# విషయసూచిక



సూచన:—

పత్రిక విషయమై వ్రాయువారు తమచందా నంబరు తెలుపని యెడల జవాబురాజాలదు. ఈ నంబరు పైనచుట్టబడిన కాగితముపై, చిరునామాకు ముందుయుండును.

# సుజాతా జయతు సర్వదా

బాలకవిః, చిదిరేమఠీయ వీరభద్రశర్మా, (కాశీక్షేత్రాత్)

| (ప్రశ్నాః) | (బహిరాలాప బంధః) | (ఉత్తరాణి) |
|---|---|---|
| శ్రేష్ఠోజాతిషు కో భూమ్యాం? | | భూ సు రః |
| కమాదావందతే? ప్రజా | | గ జా స్యం |
| కస్యాఃపతిర భూద్రామః? | | సీ తా యాః |
| కస్యచేన్దుమతీ ప్రియా? ॥౧॥ | | * అ జ స్య |
| ప్రధాన మింద్రియాణాం కిం ? | | న య నం |
| కీర్తి ర్ధర్మస్య కీ దృశీ? | | అ తు లా |
| కిం కృతం? శంభునాచర్మ | | వ స నం |
| కుత్రాధి వసతే? యతిః ॥౨॥ | | ప ర్వ తే |
| రాజ్ఞః కింజయహేతుస్యాత్ ? | | ప దా తిః |

ఏషాం త్రైవర్ణ్యముత్తరం॥

తన్మధ్యవర్ణగశ్చాఽస్యాః, పత్రికాయా జయోఽవసేత్ ॥3॥
ఇత్థమాలోచ్య బంధోఽయం, గ్రథితశ్చ మయాపునః॥
పండితాదోషముజ్ఝిత్వా, ప్రాప్నువంతు ముదాగుణం ॥౪॥

---

* అజమహారాజస్యేందుమతీ భార్యాత్వం ప్రసిద్ధం,

# ఆశీస్సు

(శ్రీ శేషాద్రి రమణకవులు)

చివుకంబాఱిన యాంధ్రసోదర మనస్సీమాంత రాళంబులన్
గవితాలీలలు ప్రాక్తనాలయ సమగ్రశ్రీలు ప్రాచీప్రతీ
చి వినోదంబులు నబ్బురంబగుగతిన్ జిత్రించి సేవావ్రత
వ్యవసాయంబున ధన్యవైతివి సుజాతా ఎంత పుణ్యాత్మవే.

సీ. జన్మమందితివి భాషాసేవ గావించు • తెగువగైకొని భాగ్యనగరమందు
చవిజూపితివి పూర్వచాళుక్య కాకతీ • యాదికనవచరిత్రామృతంబు
ప్రకటించితివి రసవత్తరంబగు తెల్గు • బాసలోఁ గ్రొంగ్రొత్త పద్ధతులను
అలరించితివి పశ్చిమాంధ్ర పూర్వాంధ్ర సో • దరుల చిత్తముల సాధారణముగ

తే.గీ. నెలలు పండ్రెండు నిండని నిసువ వయ్యు • తిరిగిచూచితి వఖిలాంధ్ర దేశమునను
అభ్యుదయమగుటరుదె నీకఖిలదిశల • కావ్యరసధామ ఓ పత్రికాలలామ.

చ. పరమత వేషభాషలకుఁ బాల్పడుచున్న స్వజాతికిన్ సమా
దరమున దేశభక్తియును దాత్త్వికభావము మాతృసేవనా
చరణము బోధసేయఁగ సుజాతవునై జనియించితీవు నీ
పరిచితి సోదరాంధ్రులకుఁ బ్రాక్తన సంపదఁగూర్చు గావుతన్.

తే.గీ. కవితభావానుబంధమౌ కవితచేత • ప్రాక్తన విచిత్ర విగ్రహ ప్రశతిచేత
ఆధునిక పూర్వజాతిదౌ నతిశయమ్ము • నలరఁజేసిన నీకు దీర్ఘాయురస్తు.

సీ. కనుగంద లేదింకఁ గాకతీయులనాఁటి • మహనీయ దేశాభిమానగరిమ
స్రగ్గిపోలేదింక రాష్ట్రకూటులనాఁటి • చిత్రలేఖన శేముషీ ప్రశస్తి
తొలఁగిపోలేదింక వెలమవీరులనాఁటి • సమధిక స్వాతంత్ర్య శాసనంబు
ఆగలేదింక నక్కనమాదనలనాఁటి • నవ్యప్రజాపాలన ప్రసక్తి

తే.గీ. చివికి ప్రాణావశిష్టమై చెలువడఁగిన • యాంధ్రజాతీయతకు మెఱుఁగడఁగలేదు
జాతినుద్బోధనము చేయు సమయమిద్ది • కడగుమా సేవకై పత్రికాకుమారి.



హైద్రాబాదు జనవరి ౧౯౨౮

సంపుటము ౨ ప్రభవ సంవత్సర పుష్యము సంఖ్య ౧

## స్వవిషయము



ఈ సంచికతో మా సుజాత పత్రికకు రెండవ వత్సర మారంభమైనది. నిజాం రాష్ట్రాంధ్ర దేశము నుండి వెడలిన మొట్టమొదటి దగు నీ సచిత్ర మాసపత్రిక, పలువురు విద్యాప్రియులగు సోదరుల పోషకత్వమును, సహాయమును, అభిమానమును బొంది రెండవ వర్షమున నడుగిడ గలిగినది.

ఆంధ్ర దేశమునందలి యొక మూలన నున్న ఈ తెలంగాణమునుండి కూడ శక్తికొలది మాతృభాషాసేవ యొనర్పవలయునను నుత్సాహమే సుజాత యుద్భవమునకుఁ గారణము. పరిపాలనా విభేదము వలన ఆంధ్ర భూభాగము నుండి నేటి కాలమున విడిగానున్న తెలంగాణమునందు పలుకారణములచేత విలక్షణమగు నాగరికత వికాసము చెందుట సంభవించుచున్నది. ఇట్టి యవకాశమును సాధ్యమగు విధమున ఆంధ్ర మాతృ దేవతారాధనమున నుపయోగించి, అరువదినాల్గు లక్షల నిజాంరాష్ట్రాంధ్రులకు బహుళ సంఖ్యాకులగు ఆంధ్ర సోదరులతో సాంఘిక, విద్యా, వైజ్ఞానికాది విషయములందు సామీప్యము కలిగించి, సమిష్టి ఆంధ్ర జాతిలో నిజాం రాష్ట్రాంధ్రులను లీనము చేయుటయే సుజాతయొక్క ఆదర్శముగ నుండ గలదు.

గత వత్సరమున నీ పత్రికయందు వెలువడిన వ్యాసములలో ననేకములు నిజాం రాష్ట్రవాసుల కెక్కువ సంబంధించినవియు, ఎక్కువ

యందుబాటులో నున్న విషయములకు చెంది నవియునై యుండుట మా చదువరులు గమనించియుందురు. నిజాంరాష్ట్రమందు లభించిన శిలా శాసనములుగాని వాని గూర్చిన వ్యాసములుగాని జనవరినుండి డిసంబరు ౧౯౨౭ వరకు ప్రతి సంచికయందును ప్రవేశము గాంచినవి. పారసీక వాఙ్మయము నజరామరముగ నొనర్చిన మహా కవులగు ఫిర్దౌసీ, సాది, ఉమర్ ఖయ్యాముల యొక్కయు, ఉర్దూ మహా కవియగు గాలిబు యొక్కయు, కవితా రసమును సోదరాంధ్రులకు చవిజూపు యత్నము చేయబడినది. నిజాంరాష్ట్ర పరిపాలనా విధానము కొంతవరకు ప్రకటింపబడినది. దక్కను (నిజాంరాష్ట్రము) యొక్క పూర్వపు నాణెముల యొక్కయు, పూర్వపు దేశ విభాగము యొక్కయు స్వరూపములు స్వతంత్ర సాధనముల సహాయమున వ్యక్తీకరింపబడినవి. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఆంధ్రుల యశశ్చంద్రికను కొంత మెరపించిన రాచకొండ యొక్కయు, తత్సామ్రాజ్య చరిత్రమును కాంతివంతముగ జేసిన రుద్రమాంబ, గణపమాంబల యొక్కయు కీర్తిగానము చేయబడినది. ఇట్టులే మరికొన్ని కలవు కాని గ్రంథ విస్తరముతో బనిలేదు.

సుజాత యొక్క బహిస్స్వరూపమును, నియమబద్ధతయు నిజాంరాష్ట్రములో నాంధ్ర లేఖకులను కొందరిని సృష్టించుటయందును, కొందరిని ప్రోత్సహించుటయందును, కొందరిని మాతృభాషాభిమాన ప్రేరితుల జేయుటయందును, ఎంతయు తోడ్పడినదని చెప్పినచో అతిశయోక్తియుండ జాలదు. అయినను, సుజాత యొక్క అంతస్స్వరూపమును ఉదాత్తముగను మనోహరముగను చేయుటలో నెక్కువ భారము మద్రాసు రాజధానిలోని యాంధ్ర దేశమందలి విద్యార్థికులును మాతృభాషోపాసకులును అగు సోదరుల వలననే వహింపబడినదనుట యదార్థమగు నంశము. ఈ విధముగ నిజాంరాష్ట్రములోని వార్తా పత్రికలవలె గాక, సుజాత ఉభయప్రాంతపు టాంధ్ర సోదరుల భావతరంగ సమ్మేళనమునకు రంగస్థలమై యొప్పుగాక యని యాశించుచున్నాము.

గత వత్సరమున మేము తలంచినంత భాషాసేవ చేయలేక పోయితిమని విచారించుచున్నాము. మొదటిదగు జనవరి ౧౯౨౭ సంచికలోని మొట్టమొదటి వాక్యమున "చెప్పినంతచేయుట కష్ట"మను లోకోక్తి నుల్లేఖించి యుంటిమి. దేశోద్ధారకులచే నడుపబడుచున్న భారతివంటి యుత్తమ ఆంధ్ర మాసపత్రికయే తన వైదవ వత్సరమున మొదటి సంచికయందు, "సకలాంగ సౌష్టవమును గలిగి చాలినంత వికాసము పొందకుండుటకు సంతాపము" చెందియుండ, వెనుకబడియున్న ప్రాంతమున, భాషాభిమానము సన్నగిల్లియున్న వారి నడుమ, సంపన్నులుకాని యాంధ్రనోత్సాహమాత్ర ప్రేరితులగు వారి వలన నడుపబడు పత్రికను గూర్చి చెప్పవలసినదేమి కలదు? గడచిన లోపములను దిద్దుకొను కోర్కెను ప్రకటించుట తప్ప ఉపాయాంతరమే యుండదుకదా.

సుజాత కొరకు పద్యములను, వ్యాసములను, ప్రహసనములను, కథలను, నాటకములను వ్రాసిన లేఖక మహాశయులును, చిత్ర ఫలకముల ననుగ్రహించిన సోదరులును మా కృతజ్ఞతకుపాత్రులని చెప్పవలయునా? స్వంత ముద్రాలయము లేని లోపమునుదీర్చి ఎంత తొందర కలిగించినను సహించుకొని పత్రికకు కొంత

మించుమించుగ సమయమునకు ముద్రించి యి చ్చిన గోలకొండ ముద్రాలయము వారి సహాయము నిరుపమానము.

రెండవ వత్సరారంభమునుండి సుజాత సంపాదకత్వమున మార్పు కలుగుట అనివార్యమైనది. శ్రీయుత పసుమాముల నృసింహ శర్మ బి. ఏ. గారిటీవల న్యాయవాదిత్వ పరీక్షలో గడతేరి ఆవృత్తిలో ప్రవేశించుట వలన తమ పదవిని వదలుకొనుట తప్పని పనియయ్యెను. సుజాత జనకులగు శర్మగారికిది యెంతయు సంతాపకారణమయ్యెను. అయినను గత్యంతరము లేకపోయినది. శ్రీ శర్మ గారి యాదర్శములే ఇప్పటి సంపాదక వర్గమువలనను పాలింపబడు చుండుననియు, క్రియా పూర్వకముగ వారి సంపూర్ణ సహాయాభిమానములు సుజాతను వీడవనియు పాఠక మహాశయులకును ఇతరాభిమానులకును నివేదించుచున్నాము.



## ఆ శ

సముద్రాల వేంకట రాఘవాచార్యులు గారు

భిదురకఠినశిలావేది పదము మోపి
చెలియ! గడెసేపు గారవించితివా? లేదో
చిప్పిలుచునుండె తావక స్నేహకలిత
పరమ మాధుర్యగుణము నిప్పటికిగూడ.
అమృతహృదయమునుండి దుఃఖార్ద్రగీత
లొక్కడో రెండొవించి నీ వుందు; నేర్చి
కొనినదో యేమొ విడకవాని నెలయించి
వినిచి కదలించు నామది విశ్వవీణ.
ఒకని మేషములోనె త్వదుజ్వలతను
ఎంతలముకొంట నేర్చిన దేత్రియామ.
మానలేదాయె నేటిక నూనగలేని
హృదయమునుజించి కరచి పారించుచుంట.
నోచుకొన నేరనైతి దీనుడను నీదు
మృదుపదంబుల నెమ్మది బదిల పరుప
నమృతగీతలవిని చెవులార దనియ.
నాకె లభియించియున్న నానందలోక
నలలితోద్యానఖేలన స్వైరమధుర
గీతములబాడి జగతినూహింప గలుగు
దేమొ యిటునలె హృదయేశ్వరీ?—

# అరబీ ఫారసీ భాషలలో సంస్కృత వాఙ్మయము

(మాడపాటి హనుమంతరావుగారు)



ఇస్లాము మత స్థాపకులగు మహమ్మదు క్రీ. శ. ౬౩౨ లో చనిపోయిన తరువాత వీరి ఖిలాఫతు పీఠము క్రీ. శ. ౬౩౨ నుండి ౬౬౧ వరకు మదీనా నగరములోను; ౬౬౦ నుండి ౭౫౦ వరకు దమిష్కు (డెమాస్కసు) పురములోను ౭౫౦ నాడి ౧౨౫౮ వరకు బగ్దాదు పురములోను ఉండిన సంగతి చరిత్ర ప్రసిద్ధము. ఈ మూడవ ఖిలాఫతు యుగారంభము తరువాత పాలించుచుండిన ఖలీఫాల వంశమునకు „అబ్బాసీ" వంశము అని పేరు. ఈ వంశపువారగు పరిపాలకులు విద్యాప్రియులుగను, న్యాయస్వభావులుగను ఖ్యాతిగాంచిరి. అందును, „మన్సూరు" అను పాలకుడు అరబీ వాఙ్మయమునకు గ్రీకు, సంస్కృత భాషలలోని గ్రంథముల పరివర్తనముచే అమూల్యములగు భూషణముల సేకరించి యిచ్చెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. అరబీ వాఙ్మయమున సంస్కృత విజ్ఞానమునకును తద్భాషా పండితులకును ప్రవేశము లభించినదీతని కాలముననేయని తెలియుచున్నది.

౧

ఎనిమిదవ శతాబ్దమున, అఫ్ఘనిస్థానములోని బలఖ్ నగరమున, „బర్మకు" అనునాతడు ఆనగరములోని అగ్ని పూజా ధురంధరుల దేవాలయమునకు ముఖ్య ధర్మాధికారిగా నుండెను. ఆతని కుమారుడు „ఖాలిదు" అనువాడు, ఇస్లాము మతమును స్వీకరించి ఖలీఫా „మన్సూరు" వద్ద ప్రధాన మంత్రిపదవి సంపాదించెను. ఈతని కుమారుడు, „యహ్యా" అనువాడు తండ్రి మరణానంతరము ఆపదవిని స్వీకరించి, „మన్సూరు" తరువాత „హారూనుర్రషీదు" కాలమునందును ఉండినవాడయ్యెను.

ఈ „యహ్యా" యను మంత్రిపుంగవుడు ఫారసీ వాఙ్మయమును అమితముగ ప్రేమించువాడు. తనపెద్దలు అగ్నిపూజా ధురంధరులైనందున వారు సంపాదించిన గ్రంథసంచయ మీతనికి జిక్కెను. విద్యా వినోదియగు నీతడు సభల సమావేశ పరచుచు వివిధ మతముల వారిని రావించి, సక్రమముగా వాగ్వివాదముల జరిపించుచుండువాడు. హిందూ దేశమునుండి పండిత వర్యులను, తత్వజ్ఞులను, వైద్య శాస్త్రవేత్తలను రప్పించి యుండెను. ఈ కార్యమొనర్చిన వారిలో నీతడే ప్రథముడు. అప్పటి ఖలీఫాయగు "మన్సూరు" ఆస్థానమునకు హిందూ దేశమునుండి గొప్ప విద్వాంసుడొకడు వచ్చి "సిద్ధాంతము" అను గ్రంథమును ప్రభువునకు కానుకగా నొసగెను. దీనిని ఆ దర్బారులోని యొక మహమ్మదీయ విద్వాంసుడు „ఫజారీ" అనువాడు అరబీ భాషలోనికి అనువదించెను. మంత్రియగు „యహ్యా" „పంచతంత్రము"ను, „కలీలాదమ్నా" (కరటకదమనకము) అనుపేర ఫారసీ భాషలోనికి అబ్దుల్లా అను విద్వాంసునిచేత మార్పించెను (హిజ్రి: శ: ౧౬౫) ఈ యమాత్యశేఖరుడు ఒక పండితుని హిందూ దేశమునకు పంపి ఇచ్చటి ఔషధ వస్తువులను పరిశోధింపించి, బగ్దాదునకు తెప్పించుకొనెను. మన దేశములోని జనుల మత విశ్వాసముల వివరముల నివేదికను వ్రాయించి ఆయంశములను గ్రంథ రూపమున ప్రకటించెను. ఈతడు హిందూ దేశమునుండి పిలిపించిన పండితుల పేళ్లు „మానక" (మాణిక్యుడు?), మార్మక (మార్మికుడు?) సిందువార్ (సింధువీరుడు?) మున్నగునవి యని యొక పురాతన మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసియున్నాడు. సుప్రసిద్ధములగు వైద్య శాస్త్ర గ్రంథములు, „చరక సుశ్రుతము" లీ యహ్యాగారి యాజ్ఞననుసరించి అరబీ ఫారసీలలోనికి మార్పబడినవి. „హారూనుర్రషీద్" „మామూనుర్రషీద్" అను పాల

కుల కాలమున గూడ హిందూదేశపు విద్యావంతులను బగ్దాదు నగర మాకర్షించి యుండెను. „హారూనుర్రషీదు” అను ఖలీఫా సత్పరి పాలనమునను ప్రజాక్షేమంకరత్వమునను, మారువేషము వేసికొని రాత్రివేళ నగరమున సంచరించి ప్రజల బాగోగులను దెలిసికొనుట యాగునను, మనదేశ చరిత్రములోని విక్రమార్కుని బోలినవాడు. ఒకమారు ఈతడు చాల జబ్బుపడెను. రాజధానీ నగరములోని వైద్యులలో నొకడైన పనికిరాడయ్యె. ఆకాలమున హిందూదేశపు ఒక వైద్యుని కీర్తి దిగంతములకు వ్యాపించి యుండినందున, ఆతనిని „హారూను” పిలిపించుకొని చికిత్స చేయించుకొనగా, సంపూర్ణారోగ్యము కలిగెను. ఈ పండితుని పేరు „మానక” అని* అరబీ భాషా గ్రంథములలో కలదు. ఈతడు వైద్య శాస్త్రమునందే కాక, తర్క వేదాంత శాస్త్రములందును అసమాన ప్రజ్ఞ కలిగియుండెనట! బగ్దాదు నగరమున నివసించి, ఫారసీ భాష నేర్చి ఎన్నియో సంస్కృత గ్రంథములను ఫారసీలోనికి మార్చెను!

„హారూను” ఆస్థానము నందలి యొక విఖ్యాత పండితుని పేరు „సాలి”‡ యట! ఈ ఖలీఫా కాలములోనే మరియొక గొప్ప హిందూ విద్వాంసుడు ఎన్నియో సంస్కృత గ్రంథములు అరబీ ఫారసీ భాషలలోనికి అనువదించెను. ఇతని పేరేమో జాడ దొరకదుకాని ఇతని తండ్రిపేరు „ధన” అయినందున, ఈ పండితుని “ఇబ్నె ధన” (ధనుని పుత్రుడు) అని పిలుచుచుండు వారట!§ అరబీ భాషయందు తండ్రి పేరును కొడుకు పేరుతో చేర్చి పిలుచుట సంప్రదాయము. అరబులు మన పండితుని విషయమున నట్లే చేసిరి. మన యీ పండితుని యోగ్యత ఎంత గొప్పదిగా నుండెనో మనము చెప్పజాలము కాని ఆ కాలపు మహమ్మదీయ నాగరకతకు కేంద్ర స్థానమగు బగ్దాదు నగరములోని అన్నిటికంటె గొప్పదగు వైద్యశాలకు మన వాడే యధ్యక్షుడుగా ఖలీఫా హారూను వలన నియోగింప బడియెను!

ఈ యుదార భావములుగల ఖలీఫా „మసూదీ” చరిత్రకారుని „ఖంబాతు” నకు పంపి యుండెను. (హిజ్రి : శ : 303) ఇతడు సంస్కృతమున గొప్ప పాండిత్యము కలవాడు. „ఖంబాతు” రాజు నాస్థానమునకీతడు వచ్చి, అచ్చటి పండితులతోను, రాజుతోను సంస్కృతమున ప్రసంగములు సల్పియుండెను. ఇచ్చటి రాజ పుంగవుని విద్యాప్రియత్వమును గూర్చియు సరళ స్వభావమును గూర్చియు „మసూదీ” కడు ప్రశంసాపూర్వకముగా వ్రాసియున్నాడు. + ఇట్టి యుదాహరణములు, మహమ్మదీయులు ఆ కాలమున సంస్కృతము నేర్చికొని హిందూ వాఙ్మయమును అరబీ ఫారసీలలోనికి దింపినవియు హిందూ పండితులు మహమ్మదీయ దేశములకేగి అరబీ ఫారసీలు నేర్చుకొని తమ వాఙ్మయము చేత నా భాషలను సారవంతముగ జేసినవియు, ఎన్నియో కలవని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు!

౨

సంస్కృత వాఙ్మయ సారమును, విశేషముగా అరబీ ఫారసీ భాషలలోనికి దింపిన మహావిద్వాంసులలో పేర్కొనదగినవాడు „అబూరేహాన్ అల్బిరూని” యనువాడు. ఈతడు గజిని మహమూదు యొక్క ఆస్థాన పండితుడు. † ఈ మహమూదు (క్రీ. శ. ౯౯౯ నుండి ౧౦౩౦) హిందూదేశ చరిత్రమున మరపురాని కార్యముల నొనరించిన వాడగుటచే, అల్బిరూని కాలమును గురించిన వివాదములకు అవకాశమే లేదు. ఈ విద్వాంసుడు

---

* ఈయన పేరు „మాణిక్యుడు” అయియుండవచ్చునేమో? ఈతని గూర్చిన వివరములు „తబ్ఖాతుల్ అతిబ్బా”లో గలవు.

‡ ఇది శాల్యుడు అను శబ్దముయొక్క అపభ్రంశమేమో.

§ అరబులు „మహమ్మదు బిన్ అహమదు” అనిరేని „అహమదు కొడుకగు మహమ్మదు”అని అర్థము. మన తెనుగు దేశములో „చూదయ్యగారి మల్లన్న”అనినట్లు. ఈ ధనుని పుత్రునిగూర్చి „అల్ఫెహరిస్తు” అను గ్రంథమునగలదు. ఇట్టివాని యుదంతము మన వాఙ్మయమున లేకుండుట సంతాపకరము!

+ యూరపునందు ప్రకటింపబడిన „మసూదీ” గ్రంథము మొదటి సంపుటము పుట ౨౫౪.

† ఈ లిఖితము కృతమగు హిందూదేశ చరిత్రము:

సంస్కృతమున నపార పాండిత్యమును సంపాదించి ఎన్నియో ఫారసీ గ్రంథములను హిందువుల కొరకు సంస్కృతములోనికి అనువదించెనట! సంస్కృత భాషలోని విశేషములను గురించి ఈతడు రచించిన గ్రంథమును విఖ్యాత జర్మను పండితుడు జకొవ్ అను నాతడు పరిష్కరించి ప్రకటించియున్నాడు. ఈ పుస్తకము ఒక విధముగా హిందూ విజ్ఞాన సర్వస్వమనదగియున్నది. గ్రంథస్థ విషయములు మొత్తము ౮౦ శీర్షికలలో నిముడ్పబడియున్నవి. ప్రతి శీర్షిక క్రింద మీమాంసా రూపమున విజ్ఞానము వెదజల్లబడియున్నది. అట్టి శీర్షికలలో గొన్ని యివి: (౧) ఈశ్వరుని గూర్చి హిందువుల విశ్వాసము (౨) ఇంద్రియములను గూర్చిన వారినమ్మకములు (౩) పునర్జన్మము (౪) వేదములు, పురాణములు; ఇతర మత గ్రంథములు. (౫) వ్యాకరణము; ఛందస్సు (౬) ఇతర విజ్ఞాన గ్రంథములు. (౭) జ్యోతిశ్శాస్త్రము దీని క్రింద సెన్నియో అంతశ్శీర్షికలు కలవు. (౮) న్యాయాన్యాయములు (౯) వారసత్వపు శాస్త్రము:

ఈ మహా పండితుడు పై పుస్తకము కాక, ఎన్నియో సంస్కృత గ్రంథములను అరబీ భాషలోనికి మార్చినాడు లేక సంగ్రహించినాడు. ౧ పాతంజలి (పతంజలి యోగ సూత్రములై యుండవచ్చును), ౨ బ్రహ్మ సిద్ధాంతము, ౩ బృహత్సంహిత, ౪ సామిక (?) ౫ లాజు (?) ౬ హిందువుల సిద్ధాంతము"ను గూర్చి ౫౦౦, పుటల గ్రంథమొకటి అరబీలో వ్రాసినాడు, ౭ ఫల సిద్ధాంతము ౮ ఖండఖంశిక (దీని తర్జుమా అంతకు పూర్వమే అరబీ లోనై యుండెను. దానికి "అర్కండ్"అనిపేరు), ౯ గ్రహణ సంగ్రహము, ౧౦ సింధు దేశమునందును హిందూస్థానమునందును సున్నాలను లెక్కించు పద్ధతిని గూర్చియొక పుస్తకము, ౧౧ అరబీ అంకెలను హిందువుల అంకెలను గూర్చిన గ్రంథము, ౧౨ రాశిక (త్రైరాశికమును గూర్చి), ౧౩ అంకెల క్రమ విధానము, ౧౪ బ్రహ్మ సిద్ధాంతములోని గణిత పద్ధతి, ౧౫ హిందువుల తిథులను బట్టి కాల నిర్ణయ విధానము, ఇవికాక చంద్రుని గమనము; హిందువులడిగిన ప్రశ్నలు వాని యుత్తరములు (జ్యోతిశ్శాస్త్రమును గూర్చి), కాశ్మీర వాసుల ప్రశ్నల కుత్తరములు, ఆయుర్వేదము [illegible] పద్ధతి, మున్నగునవి యెన్నియో కలవు. గ్రంథ విస్తృతిచే వదలితిమి.¶

3

ఈ విషయమున ప్రశంసింపదగిన మూడవ కాలము మొగలు సామ్రాజ్య ధురీణుడగు అక్బరు చక్రవర్తి (క్రీ. శ. ౧౫౫౬ నుండి ౧౬౦౫) ఈతడు తన దర్బారునందు గొప్పగొప్ప పండితులను ఏకత్రుల చేసియుండెను. "అబుల్ ఫజలు" తాను రచించిన "ఆయీనె అక్బరీ" యను గ్రంథమునందు సామ్రాజ్యములోని విజ్ఞాన ధనుల (దానిష్ అందోజానె దవలత్) పట్టికలో ముప్పదిమంది హిందూ పండితులను పేర్కొనియున్నాడు. అక్బరు జైన పండితునితో ముగ్గురు మహమ్మదీయ పండితులను తోడు పరచి "మహా భారతము" ఫారసీలో వ్రాయించి దానికి "రజ్మనామా" యని పేరు పెట్టెను. దీనిలో యుద్ధరంగముల పటములను కడు మనోహరములుగ చిత్రింపించి కూర్పించెను.§ ఈ విద్వాంసులు "రామాయణము"ను గూడ ఫారసీకరించి దానిలో గూడ చిత్రపటములను పెట్టించిరి. నాల్గవ వేదమగు "అథర్వణము"ను హాజీ ఇబ్రాహిం సర్ హిందీ అను నాతడు ఫారసీలోనికి మార్చెను. దీని వ్రాత ప్రతులు ఉత్తర హిందూస్థానములోని గ్రంథాలయములలో నిప్పటికిని గలవు. గణిత గ్రం

---

¶ అల్బిరూని వ్రాసిన "కితాబుల్ అసారాతుల్ బాకియా" అనునది యూరపునందు ముద్రితమైనది. దాని చివరన అల్బిరూని వ్రాసిన పుస్తకముల పట్టిక అతనిచే వ్రాయబడినది యొకటి కలదు. రెండవదగు "ఇల్హింద్" అను గ్రంథమున పలుతావుల తనచే రచింపబడిన గ్రంథములను ఉల్లేఖించి యున్నాడు. ఈ రెండు గ్రంథములలోని యంశములను బట్టియు పై విషయములు వ్రాయబడినవని మౌలానా షిబ్లీనోమాని యను విఖ్యాత విద్వాంసుడు వ్రాసియున్నాడు:

§ ఈ పటములలో గొన్ని ఇటీవల భారతి మాస పత్రికయందు ప్రకటింపబడినవి. ఆ పటములలోని కథ విషయము ఫారసీ భాషయందు పటమునందలి యొక భాగమున వివరముగ వ్రాయబడియుండుట కానవచ్చుచున్నది.

థముగా ప్రశస్తిగాంచియున్న „లీలావతి” యను పుస్తకమును ఫైజీ తర్జుమా చేసెను. జ్యోతిశ్శాస్త్రమున పేరు గాంచియున్న జాతక గ్రంథమును హాక్మలుఖాన్ (గుజరాతు వాసి) ఫారసీ భాషావేషమున దింపెను. వారి వంశమును మౌలానా షేరీ అను విద్వాంసుడు అనువదించెను. కరుణారస భరితమగు మన నైషధము ఫైజీ మహాకవి కృషి ఫలితముగా ఫారసీ యుడుపుల దొడిగినది. ఈ విధములగు ప్రయత్నములింకను ఎన్నియోని కలవని ఫారసీ అరబీ వాఙ్మయములు సాక్ష్యమిచ్చుచున్నవి.

ప్రస్తుత విషయమును వివరముగా తెలుప దలచిన చో నొక సంపూర్ణ గ్రంథమునకు చాలినంత సరకుకలదు. కాని అరబీ ఫారసీ భాషలలో చేర్కొనబడిన హిందూ పండితుల పేర్లు ఉచ్చరించుటకు వీలులేకుండునట్లు ఆ భాషలలో వ్రాయబడినవి. కనుక ఆ పండిత ప్రకాండుల పేర్లు నిర్ధారణ చేయుట దాదాపుగ అసంభవమని చెప్పవచ్చును. ఉదాహరణార్థము. „తబ్ఖాతుల్ అతిబ్బా” యను గ్రంథమునందు „మానక” పండితునిగూర్చి కలదు. అరబీ ఫారసీలలో వ్రాయబడిన ఈ పేరు యొక్క సరియైన యుచ్చారణము „మాణిక్యుడు” అని చెప్పవలయునో మరేమని చెప్పవలయునో దురూహ్యము. ఈ „మానక” అను వైద్యశాస్త్ర విశారదుడు రచించిన గ్రంథములు సుమారు ౧౦ అరబీ భాషలో గానవచ్చుచున్నవి. కొన్ని తావుల నితని పేరు „కనక” అని యున్నది. ఇతడు కాక ఇంకను కొందరు పండితుల సంస్కృత గ్రంథములు అరబిలోనికి భాషాంతరీకింపబడినట్లు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసినారు. వారి పేర్లు „బాఖర్” „రాజా”, „సఖ్”, „దాహద్”, „జహిద్”, „ఆంది”, „జారీ”, అనునవి. వీని సరియైన యుచ్చారణ కనుగొనుట ఎట్లు సాధ్యము? చరిత్ర వ్రాయు నాచారము మనలో లేకపోవుటచేత ఇట్టి మహానుభావుల యశోగానము చేయు నదృష్టము మనకు లేకపోయెను! ఇటువంటి రత్నముల నెన్నింటిని భారతవర్ష వాఙ్మయము కోల్పోయెనో దేవున కెరుక! *

---

* ఈ వ్యాసములోని యాశయములు మౌలానా షిబ్లి అను మహమ్మదీయ గ్రంథ రచయిత, నిజాము ప్రభువుల పోషకత్వమున వ్రాసియుంచిన „సిల్సిలే అసఫియా” యను గ్రంథమాలనుండి సంగ్రహింపబడినవి.



# ఉయ్యాలపాటలు

పూడిపెద్ది వేంకటరమణయ్యగారు
(కవితాసమితి)

౧

కొమ్మలు చివురాకుగుత్తులు పొడువఁ
జివురుపొత్తిళ్ల లోఁజిఱు మొగ్గలుఱుక
మొగ్గలలోఁ బూలుపులకలునింపఁ
బులకరింపులఁ దేనెబొట్టులుజారఁ
దేనెకాలువలలోఁ దేఁటులెదురీఁదఁ
దేఁటిరెక్కలఁ గమ్మతెమ్మెరలు తాఁఱ
వచ్చెనామని నేఁడు! పలువన్నెలగుడి!
వచ్చెనామని నేఁడు! పాలమిసమిసలు!
వచ్చెనామని నేఁడు! పలుకు నును దేట!
వచ్చెనామని నేఁడు! భావాలపంట!
వచ్చెనామని నేఁడు! పాటలవెల్లి
తుమ్మెదభావగీతుల నాలపించు
చిలుకమాటలఁ గైత చిలుపదోతెంచు
గాలిలో భావభంగములునటియించు
కోయిల గొంతెత్తి కొసరుకావ్యాలు
కవికలమ్మునఁ గ్రొత్త కళలుద్భవిల్లు
కవినాల్కనుడి క్రొత్తగతుల నర్తించు
కవిభావములతీవగములు కొనసాగు
కవితమైలోకమ్ము కలకలనవ్వు!
ప్రకృతిలోఁ గావ్యస్ఫురస వృష్టిగురియు!
గళమెత్తి జగమెల్ల గానమ్ముసేయు!

\+ + + +

పలుకులువిహరించు వనవాటియగుచు
సద్భావముల నాట్యశాలమైనగుచు
జగమెల్లసరిక్రొత్త జాడలఁబోవు!
పలువన్నియలఁజిత్ర పటములువ్రాయు
నవ్యశోభనకథానాయికలఁ జెక్కు
కడలంటసాంధ్యరాగము నాలపించు
వ్యంగ్యార్థములఁ గ్రొత్త పాటలుపాడు!
ఎలఁదోటమై పూపుటీశాలనల్లు!
ఆనందమయమైనయట్టియీ వేళ
వేయిరేకులతోడ విరియునామనసు
ఈ వసంతములోన నీసంతసమున
భావాలునాలోనఁ బల్లవించెడిని
కిలకిలధ్వనితోడఁ గెరలునీవేళ
నానందమవశమై నాట్యమాడెడిని
చల్లని యీ మంజు సమయమ్ములోని
కెరలినా మది క్రొత్తగీతాలఁబాడు!
పాడికొందును నేను పవలురేలనక
వినువారలుండ రే? విపులలోకమున!

౨

చివురు మొగ్గలలోన జీవకళలూర
సొగసైననిలువెల్ల సొగసులుజార
కొనలలోఁ గ్రొవ్వాడి గొనబులు దేర
నవకమ్ము కెలఁకుల నాట్యమ్ము సేయ
బాలుపుగ నీయాంధ్ర భూమిగుడిగొన్న
యుభయభాషలతీవలుయ్యాలఁగట్టి
యతివేడ్క నేఁదాన నమరించికొన్న
పలుకు పూసెజ్జలోఁ బవ్వళించి
తలఁపులనును గాలితరగలలోన
సౌందర్యవిభవ ప్రసారములయూత
గమ్మనితావి నల్గడలంటవీవ
నూఁగుచు జగమెల్ల నొకటియై మ్రోఁగ
గళమెత్తి నూత్న రాగము లాలపించి
కళలూరనమృత శీకరములుదూల
నాలాపగతిరేఁగియంబరంబంటఁ
బాడికొందును నేను పవలు రేలనక!
వినువారలుండ రే? విపులలోకమున!



# ఇదో కథ

మునిమాణిక్యం నరసింహారావు బి ఏ ఎల్. టి.

(సాహితీ సమితి)



"కాంతం, కాంతం, క్రొత్త పత్రిక వచ్చింది. అందులో చక్కని కథవుంది విందుగాని రావూ?

అబ్బ! ఉండండి; పిల్లలేడుస్తున్నారు. ఒకకృష్ణ లేదూ రామలేదూ. ఎప్పుడూ కథలపిచ్చి. కథలు చదువటం, వ్రాయటం ఇదీమీకు ఎందుకొచ్చినట్లు! పుణ్యమా పురుషార్థమా, ఇహానికా పరానికా? నామాట ఒకటి వినండి. లంకాయాగం, సీతసమర్తలాంటి పాటలువ్రాసి అచ్చువేయించండి. లాభం రాకపోతే అపుడు నన్ను అనండి."

"నీదొక పిచ్చిగోల. నీవు అజ్ఞానురాలవు. కథారచనా చమత్కారము తెలుసునా, కల్పనాచాతుర్యమును గ్రహించగలవా? ఈకథ ఎంత బాగుందనుకొన్నావు. మొట్ట మొదటి నుండి చిట్టచివర వరకు, కథ ఒకపట్టున నడిచింది. కథ ఎల్లా తేలుతుందో ఎవరూ ఊహించలేరు. కథాంతమును నీవు ఒకవిధంగా ఊహించుకొంటె అదొక విధంగా తేలుతుంది. ఇపుడీకథ చదవటం మొదలు పెడతాను. ఎల్లా అంతమౌతుందో చెప్పుకో చూతాము మరి.

అయినా చదవండి చూతాము అని కాంతం కథ వింటానికి కుతూహలము కనపర్చింది.

'ధన్యోస్మి' అనుకొన్నాను. కొంత వరకు దారికొచ్చింది. కథవిన్న తరువాత సంతోషించి, కథవ్రాయటం యొక కళయని గ్రహించి అట్టి కథకులయెడ గౌరవం కలిగించుకొంటుందని తద్వారా నాయందుండె ప్రేమా గౌరవములు అతిశయిస్తవని సంతోషించి గుటకలు మ్రింగి పత్రికతీసి కథచదవటం ప్రారంభించినాను.

"ఈ వూళ్లో ఒక తమాషా"

ఉండుండి, ఉండండి కథఎత్తుకోవటమే మొత్తుకొన్నట్లుగా ఉన్నది. ఆవూరంటే ఏవూరు ఊరుపేరు చెప్పవద్దూ!

ఉండుమరి ఎత్తుగడలోనే అంత విమర్శనా? మరి వినూ.

"నాకు కాపరం ఉంటానికి ఇల్లొకటి కావలసి వచ్చింది. ఇండ్లకోసం తిరుగుతూ ఎక్కడికైనా పోయి

„ఏమండీ మీయింట్లో ఏదైనభాగం కాపరం ఉంటానికి అనుకూలమైనది ఉందండీ, అని వినయంగా అడిగినా, ఆ యింట్లో ఉండే ఆడవాళ్లు ఉగ్రకోపముతో నా మొఖం మీద తలుపు విసిరికొట్టి లోపలికిపోతారు. ఉన్నదనో లేదనో చెప్పిన వీరి నోటిముత్యాలు రాలిపోవునా"

„అయితే ఆడవాళ్లు పరపురుషులతో మాట్లాడటానికీఇష్టపడకపోవటంకూడాతప్పేనా?" „ఒక విధముగా తప్పు. ఖాళీలేదు అనో ఉన్నదిఅనో అంటేనే ఆవిడ పాతివ్రత్యమంతా భగ్నమై పోతుందా? నువ్వు, నేను లేనపుడు ఎవరైనా వస్తే వారితో మాట్లాడి సరియైన సమాధానముచెప్పు. నీకు నే నీవిషయము ఎన్నిసార్లు చెప్పాను? మొన్న సుబ్బారావు వస్తే, ఇంట్లో లేడని మాత్రంచెప్పి, ఉండకుండా వెళ్లిపోయినావట. ఇక మీద ఎప్పుడుగాని........."

„చాల్లెండి. ఇంట్లోను బైటానూ పాఠాలు చెప్పటమేనా? ఈ నీతి పాఠంమానేసి కథ కానీయ్యండి" „అయితే విను"

„ఆఖరకు ఎట్లయితే నేమి ఒక ఇల్లు దొరకించుకొన్నాను. ఆ ఇల్లు గుహ. చీకటికొన, తేమ, దొడ్డిలో మంచినీళ్లు లేవు."

„మన అవస్థే పట్టింది కథలో ఆయనకు కూడా"

„అందుకు మరియొక గృహాన్వేషణము మొదలు పెట్టినాను. స్నేహితులు నలుగురితోను తద్విషయమై చెప్పి ఇంటికోసం గట్టి ప్రయత్నములు చేయుట ప్రారంభించినాను. ఈసంగతి ఎట్లో యింటియజమానునికి తెలిసినది. ఆయన నావద్దకువచ్చి „అయ్యా, మీకు ఈ ఇల్లు సదుపాయంగలేనట్లు, మరో ఇంటి కొరకూ ప్రయత్నిస్తున్నట్లును విన్నాను. నిజమైనట్లయితే వెళ్లేవారు తొందరగా వెళ్లండి. పదినెలలపాటు ఉండేవారిని తెచ్చిపెట్టుకొంటాము. ఈ నెల ఆఖరకు మీరు తప్పక ఖాళీచెయ్యాలే. అని కచ్చితంగా చెప్పినాడు."

„మనసంగతీ అంతే అవుతుందేమో అని కాంతం"అన్నది. "నీకు తెలియదా ఏమిటి ఆ కాస్త మాట. ఆయన ఇదివరకే అన్నాడు" అని అన్నాను నేను.

"అల్లాగ, అయితే ఆమాట చెప్పలేదు మీరు. అయితే యేమిలెండి. ఆమెతో చెప్పి నేను ఒప్పించగలను. ఆమెమాట ఆయన వింటాడు. దేనికైనా చేసిపుట్టాలె. పూజ కొద్దీ పురుషులన్నారు. నామాటమీరూ ఒకటీ వినరుగా"

"అదిగో, ఏదో, సమయం చిక్కించుకొని నన్ను సాధిస్తావు. మనకథవినవు. కథాసూత్రం తెగుతుంది." "ఏమి తెగదు. చదవండి"

„ఇల్లుకోసం ఎంత ప్రయత్నంచేసినా దొరికింది కాదు. కొన్ని రోజులు జరిగి పోయినవి. ఇంతలో నేను ఒక రోజు బందరు పోయినాను.

"చూచావా? కథ ఎట్లా నడుస్తున్నదో, కథాంతం ఊహించగలవా"

„ఏమౌతుందో చెప్పమంటారా? బందరు వెళ్లి ఆయన వచ్చే సరికి ఆవిడ ఇంకో ఇంట్లో ప్రవేశిస్తుంది. ఆయన ఇంటికొచ్చి శూన్యగృహాన్నిచూచి భార్య తనను వదలి పారి పోయినదని భయపడి, కర్మాన్ని నిందించు కొంటూ వీధుల వెంట తిరుగుతాడు. అయితే ఉన్మాదుడు కూడా కావచ్చు. అట్లా వదిలేస్తే విషాదాంతమవుతుంది. లేకపోతే ఇంకో విధంగా నడిపి సుఖాంతం చేయవచ్చు."

„ఏదీ చూద్దాము నీవు ఇక్కడనుంచి కథ నడుపూ"

„నడపమంటారూ? నడుపుతాను. ఇన్నాళ్లనుంచీ కథలూ నవలలూ చదివి, ఈ మాత్రం చేయలేకపోతానా."

"ఆ విధంగా ఆతడు బందరు పోవటంచేత నాయికా నాయకులకు వియోగం కలుగుతుంది. తిరిగివచ్చి తన జీవితేశ్వరిని గానక దుఃఖావృతుడై చింతాభారమును మోయలేక, జీవితముపై అవజ్ఞాభావము జనింప, ఇల్లు వదలి, కాననములో కుటీరవాస మేర్పరుచుకొని జీవిత శేషమును గడపుచుండ"

„ఓహో నవలలోవలె నడుస్తున్నదేకథ"

"వినండి; మరికొంసాకు. ఇట్లుండగా ఒకరాత్రి కర్కశశిలపై మూల్గుచూ, తుద్వ్యాధతో శల్యావశిష్టమైన వికృత రూపమొకటి ఆ కుటీర ప్రాంగణమున కనిపిస్తుంది. ఆ వ్యక్తి కుటీర ద్వారమున నిలచి, దాహము, దాహము, అని అడుగుతుంది"

"కథ బాగా నడుపుతున్నావు కాంతం"

„నాకడ్డము రాబోకండి. సన్యాసి కన్నులు తెరచి చూచును. జీర్ణ వస్త్రము ధరించినా, శుష్కించిన దేహమైనా, ఒకప్పుడు ఆమె చక్కని చుక్కయని చెప్పకనే తెలుస్తుంది. సన్యాసి దాహం ఇస్తాడు. ఆమె దాహం త్రాగి తెప్పరిల్లి సన్యాసిని రెప్పవాల్చక వీక్షించి మూర్ఛపోతుంది"

"అవునవును, మూర్ఛకూడా ఉండకపోతే కథలో చమత్కారము పోయేది కానీ"

"సన్యాసి శీతలోదకము ఆమె ముఖముపై జల్లి, ఆమెకు శైత్యోపచారముల చేసినాడు.

„కాంతం కాంతం. ఇదేమిటి. మనచదువే కథ పోగొట్టి, నీవొక పెద్ద నవల వ్రాస్తున్నావు"

"అవును మీరు చెప్పమంటే చెపుతున్నాను. అపుడామె కళ్లు తెరచి నన్ను పోల్చుకోలేవ' అంది. సన్యాసి ఆమెను గుర్తించి అశ్రుబిందువులు రాలుస్తాడు. ఆ సన్యాసి మన కథానాయకుడేయనియు, ఆ రెండవ వ్యక్తి మన నాయికయే యనియు పాఠకులు గ్రహింతురుగాక! అని చివర చేర్చాచూ కథ సుఖాంతంగా తెచ్చినామన్న మాటే" అన్నదికాంతం.

నాకు నవ్వొచ్చింది. „బందరువెళ్లినందుకు వియోగమున్నా ఇంతగోలానా" అనిఅన్నానూ.

„కల్పనా చాతుర్యం అంటే అదే అన్నది" కాంతం.

„సరే నీవట్లా తేల్చావా. ఈ కథలో ఎట్లా ఉందో విను"

„బందరులో పని అయిన తరువాత తిరిగి రైలు ఎక్కి తాడేపల్లి గూడెంలోదిగి చవుకగా పోయే కారు ఎక్కాను."

„మన ఊరేనా ఆ కథలో ఆయనది."

„బండిలో కొందరు భీమవరం పోయే పెద్ద మనుష్యులు కూర్చున్నారు. అందులో ఒక పెద్ద మనిషితో నాకు పరిచయం కలిగింది. ఆవిషయీ మాట్లాడుకొనడంలో నేను భీమవరంలో ఉన్నానని చెప్పవలసి వచ్చింది. అయ్యా మీకు ఇల్లు దొరికిందా? భీమవరంలో ఇల్లు దొరకటం కష్టం లెండి" అన్నాడు. „ఏదో ఒక యిల్లు దొరికింది, పసుతం అందులో ఉన్నాము. తృప్తిగాలేదు.

వ్వరో ఇంట్లోకి వెళ్ల వలయునని చూస్తున్నాను అన్నాను."

"అంతా మన బ్రతుకు కథలోనే ఉందే ఎవరు వ్రాశినారండీ"

"ఎవరు వ్రాస్తేనేమి విను.

"ఒక చోట ఇల్లుంది ప్రవేశిస్తారా అండి" అన్నాడు ఆయన. మా ఇద్దరికి ఈ విధంగా సంభాషణ జరిగింది.

"ఇల్లు మంచిదేనా అండి"

"ఆ విషయం అడగవలసిన పనిలేదండి"

"అల్లాగా అండీ"

"బంగారపు మేడ అనుకోండి నున్నటి గోడలు. నేలగచ్చు చేయక పోయినా అలికి ముగ్గుపెట్టుకుంటే అద్దంలా ఉంటుంది"

"అయితే తేమగా ఉంటుందా అండీ"

"అబ్బే! నిక్షేపంతల్లి లాగుంటుందండి. తేమగా ఉంటే నేను మీ బోటి వాళ్లకు చూపుతనా"

"వెలుతురూ, గాలీ వస్తవా?"

"కావలసినంత వెలుగూ, గాలీని, దొరల ఇల్లులాగుంటుంది" నాకు ప్రాణం లేచి వచ్చింది. "దొడ్లో నుయ్యి ఉందా" అన్నా.

"ఒకటికాదు రెండున్నవి. కావలసినంత ఉదకమండీ స్నానానికి. పాన యోగ్యం మట్టుకు కావు. అన్ని భావులల్లాగా కొరు ఉప్పులు కావు. స్నానానికి పనికొస్తవి"

"అయ్యా మీరు నన్ను ఊరించబోకండీ. ఇప్పుడే వెళ్లి ఆ యిల్లు తాళం వేసుకుంటాను" అన్నాను.

"అల్లా చేయటం మంచిదండి. ప్రస్తుతం ఆ యింట్లో ఎవరో ఉన్నారని కాదు. కొద్ది రోజులలోనే వెళ్లిపోతారని మా బావ చెప్పాడు. మొన్న మా పూరొచ్చి ప్రస్తుతం చూచి బయానా ఇచ్చిపొండి" అన్నాడు.

"సరేనండి, రెండు రూపాయలు తీసుకోండి"

"నా కెందుకండి మా బావకివ్వండి. ఆయన ఇంటి యజమాని. ఆ ఇల్లు చూస్తే మీరు వదలరు. ఏడు రూపాయలకు అద్దె తక్కువకు ఇయ్యడు. మా బావ వస్తే ఆయనతో చెప్పి ఆరుకే ఇప్పిస్తాను. మా బావ నా మాట యెన్నడు గురిలెండి" అన్నాడు.

"నేను పరమానంద భరితుణ్ణినైనాను. చక్కదనాల ఇల్లు ఆరు రూపాయలకు వస్తుందె. ఆ ఇంట్లో గాలి వెలుగు ఉండి బంగాళాలాగ ఉందాయె. ఇంకేమి కావలె.

"చాలా బాగుంది. ఆయనను గృహ ప్రవేశము చేయటంతో కథ ముగిస్తుందనుకొంటా. ఎంత కథ చెప్పారు యీ మాత్రం భాగ్యానికి"

"వినుమరి మోటారు దిగి మాట్లాడుతూ వెళ్లి ఒక యింటివద్దకు వచ్చే సరికి ఆయన ఆగినాడు. ఎందుకో ఆగినాడనుకొని, ముందు మీరు చెప్పిన గృహానికి వెడదాంరండి" అన్నాను.

"ఇదేనండి ఆ యిల్లు అన్నాడు" ఆయన ఆ ఇంటికేసి చూపుతూ.

నేను శిలాస్తూపం అయిపోయినాను.

ఆశ్చర్యమో, ఆగ్రహమో, ఆనందమో: ఏవో నా నోట మాట రానియ్యలేదు. రెండు నిమిషాలలో తెప్పరిల్లి భగభగ మండుతున్నప్పటికీ వళ్లంతా కోపం చల్లార్చుకొని నోట మాటరాక పిచ్చి చూపులు చూచాను.

"పైకి యిల్లా కనిపిస్తుంది కాని లోపల బంగాళా లాగి ఉంటుందండి—దయచేయండి. అల్లా చూస్తారేం" అన్నాడు.

ఏమి అనలేక కోపం నిగ్రమింగి "ఇదేనండి నేనుండే ఇల్లు" అన్నాను నేను.

కాంతం విరగబడి నవ్వింది. "ఏమి కోతలు కోనాడు తమాషాగా ఉంది కథ అన్నది కాంతం"

ఇంక కొంచెముంది విను.

అతడికి పై ప్రాణాలు పైన పోయినవి. కొయ్య బారి గలబడి నావంక శూన్య దృక్కులు సారించాడు.

"ఇంతలో నామాటలు విని కాబోలు మారుక్క తలుపు తీసికొనివచ్చి నా మీదికి దూకింది. మా అమ్మాయిని ఎత్తుకొనివచ్చి నేను లోపలికి పోయినాను. అతడు మాడిపోయే ఎండలో ఎంతసేపు నించున్నాడో నాకు మాత్రం తెలియదు.

"ఓహోహో, రుక్కు అంటున్నారు, ఇదంతా మనింటి గోలేనా! ఈ మాట తెలిస్తే ఇంత ఓపికగా వినేదాన్నా? ఎవరో వ్రాశారంటే విన్నా. అయినా మీరు మన ఇంటి గోలలు పత్రికలలో వ్రాయబోకండి. సంసారం గుట్టు రోగం రట్టు అన్నాడు" అనినన్ను కాంతం మందలించింది కథ కడియందు గౌరవం కలుగ జేదామని వ్రాసిన వాడిపేరు చెప్పక జాగ్రత్తగా కథ నడిపినా చివరకు, ఆవిడ పెట్టేవి నాలుగు పెట్టింది గదా అను విచారము మట్టుకు నన్ను కొంతసేపు బాధ పెట్టింది.

---

# ముగ్ధుఁడు

వేంకట కాళిదాస కవులు

(ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము)

ఏనువసంతరాత్రుల, మహీరుహశాఖల, నాకుసందులన్
మౌనమునూని కారునును మబ్బులవెన్క హసించుచంద్రునిన్
గానగ లేకనాదు సముఖమ్మున నున్న త్వదీయహాసరే
ఖానవచంద్రికాసమితిఁ గన్నుల నిల్పెద ముగ్ధవిస్మృతిన్.

నేనుసుధాప్రపూరితధునీ కమనీయతరంగమాలికల్
సోనలువోవఁ దావక విలోకనపంక్తులుగ్రుమ్మరించు, అ
జ్ఞానఘనీరవప్రణయగానములన్ జవిచూచి, నిశ్చల
ధ్యానవిలీన మానసుడనై నినుఁగాంచెద ముగ్ధదృష్టులన్.

నేను నవీనసూన రమణీయదళాంతనితాంతరాగరే
ఖానలనల్పమల్పరచు కమ్మని నీ నును జెక్కులన్ మదీ
యానననిశ్చల ప్రకృతి యంతయుఁ బ్రేమరసప్రపూర్ణ, దీ
ప్తానియతిన్ నిరంతరముఁ గన్గొనుచుండెద ముగ్ధమూర్తినై.

"శుక్లపక్షము."

# నిజాంరాష్ట్రి చారిత్రిక పరిశోధనము

## మహమ్మదీయ శాసన లిఖితముల విషయము

ప్రొ. సిరుగూరి హనుమంతరావుగారు, ఎం.ఏ.,ఎల్.టి.



ఈ వ్యాసమునందు అర్ష శాఖ వారిచే సంపాదింప బడిన మహమ్మదీయ శిలా శాసనాధారములను గురించి సంగ్రహముగా వివరింప బడినది. ఈ శాసనములు వార్షిక నివేదనములందు సూచింపబడి „ఎపిగ్రాఫికా ఇండో మాస్లిమికా" యను గ్రంధము నందిదివరకు విమర్శింపబడినవి. ఈ విషయమునందు అభిరుచి కలవారి కనుకూలముగా నుండుటకై వీనిని కాలానుసారముగా ఏర్పరచి యున్నాను.

అతి పురాతనమైన శాసనము మహమ్మదు బిన్ తుగ్లకు కాలమునాటిది. ఇది నిజామాబాదు జిల్లాలో బోధన్ అను ప్రదేశమునందు దొరికినది. హిందూ ప్రభువుల కాలమునందు బోధను ప్రాముఖ్యతె జెందిన పట్టణమై రాష్ట్రకూట రాజుల రాజధానులలో నొకటిగా నుండెను. ఇందు పెక్కు దేవాలయములుండెను. దేవాలయపు శిధిలములపై నిర్మితమైన 'దేవల్ మసీదు'నందు మహమ్మదు బిన్ తుగ్లకు శాసనము కలదు. కావలి బురుజు నిర్మాణమును సూచించు చున్నది. ఈ ప్రదేశము యుద్ధ వ్యూహములకు పేరు గన్నదిగా అదే ప్రదేశమందలి తర్వాతి శాసనములు తెలుపుచున్నవి. క్రీ.శ. ౧౬౫౫ లో మరొక దేవాలయ ప్రదేశమున ఒక చిన్న మసీదును ఔరంగజేబు నిర్మించెను.

కంధారమనునది నాందేడు జిల్లాలోని మరియు యుద్ధవ్యూహ ప్రసిద్ధమగు ప్రదేశము. ఇచ్చట మహమ్మదు బిన్ తుగ్లకు అధికారము చక్కగా నెలకొనియుండెను. „కంధారము మలిక్ సయిఫుద్దౌలా (Malik Saifuddowla) యొక్క ఇనాం ప్రదేశముగ నుండె"ననియు „కప్పము చెల్లించుట వల్లగాని, ఫరీలనా భాగముతో కలుపుట వల్లగాని యేదో సంబంధము వల్లగాని సార్వభౌమిక ఇనాందార్లుగగాని ప్రతినిధులు ఏజంట్లుగగాని, ఉద్యోగులుగగాని, రాజు దర్బారుతో సంబంధము కలిగియుండని భూభాగము లేదు. తన స్వాధీనములోనికి ఏదేశమును తేలేనుగాని జనులమీద 'జిజియా' అను పన్నును అతడు విధించెను.....అతని న్యాయశీలముచే నీ ప్రపంచమునందు ప్రాణరక్షణము గానింపబడని వాడు ఒక్కడును లేడు." అనియు ఈ శాసనము తెలుపుచున్నది. ఒకానొక కోట బురుజుపై క్రీ.శ. ౧౬౮౪ తారీఖుగల ఔరంగజేబు పరిపాలన కాలమునాటి యొక శాసనము కలదు. (ఎ. ఇ. మో. ౧౯౧౯—౨౦)

మహమ్మదు బిన్ తుగ్లకు పరిపాలనా కాలమునకు పదునారవ శతాబ్దములోని స్వతంత్ర మహమ్మదీయ రాజ్యస్థాపనమునకును మధ్య కాలమును గూర్చిన శాసనములు ప్రకటితమైనవి లేవు. వీనిలో విజాపురము ప్రసిద్ధిగాంచెను. ఉస్మానాబాదు జిల్లాలోని నలదుర్గమునందలి కోటలో అదిల్ షాహీలకు జెందిన రెండు శాసనములు కలవు. ఈ కోట బీజాపురము, అహమ్మదు నగ

షరా:—ఎ.ఇ.మొ. అనగా ఎపిగ్రాఫియా ఇండో మాస్లిమికా.

రము వారికి వివాద కారణమై యుండెను. క్రీ. శ. ౧౫౫౮—౬౨ సంవత్సరముల మధ్య విజాపురము, వారి హస్తగతమయ్యెను. ఆలీఆదిల్ షాహ ఈ కోటను మిగుల అభివృద్ధి పరచెను. క్రీ.శ. ౫౭౪ సంవత్సరములో యీ నలదుర్గమునందే ఇబ్రాహిం ఆదిల్ షాహీ మహమ్మదు కులీ కుతుబ్ షా సోదరిని పెండ్లి యాడెను. ౧౬౧౩ తారీఖుగల ఒక శాసనము కలదు. ఇది నదికి ఆనకట్టు కట్టిన విషయమును సూచించు చున్నది. ,,ఈ ఆనకట్టు అలె గ్జాండర్ దుర్గ ప్రాకారములవలె ప్రసిద్ధి చెంది యున్నది. (ఎ.ఇ.మో. ౧౯౧౪—౧౯౧౫.)

విజాపుర, అహమదునగర ప్రభుత్వముల వారిద్దరు అభిలషించిన దక్షిణాపథమందలి మరియొక దుర్గము పరిండా. ౧౫౪౭ తారీఖుగల ఒక శాసనముగలదు. విజాపూరు నవాబగు ఇబ్రాహిం ఆదిల్ షాచే పరిపాలకుడుగా నియమింపబడిన ఖాజా జహాన్ అను వాని పేరును ఇది పేర్కొనుచున్నది. ఈతడు ఈ కోటను అహమ్మద్ నగర్ బుర్హాన్ నిజాంషాహకు ఒప్పగించెను. (ఎ. ఇ. మో. ౧౯౨౧—౨౨) అహమ్మదు నగరు ఎంశమును గురించిన ప్రాచీన శాసనము క్రీ.శ. ౧౫౨౧ తారీఖుగలది. మొదటి బుర్హాన్ నిజాంషా పరిపాలనమును గురించి సూచించును. ఇది బీడ్ జిల్లాలోని ఆష్టి యందలి మసీదులోనున్నది. (ఎ. ఇ. మో. ౧౯౨౧—౨౨) కంధారములోని కోటయందు మొదటి ముర్తజా నిజాం షాహ శాసనములు కలవు. ౧౫౬౫—౭౬ అవి కొన్ని బురుజులయొక్కయు ప్రాకారముల యొక్కయు నిర్మాణమును తెలుపుచున్నవి. అఖారూమీ అను ఫిరంగులు కాల్చు తురుష్కుని నియామకమును గూర్చి కూడ ఉదహరింపబడి యున్నది.

ఔరంగబాదు జిల్లాలోని అంతూరు కోట ముఖ్యమైన శాసనములను కలిగియున్నది.—,,ల్యాండ్ మార్క్స్ ఆఫ్ ది డక్కన్'' అను తన గ్రంథమునందు కర్నల్ హేగ్, రెండవ ముర్తజా నిజాంషా కాలము ౧౬౦౩—౧౬౩౦ అని యిచ్చినట్లు మిస్టర్ యజ్దాని గారు తెలుపుచున్నారు. గాని నిజముచేత ఆ కాలమునందు ఇద్దరు రాజులుండిరి. మలికంబరు ముర్తజాలకు మిక్కిలి విరోధములుండెను. మలికంబరు ముర్తజా పక్షమును విడిచిపెట్టి మూడవ బుర్హాను నిజాంషాను సింహాసనమునరిమంచెను. ఈశాసనము ౧౬౧౦ లో సింహాసనముపై నుంచబడి మలికంబరు కుమారుడగు ఫతేఖానుచే ౧౬౩౦ లో చంపబడిన యీ రాజును గురించి సూచించుచున్నది. బురహాన్ నిజాంషాహ కుమారుడగు హుస్సేను నిజాంషాహ గద్దె నెక్కి ౧౬౩౨ వరకు పరిపాలించెను.

కోటలోని యొకానొక శాసనము మలికంబరు ,,మానవజాతి యుపకారి''గా వర్ణించుచున్నది. ౧౫౯౦—౧౫౯౪ వరకు పరిపాలించిన బురహాన్ నిజాంషాను గూర్చి తెలుపుచు ౧౫౯౨ తారీఖు గల అంతూరునకు రెండు మైళ్ల దూరములో నొక శాసనముగలదు. (ఎ. ఇ. మో. ౧౯౧౯—౧౯౨౦.)

మొగలు ప్రభుత్వమునకు సంబంధించిన శాసనములనేకము లిచ్చటఁ గలవు. ౧౬౨౪ తారీఖుగల యొకటి దక్కను పరిపాలకుఁడుగా నవాబు జాన్సిపూర్ ఖానును పేర్కొనుచున్నది. ఈ విషయమును 'బాదుషా నామా' రూఢి పఱచుచున్నది. మఱియొకటి ౧౬౩౬ తారీఖుగలది సఫ్ షికన్ ఖాను పరిపాలకుఁడుగా పేర్కొనుచున్నది.

౧౬౬౧ మెయి ౨౧ తారీఖుగల శాసనము హిజు మెజిస్టి ఆలంగీరుషా (గాజీ) కిలాఫతు కాలమందలి ఉన్నతోద్యోగియగు సర్దారుఖాన్ ఫౌజుదారుని సంబంధించినది. ౧౭౦౧ గల యింకొకటి అవురంగజేబు జయించిన దుర్గములుగా విజాపురము, హైదరాబాదు, ఇనవాని, నర్నాలా, జింజి, ఖేల్నాలను పేర్కొనుటయేగాక, విజాపురమునుండి ఖుజస్తాబున్యాదు (అవురంగబాదు) వరకు వ్యాపించిన పరగణాకు పరిపాలకుఁడుగా గాజియొద్దీన్ ఖాన్ ఫిరోజుజంగు నియామకమును పేర్కొనుచున్నది. ఈ పాలకుని పేరక్రొత్తగా నిర్మితమయిన గాజీయొద్దీన్ నగరము పట్టణమునకుఁ బెట్టఁబడినది. ఈ నగరనిర్మాణమునందు నాయబు-ఫౌజుదారు, సదరుషాబేగు, సింధూజీదేశముఖు, ధోండోజి దేశపాండ్య, శంభునేటు అను వారలు సహాయముచేసియున్నారు. ఈ విషయము పారసీ, మరాటి అను

రెండు భాషలందుగలవు. శక సంవత్సరము ౧౬౭౫. దీనికి సరియగు క్రీ. శ. ౧౭౫౩-౫౪. ధోండాజీయను వాఁడు గొప్ప పలుకుబడి కలవాఁడుగాఁ గనఁబడుచున్నాడు. అతని సంపూర్ణనామము ధోండాజి కిషన్ అని ౧౬౯౦-౯౧ తారీఖుగల మరియొక శాసనమునందు తెలుపఁబడినది. ఈతఁడు ధోండుపురం అను కోటబురుజును గట్టించియున్నాఁడు. (౧౭౫౪).

౧౭౨౫, ౧౭౩౨ తారీఖులుగల మహమ్మదుషా పరిపాలనపు రెండు శాసనములు గలవు. వీనిలో రెండవది ,,బీడుపరగణా జాగీరుదారగు ధైర్యమహనీయుఁడు రావు సుల్తాంజీ బునాల్కర్‌”చే నిర్మితమయిన అహమదనగర దర్వాజా విషయమును సూచించుచున్నది.

రెండుశాసనములును పంజాబు దేశపు హిందూ వనితయు, విఠల్ అనువాఁడును షాహకోచక్ వలీయను మహమ్మదీయ యోగి భక్తులుగా నుడువుచున్నవి. ఈ కాలమునందును మహమ్మదీయ యోగుల యొక్క భక్తి ప్రపత్తులుగల హిందువులు పెక్కురున్నారు. దక్షిణ హిందూ దేశములోని ,,నాగూరు” వివిధజాతీయుల నాకర్షించు పవిత్రస్థానముగా పేర్కొనవచ్చును.

బీడునందు ఆసఫ్‌జాహి కాలమునకు సంబంధించిన నాల్గు శాసనములు గలవు. ౧౭౪౩ తారీఖుగల యొకదానియందు ,,షాహ ఆలం రాజ్యము చేయుచుండ, నిజాముద్దౌలా సుబేదారుగను ఉండిన కాలమునందు మీరు నిజాం అలీఖాను ఈ సింహద్వార నిర్మాణమును పూర్తి గావించెను.” అని లిఖింపబడియున్నది. ,,నవాబు షరఫుద్దౌలా బీడు, బక్షీ పరిపాలకుఁడుగను, అలీ మహమ్మదు ఖాను కోశాధికారిగను పేర్కొనఁబడి యున్నారు. (ఏ. ఇ. మో. ౧౯౨౧-౨౨)

ఇప్పుడు మనము కుతుబుషాహి రాజుల శాసనములకు వత్తము. ఈ వంశ మూల పురుషుఁడగు సుల్తాన్ కులీ కుతుబుషాహకుఁ జెందినది అత్యంత ప్రాచీన శాసనము ౧౫౧౮ లో నితఁడొక మసీదును గోటలోఁ గట్టించెను. బహమనీ రాజగు మహమ్మదుషా సార్వభౌమత్వము ఇంకను నామమాత్రముగా నంగీకరింపఁబడియున్నది. (ఏ. ఇ. మో. ౧౯౧౩-౧౯౧౪.)

కరీంనగరమునకు మూడుమైళ్లమీఁది ఎల్లందలలో ౧౫౨౫ తారీఖుగల శాసనము గలదు. మన్సూరుఖాన్ అను బిరుదుగల అబుల్‌ఫతె యొక్క మసీదును గట్టినట్లు తెలుపుచున్నది. (ఏ. ఇ. మో. ౧౯౧౯-౧౯౨౦)

సుల్తాన్ కులీ సమాధిపై నున్న శాసనము సెప్టెంబరు ౨, ౧౫౪౩ అతని మరణ దినముగాఁ దెలుపుచున్నది. సమాధిపైని లిఖితమును బట్టి యాతని ముద్దుపేరు ,,బడే మాలిక్” అనఁగా గొప్పరాజు. అతనిని ,,దైవ సేవాభిలాషియగు యోధుఁడు, దైవపథగామి” అని పేర్కొనుచున్నది. హిందువులతో నితఁడు హోరాహోరిగ పోరాడినట్లు సమకాలిక లిఖితములు దెలుపుటచే ఈ విషయము సరిపోవుచున్నది. ,,షహీద్” (మతము కొరకు, దేశము కొరకు ప్రాణమిచ్చిన వాఁడు) అను పదము, ఈతడు తన మూడవ కుమారుఁడగు యార్‌కులీ కుట్రచే చంపబడుట సూచించుచున్నది. (ఏ. ఇ. మో. ౧౯౧౫-౧౬)

జెమ్షీదుకులీ, సుబహాన్‌కులీలకు సంబంధించిన శాసనములు లేవు. కోటలోని మక్కి దర్వాజామీఁద ౧౫౪౯ తారీఖుగల ఇబ్రాహీం కుతుబుషా శాసనముగలదు ఇబ్రాహీం రాజాధిరాజుగను, భూసముద్రపరి రక్షకుఁడుగను, నిఖిల జంతుసంతానమునకుఁ గరుణాసంధాయకుఁడుగను వర్ణింపబడి యున్నాఁడు. ఇబ్రాహీం మహా సేనాధిపతులిద్దరిలో నొక్కఁడగు ముస్తఫాఖాన్ పేరుగూడ గలదు. అతని పేరు కమాలుద్దీన్ హుస్సేన్. ఈతఁడు ,,సామ్రాజ్యపు మూల స్తంభముగను, రాజ్యమునకాధారుడుగను, గ్రంథ గ్రాహిగను, సైన్య విక్షేపకుఁడుగను” వర్ణింపఁబడియున్నాఁడు (ఏ. ఇ. మో. ౧౯౧౩-౧౪.)

౧౫౬౨ తారీఖుగల యొక శాసనము నెల్లూరు జిల్లాలోని గూడూరునందు గలదు. ఇబ్రాహీం రాజ సేనాధిపతియగు ,,రిఫతుఖాన్ లోదీ”నిఁ పేర్కొనుచున్నది. ఈతనికి మలిక్ నాయబు అని మరియొక నామము గలదు. (ఏ. ఇ. మో. ౧౯౨౧-౨౨)



శ్రీమతి రత్నాల కృష్ణాబాయి గారు బి. ఏ., ఎల్. టి.
చిత్రకారిణి.

ఇబ్రాహింకులీ సమాధియాతని పూర్వీకుల వాని కంటె విస్తీర్ణమైనదై, యొకప్పుడు వివిధ వర్ణముల యిటుకలచే సుందరముగా నలంకృతమై యుండెను. సమాధి మీఁది శాసనము బట్టి యాతని మరణకాలము జూన్ ౫, ౧౫౮౦.

తరువాతి రాజు మహమ్మదు కులీకుతుబుషా. హైద్రాబాదు నందలి జామా మసీదులోని శాసనములో నితఁడు "ప్రపంచనేత గను తన పరిపాలనలో సచ్ఛీలుర కుదారమాన్యత లభించు రాజాధిరాజుగను" వర్ణింపఁబడి యున్నాఁడు. అమినుల్ ముల్కు అను వాని యాజమాన్యము క్రింద నా మసీదు ముగింపఁబడినది. ఈ యమినుల్ ముల్కు ప్రజ్ఞా ధురీణుఁడగు సేనపతియు, మీరుజుమ్లా యున్నతోద్యోగమును వహించినవాఁడును నయి యుండెను. కులీకుతుబుషా కాలమునందలి హిందువుల తిరుగబాటులను పెక్కింటినడంచిన వాఁడు.

ఖైరతాబాదు నుండి గోలకొండకుఁ బోవుమార్గము నందలి మా సాహెబా తటాకమందలి మంటపములందు కొన్ని శాసనములు గలవు. ఇవి మహమ్మదుకులీ, అతని యనంతర రాజుల కాలములందు తబాతబా సయ్యిదుల ప్రాబల్యమును విశదపరచుచున్నవి. [ఎ. ఇ మో. ౧౯౧౫—౧౬.] కులీకుతుబుషా సమాధిమనోహరమైన కట్టడము. ఆతని మరణ దినము జనవరి ౧౧, ౧౬౧౨ అని సమాధి మీఁది శాసనము తెలుపుచున్నది. రాజుగారి నామమునకు ముందు "మహా చక్రవర్తి" బిరుదము వాఁడబడినది. ఈ బిరుదము హుమాయూన్, అక్బరు, ౧౫౫౬, ౧౬౦౫ లోఁ గ్రమముగా మరణించిన తరువాత వారికి వాడఁబడినట్లును, ఇట్టి యనుకరణము వలన కుతుబుసాహి రాజుల మహత్వకాంక్షను సూచించుచున్నదనియు మిస్టరు యజ్దానిగారు వ్రాయుచున్నారు. [ఎ. ఇ. మో. ౧౯౧౫—౧౬.]

తరువాతి రాజగు మహమ్మదు కుతుబుషాహు గురించి, సమాధులలోని శాసనములు మాత్రమే గలవు. అతని సమాధి మీది శాసనము ఆతని జన్మదినము (ఏప్రిల్ ౧౫౯౩), గద్దె నెక్కిన దినము (జనవరి ౧౧, ౧౬౧౨) అతని మరణ దినము [ఫిబ్రవరి ౧, ౧౬౨౬] ఇచ్చుచున్నది. మహా చక్రవర్తి బిరుదము ఇంకను వాడుకలో నుండుటయే గాక, రాజకుమారికల సమాధులపై మహా చక్రవర్తిని యనియు, రాజగురువు సమాధిపై "మహాచార్య" యనియు లిఖితములు గలవు. అతని మనుమని సమాధిమీది శాసనములో సుల్తానునకు మర్జు మినినూరుల్లా [భగవత్తేజాభిలాషి] బిరుదమియ్యఁ బడినది. సుల్తాను సతీమణియగు హయాతు బక్షు బేగము సమాధి యామెమరణ దినము ౧౬౬౭ గా తెలుపుచున్నది. ఆమె తన కుమారుఁడగు అబ్దుల్లా కుతుబుషాహ కాలములో రాజ్యపరిపాలనయందు కార్యభారమును ప్రఖ్యాతిగ వహించెను. [ఎ. ఇ మో. ౧౯౧౩—౧౪.]

అబ్దుల్లా కుతుబుషాహ కాలమునందే గోలకొండను మొగలులు మొదటిసారి ముట్టడించుట సంభవించెను. మూసాబురుజు అను పేరు గల కోటబురుజు మీది శాసనము ఈ ముట్టడినిఁగూర్చిన వివరము వర్ణించుచున్నది. ఆ కాలపు మంత్రి మండల నాయకాగ్రగణ్యుడును, రాజవిశ్వాస పాత్రుఁడును రాజ్యభారవహుఁడును, ఖానుడును, మహా ముఖ్య సేనాపతియును అగు మూసాఖాను శత్రువును తరిమి వేయఁబంపఁ బడెను. కోటపై నుండి కాల్చఁబడిన యొక ఫిరంగి గుండు మొగలు సేనాపతి యగు మీరెమీరాన్‌కుఁ దగులగా, వాఁడు తత్ప్రదేశమందే మరణించెను. ఆతని మరణానంతరము మూఁడు దినములకు సంధిచేసికొనఁ బడెను. ఆ స్థలమందు గొప్పబురుజును నిర్మించుటకై మూసాఖాను ఆజ్ఞాపింపఁబడెను. ఇది ౧౬౫౬ లో ముగింపఁబడినది. ఇందొకటి పారసీభాషలోను, మరియొకటి తెలుగు భాషలోను ఉన్నది. [ఎ. ఇ. మో. ౧౯౧౩—౧౪.]

మూసాఖాను మహల్దారు ఉద్యోగమునందున్నట్లు నగరములోని టోలి మసీదులోని శాసనము తెలుపుచున్నది. ఈ మసీదు ౧౬౭౧ లో ముగింపఁబడినది. [ఎ. ఇ. మో. ౧౯౧౭—౧౮.]

౧౬౭౦—౭౨ తారీఖు గల రెండు శాసనములలో అబ్దుల్లా కుతుబుషాహ సామంతుడగు ఖైరాత్ ఖాన్ పేర్కొనబడి యున్నాడు. ఈతడు దుర్గములోని అంబరుఖానా [సామాను కొట్టిడి] కట్టించియున్నాడు. ఇతడిం




# రాణా ప్రతాపసింహుఁడు

(ఏకాంక రూపకము)

(ఒ. సీతా రామచంద్రరావు)

౧ వ స్థలము: కుమల్మేర్ దుర్గము

(ప్రవేశము: రాణాప్రతాపసింహుఁడు)



ప్రతా—(సాశ్చర్యము) వీరు నిశ్చయముగ రాజపుత్రులేనా? రాజపుత్రులనుటకు దగినవారేనా? దేశస్వాతంత్ర్య రక్షణార్థము ప్రాణములనైన విడవ వలసిన రాజపుత్రుఁడొక రాజనోద్ధ సేవకుఁడు గావలయునా? అథవా, అంకితుఁడు గావలయునా? నరులు స్వేచ్ఛా ప్రవర్తకులే. అయినను; రాజమండలి కంతటికిలేని యీ వినాశకాల మీ జోధపూర్, అంబీర్, బికనీరు, బుందీరాజులకేల గలుగవలయును? (విచారించి) అక్బరు చక్రవర్తి రాజనీతిజ్ఞుఁడు. ఏ యెండ కే గొడుగు పట్టవలయునో యాతనికి బాగుగ దెలియును. పరదుర్నిరీక్ష్యమగు రాజపుత్ర స్థానమును „స్వాహా” యనఁదలంచి, గుండె గాలములవంటి రాజపుత్రులఁగని, జంకి, మాయోపాయమున రాజపుత్రులలో నంతః కలహముల ప్రతిష్ఠించి తన పనిని నెగ్గించు కొనుట కుపక్రమించెను. అతని సామర్థ్య మెంతదియో! నాతమ్ముని— సాగరజీనికూడ తన పక్షమునకు ద్రిప్పుకొనియె! వంచకుడు—పయోముఖ విషకుంభము—గోముఖ వ్యాఘ్రము—తృణాచ్ఛన్న కూపము! అయ్యో! [illegible] టలకు బుద్ధిబృహస్పతులగు రాజపుత్రు లెంత సులభముగ లొంగిపోయిరి! „ఏకఁట నే వ్రేలిడెద; నానోట వ్రేలిడు” మనునటుల నన్యోన్య సంబంధ బాంధవ్యముతో నెంత సులభముగ—నెంత త్వరలో పాలవంటి పాల మీఁగడవంటి రాజపుత్ర వంశమును సాంకర్యమ్మా యమగు నట్టిదానినిగా నొనరించెను! కానిమ్ము. (తలయూచి) అటుల మ్లేచ్ఛ సంబంధముగల రాజపుత్రులకొఱకే నేర్పరచిన జాతి బహిష్కరణ విధానము బుద్ధిరుదాక వారి గలచనిమ్ము. ఏనాఁటికైనను తమ కృత్యమకృత్యమని వారికి దోపకుండునా? పశ్చాత్తాపము కలుగకపోవునా? [illegible] స్వాలోచనము యిన? వారందఱు చక్రవర్తికి బానిసలయై చేయునదేమి? రాజపుత్ర స్థానమున పారతంత్ర్య మహా భూతము ప్రతిష్ఠించుటయేనా? అది వారికి సాధ్యమేనా? ప్రతాపుని యంగకములు జరావిశీర్ణములైనను పని చేయవలమని చెప్పవే. ప్రతాపుని నాడుల యందింకను విక్రమోపేతమగు శిశోదియా వంశపవిత్ర రక్తము విడువక ప్రవహించుచునే యున్నదియే! క్షాత్ర వంశీయ రాజపుత్రస్థాన చరిత్ర యింకను వినవచ్చుచునే యున్నది! నిలుచుట కాధారమై యున్న యీ కుమల్మేరు దుర్గ[illegible]

చాలదా? డిల్లీశ్వరుని దృక్కులను రాజపుత్ర స్థానముపై నుండి మఱలించుటకు. [ముందునకు జూచి] ఏమది? యశ ఎంత సింగేలనో త్వరితగతి వచ్చుచున్నాడు? శత్రువుల జాడ నేదయిన ఁగనిపెట్టెనా యేమి?

యశ—(ప్రవేశించి) జయము, జయము మహారాణావారికి!

ప్రతా—ఏమయ్యా యశవంత సింహుఁడా! ఏమి సమాచారము? నీత్వరితేమువ కేదయిన విశేషముండక తీర దని తలఁచెద.

యశ—రాజా మానసింగ్ జీ వచ్చియున్నారు.

ప్రతా—(నిరసనభావముతో) ఏమి? మానసింగ్! డిల్లీశ్వరునకు తనజనకస్థానపు సోదరిని, పాలకస్థానపు సోదరిని యప్పగించినమానసింగ్ వచ్చెనా? మంచిది. ఇంటికి ద్రోసికొని వచ్చినవాఁడు మ్లేచ్ఛమతి స్వీకృతుఁడగు రాజపుత్రుఁడైననేమి, మ్లేచ్ఛుఁడే యైననేమి! మన కాదరణీయుఁడే. నడువుము. నేనును వచ్చి చేరితిని. ఇంతలో నతిథి సత్కారమునందు మాత్రము లోపము గలుగరాదు సుమ! జాగ్రత.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## ౨ వ స్థలము.

(ప్రవేశము: రాణాప్రతాప సింహుఁడు, రాజా మానసింహుఁడు, మఱికొందఱు రాజపుత్రులు గూర్చుండి యుందురు.)

మాన—రాణావారి మర్యాద ప్రదర్శన మమితానందము గలిగించినది.

 ప్రతా—మానసింగ్ జీ దయ.

మాన—డిల్లీశ్వరుఁడగు నక్బరు పాదుషావారు రాణావారిస్థితిఁ గూర్చి సర్వదా జాలిఁ జెందుచుందురు.

ప్రతా—రాజ పుత్రస్థానమును పారతంత్ర్య మహా బడబాగ్నిఁ బడి, కమలి, కుమిలి, కాలి, భస్మమాత్ర ప్రాయమగు దానిగా నొనరింపక పోయినవియా?

మాన—స్వాతంత్ర్య, పరతంత్ర్య సంఘటనము లీశ్వర కల్పితములు. అందునకుఁ గాదు—మీరనుభవించుచున్న యిడుము లకుఁగాను.

ప్రతా—(గంభీరముగ) డిల్లీశ్వరునకిట్టి జాలిఁ గలిగించిన పరమాత్మకుఁ గృతజ్ఞుఁడ. కాని యావగింజలకు తవుడుపట్టను. ఇదేదియో వినవలసినదే యున్నది.

మాన—వినవలయుననియే చెప్పుచుంటిని.

ప్రతా—శ్రద్ధమై వినియెదను.

మాన—మీరొకసారి డిల్లీనగరమునకు రావల యును.

ప్రతా—ఏల?

మాన—మీ శ్రమలను దూర మొనరించు కొనుటకును, మేవాడ్, చితోడ్ రాజ్యములను సాధించు కొనుటకును.

ప్రతా—ఎట్లు?

మాన—ఒక్కసారి పాదుషావారి దర్శనము గలిగించుకొనుటచే.

ప్రతా—(కోపము నణఁచికొని) మానసింగ్ జీ! బాప్పారావల్ వంశ సంజాతునకు బాదుషావారి దర్శనము రణక్షేత్రమునందే. అంకితుఁడైనవాఁడు కళంకితుఁడే కదా? అసాధ్యమగు సమస్య—దానికేమి? సింగ్జీ! ఎందుండి మీరాక? ఇచటికే?

మాన—షోలాపుర దండయాత్రకేగి, విజయము గాంచి మఱలి పోవుచు మీయునికి యిందుఁ గలదని విని వచ్చితిని.

ప్రతా—(అసహ్య భావముతో) అక్బర్ పక్షమున!

మాన—(అలక్ష్యముగ) ఊఁ.

ప్రతా—రాజపుత్ర పౌరుషమునకు వన్నెఁదెచ్చితివి!

మాన—(కపటహాసముతో) ఏలికను గొలచి.

ప్రతా—(అన్యావలోకనముగ) వీరశక్తి రాజపుత్రస్థాన రత్నాకరమున వలనొడ్డగా రత్నములకు మాఱు లత్తుకలు—గుల్లలు పడుచున్నవి!

మాన—రాజహంసలతో పరుగు పందెమాడిన కాకములు రెక్కలను పరచుకొనినను, తూఁగఁజాలకున్న యవి—ఫలభ్రాంతిచే మిడుతలు మంటఁబడి చచ్చిపోవుచున్నయవి!

ఒకఁడు—(ప్రవేశించి) జయము! జయము! మహారాణావారి యాజ్ఞానుసార మాతిథ్యము సిద్ధమైయున్నది.

ప్రతా—మంచిది.

(అతఁడు నిష్క్రమించును.)

ప్రతా—మానసింగ్ జీ! ఆతిథ్య స్వీకారమునకేమయిన నాలస్యము గలదా?

మాన—నాకాలస్యమే లేదు. లెండు.

ప్రతా—నేనిపుడేల? మీరు భుజింపవచ్చును.

మాన—మీరు పంక్తిలో లేకుండఁగనే?

ప్రతా—ప్రత్యవాయమేమి?

మాన—మీరు పంక్తిలో లేకుండుటయే.

ప్రతా—అది యొకలోపము గాదు. మీరు భుజించి రావచ్చును.

మాన—వీలులేదు.

ప్రతా—మ్లేచ్ఛ రాజులకు రాజ బంధువైనను మానసింగ్ జీ రాజ పుత్రధర్మము నింతలోనే విస్మరింపఁడని నానమ్మకము.

మాన—ఏమి? మ్లేచ్ఛరాజునకు—రాజబంధువు?—అయిన మానసింహుఁడు మతచ్యుతుఁడా?

ప్రతా—మతమునకుచ్యుత మేది?

మాన—అయిన నేను జాతిబహిష్కృతుఁడనా?

ప్రతా—నీవెఱుఁగకుండఁగనే?

మాన—(నిలిచి కోపముతో) గర్వమా? అగర్వమే నా నాకిట్టి యతిథి సత్కార మొనరించినది? కానిమ్ము రేపే మఱల నిన్ను జూడవలసివచ్చినది. అప్పుడు నీగర్వమును—అభిమానమును డక్కించుకొనెదవు.

ప్రతా—బాగు, మానసింగ్జీ! బాగు, తప్పకరావలయును సుమ. కాని యల్లుఁడు గావలయునో, బావమఱఁది గావలయునో—నీ కక్కరేమి కావలయునో అవి నేనెఱుఁగ— అతనిని వెంటగొనిరమ్ము. ఒంటిగా... నెటుపోయి యెటువచ్చునో.

మాన—[అదియే త్రోవఁ దంతఘట్టన మొనరించు నిష్క్రమించును.]

ప్రతా—(అతనితోఁ గొన్ని యడుగులు నడచి ... లివచ్చి సావష్టంభము) రాజపుత్రవీరులారా! యోధులారా! వింటిరా? ఇంతలో సమరప్రసంగము లేదు—రాజపుత్ర వీరులకొకింత విశ్రమము దొరకినది, అలసట ... నని తలఁచితిని. కాని నా తలఁపు వితథమైనది. ... మీరు మీ సన్నాహములయందు దుండ వలయును. ... లేదు.

వీరులు—(ఒఱల నుండి కత్తులఁ బెఱికి) ... పుత్ర స్థాన స్వాతంత్ర్య రక్షణార్థము మహారాణా... కనుసన్న కంటె ముందే సామరిక సామగ్రి సహిత... వీరులందఱు సిద్ధము!

ప్రతా—అ క్షత్రరాజ పుత్రులకందఱకు సహజ ధర్మము. అయినను పరీక్షార్థ మొకసారి శిబిరమును ... లించి వచ్చెదము.

వీరులు—మహారాణావారి యాజ్ఞ.

(అందరు నిష్క్రమింతురు)

---

## 3 వ స్థలము.

(ప్రవేశము : రాణా ప్రతాపసింహుఁడు, సా... భ్రాధీశుఁడు, దేల్వాడాధీశుఁడు, యోధులు.)

సాళు—అటులచేయుటలో కాకాజీ బుద్ధి ... త్రయజరామరమైనది. శత్రుదేశపు పొలిమేర భూము... చాల నిర్మానుష్యములై పోయినవి. అచ్చటి ప్ర... ప్రాంతపర్వతాధిత్యకోపత్యకల యందు నివాస... నేర్పరచుకొనుటచే రాజునకు రాఁబడుకప్పములు ... యినవి. ఆ విజనారణ్య మార్గమునఁ బోఁబడు ... మొదలగు సామగ్రియును ఢిల్లీశ్వరునిఁ జేరక రాజపు... హస్తగతము లగుచున్నయవి.

దేల్వా—ఢిల్లీశ్వరుని కొఱకు సీమనుండి ... మార్గమునఁ బోఁబడు నమూల్య వస్తువు లాయరణ్య...

తమున నే కదా మహారాణావారి సొత్తుగా సంక్రమించినవి. కొంత యెక్కువ సేనను గూర్చుట కా వస్తుమూల్యమే కదా ముఖ్యాధారము?

ప్రతా—రాజపుత్రరాజ్యము ధన్య మయ్యెను! రాజపుత్రవీరుల దేశాభిమానము సువ్యక్తమయ్యెను. ఆత్మ గౌరవ స్థాపనము కొఱకు—దేశ స్వాతంత్ర్య రక్షణము కొఱకు—రసపుత్రాంగనా గౌరవ సముద్ధరణము కొఱకు మహాహవకేళీ వినోదమునఁ దేలుట కిప్పటికి సంగ్రామవీరు లిఱువది రెండు వేల సంఖ్య నతిక్రమించిరి. ఇఁక గావలసినదేమి? ఒక్కొక్క రాజపుత్ర యోధయే ససైన్యముగ డిల్లీశ్వరు నోడింపఁజాలునపు డెందఱు డిల్లీశ్వరు లెందఱు మానసింగులు వచ్చినను రాజపుత్ర స్థానమునకు భయమేమి?

(ఒక యోధ ప్రవేశించుచుండును)

ప్రతా—ఏమయ్యా! అజయశింగ్! ఏమివార్త! ఏమి మానసింగపుడే వచ్చెనా ఏమి?

యోధ—జయము మహారాణా వారికి! జయము! ఒక్కఁడే కాదు; యువరాజగు సలీమును వెంటఁదీడుకొని హల్దీఘాటు నొద్ద విడసెను.

ప్రతా—బాగు నేఁడేమి? శ్రావణ శుద్ధ సప్తమి. జయదివసమే. నివేగి సేనల నెచ్చరింపుము. క్షణములో సన్నద్ధులై సేనలు ముందునకు నడచుచుండ వలయును.

యోధ—మహారాణావారి యాజ్ఞ. కొంత సైన్యమప్పుడే సగము దూరము నడచియున్నది. (నిష్క్రమించును)

ప్రతా—వీరులారా! రెండు.

(అందరు నిష్క్రమింతురు.)

---

## (౪ వ స్థలము యుద్ధరంగము)

(ప్రవేశము: భానుఁడను భట్రాజు, అభయ సింహుఁడను రాజపుత్రయోధ.)

భాను—అభయసింహా! రసపుత్ర వీరుండ! సమరశూరులగు మీతో చెలఁగి, మీతోఁ గుడిచి, మీతో నడచి మీలో శౌర్యమున కొకింత భాగ స్వామినైనందున నాకీ రాజపుత్ర వీరైక భోగ్యమగు వీర శయనము లభించినందులకు ధన్యుఁడను. (గాయములబాధచే సంకటపడుచు) ఈనాటి యుద్ధమద్వంద్వము—అతి భయంకరము. ఇఱువది రెండువేల రాజపుత్ర వీరులలో పదివేల వీరులైనఁ గానవచ్చుటలేదు. నారక్షణార్థము నిన్నిచట నుంచి శత్రు జిగీషచే మహా రాణావారు. శత్రువులలో దూరిరి. ఏకాకియై వారట్లు వీర విహారము సలుపుచున్నవారో చూడుము! జీవితాశలేని నాయొద్ద నుండుటకంటె రాజపుత్ర స్థాన స్వాతంత్ర్య రక్షణ దీక్షాకంకణ బద్ధ హస్తుఁడగు రాణావారికి బాసట యగుటముఖ్యము. పొమ్ము! కాని యీనాటి యుద్ధమును వర్ణించుచు వ్రాసిన యీ పద్యములను రాజపుత్రస్థానమునకు పరిచయము చేయుము. (కొన్ని పత్రములనిచ్చి) సింగ్ జీ! బాధ మిక్కుటమగుచున్నది. (మూల్గును, కొంచెము తలనెత్తి యొకదిక్కుఁ జూచి) అభయసింగ్! ఆలస్యమా! పొమ్ము, పొమ్ము. మహారాణా వారిని గలయఁ బొమ్ము. [వివశుఁడై పడిపోవును.]

అభ—[భానకవినాడి (బరిశీలించి] హా, హతవిధి! మహారాణా ప్రేమైక నిధానమగు భానకవి కింతటి గతి దెచ్చితివి! [విచారించి] చింతించిన లాభమేమి? [రణభూమివంకఁ జూచి] ఏమి? సేనలు చెదరుచుండెనా? శత్రువుల వెన్నంటి పోదముచుండెనా? నాకు పిచ్చియెత్తలేదు కదా! [పరుగున రాణా వైపు వెడలిపోవును.

---

## ౫ వ స్థలము మరియొక పర్వతము

ప్రవేశము: రాణా ప్రతాపసింహుఁడు, రాణి, పిల్లలు

ప్రతా—[దీనముగ] యశోవతి! నిర్భాగ్యుఁడగు ప్రతాపున కర్ధాంగివై యనుభవించుచున్న సుఖమిదియే కదా!

రాణి—శూరాగ్రణీ! సత్తమ క్షత్రియుఁడు స్వదేశ హితార్థమందు చున్న శ్రమకు సమభాగిని భార్య గాక మఱియెవ్వరు?

ప్రతా—వీరపత్నీ! మనకు క్రమగలుగు చున్నంమ కు చింత లేదనుకొనుము. కాని మొన్నటి హల్దీఘాట్ యుద్ధమునందలి రాజపుత్ర వీరుల మరణదుఃఖము ఆత్మను శరీరమును కూడ కాల్చివైచు చున్నయది. అబ్బ! పదు రెండు వేల రాజపుత్ర వీరుల మరణము! అట్టివారిని మరల నే జన్మమున సాధింప గలనా? దైవము ప్రతికూల మగుట చే కుమ్భల్మేర్, గోగుండా దుర్గములను విడువవలసి వచ్చె ను. అరణ్యమును శరణ్యముగా గొనవలసి వచ్చెను. తిను ట కన్నము లేకపోయె, తలదాచుకొనుట కిల్లులేకపో యె, ఏలుటకు రాజ్యము లే పోయె, పోయిన రాజ్యము ను సాధించుటకు సేన లేకపోయె, సేనసుగూర్చుటకు ధన ము లేకపోయె, పశులవలె దినమొక గట్టునకు, గడియ కొక మెట్టునకు అసూర్యంపశ్యవగు నిన్నును, పసిబిడ్డల ను వెంటనిడుకొని తిరుగుచుండవలసి వచ్చె. నా బ్రతుకు నా పౌరుషము కాల్పనా! ఒక కిలతో తెల్లవారెనా? మంచెన్ని దిక్కుల కుఱకవలసి యున్నదియో! దుర్భరము! ఈనాటి పరాజయము రేపటి విజయమునకు ద్రోవజూ పునను నాశ యేమయిన నుండునా?

(దూరమున చెట్లచాటునుండి)

"అస్మిన్ దినేనిష్ఫల తాభవేచ్చేత్
శ్వస్సృప్య గేవరచయామి; నహిత్యజామి"

[అను వాక్యము వినవచ్చును.]

ఎవరా శపథ మొనరించువారు? నేఁడు ప్రయత్నము నిష్ఫలమైనను రేపు చక్కఁబఱచెదను; విడువననుచున్నాఁ డు [విచారించి] వీఁడు—సోదరుని కుమారుఁడు— సాళుంబ్రాధీశ్వరుఁడే. ప్రతిభావతీ! కుమారు నిక్కడికి రప్పించెదె?

రాణి—రాణా వారియాజ్ఞ [చెట్టు చాటునకు బోవును.]

ప్రతా—(తలయెత్తి) కుమారా! సాళుంబ్రాధీ శ్వరా రమ్ము. నిరభ్యంతర ముగ రమ్ము.

సాళు—(ప్రవేశించి) జయము, కాకాజీకి జయ ము. మహారాణావారి స్వదేశాభిమానము శత్రుజనశ్లాఘ నీయము.

ప్రతా—వీరపుత్రా! దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము చేతఁగల కమ్మయేమి?

సాళు—దేవరయశోగీతము దేవరకు ప్రబలశత్రు వగు డిల్లీశ్వరుని ముఖ్యమంత్రి—ఖానఖానునిచే గానము చేయఁబడినది.

ప్రతా—అట్టియశోగీతములను వినవలసిన పని కుండెను; కాని ఖానఖానుని గుణసంపత్తి యొక్క నిరూపించుకొనుటకు వినవలయును. రమ్ము, కూర్చుండుము.

సాళు—(కూర్చుండి) చిత్తగింపుఁడు.

తే.గీ. మానవునకుఁగలట్టిసంపత్తి, రాజ్య

ప్రతా—ఛందోబద్ధమా? కవిగాఁబోలు.

సాళు—అగును, చిత్తగింపుఁడు.

గీ. మానవునకుఁగలట్టి సంపత్తి, రాజ్య
పాలనాధికారంబు నశ్వరము సృష్టి
చిత్రమిది! కాని, మానవ శ్రేష్ఠు సుగుణ
గణముయొక్కయు, కీర్తియొక్కయు బ్రతి
లోకమున శాశ్వతముగని ల్చుననివిం
గాన, నీవుధన్యుఁడవు. పుత్రో! నిజం బ
దేల? యన: నీవుసంకట పాళిఁజిక్కి
యును నృపాలునిశరణంబుఁ గొనక నీ
కీర్తిగౌరవములను ర క్షించుకొనఁగ
యత్నములఁజేయుచుంటి వ న్యనృపుల
గానరావీగుణంబులు కానరావు!
కాన, నీవు స్వజాతియొ క్కయభిమాన
గరిమవర్ణనీయముగ ర క్షణము సేయు
చున్నవాఁడవు. నీవు నీ యొక్క రాజ్య
వైభవంబునెల్లను గడ్డి పరకసాటె
సలిపి, నీ వందనీయ వం శంపుగీర్తి
కాశశాంక, నక్షత్ర, సూ ర్యముగ స
న్నమరఁజేయుచునున్న ప్ర జ్ఞాస్వతుఁడవు!

ప్రతా— కుమారా! దీనిభావమేమి? (విచారించుచు త్వరితముగ) కుమారా! పర్వతప్రాంతమున నేదో కలకలము?

సాళు—(ఆలించి) సమరము! సమరము! (లేచి కత్తిదూసి, పరుగునఁబోనుద్యమించును.)

ప్రతా—(ఆపి) కుమారా! ఎచటికి?

సాళు—యుద్ధమునకు.

ప్రతా—నేనేగెదను.

సాళు—(కొంతతాళి) మఱి నా కొఱకు రాణావారి యాజ్ఞయేమి?

ప్రతా—(యుద్ధభూమికి నడచుచు) నిన్ను నే కేరింగించిన కొండలలో చివరది సురక్షితమైనది. నీ పినతల్లిని, పిల్లల నచటికి జేర్పుము. నేను శత్రువుల బాఱఁదోలివచ్చి కలసికొనియెద. [నిష్క్రమించును.]

సాళు—(విచారించి) ఇదియునాకు విహితమే. (కొంచెము ముందునకు నడచి రాణికి నమస్కరించును.)

రాణి—దేశహితార్థ చిరంజీవివిగమ్ము! కుమారా! 'కాకా'జీగారి సెలవేమి?

సాళు—(తలవంచి మౌనము భజించును.)

రాణి—మంచిది, కుమారా! మహారాణావారి యాజ్ఞ అవిలంఘ్యము, దారిఁజూపుము.

(అందఱు నిష్క్రమింతురు)

---

౬వ స్థలము: మఱియొక పర్వతము.

(ప్రవేశము: రాణాప్రతాప సింహుడు, రాణి, పిల్లలు,)

౧ బాలుఁడు—(రాణాయెదుట నిలిచి) నాన్నా! ఆకలిఅంతె, అమ్మ—రొట్టె (ఈయలేదను భావము ప్రకటమగునట్లు పెదవివిరచి తలనాడించును.)

౨ బాలుఁడు— నాన్నా! తమ్ముని రొట్టెబూచి యెత్తుకోపోతె బూదిరొట్టెతెచ్చి అమ్మ తమ్మునకియిచ్చి నాకేమి యియ్యలేదు.

చిన్న బాలుఁడు— (రాణిపైఁబడి యేడ్చుచు) తే నా రొట్టెతే—నాకు తెల్లరొట్టెవొద్దు, ఊ, ఊ.

రాణి—(బుజ్జగించుచు) తండ్రి! అమల్లు గడ్డి నూరి చేసిన రొట్టెయైన నీ పొట్టఁబడకుండ మనపాపమే యా యడవిపిల్లి రూపమునవచ్చి యెత్తుకొని పోవలయునా? తండ్రి! దుఃఖింపకుము. త్వరలో మఱల రొట్టెజేసి యిచ్చెదను. (కనుల నీరు రాల్చుచు బాలుని ముద్దుగొనును)

౨ బాలుఁడు—తమ్ముడు! నేను బూచిని చంపి నీ రొట్టె తెచ్చి నికిత్తు. అమ్మనుయేడ్పింపకు.

ప్రతా—[చిన్న బాలుని దగ్గరకు దీసికొని] కుమారా! శిశోదియావంశోద్భవా! నీ రొట్టె బూదిగొనిపోయెనా? తండ్రీ! రాజపుత్రుల రొట్టెనాటికి బూచులాశించెనా? అన్నయ్య బూచిని జంపునఁట ఏడువకు.

చిన్న బాలుఁడు—దబ్బునతే. నాకీ తెల్లరొట్టె వొద్దు. [బూడిదరొట్టెను తండ్రిపై విసరును.]

ప్రతా—[రొట్టెనెత్తి, జాలితో] రాణాకుమారునకాయాఁకలిబాధ! ఆకలివేళ్ల కీయఁబడునది బూడిద రొట్టెయా! ఆహా! భుజములయందు బలము హృదయమునందు శౌర్యము—భావమునందు పూర్ణమూర్తియందు రాజపుత్రత—అధికారమునందు రాణాపదవి చేష్టలయందు స్వదేశస్వాతంత్ర్యరక్షణము! ఇన్ని యుండియును చిత్తూరు రాణా తన యనుఁగు సంతాన మాఁకలిబాధచే దుఃఖించుచుండ కొయ్యబొమ్మవలె—చిత్తరువువలె—ప్రతిబింబమువలె—ధ్యానమూర్తివలె పలుకఁజాలక ఏమిచేయఁజాలక జూచుచుండుట నిర్భాగ్యుఁడగుటచేత నేకదా! ధనికుఁడేగొప్పవాఁడు; ధనికుఁడుగానివాఁడు రాజైనను భిక్షుకుఁడే!

"శ్లో. భాగ్యవన్తం ప్రసూయేథా!
మాశూరాన్, మాచపణ్డితాన్;
శూరాశ్చ, పణ్డితాశ్చైవ
మమపుత్రా వనం గతాః"

అని పలికిన కుంతీ మహారాణి వాక్యము సకారణము! (కుమారుని కనుల నిముడుచు) కుమారా! దేశమున భాగ్యవంతులెందఱో యుండ నీజనన మునకు మాయిల్లే దొరకవలయునా?

రాణీ—ఆర్యా! మీరట్లు పలుకవచ్చునా? రాజ్య భోగమును వీరస్వర్గరాజ్యభోగమును రెంటిని రెండు చేతుల ధరించి . జన్మించుటకు రాజపుత్ర స్థానమున రాణావంశముగాక మఱియేది? అదియు గాక ఆఁకటిచుంటకు మల్లు గడ్డి రొట్టెను గల్పించుకొని యైనను, దాని నడవిపిల్లి యెత్తుకొని పోయినపుడు తల్లిచేతులార బూడిదరొట్టెనిచ్చినపుడు దుఃఖించియైనను కాలము బుచ్చుచుండిన రాణాసంతానమునకుగల గౌరవమే యితర భాగ్యవంతుల సంతానమునకుగలదు? స్వధర్మ నిర్వాహణమునందే కాలమును వ్యయించు రాణావంశమునకు గల కీర్తియే భాగ్యవంతునకైనఁ గలదా?

ప్రతా—వీరపత్నీ! నిశ్చయము. కాని. దుర్భరము! సహధర్మిణి ససంతానముగ నందుచున్న యిడుమలఁగాంచి సహించుట దుర్భరము. మహా యోధనమున శత్రు ప్రేషిత బాణము హృదయమున గ్రుచ్చుకొనిన దానికంటె మానవతియగు భార్యకు శ్రమగలుగ నున్నదనుట వినినపుడు గలుగుశ్రమ దుర్భరము. శూరుఁడు పరబాణ విద్ధుడై పంచత్వమందఁ బోవునపుడు చలింపఁడు; కాని సంతానమును కొండ గుహలలో నుండఁజూచి తప్పక చలించి తీరును!

ఒకయోధ—[పరుగునవచ్చి] జయము జయము! మహారాణావారి శత్రువులు పర్వతారోహణమునకు ప్రయత్నించుచున్నారు. మనవీరు లడ్డుచున్నారు. రాణీగారి, చిన్న రాణావారి భద్రత మీపాలిటఁగలదని సాళుంబ్రాధీశుని మనవి [పరుగున నిష్క్రమించును.]

ప్రతా—(కొంత వడిమౌనము వహించి) విధిచయిదము! అంతకంటె వేరు మార్గములేదు.

[నిశ్శబ్దముగ నందరు నిష్క్రమింతురు]

---

## ౭ వ స్థలము: అరణ్యము

[ప్రవేశము: రాణా ప్రతాపసింహుఁడు, సాళుంబ్రాధీశుఁడు మొదలగు కొందరు యోధులు.]

సాళు—మహారాణావారట్లు తలఁపరాదు. పారిపచ్చుట యెన్నటికినిఁగాదు. శత్రువులు పారి పోయిన పిమ్మట సురక్షిత ప్రదేశము నన్వేషించుచు వచ్చుచున్నారము.

ప్రతా—యుద్ధమున నేను లేనుకదా!

సాళు—పరిచరుల వలనఁ గానున్న పనికి పట్టభద్రుఁడే గవలయునని నిర్బంధమా!

ప్రతా—ఈనాటి పయనములో రాజపుత్రస్థానపు పొలిమేర దాఁటవలయును కదా?

సాళు—[మిన్నకుండును.]

ప్రతా—రాజపుత్ర వీరులలో నెవరును ప్రత్యుత్తర మీయరా?

[వీరులందఱు తల వంచుకొనియెదరు.]

ప్రతా—[సరోషము] వీరులారా! పరమ పవిత్రమై, ప్రత్యణువునందును వీరత్వ మిమిడియుండు రాజపుత్ర వీరుల రక్తముచే రాగవంతమగు నీ రాజపుత్ర స్థాన వీరక్షేత్రమును, మనము నిశ్చయముగ రాజపుత్రులమే యగుదుమేని, దేశ స్వాతంత్ర్య రక్షణ మహాయజ్ఞమున మన ప్రాణము లాజ్యధార గావలయు నను దృఢ దీక్షయే మనకు గల దేని, మన మెన్నఁడైనను రాజ పుత్రస్థానపు పొలిమేర దాటఁగూడదు. శూరులముగాని, భీరులముగాము; ధరించినవి సామరిక సాధనములుగాని దాస్యోపకరణములుగావు; ఆపద్భయమున జన్మ భూమికంటె వెన్నుఁగొట్టి, యితర రాజ్యముల యందలి యెంగిలి కూటి నాసించుట రాజపుత్రుని పనిగాదు. తుచ్ఛమగు దేహసుఖమును, ఎప్పుడైనను వెడలిపోవు ప్రాణముల భద్రతను చింతించి స్వదేశమును పారతంత్ర్య మహాగ్నిఁ గాల్చుట రాజపుత్రుని కృత్యముగాదు.

వీరులు—యదార్థము. మన మా పొలిమేరఁదాటరాదు.

ప్రతా—బాగు, అయిన... [ముందునకుజూచి] ఇటు రావచ్చుచున్నది?

సాళు—[పరిశీలించి] ఎవరో, రాజపుత్రుఁడే.

వీరులు...[చూచి] రాజపుత్రుఁడే.

రాజపుత్రుఁడు—[ప్రవేశించి] జయముజయము మహారాణావారికి! ఇది ఢిల్లీశ్వరుని, కడనుండి వచ్చినకమ్మ సెలవులేక దర్శనము జేసికొని నందుకు క్షమింపుడు.

ప్రతా—కుమారా! కమ్మను గ్రహించెదవా?

సాళు—మహారాణావారి యాజ్ఞ, (చీటినందు కొనును.)

ప్రతా—కొన్ని దినములు యుద్ధమునకు వ్యవధి కోరి పంపిన జాబున కుత్తరము గాఁబోలు.! వీరుల సమక్ష మున వినిపింపుము.

సాళు—మహారాణివారి యాజ్ఞ. (కమ్మనామూ లాగ్రము జూచి) పృథ్వీరాజు గారి సందేశము.

ప్రతా—(సాలోచనము) ఎవరు?

సాళు—బికానేర్ రాజుసోదరుఁడు; డిల్లీశ్వరుని సేనాని.

ప్రతా—(తలయూచి) జాబా?

సాళు—కాని, ఛందోబద్ధము.

ప్రతా—ఏదయినను వినిపింపుము.

సాళు—మహారాణావారి యాజ్ఞ.

(తేఁటగీతము)

ధన్యమూర్తి వి. రాణాప్ర • తాపసింహ!
హైందవులమైన మేము మీ • యట్టిదోః ప
రాక్రమాఢ్యులరగు హిందు • రాజశబ్ద
ధారులను నమ్మియున్నట్టి • వార. మితర
రాజులెల్ల మాయాశ ని • రాశగాఁగఁ
జేసివైచినను, ప్రతాప • సింగురాణా
వలనఁ గూడ నట్లయయి బాదుషాహ
కతఁడు శరణువచ్చుటయు న • త్యంతదుఃఖ
కరము! దైవోపహతులమై • సరగిమేము
మా పరాక్రమమును, మాదు • మానవతుల
గురుపవిత్రతయును చెడ • గొట్టుకొంటి
మయ్య! మా యభిమానము • నంత, మాదు
పడతుల పవిత్రతయును న • క్బరునకమ్మి
నార; మాతఁడు వాడుకొ • న్నాఁడువాని !
నైన, నుదయసింహుని పుత్రు • లైనమీరు
మాత్రమిందాక మీవంశ • మాత్రరాజ
పుత్రలజ్జయు, స్త్రీల ప • విత్రతయును,
కాచినార; లింకయునట్లు • గాపనలయు.

రాజ! యేమనిదెల్ప? నా • రోజయురుసు
నందునే రాజపుత్రి మ • ర్యాదదక్కె?
దక్కలేదు! కావున, మాన • ధనముగలిగి
సుప్రసిద్ధమైనట్టి సి • సోది యాఖ్య
కులపు మర్యాదఁ బట్టితే • వలనదురుసు
నందునమ్ముటకనుచు మా • ప్రార్థనంబుఁ
గానుఁడు. సర్వము పోగొట్టు కొని దరిద్ర
దశఁ జరించుచున్నట్టులఁ • దలఁచుచున్న
వారలేమొ! యట్టులఁదల్ప • వలదు. మీకు
మీయశోవృద్ధిచే మీకు "పోయె" ననిన
దంతయుఁ గా నున్న యటులనే • యరయవలయు
గురుని రాశ క్షత్రియులనే • కులపమాన
జన్యదుఃఖము బొందిరి • క్షాత్రవేళ
నైన, యీయపమానమే • గాని, యట్టి
యపయశము గాని యిదివర • కైతె శ్రీహ
మీరువంశజులైనట్టి • మీదుపాల
బడఁగలేదు. లోకంబువి • శ్వాసపూర్ణ
దృష్టిఁబరపుచున్నదిమీదు • దెసకు. హిందు
జనులఁ మర్యాదఁగాచుట • యును!తదీయ
పౌరుషము వెలువడుటమీ • వలన జరుగు
నని జనులు నమ్మియున్నవా • రార్య! మీకు
లంబునకు, మీదురాజవం • శంబునకును
గలుగనట్టి యపఖ్యాతి • కలుగఁగూడ
దెన్నటికినైన ననుచుమా • యిచ్ఛ, విజయ
శాలియైన మీఖడ్గము, • సమధికాత్మ
గౌరవోపేతమైమెప్పు • గనపడుభవ
దంతరాత్మయు మీకు స • హాయకర్త
లగును; వాని సాహాయ్యంబు • నందిమీరు
క్షత్రియ కుమారగణపౌరు • షమును బ్రోవ
వలయుఁగాన, నక్బరుచక్ర • వర్తిగూర్చి
"శరణ"నిన లేదు లాభ! మీ • శ్వరుఁడుమీయ
శస్సమార్జనమున పౌరు • ష ప్రకటన
మునన జస్రము తోడ్పడఁ బూనుగాత!

ప్రతా—[దీర్ఘముగావిచారించి] ఇంతటి కళవళము గలిపించినది నా సందేశమే.

సాళు—ఔను. యుద్ధమునకు కొంత వ్యవధియొసంగుమని డిల్లీశ్వరునకు చెప్పిపంపితిరి. దానిచేతనకు శరణనినటుల ప్రకటించుకొనియెను గాంబోలు. అమాట సహింపని పృథ్వీరాజీ సందేశమంపెను.

రాజపుత్రుడు— డిల్లీశ్వరుని సేనయు వచ్చుచున్నదట.

ప్రతా—[సశిరఃకంపము] బాగు. [వీరులతో] వింటిరా?

వీరులు—వినినపుడు, విననపుడుకూడ సిద్ధముగానుండుటయే మీయాజ్ఞయు, మాపూన్కియు.

ప్రతా—భామాసాయిచ్చిన ధనముతో నిరువదియైదువేల సైన్యము ససాధనముగ సమకూడినది.

సాళు—పూర్వమంత్రియగు భామాసాపూర్వము వలెనే భక్తి ప్రకటన మొనరించి ధన్యుడయ్యెను.

ప్రతా—ఇపుడంతయు మనయొద్దనున్న సైన్యము ముప్పదియైదువేలు.

వీరు—మహారాణావారి యుద్దేశమునకు విజయ కాలము వచ్చినది.

(కొంతసేపు నిశ్శబ్దముగానుండి యందఱు నిష్క్రమించెదరు.)

---

౮ వ స్థలము. పర్వతోపరిభాగము.

(ప్రవేశము. రాణా ప్రతాపుడు శయ్యపై బరుండి బాధ ననుభవించుచుండును. వీరులందరు ఉచితప్రదేశము నగూర్చుండి యుందురు.)

భామాసా—మహారాణావారి బాధ దుర్భరము! [కనులనీరునించును].

ప్రతా—[ఆయాసముతో] వ్రతసమాప్తి కా
యెననుచింత దుర్భరము.

భామా—అట్టిచింతతో మహారాణావారి కవస
లేదు. రాజపుత్రస్థానమంతయు దేవర పరాక్రమవ్య
గా మహారాణావారి వశమయ్యెంగదా?

ప్రతా—[మిక్కిలి ఆయాసముతో] ఏమిలా
చితోడ్, అజ్మీర్, మండల్గడ్—[మాటాడలేకపో

భామాసా—ఈమూడు దుర్గములుకూడ శ్
పారతంత్ర్యమునుండి విముక్తములగును.

సాళు—కాకాజీ! మాకేమిగతి? మాకేమిసె

ప్రతా—[వికృతస్వరముతో] రాజపుత్రస్థా
మీకుగతి—స్వాధీనములుగాకుండ నిలిచిపోయినమూ
దుర్గములను సాధింపుడని మీకుసెలవు.

వీరులు—ధన్యులము! మీయాజ్ఞ శిరసావహించి

ప్రతా—[నమ్మకములేదని సైగజేయును]

వీరులు—[ఉచ్చస్వనముతో] మే మందఱము
హారాణావారికిని, వారికుమారులగు నభయసింగ్ రా
వారికిని సర్వదా సాయ మొనరించుచుండెదము. మఱి
మిగిలియున్న మూడు దుర్గములను సాధించెదమని ప్ర
ణ మొనరించుచున్నారము. [ఖడ్గములను ముట్టి బాస
దరు.]

ప్రతా—[కనులందెఱచి రాజపుత్రుల దెస
మూసుకొనును]

వీరులు—(దుఃఖముతో) హా! రాజపుత్రస్థాన
తంత్ర్యస్థాపకా! హా, ప్రతాపసింగ్ మహారాణా! మ
బాసితివా! హా! ఐందసీము పరాక్రమాన్వితుండా!
యున్నమూడు దుర్గములను సాధించెదమను సమయ
మాకలనంగొనుదాక నీయాత్మకు శాశ్వత విశ్రాంతి
గొనుటకు వీలులేకపోయెనా? స్వామీ! మీపైంగల
ము మాపైనిడి పోయితివా!

# వల్లకి

మంగిపూడి శ్రీరామచంద్ర శాస్త్రి
(లలిత కవితా కార్యస్థానము)

వేణుక నీకరాంచలన
వీసకళా కలనా విశేషత
బోడిగనొంది నీకరవి
ముక్తిని గాంచినదావిపంచియే

వాడుదు లేమి శీర్ణమయి
భంశమునొందుట ప్రేమగీతికల్
పాడుటలేదు నాహృదయ
వల్లకి త్రొళ్లిటిరీతి నీశ్వరా!



# విచిత్ర పరిశోధనము!

(ఇద్దరుదొంగలు ప్రవేశించుచున్నారు)

మొదటిదొంగ—పెండ్లి నడక నడుస్తున్నావేమిరా? ఎడిఎడిగా అడుగులుసాగనీ, ఇనుప కడియాలు తగిలించుకుందామని మనస్సున్నదాయేం? నడువు నడువు! ఆ యమదూతముండాకొడుకులు రాకముందే ఈ పెట్టెను యెక్కడనైనా పడవేయవలెకదా. ఇప్పటికి దీనిని ఈ గుంటలో పడవేసి తప్పించుకుందాము! తరువాత తీరికవెంట చూతాములే! ఏం—అంతేకదా?

రెండవదొంగ—షాబాష్: మంచి ఉపాయము చెప్పినావురా. ఈ పెట్టెమూలముగా వెముకలు విరిగి పోతున్నవిసుమా. ఇప్పటి కీ లచ్చిందేవిని ఈ బొందలో పూడ్చివేతాము.

(ఇరువురు అక్లైగుంటలో పెట్టెను పూడ్చి పారిపోవుచున్నారు.)

పరిశోధకరావు—విమర్శకశాస్త్రి

ప్రవేశించుచున్నారు.

పరి—తిరిగీతిరిగీ మనము చాలాదూరము నడచినామన్న మాటేకదా! ఈ పరిశోధన కార్యమున మనస్సుకు కలిగే అనందమే వేరండి! పరిశోధనవిషయములను గురించి ఇంతసేవు మాట్లాడినాము! చూడండీ:—ఏమైన విసుకుఅనేది తోచిందేమో! కాస్తసేపు విశ్రాంతిగా కూర్చుందాము రాండి ఇక్కడ.

(ఇద్దరును కూర్చుండుచున్నారు.)

విమ—అయ్యా, తమరు యిందాక యేదో చెప్పుతూ వుంటిరి. ముచ్చట ధోరణిలో మరచిపోయినాను సరే: తమరీ పరిశోధన వ్యాసంగము ఆరంభించి ఎంతకాలము అయి వుంటుందండీ!

పరి—యెంతలేదన్నా—ఆఖరుకు మూడు మాసములైనా అయివుంటవి. యదార్థముగా చెప్పుతున్నాను సుమండీ:—ఇటువంటి స్వార్థరహితమైనట్టిన్ని, నిరుపద్రవమైనట్టిన్ని, లోకహితమైనట్టిన్ని—అభిమానప్రద—

విమ—అయ్యా కొంచెము ఆగండి. ఈ విశేషణములను లెక్కపెట్టనియ్యండి కాస్త.

పరి—అయితే పోనియ్యండి? ఇన్నిమాటలెందుకు పరిశోధనకార్యమువంటిది. ఏదైన ఉన్నదంటే అది పరిశోధనమేకాని మరొకటికాదు. మన పూర్వీకులను గురించి ఒక్కొక కొత్తసంగతి కనిపెట్టినప్పుడు కలిగేటటువంటి అపూర్వమైనట్టిన్ని, మనోహరమైనట్టిన్ని, నిష్కలంక మైనట్టిన్ని.

విమ—ఆఁ! ఆగండినాయనా! నిదానించండి! లెక్కపెట్టటానికి వేళ్లు మడవనియ్యండి!

పరి—సరే, పోనియ్యవయ్యా, దానికేమి గాని? ఎటువంటి అనందము కలుగుతుందంటే.

విమ—షహబాష్! పరిశోధకులైన మీరు చేసే పనులు సామాన్యములైనవా? అసలున్న దేదికలదో, దానిని తవ్వి పెల్లగించి బయట పెడుతారు. అంతేకాదు. లేని

దానినికూడా రహస్యపు పోలీసువారివలె లేక, కవిశేఖరులవలె వెదికి వెదికి, కల్పించి, ప్రకటించుతారు. మొన్నమొన్ననే యట ఒక మహాశయుడు భాగవతమును వ్రాసినవాడు బమ్మెరపోతనకాడు, ఇంకొకడని ఘంటాపదముగ జెప్పినాడట! 'శ్రీకృష్ణమహాకవులు' నలుగురుండిరని మరియొక మహానుభావుడు సిద్ధాంతముచేసినాడట! కాళిదాసులు ఇద్దరు! ఇట్లే, ఇంకా ఎవరెవరికి ఏఏ అవస్థ పట్టనున్నదో!

పరి—బాగున్నది! మీమాటలుచూస్తే మీరు పరిశోధనకార్యమును ఎగతాళి చేస్తున్నట్టున్నది. కాని సంగతిమాత్రము యదార్థము. మొన్న ఒకగొప్ప పరిశోధకుడు సురాజుద్దౌలా కాలపు కలకత్తా చీకటిగది వృత్తాంతము హిందూదేశచరిత్రలో నున్నదే, దానిని కేవలము అబద్ధమని ప్రమాణములతో రుజువు చేసినాడు! శుద్ధఅబద్ధము!

విమ—సిరాజుద్దౌలా అనే వ్యక్తి ఒకడుండె ననే సంగతికూడా అబద్ధమేనా?

పరి—అంతా అబద్ధము!

విమ—కలకత్తాకూడా?

పరి—అంతా అబద్ధమేనండీ! వట్టిగప్పాకూత!!

విమ—చమత్కారముగా మాట్లాడుతున్నారండీ!

పరి—ఆ సంగతి యెందుకు? ఇదిచూడండి. రాజరాజనరేంద్రుడు, కొడుకైన సారంగధరునిమీద మాతృద్రోహదోషము ఆరోపించి చంపిన సంగతిని మొన్నమొన్న నే ఒక పరిశోధకుడు అబద్ధమగు కల్పనయని దృఢపరిచినాడు! వట్టి బూటకము!!

విమ—రాజనరేంద్రుడుకూడా అబద్ధమేనా?

పరి—ఆం! అభూతకల్పన! దూరపుమాటయెందుకు! ఇటీవల ప్రతాపగడము దగ్గర, ఒకయింటి బునాదులు తవ్వుతూ వుండగా కూలివానికి ఒక చిన్న పుర్రె దొరికినది. దానిమీద 'అ' వంటి ఆకారము స్పష్టముగా చెక్కినట్టు కానవచ్చినది. ఏంతెలిసిందా? ఇక ఊహించి చెప్పండి; చూతాము! మీ తర్కము ఏమైనా పనికి వస్తుందేమో! అది ఎవరిదై వుంటుంది?

విమ—చిన్నది అంటున్నారు. కనుక ఏదో ఒక పిల్లవానిదై యుంటుంది! నిజమేనా?

పరి—మీ తర్కము ఏమీపని చేయలేదు చూ[డండి]. ప్రతాపగడముకు సమీపముననేకదా శ్రీ శివాజిమహా[రాజు] అఫజలుఖానుని చంపినది! కనుక అది అఫజలుఖాను[ది]. 'అ' అనగా అఫజలుఖాను! ఏమంటారు?

విమ—ఛీ! అఫ్జలుఖాను లావైన మనిషి అని [అం]టారు. ఇది ఇంత చిన్నది? ఇది ఖానుది ఎట్లా అవు[తుం]దండి?

పరి—ఇదిబహుశః ఆతని చిన్ననాటిదై యు[ండ] వచ్చును! నేను దీనిని లండనులోని పురాతనవస్తు ప్ర[ద]ర్శనశాలకు పంపదలచి యున్నాను. అరే, ఇదేమి? [కొం]చెము ఆగండి. నాకాళ్లకింద యేదో బోలుచప్పుడు [విని]స్తూంది. (కర్రతో అంటుకొని) ఆగండి, ప్రతాపరుద్రు[ని కా]లపు ఏదో నేల బొయ్యారము నాకు దొరికేటట్టు [కని]స్తూంది—కాని ఈ బోలుచప్పుడు మొట్టమొదట [విన్న]వాణ్ణి నేను సుమా!

విమ—బాగున్నది! ఆధ్వని మనయిద్దరికి ఏక[కాల]మందు వినవచ్చినదికదా!

పరి—అవునుగాని, నేను మీకంటె పొట్టి[వాణ్ణి] కానా? నా చెవులు భూమికి మీ చెవులకంటె [దగ్గర] ఉంటవికాదూ? ఎట్లాఐతేనేమి? ఈ పరిశోధన గౌ[రవము] నాదేకాని మీదికాదు. (కర్రతో త్రవ్వుచు) ఏమి [చెప్పమం]దండీ శాస్త్రిగారూ, పరిశోధన కొరకు త్రవ్వుట[యొక్కటి] మాత్రము కష్టముగా తోచును సుమండీ! రాష్ట్రవి[భా]గనులలో తవ్వుతూవుండే కూలివాండ్లు తామ[ు] ఆపరి[శో]ధనకొరకు చేస్తూవున్నామని భావించి చేసినా[రంటే], వాండ్లు చేసేకష్టములో సగము భా[గము] తప్పక మాయమై పోతుందని నా అభి[ప్రా]యము! కొలంబసు అమెరికాను శోధించి కనిపెట్టి[నం]దుకు ప్రపంచమంతటా చుట్టవచ్చినాడు; హిమవత్పర్వ[త]మునుయొక్క పై శిఖరములను కని పెట్టవలెనని [ఎం]త కష్టపడుతున్నారు! అట్టివాండ్ల పేళ్లతో పాటు [ఆ పే]ళ్ల పట్టికలో నాపేరుకూడా ప్రకాశించుతుందను[కొంటా,] ఏమంటారు? ఈ బొయ్యారము అశోకుని [కాల]ము యుంటుందా చాళుక్యుల కాలపుదా? వద్దు మీ[రు] త్రవ్వవద్దు. ఈ విషయములో గౌరవమంతా

దక్కవలసినదే. (పెట్టెబయటబడును) ఇక చూడండయ్యా. పెట్టె మాత్రయెంత బాగుగ అందముగా, వున్నదో!

విమ—దానిమీద సంవత్సరము యేదైనా వేసి వున్నదేమో చూడండి.

పరి—కనపడటంలేదండీ! క్రైస్తవ శకమునకు పూర్వపుదై వుండవచ్చును.

విమ—అదిగో అదిచూడండి! అవేమి అక్షరాలో

పరి—ఏమి? ఇవా? అవినాకు మొదటనే కానవచ్చినవి!

విమ—చదవండి చూతాము.

పరి—ఏ.నూ.గు. శా స్త్రిగారూ పూర్వకాలమున దీనిలో ఏనుగులను వుంచుతూ వుండినట్టు కనపడుతున్నది!

విమ—ఇంతచిన్న పెట్టెలోనా?

పరి—అయితేయేమి? గలివరు అనువాడు లిల్లిపుట్ దేశములో అంగుష్ఠమాత్ర శరీరులను చూచినట్టు వ్రాయలేదూ? మనుష్యులు అంగుష్ఠములంతే ఉంటే ఏనుగులు యింతవిగా వుండటము అసంభవమనుకున్నారా? లిల్లిపుటుదేశమునుంచియే యేరాక్షసుడో యీ యేనుగులపెట్టె ఇక్కడికి తెచ్చిపెట్టినాడని మనము యెందుకు అనుకోగూడదు? సరేకాని దీనిని తెరతామండి. (మూత తెరిచి) అబ్బో! అబ్బో!!

విమ—ఏమండి క్రొత్త పరిశోధన లేమైనా ఉన్నవాయేమి?

పరి—పరిశోధనలు బండలుకాను! ఏదో కుట్టిందయ్యా! తేలుపిల్లవున్నట్టున్నది. నావేలు కొంచెము బిగించండి. ఇంతను అదృష్టవంతున్నే. ఎర్రచీమ అయి యుండవచ్చును. సరే బాధతగ్గిందిలేండి (ఒక అత్తరు సీసాతీసి) ఓహో! అరేబియన్‌నైట్సు కథలలోని అప్సరసల రాజ్యమందుండెనని చెప్పబడిన అతి పరిమళముగల అత్తరులు యివేఅయివుండవచ్చును సుమా: ఇప్పటికాలపు కామినియా నూనెవంటి సువాసన దీనిలో వేస్తూవిన్నారా? మన పూర్వులు క్రొత్తది అనేవస్తువుయేదీ మిగలకుండా చేసినారండీ. ఇదేమిటి? ఓహో! తిలకమహాశయుని పటము! చూశారా! ప్రాచీనకాలపు మన పెద్దలు తిలకువంటి మహాపురుషుడు పుట్టబోతాడని, తమ త్రికాలజ్ఞత బలమున ఈ పటము ముందుగానే వేసియుంచినారు! ఫోటోగ్రఫీ చాలా ప్రాచీనమైనది అయి యుంటుంది! ఈజిప్టుదేశములో "టూటేంఖామెను"అనువానికి ఎవడో ఒకడు భూమిలోనుంచి అపారమైన ద్రవ్యము శోధించి బయటికితీసి యిచ్చినాడని చెప్పుతారు, మన ఆర్యావర్తముయొక్క సంపత్తియేమి అంతకంటె కొద్దిదా?

విమ—ఆ మెరిసేది యేమిటండీ?

పరి—అదినాకుముందే కనుపడినది! మొట్టమొదటనే మన పూర్వులు ధన్యులండీ. ఏభారత వర్షములో ఇట్టి సున్నితమైన బంగారపు గడియారములు సిద్ధమగుచుండేనో, అట్టిదేశములో ఈ కాలమున గడియారములు కావలెనంటె స్విడ్జర్లాండును యాచించవలసిన దుర్దశ పట్టినదిగా! సరేగాని ఇదియేమి? టెలిఫోను చెవియంత్రమువలె వున్నది.

విమ—పూర్వికులు ధన్యులు: ధన్యులు! కాని దాని కింద ఇంకయేమో శోధించుచున్నారు. ఏమిటి?

పరి—యంత్రమువెంట తీగెవున్నదేమో చూతామని వెదుకుతూవున్నాను. తీగెతునుక ఒకటి అయినా కనపడటంలేదు సుమండీ! దీనిని బట్టి మనము యేమని వూహించవలెను, చెప్పండీ!

విమ—నాబుద్ధి పనిచేయుటంలేదు.

పరి—ఇంతమాత్రము వూహించలేరే తీగె దొరకటం లేదు కనుక మన పెద్దలు తీగెలేనిం టెలిఫోను పద్ధతి యెరిగి యుండిరనుటకు యేమైనా సందేహమా?

విమ—సాబాష్! కవియొక్క కావ్యమునకు వేర్వేరు అర్థములు చెప్పువారినికూడా మీరు సిగ్గుపరచితిరనేసంగతి నిస్సంశయము!

పరి—చూడండి! చూడండి! ఎంతనాజూకైన పట్టుబట్టో! యెవరైనా చూచితే, నిన్ననే మాంచెస్టరు నుంచి వచ్చిందని అనకమానరు. డక్కాలో నేసిన సన్నని మల్మలుబట్ట ఇంగ్లాండురాణీ ఎలిజబెత్తు ధరించు

చుండెను అనేమాట అబద్ధముకాదు. ఇదిగో, ఇదిచూడండి! స్ప్రింగుపెట్టివున్న సులోచనములు!

విమ—పూర్వీకులు ధన్యులు! ధన్యులు! వారు ఇప్పటి కాలపువారివలె అంధకారములో పడియుండిరా?

పరి—శాస్త్రిగారూ. నడవండి! ఈ పురాతన సంపదను తీసికొని పోదము. పరిశోధక సంఘ మందిరము తట్టునడవండి! పెట్టెనెత్తిమీద పెట్టుకొండి. రాత్రిపూట ఎవరు చూస్తారు?

(శాస్త్రి నెత్తిమీద పెట్టెరుంచి యిద్దరును నడచుచున్నారు)

పోలిసు—యెవరురా బద్మాషులు! (పరిశోధకుని పట్టుకొని) ఎక్కడికి పోతున్నావ్!

పరి—నే-నేను-కాదు. శాస్త్రిగారికి నాకు యే సంబంధములేదు.

పోలిసు—సంబంధంలేకపోతే ఆయనపేరు నీకు యెట్లా తెలిసింది? నీవెవరు?

పరి—నేను పరిశోధకుణ్ని.

పోలిసు—ఇది ఏడునూతుల గురునయ్య గారి పెట్టెకానుకదా! ఎదీ దింపుమాతాము! (దింపి) దీని మీ అక్షరాలు చదువు?

పరి—ఏ. నూ. గు.

పోలిసు—స్పష్టము అయినదికదా; ఏడునూతు గురునయ్య!

పరి—ఛీ శాస్త్రిగారే

విమ—ఏమండీ! ఇప్పుడు గౌరవమంతా మీ దక్కగూడదాయేమి?

(పోలీసువారు పెట్టెతీసికొని వెళ్లుచున్నారు)

పరి—శాస్త్రిగారు! అయినదేమో అయినది. ఈ సంగతి యెవ్వరికీ తెలియనియ్యవద్దు సుమా!

(“మాసిక మనోరంజన” మాసపత్రికననుసరించి.



# నీలి పువ్వు

సరస్వతుల, వైద్యనాథకవి.

పచ్చనాకుల పరుపుపై తగ
వన్నెలందళుకొత్తు రీతుల
నిగనిగ ల్గడునింపుచుండెను
నీలపుష్పంబు.

ఇంచుకించుక ముఖము వంచుచు
సిగ్గుతోడుత నువ్వు యెట్టుల
చిగురు వెన్కకు దాగుచునండెను
చిన్ని పుష్పంబు.

రాగరంజితమై చెలంగెను
రంగు జల్లుల పైకి గురియుచు;
పూవుబోణి నలంకరింపక
దాగె నది యచట.

నిగ్గు బుగ్గల నీటులొలయగ
నిలిచె నది యట తృప్తికరముగ
నీగవంబగు నీడతీయని
తావులొలయించెన్.

# విక్రమోర్వశీయము.

బాలకవి-చిదిరెమఠము వీరభద్రశర్మగారు.

---



స్వతంత్రగ్రంథ రచనలలోఁ బేరువడసిన యాంధ్రులిటీవల నేరెండు మూఁడు వాసరములనో ఏ నాల్గు పద్యములనో వ్రాసి కవులమనియు గ్రంథకర్తలమనియును చాటించుకొనుచున్నారు. స్వతంత్ర గ్రంథకర్తలు లేరని నా యభిమతము గాదు. అట్టి మహానుభావులగు పండిత పుత్రులిప్పటికిని మన యాంధ్రమాతకుఁ దగినంతమంది యున్నారు. అవిశ్రుత కీర్తి పజ్త్రిలోని వారగు శ్రీ శేషాద్రి రమణకవుల నాంధ్రభాషా సేవకులందరు నెఱుఁగుదురు. వీరిగ్రంథములన్నియు స్వతంత్ర రచనలే! భావోద్రేకమును దేశభక్తిని వెలిబుచ్చి రచించు వారలలో వీరికివీరే సాటియని "పాపారాయనిర్యాణము"ను "నిజాంరాష్ట్ర ప్రశంస"ను బఠించిన వారికి గోచరించక తప్పదు. అటులేకాక సులలితోత్కృష్టభావములతో ప్రబంధములను గూర్చుటయందును అసమాన ప్రజ్ఞను గలిగియున్నారు, ఆంధ్రభాషాభివృద్ధికై యవిశ్రాంతిగఁ బాటుపడుచున్న ఈ శ్రీ. శే. ర. కవులు గతవత్సరమునఁ బ్రకటించిన విక్రమోర్వశీయమను దివ్యప్రబంధమును జదువు భాగ్యము నేఁటికిఁగాని నాకులభించినది గాదు. ఈ యుత్కృష్ట గ్రంథముపై నసుబోఁటివాఁడు విమర్శను వ్రాయఁజాలఁడు గాని ప్రబంధపఠన మొనర్చినపుడు నాకుఁ గలిగిన పరమప్రోత్సాహమే యిటులభిప్రాయ ప్రదర్శనమునకుఁ గారణమైనది.

కవి కంఠీరవుఁడగు కాళిదాసుని సంస్కృత విక్రమోర్వశీయత్రోటకమునుండి యితివృత్తము మాత్రము సంగ్రహించి యైదాశ్వాసముల యాంధ్రశ్రవ్య కావ్యముగ మన కవులు రచించిరి. కాళిదాసుఁడు పురాణకథలను నాటకముగమార్చి యెంతప్రజ్ఞ వెల్లడించెనో యంతకంటె నధికప్రజ్ఞను నాటకమును కావ్యముగమార్చిన శ్రీ. శే. ర. కవులు ప్రదర్శించిరని వ్రాయుట యతిశయోక్తి గాదు.

ఇయ్యది కాళిదాస గ్రథితేతిహాసమైనను, భావములు సంభాషణ చిత్రములు మొదలగు నలంకారములు వీరి స్వంతరచనలే! కవులు ప్రబంధమును రచించుటయందుమేము గల యసమానప్రజ్ఞను వెల్లడించుటయే గాక, నిప్పటి భావపరంపరలను బ్రబంధమున నిమిడించు విధమును గూడ బహుభంగుల బ్రదర్శించిరి. ఆదును మనయాంధ్రమున నింతవఱకులేని విక్రమోర్వశీయ కావ్యలోపమును బోఁజేసి యాంధ్ర సారస్వతమున కుపకారమొనర్చుటొక విశేషము. ఇందలి కథ కొంత భేదముతో శాకుంతలైతిహ్యము బోలియుండును.

"రంభోర్వశీమేనకాదు లరణ్యమున సంచరించునపుడు కేశియను రక్కసుఁ డూర్వశిం గొంపోయెను. దైవవశమున విహరించవచ్చిన పురూరవుఁడు కేశిని సంహరించి యూర్వశిని విడిపించిన పిదప నిరువురకుఁ బ్రేమాంకురము దయించెను, తరువాత నొకనాఁడూర్వశి యింద్ర సభలో లక్ష్మీ పాత్ర(వేషము)తో నభినయించుచుఁ బురుషోత్తముఁ డనుటకు మారుగాఁ బురూరవుఁడనెను, నాటకాభినయమునకు భంగము గలిగించెనని నాట్యశిక్షాచార్యుఁడగు భరతుఁడు కుపితుఁడై "నీవు దేవలోకమున స్థానము లేకుండుగాక!" యని శపించెను, పురూరవుఁడింద్రునకనేకసారులు యుద్ధమందు సహాయుండగుటంజేసి "నామిత్రుఁ

డగు పురూరవునికేలిగూడి యతఁడు దుష్టపుత్రుఁడైన పిదప నీలోకమునకు వచ్చెదవుగాక''యనియె, నింద్రుడు మఱల నూర్వశినను్రగహించెను, అటులే విక్రమ (పూరూరవ) రాజుతోఁడ నూర్వశిగలసి మెలసి సుఖము ననుభవింపుచుండెను. కొంతకాలమున నూర్వశి పురూరవునితో విహారార్థమై గంధమాదనవనమునకేఁగెను. అప్పుడే యచ్చోటికి నుదయవతియను గంధర్వకన్నె యరుదెంచుచుం. ఆయువతిరూపనయోవిలాసములను గాంచి పురూరవుఁడు మోహితుడైనటుల నూర్వశి గ్రహించి తత్క్షణమున రాజుతో గలహించి మూఢహృదయయై ఈశ్వరుని కుమారవనమును బ్రవేశించెను, అందుఁబార్వతీ పరమేశ్వరులుదప్పఁ దక్కినవారెవ్వరేఁగినను తీవియలౌనుగాన నూర్వశియును లతాకృతిని బొందెను. వేఱొక్కడఁ బురూరవుఁడూర్వశీ విరహమునకుఁదాళఁజాలక ననేక వనములల్లో వెదకి వెదకి వేసారి, మఱియొక దిశకఱుగునెడ దారియందొక రత్నమును జూచి నివ్వెరపడి నిలిచెను. అంత నాకాశమునుండి ,,రాజా! విరహముఁ బోఁజేయు సంగమ నీయమణియిది, గ్రహించుము''ని యశరీరవాణి వినఁబడెను. తోడనే రాజద్దానిని గ్రహించి కుమారవనమును బ్రవేశించి హృదయంగమ మగు నొక లతను చెలియను భ్రమచే గౌఁగిలించెను. తత్క్షణమున నాతీవ సంగమనీయమణి ప్రభావముచే నూర్వశియయ్యెను, మఱల నిర్వురు గలిసి తమపట్టణమునకే తెంచిన కొంతకాలమున నూర్వశికి నాయువను కుమారుఁడు జనించెను. ,,నీకుదయించిన పుత్రుని బురూరవుఁడు జూచినతోడనే మరల దేవలోకమునకు రమ్ము''నియింద్రుని యాజ్ఞగుఁక నూర్వశి యీ విషయమును స్మరించితన పుత్రుని బురూరవునికికంట బడనీయకుండ నొక ఋష్యాశ్రమమునఁనుంచి వచ్చి యెప్పటివలె బురూరవునితో సుఖమనుభవింపుచుండెను ఒకనాడు గరుడుఁడు మాంసఖండమని భ్రమసి. సంగమనీయమణిని నోటఁగఱచుకొని వెడలును. ఆ పక్షిని మఱెవ్వరు బట్టఁజాలరైరి. కడకు ఋష్యాశ్రమమునఁగల యాయువను కుఱ్ఱవాఁడు బాణమునఁ బడవేయఁగా రాజభటులా పక్షిని రత్నయుతముగఁ బురూరవుని కడకుఁ గొంపోవుదురు. రాజా పక్షికంఠమునఁగ్రుచ్చుకొనియున్న బాణమును దీసి దాని మీఁదఁగల

,,గీ. సిద్ధసంకల్పులగు నూర్వశీపురూర
వులకు జననంబునొందిన పూజనీయుఁ
డాయువనివాని యవ్వురుది యరివితాన
దళన నిర్మల తేజః ప్రభావమిద్ధ''

యని చదివి నివ్వెరపడును. అంతబాలకుని వెంబడించి నొకతాపసిరాజు సన్నిధికేతెంచి ,,మహారాజా! ... వాక్యము ననుసరించి యీ బాలకు నిన్నిదినములు పెద్దజేసితిమి. నేడీకుఱ్ఱఁడాశ్రమ విరుద్ధముగఁ బక్షిని హరించుటచే నీ పుత్రుని నీ కొప్పగింతును''ని ... విడిచి వెడలును. ఇంద్రానుగ్రహమును సారము దనపుత్రుని బురూరవుఁడు జూచిన క్షణమున నూర్వశీ పురూరవుల విరహవేదనను దలపోయుచుందురు. అసమయమున నారదుఁడాగమించి ,,రాజా! నీవు చింతింప నవసరము లేదు ఇంద్రుడుఁ మీ యిరువురకుఁ జిరకాలసుఖ సంవించునట్లు అనుగ్రహించె''నని చెప్పెను. రాజు ... సించి పదప నాయువున (పుత్రున)కు రాజ్య పట్టాభిషేక మొనరించి సుఖముగ నుండును.

ఏతన్మధురేతి వృత్తమును సంగ్రహించి యైదాశ్వసముల ప్రబంధముగ నిరాఘాట మధుర కవితా ... లాలికించి విక్రమోర్వశీయము నాంధ్ర సరస్వతి కర్పించిరి, ,,కవిః క్రాంతదర్శీ''యను ప్రమాణమీ ... కవుల విషయమున సంపూర్ణముగ సరిపోవుచున్నది. గ్రంథమునందుగల వర్ణనలు ,,సినెమా'' ... నెక్కువ ప్రత్యక్ష్యముగఁ బాఠకుఁ ... యును. అట్టి పద్యము నొకదానినిటఁ బొందుపరచెద.

సీ॥ వాతాహతోర్మికా జాతడోలాలోల
రాజహంసకదంబ రాజితంబు
కూలసంజాత రసాలపల్లవిసిగ్గ
శత్తుషారాంబుమాలామయంబు
ప్రతిబింబితోపాంత పట్టణరమణీయ
భర్మహర్మ్యాది విభాసురంబు

సతతవినోదనం చారప్లవానీక
చిత్రధ్వజవితాన సేవితంబు

గీ॥ మహితసాయంన మారంభతుహినకిరణ
బింబసన్నిభ సైకతా డంబరంబు
భువనగేయప్రతిష్ఠాన పురవరేణ్య
పార్శ్వమునఁనొప్పు నొక్కజీవస్రవంతి.

ఆ ౧-౩-౧.

ఆహా! ఏమీ ప్రకృతి వర్ణనము? "సమీరుఁడు కొంచెమువడిగ వీఁచునపుడు నదియందు తరంగములు బుట్టినవి. వానిలోఁగల రాజహంసలు దొట్టిలలో నూగు చున్నటులుండి దర్శకుల మనస్సును హరించుచున్నవి. మఱియొకప్పుడానదియే తీరమునఁగల పట్టణపు మేడల ప్రతిబింబములచే మానవుల నానందమున ముంచినది. ఇంకొక వేళఁజిత్ర విచిత్రములగు జెండాలను ధరించి తెప్పలో బైలు వెడలు సైనికులచే వినోదమును గూర్చుచుండెను" ఇట్టి మనోజ్ఞమగు స్వాభావికాలంకారముల నుడినకవి చిత్రకారునికంటె విలక్షణమైన వాఁడుసుమీ! ఏల! చిత్రకారుఁడనేకవిధములైన రంగులను సేకరించి, కుంచెతోఁదెలిసినపుడెల్ల నొకకొంత చిత్రించి యేయారునెలలకో గాని యొక యాకృతిని జూపించఁజాలఁడు, కవియట్లుగాదు, కలమును కాగితమును ధరించికన్నులమూసి భావమును ధ్యానించి యరక్షణములో ననేక యాకృతుల సిద్ధమొనర్చును. ఆ మహిమవలననే బూర్వము నుండి కవి బ్రహ్మలకుఁ బ్రతివిషయమున నగ్రతాంబూలమును సమర్పించుచున్నారు. కవీశ్వరులైన మన శ్రీ. శే. రమణుల "నైజ సౌందర్యవర్ణనమునఁ బసిమీరు వాక్కుల"నొకరెండింటిని వ్రాసెదను,—కేశిని నవధించి యూర్వశిని వెదకి కొనుపుడు పురూరవునితో,

"ఉ. చక్కఁదనంబు తావియుఁ బొసంగు గులాబిని వీఁడిమన్మథుం। డక్కట దిక్కులేని, పువులన్నిటి నమ్ములుగాఁగొన్నయ। ట్లుక్కుఁదొలంగిరంభకయి, యువ్విళులూరును గానియూర్వశిం। జక్కఁదనంపు రాశినిగనుండు కుబేరజుఁడెంత వెట్టియో!"

యని పాఠకులను చమత్కారముగ మందలించు ప్రజ్ఞ వీరికీ గలదు. ఊర్వశి చిత్తము బురూరవునియందు దగిలియుండుటఁజూచి రంభాదులతి మృదువుగ నెట్లు హాస్యరస వసంతములాడిరో చూడుడు.

సీ. కరికుంభయుగ్మంబు, పురుషసింహనఖాగ్ర
దళితమయ్యెనటంచుఁ బలికెరంభ
కాలేదయైనను ఖణిత జన్యాంక
మగుపడదేయని, యనిమెమోహ
రమ్యమానసలోల రాజహంసముమెట్టి
నబ్జనాళంబుల ననిమెతార
అతులఘువాగమం బరసయుక్తంబుకా
దనిజంకెననుమవా కొనెఘృతాచి

గీ. హస్తికుంభములను సింహమందికొనుట
జలజనాళంబు లాటహంసంబు జరుట
సహజధర్మమే యిందునాశ్చర్యమేమి?
చెప్పుడీయని వాకొనె చిత్రరేఖ.

ఆ, ౧ ౩, ౧౦౫,

వీరు తెలుఁగు తేనెనెట్లు గూర్తురు.

సీ. కలువమొగ్గగుడార ములఁగాపురముజేయు
కొదమతుమ్మెదదోయి కూర్మివిధము
కవఁబాయలేక నిక్కువపుఁబాళిఁజరించు
జక్కవపులుగుల సంగతంబు
నడలఁజక్కదనంబు, పొడసూపజోడుబా
యకనీడు నంచయుల్లాంఛ చెలిమి
జతఁగూడి సమముగా సంచరించుచునుండు
బెగ్గురు పిట్టల ప్రేమభరము.

గీ. జంటగావచ్చి జలమువాచవులుదీరఁ
ద్రావుసారంగముల యనురాగరసము
ప్రకృతిసౌందర్య మయసరోవరవిలాస
మలనృపాలుని తాపమగ్గల మొనర్చె.

కాళిదాసుని సంస్కృత విక్రమోర్వశీయమునుండి యనువదించిన పద్యములు గ్రంథమంతటను గలసియైదారు మాత్రము గలవు అందొకదాని నిటవ్రాసెదను.

"చిత్రలేఖే! త్వరయోర్వశీమ్. శ్లో. మునిసాభరతేనయః ప్రయోగో। భవతీష్వష్టరసాశ్రయోనిబద్ధః। లలితాభినయంతమద్యభర్తా। మరుతాంద్రష్టుమనాస్సలోకపాలః"

సం. వి. అంక. ౨. శ్లో. ౧౮:

చ. భరతమునీంద్రుఁడష్టరస
బంధురమైతగునేప్రయోగముల్
గఱపెనొ దానిఁజూచుటకుఁ
గానిపుడింద్రుఁడు కొల్వుదీర్చెసం
బరమునఁజిత్రరేఖ రోజవంబున
నూర్వశితోఁడరమ్మ, భూ
వరుని యనుజ్ఞనొందియని
పల్కెసురాంగనయోర్తు మెల్లగన్

అ. ౨, ప, ౨౨.

కవులు తమయద్వితీయ ప్రతిభాప్రకాండమును శ్లేషసమాసోక్తి నానార్థ ప్రౌఢపదములుగల వృత్తముల మూలమున నచ్చటచ్చట నిదర్శన మిచ్చిరి. అందేఁ ప్రథమాశ్వాసమున నానార్థము నిట్లు బద్ధించిరి.

చ. హరిపదమంటి హర్మ్యనిచ
యంబు చెలంగుచునుండఁ గూపముల్
హరిపదమంటి చెన్నలర
హాళి కులంగ విబుధాగ్రగణ్యులున్
హరిపదభక్తులై చెలఁగ
పుష్కరమొప్పుదలిర్చునిత్యముల్
హరిపదరీముఖంబున మ
హాహవదోహలవీర వారమై.

ప్రౌఢ సమాసమును గుఱించి ఈక్రింది పద్యము జూడుఁడు.

శా. కాంచెన్ భూతల నాయకుండు పరిఖా
కాండాట హంసాంగనా,
చంచూద్వంద విఘట్టితాంబుజరజ
స్సంభన్న మాధ్వీపయః
ప్రాంచద్దేశ ఘటస్మదుప్రతకుమా
రశ్రావ్య గీతామృతో,
దంచత్సింహపురీవరేణ్యమును రా
ర్యధ్యక్ష పర్యాప్తముల్.

దీనిని జదువునప్పుడు వసువును చరిత్రలలోని పద్య రత్నములు జ్ఞాపకమునకు వచ్చుటయేగాక నిప్పటి మోస్తరు సైజులు నచకగూడ స్ఫురించును. కవులూర్వశీ ముఖమునుండి విరహమును వెలిబుచ్చుచు,

"గీ. రాత్రిచరునొంచి పూర్వమూర్వశికినీవ,
యతను సంతాపమును నడంచితివి నేఁడు
ద్రాత్రిచరునొంచుమయ్య యూర్వశికినీవ
యతనుసంతాపముడగించుమయ్య సఖుఁడ!!"

యని యెట్టి సుందర లాటానుప్రాసాలంకారమును ప్రయోగించిరో వేరవ్రాయ నక్కఱలేదు. ఇట్టి యీ యాంధ్ర విక్రమోర్వశీయమునుండి పద్య రత్నములను వెడదీసి వ్రాయఁబూనినచో మఱియొక గ్రంథమగును. కావున నంత్యమునఁ బురూరవుని యూర్వశీ విరహవిలాపము నొకదాని నిటవ్రాసి నా యాకాంక్షఁ బూర్తి గావించికొనియెదను,

సీ॥ అతులవిలాస సంగతమైన జిగిచెల్వ
మంతయు వనలక్ష్మికప్పగించి
విరలత్రపాభరాకరమైన నయన లా
ల్యము లేడి గుంపుల కంటువరచి
అనురాగ రసయుతంబైన నెమ్మోము ని,
గ్గును తమ్ములందుఁ దక్కొలు సల్పి
కరుణాతిశయము నే కరువున ల్పెడి ముద్దు,
పలుకులఁ గోకిలావళికి నేర్పి॥

గీ॥ పంచభూతంబులను గూర్మిపాళ్ళఁబంచి
భౌతిక జగత్తునందెల్లఁ బారఁజల్లి
చెలువ! యెచ్చట నామావశిష్టవై తె?
తెలుపఁగా బూన వింతటి యలుకయేల'

తృతీయాశ్వాస ౩౮, వ పద్యమందు ,,ప్రాయశరచ్ఛుధాకిరణు'' యని దుస్సంధి యగుపడుచున్నది. ముద్రణాదోషమింత పెద్దఁగాఁ బడియుండదు ,,శరత్ + సుధా'' యను సంధియందుఁ బాణిని మతానుసారము ,స్తోశ్చునాశ్చుః' అను సూత్రము గాని ,శశ్ఛోటి' యనునది గాని ప్రవర్తించదు. ,హలోఽనంతరాస్సంయోగః' యన్నట్లు ,శరత్సుధా' యగుననుటయే నాయభిమతము, ౬౨, వ పద్యపు మూడవ చరణమునఁ గల ,,హరిహరియు దన్పినారె'' యను ప్రయోగమున నర్థము సరిపోక పోవుటయే గాదు, సపరి గణంబుతో నజభజాజులు రేఫయుఁ గూర్చి సత్కవు'' లను నప్పకవీయ లక్షణమునకు భంగము వాటిల్లుచున్నది. అచ్చు పొరపాటైనచో దప్పొప్పుల పట్టియందు మఱచియుందురా? చతుర్థాశ్వాసము ౧౧,౪౬, వ పద్యములందు ,సంభ్రమత్ శశకాది' కనత్ శతమన్యు వని సంధి వదలి వేయఁబడినది ,ఛత్వము' వికల్పమైనను ,శ్చుత్వము' నిత్యముగనుక ,,సంభ్రమచ్ఛశకాది. కనచ్ఛతమన్యు'' రూపములు సిద్ధించియే తీరునుగదా? ,వాకొను' యను శబ్దము గ్రంథమును ముగించునంతలోఁ బాఠకులనేక వేళ వాకొనవలసి వచ్చును గావున సందర్భానుసారమున వాకొను శబ్దమనుచితిబుట్టించు చున్నదని నామనవి. పరిశోధకులయిన వారలైనవానిని శ్రీ॥ కవులు ద్వితీయ ముద్రణమున సరిఁజేయుదురని నమ్మెద.

ప్రబంధమును నిబంధించుట బాలుర యాటగాదు. కవికి సకల విషయ ప్రతిభ గావలయును. అందున నిప్పటివారిని సంతసింపఁ జేయుట మఱింతకష్టము. ఒకరికిఁ జిగురు మీఁద ప్రేమయైనచో నింకొకరికిఁ బూలపై ప్రీతి నాకుఁ దోఁచినంతవఱకీ ప్రబంధమట్టు గాక యెల్లర యుల్లముల్లసిల్లఁజేయుట దెల్లము, మఱియు కవులు తమ విషయమునఁ దాత్మప్రశంసలో

"గీ. మమ్ము శేషాద్రి రమణుల మాధురీర,
సాభిరామకవిత్వ సంశోభితులను"

అని చెప్పికొనిన గీతము సంగతమై యొప్పుచున్నదని నిస్సందేహముగ సంగీకరించవలయును. పరమపూజ్యులగు నిక్కవీశ్వరుల గ్రంథము నాదరమునఁ బఠించి లాభము నొందెదరని వేఁడుచు విక్రమోర్వశీయమునందు తమ కవితా విక్రమమును జూపిన శ్రీ శే॥ రమణకవుల కభివాదముల సమర్పించకుందు టెట్లు?

పాఠకులారా! మిమ్మానందింపఁజేయు విషయముల నీ గ్రంథమునుండి యనేకముల నెత్తి చూపించవచ్చును. కాని నాకుఁగల యసమర్థత వలనను వ్యాస విస్తర భీతి చేతను ఉపసంహార మొనర్పవలసి వచ్చుటకు మన్నింతురుగాత!

గీ॥ విక్రమోర్వశీయ, విరచనేచ్ఛువునందు
తెలుఁగు దేనెపలుకు లొలుకఁజేసి
యాంధ్రజాతికెల్ల, నారగింపులనిడు
కవివరేణ్యములకుఁ గరము మోడ్తు



# బాల్య దుఃఖము

శ్రీకాళహస్తీశ్వరరావు

"అమ్మ! తమ్ముని దిరిగి రమ్మనుము వేగ
నేనొకండనొంటిగ నాడలేనసుమ్మ!
తమ్ముఁడెటకుఁ బోయెనె?
వసంతమ్ము, తీపి
పూలతో, తుమ్మెదలతోడఁ బొలుపునింపు
తళతళలనీను రంగు రెక్కలను వేడి
యెండదారులనూపుచు నెగురఁదేఁటి;
దానివెన్నాడ నాకు సంతసము లేదు.
అమ్మ! తమ్ముని దిరిగి రమ్మనుము వేగ.
తేనియలతోడ నిండి యెంతేని బెరటి
లోని మల్లెలు విరిసె; అందాన మిగులఁ
జెలఁగి మోము వాల్చుచు నుండె సిగ్గుతోడ
అమ్మ! తమ్ముని దిరిగి రమ్మనుము వేగ—"
నాదు మాట వానికిఁక విన్పడదు; బిడ్డ!
నీకొఱకునై యతండిక రాకపోవు
ఆమనింబోలినట్టి యతని ముఖము
నేఁడిక నీవు భూమిపైఁ జూడలేవు
మితమునై, కాంతిమంతమై మేల్గులాబిఁ
బోలె వాని జీవితమయి పోయెనపుర!
పొమ్ము! ఒంటివై నీవాడుకొమ్ము: నీదు
తమ్ముఁడిట లేఁడు: పోయె స్వర్గమ్మునకును!
"పూలఁ, బిట్టల నిటవీడి పోయెనేమి?
ఊరక యెవాని నే పిల్చుచుండవలెనొ?
మధురమైయున్న యామధుమాసదీర్ఘ
వాసరంబులలో మరి వాఁడు రాఁడ?
ఈవిరుల చెంగటను,
సెలయేటి దరినిఁ దిరుగుచున్నట్టి సంతోష మరిగెనేమి?
వాఁడు నాతోడుతను బూర్వమాడినపుడె
మించివానినెంతయును బ్రేమించియుంటి.

*Mrs Hemans రచించిన, First Grief కనువాదము.



# అద్వైతి

(సోమంచి అన్నపూర్ణేశ్వరశాస్త్రి గారు)

సాయంకాలము చీకటి పడుచుండెను. కొండ ప్రక్క నొకబాలిక యేడ్చుచుండెను. ఆమె ముందొక కట్టెలమోపుండెను. ఆమె యదేపనిగ నేడ్చుచు నిటునటు చూచి తరువాత నామోపు వైపునకు చూచుచు నేడ్చుచుండెను,

ఇంతలో నామె నెవరో పలుకరించునటు లామెకు తోచెను. ఆమె కన్నులెత్తి చూచెను. ఎదుట నొక సుందర యువకుడు!—నిలువబడి యుండెను. అతడు ముదుక వస్త్రములను ధరించెను. ఒక దరిద్రునివలె కానబడుచుండ వచ్చునేమో?—అతడామెనుజూచి ''అమ్మా! ఏడ్చుచుంటివేమి?'' అని యడిగెను.

బాలిక కొంచె మాలోచించి ''అయ్యా! నేనీకట్టెలమోపు నెత్తికొనుటకు మిక్కిలి కష్టపడుచుంటి'' నని పలికెను.

అతడు మాటాడకుండ నామోపును విప్పి దానిలోనుండి కొన్నిమాత్రమే కట్టెలను దీసి యొక మోపుకట్టి యామె నెత్తిపై బెట్టెను. మిగిలిన మోపంతయు తన తలపై బెట్టుకొనెను. అతడట్లు చేసి ''అమ్మా! మీయింటికి దారిచూపు'' మని పలికెను.

ఆబాలిక సంతోషముతో కొండమీదికి దారితీయుచుండెను. లోన నామె యాతని నభినందించుచుండెను. అతడే యామె పాలిట దైవమని నమ్మి, నమ్రతతో దారి చూపుచుండెను. అతడామె వెంటనే యా కొండనెక్కెను.

ఒక ఘడియలో వారొక కుటీరమును చేరిరి. ఆబాలిక తొందరగా తలుపు తెరచి, లోనికి జని కట్టెలమోపు నొక మూలనుంచెను. ఆమె యీవలకు వచ్చి ''అయ్యా! లోనికి దయచేయుడు. అంటులకు మీ కభ్యంతర ముండదను కొనియెదను. మేము మాలలవలె కనుపించుచున్నను మాలలము కాము లెండు!'' అని చెప్పెను. ఆ యువకుడు మాత్రము నవ్వుచు లోనికి జనెను.

మోపు నొకచోట నిడి యాతడా కుటీరమంతయు నొకసారి తిలకించెను. ఒక మూల మనుష్యుడొకడు, మరణాసన్నుడై పడియుండెను. ఒకమూల స్త్రీ యొకతె యేడ్చుచు చేతులతో నెత్తి గొట్టుకొనుచుండెను. ఇద్దఱు పిల్లలామెను పట్టుకొని యన్నమునకై పీడించుచుండిరి. ఆమె సమాధానమివ్వక నీరసమున మూల్గుచు నేడ్చుచుండెను.

పాపమది చలికాలము. వారికి కప్పుకొనుటకు వస్త్రములైన లేవు. ఆ యువకునకు వారి స్థితి బోధపడినది. హృదయము ద్రవించినది. అతడు తన యుత్తరీయమును దీసి వణకుచుండిన యా మనుష్యునిపై కప్పి యతనినాడి జూచి ధీరుడై, యా కట్టెలలో రెంటిని రాచినిప్పు చేసెను. మంట వేసెను. ఆ కుటీరపు తలుపు దగ్గరగ వేసెను. ఆ మనుష్యుని నిప్పు వద్దకు తీసికొని వచ్చి కాలు చేతులు నిప్పుసెగకు చూపెను. ఆ మనుష్యునికి వణకు తగ్గినది. తరువాత నా యువకు డా మనుష్యుని శయ్య నిప్పునొద్దకు తీసికొనివచ్చి యాతని దానిపై శయనింపజేసెను. అతడు తన యొద్దనున్న మందును కొంచె మామనుష్యుని సేవింపజేసెను.

ఆ యువకుడు చేసిన పరిచర్యవలన నాతనికి నిద్ర పట్టెను. అపస్మారము తప్పెను. ఆ యువకుడు తరువాత

నా స్త్రీకిని పిల్లలకును తన యొద్దనున్న జొన్నరొట్టె నొక దానినిచ్చెను. వారది పెన్నిధిగన్న పేద చందమున సం తసించి, స్వీకరించి, భుజించి యానందించిరి. ఆ స్త్రీ యువకునిగూర్చి ,,అయ్యా? తమరు దేవునివలె గానవచ్చు చున్నారు. మమ్ముల నిట్లు నిష్కారణముగ ప్రేమించు వారెవరు?'' అని యడిగెను.

ఆయువకుడు ,,తల్లీ! ఈ ప్రపంచము పరమేశ్వ రుని ప్రేమరాజ్యము. దానిలో ప్రతిమానవునకిని సమాన మైన హక్కులుగలవు!—ప్రతి మానవుడును పరమేశ్వ రుని ఛాయా స్వరూపమే!—అట్లగుట నొకరి కొకరి కుపకార మొనర్చుట యన నేమి?—తన శరీరమునకు రు గ్మత వచ్చినపుడు మానవుడెటుల శరీరమునకు పరిచర్య చేయునో, యటులనే, యేజీవికైనను కష్టము వచ్చిన యెడల ప్రతి మానవుడు నాజీవికి పరిచర్య యొనర్పవల యును. దీనిలో నా ఘనత యేమి తల్లీ!'' యని యూర కొనెను.

ఆ స్త్రీయును ,,మహాప్రభూ! మీరు పరమేశ్వరు లు!—మాకు సాక్షాత్కరించినారు. మా పూర్వ పుణ్య వశమున మేము పావనుల మైతిమి!—కాని మీ సేవ పొందుటవలన చాల భాగమా పుణ్యమును పోగొ ట్టుకొంటిమి'' అనెను.

యువకుడు ,,తల్లీ! ఎట్లైనను సరియే!—మీ రా త్రికి పరుండుడు. రేపు మాటలాడవచ్చును''. అనె

ఆ స్త్రీయును పిల్లలును యువకుని యానుమతిగా ముచే పరుండిరి.—* * *

### తెల్లవారినది.

ఇంట నా యువకుడు వారికి కనుపించలేదు. వా రిదేమని యాశ్చర్యపడిరి. చాల సేపటికి నేవదేరిన భర్తకు ఆ స్త్రీ గడచినరాత్రి జరిగిన విషయముల నె గించెను. అతనికి నూతన వికాస ముదయించెను. అతడు చప్పున లేచి మోకరించి ',,నీమాయ నెఱుగుట కష్ట ము!'' అని దైవమును స్మరించి ప్రార్థన సలిపెను

ఇట్లు ప్రార్థన సలుపుచుండగా నా యువకుడు పెద్ద కట్టెలమోపు నొకటి తలపై నిడికొని లోనికరు చెను. ఆ కుటీర వాసులందర రాతనిజూచి యాతని కా ళ్ళపైబడిరి. ఆ యువకుడు కట్టెల మోపును దింపుకొనుట వీలులేక నట్లే నిలువబడియెను.

కొలదిసేపట్లుండి వారందఱును. లేచిరి. ప్రమో రి. మరలలేచి మ్రొక్కిరి. ఇట్లా మ్రొక్కుటలో వా యువకుని తలపై మోపును జూడనేలేదు.

వారు లేచినసమయమున నా యువకు డొక మూ కుపోయి కట్టెలమోపు నచట దింపెను. ఆ దంప లాశ్చర్యముతో నాతని జూడసాగిరి.

ఆపురుషుడు ,,దేవా! మీరీశ్వరునివలె నా క గుపడుచున్నారు. మీ సహవాసమున మేము పవిత్రు లైతిమి. మా యందటి జన్మములును తరించినవి ప్ర మ్రొక్కెను.

ఆ యువకుడాత నివారించి ,,తండ్రీ నీవటు ల రింపగూడదు. దేవుడు ప్రతి మానవునియందు నున్నా ఆదియే యీ సృష్టియందలి రహస్యము'' అని చెప్పె

యువకుడు పురుషుని లేవదని ',,తండ్రీ! నీవు నా గావలెను. ఈ దరినున్న పట్టణమునకేగి యీ కట్టెల నమ్మి

వచ్చెను. నేను ప్రొద్దుననే లేచి వెళ్లి కట్టెలనమ్మగా వచ్చిన సొమ్మిదిగో'' అని యాతడొక మూడు రూప్యములను ఆ పురుషుని చేతిలో బెట్టెను. ఆ మనుష్యుడు సంతసించి "అయ్యా! మీ కరుణమూచి నాగుండె నీరగుచున్నది. మాకొఱకు మీరింత కష్టపడినందులకు చాల విచారించుచుంటిని'' అని చెప్పి యా రూప్యముల నందికొనెను. నమస్కరించెను!

తరువాత నా యువకుడు కురల నామోపు తన తలపై నిడికొని బయలువెడలెను. పురుషుడు అతని వెంబడించెను.

వారు కొంత సేపటి కా కొండపరిసరమున్న ఒక పట్టణమును జేరిరి. యువకు డచట నామోపు దింపెను. ఆ మనుష్యుడు యువకునితో "అయ్యా! ఇచట నెవ్వరును కొనరు. సంతకు పోవుదము' అని చెప్పెను. యువకుడు తిరిగి నడవసాగెను.

వారు సంతజేరిరి. బేరగాండ్రునచ్చి యా మోపునకు సాధారణముగ నిచ్చు వెలకంటె రెండింతలు వెలనిచ్చుటకు సిద్ధపడిరి. అది యా పురుషున కాశ్చర్యము గలిగించెను.—కాని యాతడు మూడింతల నడిగెను. బేరగాండ్రు పోయిరి. ఆ మనుష్యున కా యువకుడు తరువాత కనుపింపలేదు. ఆమోపు నెవ్వరును సాధారణపు వెలలో సగము సగమునకైనను గొన నిచ్చగింపలేదు. ఆ మనుష్యుడు విచారముతో నింటికి తిరిగివచ్చెను.

ఈ లోపుననే వారింటి కా యువకుడు వచ్చి తన ఒట్టలన్నిటిని వారికిచ్చి, వానితో మతిరెండురూకలగూడ నిచ్చి యా కుటీర వాసినితో "తల్లీ! మీ కొక్కటే చెప్పుమంటిని. మరియొకలాగున ననుకొనవలదు. ఈలోకమం దెన్నడును రూకలకై న్యాయాన్యాయ విచక్షణలేక మసలవలదు.'' అని చెప్పి, కుటీరము వెలువడి, యా కొండగుట్టలలో నెటకేని పోయెను.

ఆ కుటీరవాసు డింటికిరాగా నాతని భార్య తన కా యువకుడు చెప్పినమాటలు చెప్పెను. ఆమాటలు వినుటతోడనే యా మనుష్యుని కొడలంతయు ఝల్లుమని గతి పొడిచెను. 'హా' యనుచు మనుష్యుడు క్రిందబడి పోయెను.

*　　　*　　　*　　　*

## స్వామి

మాచునూరు నాగభూషణ రావుగారు

ఉన్నావనినిన్ను నమ్మకొన్నారా, స్వామి?......
　　ఇనుములచే సరతపించి
　　సుడిగొనియెడి మానసమున
　　　　ఉన్నావని............
　　శిథిలమైన మన్మానస
　　జీర్ణకుసుమగర్భమందు
　　చివరకు నీరూపమంత
　　చెక్కు-గట్టియైన నిలచి......
　　　　ఉన్నావని............

నాయేడుపురొదలలోన
నిదొక మృదుగీతివగుచు
　　నున్నావని............

నాయెడద కెగాకనీవు
యీపుడమిని తేజరిల్లు
సర్వభూతముల కెల్లను
సాక్షిరూపధారివగుచు
　　ఉన్నావని............





# ఏరి కూర్చిన పువ్వులు

## యజ్ఞోప వీతములు

,,సుధా''యను హిందీపత్రికలో సాలగ్రామశాస్త్రి యనువారు యజ్ఞోపవీతములను గురించి ఇట్లు వ్రాయుచున్నారు:—

,,భారత దేశములో యజ్ఞోపవీత సంస్కారము మూడు విధములు. ౧ ఉపనయనము ౨ వేదారంభము ౩ సమావర్తనము. ఈ మూడును ఒకేతూరి యుపనయన కాలముననే చేయబడును. కాని దక్షిణ హిందూస్థానమున మొదటి రెండే మొదలు కావించి వివాహసమయమున సమావర్తనము కావించుచున్నారు. సమావర్తనమైన వెంటనే గృహస్థ ధర్మములో ప్రవేశించవలెను. ఉత్తరమున నిదికూడ బ్రహ్మచారికి జరిపిన నతడు బ్రహ్మచారి కాక పోయెను. గృహస్థుడు కాకపోయెను. కావున దక్షిణాపథ మందలి యాచారము శ్రేష్ఠమైనది''

## అస్పృశ్యత

,,మస్తానేజోగీ'' యను ఉర్దూమాస పత్రికలోని గంభీరభావ పూరితమైన వ్యాసపు భాగములు.

,,బ్రాహ్మణు లెంతవఱకు స్వార్థపరులు గాక యుండిరో యంతవరకు ప్రపంచమంతయు వీరిని పూజించుచుండెను. వీరి వైదుష్య మందఱు నొప్పుకొని యుండిరి. ఇప్పుడు వీరి జీవనము అవిద్యచేతను, స్వార్థ పరత్వము చేతను నాశరింపబడినది.''

,,పరుసవేది లోహమును దాకి బంగారు చేయును, గంగాజలము పాతకులను పవిత్రులనుగా జేయును. గాయత్రి నీచకర్మలను శుద్ధపఱచును. ఇట్లే మనలో నెంతవరకు ధర్మముయొక్క జ్యోతి వెలుగుచుండెనో యంతవరకు మన మధముల నుత్తములనుగా జేసితిమి. సారెక బీరు భక్త రాజయ్యెను; దొంగ వాల్మీకి భగవద్భక్తుడయ్యెను; కామక్రోధ యుక్తుడైన సూర్దాసు భగవత్ప్రియుడయ్యెను. అప్పుడు మన ధర్మము పరుసవేదిగా నుండెను. ఇప్పుడు ధర్మజ్యోతి చల్లారినది. ,,క్రైస్తవుల బాప్టిజము (స్నానము) నకు మన మంత్రములకన్న శక్తి యెక్కువ గినది. ఏలయన ఒక్క నిముసములో నది హిందు క్రైస్తవునిగా మార్చుచున్నది. ముసల్మానుల కలిమ (మహా వాక్యములు) మనల ధర్మమునుండి శాశ్వత విడదీయుచున్నవి.

,,భగవాన్ రామచంద్రుడు భిల్లాంగనయైన రియుచ్ఛిష్టమును దిని శబరిని పవిత్రు రాలినిగ జే పాపులను పవిత్రులను జేయుట బ్రాహ్మణుల ధర్మ కాని నేటి బ్రాహ్మణులు నీచులకు సేవచేయుట, చేయుట, యిట్టి పనులు చేయుచున్నారు''

## పూర్వకాలపు ధరలు

పై పత్రికలోనె అల్లావుద్దీన్ కాలములో యిప్పటి రూపాయను యిప్పటి తూకమునకు స తూకముతో వివిధవస్తువులధర లుదహరించినారు.

| | | | |
|---|---|---|---|
| గోధుమలు ౧ రూపాయకు | | ౧౧౯ | సేర్లు |
| బియ్యము | ... | ౧౪౯ | ... |
| సెనగలు | ... | ౧౪౯ | ... |
| నెయ్యి | ... | ౩౩ | ... |

## ఇందూరుమహారాజు

,,సింహాసనమునుండి తొలగింపబడిన మహారాజు పత్రికలో చర్చింపబడుచున్నాడు: ఒక భోగమువా రాజ్యము గోలుపోయెను. మరల యిప్పుడు వీరి చ పత్రికల కెక్కినవి. ఇతని కిద్దఱు భార్య లున్నారు. గా శాస్త్రానుసారముగా పెండ్లి చేసికొన బడిన అయితే యిప్పుడు రాజుగారు మరల నొక అమె స్త్రీని వివాహమాడ నెంచినారు. ఈ క్రియ హిందువు గావలసియున్నది. దీని పేరు ,,శుద్ధి.'' దీనికి సరియైన పేరు అశుద్ధి. ఎవరీశుద్ధి చేయుదురో సంఘముచే దూషింప బడవలసిన వారగుదురు.

(మాడర్న్ రివ్యూ)

### అన్నయ దేవుఁడు.

రాజమహేంద్రవరము నుండి వెలువడు సుభాషిణి పత్రిక మొదటిసంచికయందు అన్నయ దేవునిఁ గూర్చి శ్రీయుత చిలుకూరి వీరభద్ర రావు పంతులుగారు శ్రీ వారికి క్రొత్తగా దొరికిన శివయోగసారమను గ్రంథము ననుసరించి నూతనమై వింతయైన చరిత్రాంశములు గల వ్యాసమును వ్రాసియున్నారు. ఇది నిజాంరాష్ట్రాంధ్రులవగాహనచేసికొనఁదగినదై యున్నది. వీరభద్రరావు పంతులుగారు కనిపెట్టిన వింత చరిత్రాంశములను ఈ క్రింద బేర్కొనెదము.

౧. అన్నయదేవుఁడు క్షత్రియుఁడుగాఁడు; నియోగి బ్రాహ్మణుఁడు.

౨. ఇతఁడు శివదేవయ్య మంత్రి యపరావతారము.

౩. ఇతఁడు కాకతి రుద్రాంబ గాదిలిసుతయైన మయ్యంబఁ బెండ్లాడిన వాఁడు. అనఁగా రుద్రమదేవి చక్రవర్తిని యల్లుఁడు.

౪. ప్రతాపరుద్రుని తల్లియైన ముమ్మడమ్మ రుద్రమదేవి గర్భమున బుట్టిన కూఁతురు గాదు. "అనుపిత రుద్రమాంబికకు నాత్మజనాభోగడొందు ముమ్మడమ్మకు" అని యుండుటచే పెంచినకూఁతురు.

౫. పురుష వేషముతో సంచరించుచుండిన రుద్రాంబను పురుషుఁడనియే లోకము విశ్వసించుటకై ముమ్మక్కను ఆమెకు పెండ్లి చేసిరి. తరువాత మోసమునకు బశ్చాత్తప్తురాలై ముమ్మక్కను గోమార్తెగాఁ జూచి, మహదేవ రాజున కిచ్చి పెండ్లిచేసి యామె కొమరునకు బట్టాభిషేకము గట్టెను.

౬. ఆ కాలమున ననులోమ వివాహములు బాహాటముగా రాజ కుటుంబములలో జరుగుచున్నవి.

౭. అన్నయదేవ వంశజులు బ్రహ్మణ్య రాజులుగా జెప్పబడియున్నారు.



## ఆంధ్రాభ్యుదయము

మా సమకాలిక పత్రికయగు "ఆంధ్రాభ్యుదయము" (హనుమకొండ) పునఃప్రచారమునకు వచ్చినదని తెలుపుటకు సంతసించుచున్నాము. ఇప్పుడు వెలువడిన ౧౯౨౮ జనవరి సంచిక వివిధ విషయములచే నొప్పారుచున్నది. కోణకంచి చక్రధరరావుగారి సాల్టు ఇనస్పెక్టరు కథ మనోరంజకమై సత్ప్రవర్తన ఫలమును బోధించుచున్నది. కొలచలమ కృష్ణసోమయాజిగారి వ్యాసము మల్లినాథసూరి నిజాంరాష్ట్రవాసియని రూఢిపరచుచున్నది. విశేషముగా [illegible] నుండి యమెరికా దేశమునకు అధిపతియయిన జేమ్సుగార్ఫీల్డు మహనీయుని జీవితమును ఆదిరాజు వీరభద్రరావుగారు వర్ణించియున్నారు. గుండు రాఘవ దీక్షితులుగారి వర్తకము వృద్ధియగుటకు మార్గములు, జీవిత మూలాధారము, తదన్వేషణము అను వ్యాసములు సుభాషితములచే నొప్పారుచున్నవి. ఇంకను పద్యములుగలవు: ఎల్లరు ఆంధ్రాభ్యుదయమునకు దోడ్పడెదరుగాక! ఎచ్చట జూచినను ఆంధ్రాభ్యుదయమే ప్రఖ్యాతి [illegible]గాక!

# గ్రంథ విమర్శనము

## ౧ బసవ పురాణము

ప్రకాశకులు. ఆంధ్ర పత్రికా కార్యాలయము. తంబుచెట్టివీధి, మద్రాసు వెల. ౨-౮-౦ కల్దార్లు.

సుప్రసిద్ధ ప్రాచీన కవిరాజ ప్రణీతమైన యీద్విపద కావ్యమత్యుత్తమ పద్ధతిపై ముద్రితమగుట దానిప్రాశస్త్యమునకు దగినట్టిది. ఈముద్రణమందు శ్రీయుత నాగేశ్వర రావుగారి ప్రస్తావనయున్నది. పైగా శ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రిగారిచే ౧౩౦ పుటల సువిపుల పీఠికయున్నది. శ్రీ శాస్త్రిగారు రేకొదవయు లేనట్లుగా గ్రంథకర్త యొక్కయు గ్రంథస్థ చారిత్రిక మహాపురుషులయొక్కయు, వారి మతదీక్ష యొక్కయు సర్వ విషయములను సమగ్రముగా బరిశోధనా పూర్వకముగా జర్చించియున్నారు. ఇక మూల గ్రంథ ముద్రణములో ప్రతి పుటయందును, పాఠాంతరము లుండు పట్టుల దానిని జూపించి యున్నారు. మఱియు గ్రంథాంతమున సంజ్ఞా పదముల పట్టిక అకారాదిగా నైఘంటిక రీతిఁగూర్చి యున్నారు. ఈ ప్రచురమందు బసవ రాజుయొక్కయు, లింగార్చనము యొక్కయు రెండు పటములు ముద్రించి యున్నారు. ఇది ముద్రణ విషయము

ఇక కవిత్వ విషయమును గుఱించి యించుక చర్చించెదము. "ద్విపద కావ్యంబు ముదిలంజ బిడ్డ" యని యన్నిటి సమానముగాఁ బడఁద్రోసిన కొందఱు వేణు గోపాల శతక కారుని వెక్కిరింపు నిసాలుకకు సోమ నాథుడు బొంకునాఁ జేసియున్నాడు.

పెద్దలజేయు వెన్నుద్దుల మొదలు
బుద్ధులప్రోక విబుధ నిధానంబు
సమితవచోరాశిసుమనోనురాగుఁ
డమలినచిత్తు డుద్యద్గుణాన్వితుఁడు

సకలవీణాప్రవీణ కళావిదుండు
సకలంకనాద విద్యాపండితుండు

పుట ౫౧

అని భక్తుల గుణసంకీర్తనంబుచేయు పదము యల్లిక,

న్యాయవైశేషి కాద్యఖిల వాగ్ద్రష్ట
ధీయుక్తులను బెక్కుఁ దెఱగులుసూపి
యద్వితీయుడు రామనాథుడే కర్త
సద్విధి సర్వము సర్వేశ్వరుండు
శ్రుతి "ఏక యేవరుద్రో" యనుతత్వ
గతి "లింగమధ్యే జగత్సర్వ" మనియు
రతి "లింగబాహ్యాత్పరం నాస్తి" యనియు

పుట ౧౫౨

యని మఱియు మన్య శ్రుతులు నుదాహరించు నేర్పు

హారసకు సజ్జనంబాప్పు చేతులను
సంవి విప్రులకాళ్లు సంగడ్డదగునె?
శ్రీ మహాదేవు బూజించు చేతులను
నామాలకుక్కల నర్చింపఁదగునె?
పురహారార్చితునకు మున్నెత్తు కేలు
ధరనెత్తనోపునే తాటిమాలలకు

పుట ౨౪

యని తీక్ష్ణముగాఁ బరమతాసహనభావము ప్రకటించుటయు,

ఎన్నంగ వేమారు నెంతగాచినను
పన్నెక్కుగాదె సువర్ణంబు మిగుల?

నింతంతగాఁ జేయ నిక్షుఖండంబు
నంతకంతకు దీపు లధికమౌఁగాదె?
అంపానఁగోసిన యాచిననెఱయఁ
గంపెక్కఁగాదె శ్రీ గంధముసకును

పుట ౧౧౦

అను వాక్యములలోని వర్ణనయు,

మల్లికావిద్రుమమాధవీద్రాక్ష
వల్లరీవేల్ల నసల్లీలఁ దనరి
లలిత తదీయ కిసలయప్రసూన
ఫలమంజరుల ప్రభఁబ్రజ్వరిల్లుచును

పుట౧౧౩

అను శైలిలోని ధారాశుద్ధియు, సోమనాథుని కవితా ప్రాశస్త్యమునకు కొన్ని యుదాహరణములు.

ఈ గ్రంథము బసవరాజుయొక్క చరిత్రమును తెలుపవలసియుండెను. కాని „పురాణము" అగుటచే ననేక విషయములు మనకు బనికిరానివై యున్నవి. వీరశైవమతము హిందూ మతములో నొకక్రొత్త త్రోవ దీసినది. మహమ్మదీయ మతపు జాడలిందనేకములు కలవు. ఈమతము గొప్ప సంస్కారమును గూడ జేసినట్టిది. మాలమాదిగ జోగి జంగముల నందఱ నొకటిగా జేసినట్టిది వీరశైవమే. ఈ గ్రంథమందలి సప్తమాశ్వాసములో శివనాగుమయ్యయను మాలభక్తుని కథ దీని కుదాహరణము. కాని యీ సంస్కార పద్ధతి రానురాను నశించి పోయెను.

ఈ గ్రంథములో ననేక విషయములు వ్రాసినకొలది స్ఫురించుచుండును. చరిత్ర ప్రియులును, కవితా ప్రియులును నీ గ్రంథమును పఠింపదగినవారు.

### ఆంధ్రవీరులు రెండవభాగము

తెలుగువచనము. గ్రంథకర్తలు శ్రీ శేషాద్రి రమణకవులు. ప్రకాశకులు వేంకటరాం అండుకో. బెజవాడ. పుటలు ౧౯౪. వెల ౧-౧౨-౦ లు.

సుప్రసిద్ధులగు శ్రీ శేషాద్రి రమణకవులు ఆంధ్ర చరిత్ర వికాసమునకై చేయుచున్న కృషియమూల్యమైనది. వీరు రచించిన మొదటిభాగము సుజాత సంచికలో విమర్శించియున్నాము. ఇప్పుడు మాకార్యాలయమలంకరించిన యీ రెండవభాగమునందు ౧ మాధవ వర్మ ౨. విష్ణువర్ధనుండు, ౩ రుద్రమదేవ చక్రవర్తి, ౪ కన్నమదాసుడు, ౫ వేమారెడ్డి, ౬ హరిహరరాయలు, ౭ అనపోతనాయఁడు, ౮ సాళ్వనరసింహరాజు, ౯ సోమనాద్రిరెడ్డి, ౧౦ విజయరామరాజు, అను పదుగురాంధ్రవీరుల చారిత్రములు రసప్లుతముగ వర్ణితమైనవి.

విశేషించి యీ గ్రంథము నిజాంరాష్ట్ర వాసులకు ఎక్కువయభిమాన నీయమైనదిగా నుండగలదు. ఏలయన నీ రాష్ట్రమునకు సంబంధించిన అర్గురు వీరుల చారిత్రములు గలవు. ఇట్టి గ్రంథములను నిజాంసర్కారువారు పాఠశాలలయందు బఠనీయముగా నేర్పరిచినచో అంధ్రులకెంతయు మోదావహముగ నుండఁగలదు. సులభశైలి. ధారాళమైన రచన. ఆంధ్ర చరిత్రాప్రియులాదరించు, దీనిం జదివి మనపూర్వుల విద్యాగోష్ఠిని, పౌరుష ప్రతాపములను, ధార్మికబుద్ధిని, రాజనీతిని గ్రహించెదరుగాక!

ఇట్టి సుప్రయోజనకరమైన గ్రంథమును. గర్తలను కారకులను మేమభినందించు చున్నాము.



# కొలనుపాక శాసనము.

[ఆంధ్ర పరిశోధక సంఘము-హైద్రాబాదు.

శాసనసంఖ్య ౧౦౫. ఆలేరునకు నాలుగైదు మయిళ్ల దూరమునందున్న కొలనుపాక యందలి సోమనాథాలయములో నొక ప్రక్కనున్న శాసనములలో నొక్కటి. ఈ కొలనుపాక సుప్రసిద్ధ జైన క్షేత్రము. జైనాలయమే కాక సోమనాథాలయమును వీరనారాయణాలయమును గలవు. మఱికొన్ని శిథిలాలయములు గలవు. శాసన శిల స్నిగ్ధము చేయఁబడి నాల్గు వైపులను వ్రాయఁబడి యున్నది.

మొదటివైపు

పానవట్టం

౧ శ్రీశివమస్తు॥ అవ్యాద్వారా
౨ హస్తాయస్య దంష్ట్రాగ్రేజ
౩ యతిక్ష్మా। బోధాపికాళి
౪ + బంధాగ్రశ్యామ శుభ్రాబ్జ
౫ కోరకం॥ అవ్యాజోద్దామ
౬ భూయా సభవతు భవతాం
౭ భూత యేదంతి వక్త్రః పార్వ
౮ త్యాః ప్రేమపాత్రం ప్రణతజ
౯ నమనస్తోష పోషప్రదాయీ స:
౧౦ ర్వేర్సామణ్ణ దానాంజలమలి
౧౧ ముగలద్దాన షాధః ప్రవాహై
౧౨ రుద్వేలం సావిలేపః కలయ
౧౩ దిశి హితాయస్య హస్తావిహ
౧౪ స్థః॥ చాంద్రీకలాది గతుదిస్స
౧౫ కలాం విభూతిం సాంద్రామ
౧౬ లౌఘు పరివాహి భిరంశుజాలైః
౧౭ రుజ్జీవయంత్య విరతం భువన
౧౮ ం ప్రశస్తం భానోః కరైః ప్రతి
౧౯ దినంపరివర్ధ్యమానా॥ ఆమ్నాయో
౨౦ దారధామ్నస్సర సిరుహదృశస్త
౨౧ స్థుషోనాభి పద్మేధాతుస్తాతుః ప్ర
౨౨ జానామ జనిషత భుజోభూభుజ
౨౩ జోదుర్జయాఖ్యః। వంశే తేషా
౨౪ మభూవం నత వితవిభవాః
౨౫ కాకతీయానరేంద్రాః సర్వాణాః
౨౬ క్షోణిరక్షాం నిజభుజపరి
౨౭ ఘైర్జాగరూకాను భావాః॥ తద్గా
౨౮ య్యాస్య వికాంతిభూః కారు
౨౯ ణ్యస్యగృహం సువేశ్మయశసో
౩౦ గంభీరతాయాః పదం। ఔదా
౩౧ ర్యస్యనికేతనం గుణమణి శ్రే
౩౨ ణీ.....మ్మందిరం లక్ష్మ్యాస్స్వచ్ఛ
౩౩ రితస్యకేళి సదనం స్యాత్ప్రోల
౩౪ రాజాహ్వయః తస్యాత్మజో

రెండవవైపు.

౧ ణిపతిరమల దోర్దండవి
౨ భవోయదీయాంస్త్రస్యా
౩ సీత్పరిమథితవైరి ద్విపమదః
౪ మహాదేవం దేవం య
౫ మనుదిత బాలాక్షిమ
౬ హాసంభుజంగ వ్యాసంగో
౭ ఝితతను యమన్యంత
౮ మనుజః॥ తత్పుత్రో
౯ గణపతి నామధేయ
౧౦ సంజజ్ఞే జలనిధి మేఖలాం
౧౧ భువంయశః దోస్తంభే
౧౨ మణివలయి చకారశత్రై
౧౩ ర్దిగ్నాగైః ఫణిపతినాకధం
౧౪ బిదూఘాం॥ జాతాతస్యపయో
౧౫ నిధేరివరమా శ్రీరుద్రదేవీ
౧౬ సుతాభాస్వద్భి నృపమౌలి
౧౭ రత్ననివహైః నీరాజితాంఘ్రి
౧౮ ద్వయా॥ త్యాగేనత్రిదివద్రు
౧౯ మాన్ద్రవిదిశః కీర్త్యాధనా

౨౦ నాంహతిం లక్ష్మ్యైకించ
౨౧ భుజాబలేన విజయం
౨౨ వ్యక్తిర్వ్యర్తి వర్తర్తి ॥ భాగ్యై
౨౩ ర్విశ్వస్యతస్యాః పతిరభవ
౨౪ దథోవీర భద్రాభి ధాన స్సో
౨౫ ందర్యేణేందుమస్తాం
౨౬ పతిమపి మహసా
౨౭ మందభాసా వితన్వన్ । య
౨౮ ద్వైదగ్ధ్యం విదగ్ధాయ సుఖ
౨౯ వితరణం యాచకో
౩౦ దూయదాజ్ఞాం రాజానోయ
౩౧ త్ప్రతాపం విమత నృపత
౩౨ యోజార్జనతే జ్ఞాతభావాః ॥ శ్వ
౩౩ స్థశ్చాలుక్య వంశార్ణ

## మూడవ వైపు

౧ శివాఘైర్యర్తే జన్మోర్తి (వీ)
౨ రైరరినృపతి తమస్సంచయై
౩ రాశుయాతం ॥ లక్ష్మాంబా
౪ యాంసుతోజాత శ్రీమహా
౫ దేవరాజతః । నామ్నేందుశే
౬ ఖరో రాజకుమార శ్శివగో
౭ రవ ॥ ఇందుశేఖరనరేంద్ర
౮ నందనే నందతి స్వయము
౯ శేష నందనే । జగ్మ్రమాంవిత
౧౦ రణంరణం ముహుస్స్వస్థ
౧౧ శైవ విదుషాం ద్విషామ
౧౨ పి ॥ వెంకస్త స్యా కలంకః న్య
౧౩ పతి సరోజాత రాజన్మృగాంకోని
౧౪ శ్శంకశ్శస్త్ర తేజస్ఫురతి రణశి
౧౫ రస్యుద్ధతారాతిఘోరే । య
౧౬ స్యాస్యుత్క్రుత్త మత్తద్విపవిపు
౧౭ లశిరోవ్రాతనిర్యాత ముక్తా
౧౮ బీజైర్జాతా సుకీర్తి ప్రతతివిత
౧౯ తయః । ప్రోల్ల సంతిత్రి లోక్యాం ॥
౨౦ భువిమాచ నాయకాఖ్యే

౨౧ విదితోజనకో జనన్యపిచ
౨౨ సాక్షాత్ । గుణ విజితమహా
౨౩ లక్ష్మీశ్శీలవతి భవతి మాడచి
౨౪ యస్యా ॥ వీరేందు శేఖర పదా
౨౫ ంబుజ సేవకేన శ్రీ పోతినాయ
౨౬ క ఇతి ప్రథితేనతేన । యావంశ
౨౭ వర్ధన సమాహ్వాయ విశ్రుతా
౨౮ సాసల్యా కృతాప్రపచిరా కొలి
౨౯ పాక పుర్యాం ॥ అస్యాంకాకతి
౩౦ సంతతిక్షితి భృతాం భృత్యాశ్చ
౩౧ రాయేశ్వరాదక్షీ త్సూన్నృతమా
౩౨ స త్రిభువనఖ్యాతైక వీరా
౩౩ * * * *

## నాల్గవ వైపు

౧ సంధ్యాత్రయోధికా యుద్వేని వేద్యా
౨ యనివర్తనె । తాంజ లాప్పర్ణని
౩ ధ్యర్థం పాదమేక మనంతరం ॥
౪ సాయం ప్రాతస్సదాదీపాశ్చతు
౫ రుత్తర వింశతిః తేషామాచవర్తం
౬ తైలం తదర్ధం ద్వేని వర్తనం ॥ సేవన్తి కాసు
౭ దానసంతి సంధ్యంచ సహస్రకం స
౮ త్యంచ సేవధ్యానాయ భవత్వితినివర్త
౯ నం నివర్త నానాంత్రితయం రంగ
౧౦ భోగపురస్తి తే ॥ ఏకం నివర్తనంతస్య
౧౧ సతదచ్చర్క జనాయచ । ప్రోతినా
౧౨ యకదత్తాజి సంఘురక్షక నరాయ
౧౩ చ । పాదంచేత్త హానస్సర్వ మవశి.
౧౪ ష్టంతం దంతికే ॥ సర్వాంగ భోగరమ్యై
౧౫ ర్దాతోస్మ నాథస్యభక్తితః । ప్ర
౧౬ మాద్య బ్ధేదిపేకృష్ణ పంచమ్యాం మకర
౧౭ సంక్రమే । ఏకమేతం చతుష
౧౮ ష్ట్యా కాంస్య పాత్రంచ నూతనం । అష్టాద
౧౯ శఫలైర్యుక్తం తదాధార చ
౨౦ కల్పితం— * * *
౨౧ దద్వయాద్యై తేరప్యఖిలైరసావ

౨౨ సుమతా పండాత్య సామాత్యకః
౨౩ శ్రీనామ సాధనీయతా చనవ్యత్తి
౨౪ హేతావ్వ రేందు శేఖర నగాధిప శేఖ
౨౫ రేణ ॥ చాళుక్య వంశమణినా ప్ర
౨౬ తిపాదితా సాత్రింశన్నివర్త నస
౨౭ ముద్యశస ప్రసీః ॥ తతోగ్రవం
౨౮ దీశ్రీ సోమనాథాయచ నివర్త
౨౯ నం । ప్రాదార్ధో ర్యో చతస్యైత్వా
౩౦ మక్యవిఘ్నేశ్వరాయచ । పాదం
౩౧ జ్యోతిర్వి దేపాదమన్నీ పెద్దాహ్వ
౩౨ యాయచకోడ్డూరు వ్వనానామ్నే
౩౩ చవిర్ ప్రాయార్ధ నివర్త నం॥ అన
౩౪ ంతనాయకాఖ్యాయలాదయ
౩౫ చనివర్త నం । తస్యార్ధ మచ్యు
౩౬ తాఖ్యాయ నాయకాయచ శా
౩౭ సనం ॥ సత్ ప్రోక్త వతేచ శ్రీరామా
౩౮ యార్ యత్రిపాదికాతత్రభోగక్రమ
౩౯ ంచై వదేవస్యాచ్చిత్త వత్స్వాయం ॥

సూచన

ఈ శాసనమునందు కాకతీయ వంశ మూల పురుషుఁడగు దుర్జయుఁడు బ్రహ్మ భుజమునందుఁ బుట్టిన వాఁడుగఁ జెప్పఁబడెను. అందుచే కాకతీయులు శూ యులని తేలును. ఇందు రుద్రమదేవి గణపతిదేవుని కుమా ర్తెయనియు, ఆయమ భర్త చాళుక్య వంశజాతుఁ వీరభద్ర రాజనియు స్పష్టముగాఁ జెప్పఁబడెను. కా చరిత్ర దృష్టితోఁ జూచితిమేని యీ శాసనము చాల వగలది. ఈ ధర్మమును గావించినవాఁడు కాకతీయు భృత్యుఁడగు పోతినాయకుండు. వెంకయను పదము సంస్కృత సమాసమధ్యమునఁ బ్రయోగింపఁ బడెను.

షరా. వర్ధమాను పుర శాసనాంతర విషయము బట్టి కాకతీయులు శూద్రులని తేలుచున్నట్లు సుజాత ౧౯౨౭ జనవరి సంచికయందు వ్రాసియుంటి అందులకు ఒకానొకరు ఆగ్రహావేశులై విషయ విడిచి మమ్ముల కఠినముగ దూషించి యున్నా ఇప్పుడు భూషించెదరేమో! కాని దూషణ భూషణ లను లెక్కపెట్టక సత్య దృష్టితో శాసనాంతర విష ములను సూచించుటయే పనిగాఁ బెట్టుకొన్నాము. వా ఖండించుటగాని, సమర్థించుటగాని మాపనిగాదు. పరస్పర విరుద్ధ విషయములు వచ్చినప్పుడు వానినిఁ చి సమన్వయము చేయు భారము చరిత్రకారులపై దని మనవిచేయుచున్నాము. మేము పొరపాటు ప్పుడు దిద్దుకొనుటకు ఎంతమాత్రము సంశయింప కాని యట్టి యావశ్యకత యింతవరకును గలుగలేదు.



# చిత్రముల వివరము

## చిత్రకారిణి

శ్రీమతి ఆర్. కృష్ణాబాయి, బి. ఏ ఎల్.టి గారు రాజమహేంద్రవరపు నివాసిని, మద్రాసు యూనివర్సిటి ఎల్. టి పట్టమును బొందిన నాయుడు తెగ పట్టభద్రురాండ్రలో నీమెయే మొదటిది. ఈమె గొప్ప చిత్రకారిణియునై యున్నది. ఈమె చిత్రములు మద్రాసు ప్రదర్శనమునందు యోగ్యతా పత్రమును బొందుటయే కాక, పునహా, బొంబాయి ప్రదర్శనములందును బేరును బొందియున్నవి. ఈమె గాన విద్యావిశారద కూడను. వీణా గానమునందు ఈమె కడు నిపుణురాలు. ఈ నారీమణి ప్రజాహిత జీవితమునందు పాల్గొనుచున్నది. ఈ మధ్య మద్రాసునందు సమావేశమయిన బ్రాహ్మణేతర యువక మహాసభ ప్రారంభోత్సవము ఈమెయే జరపియున్నది. ఈమె వివిధవిషయ పరిజ్ఞానమునకు సూచకముగ మద్రాసు బ్రాహ్మణేతర కేంద్రసంఘ పత్రికయందగు జస్టిస్ ఉమెన్ (కళ–కాంత) అను భాగమునకు సంపాదకత్వమును వహించి యున్నది.

ఈ సంచిక మొదలి త్రివర్ణ పటము "మేనక" ఈమె చిత్రించినదే. ఈ యాంధ్ర నారీమణి రూపపటము గూడ నిందు ముద్రింపబడినది.

## కొప్పలకోట

రాయచూరు జిల్లాలోని యొక పర్వత దుర్గము. ఈ కోటను కొన్ని శతాబ్దముల క్రిందట ఒక కానోకపాళెగారు బలపరిచినటుల దెలియుచున్నది. ౧౭౮౬లో టిప్పూ సుల్తాను దీని నాక్రమించి, ఫ్రెంచి యింజనీర్ల చేత క్రిందికోట పునర్నిర్మాణము గావించెను. ౧౭౯౦ మేయి నెలలో బ్రిటిషువారు, నిజాము దీనిని ముట్టడించిరి. బ్రిటిషు రెజిమెంటు అధిపతియగు సర్ జాన్ మాల్కొలం "దుర్గము నెదుట ఆరునెలలు బహుకష్టముతో గడపవలసి వచ్చినది. అది పూర్తిగ స్వాధీనమగువరకు ఎన్నో విలువగల ప్రాణములను గోల్పోవలసి వచ్చెను." అని వ్రాసియున్నాడు. ఈ దుర్గ పతనమునకు ముఖ్యముగా ఇంగ్లీషువారి సేనలోని ఫిరంగులే కారకములయ్యెను. ఆరు నెలల ముట్టడి తరువాతకూడ నా ప్రదేశపు టాకారమునం దెట్టి మార్పును గలిగియుండలేదు.

౧౮౫౭ సంవత్సరములోని సిపాయీల తిరుగుబాటు సందర్భమున భీమరావను నాయుడు దుర్గము నాక్రమించెను. కావున దాని పునరాక్రమణమునకై ఘోర యుద్ధము జరిగెను. రాజాభీమరావు సమేతముగ ననేకులు సంహరింపబడిరి.

ఈ రక్షణ కట్టడమునకు రెండు కోటలు గలవు. మీది కోట పెక్కుమైళ్ళ విస్తీర్ణముగల శైలసమూహమునకు తూర్పువైపున సందులలోని అత్యున్నతమై విడివిడిగానుండు శిఖరముమీద నున్నది. ఈ కోట భూమిమట్టమునకు ౪౦౦ మైళ్ళ యెత్తునున్నది. మంచిస్థితిలోనున్నప్పుడిది బలీయముగా నుండియుండును. హిందూదేశమునందు తాను చూచిన దుర్గములన్నిటిలో నిది నిరభ్యంతరముగ అత్యంత బలీయమైనదని సర్ జాన్ మాల్కొలం ౧౮౬౦లో వర్ణించుచున్నాడు. దీనినిగూర్చి కర్నల్ మీడోసు టైలరు ఇట్లు వ్రాయుచున్నారు. గుట్టల మధ్య వంకరటింకరగా నుండుటయేగాక, కొన్నిచోట్ల మిగుల యిరుకుగాను, అసాధారణముగాను నుండి మాటుగా నిర్మితమైన మెట్లమీదిగాదప్ప దీని జేరుటకు వేరు మార్గము లేదు. ఎప్పుడయినా ఫిరంగులు పైకి గొంపోబడియెనా యనుట అశక్యముకాని పై భాగమందలి బురుజులయందు పురాతన ఫిరంగులు కొన్ని గలవు."

౧౮౬౧ లో నిదియు, దీని పరిసర ప్రదేశములును నిజాము స్వాధీనమయ్యెను. కొప్పల యిప్పుడు సాలారు జంగు జాగీరులోనున్నది నిజాము బరారును ఇంగ్లీషు వారికిచ్చిన సందర్భమున గోల్పోయిన ప్రదేశమునకు ప్రత్యామ్నాయముగ దీనిని సర్ సాలార్ జంగుకు నిజాము నొసంగెను.

గోలకొండ ముద్రణాలయము (తూపు బజారు, హైదరాబాదు) నందు
కే. బాలకృష్ణా రెడ్డిచే ముద్రితము. & ప్రకటితము.

# విషయసూచిక



**సూచన:—**

ప్రతిక విషయమై వ్రాయువారు తమచందా నంబరు తెలుపని యెడల జవాబురాజాలదు. ఈ నం పైనచుట్టబడిన కాగితముపై, చిరునామాకు ముందుయుండును.

## విజ్ఞప్తి!

అనివార్యములగు కారణాంతరములచే, ఫిబ్రవరి ౧౫ వ తేది వరకే వెలువడవలసిన, ఈ పత్రిక, యాలస్యముగా వెలువడవలసి వచ్చినందులకు చాల విచారించుచున్నాము. ఏప్రిలు నెల వెడలులోపలనే ఏప్రిలు నెలల రెండు వేఱువేఱు సంచికలు, పాఠకుల హస్తముల నలంకరింపగలవు. పాఠకులీ యాలస్యము గలరని పదింపదిగ ప్రార్థించుచున్నాము.

ఈ నెలతో చందా పూర్తియైన వారును, ఇదివరకే చందా పూర్తియైన వారును, వెంటనే తమ చం మనియార్డరు చేసి, మమ్ము ప్రోత్సహింప బ్రార్థితులు. వారము రోజులలో డబ్బు చేరనియెడల, కార్డు వి.పి. చందా రాబట్టుకొనియెదము. దయచేసిస్వీకరింప బ్రార్థితులు.

వ్యవస్థాపకుడు.




హైద్రాబాదు ఫిబ్రవరి ౧౯౨౭

సంపుటము ౨ ప్రభవ సంవత్సర మాఘము సంఖ్య ౨


# ఈశ్వర స్మృతి


సోమంచి సూర్యనారాయణశర్మగారు


దొంగనింటనుఁ బెట్టి దొరవీపునందట్టి
 యానందమందు మాయావి యెవఁడొ!

అణువందణంగియుండ నఖిలమా బ్రహ్మాండ
 మేరుపఱచుభూతి సారుఁడెవఁడొ?

ఆవగింజంత విత్తందున నొకవింత
 వృక్షంబు నిముడుచు దక్షుఁడెవఁడొ!

మసిబొగ్గునఁగరంబు మహితమాహీరంబు
 బొనఁగించెడు ననంత బుద్ధియెవఁడొ?

అట్టి జగదింద్రజాలు మహావిశాలు
నన్నతోన్నతు శాశ్వతు సన్నుతింతు
ని న్ననారత మెదలోన నిరుపమాన
భరిత భక్తికలాప! ప్రేమస్వరూప!

# శ్రీకృష్ణదేవరాయ ప్రశంస *

శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు.

మ. శరదిందూపమ సద్యశోధవళి తాశామండలుండై కవీ
శ్వరసంకల్పిత నాకలోక నద భాస్వద్భర్మ కంజాత ని
స్సరదంచన్మకరంద సుందరగుణ స్ఫాయత్కృతిస్తోత్రభా
గురుచారిత్రుఁడునై సమస్తరిపు రాట్కుంఠీ కృదస్తోకబం
ధుర బాహార్గళ విక్రమక్రముఁడునై తోరంబుగ మించె భూ
వరుఁడామాన్యుఁడు కృష్ణరాయునిల సత్పావిత్ర్య చారిత్రమే
ర్పర నాలించిననాఁడె యావినినవాఁడే ధన్యముఁ ధన్యుఁడుఁ
ఉరుతద్గ్రంథమణుల్ పఠించు ఘనుఁడే యుద్దండ పుణ్యుండగున్.

ఉ. రాయలు రాయలంచు నలరాజును నూరక పేరుకొంగనే
యే యటువంటి లాభ మది యేర్పడునంచుఁ దలంపవచ్చునే?
శ్రీ మెసలాఱుత న్నృపవరేణ్య సభాంతర సత్కవీంద్ర గ్రం
థాయతవైభవమ్ము మనసాఱఁ బాడంగని మించకుండినన్.

చ. తనరఁగ గ్రంథగేహమును తావున మాత్రమె కృష్ణభూపత
ద్ఘనకవి రాజగ్రంథములు గ్రాలెడుమాట యెసంగఁ బోఁకయీ
కనదమలాంధ్ర మానవ నికాయహృదంబుజ సీమలందు నె
ల్లను డదనూన పుస్తక విలాస మెసంగుట నే హొరంగగున్.

---

* (కుక్కనూరు శ్రీ దేశోద్ధారక ఆంధ్ర భాషా నిలయ పక్షమున జరుపబడిన శ్రీకృష్ణదేవ రాయల జన్మ దినోత్సవ సందర్భమున చదువ బడినవి)

# రెండవ హరిహర దేవరాయలు

పాలకోడేటి వేంకట్రామశర్మగారు బి. ఏ.

౧

మహామండలేశ్వర బిరుదాంకితుఁడును, రణధీరుడును, మహావిఖ్యాతుడును, ఆత్మజ్ఞానియునగు బుక్కదేవరాయల నిర్యాణానంతరము, అతని జ్యేష్ఠ పుత్రుఁడు, యువరాజునగు హరిహరరాయలు సక్రమముగా రాజ్యాభిషిక్తుడాయెను. ఇతఁడు బుక్కరాయల పట్టమహిషి యగు హొన్నాయి యనబడు హొన్నాంబిక కుద్భవించెను.

ఇతఁడు తండ్రి జీవించియుండగా యువరాజుగను దండనాథుడగనుండి విజయనగరమున రాచకార్యములందు ఉత్సాహమును మేధాశక్తిని గనపఱచెను. తండ్రియగు బుక్కరాయలకుగల సాహసమును రణకౌశలమును నీతనియందు గానరాకపోయినను, విద్యావంతుడును సహృదయుఁడుగలవాఁడు నగుటచే విజయనగర సామ్రాజ్యకీర్తిని ప్రపంచమునందు శాశ్వతముగ నుండుటకై యత్నించెను.

ఈ యాదవవంశ చక్రవర్తులలో భామినీ సుల్తానులకు గాని యే యితర స్వతంత్ర రాజులకు గాని జంకక చాళుక్య సామ్రాజ్య ధురంధరుడగు పులికేశునివలె మహారాజాధిరాజ రాజ పరమేశ్వర బిరుదముతో రాజ్యాభిషిక్తుడగుట యారంభమున యీ హరిహర దేవరాయలే. ఇతఁడు క్రీ. శ. ౧౩౭౭ సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను.

బుక్కదేవరాయలు కృష్ణవేణివరకు తన రాజ్యము వ్యాపింపజేసి విజయనగరమున కెట్టి భయమును లేకుండ జేయుట కుద్దేశించియు, భామినీ సుల్తానులతో ననవసర కార్యములకు దిగుట కిష్టములేక తుంగభద్రా నదికి దక్షిణమున నుండిన భూమండలముతో సంతసించెను. అదియునుగాక మహమ్మదీయ గుఱ్ఱపుదళముతో హిందూసైన్యములు పోరి జయము బడయుట యసాధ్యమని గూడ తలచియుండెను. అందుచే విజయనగర కోటను బలపఱచియు, దక్షిణ మండలములను స్వాధీనపఱచుకొనియు వర్తకము, కళలు, విద్య, మొదలగువాటిని ప్రోత్సాహముజేసియు, బ్రాహ్మణులను బూజించియు, కోశాగారమును వజ్రములతోను కెంపులతోను నింపియు, స్వదేశమున శాంతిగా పాడియు, పరరాజులు భీతినొందునటుల సైన్యమును బలపఱచియు కాలమును గడపెను,

రెండవ హరిహర రాయలు తనకు వశములోనున్న భూమండలముతో తృప్తి జెందలేదు. మఱియు తన రాజ్యమును కృష్ణవేణి వరకు వ్యాపింపజేయుటకేగాక వరంగలు ప్రాంతాది హిందూరాజుల కుత్సాహము గల్పించి భామినీ సుల్తానుల రాజ్యకాంక్ష నరికట్టదలచెను. ఇందులకు రాయచూరు మండలము నాక్రమించి తుంగభద్రానది కుత్తరమున బలమగు కోటల నిర్మింప సంకల్పించెను.

వరంగలు మొదలగు ప్రాంతముల హిందూరాజులు హరిహర రాయల ఉద్దేశముల కనుగుణ్యముగ జాగ్రతతో ప్రవర్తించినచో నీ విజయనగర చక్రవర్తియొక్క సంకల్పము నెరవేరియుండును. కాని వారు భామినీ సుల్తానుల బల పౌరుషములను గుర్తింపక క్రీడావినోదములయందుగల యుత్సాహమును సైన్యరక్షణయందు నియోగింపక నున్మత్తులవలె సంచరించిరి. అందుచే వరంగలు రాజ్యమస్తమించుటయేగాక, హిందువులు వందలకొలది సంవత్సరములు దాస్యమునం దుండుటయు, హరిహరరాయల కోరికలు ఫలింపకుండుటయు సంభవించెను.

ఈ హరిహరరాయలు దక్షిణ దిగ్విజయ యాత్రకై చని మధుర, మలయాళము మొదలగు ప్రదేశముల రాజులనుండి కానుకలను బడసి శృంగేరి పీఠాధిపతులకు భూదానములను బూజలను గావించి నిజరాజధానికి మరలెను.

విజయనగర కోటను శత్రువులు ముట్టడిసలుప దలచినచో నాదోని, బంకాపురము మొదలగు చిన్న దుర్గములు స్వాధీనపఱచుకొనవలయును. అందుచే హరిహరరాయలు ఈ కోటలను మిగుల బలపఱచెను. ఇంకను చిన్న చిన్న దుర్గములందు పటాలము లుంచెను. శత్రువులు తుంగభద్రానది దాటకుండునటుల పడవలు మొదలగు వాటిని తన స్వాధీనమం దుంచుకొనెను. దక్షిణ భూమండలమునంతయు స్వాధీనపఱచుకొనినపిమ్మట భామినీ సుల్తాను అగు మహమ్మదుతో కయ్యమునకు సిద్ధపడుచుండెను. యుద్ధ పరికరములను సమకూర్చుచుండెను. గుఱ్ఱపు దళమును వృద్ధిపఱచెను.

ఇట్లు హరిహరరాయలు దినదినము సైన్యబలమును వృద్ధి పఱచుచుండుటయు సరిహద్దుకోటలు బలపఱచుటయు నూతనకోటలు నిర్మించుటయుగాంచి మహమ్మదు మెలకువతో నుండెను. అతడును తన సైనిక బలమును గుఱ్ఱపుదళమును, యుద్ధసామగ్రియు సమకూర్చి నరస్మార్తుగ వరంగలు రాజ్యముపైబడి, చేతికింజిక్కిన వినాయక దేవుని వధించి గొల్కొండ మండలమును స్వాధీన పఱచుకొని వరంగలు దండనాథు లర్పించిన రత్నపు సింహాసనమును, ధనమును దీసికొని జయజయధ్వానములతో నిజరాజధానికి మరలెను.

హరిహరరాయలు, మహమ్మదు గావించిన పనులు విని క్రుద్ధుడై నరస్మార్తుగ రాయచూరు ముద్గలు కోటలను ముట్టడించెను. మఱియు నొక నారీమణి నపహరించుటకై యత్నించెను. ఈ విషయము బుక్కరాయల జీవితమందు సవిస్తరముగ వర్ణింపబడెను. తుదకు మహమ్మదునకు జయమును హరిహరునకు పరాభవమును సంప్రాప్తమాయెను. కాని యీ యుద్ధమువలన యుభయులకునే విధమగు లాభమును గలుగలేదు. అప్పటికి బుక్కరాయలు జీవించియే యుండెను. క్రీ. శ. ౧౩౭౫ సంవత్సరములో శ్రీభయంకరుడగు మహమ్మదు పరమ పదమొందెను.

మహమ్మదు చనిపోయిన పిమ్మట నతని కుమా[రుడు] ముజాహదు గుల్బర్గా సింహాసనాధిష్ఠుడాయెను. రాజ్యపాలనయందు తండ్రికి గల సామర్థ్య[ము] ముక్కోపము, అహంభావము, నిర్దాక్షిణ్యము[న]గుటచే జన విరోధుడాయెను. కాని సాహస[ము] రణోత్సాహమందును ఇతడు తండ్రిని పోలియుండె[ను].

సింహాసనము నధిష్ఠించిన వెంటనే తుంగభ[ద్ర]కుత్తరమునగల రాజ్యమును స్వాధీన పఱుపవలయు[ను] లేనియెడల యుద్ధమునకు సిద్ధపడవలయు[నని] విజయనగరమునకు రాయబారమంపెను. తన ప్రజ[ల] నసంతుష్టి ప్రబలుటచే వారికి యావేశము గలి[గించి] ధనాశయు, మతావేశమును పురికొల్పి వారిలో [ఐక]మత్యము గలిగించుటకై యిట్లు గావించియుండును. హరి[హర]రాయలు తన మనోరథ మీడేర్చుటకు కాలమ[ాసన్న]మాయెనని తలచి భామినీ సుల్తానులు కృష్ణవేణికి [దక్షిణ]మునగల భూమండల మంతయు తనచేయుని గ్రహించ[వలె]యుననియు, నట్లునంగీకరింపనిచో యుద్ధము వాసి[ల్లును] దనియు జవాబిచ్చెను.

ముజాహదు తన సైన్యములతో తుంగభద్ర[ను] దాటి యాదోని కోటను ముట్టడించెను. వేఱొక [భాగ]మును విజయనగర కోటను ముట్టడి సల్పుటకై బంపె[ను. సు]ల్తాను స్వయముగా కొంతసైన్యము ననతి దూరములో[నే] యున్న రాయల సైన్యము నెదుర్కొనుటకై [బయలు]దేరెను. కాని రాయలు సుల్తానుతో తలపడక సాండూ[రు] కొండల దాపుననున్న యడవులలోజొచ్చి రహస్య[మార్గ]మున విజయనగరకోటలో ప్రవేశించి కోటరక్షణకై [యే]ర్పాటులు గావించుచుండెను.

ముజాహదు ఆటులరాయలచే మోసపడి సా[ండూ]రుకొండలలో జిక్కుకొనెను. అతడు మార్గము తెలి[యక] నాలుగయిదు మాసములు ఆయడవులలోనే తిరుగా[డెను.] ఆతని దండనాథులు అదోని, బంకాపుర, [విజయ]నగరకోటలను బట్టజాలక మరలుటకై నాలోచించు[చుండి]రి. ఇంతలో సుల్తాను విజయనగర కోటను సమీపించి ముట్టడికొఱకు యుత్సాహముతో నారంభమాయెను. [ముజా]హదు దీర్ఘముగ నాలోచించి యెట్టులైన విజయనగ[ర]

నుద్యోగముకొనసంకల్పించి మారు మార్గమున కోటలో బ్రవేశించి, యేమను పాటున హిందూసైనికులపైబడి కల్లోలముగావించి కోటను ధ్వంసము గావించుట కుద్యుక్తుడై, మంచిసాహసులగు వేయిమంది గుఱ్ఱపు రౌతులతో కోటవెనుకటి భాగమున నున్న గోడలను దాటుటకై చనెను.

విజయనగరపుకోటలో బ్రవేశించుటకు రెండే మార్గములుగలవు. ఒకటి రాచబాట. అది కోట సింహద్వారము కడకు బోవును. రెండవది లోయబాట. ఇదికొండలమధ్యనుండి సన్ననిలోయలగుండ కోటవెనుకటి ప్రక్కనగల ద్వారము కడకుబోవును. ఈ లోయగుండకోటలో ప్రవేశించుట శత్రువునకు మిగుల కష్టతరము. ఈ బాటనే పోయి హరిహరరాయలు కోటలో బ్రవేశించెను. గూఢచారుల వలన ముజాహదు ఈ బాటసంగతి తెలుసుకొనెను. తాను స్వయముగా నీమార్గమున బోదలచెను. అతని దండనాథులు మొదలగువారు నిరోధించినను చెవినిడక యొకరేయి తననునుచరులతో నీలోయలో బ్రవేశించి ప్రహరీగోడను దాటి లోన బ్రవేశించెను. మఱికొన్ని ఘడియలకు రెండవప్రాకారమును గూడ దాటెను.

ఈ సంగతి కనిపెట్టి చక్రవర్తి సుల్తానును బట్టుటకై పటాలముల బంపెను, సుల్తానున కెదుటనయిన ప్రాకారములు గానబడు చుండెను. ఈ పద్మవ్యూహమునకు నడుమ యాకాశమునంటు రాజాంతఃపురములనుగాంచి సుల్తాను యువ్విళ్లూరు చుండెను. అప్పుడు సుల్తాను మఱొక అఫ్గను సర్దారునితో కొంతదూరముచని యామందిరములను జూపుచుండగా నెత్తయిన దిబ్బపై నున్న హనుమంతునిదేవళమొకటి సుల్తానునకు గానిపించెను. అందలిధనమును దోచుకొనుటయు, విగ్రహమును బగులగొట్టుటయు, దేవళము ధ్వంసము చేయుటయు తన విధియని భావించి నచటకుచని పూజలొనర్చుచున్న బ్రాహ్మణులను జంపియు, విగ్రహమును బగులగొట్టియు దేవాలయము పడగొట్టియు తన మనోరథము నెరవేర్చుకొనె. ఇంతలో నొక హిందూ యోధుడు సుల్తాను గావించిన యపవిత్రకార్యమున కాగ్రహించి డేగవలెనచట వ్రాలి యాఫ్గనుని కత్తితో పొడిచి సుల్తానుని గాయపఱచెను. సుల్తాను గూడ నతి యపాయముతో తప్పించుకొని ఆ యోధుని తన ఖడ్గముచే నరికి గాయపడిన అఫ్గనుని తన గుఱ్ఱముపై నిడి కోట వెలుపలికి పారిపోయెను. సుల్తానును కాపాడుటకై అతని యనుచరులు ప్రాణము లర్పించుచు మిగుల త్యాగముతో బోరుచు, బోనులో జిక్కిన సుల్తానును రక్షింపగల్గిరి. పారిపోవు సుల్తాను సైన్యముపై హిందూ యోధులు శిలావర్షమును బాణవర్షమును కురిపించిరి.

సుల్తాను అపాయమందున్న సంగతి ముఖ్య దండనాథుడగు దావూద్ఖానునకు తెలిసెను. వెంటనే యతడు తన స్థానమును వీడి సుల్తానును రక్షించుటకై చనెను. దావూద్ఖానుడు పోయిన వెంటనే హిందూ సైనికులు విజృంభించి సుల్తాను సైన్యములను వేటాడుట కారంభించిరి దావూద్ఖానుడు గావించిన పొరపాటు గ్రహించి సుల్తాను అతనిపై మండిపడెను. అందుపై దావూద్ఖానునకు సుల్తానుపై యాగ్రహము జనించెను.

ఇంతలో రాయల సోదరుడు ఇరువదివేల సైనికులు గల పటాలములతో యుద్ధరంగమున బ్రవేశించెను. అంతట ముజాహదు భీతిజెందినవాడై తొమ్మిది మాసములు గ్రామములు దోచుకొని ముట్టడినాపి గుల్బర్గానకు చనెను. రాయల దండనాథులు అతనిని వెంటాడి అతని యుద్ధ పరికరములను, గుంజియు ననేకుల ఖయిదీలుగను బట్టియు, కృష్ణా నదివరకు తరిమిరి. అప్పటినుండి రాయచూరు ముద్గలు మండలములు కొంతకాలము విజయనగర చక్రవర్తుల పాలనయందుండెను.

హనుమంతుని విగ్రహము పాడు చేయునపుడు కత్తిపోటులచే మరణించుటకు సిద్ధముగా నున్న బ్రాహ్మణుడొకడు 'నీవు నిజరాజధానికి మరలినవెంటనే దారుణమగు చావు సిద్ధించు'నని శపించినటుల ఫైరిస్తా దొర తన హిందూదేశ చరిత్రయందు వ్రాసెను. ఇందు సత్యమున్ననులేకున్నను ముజాహదు గుల్బర్గా మసీదునందు తలవంచి నమాజుచేయు సమయమున దావూద్ఖానుడు స్వహస్తములతో నతని శిరస్సు ఛేదించెను.

ఈ దావూద్ఖానుడు దండ నాథులచే భామినీ రాజ్యపు సుల్తానుగా నొనర్పబడెను. కాని ముజాహదు

సోదరియగు 'రూహిపర్వరాఅజో' అను నామె యితనికి శత్రువై నిలబడెను. 'నరహంతకుని సుల్తానుగానే నంగీకరింప జాల'నని ధైర్యముగా బలికిన యీ నారీరత్నము యొక్క కపట ప్రవర్తనముచే దావూద్ఖానుడు ఆ మసీదు నందే యదే సమయమున దారుణముగా నరకబడెను. రూహిపర్వరా వెంటనే కోట ద్వారములు మూయించి యల్లాఉద్దీనుని కడసారి పుత్రుడగు మహమ్మదుషాయను వానిని సుల్తానుగా జేసెను. దావూద్ఖానుని పుత్రులు దేశశాంతికి భంగకారులని వారిని బట్టించి కండ్లూడ బెరికించెను. తనకు విరోధులుగా నున్న వారినందరిని బందిఖానాలో బడద్రోసెను. ఖానుమహమ్మదు యను గొప్ప సర్దారుకూడ ఖైదులో నుంపబడెను.

ఈ సుల్తాను మహమ్మదుషా సౌమ్యుడనియు, నిష్కపటియనియు, దయాళుడనియు బుద్ధిమంతుడనియు చెప్పుదురు. ఇతడు పండిత పక్షపాతి. అనేక పండితులను పోషించెను. విద్యకై పాఠశాలల నభివృద్ధి పరచెను. ఇంక ననేక ధర్మకార్యము లొనర్చెను. వృద్ధుడును బుద్ధిశాలియు, రాజనీతి విశారదుడునగు సైఫుద్దీనుని తిరిగి మంత్రిగా నొనర్చెను. హాఫీజుఅను పండితుడు ఇతనిని పొగడుచు పద్యములు వ్రాసెను. అతడు గుల్బర్గాకు రాకపోయినను సంతసించి బహూకరించెను. సాధారణ దుస్తులను ధరించి డాంబికములేనివాడై అందరిచే కొనియాడబడెను. కరువు బాధచే ప్రజలు తన రాజ్యములో మాడిపోవుచుండగా దయాళుడగు సుల్తాను మాళ్వా గుజరాతు మండలములనుండి ధాన్యము దెప్పించి తక్కువ ధరలకు ప్రజలకమ్మించెను. ఇతడు ౧౯ సంవత్సరములు గా రాజ్య పాలనము గావించి క్రీ. శ. ౧౩౯౮ కాల ధర్మమొందెను. ఆ సంవత్సరమునందే మంత్రికూడ మరణించెను.

మహమ్మదు సింహాసనమునకు వచ్చిన రాయలు రాయచూరు ముట్టడిమాని కప్పము కంగీకరించినటుల ఫెరిస్తా వలన తెలియుచున్నది. ౧౩౭౮ సం॥లో ముజాహిదు యుద్ధమందు హ[తుడ]ాయెను. క్రీ. శ. ౧౩౭౭ సం॥లో నతడు దారుణహ[త్య]నొందెను... భవించెను. క్రీ. శ. ౧౩౭౯ సం॥లో మహమ్మదు సుల్తానుగా చేయబడెను. ఈ మూడు సంవత్సరము[లు] రాయచూరు మండలము రాయలకు పూర్తిగా స్వా[ధీన] పడియుండవలెను. మహమ్మదుషా సింహాసనము వచ్చిన పిమ్మట యుభయులు రాజీపడియుందురు. రాజీవలన రాయచూరు ముద్గలు మండలములు రాయ[లు] ఎదలి కొంతసైకము పుచ్చుకొనుటకు సుల్తాను అ[ంగీక]రించియుండును. అందుచే హరిహరరాయల మ[నో]మీ డేరియుండును. సుల్తాను సౌమ్యుడగుటచేతను, మందు తనకన్న వేయి మడుగులు పౌరుష శా[లి] ముజాహిదు ఎట్లు పరాభవింపబడినదియు గ్రహి[ంచి] శత్రువులుండుటచేతను, రాయలతో సంధికి యను[కూల]డాయెను. హిందూ సామ్రాజ్యము శ్రీ హరిహరరా[య]కాలమున కృష్ణవేణివరకు వ్యాపించె ననుటలో [సందే]హము లేదు.



# నా ప్రేయసి

నన్ని ఛానము సూర్యనారాయణశాస్త్రిగారు

గీ. ఆలలననె మొగ్గం బొక్క పూలతోట;
అందుఁగలపువ్వులుంబండ్లు ననుదినంబుఁ
గానకగానాకుఁ బంపునుగాని తాను
లతివరహాలొసంగిన లాఁతికిడదు.

గీ. ఆలలితగాత్ర మొక్క రత్నాలరాశి
యన్యులకు లోభ నీయంబయగును; గాని
దాని వెలఁగట్టఁగాలేఁడ నేనుదక్క;
దానిఁగొనలేఁడ యన్యుండు నేనుదక్క.

గీ. ఆరమణిచిత్త మనురాగ మారుతంబు
మలయు నంతఃపురోద్యాన మండపంబు;
అటకుఁ జననాకు మాత్రంబె యాజ్ఞగలదు;
పరులుచొరకుండ మూయఁగాఁబడునుదలపు.

గీ. ఆవనితమోవియందు లాస్యంబునేయు
చున్న చిఱునగ వమృతంపు జున్ను నాకుఁ
గానఁబడుఁగాని పరులకుఁగానఁబడదు
పుట్లకొలఁదిఁ బుణ్యంబు సల్పుకొనియుంట.

గీ. ననుస్మరించుచు మేల్కాంచు నాదురమణి
ననుస్మరించుచుఁ బనిసేయు నాదుకాంత
ననుస్మరించుచు భుజియించు నాదుయువతి
ననుస్మరించుచు నిద్రించు నాదు తరుణి.



# శిరోధార్యము

ఈటుకూరు సత్యనా . . . గారు

...వసంత ప్రశాంతనిశాంతధవళ
...వనరసార్ద్రిచంద్రిక పరిమళింప,
చటితను లతాముగ్ధకల్యాణమధు...
...ననసందేశ మది హృదయాంతరమున
...ధువులూరించె, మృదుపవన మానపోత
...లితమదంగ వల్లిక సోలిపోయె
...తృణాంకుర విమల శయ్యాతలాన.
...ందరంబది, గాఢ సుషుప్తి, విశ్వ
...శ్చిత్రప్రేమగాథాను ఖప్రముగ్ధ
...వమది, అనన్యజనలభ్యంబు; కాని
...తపు మొగ్గ వికసించి తావిగొల్పు
సంతలో మాయదారులే సైన నేమి,
హృదయదళముల నేకత్తిరించినారు.
అయ్యో! యీ వేసనాభర మనుభవింప
లేను, నెమ్మది జీవింప లేను నేను.

* * * *

ఈవిదగ్ధ ప్రలాపము లావిమోగ
కాళిమనిశార్ధగీతికా గానమునకు
శ్రుతులు వేయుచు నుండె తంత్రులువిలాస
మైన; ఇదనీ విలాసమే యగునొనాథ!
అటువెయగుచో శిరోధార్య మయ్యనాకు.



# అబెస్సీనియా

డాక్టరు ఒద్దిరాజు రాఘవరంగారావుగారు

అబెస్సీనియా చరిత్ర నవలోకించు వారు క్రైస్తవ వేదగ్రంథము (బైబిల్) నకు పూర్వపు సమాచారము నరసిన వారగుదురు. ప్రస్తుత కాలమందీ దేశమున నొక విధమగు అయో మార్గము (రైల్వే) ఏర్పడియున్నను, ఈ దేశ సంచారము విసుగు బుట్టించునంతటి దూరపథము గలదిగా నున్నది. ప్రస్తుతము నడవడిలో నున్న రైలు మార్గము „అడిస్ అబ్బాబా" వరకు గలదు. ఈ నగరము ఈ దేశమునకు రాజధాని. ఇందొక న్యాయస్థానము రాచనగరు గలదు. వీనిచుట్టు కుటీరములు (ఇండ్లు) గలవు. ఇవన్నియు మట్టిచే గట్టబడినవే. అయినను, న్యాయస్థానము, రాచనగరు ఈ రెండు తక్కిన కుటీరములవలె మిక్కిలి చిన్నవిగావు; కొంచెము విశాల పరిమాణముగా కట్టబడియున్నవి. మూడవవంతు త్రోవనడచగా „హరార్" అను నొక పెద్ద పట్టణ మగపడును. ఇందలి గృహములు ప్రాచీన శిలలతోడను, మట్టితోడను నిర్మింపబడినవి. ఈ కట్టడము లిజిప్టుదేశీయులు నిర్మించిరి. పూర్వపు టీజిప్టీయు లిందుండెడు వారు. మరికొంత దవ్వులో నొక పల్లియ గానవచ్చును. ఇందలి జనులు పశుపాలకులు. వీరు నిడువుగా జీరాడు దుస్తుల ధరించి గొఱ్ఱెల గుంపులను మేపుచుందురు.

రమారమి మూడు వేల సంవత్సరములకు పై కాలమందలివలె ఇచ్చటి జనులు పారితోషిక ప్రదాన, స్వీకారముల కొఱకు పట్టుదల గలవారు, ఈ దాన ప్రతిగ్రహములు దాతా ప్రతిగృహీతల యోగ్యతలనుబట్టి యుండును. ఇచటి జనులు దాన ప్రతి గ్రహము కొఱకే మహోత్సవ మొనరించి జనుల నాహ్వానించి, ఎద్దునో, గొఱ్ఱెనో దాన మొనరించెదరు. ఆ దానమునకు ప్రతి ఫలముగా నమిత ద్రవ్యమొసంగి ఆ దానమును గ్రహింపని వాడు మహాపరాధ మొనరించినవారి గతిబట్టును.

ఈ దేశీయు లొక „విస్కీ," లేక „బ్రాందీ" సారాయి బుడ్డినిచ్చిన మాత్రాన తృప్తినొందరు. యనంగా వీరీ సారాయము కొఱకమిత ధన వ్యయము చేయుచుందురు. ద్రవ్యార్జనవారికి కష్ట సాధ్యము. „మరియా థెరసా డాలరు" లను నాణెము లీదేశమందు చెల్లుచుండును. యుద్ధాంతము వఱకీ నాణెము లాస్ట్రియా టంకసాలయందు సిద్ధమగుచుండెడివి. ఈ నాణెముల పరిమాణము „అయిదు షిల్లింగుల నాణె" మంతయుండును. వెండితో చేయబడును కాని వెలకు సరిపోవునంతటి వెండి ఆ నాణెమునందు లేదు.

చిన్న నాణెములను వాడవలసిన చోట తూటాలు (Cartridges) ను, ఉప్పుతో జేయబడిన కడ్డీలు చెలామణి యగుచుండును. ఉప్పు కడ్డీలు అర అంగుళము మందము, నాలుగంగుళముల పొడవును గలవిగా నుండును. ఈ కడ్డీలను „డంకీ" లను పేరుతో వాడెదరు. వారేని ఇట్టి డంకీల నార్జించిరేని ఆకస్మికమగు నొక ప్రదేశముచే సంపాదనయంతయు నీట గలియును.

దేశాంతరాళభాగమందు బహుమతులను స్వీకరింపక దప్పించుకొను యుక్తిగలదు. ప్రతి మర్యాదకు పెద్దను బహుమతిగా నొసగి రూకలు చెల్లించుట దప్పించుకొనిరెదరు. ఈ సందర్భమున ఇచ్చినంత సారాయివారు త్రాగెదరని అనేకులెఱింగి యున్నారు. అబెస్సీనియా యందు మాంసము, సారాయియుకూడ పరిగడుపుగలవారికి మిక్కిలి మత్తుగొలుపును. అక్కడి రాజగు ,,మెనేలెక్'' అను నాతడు స్వల్పమగు బహుమతుల కొఱకు సైతము తగవులాడు స్వభావముగలవాఁడు. ఒకానొకసారి మిస్టర్ ,,హెర్బర్ట్ విలియమ్, ఎం. ఏ.'' ఈదేశమునకు వెళ్లి వడిగల ప్రవాహములు, భయంకర ప్రదేశములను గడచి మిక్కిలి శ్రమఁబడి రాచనగరు చేరుటకు మూడు మైళ్లు నడిచి ఈ రాజు సందర్శనము చేసినపుడు, కుశల ప్రశ్నాదికముల కంటెముందు ,,నాకొఱకేమి దెచ్చితి''వని యడిగెను. విలియమ్‌గారు "ఆటోమాటిక్ పెస్టల్''ను కానుకగా నిచ్చినంతనే దాని కవచముపై చేయి సోకించి, ఘుష్ఘుర ధ్వానముతో గూడిన ఆనంద ధ్వాన మొనరించెను.

ఈ దేశమునందన్ని విధములగు నిబంధనలు చట్టములు గలవు. దేశమొకింత నాగరికత గన్నదైనను ఆ నిబంధనలు విసుగు బుట్టించును. మఱియొక జిల్లాప్రదేశమునకువచ్చినపుడు సమీపమునగల పర్వతాధిత్యకయందలియొక జాతి పక్షి కులాయములను విడచివచ్చు గాలిలో గాల్చబడు తుపాకి ప్రేల్పులవలన కొంతకాలము వేచియుండవలసి వచ్చును. కఠిన పరీక్షలకు సహించుటకు, పారితోషిక ప్రదానమునకు, ముఱికియగు కాగిదలముతో సంబంధింపఁబడిన డబ్బారు చెల్లుచీటీలు (Endorsements) గ్రహించుటకు; నూతనరాజ్యముల కే యుద్దేశములతో వచ్చుట మొదలగు విషయములందు సమాహితములను దెలుపుటకు కొన్నిగంటలకాలము బట్టును. రాజకీయ శాసనమున ననుసరించి ఎంతకాలమందు నివసించి యుండినది, ఎపుడు తిరిగి వచ్చిన దెవరికి చెప్పగూడదు.

ఈదేశస్థులు తమ్ము ,,ఎథియొపియన్సు'' అని చెప్పుకొనుచుందురు. వారి నెవరయిన ,అబిసెనియా' వారనిచో మిక్కిలి కోపించెదరు. కారణమేమనగా: ,,అబెస్సీనియన్'' అనుట కర్థము ,సంకరజాతి' (Mongrel) యని. ప్రపంచముపై సంకరజాతులెన్నియో గలవు. అందుచే వారికానామము ముదావహముగా నుండదు. పూర్వపురాజగు ,,మేనేలెక్'' అరబ్బులవంటి ముఖవర్చస్సు' సిద్ది (Negro) వంటి ముఖసౌందర్యము గలవాడుగానుండువాఁడు. ఈ దేశీయు లితని పోలికనే యుందురు. కాని అంతనలుపు వీరిదేహము లందిపుడు లేదు. యూరేషియన్‌కంటె కొంచెము నల్లనివారు. మెడిటరేనియన్ దేశీయుల యందలి యొకానొక జాతివలె వీరిదేహము మృదుచర్మస్థగితము కావున కొంత సౌందర్యమునకు తావుగలదు.

అబెస్సినియా దేశీయులు నల్లనివారును, వికారవిగ్రహులునై యుండియు, తాము చక్కని (తెల్లని) వారను భావమును సంరక్షించుకొనుచుండుటచే వినువారికి, చూచువారికి నవ్వువచ్చుచుండును. వారాంగ్లేయుల ,,తెల్లని మొగమువా''రనుచుందురు. బోర్సులుకూడా ఆంగ్లేయులను రక్తముఖులనుచుందురు. వారి యనుకరణమే వీరొనరించుచుండునది. ఈదేశీయుల ముఖ్యాహారము పచ్చిమాంసము. ఎవుడైన మట్టితోను కఱ్ఱలతోను కట్టబడిన తమ రాచనగరునందు రాజుగాని రాణిగాని విందొనరించెనేని వసారాయందు యుద్ధవీరులందఱు నేలపై గూర్చుందురు. సేవకులు నెత్తురు చిప్పిలుచున్న మృగముల శవములను దెచ్చి వారి యొద్ద నుంతురు. అంత ప్రతివీరుడు వరనుండి ఖడ్గమును దీసి మగసాల కొక ప్రదక్షిణ మొనరించి, మాంసఖండమును గఱచి తన నాసికము నొద్ద నొకమాంస ఖండమును భయంకరముగ ఖండించును. సర్వసాధారణముగా వారెప్పుడును పచ్చిమాంసము నాహరించుచుండుట మిక్కిలి ఆశ్చర్యకరమే. పచ్చిమాంసాహారమును వారు దైనికాహారముగా వాడుచుండుటచే భయంకర వ్యాధులు వారి నాశ్రయించుచుండును.

త్రాగుబోతుదన మచ్చట విశేషము. తేనెను పులియబెట్టి, దుర్కలమైన ద్రాక్షసారమువంటి రుచిగలదానిగా నొనరించుకొని దానిని విశేషముగా ద్రాగెదరు. ఇది తక్షణమే మెదడునకెక్కి మత్తుగలిగించును. ,,బీర్''

ఈను సారాయిని కూడా వాడెదరు. నరమాంసభక్షణా చారమిప్పుడు నశించినదని యూహింపవచ్చును; కాని ప్రభుత్వమువారి పూర్ణదృష్టి ప్రసరింపని కొన్ని దూరపు గ్రామములందిప్పటికిని నరమాంసభక్షణము జరుగుచున్న ట్లు వింతవార్తలు చెప్పుకొనుచుందురు.

"సోమలిలాండ్" తీరవాసులను నొక నల్లజాతి వారు. క్రూర్యమునెడ మిక్కిలి 'యుత్సాహోపేతులు' వీరు కోపకారణమేదిలేకయే పురుషులను జంపుచుందురు. సాధారణముగా చావులన్నియు నొకానొకని ఇత్తడి బంధముగల ఈటెలవలన గలుగుచుండునవియే. ఇట్టి వీరి పరాక్రమమును రూఢి పరచ బనిలేదు; ఒకని నొకడు పొడచి చంపుటకంటె బలివిధానమింకను ప్రాముఖ్యత గాంచి యున్నది. ఒకానొక వర్తకుడు కొన్ని సంవత్సరములకు వర్తకమునాపి హంతక శ్రేష్ఠుడుగా మారెను. ఏనుగ వేటకాడు తుపాకితో దాని కక్షస్థానమందు గొట్టినట్లెందఱనో వెనక భాగములందుపొడచి చంపుచుండువాడు. కొందఱ తల్లుల చరిత్ర కధనములు వినవచ్చుచున్నవి. వారు తమ సంతానము పురుష సంతానమగునేని పొడచిచంపుచుండెడివారట! ఇట్లు చేయుటచే తమ ముద్దు సంతానము ముందొకని యీటికెఱగ కుండునని వారి భావము. మగవాడెప్పుడైన నొకనిచే జంపబడవలసినవాడే యని తెలియుచున్నది.

ఏనుగులనుగాని సింహమునుగాని చంపిన సోనదియు నొక పురుషార్థముగా నెంచబడును. అబెస్సీనియా దేశపు సింహములు మొత్తముమీద పిఱికిస్వభావముగలవి. బాటనడచు శబ్దము వినవచ్చినచో తుపాకిశబ్దము సహించి మెల్లన బాటదొలగి దాగుకొనును. ఏనుగలు మాత్రము మిక్కిలి బుద్ధిచాకచక్యముగలవి. మనుష్యుని గాంచినపుడు డాతని యొద్ద తుపాకి యున్నది లేనిది గురితించును.

నైసర్గిక భూభాగము వ్యర్థపుటిసుక దిబ్బలచే నానావైఖరీ సమామ్నాయమై యున్నది. ఈ యిసుక దిబ్బలయందనేకులు ప్రయాణికులు తమ ప్రాణములను గోల్పోయిరి. అకస్మికముగా నాయిసుకదిబ్బ లలలవలె కదలుటయు ప్రవహించుటయు జరుగును. అపుడందు జిక్కుకొనిన ప్రయాణికులకు ప్రాణవిసర్జనమునకంటె మిక్కిలిలేదు. అచటి సారవంతమైన ఆరామ భూములు ఘ కును. స్మృతికీ నెమ్మదు. శీతభూములు తొ అడుగుల యెత్తు వరకు బెరిగియున్నవి. ఇచటి స్థితి మిక్కిలి చంచలమైనది. సాయంకాల మగుట డవు ఆకారణముగా నలుబది డిగ్రీల ఫారన్ హీట్ దిగిపోవును

ఈ దేశమునందు బిడారులు నడచిన బాట కొంత విశేషముగా నన్ని కోటుల చుండును రాజ్యములను. అక్కడక్కడ కొన్ని నదులపై—అను జలగలు, మొసళ్లు, నీటి గుఱ్ఱములు (Hippopota గలిగియుండెనేని వంతెనలు కట్టబడి యున్నవి ప్ర కులతికష్టముతో వానిని దాటవలసియుండును.

కొన్ని నదులీ రాజ్యమునందు మిక్కిలి మోస నవిగా నున్నవి మిస్టర్ హెర్బర్టు విలియర్స్, గారీ దేశప్రయాణమొనరించునపుడు జరిగిన విష నొక దానినిట్లు చెప్పుచున్నారు:

"నేనొక నదిని దాటవలసియుండెను. ఆ న ము కొన్ని నూర్ల గజముల వెడల్పు రాయివలె యున్నది. నేనా నదీ తీరమునకు వచ్చునప్పటికి జనమంతయు నదిని దాటిరి. నేనింకను నదిని దా డుటగాంచి "త్వరింపుడు. మనము నీటిలో మునిగి టనుగాని, కొన్ని దినములు తినుటకన్నము, నిలచుట డారములేక నుండుటకుకోరము" అనిబలికిరి. కస్మికముగా నదివచ్చునని వారియనుమానముగా హసించుచు వచ్చుచుండగనే దూరమునుండి నడు బండిచంటి శబ్దము వినవచ్చెను. ఆశబ్దమునువిని ముగా గలిగిన దిగులున నా పరిజనము "త్వరింపు రింపుడు" అనిరి. త్వరపడినేను వారిని గలుసుకొ టికే అనేకవృక్షములను, గొఱ్ఱెల, ఎద్దుల శవములను ధ్వయిచుకొని అనివార్యప్రవాహము నదినిండి వ చ్చెను. ఇది గ్రీష్మకాలమునందు జరిగినది. ఎండకా నిర్భయముగా బయనమొనరించు ప్రయాణికులెందరో లలో జిక్కుకొనిరో!"

ఈ దేశమునందు నీటియొక్క కొఱత వ్యాయ లివృద్ధికి మిక్కిలి ఆటంకము గలిగించుచున్నది.

ల పేరులబెట్టి ఆదరంపు విచిత్రములగు పటములను నాటియున్నారు; కాని అడిగ్గియలలో కొంచెముమాత్రము నీరుండును. అనీటిరుచి ఉప్పగా చవిటిసిటివలెనుండును. ఆ కొంచెమునీరయినా నిర్మలముగానుండదు. ఒంటెలచే వేసడములచే మురికిగా జేయబడియుండును. ఆమురికినీరయినను రమారమి రెండడుగులలోతు ఇసుకనుదోడినగాని దొరకజాలదు. పీటభూములయందు సమృద్ధియగు జలప్రవాహములుగలవు. అబెన్సియాదేశ మెప్పుడయినసంపూర్ణనాగరికతగాంచునేని వానినిజలశక్తి (Waterpowers) గా వాడుకొనవచ్చును. ఈపీఠభూములయందలి నేలదున్నకుండనే ఫలించునంతటి సారవంతమైయున్నది. ఈ దేశపు దక్షిణభాగపు టడవులలో కాఫీరూఢిగాబండును. ఎడెన్ సమిక్కిలి ఆరోగ్యకారణములని మోకాలాంగ్బరీ ఎగుమతి యగుచున్నకాలమునందుకాఫీ ఈప్రదేశమునుండియే సుదాన్కు ఎగుమతియగుచుండెను.

పశువులు, ధాన్యము పుష్కలములు. ఈదేశీయులు సుస్వరూపముగా నుండవని గుఱ్ఱములయెడ నుపేక్షాభావము వహించిరి. రోగదశలో నున్నపుడు వానిని బాటప్రక్కన ఈగలకృపాపాత్రతగాంచుటకు పారవైచెదరు. వానికళేబరములు ఒంటెలయొక్కయు, గాడిదలయొక్కయు, వేసడములయొక్కయు కళేబరములు (Skeletons) జనసంచార యోగ్యములగు బాటల కిరుప్రక్కల గాన్పించుచుండును.

అబెన్సియాదేశపుటీగ లెంత పెద్దవో తెలసికొనుట కాదేశమునకే పోవలయును; చెప్పుటకుసాధ్యము గాదు. ఎదురుపడినవానిపైబడి కనికరముమాని యొక్కప్రేటు దీర్ఘమైనది వేసినచో దాని కుక్షినిండును. ఒకపల్లెటూరినుండిగాని, కృషికులస్థానమునుండి కాని ఎవడేని నిర్గమింపవలసివచ్చినపుడు అతనిచుట్టు మేఘఖండమువలె అవలిస్తువు కానుపంపసేకము ముసరుకొనును. కుళ్ళిన వెన్నను దళముగా వెంట్రుకలకుబట్టించి ఝుంకార [illegible]వరించుచున్న ఈగలు మొదలగు నెసురుగల కీటకములు దట్టముగా బరివేష్టింప సంచరించుట అబెన్సియనులకు సహజముగా విలాసపద్ధతి. పసిపిల్లలకనులీఁగాగలకు విడువగూడని వలసవచ్చినరాజ్యభాగము. ఈకష్టములు మానవులసర్వావస్థలయందును విడువని భయంకరఅనివార్యములు.

ఇచటి వివాహపద్ధతులయందనేకములు ప్రాచీనపద్ధతుల కనుగుణ్యములు. అనేక వివాహములయందు సాధారణముగా వధువును కొనినట్లుగనే జరుగును. ధనమునిచ్చి వధువునుగ్రహించుటకు మారుగా ఎద్దులను, గొఱ్ఱెలనిచ్చుచుందురు. ఈ కన్యాశుల్కము పెండ్లికూతురుయొక్క సౌందర్యమును స్థితినిబట్టి యేర్పరుపబడును. పెండ్లికుమారుడు ఇనుపపిడిదాపి చివరయందుతోలు చబుకు (Lash) గట్టబడిన కొరడాను చేతబట్టుకొని దేవప్రార్థనామందిరమునకు వచ్చును. ఇది అతనియధికారమునకుసూచన. వివాహమునకు పూర్వము వ్యభిచారవృత్తి చాలయుండును. కాని అవిశ్వాసముమాత్రము సర్వసాధారణము: కొలదిమాత్రలత్యము ఆకర్షింపబడును. పెనిమిటినియోగములనన్నిటికి నోర్చుటయే భార్యకుగలుగుచుండుకష్టము. భార్య పొలమునొద్దకు బరువులనుమోసికొనిపోయి పాటుబడుచుండును. ఆప్రదేశమునకేగువారు నాగలికొకదిక్కుభార్యను, రెండవదిక్కు గాడిదను గట్టిదున్నుచుండుటనుజూతురు. దున్నుచున్నపుడు భర్త చేతనున్న కొరడా చిటచిట లాడుచునేయుండును. ఒకవేళ ఆపెశక్తినిగురించి భర్త కసంతృప్తిగలిగనేని ఆపెను ఆపెయొక్క కుటుంబమునకు వెడలనడచును. ఇట్లుజరుగుట తటస్థించిపుడు భర్త ఆపెకుమిక్కుటమగు నష్టపూర్తిగట్టి యీయవలసియుండును. క్రొత్తగా అరేబియా, తురుష్కస్థానము (Turkey) మరియు నితరమహమ్మదీయరాజ్యములకు క్రొత్తగా బానిసె లెగుమతి చేయుట, బానిసవ్యాపారము పేరునకుమాత్రముధ్వస్తము చేయంబడినదనిపించుచున్నను, యుద్ధమునకు కొన్నిసంవత్సరములకుపూర్వము ఇంకను బానిస వర్తకపువెలఅబెన్సియాయందౌన్నత్యము నేయందియున్నది.

వెనుకటిరాజు తన్ను „యెథియోపియా'' రాజాధిరాజు అనిపిలుచుకొనుచుండువాడు. మఱియు సాలెమన్తో తనహక్కులకొరకు వాదించువాడు. షిబారాణి తనపూర్వరాజ్యపు సీమను దాటించి యేయధికారమును చెల్లింపకుండును. ప్రస్తుతము మాన్యదేశమునకు రాజులగుచిన్న (సామంత) రాజులు వారి సుఖప్రీతికొఱకు వారి

యభీష్టము నెరవేర్పుచుండుటయేగాక గుఱ్ఱముల నెక్కి, చిరుతపులిచర్మములను భుజములపైవైచుకొని క్రొత్తవారితో కదనరంగమున పోరాడి వారివలన బలాత్కారముగా గప్పములగొనుచుండురు. ఈరాజ్యమందు దక్కాలమాన ఛత్రములు సింహాసనములు మొదలగు రాజచిహ్నములను విపరీతముగా బహుమతిగాబడసిన జాగీదారులీరీతియుద్ధముల నొనరించుచుండుట బహుశః ప్రభుశక్తికిలోపము రాకుండ నుంచుటకే యని తోచుచున్నది.

నాల్గవ కింగ్ జాన్ ప్రాచీనపట్టణమగు అక్జుమునందు పట్టభద్రుడయినపుడందొక సింహాసన మతిశోభాయమానమగునది స్థాపింపబడియుండెను. ఈ సింహాసనము సాలమన్ రాజసింహాసనమువలె నుండెను. ఈపీఠము ఒకానొక ఇటలీదేశపు వడ్రంగిచే సిద్ధము చేయఁబడెను. ప్రతిఫలముగా నాతఁడు మంత్రిపదవిని స్వీకరింపవలసినవాఁడాయెను. అయినను ఆతఁడు ఇటలీవలసరాజ్యములయం దాతఁడంతకుపూర్వము నిర్వర్తించుచున్న ద్విభాషి (Interpreter) గా నున్నప్పటివలెనే మిక్కిలి వినయముతో నుద్యోగధర్మనిర్వర్తించెను. పిమ్మట ఆడిస్ అబ్బాబా యను నూతనరాజధాని నగరమునందు ఫ్రెంచిదేశమంత్రి యూరపు మొదలగు దేశముల సహోద్యోగీయులను [Colleagues] చేరదీసి సింధూరవర్ణపు పట్టుబట్టతోడను, రమణీయములగు బంగరుసూర్యులతో డిరాశిచక్రములవలెచేసినబుటేదారి [Emberoi dery] సింగారములతోడను ప్రకాశించు పెద్దసింహాసనారూఢుడై మిక్కిలియధికారానుభవము నభివృద్ధినొనరించెను.

మొట్టమొదటి ప్రార్థనా మందిరాధికారియగు "అబనా" సర్వోత్కృష్టస్థితియందుండెను. ఆతని సింహాసన మున్నతమైనదై యుండెను. సింహాసనము వెనుకనుండు తెరపైనుండు క్రైస్తవమతచిహ్నము (Crucifix) నకు చుట్టు బంగారునక్షత్రములు ప్రకాశించుచుండెను. ఆతనివామహస్తమునం దమూల్యమగు రత్నాక్షమాలయు, పాదములక్రింద పారసీకదేశమునుండి తెప్పింపఁబడినట్టి రమణీయరత్నకంబళము విరాజిల్లుచుండెడిది.

ఇతరములగు ప్రార్థనా మందిరములవలె గట్టఁబడిన దక్షిణ అబెస్సీనియా ప్రార్థనాలయములు వర్తులముగా మట్టితోడను, కఱ్ఱలతోడను కట్టఁబడియున్నవి. కట్టడము యొక్క మధ్యప్రదేశము పవిత్రములకెల్ల పవిత్రమయినదిగా [గర్భగృహముగా] నెంచఁబడును. అచటిజనులు మందిరప్రాకార మధ్యమముననైన, బహిర్వర్తులమునందయినను కూర్చుండినంత మాత్రమున తమవిధిని నిర్వర్తించినట్లు భావించెదరు. నాట్యమొనరించుట వారియందొక యాచారముగా గాన్పించుచున్నది. ప్రతిగురు వొకదీర్ఘదండమును — తెప్పకొయ్యవంటిదానిని హస్తమునందు ధరించి పాముల జంపుచున్నటుల భూమిపై బాదుచుండును. తప్పెటలతోడను అనాగరకములగు ముఖవాద్యములతోడను వారుత్సవములను జరిపెదరు.

ఇచ్చటిజనులు క్రైస్తవులుగానుండుట కతిగర్విష్ఠులుగా నున్నారు. నాలవశతాబ్ద మధ్యకాలమున వీరు అస్తానియస్ శిష్యునిచే వీరికి క్రైస్తవమతదీక్ష యొసగబడెను. అస్తానియు సొక మతద్రష్టగానుండెను. ఈ మతస్థులు క్రమముగా ప్రామాణికమతమునుండి చ్యుతులై యన్యమతావలంబులుగాఁజొచ్చిరి. నూతనముగా నవలంబింపబడినది "మానోఫిసిటి" సంబంధము. సాధారణముగా వారు ఈజిప్టునందలి కాప్ట్సుమతానుయాయు లగుచుండిరి. ఇప్పటికి వీరిప్రార్థనామందిరములయందుండు మతము ప్రధానమతము నెడలను స్వేచ్ఛగలవారుగానుండ ప్రయత్నించిరి కాని వారిప్రయత్నము తృప్తికరముగా నుండకుండెను. అలెగ్జాండ్రియా ప్రధానగురువుమాత్రము వారికొఱకు ముఖ్యముగా నేడుగురకోప్టిక్ మతబోద్ధలను ధర్మశాస్త్ర సంబంధులగువారిని, ప్రధానాచార్య నియమనముకొఱకు పదుగుర మతబోధకులను నియమించెను. ఆబెస్సీనియనులు తమకుదామే స్వాతంత్ర్యముగల ప్రధానాచార్యులుగా నియమితులు గాజాలరు. ఇప్పటికిని బహుశః ముఖ్యకూటస్థానములపై కాప్టులు పాలనాశక్తిని నిలుపుకొని యుందురు.

కొంతకాలముచనగా మహమ్మదీయమత ఘంటారావము శబ్దింపదొడగెను. క్రైస్తవమత వయస్సౌభాగ్యము మఱుపుదట్టసాగెను. ఆటవికులగు ఎధియోపియనులు క్రైస్తవ, మహమ్మదీయమతముల ప్రతిఘటనమును దక్షతతో గాచుకొనుచున్న కాలమున ప్రతిఘటించుచున్న సిద్దీలమూ

ఢవిశ్వాసముచే గలిగిన హృదయవేదనయందు వారుమునిగిపోయిరి. నూటికిరువది మతాచార్యులు, మతబోద్ధలు, యావనులు విగ్రహారాధన మొనరించునట్టి యొకానొక క్రొత్తమతమును స్వీకరించుచుంట నాపజాలకపోయిరి. వారిలో కొందరి భూతవైద్యము స్మరణీయముగా నుండెను. గ్రామస్థుల నేరములు దెలిసికొనుట మతాచార్యునియోగ్యతమీద నాధారపడియుండెడిది. ప్రార్థనలచే, శాపాలాపములచే దోషిని తెలిసికొనజాలనపు డాతడొక చిన్నబాలునిగొని వానియం దోషధీప్రయోగ మొనరించువాడు. దానిచే నాబాలుడు నేరస్థునిగూర్చి కలగాంచును. ఇది రమారమి ఆ జనమునకు సామీప్యబాధు వనవచ్చును. అప్పటికి నాబాలుడు స్వప్నమందు దోషిని కనుగొనజాలకుండెనేని మఱికొన్ని వనౌషధుల నుపయోగించును.

అబెస్సినియాదేశీయుల క్రైస్తవత్వము వెడలగొట్టబడెను. కాని అదినిరస్తముగాలేదు; సజీవమైయున్నది. వీరిలో నొకజాతి జ్యూరీకి వెడలిపోయి తక్కినవారిని హెబ్రాయిక్ ఆచారములను స్వీకరించుటకు నిర్బంధింపజొచ్చిరి. కావున క్రైస్తవమతాచారముగా నాదివారములును జ్యూయిషులసెలవు( Sabbath) దినములు నుత్సవదినములుగా జూడజొచ్చిరి. సున్నతివిధాన మభ్యసించిరి. మృగములవేటయం దొకవిధమగు మార్పును, అపరిశుద్ధాహారభక్షణ పరిత్యాగమును వారవలంబించిరి. వీ రొకసంవత్సరములో నూటయేబదిపండుగల నేర్పరచుకొనుటచేవీరిజీవితము కఠినపరిశ్రమల నొనరించునట్టిదిగానుండదు. మతాచార్యులందరు దాదాపు వివాహముల నొనరించుకొనిరనినను ఇంకననేకులు మతాచార్యులు సన్యాసులు తమ్ము ప్రత్యేకించుకొని ఆశ్రమముల (Monasteries) యందును మతముల (Convents) యందును నివసించుచుండిరి. వారిభూములు మిక్కిలిసారవంతముగా (వెలకుగొనబడిన) దాసులచేసాగుబడిగావింపబడినవి. ఈవిధాన మాచరణయం దుండుటచే కొండజాతివారికి క్రైస్తవమతబోధక సంఘము లసహ్యత్యసహ్యకరముగా గాన్పింపదొడగెను. సమయముజిక్కినపుడు వారిని దేశమునుండి వెడల నడుపవలయునని వారు తలంచుచుండిరి.

తుదిరాజులలో నొకడొకసారి ఇట్లు చెప్పెను. యూరపుదేశీయులారా! మొదలుమాకు క్రైస్తవమతబోధక సంఘముల (Missioneries) ను, పిమ్మట నొకరాజ్యపక్షమున మఱియొకరాజ్యమునందుం మంత్రులను [Consals] ను, చివరకు యుద్ధవీరులను బంపుడు" కొత్తవైద్యుల (Doctors) ను బిలుపింపదొడగిరి. ఇతరదేశములనుండి యీదేశమున కరుదెంచి తమప్రజ్ఞాగీతి నొనరింపదలచి వారుకొన్నినల్లని మాత్రలను, క్వినను, నల్లమందు మాత్రలనుదెచ్చి అచ్చటివారి కిచ్చుచుండినచో జనాకర్షణకు సులభమార్గ మేర్పడును.

అబెస్సినియా దేశీయులను సైనికులనుగా ప్రోగుచేయుట సులభసాధ్యముగా నుండలేదు. ఉత్తరాఫ్రికా దేశీయుల స్వభావము, బెర్బర్సు, పూర్వపు టీజిప్టియన్, మెడిటరేనియన్ జాతికి జెందిన యూరపియన్ సజాతీయతవీరియందు బింబించును. శుభ్రతగా మెలంగువారందరు తేటయగు ముఖవర్చస్సుగలవారు. మొత్తముమీద ముఖవర్చస్సు లోచనలోభనీయమైయున్నది. వారి నైసర్గికభాష ,కుషైట్" ప్రస్తుత మేవిధముగనైననేమి వారు చాలాభాగ మభ్యున్నతిగాంచిరి. పూర్వము వారిపై దండెత్తివచ్చిన సెమైటువారితో చాలాభాగమువారిపుడు వియ్యమందుచున్నారు మఱియు వారిభాషయగు 'అంహారిక్' నువాడుచున్నారు. హారిక్ భాషనుమాటలాడువారే నిజమైనఅబిస్సెనియనులు. వీరికే మిశ్రజాతి [Mongrel] అనివిదేశపారిభాషికనామమీయబడినది. దేశస్వాతంత్ర్య మెవరియాక్రమమైన కొండయుద్ధవిహారముపై వేలసంవత్సరములనుండి యాధారపడియున్నదో అట్టియీ తెగవారిపుడు అప్రమత్తతగలవారుగాను, యుద్ధోచిత కృత్యములనేర్చి సమయముపట్టున యుద్ధవీరులుగా నుండువారుగను సిద్ధపరపబడిరి.

వారి యావనమంతయు స్పృహణీయమగు సౌందర్యముగలది; కావున, ఇటలీ మొదలగు దేశములనుండి వచ్చి ఆవాసమేర్పరచుకొనినవారును, గుణజ్ఞులగు మహమ్మదీయులును వారివారి యోగ్యతలనుబట్టి గృహిణులనుగా గొనుచుండిరి. ఇట్టివారిలో నాలవవంతు జనముశాస్త్రోక్త వివాహములచేత భార్యలయందు ప్రేమానుబంధముగలిగి యున్నవారు. తక్కినవారు బదులుకు బదులు

(Barter) వివాహపద్ధతిపై భార్యలను సంపాదించి దా దావు తాత్కాలిక న్యాయైక్యతతో గాలము బుచ్చుచున్నారు.

అంహారిక్ ఛత్రము క్రింద "గల్లా" అను మతీయొక తెగగలదు. ఈ తెగబాగుగా సంస్కరింపబడినది. ఎత్తగు ఫాల భాగముచే వీరి ముఖములు రమణీయములుగా నుండును. వీరు మొదట ఆడెన్ సింధుశాఖ [Gulf of Aden] నుండి దండెత్తి వచ్చిరి. వీరీదేశీయులుగా నిలిచిపోయిరి. అనగా దేశపు గొప్ప కట్టుబాటును అపద నతిక్రమింపజాలకపోయిరి. తమ్ము యుద్ధార్హులుగా నొనరించుకొని తమ ప్రాణముల నొక సైనిక సర్వాధికారి వశ మొనరించి, యుద్ధ మెపుడాయని యెదిరిచూచుచుండునటుల చేసికొనిన పిమ్మట ఈకులీనులగు కొండజాతి అబెస్సీనియాలను "గల్లా" లు దాసులుగా నున్నారు. గల్లాలు మంచి శూరులు. వారికొకవేళ ప్రస్తుతకాల నిర్మితములగు తోపులు మొదలగునవి దొరకినచో వారు తప్పక అబెస్సీనియనులను దాసులనుగా గొనునంతటి శక్తి గలవారు క్రైస్తవులు క్రైస్తవ మతమునకును, మహమ్మదీయు లిస్లాము మతములోనకు వారిని సంక్రమింపచేయుటకు ప్రయత్నములు సలిపిరి. ఎటులనైననేమి. చివరకు హృదయపూర్వకముగా విగ్రహారాధకులుగను, మంచి యుద్ధనిపుణులుగా నుండి అబెస్సీనియనులు యుద్ధోచిత సైన్యమునకు తగినవారుగా నుంచుటకు కృషిసలిపిరి.

తర్బీతు గాంచిన కులీనులగు ఉన్నత వంశీయులుకూడా తమ పొలిమేరలయందు గల అరణ్యములయందు ఎన్నదగిన శాశ్వత సైనికశిక్ష నొందుచున్నారు. స్వమతాభిమానులగు బెడొయిన్ వంశీయులును, డానాకిల్సు అనువారు ఈదేశముయొక్క ఈశాన్యభాగమందలి సీమాభూమియందును మిక్కిలి సంచరించుచుండువారు. వారితో తూర్పు పొలిమేరలయందుండువారిని నోమలి పొలిమేరవాసులని శ్రేణి విభాగ మొనరింపవచ్చును, వీరు ఈమెర్క నుండి షేదసంస్థానములను జయించి ఆక్రమించుకొనిరి. పశ్చి దిశగనుండు సరిహద్దు ప్రాంతములనుండి దేశీయపు శా నిర్గమము వ్యాపించువరకు నీగ్రోజాతితో సంకరవ నట్టి బానిసెలయొక్క వివిధ సంకరజాతు లుందురు. బాలికలనుండియే వచ్చిన మహీరసతూలిక (Tarbush) పూర్వాసు రాజగు మెనెలెక్ మరియు దక్షిణ అబెస్సీయనులకు తగిలినది.

చిట్టచివరకు తెలిసికొనవలసిన విషయ మేమనా జూయిష్‌మతమును స్వీకరించి ఉత్తరపు కుష్షైటు వంశీయులనగా శేషించిన పాలాషా యొకటి రెండు పురుషాంతముల వరకు రాజ్యమేలిరి. వీరివిషయమై చెప్పబడుక లలో సగపాలు నిజమైనను, వీరు వెనకటినుండియు క్రైస్తవ మహమ్మదీయ మతములకు దూరవర్తులై క్రొత్తపా స్థయిన్ల వలన పవిత్రమంచుటకై మిక్కిలి కోరుచున్నారుగా గానబడెదరు.

పునస్సంస్కరణ మొనరింపబడిన అబెస్సీనియాశక్తి మేర, సౌభాగ్యము, అనుభవములా దేశపు టప్పుట్టభూ గములవలనను, గొప్పనగు ద్రవ్యార్జనోపయోగోపకరణము చేతను గొల్చబూనుట మిక్కిలి కష్టము. కాని ఉన్నతజా నిమ్నజాతి వివాదములమాత్ర మబెస్సీనియనులు తమలో దాము పునస్సంస్కరణ మొనరించుకొనియెను. కొన్ని శ రుషాంతరములవరకు వీరు క్రైస్తవులతోను, మహమ్మ యులతోను, విగ్రహారాధకులతోను యథావిధిగ పోరా చు పూర్వులచే ఆఫ్రికాదేశపు టడవులకంటెమించి ష్ట్యముగలదానిగా నిర్మించినకోటను నిలుపబెట్టిరి. ఆఫ్రి తో నిప్పటికిని చివరస్వతంత్ర్యరాజ్యముగా నిలిచియున్న రాజ్యమునందు తమ అదృష్టమునకు ప్రభువులుగా నుండ మనుట నభయమిచ్చుచున్నటుల వారిప్రస్తుతస్థితికానవచ్చు చుచున్నది.



# విలాపము

బూరెల వేంకట రమణయ్యగారు

[లలితకవితా కావ్యస్థానము]

చ. తిరిగితి నెల్లవీథుల నదేపనిగాఁగఁ బ్రభాతమాదిగా;
దరికొను దుఃఖభారమునఁ దాల్మిదొలంగితి; నెల్లవారికిన్
గరముల మోడ్చి వాక్సరణిఁ గాతరభావము దోపఁ మ్రొక్కితిన్;
చరణయుగంబులంటితిని; జాలిఁగొనం డొకఁడైన నక్కటా!

మ. గతజన్మంబున భాగ్యసంకలిత దోర్గర్వాతిరేకంబునన్
వెతలం బెట్టితినో జనాళిని?—మదాభీల ప్రతాపోద్ధతిన్
అతికాఠిన్యత నొవ్వనాడితినొ భిక్షార్థిన్?—కటా! యిప్పుడీ
గతి నూహింపగరాని బాములఁ బడంగానయ్యె నశ్రాంతమున్.

శా. ఏరీతిన్ దగఁ బ్రొద్దుపుత్తు? నిఁకపైనే వేల్పుఁ జింతింతు? నె
వ్వారిన్ వేఁడుదు? నేదిదిక్కిఁకను?—నార్వాఁతన్ తొలంగింపఁగా
లేరే దాతలు భూమిపై! నకట! నీలీలల్ విలోకింపఁగా
నోరా జీవదశాయతాక్ష! మది ఖేదోల్లాసముల్ గల్గెడిన్.

ఉ. ఆలియుఁ గూతులున్ సుతులు నస్థిగతిన్ తపియింత్రు; భుక్తికిన్
వేళ యతిక్రమించె; నిక వేజనకుండిన వారలాఁకటన్
సోలుచు, చింతతో నెదురుసూచుచునుందురు; రాప్తబంధులా
లీలఁ గృశింపఁజూడఁగ విరించివిధించె దయావిహీనుఁడై.

ఉ. సోదర సోదరీమణులు చూచుచునుండఁగ నెట్టులింక మ
ర్యాద నతిక్రమించెద; నహా! యెటువంటి గతిన్ వహించితిన్;
మేదురకుంభికుంభముల మీఁదికిఁ బోయెడు సింహమిప్పుడా
స్వాదము సేయుచుండెఁ గలుషంబగు క్షుద్రమృగాళి రక్తమున్.

శా. గంగానిర్మలవీచికానమిత కగ్రస్థానమై; మంజులో
త్తుంగ శ్రీకమనీయ రాజిత లసత్ప్రభాకరంబై, కదున్
రంగారం గల భారతాంబ, కడుపారన్, బిడ్డఁడొక్కండు తృ
ష్ణంగాసిల్లుచునుండఁగాఁ బిడికెడన్నంబీయఁగా లేదొకో!





# కళంకము

జి. వెంకోబరావుగారు



కలకత్తానగరమునుండి లార్డు క్యానింగ్ యొక్క ఉత్తరము అందినతోడనే నేను నాలుగుదినములలో ఢిల్లీనగరము చేరితిని. పల్టన్ యొక్క సిపాయిలొక్కటి రెండుస్థలములందు దుండగములు చేసిన సమాచారము నాకిదివరకే తెలిసియుండెను. ఢిల్లీఅధికారులను జూచినపిదప వారు నాకు క్యానింగ్ రెండవపత్రమునిచ్చిరి. అందులో నిట్లువ్రాసియుండెను.

“ప్రియరామపాలసింహ! మీరుఢిల్లీనుండి త్వరగా కాన్పూరుకుపోవలసినది. ఇంగ్లీషుప్రజల ప్రాణములు చాలకష్టస్థితియందున్నవి. అక్కడ జనరల్ హేను చూడవలెను. అతడుమీ నిమిత్తము సర్వవ్యవస్థలు చేయగలడు. సిక్కుల యుద్ధసమయమునను మీరేప్రకారముగా సహాయము చేసియుంటిరో అదేప్రకారము ఇప్పుడు మనఃపూర్వకముగా జేయగలరని నేను నమ్ముచున్నాడను. కాన్పూరుకుపోవుటయందు విలంబముజేయకూడదు.”

రెండవనాడే నేను నా ముఖ్యపరివారముతో కాన్పూరునకు వెడలితిని. ఆగ్రానగరమునుండి ఏబదిమైళ్ళదూరమునయుండు గంగానదీతీరమున అశ్వమేధఘట్టమునందు మేము చేరితిమి. మార్గమధ్యమందు నాకుచాల శ్రమగలిగియుండెను. ఆ రమ్యస్థలమును జూచినపిదప మనస్సు చాలవిశ్రాంతిగలిగినది. గంగాస్నానము చేసి నేను పూజ చేయదొడగితిని. నా పరివారము కొద్దిదూరమున విశ్రాంతిగొనుచుండెను. నా సమీపముననే ఒకసన్యాసి వ్యాఘ్రచర్మమునకూర్చుండి ధ్యానావస్థయందుండెను. అతనివిశాలమస్తకము జటాభారముల నాచ్ఛాదింపబడి శరీరమంతయు భస్మమయమైయుండెను. పూజార్చన సమాప్తియయినపిదప నేను నాపరివారమున్నస్థలమునకు పోవుటకై లేచితిని. ఇంతలో సన్న్యాసి తనసమీపమునకు రమ్మనిసంజ్ఞ చేసెను. అతనిని చూచినప్పటినుండి నాకా వ్యక్తిమీద ఆదరముత్పన్నమైయుండెను. నేను భక్తిపూర్వకముగా అతనికిప్రణామముచేసి నమ్రభావముతో “మహారాజ సేవకుని ఏనిమిత్తముబిలచితిరి” అనియంటిని. సన్యాసి నన్నాశీర్వదించి ఇట్లనెను. “వత్సా! నీ వెక్కడికి వెళ్ళుచుంటివి?”

“మహారాజ! నేను కాన్పూరునకుపోవుచున్నాను” అని బదులుచెప్పితిని.

“ఏమి! కాన్పూరునకా?” తనమస్తకమునుండి జటాభారము వెనకకువైచి ఆశ్చర్యముతో అతడడిగెను “కాన్పూరున కేమినిమిత్తము బోవుచున్నావు?”

నామనస్సున ఎట్టియనుమానముగలుగలేదు. నిస్సందేహముగా బలికితిని “ఆంగ్లేయులకు సాహాయ్యమునిమిత్తము. వారునన్ను పిలిపించియున్నారు.” ఇప్పుడు

త్రము నేనా వ్యక్తిపై సూక్ష్మదృష్టితో గాంచితిని. "మహారాజా! తమతో నేనెట్టిప్రసంగమైన దాచుటలేను.

అప్పుడా సన్యాసి నాతో, 'అయిననీవు కాన్పూరువకుబోయి ఆంగ్లుల కేమిసహాయము చేయుగలవు? నిజము చెప్పుము" అని పలికెను.

నేను ప్రత్యుత్తర మిచ్చితిని. "నేను పంజాబు ప్రాంతమున గొప్ప వ్యాపారినై యుంటిని. కాన్పూరు ఆంగ్లసైనికులకు కావలసినంత ధాన్యము నిచ్చునట్లు ఒడంబడిక చేసికొన్నాను. ప్రస్తుతము ధాన్యముకొరత గలిగినందున నేనక్కడికి వెళ్ళుచున్నాను" నిజముగా ఇప్పుడు నేను సర్వమబద్ధము చెప్పుచుంటిని. సన్యాసికి ఏమి తెలియునని నేను తలచియుంటిని. కాని నాతలంపు కొద్దిసమయములో అబద్ధమని తేలినది.

సన్యాసి ఇట్లనెను. "నీవు అనృతమాడుచున్నావని నాకు తోచుచున్నయది. కాన్పూరునుండి నేనువచ్చి నాల్గుదినములు కాలేదు. ఆంగ్లసైన్య సమాచారము నాకు చాల తెలియును. సైన్యమునకు ధాన్యసామగ్రి ఏమియు కొరతలేదు. నేను కండ్లతో చూచివచ్చినాడను. నీమాటల నిజముగాని అబద్ధముగాని నాకెట్టి అవసరములేదు. నేను సన్యాసిని. ఇక్కడినుండి నీకు పోవలెనని యిష్టముండిన యెడల నీవు పోవచ్చును. ఎట్టి అభ్యంతరములేదు."

ఇతడు సామాన్య సన్యాసి కాడని ఆ క్షణమందే నాకు తెలిసిపోయెను. లేనియెడల ఆంగ్లసైన్యముయొక్క రహస్యములను ఇతడెట్లు కనుగొనును? ఇట్లు మనమున నేను తలచినప్రస్తావముతో "మహారాజా!" తమకు కోపము రానితరి ఒకటిరెండుమాటలు తమరితో విచారించవలసియున్నది. ఆజ్ఞయైనయెడల విచారించగలను." అని అంటిని.

"నిర్భయముగా విచారించవచ్చును" అని ఆతడనెను.

"తాము ఈ సన్యాసాశ్రమముస్వీకరించి ఎంతకాలమైనది!" అని విచారించితిని. దానికా సన్యాసి "కొద్దికాలమైనది. నేను సంసారిని. కొన్ని మహత్తరకార్యముల సాధన నిమిత్తము నేను సన్యాసినైతిని. నాసంకల్పము సిద్ధించిన తరువాత మరల నేను గృహస్థాశ్రమము స్వీకరించగలను" అనెను.

"తమ నివాసస్థానమెక్కడ"

"విఠలపురము"

"ఇప్పుడు తమరెక్కడనుండి రాగలిగితిరి"

"ఒకసారి నీకు చెప్పితినికదా! కాన్పూరునుండి వచ్చితినని!" కొద్దిగా కోపముతో సన్యాసి పలికెను.

"తమరు సన్యాసులు. తమకును సైన్యమునకును ఏమి సంబంధము? అదిగాక ఈదినములలో ఆంగ్లులకు విరుద్ధముగా ఎన్నియో కుట్రలు పన్నబడుచున్నవి. ఇట్టిపరిస్థితియందు తమ నోటినుండిట్టి మాటలు వినిన యెడల ఎవ్వరికైన సంశయము కలుగకమానునా" అని నేను మరి ఏమో చెప్పబోవుచుంటిని. అంతలో నాసన్యాసి తనస్థలమునుండి లేచి నిలువబడెను. నావిచారణవలన అతని మనస్సు విచలితమై యుండును. అతడు మరల నన్ను తీవ్రదృష్టితో జూచి ప్రత్యుత్తరమిచ్చెను.

"నాకు నీవును సామాన్యమానసికానట్టు తోచుచున్నది. నీవు నన్నవమానించుచున్న వైఖరినిబట్టి నీవు ఆంగ్లుల గుప్తశోధకుడని తెలియుచున్నది. నీవెట్టివాడవైనను నేనేమి చెప్పవలసియున్నదో! అదినీకు చెప్పిచేయుదును. ఆంగ్లులకు విరుద్ధముగా శస్త్రధారణము చేయుట నేడు కాలధర్మమైయున్నది. ఇప్పుడు! దేశబాంధవుల కర్తవ్యమిదియే. ఆంగ్లులకు సహాయముచేసి స్వదేశద్రోహివి కాకుము. ఆర్యరక్తముచే పరదేశీయులను పోషించి పాపపంకిలమందు పడబోకుము. పో! నీకర్మానుసారము ప్రవర్తింపుము." ఇట్లుద్ఘోషించి ఆ మహాపురుషుడక్కడినుండి తరలిపోయెను. ఆతని గంభీరశబ్దములు నాహృదయమందు నాటినవి. తరువాత నేనుఖిన్నుడనై నాపరివారమును వెంటబెట్టుకొని త్రోవనడువసాగితిని.

కాన్పూరుచేరినతరువాత "హే" (Hey) నాకు, క్యానింగ్ తనకువ్రాసినపత్రము నిచ్చెను. అందదియిట్లు వ్రాయబడియుండెను.

"సర్ దార్. రామపాలసింహునకు ఆక్కడిపరిస్థితు లంబట్టి పితూరి చేయువారివిషయమునందు కడుజాగ్రతగ మెదలవలసినదని చెప్పవలెను విఠలపురపునానాసాహే బు అనతికాలమందె మనకువిరుద్ధముగా శస్త్రముస్వీక రించగలడని వదంతి. కావునజాగ్రత"

క్లానింగ్

పత్రమునందు 'విఠలపురము' అనుశబ్దముజూచినక్ష ణమె నాకు ఆశ్చర్యముగలిగెను. అశ్వమేధ ఘట్టము నందుగనబడిన సన్యాసియొక్క నివాసస్థలము విఠలపుర మే అయియుండెను. మరి ఏమి! ఆసన్యాసి నానాసా హెబేనా? అనినాకుదృఢశంక గలిగెను.

## II

## సర్ థామస్ హే డైరీనుండి

విఠల్ పురపు నానాసాహెబుయొక్క భవనము నే డు లూటిచేయబడెను. ధనము కొద్దిగా దొరికినది. నేడు నానాయొక్క భవనము ఫిరంగుతో ఎగరగొట్టబడెను. అట్టి సమయమందు భవనముయొక్క బురుజుమీదొక సుందర గౌరవర్ణముగలస్త్రీ నిలబడి యుండెను. ఆశ్చర్యకరమైన స మాచార మిదికదా; ఆభవనము లూటీచేయు సమయమం దాస్త్రీ భవనమం దెక్కడను లేదు. ఫిరంగి దెబ్బలవలన భవనము పడిపోవుచుండెను. అట్టితరి ఆ స్త్రీ వ్యక్తి మీద భాగమున మాకు కనబడి, ఈ భయంకర కృత్యమును ఆప వలసినదని సంజ్ఞచేసెను. కొంతకాలమువరకు నేనటు ల క్ష్యము చేయలేదు. తదుపరి తోపు విడిచేవాండ్లనా పని ఆ పుటకు ఆజ్ఞయిచ్చి నేను ఆ స్త్రీ సమీపమునకు పో యితిని.

హా! ఆబాలికను నేను పూర్వమెక్కడనో చూచి నట్టు మనసుకు దట్టై ఆమెను చూచినప్పటినుండి పూర్వస మాచారములయొక్క స్మృతి కలుగగలిగెను. ఆమె అప్పు డు నాతో శుద్ధ ఆంగ్లభాషయందు మాట్లాడ దొడగెను. ఆమె నోటనుండి ఆంగ్లభాష విని నాకు చాల ఆశ్చర్యము గలిగెను.

"దయచేసి తమరీ భవనముసురక్షణ చేయగలరా?" అని ఆవ్యక్తి నన్ను ప్రార్థన చేసెను.

దీనిని రక్షణచేయుటయందు నీ ఉద్దేశ్యమేమి దు?" అని నేనడిగితిని. దానికి ఆబాలిక చాల భిన్నస్వరము తో "మీరే సెలవిండు. ఈ భవనమును నాశనముచేయు యందు మీ హేతువేమికలదు?"

"ఈప్రాసాదము రాజద్రోహియైన నానాసాహె బుదై యుండెబట్టి, దీనిని భూసమానము చేయవలసి సర్కార్ వారి ఆజ్ఞయైయున్నది." అని నే బదులు చెప్పి ని. 'తమకు విరుద్ధముగా నెవడు ఖడ్గమును ధరించినా అతడపరాధి కావచ్చును. దోషి కావచ్చును. కాని ఈ డ దార్థము మీకేమి ద్రోహము చేసియున్నది? నా సాహెబు ద్రోహము చేసెను. కాని ఈభవనము నెట్టి పరాధము చేయలేదుకదా! ఇదినే జన్మించిన స్థలము గా న, నాకత్యంత ప్రియమైయున్నది. ఈ భవనమునం ప్రతివస్తువు నాకు ప్రేమాస్పదమైనది. దీని విధ్వంస నేజూడలేను. కావున నేను మిమ్ములను ప్రార్థన చే చున్నాను. దయచేసి ఈభవనమును కాపాడుడు. న చంపుడు, సజీవముగా దగ్ధముచేయుడు. సదనము మా త్రము భగ్నము చేయకుడు" అని ఆబాలిక దీనముగా లికెను.

"బాలా! అత్యంత దుఃఖకరమైన ప్రసంగము ను నీ ప్రార్థనను సఫలీకృతము చేయజాలను. ఈభవ భగ్నమాటచూచి, నాహృదయము చలించుచున్నది నేనేమి చేయగలను. బాలా! నాచేతియందేమియున్న కఠోరకర్తవ్యమని ఈ ప్రాసాదము ధ్వంసము చే వలసినదే" నేను కష్టముగా బదులుచెప్పితిని.

ఆంనులకామె "మీరు సర్వసేనాధిపతులు రు, 'హే' గారు నాకు తెలియును. మీ ప్రియపుత్రి పత్రమొకటి నాదగ్గరనున్నది. నేటికి మూడునెలక్రిం డచినవి. ఈ యుత్తరము 'తెమ కియ్యుమని నాతో యుండెను. హా! ఆమెకు నామీదెంత ప్రేమయుం నన్ను తన చెల్లెలని భావించుచుండెడిది. ఈ యుత్త చూచినయెడల మీకుకూడ దుఃఖము రాగలదు. మీ యముకూడ విదీర్ణమైపోగలదు. కాని నేడునాకు సం చిన దుర్భరమైన విపత్తును లక్షించి నేనా యుత్త మీకిచ్చుచున్నాను. మేరియును నేనును చాల కా

కలసియుంటిమి. అట్టితరి మీరు నన్ను చిన్నమేరియని పిలుచుచుంటిరి. ఆమాటకు చాలాకాలమైనది. ఇప్పుడు మీరాసందర్భమును మరచిపోయి యుందురు”

ఆబాలిక నోటినుండి నాపుత్రికపేరు వినిన తత్క్షణమే నాకు పూర్వ సమాచారములు ఒకటివెనుక మరొకటి స్ఫురింప దొడగెను. నానాసాహెబు ఏకపుత్రియు నాకూతురు మేరి—హా! ఆసమయమందు బ్రిటిషు సర్కారునకును, నానాసాహెబునకును, మనోమాలిన్యము లేకయుండెను. ఆప్రసంగమునకు నేడు మూడు సంవత్సరము లయిపోయినవి. నా ప్రియపుత్రి నేడీ ప్రపంచమందు లేదు. ఇన్నిదినముల పిమ్మట నేడు దానిహస్తాక్షరములు చూచుభాగ్యము నాకు గలుగకపోవుచుండెను: అందువలన నామనస్సు, చలించిపోయెను, నేను ‚మైనా’ (నానాసాహెబు కూతురు) తో అంటిని;—

„అవును! అవును! మైనా! హా! నేను నిన్ను గుర్తుపట్టితిని. నేను నిన్ను మరువజాలను. మీ యిద్దరియందు సోదరీప్రేమ యుండెను; కాని మైనా! నేనుఆంగ్లసర్కారు నౌకరునై యున్నాను. సరదారు ఆజ్ఞకు విరుద్ధముగ నేను నడువజాలను. నా ప్రియపుత్రియొక్క అంత్యలేఖనము నాకిచ్చివేయుము; దాని హస్తాక్షరములు చూడవలెనని నేను చాల కుతూహలుడనై యున్నాను. దాని స్మృతివలన నా మానసము వ్యగ్రభావము పొందియున్నది.”

తదనంతరము మేడమీదినుండి మైనా! ఆయుత్తరమును క్రిందికి జారవిడిచెను. ఆ అక్షరములు చూచిన క్షణమందే అవి మేరి హస్తాక్షరములని నాకు నిశ్చయమైనది. ఆపత్రముయొక్క ముఖ్యభావ మిట్లుండెను. „ఆపత్కాలమందు, మైనాకు—తమ చిన్న మేరీకి—నా ప్రియ తమ చెల్లెలికి— మీరు సహాయము చేయవలసినది” ఆపత్రమును చూచినతోడనే, నాకొకతట్టు రాజకార్యము, రెండవవైపు ప్రియపుత్రి అంత్యవాంఛ కనబడినవి. ఒకతట్టు కఠోరమైన కర్తవ్యము రెండవతట్టు ప్రియపుత్రియొక్క సుందరముఖమునుండి వెడలిన అంత్యప్రార్థన. నన్ను శూలములవలె బాధింప దొడగెను. నేను కర్తవ్య మూఢుడనైపోతిని. ఇంతలో జనరల్ అవుట్రాము (General Outram) నాసమీపమునకు వచ్చెను. నేనతనికి యావత్సమాచారము నివేదించితిని: ఏమిచేసినను ‚నానా’ భవనమువిధ్వంసము కాకుండ చేయవలసినదని నేనాగ్రహపూర్వకముగా అతనితో చెప్పితిని.

అవుట్రాము గవర్నర్ జనరల్ అనుమతి లేనిది ఈపని కానేరదు. నానాసాహెబుపై సర్కారువారికి క్రోధము చాలయున్నది. నానాయొక్క వంశజులపై దయచూపిన యెడల రాజద్రోహముచేసిన అపరాధమునకు పాత్రులము కావలసినదే.” అని నిశ్చయముగా బలికెను.

„లార్డుక్యానింగుకు ఈవిషయమంపి తంతి యిచ్చి చూడవలెను. వారేమిచెప్పెదరో తెలిసికొనవలెను” అని నేనంటి.

„మీకిష్టముండినయెడ మీరు తంతిచేయుడు; కాని నానాసాహేబు కుమారిని నేను బంధనముచేయక తప్పను.” అని అవుట్రాము ప్రత్యుత్తర మిచ్చెను.

కటకటా! ఆపని నానుండి త్రికాలములయందును కానేరదు. మరియు నేను ఆమెను పట్టియ్యజాలను. క్యానింగ్ కిప్పుడే తారు చేసెదను. మీయిష్టము వచ్చినట్లు మీరు చేయవలసినది” అని నేను నిశ్చయముగా బదులు చెప్పితిని. తరువాత నేను అవుట్రాముయొక్క మనోనిశ్చయమును విశదముగా మైనాదేవికి తెలియజేసి అక్కడినుండి వెడలిపోయితిని. నేను పోయినతరువాత అవుట్రాము నానాసాహెబుయొక్క భవనము నాలుగుతట్టులనుండి సిపాయీలను మైనాను బంధించు నిమిత్తము పంపించెను. కాని ఎక్కడ వెదకినను మైనా కనపడలేదు. చాల ఆశ్చర్యకరమైన విషయము.

ఆదే దివసమందు నాల్గు గంటలకు క్యానింగ్ వద్దినుండి తారుజవాబు వచ్చెను. ఈక్రిందివిధముగా దానియందు సమాచార ముండెను.

„ఇంగ్లండులో మంత్రిమండలి మత మిట్లున్నదికదా—ఈపృథ్వీతలమందు నానాసాహేబుయొక్క స్మృతిచిహ్నమేమాత్ర ముండగూడదు, దానిని నశింపజేయవలసినదే. నానాసాహేబును అతని సజీవ నిర్జీవములగు ఆస్తును ఈ జగత్తునుండి నష్టము చేయవలసినది. ఆయాజ్ఞ

విరుద్ధముగా నేను నడవజాలను. దానిని గురించి నన్ను క్షమించవలసినది.

క్యానింగ్

వెంటనే జనరల్ అవుట్రాము ఆజ్ఞానుసారము నానాసాహేబుయొక్క అభవ్య ప్రాసాద మొక ఘడియ కాలములో భూసమానము జేయబడియెను. మరియు శిధిలమైన భవనమునకు అగ్ని సంస్కారముకూడ జేయబడెను, నేను ఈరాక్షసకార్యమును దూరమునుండి చూచు చుంటిని. ఆ భయంకరమైన దృశ్యమును నేనిజన్మమందు మరువజాలను.

## III

### టైమ్సు పత్రికా ౬ సెప్టెంబరు ౧౮౫౭

ఇదివరకు విలక్షణ వ్యక్తియైన నానాసాహెబు దొరకలేదు. ఇండియాగవర్నుమెంటు కిదివరకు ఎట్టి యశస్సు చేకూడవలెనో దొరకలేదు; ఇది చాల విషాదకరమైన సమాచారము. నానాసాహెబు మీద సకలాంగ్ల జాతికి భీషణమైన క్రోధమున్నది. ఆంగ్లులశరీరములందు రక్తము ప్రవహించుచున్నంతవరకు కాన్పూరు ప్రసంగము వారు మరువజాలరు. ఈదినమందు హవుస్ ఆఫ్ లార్డ్స్ (House of Lords) సభలో థామస్ హే (Thomo-usHey) రిపోర్టు మీద చాలచర్చ జరిగెను. ఏ నానాసాహెబు ఆంగ్లబాలబాలికలను స్త్రీ పురుషులను అమానుష కృత్యముతో చంపివేసెనో, అట్టి నానాసాహెబు యొక్క ఏకపుత్రికయైన మైనాను చంపకూడదనియు నానా యొక్క పాపభూయిష్ఠమైన భవనమును విధ్వంసము చేయకూడదని మహారాజ్ఞియొక్క పురాతన విశ్వాసపాత్రుడైన భృత్యుడగు 'హే' గారు పార్లమెంటుకును మహారాణికిని అతిదుఃఖముతో ప్రార్థన పంపియున్నాడు. దీనిలో సత్యమెంతవరకున్నదో తెలిసికొను యసంభవము. ...డైన ,,హే'' గారు ఈ ప్రకారముగా దయజూపుట తవకు మిక్కిలి లాంఛనాస్పదమైయున్నది. సర్వజన్మము యుద్ధమునందు గడిపి, అంత్యమునకు వృద్ధాప్యకాల మందొక సుందర మహారాష్ట్రబాలిక నేత్రములనుండి వెడలు అశ్రుజాలముచే అతనిహృదయము విదీర్ణమైపోవుట మాకుచాల ఆశ్చర్యముగా తో

చుచున్నయది. మా మతము—నానాయొక్క కూతురు నానాయొక్క కుమారుడు—మరియు నానాయొక్క సంబంధమైన బంధువులుఎక్కడెక్కడ నుండినను ఆతిత్వరగా సంహరింప వలసినదనియే'—

౧౦ సెప్టెంబర్ ౧౮౫౭ ''హరకారా'' అను ...ముమండి

ఇదివరకు నానాకూతురు చే జిక్కియుండలేదు కాని నేడు అవుట్రాము, ఆ బాలికను పట్టుకొనెను. మె నిప్పుడు కాన్పూరు కారాగృహమందు బంధింపబడియున్నారు, త్వరలో విచారణ కాగలదు

౧౮౫౭, యొక్క సెప్టెంబరు ౩ వ తేదీ: మధ్య రాత్రి సమయమున పరిశుభ్రమైన వెన్నెలయందు, ధవళవస్త్రమును ధరించినట్టి ఒక మహారాష్ట్రీయ బాలిక, నానాసాహెబు భగ్న ప్రాసాదపు శిథిలమైన రాళ్ళపై కూర్చొని ఆక్రోశము జేయుచుండెను. సమీపమునందు అవుట్రాము సేనాదళము విడిసియుండెను, నిశీధి సమయమున కొందరుసైనికులు ఆరోదనధ్వని వినుటవల్ల ఎవ్వరు రోదనము జేయుచున్నారో చూచుటకై అక్కడి పోయిరి అక్కడా వ్యక్తికన్నులనుండి అవిరళ దుఃఖాశ్రుధారలు ప్రవహించుచుండెను. ఎంత విచారించినను మాటలేదు. అనంతరము అవుట్రాము వచ్చి ఆబాలిక నానా కూతురేయని నిశ్చయించెను బ్రిటిషు రాజాజ్ఞానుసారముగా ఆ బాలిక బంధింపబడెను. అప్పుడా బాలిక ,,నన్ను మనఃపూర్తిగా ఏడ్వనిమ్మని'' అవుట్రామును వేడుకొనియెను.

అవుట్రాముట్టి అవకాశము ఆమెకు యివ్వక పోయెను. చాల దుఃఖాస్పదమైన సమాచారము. ఆ మందే ఆ బాలిక ఆ దేవమూర్తియైన మైనా దేవి శృంఖలబద్ధము జేయబడి కాన్పూరు దుర్గములోనికి తీసుకపోబడెను.

నిన్నటి దినమున కాన్పూరు దుర్గమునందొక భయంకరమైన స్త్రీ హత్య జరిగినది. నానాసాహెబు ప్రియపుత్రికా రత్నమగు మైనా దేవి సజీవముగా దగ్ధము చేయబడెను. ఆ భయంకర అగ్నిజ్వాలలందామె

కములము కొద్దికాలమువరకు ప్రఫుల్లముగా కనబడినది. కాని అనంతరము కొంచెము కొంచెముగా మలినమై అంత్యమున భస్మమై పోయెను. అగ్నినుండి వెడలిన జ్వాలలు మరల అగ్నియందే లీనమాయెను: ఆర్యావర్తముయొక్క స్వాభిమానము స్వాతంత్ర్యప్రేమయు, నికట దేశభక్తియు కల్పి మండుచున్న జ్వాలారూపతేజస్సు, నాట్యమాడుచు, నాదించుచును, అనంతమందంతర్హితమయిపోయెను.

ఆ కరుణాలత కాలుచున్నప్పుడు, సమస్త ప్రేక్షకుల నేత్రములనుండి ఎడతెగక అశ్రుధారలు ప్రవహించుచుండెను. సర్వప్రదేశము, హా! హా! కారమయమై పోయెను. కాని, ఆమెను ఆ అకాల మృత్యు గరళమునుండి విముక్తి జేయుట కెవ్వరికిని సాధ్యము కాకపోయెను. సమస్తజనులామెను దేవతగా భావించి భక్తిపూర్వకముగా ప్రణామము జేసిరి:—

మైనా దగ్గర తాంత్యాటోపిని కొన్ని లేఖలుండెనని వదంతి కాని వాటియందేమి యుండెనో బహిర్గతముకాలేదు. దీనినిమించిన అత్యంత దుఃఖదాయకమయిన సమాచారము? ఆసుందరమూర్తియొక్క ఆత్మాహుతియైన పది నిమిషములకు లార్డ్ క్యానింగ్ నుంచి తంతీవార్త, 'హే' గారికి అందినది. అందులో 'ఇంగ్లాండు మంత్రి మండలి యాజ్ఞానుసారము మైనాదేవి క్షమింపబడినది. ఆమెను విడుదలచేయ వలెను' అనియుండెను.

హా! అదివరకే మైనా యొక్క సుందర దేహము భస్మమై పోయినది. ఆంగ్లప్రభుత్వపు లలాటమున ఈభీషణమైన కళంకము శాశ్వతముగా నిలచిపోయెను.

## IV

నానాసాహెబు కూతురు మైనాదేవి కాన్పూరు దుర్గమందు సజీవముగా దగ్ధముచేయు సమయమందు శూరుడైన తాంత్యా అక్కడలేకయుండెను. అతడుండినయెడల ఆంగ్లులకిట్టి భయంకరకృత్యమును చేయు సాహసము గలుగకుండెను.

ఆదినము సంధ్యాకాలమందు, నేను ఖిన్నమైన అంతఃకరణముతో కాన్పూరు దుర్గమునుండి స్వగృహమునకు తిరిగి వచ్చితిని. లోపల ప్రవేశించినతోడనే నాకొక యుత్తరము చేజిక్కెను. అందీ క్రిందివిధముగా వ్రాయబడియుండెను.

"ప్రియ రామపాల సింహునకు:—

"కొన్ని అవసరమైన కార్యములుండి నేను ఢిల్లీనుండి కాన్పూరు వచ్చినాను. నేడు రెండు ప్రహరముల రాత్రి సరికాదవ, నానాసాహెబుయొక్క భగ్న ప్రాసాద సమీపమున నన్ను చూడరమ్ము"

ఇట్లు,

'శుభకాంక్షి సన్యాసి'

ఈ సన్యాసి ఎవరై యుండును? తాంత్యాటోపే ఢిల్లీకి పోయియుండెను. ఏమి! ఇది శత్రువుల క్రొత్త కుట్రకాదుగదా! ఏమియైనగాని, రెండు ప్రహరముల రాత్రి నేను సాంకేతిక స్థానమునకు పోవుటకే నిశ్చయించి వెళ్ళితిని—రాత్రి పండ్రెండు ఘంటలు వేసెను. కాని అక్కడ నాకెవ్వరు కనబడలేదు. నామనసు అధికాధికముగా సశంకము కాజొచ్చెను. మరలి పోవుదునా అని మనస్సులో గలిగెను. ఇంకను నిరీక్షించి ఏమిలాభమని తలచి ఆభగ్నప్రాసాదమున కొకసారి ప్రదక్షిణము చేయవలెనని నిశ్చయించితిని, హా! ఈశ్వర తంత్రమెంత ఆశ్చర్యకరము? ఎట్టి విషాదకరము! ఏ భవ్యదసన మొక సమయమందు ఆంగ్లులయొక్క మనోపటమును విభ్రాంత చేయుచుండెనో ఏరాజప్రాసాద మొకకాలమందమూల్య పదార్థములతో నిండియుండెనో! అట్టి నానాయొక్క మేడ నేడు స్తూపాకారముగా మృత్తికారూపముతో గనబడుచున్నది! ఏమి కాల వక్రగతి—కాసిమ్మా!

ప్రాసాదము నలువైపులు నేను తిరిగితిని. ఎవ్వరు కనబడలేదు. రాత్రి మూడవ ప్రహరము కూడా గడిచెను. ఎవ్వరు కనబడలేదు. సన్యాసిపేరు కేవలము నన్ను మోసము చేయుటకు వ్రాసి యుండవచ్చును అని నేను మనస్సునందు తలపోసితిని. నాకు కొద్దిగా భయము కలుగజొచ్చెను. నేను నా పిస్తోలును చేతియందు భద్రముగా పట్టుకొని నలుదిక్కులు చూడ మొదలు పెట్టితిని. అట్టితరి నా ఎదుట అనతి దూరమున నుండు అశ్వత్థ మహావృక్షము క్రిందనుండి ఒక మనుష్యచ్ఛాయ నాకట్టువచ్చుచున్నట్లు గోచరించెను. కాని యాతడు శత్రుడా? మిత్రు

డా? నేను కనుగొనలేక పోయితిని. నేను పిస్తోలును సరిగా ఛాయ కెదురుగా సరిపెట్టి నిలచితిని, అపుడా మూర్తి అదేస్థలమందు నిలచెను. అది వెన్నెలరాత్రి. స్వచ్ఛమైన చంద్రకిరణములు సర్వదిక్కుల నాక్రమించి యుండెను. ఆ వెన్నెల యందా చాయయొక్క మస్తకముమీద జటాభారము, స్పష్టముగా కనబడుచుండెను. సర్వాంగము భస్మలేపనమై యుండెను. నేను మనస్సునందీ ,,వ్యక్తి స్వదేశభక్తుడైన తాంత్యాటోపి కావచ్చునని తలచి పిస్తోలు నా వ్యక్తి ముఖమునకు సరిగా గురియుంచి ఎవ్వరు మీరు? మిత్రులా! శత్రులా?'' అని విచారించితిని:—

ఆ మూర్తి గంభీర స్వరమందు ,,నేను మిత్రుడనే!'' అని ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు నేను సమీపమునకు జేరి ఆతనికి ప్రణామము జేసితిని ,,మహారాజ! మీ హస్తాక్షరములు నాకపరిచితము గనుక నాకు విశ్వాసము కలుగలేదు. కావున క్షమింపవలసినది. అని నేను ప్రార్థించితిని. కొంత కాలమువరకా సన్యాసి నోటనుండి యెట్టి మాట వెడలలేదు. అతని సమస్త లక్ష్యమా భగ్న ప్రాసాదమువైపు నిలచియుండెను. నానా సాహెబుయొక్క ఆ భవనము, అట్టి విపన్నవస్థయందుండుటజూచి కాబోలు అతని మనోసాగర మందెట్టి సంకల్ప వికల్ప తరంగము లుద్భవించు చుండెనో కనుగొను టతికష్టమై పోయెను. ఎన్నియో అతీతస్మృతులతో అతని మనస్సు దగ్ధమైపోయి యుండవచ్చును. ఇట్టి స్థితియందు కొద్ది కాలమైన పిదప, సన్యాసి (అతడే తాంత్యాటోపీ) ఇట్లనెను'' రామసింహా! మైనాస్థితి ఏమి అయినది?...హా! ఇంకెక్కడ మైనాకుమారి, ఎక్కడి నానాసాహెబు, ఎక్కడి రాజభవనము. వారియందొకరైన సజీవముగ నున్నారని చెప్పుడు! దానికేమి యుత్తర మియ్యవలెనో నాకు తెలియకపోయెను. మైనాదేవి! హా! స్వర్గీయదేవీ ప్రతిమా! సౌందర్యమూర్తీ! ఆ దేవబాల సజీవముగా దగ్ధము జేయబడి యుండెను. తాంత్యాకు నేనా భయంకరమైన వార్త ఎట్లు చెప్పుదును.? అతని కింతకుపూర్వమే ఈశోకవార్త తెలిసి యుండునని నేను తలచియుంటిని. కాని ఈ హృదయ విద్రావకమైన సమాచార మతనికి తెలి

యదు. నేనేమి ప్రత్యుత్తర మియ్యలేదు.

అపుడా మహాపురుషుడు మరలనదే ప్రకారము ,,మైనా కుమారిని ఆంగ్లులు బంధించ లేదుకదా!'' అని విచారించెను. నేను దానికి ,,లేదు ఆమె పవిత్ర దేహమ్మువారు స్పర్శించలేదు. అని భిన్నముగా బదులు చెప్పితిని.

''మరి! ఆమె ఎక్కడ నున్నది'' అని విచారించె. ,,మైనా దేవియొక్క విషాదకర సమాచారము నేనెట్లు జెప్పజాల'' నంటిని.

ఆశ్చర్యముగా తాంత్యా నుడివెను ,,విషాదకరమైన సమాచారము'' ఏమి! రాజకన్య ఈ జగత్తునందు లేదా?'' ,,లేదు నందన వనముయొక్క పుష్పమును దేవతలీ మర్త్య లోకమునుండి మరలి ఆ వనమునకు తీసుకు వెళ్లిరి.'' అని నేను శోకస్వరముతో చెప్పితిని!

నా ఈ శబ్దములు కర్ణ రంధ్రములందు పడగానే తాంత్యా హృదయమున ఎట్టి అసహ్య వేదనము! ఎట్టి ఘోర దుఃఖము కలిగెనో అది నేను చూడజాలక పోయితిని. అతని యాతేజమయమైన ముఖ మండలము నిస్తేజమై మ్లానమై పోయెను. అంబరమున చంద్రుడు నవ్వుచుండెను. చకోరము అమృతము నాస్వాదించుచుండెను. కాని, హా! ఈ సన్యాసికీ సమయమందు సర్వ సంసారపు కోటి పదార్థములు శోభా శూన్యములు—అర్థ శూన్యములు మరియు ప్రాణ శూన్యములుగా తోచుచుండెను. చాలకాల మతిక్రమించెను. తాంత్యా నోటనుండెట్టి శబ్దములు వెడలలేదు. తరువాత నా సన్యాసి నోటనుండి యట్లు మాటలు వెడలెను. ,,నానా సాహెబుయొక్క ఈ రాజ భవనమున కిట్టి దుర్దశ ఏ చండాలునిచే గలిగెను''?

,,ఆంగ్లుల ఆజ్ఞానుసారము జనరలు ఔట్రాము శతఘ్నులతో ఈ దివ్య భవనమును పాడుచేసెను'' అని నేనంటిని.

,,ఏమి! దాని యందే మైనా దేవి చిక్కుబడెనా!

,,అవును భవనమును విధ్వంసము చేయ గూడదని ఆమె చాల ప్రార్థించెను కాని, ఆ నరపశువు వినలే

„తరువాత నేమి జరిగినది” అని తాంత్యా ఆతురతతో నడిగెను „ఈ జగమునుండి నానా సాహెబును నానాయొక్క అస్తిత్వ చిహ్నమునుకూడ నష్టము చేయవలసినదని ఇంగ్లాండు మంత్రిమండలి యాజ్ఞయై యుండెను. తదాజ్ఞానుసారము జరుప బడియెను.

„మరి, ఇదే ప్రాసాదమందు మైనాదేవి శతఘ్ని ముఖమున కాహుతి యైనదా” అని తాంత్యా కంపిత గాత్రముతో విచారించెను „ లేదు జనరల్ అవుట్రామ్ ఆ సమయమందీ ప్రాసాదమున చాల పరిశోధించెను. కాని మైనా అక్కడ దొరకలేదు,”

„‘మరి, ఆమె ఎక్కడికైనా వెళ్లిపోయి యుండ కూడదా” అని తాంత్యా కొద్దిగా ఆశా పూర్ణ స్వరముతో అనెను.

„అవును, ఆమె గుప్త మార్గమున ఈ ప్రాసాదమునుండి వెడలిపోయినది”

„తరువాత ఏమిజరిగినది?” అనిఅత డడిగెను. కొన్ని దినముల తరుపరి ఒకనాడు మధ్య రాత్రమున ఈ భగ్న ప్రాసాదముపై ఒక బాలిక ఆక్రోశము చేయుచుండగా చూచి అవుట్రామ్ ఆమెను పట్టుకొనెను, అని నేను చెప్పితిని.

„ఆమె ఎవ్వరు?” అని సన్యాసి తీక్ష్ణముఖముతో విచారించెను „ఆమె,—ఆమె—నానాయొక్క ప్రియ కుమారి మైనాదేవి „హా! హతవిధి!” అని తాంత్యా తన కపోలములను రెండు చేతులతో పట్టుకొని నేత్రములను మూసికొనియెను. కొద్దికాల మట్టి స్థితియందుండి „ఏమి? ఆమె తనకు దానే ఆంగ్లుల స్వాధీన మయ్యెనా?”

“అవును, ఆమె తన యిచ్ఛాను సారమే ఆత్మ సమర్పణము చేసెను” జనరల్ అవుట్రాము ఆమెకట్టి శిక్షయిచ్చెను? తాంత్యాయొక్క విశాల నేత్రము లెఱ్ఱబారుచుండెను. దానికి నేనంటిని „ఆశిక్ష నే జెప్పజాలను, అది చాలా భయంకరమైనది”

తాంత్యాయొక్క సర్వాంగము కంపింప దొడగెను. అతడు తన నడుమునందుండు ఖడ్గమును లాగెను. మరియు క్రోధాయమానమైన కంపిత గాత్రముతో „నాకఠోర హృదయము మిక లేశమాత్రమైన ద్రవించ నేరదు. మైనాదేవి కట్టి శిక్ష ఆ పాపిష్టు డిచ్చెనో? రామపాల! చెప్పుము! చెప్పుము! నాకు సహించుట కసాధ్యమై పోవు చున్నది” అని నుడివెను.

„దేహాంత శాసనము! సజీవము గాదగ్ధము! మైనాదేవి జీవముతో కాల్పబడియె!”

„ఏమి? జీవాంత దగ్ధమా!” తాంత్యా రాక్షసుని వలె కఠోరముగా ఆక్రాంతిక స్వరముతో నుడివెను. “పరమేశ్వరుని శాంతి మయ రాజ్యమందు, ఇట్టి భీషణ అత్యాచారమా? మరియు దాని విషయమందు రామపాలా! నీవేమి ప్రతీకారము చేయలేదా? నీవు నీకంటియెదుట ఇట్టి దారుణ భీభత్సమును చూచుచుంటివా?”

నేను శోకావేగము నాపలేక ఏడ్చుచు బలికితిని, „మహారాజ! ఆమె విముక్తికి నేను సకల ప్రయత్నములు చేసితిని. కాని సర్వము వ్యర్థమై పోయెను. ఆంగ్లమంత్రి తరువాత నామెను విడుదల చేయుట కాజ్ఞయిచ్చెను. కాని మా దౌర్భాగ్య వశమున ఏ సమయమందాజ్ఞ వచ్చిచేరెనో అదివరలోగ మైనాకుమారియొక్క పవిత్రాత్మ ఆమె జడదేహము మర్త్యలోకమును విడచి, సచ్చిదానంద స్వరూపమైన పరంజ్యోతియందు లీనమై పోయి యుండెను, మైనా దేవి దగ్ధమై యుండెను.

హా! పరాత్పరా! నారాయణ! నేను జీవించియుండి ఏమి ప్రయోజనము. హా! ఏనానా సాహెబు నిమిత్తము, ఏ రాజకుమారి నిమిత్తము, ఈ కాన్పూరు నగర మింద్రలోక తుల్యమై యుండెనో, ఆట్టివారిద్దరు నన్ను విడచి వెళ్ళిపోయిరి. హా! దైవ సంకల్ప మవిలంఘ్యము”

“మహారాజ! తాము ముందెక్కడికి పోయెదరు?” అని నేను కడుదుఃఖముతో విచారించితిని.

“శీఘ్రముగా నేనిక్కడి నుండి కాశీక్షేత్రమునకు పోయెదను. అక్కడ ఆంగ్లులకు మనకు అంత్య యుద్ధము కాగలదు. ఆ సమయమందు, మైనాయొక్క ప్రతీకారము తీసికొనుటకు వీలు దొరకును. నామనోదేవత చెప్పుచున్నదికదా, విజయ లక్ష్మి మమ్మలనే వరించ గలదు. చాలమంది రాజవర్గము మాకు సహాయము చేయగలరని నేను నమ్ముచున్నాను. ఒకవేళ యుద్ధమున మాకు పరా

జయము తటపించెనా! ఆర్యావర్తమున కిప్పుడే స్వతంత్రము కలుగుట పరమాత్ముని సంకల్పము కాదని నమ్మవచ్చును” అని తాంత్యా బనులు చెప్పెను.

“మరి మీరేమి చేయగలరు” అని నేవిచారించితిని.

“కదా బత్, యుద్ధమందు యుద్ధముచేయుచు వీర ధర్మము పొందగలను. మరియు అంత్యమున నాబలిదానముతో మాతృయజ్ఞము పరిసమాప్తి నొందగలను”

“కాశీ నుండు తను సైన్యమెంత యుండవచ్చును”

“రమారమి పది యారువేలు”

“ఎందరు హిందూరాజన్యులు తమకు సహాయము చేయగలమని వచన మిచ్చియున్నారు?”

చాల కొద్ది జనులు అని తాంత్యా ఉత్తరమిచ్చి “రామసింహా! ఇప్పుడు నాకొకటి అభిలాష యున్నది. ఏ స్థలమందు మైనాకుమారి దగ్ధము చేయబడెనో, ఆ పవిత్ర స్థలమును ఈ పాపిష్టి నేత్రముల కొకసారి చూపెదవా?” అని అడిగెను.

“అది చాల సమీపమందే యున్నది, నా వెంట రావలసినది” అని నేను ముందు నడవ మొదలు పెట్టితిని. నా వెనువెంటనే తాంత్యావచ్చుచుండెను. అద్యాపి ఆ పవిత్రమైన తమ యొక్క దేహభస్మ మక్కడనే పడియుండెను. తక్షణమే తాంత్యా ఆ స్థలములకు ప్రణామము చేసెను—” ఆహా! మైనా! నేను నీ దగ్గరకు వచ్చెదనని నీతో ప్రతిజ్ఞ జేసి యుంటిని. మైనా! మైనా! నేను వచ్చియున్నాను. నీవు ఈ సమయమువం దెక్కడికి వెళ్ళితివి. అని రోదనము చేయ మొదలు పెట్టెను.

తాంత్యా యొక్క ఆ విషాద స్వరము వినినతోడనే అతను రోదనము జేయుచున్నాడని, నేను కనుగొంటిని; ఎట్టి శిలానిర్మిత హృదయుడైనను, ఆ ప్రసంగమును చూచి ద్రవించకపోవునా! స్మశాన శక్తి కొక పరిమాణము న్నది. గాలి ఆనందముతో ఆ చితి భస్మమును ఇటునటు కదలించుచుండెను. ఆ చితినుండి కొద్ది భస్మమును తాంత్యా తీసికొని తన సంచియందుంచుకొనియెను. “హా! మైనా! మైనా! ఈ సమయమున నీ చితిభస్మమునుండి వేల కొలది మహారాష్ట్ర సన్యాసులుద్భవించవలసి యున్నది. విశ్వమును దగ్ధము చేయు క్రోధానలము నీ చితిజ్వాలలనుండియే వెడలవలసి యున్నది. ప్రతీకారము యొక్క రణగర్జనము వలన, సర్వపృథ్వి కంపాయమానము కావలసియున్నది, స్వదేశము! స్వదేశము! ఇదియే నీవు జయ జయకార రవ ముద్ఘోషించవలసి యున్నది. కాని మైనా, నీవు సజీవముగా దగ్ధమై పోయితివి. లేదు లేదు నీవు దగ్ధము కాలేదు. ఆర్యావర్తము యొక్క స్వాతంత్ర్య మూర్తియే సజీవముగా దగ్ధమై పోయినది. మైనా! నీవు చావలేదు. నిన్నెవరు కాల్పలేదు. స్వాతంత్ర్యము యొక్క పవిత్రాత్మను ఎవరు చంపలేరు నీవమరవు! అమరవు! నీ యొక్క ఈజన్మము కేవల మవస్థాంతరము ఎవరి నేత్రములనుండి జ్యోతి నశించి యున్నదో ఎవరి నేత్రదీప మారిపోయి యున్నదో ఆజడ చక్షులకు ఆచర్మ చక్షులకు ఈ స్థానము చూచుటకు పవిత్రముగా నుండగలదు. మైనా! నీ పవిత్రమైన భస్మమును, ఈ నీ మడైన తాంత్యాస్పృశించుటకు కోపింపకుము. ఎంతవరకీ తాంత్యా పృథ్వియందు, స్వాతంత్ర్యము నిమిత్తము యుద్ధముచేయుచుండునో, అంతవరకు ఈభస్మమును ప్రాణముకన్న శ్రేష్ఠముగా తలంచి దాచగలను. ఏనాడు స్వాతంత్ర్య నిమిత్తము చివర ప్రయత్నము చేయుచుండగా ఈతాంత్యా యొక్క ప్రాణము తాంత్యా టోపీని విడచి పోగలదో ఆ సమయమున నీభస్మము తన మూలాధారమైన జడపృథ్వియందు లీనము కాగలదు.”

ఇట్లు చెప్పి తాంత్యా అచితరూపియైన చిన్నమేరువునకు ప్రదక్షిణము చేసి సాష్టాంగ ప్రణామము జేసెను. తాంత్యా సన్యాసవ్రతము యొక్క ఉద్యాపన మిక్కడనే జేయబడెను.

నేను తాంత్యాతో అంటిని “మహారాజ నానా సాహెబెక్కడ ఉండవచ్చును” దానికి తాంత్యా జగదీశపురము రాజైన అమరసింహుని చిన్నతమ్ముడైన కుమారసింహునితో నేపాళదేశమునకు పోవలెనని నానా నిశ్చయించి యుండెను, అని ఉత్తరమిచ్చెను.

“కోటయందు నానాసాహెబని ఒక మనుష్యుడు పట్టుబడి యుండెను, ఆంగ్లుల మత మతడే నానా యని యున్నది. అది నిజమేనా?” అని నేను విచారించితిని.

"ఏ మనుష్యుడు చిక్కియుండెనో అతడు నానా యొక్క స్వామి నిష్టసేవకుడు. నానా ఆజ్ఞానుసారము; ఆస్వామి భక్తుడు అంగ్లుల స్వాధీనమై యున్నాడు" అని తాంత్యా బదులు చెప్పెను.

నేనడిగితిని 'దీని యందు నానాదేశ మేమయి యుండును' 'నానాను పట్టవలెనని అంగ్లుల వైపునుండి గుప్తచారులు నాలుగువైపుల తిరుగుచున్నారు. వారి తీక్షణ దృష్టినుండి తప్పించుకొని పోవుటకు వీలుకలుగ వలెనని చేసిన ప్రయత్నము' అని అనెను.

చిరవను ఏస్థలమున మైనా దగ్ధమై యుండెనో అస్థలమును తాంత్యా ఒకసారి కాదు, పదిసార్లు కాదు అనేక పర్యాయములు నేత్రములనుండి వెడలు అశ్రుజాలముతో నాచితిని అభిషేకించు చుండెను. ఈస్థితి యంతెంతకాల ముగతించినది. మా తథయులకు గోచరించ లేదు. తుదకు తాంత్యా ఒక దీర్ఘనిశ్వాసమును విడిచి నన్నుజూచి రామ పాలా! నేను నేను నీతో కడసారి సెలవుతీసుకొను చున్నాను,' అని అనెను.

"నేను భిన్నముగా నడగిన నో మరల తిను దర్శనమెప్పుడు కాగలదు."

యుద్ధము సమాప్తమైనపిదప నాకే తను తోకలము కలెనని యిచ్చియున్నది"

"భవిష్యత్తు ఈశ్వర స్వాధీనము" తాంత్యాభిన్నముగా బదులు చెప్పి నాదృష్టి పథమునుండి అంతరించెను.

* * * * *

తదనంతరమున ఎందరు నానా సాహెబు రూపమున బట్టుబడి శూలాగ్రమున వధింపబడిరో, నిజమైన నానా సాహెబు చే జిక్కినో లేదో మరియు తాంత్యాటోపీ యొక్క గతి ఏమిఅయి పోయెనో, ఇతి హాసజ్ఞులైన వాచక వర్గమునకు తెలుపుటనవసరము.

---

చిత్రమయజగత్తు పత్రికనుండి యనువదింప బడినది.

# మానరక్ష

పూడిపెద్ది వేంకట రమణయ్యగారు

(కవితాసమితి)

1

ఆకురాలిన మొడమోడు ప్రాకుజూచి
పాలమిసమిసనామని నన్నెఁ బూయు
మాధవా! నీకు తీఁగవిరామ మున్నె గలదె!
మంజీతానేకవస్తు కరండమైన
నిఖిల భూమండలమునఁ గనిన మొక్క
వెలితియైనను రానీవు విసుపులేక!

* * *

చిన్నవోనిత్తువే? సృష్టి చిత్రశాల.

2

సుడియుఁ బెనుగాలి జోకల యొడుపులేడ
చివురులోవిడుఁ బూవుల చెలువ మేడ
నలుఁగనీయకతత్ప్రసూనములఁ గృష్ణ
వలపు లాలికించి, యందాలఁ జిలుకరించి
తేనెసోనల జారిచి, ప్రియమొసఁగ
ఫలరసాలను వర్షించు ప్రజ్ఞనీది

* * *

చిన్నవోనిత్తువే? సృష్టి చిత్రశాల.

3

కోమలీమణి! ముగ్ధ! సాధ్వీమతల్లి
ద్రౌపదీదేవి! నీపదధ్యాననిరత!
కౌరవులలోన నొంటిపిరి ముగ్నోలె
ధార్తరాష్ట్రుని సభలోనఁ దలఁచునాడు
చీరల రచించి నీమసంచి మనుబోదలు
వడికి లోకాలు నివ్వెర పడియెఁ గృష్ణ!

* * *

చిన్నవోనిత్తువే? సృష్టి చిత్రశాల.







# అమెరికా దేశము—వ్యవసాయము

"కర్షకుఁడు"



సంసారము పరివర్తనశీల. అందుకనే ఒకవస్తువు ఒకేరూపమున సదా యుండజాలదు. సమయానుసారము ప్రతి వస్తువయందు పరివర్తనము జరుగుచుండును. ఏదేశము ఏజాతివ్యక్తులు సమయముయొక్క స్వాభావిక గతియను సరించరో ఆదేశము, ఆసమాజము అధఃపతనమగుట సహజము.

భారత వర్షము వ్యవసాయమునకు పుట్టిల్లు. ఈ దేశపు భూమియందుగల యుత్పత్తిశక్తి యితర భూములందుగలదాయని సంశయము కలుగక మానదు. వ్యవసాయమునకు యోగ్యమగు భూమి భారత వర్షముననున్నంత యితర దేశములందు లేదనుట నిర్వివాదాంశము ప్రకృతి ఇన్ని భారతీయుల కిట్టి సౌకర్యములు సమకూర్చినను వ్యవసాయకులు పట్టెడన్నమునకై మలమల మాడుచుండుట శోచనీయము; తచ్చు సౌకర్యములగల యితరదేశపు వ్యవసాయకుల కష్టములకన్న నెన్నియో రెట్లు లాభముగడించు, దినమునకు ౧౨ గంటలకు విధివిరామము లేక కృషి చేయు భారతీయ వ్యవసాయకులు గడించునది దుఃఖభాజనమైన జీవనము, దారిద్ర్యము.

భారతీయ వ్యవసాయకుల దురవస్థ, దారిద్ర్యమునకు పెక్కు కారణములుగలవు, వీరిలో అవిద్యాగంధము ప్రబలి సుశిక్షితులుగా జేయకుండుట మొదటిది. కొ... ముష్టా రేదియో కొంతభాగము వదిలి మిగిలిన దాని... టికి యజమానత్వము బూనుట రెండవది. బీదదశ ... వించుచున్న వారిపై జాలిగొని వ్యవసాయాభ్యుదయ... నకై గాబోలు కృషీ ఫలితములకన్న దొరతనమువా... భూమిపన్నులు విధించుట మూడవది. గ్రామోద్యో... తమ సౌఖ్య జీవనమగు, దుర్వ్యయము లమాయక... భారతీయ వ్యవసాయకుల పాలుజేయుట నాలుగవది. ...జాభ్యుదయ మార్గదర్శకముగా గొని సత్యమునకై పా... బడు కృషీవలుని గ్రామాధికారులు ముప్పు తిప్పలు ...ట్టు పైదవది. దొరతనమువారు ప్రజాస్థానికనిధి... పన్నురాబట్టుకొని వారికి తగిన సౌకర్యము లేర్పరచకు... ట యారవది. పరపతి సంఘములుగాని, వ్యవసాయ... గాని రైతుకు కావలసిన సాయ మొనర్పక మాన... హాము ఏడవది. సర్వనాశన మొనర్చు సాహుకా... యమపీడ యెనిమిదవది. భారతీయ వ్యవసాయకుని నుని గాసిజేయు యిట్టి కారణము లెన్నియో గలవు.

పాశ్చాత్య దేశములందు వ్యవసాయకులు ... తులగుటచేసి వైజ్ఞానిక పరికరముల సహాయమున ... వృత్తి నిర్వహించుట వలన లక్ష్మీదేవివారి ప్రాపున ... ము గడుపుచున్నది. భారత వర్షమున సుశిక్షితులగు ... వ్యక్తులు లేకనపోవచ్చును. ఉన్నను వారిని యనుసరించి...

గు దరిద్రదేవత వారికిట్టి దుర్బుద్ధి పుట్టించుటచే. అందు వలననే భారతీయులు ప్రాచీన సాంప్రదాయుల

(ہندوستانی پورانے لکیر کے فقیری)

నిపేరు బడసిరి. పాశ్చాత్య దేశములందు విద్య నభ్యసించిన భారతీయులైనను, వైజ్ఞానిక ప్రపంచముతో పరిచయముగల దేశీయులైనను సమస్యపై దృష్టిసారించకుండుట హేయము. దేశీయులు వ్యవసాయము నూతన యవిష్కారము అసహాయమున జరుపు నరకే దరిద్రదశ భారతీయుల విడనాడ జాలదు. దేశము సమృద్ధశాలి కావలెనన్న వ్యవసాయ మీ పరికరములతో జరుపుటత్యావశ్యకము.

వర్తమాన కాలమున భారత వర్షము నావరించిన పరిస్థితులకన్న సుమారు ౩౦౦ ల సంవత్సరములకు పూర్వము అమెరికా దేశము నీచస్థితి యందుండెను. సంయుక్త రాష్ట్రమండలి వర్జీనియా ప్రదేశ మాకాలమున దేశమందంతట వ్యవసాయ యోగ్యమై యుండెను. అనగా దేశమందలి యితర భూములకన్న యీ భూములు మిక్కిలి సారవంతములని తలంచబడుచుండెను. క్రి. శ. ౧౬౧౬ సంవత్సరమున కెప్టెన్ జాన్ స్మిత్తను నాతడా దేశపు వ్యవసాయస్థితి కన్నులకుగట్టునట్లుగా దెలిపియున్నాడు. ప్రస్తుతము మన దేశమునందు వాడబడు నాగలి మాదిరి పరికరముతో వారుపొలముల దున్నుచుండిరి. భూమిని పికాసుతోగాక కర్రతో చేయబడిన వానితో త్రవ్వుచుండిరి. జొన్నలు మున్నగు ధాన్యములు రోకటి బండతో త్రొక్కుచుండిరి. గొడ్డలితో వృక్షము లఛ్ఛేదించు విధము వారికి దెలియనే దెలియకుండెను. క్రమానుగాల్చి వృక్షములు త్రెంచుటవారికి సహజమైయుండెను. వ్యవసాయపు పనులన్నియు చేతితో జేయుచుండిరి.

అమెరికా అధినివేశ దేశము. భిన్నభిన్న దేశములనుండి ప్రజలా దేశమున నివసించిరి. యూరపు దేశీయులు ఆదేశమున వృద్ధి జెందిన కొలది వ్యవసాయమునున్నతస్థితికి దేవలయునని లోకులలో కోరిక మెండయ్యెను. తమ దేశమున జరుగు రీతిని యీ అధినివేశ దేశంబునవ్యవసాయము చేయుటకు వీరు సంకల్పించిరి. ప్రజలంతగా క్రిక్కిరిసి లేనందున వ్యవసాయము జేయు కృషీవలులొక్కొక్కరికి వందల కొలది యెకరముల భూమియైనను లభించుచుండెను. ఇంత భూమిలో ప్రాచీన సాంప్రదాయమనుసరించి చేతితో వ్యవసాయపు పనులు నెరవేర్చిన కాలహరణము జరుగక చక్కగా పనులు నెరవేర్చుయంత్రములు, పరికరములు కనగొనుటకు నుద్యుక్తులైరి.

ప్రప్రథమున యీ దేశమునందొక నీటిశక్తితో నడచు విసురుడు యంత్రము (Water mill) నిర్మింపబడినది. రోజులకు నూర్లకొలది మణుగుల పిండి తయారగుచుండెను. దూరదూరములనుండి ప్రజలు ధాన్యములు విసిరించుకొనుటకు వచ్చుచుండిరి. ఈయంత్రపు యజమానుడు కొలది కాలములోనే మిక్కిలి లాభముపొందుటవలన లోకులు దీని యనుకరణముజేయ మొదలిడిరి. కాలానుసార మీయంత్రములు దేశమునందు సర్వసామాన్యమైపోయెను. నీటిశక్తి (Water force) వలన చలింపజేసిన యీ యంత్రము కొంతకాలము యింజను సాయమున పనులు నెరవేర్చి యిప్పుడిట్టి యంత్రములు వేలకొలది దేశమునందు విద్యుచ్ఛక్తివలన నడుపబడుచున్నవి.

అమెరికా దేశమునందు యధినివేశమొనర్చుకొనిన యూరపు వాసులు గాలిశక్తి (Airforce) తో చలించు పొలములకు నీరుకట్టు యంత్రములు నిర్మించి వ్యవసాయముచేయు మొదలిడిరి. కష్టముగాకుండ కావలసినంత నీరు పొలములకు కట్టబడుచుండెను. నేటికిని యిట్టి యంత్రములచ్చట కానిపించుచున్నవి. ఆధునిక యుగములో యింజనులతో నడుచు యిట్టి యంత్రములు వేల యెకరముల పొలములకు అవసరమున్నంత నీరు గంట కాలములో కట్టుచున్నవి. ఇట్టి రూపముగల మరొక యంత్రమువలన కర్రలు చీల్చుట, ధాన్యములు దంచుట, పండినపంట చెదరకుండ కోయుట, పిండి విసురుట మొదలగు పనులెన్నియో జరుపబడుచున్నవి. వ్యవసాయమునకు సంబంధించిన ప్రతిపనియు యంత్రముల వలననే జరుపబడుచున్నది. తచ్ఛ్రమముతో యధికఫలము బొందు సూత్రము అమెరికనులకీ యంత్రనిర్మాణ విద్య గరపినదనుట నిస్సంశయము.

క్రీ. శ. ౧౮౦౦ల సంవత్సర ప్రాంతమున నీ దేశమున కొన్ని కృషికార్యములు—చెరుకురసము తీయుట, బెల్లము జేయుట మొదలగునవి అశ్వములు, శునకములతో లాగబడు యంత్రములద్వారా జరుపబడుచుండెను. ఈ దేశమునకు దక్షిణభాగమున నివసించియుండు నీగ్రో జాతివారు కొన్ని వ్యవసాయపు కార్యములు నేటికి యిట్టి యంత్రములతో జరుపుచుండుట చూడనగును. కాపుకాచుటకు తప్ప మరొకపనికి యోగ్యములుగావని దలంచబడు శునకములు వ్యవసాయమునకు సహాయకారులను విషయము నూతనముగా దెలియుచున్నది.

క్రీ.శ.౧౮౦౮ప్రాంతమునయీ యంత్రములకన్న ఆవిరితో నడుచు యంత్రములు సులభముగా కార్యములు నెరవేర్చునని దేశీయు లాలోచించిరి. రాబర్టు ఫుల్టన్ (Robert phulton) యనునాతడుఆవిరితో నడుచు నావ (Steam. Boat నొకదానిని చేసి హడ్సన్ నదిపై న్యూ యార్కునుండి అల్బెనివరకు నడిపించుటమున ఆవిరిలోగల చలనశక్తి లోకులకు సుబోధక మయ్యెను. కొంత పరిశ్రమయైన పిదప దేశమునందీశక్తితో నడచు యంత్రములు ప్రాకిపోయినవి. విరివిగా వీనికి సంబంధించిన కర్మాగారములు స్థాపింబడినవి. దేశమునం దంతటను వ్యవసాయపు పనులీయంత్రముల సాయమున జరుపబడుచుండెను. కాలానుసారము కనుగొనబడిన లాభదాయక యంత్రములు ప్రజలు వాడుటమున యంత్రనిర్మాణ విద్యను పోషించుటేకాక వ్యవసాయమునం దెక్కువ లాభము పొందుచుస్వాతంత్ర జీవనమునకు నొకవిధమున మార్గదర్శులైరి. రానురాను విద్యుచ్ఛక్తి వారికికన్న బిడ్డయై ప్రతికార్యము స్వయముగా నెరవేర్చు చుండుట లోకవిదితము

అమెరికాలో కొన్నికొన్ని పెద్దపెద్ద పొలములవద్ద నీటి యూటలు బయలు దేరినవి. ఈ నీటి యూటల నుండి వెడలు ధారలలో విద్యుచ్ఛక్తి కలిగించి దాని మూలమున వ్యవసాయపు పనులేగాక యితరత్రి గృహకార్యములు జరుప వలయునని అభూస్వాములు ఆలోచించుచున్నారు. దీనిలోనుండి యుద్భవింపజేసిన విద్యుచ్ఛక్తి వలన ప్రస్తుతము మాత్రను యొట్ల స్వయముతేక వ్యవసాయపు పనులు నెరవేర్చు యంత్ర మొకటి నడిపింపబడుచున్నది. విధివిరామములేక రేయింబవళ్లు కృషిసంబంధ కార్యములు చేయుచుండును. దరిద్రుని క్షేత్రల గడియ గండ్లు నరీతి రేయింబవళ్లు కష్టపడి సిద్ధపరచిన పైరు తప్పక వీరి యజాగ్రత వలన రోగము కలిగి మరింత [illegible] ము కలుగుచున్నది. కాని ఆదేశము పైరులకు రోగములను మాటయేలేదు. విధినశమున కలుగు సూచనలు [illegible] సూపిన యీ యంత్రము తక్షణ మా మొక్కలను నశి[illegible]కి పొలమును రక్షించును.

దేశమునందెట్టి నూతన భావములు కార్యరూపము దాల్చినను వ్యవసాయక పరికరములలో క్రి. శ. ౧[illegible] వరకు విశేషముగా యున్నతి కలుగలేదు. ఈ దేశ[illegible]వాడు నాగలి మోస్తరు నాగలి వారు వాడుచుండిరి. [illegible] ఆదేశపుకఠిన భూములు వీనితో చక్కగా దున్నబడకను, అకఠినమైన భూములలో యీ బరువు నాగండ్లు [illegible]చుట కష్టతరముగా నుండెను. ఇవి నాయిస్ రా[illegible] నివాసియగు జాన్ డియర్ నూతన విధమగు నాగలి [illegible]తులకు తగినది, తయారుచేసెను. ఇది తేలికగానుం[illegible] జేసి భూమిలో లోతువరకు దిగుచుండెను. చక్కగా [illegible]ములు యీ పరికరముతో దున్నబడుట వలన వీనికి [illegible] ప్రచారము కలిగినది. పదునెనిమిది వర్షముల ప్రయ[illegible] వలన యీ కర్మాగారములో తయారగు యీ [illegible] వేలకొలది విక్రయింపబడుచుండెను. ఇప్పటికిని [illegible] సమానమగు మరొక కర్మాగార మమెరికాయందు [illegible]పింపబడలేదు. ప్రస్తుత మీకర్మాగారము ఇలి నాయిస్ [illegible]ష్ట్రపు మోలిన్ పట్టణమునందు గలదు. దీనిలో [illegible]ది కూలీలు రోజుపని చేయుచున్నారు. అర నిమిషము (౩౦ సెకండ్లు) ఒక నాగలి తయారుచేయ బడును. ప్రతివత్సర మీకర్మాగారమునందు ౧౦ లక్షల మణు[గుల] లోహము, ౫ లక్షల మణుములబొగ్గు, ౧౧ మణు[గుల] వార్నిష్ తైలము, ౨౫ లక్షల అంగుళమాలకొట్టు [illegible] లక్షల గ్యాలనుల నూనె వాడబడుచున్నది. అధిమ[illegible] కర్మాలయమునుండి సంవత్సరములో ౩౦ లక్షల నా[గండ్లు] విక్రయించుటకు తయారగుచున్నవి.

లోకులబుద్ధి వికసించిన కొలది దీని కన్న [illegible] వ్యవసాయ ప్రమాణమునకు తేనలయునని [illegible]

నిశ్చయించిరి. జాక్డియర్ నాగలిలో కొన్ని మార్పులు కలిగించి 'సమూహ నాగలి' (Group plough) యను నూతన విధముగ మరొక నాగలి తయారు కాబడెను. దీనియందు పదునెనిమిది నాగలు లమర్చబడి పైన యంత్రము నడుపు సారథి కూర్చుండుటకు వీలు కల్పింపబడెను. రోజు నాగలివలన ౩౦-౪౦ యెకరముల పొలము చక్కగా దున్నబడుచున్నది. పొలములో గుండ్లు మొదలగునవి యున్న వాటితో డీకొనక పైనుండి వెళ్లిపోవుటకు వీలుగలదు. అవసరమున్న పొలమును వేగము గ ౨ గజములలోతు వరకు దున్నును. ఇది పొలములో పనిచేయునప్పుడు చూచుటకు రైలు ఇంజనువలె కనుబడును. దీనియందు గంటకు ౪౦ మైళ్ల వేగమున్నను సహజముగా ౨౦ మైళ్ల వేగముతో పనిచేయుచుండును.

దున్నిన పొలము సమముగా జేయుట కాదేశమున పూర్వము యిప్పుడీదేశమున నుపయోగించు కఱ్ఱ సాధనముచే వాడబడుచుండెను. నూర్లకొలది యెకరముల భూమి యీ పరికరములతో సమముగా జేయుట వ్యర్థకాలయాపనమని గమనించి అశ్వములతో నడచు లోహసాధన మొకటి తయారుజేయబడెను. ఒక వేపునుండి అశ్వములు లాగుచుండ దీని దంతములు నిక్కిలేచిన పెళ్లలమట్టి జేయును. మరొక వేపునుండి నడిపించిన ప్రక్కలపడిపోవును. ఇటుల పెళ్లలన్ని పగలి భూమి సమమగును. కొంతమార్పుతో మరొకటి యిట్టి యంత్రము కనుగొనబడినది. దీనిలో దంతముల కుమారిరువైపుల చక్రములుండును. చూచుటకిది రోడ్లు బాగుచేయు రోలరుయంత్రము మాదిరి కనుబడును. చక్రదంతములు వాడిగానుండుటచేసి పెళ్లలన్నియు నొకేసారికి పూర్తిగా మట్టియగును. క్రీ. శ. ౧౮౩౧వ సంవత్సరమువరకు యిచ్చటి వరెన పండిన పైరు కొడవలితో కోయబడుచుండెను. కాని యంత్రనిర్మాతలు తగురీతి యంత్రములు కనుగొని వ్యవసాయకుల కెంతో సాయమొనర్చిరి. ఇప్పుడు పంట యంతయు యంత్రముల వలన కోయబడుచున్నది. క్రీ. శ. ౧౮౫౧వ వత్సరమున కోయబడిన ధాన్యపు మొక్కలు దగ్గరికిజేర్చి తీగతో కట్టుయంత్రము సిద్ధము చేయబడినది. ఈకట్టబడిన మోపులు యంత్రముల వలన కళ్లములలో జేర్చబడును మరొక యంత్రము మూలమున కుప్పకొట్టుట, పొట్టునుండి ధాన్యము విడదీయుట, మొదలగు కార్యములు జరిగి గంటకాలములో స్వచ్ఛమైన వేలకొలది పుట్లధాన్యము గరిసెలలో జేర్చబడుచున్నది. మొత్తముమీద ఆదేశమున పొలములో చెట్టుచేమ కొట్టుట మొదలుకొని గరిసెల ధాన్యము నమ్మువరకు పనులన్నియు యంత్రముల వలననే జరుపబడుచున్నవని స్పష్టముగా దెలుపబడి పై విషయములు దెలుపుచున్నవి. ఇవిగాక దేశమునందు యునుకకు నెక్కువయమ్మక ముండుటవలన ధాన్యపు పొట్టును యునుక రూపమున మార్చు యంత్రములనేకములున్నవి.

---

సంయుక్త రాష్ట్రములందు బంగాళదుంప (Potato) పంట విరివిగా గలదు. భూమిలో దుంప అలుకుటమొదలుకొని తయారైన దుంపల భూమినుండి త్రవ్వి శుభ్రపరచువరకు పనులన్నియు యంత్రముచే నెరవేర్చుచున్నవి. కంచెలందలి గడ్డి యంత్రముల వలన కోయబడి మోపులు కట్టబడును. ఈ గడ్డిమోపు లితర దేశముల కెగుమతిచేసి వేలకొలది లాభము గడించువారనేకులు గలరు.

శతవత్సరములు దున్నుకొను యంత్రములకై పస రాని పాట్లుబడు భారతీయులు వ్యవసాయపు యభివృద్ధి గమనించు టత్యవసరము. భారతవర్షమందలి విశ్వవిద్యాలయములన్నియు. ఏవో ఒకటి రెండు తప్ప— దేశీయుల దాస్యశృంఖలములనే మరింత బిగించుచున్నవి. వ్యవసాయపు వృత్తి లాభము గడించునదియేగాక దేశీయులందు స్వాతంత్ర్య జీవనము వృద్ధిజేయుట నిక్కము, పరిస్థితులంబట్టి అమెరికావలె యీ దేశమున వ్యవసాయము సాగజాలకున్నను భూస్వాములు, లక్ష్మీకటాక్షులు ఆస్వాతంత్రము వృద్ధిజేయు విషయములకై ప్రయత్నింపక తగురీతిగా కృషిసలిపిన దేశమున కెంతయో మేలొనర్చినవారగుదురు. పలుపట్టణములందు సుశిక్షితులైన భారతయువకులు కృషీవలుల సమాజములు స్థాపించి అమాయకులైన కృషీవలుల వ్యవసాయరహస్యము తెలిగింపజేసి వారిని సుశిక్షితులజేయుగా యవలయును. దరిద్రమనుభవించుచున్న కృషీవలులు వెలగల పరికరములు దెప్పించుట కశక్తులైనందున నవనవంతులగు భూస్వాములు వానిని దెప్పించి వాటియు

ప్రయోగము కార్యరూపమున ప్రకటింప వలయును. అదే కమంబును వ్యవసాయకునివద్ద వలయు పరికరములన్నియు నుండవు. ఉన్నవారివద్దనైన, కర్మాగారములనుండియైనను యద్దెపై దెచ్చుకొని కార్యములు చక్కబెట్టు కొను చుందురు. ఆ పద్ధతిపైననే యీ దేశమున ధనవంతులైన భూస్వాములు సహకార సంఘములయుములు స్థాపించి తగు రీతిని పరికరముల యద్దెపైనిచ్చుచు వ్యవసాయకులకు నూతన ముత్సాహము కలుగజేయ వలయును. దీని వలన కృషీవలుల కష్టమొకింత తగ్గిపోవును. విద్యాధికులై దేశమునందు తిరుగు యువకులకు స్వాతంత్ర్య కాంక్షాహామంత్రోపదేశము మొనర్చిన వారగుదురు, ధనముగల వారును, యుత్సాహవంతులును, స్వాతంత్ర్యేచ్ఛగల వారును ఈ మొఱగానేకపు కృషీవలుల సంఘీభావముచే కృషిని యాదర్శముగాగొని దేశమును ఫలవంతము జేసి, సాహుకారుల యపుబాధనుండి యమాయక కృషీవలుల తరింప జేయుదురు గాక!



# త్రివర్ణ చిత్రములు.

త్వరపడుడు! ఆలసించిన ప్రతులు చిక్కవు!!

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణుడు | ప్రతి ౧ కి. | వెల | ౦-౧-౦ |
| మేనక | ,, | ,, | ౦-౨-౦ |
| ప్రభావతీ ప్రద్యుమ్నులు | ,, | ,, | ౦-౧-౦ |

రత్నాల కృష్ణాబాయి, శివరాజబహాదురు, మొదలగువారి పటములు ౧ కి ౦-౦-౭

పలువురు కోరినందున పునర్ముద్రితమైనవి.

## సుజాత చందావివరము.

| | | | |
|---|---|---|---|
| రాజపోషకులు | సంవత్సరమునకు | రు. ౫౦ | ఆపైని |
| పోషకులు | ,, | రు. ౨౫ | యనుగ్ర |
| సహాయకులు | ,, | రు. ౧౦ | హాధీనము |
| సాధారణచందాదారులు | ,, | రు. ౩ | ,, |
| ,, | అర్ధసంవత్సరము | రు. ౧ | అ౧౨ |
| విడిపత్రిక వెల | | అ. ౭ | |

ఉత్తర ప్రత్యుత్తరములు, మనియార్డర్లు మొదలగున వన్నియు:— మేనేజరు

సుజాత పత్రిక

త్రూపుభజారు, హైద్రాబాదు, దక్కన్.

చేర పంపవలయును.

ఇండియాగవర్నమెంటువారిచే నియోజితులు

## నేత్ర పరీక్షకులు.



మానవకోటికి నేత్రములు ప్రశంసమగు తృప్తిసాదము. సరియగు నేత్రపరీక్ష లేక అద్దము వాడిన దృష్టికిని, ప్రాణమునకును హానిగలుగును.

మీకండ్లను పరీక్షింపగోరిన మా ప్రవీణుడగు నేత్రపరీక్షకుడు (యూ, యస్, ఎ,) ఉచితముగా పరీక్షించును. ధరలు సరసముగానున్నవి. వచ్చిచూడుడు. ఎట్టిఖర్చులేదు.

ది స్టాండర్డు ఆప్టికల్ కంపెనీ

అర్హ్మ ఆప్టీషియన్సు,

రెయిడ్ బిల్డింగు, అక్సుఫర్డుస్ట్రీటు,

సికింద్రాబాదు.



# ఈరానీ చిత్రకళ

బి. యస్. శర్మ బి.ఏ. గారు

ఈరాని చిత్రకళా చరిత్రము క్రీస్తుకు పూర్వము సుమారు ౩౦౦ ల సంవత్సరములకంటె ప్రాచీన మగుటకు తగిన నిదర్శనములు కనుపించుట లేదు. ఆకాలమునందు పర్షియాదేశము అకెమెనిడ వంశస్థుల పరిపాలనముక్రింద తేజోవంతమై విరాజిల్లుచుండెను. చారిత్రక ప్రసిద్ధి పురుషుడగు „కిరోసా" యీ వంశమునకు మూల పురుషుడు. ఈతని ధైర్య సాహసములు, కళాభిమానములు ఐతిహాసిక విషయములు. ఈతని కాలముననే పర్షియా దేశము భారత వర్షము వరకు విస్తరిల్లి యుండెను. స్థాపత్య కళ (Creative Art) యీతని యాజమాన్యము క్రింద మహోన్నత దశ ననుభవించెను. పర్స పోలిస్ పాడు దిబ్బలు నేటికి ఆనాటి వైభవ చిహ్నములు ప్రదర్శించుచున్నవి.

కాలవశమున యీదేశము అలగ్జాండరువశ లొంగి సెల్యూకస్ వంశస్థుల కాశ్రయ మొసగుటచే వ్యక్తిత్వము నిలుపుకొనిన యీరాని కళ యూనాని (యవన) కళలో లీనమై పోయెను. కాని పార్థియుల ప్రవేశము కళకొక మిశ్రిత రూప మొసగెను. క్రి. శ ౨౨౬ న సాసానిద వంశస్థుల పరిపాలనమునందు తారుమారు జెందిన యీకళ తిరిగి తన ప్రాచీన ప్రత్యేకత్వము నిలుపుకొనెను. చంగేజ్ ఖాన్, సుల్లెఖాన్ మొదలగు ప్రముఖుల దౌర్జన్యములు, వారొనరించిన యత్యాచారములు, భారతీయులకు చిరప్పచితములు. వీరు భరతఖండమును పాడు దిబ్బగా జేయుటకు ప్రయత్నించినను తమ దేశమును సర్వతోముఖముగ అభివృద్ధి జేయుటకు మిగుల కృషి సలిపినటుల చరిత్ర దెలుపుచున్నది. వీరి పోషకత్వము క్రింద కొంత వరకీరాని కళవృద్ధి జెందినది.

ఇస్లాము మతమునందు రెండు ముఖ్యమైన శాఖలు గలవు. ఒకటి సున్నీశాఖ రెండవది షియాశాఖ, ఖురానునందు „విగ్రహములు దయ్యముల కృత్యములు. వీనినుండి దూరముగా నుండుటయే శ్రేయస్కరము" (బుత్ శైతాన్కీయీ జాద్ హై. ఇస్సేహూర్ రహినాతుమ్ ఖుష్ రహో) గేఅనియుండుటయు, హదీస్‌నందు „ఏ ప్రతిమ యైనను చేయకూడదు. సజీవముగాని—మనుష్యుడు, జంతువులు, పుష్పములు, వృక్షములు మొదలగునవి—నిర్జీవములుగాని—దృశ్యములు, కొండలు, నదులు మొదలగునవి—దైవికములుగాని చిత్రింప గూడదని" వ్యాఖ్యానించియుండుటచే సున్నీశాఖవారు తమ దేశమునందే గాక యితర దేశములందు సహితము కళావినాశనమునకు పూనుకొనిరి. రెండవ శాఖవారగు షియావారు ఖురానునందున్నంత మాత్రమున నిది యాచరణీయము కాజాలదు. అది కేవలము వైరాగ్య దశయందు అనుచరణీయము కాని ప్రపంచముతో సంబంధము గలవారికి నాగరకత న్యాయములను దృష్టి పథమునందుంచ వలయును. శా

నాగరత, నైపుణ్యము దెలుపు చిహ్నములు నశింప జేయుట జాతిని నశింప జేయుటయే' యని వీరి విశ్వాసమైనం దున శక్తి కొలది యీ శాఖవారు కళాభివృద్ధికై పాటుబడినటుల వర్తమాన కాలమునందు లభించిన చిత్రములు దెలుపుచున్నవి. ౧౩ వ శతాబ్దమునకు తర్వాత ఈ రాని దేశము షియా రాజులచే పరిపాలింపబడుటచే యీ చిత్రములు వీరి కళాభిమానము స్పష్టపరచు చున్నది.

మహమ్మదీయుల స్వదేశమగు అరేబియా దేశమునందు సున్నీ శాఖవారు ప్రబలులై యుండుటచే గాబోలు ఖురాను వాక్యము పూర్తిగా కావ్య రూపము దాల్చినది. చిత్రకారుల జీవితములు లభించినను చిత్రములు మాత్రము హస్తగతము కాలేదు. బఖిషిచే వ్రాయబడిన 'అరేబియా చిత్రకారుల జీవితము' అను గ్రంథమునందు సహితము కనుపించుట లేదు. బఖిషి తన గ్రంథమునకు యవతారిక వ్రాయుచు "నమ్మదగినది యొక చిత్రము లభించుట లేదు. కళాభిరుచియొక్క ఫలితములగు చిత్రములన్నియు నాశన మొనర్పబడినవని" శోకించి యుండుట విదితము. ఇట్టితరి అనాగరకస్తులగు మంగోలియనులు, తమ పూర్వమతము, నూతనముగ స్వీకరించిన ఇస్లాము మత నియమముల గర్హించి యీరాని గ్రంథములలో గల చిత్రముల దిలకించి అట్టి కళను అభివృద్ధి జేయుటయే తమ విధియని దృఢపడి కృషిజేయ మొదలిడిరి. కొంతవరకు పర్షియా దేశమును తమ స్వదేశముగా జేసుకొనిరి. కళా ప్రియులగు చీనా వారితో గల సంబంధమే యీ సమద్యమునకు వీరిని ప్రోత్సహించి యుండును. క్రి. శ ౧౪ వ శతాబ్దపు మంగోలు దర్బారు చిత్రములందు చీనా కళా చిహ్నములు దృశ్యమగు చున్నవి. క్రమక్రమముగా అబుల్ ఘాజి కమాలోద్దీన్, సుల్తాన్ హుసేన్ ఇబ్నె మన్సూర్ ఇబ్నె తైకాను కాలములో యీకళ వృద్ధిబొంది చివరకు ౧౬ వ శతాబ్దమున వికసించినటుల రిజా, అబ్బాసి, మొదలగు వారి చిత్రములు పూర్తిగా దెలుపుచున్నవి.

ఈ సుల్తాన్ గొప్ప రసికుడు. విద్యాప్రియుడు. సుగుణమూర్తి ప్రౌఢముగ కవిత్వము చెప్పగల శక్తిమంతుడు. వాఙ్మయమునం దమితాభిలాషియగుట చేతను రచించిన "మజాలిస అల్ అష్ఖ్" (భక్తుల జీవితము) యను గ్రంథము ప్రబలనిదర్శనము. ఇది జామి "నఫ్హత్ అవానస్" యను ముత్కృష్ట గ్రంథముతో పోల్చదగినదని కొందరి యభిప్రాయము. ఈ కళాప్రియుడు విక్రమాదిత్యునివలె తన రాజ దర్బారునందు వెందరినో విద్వాంసుల సమకూర్చెను. ప్రసిద్ధిజెందిన చిత్రకారులకు పోషించినటుల యీతని గ్రంథ రాజము దెలుపుచున్నది. ఈ గ్రంథమునే గాక జామి గ్రంథము కూడ సుందరమగు చిత్రములతో వ్రాయించి యుంచినటుల గలదు. ... తీయు పోషకులు వృద్ధిజెందుటను గాదు యీ చక్రవర్తి మంతయు నీటి ప్రవాహమువలె నిష్పక్షికముగా ... పరచినటుల నిదర్శనములు గలవు.

పూర్వము నుండి నేటివరకు భరత ఖండము ... కలహముల కొటపట్టు. హిందువుల యంతఃకలహములు మహమ్మదీయులకు తావొసగినవి హిందూ మహమ్మదీయ జగడములు ఆంగ్లేయుల భద్రపరచినవి— పరచుచున్నవి. బాబరు చక్రవర్తి సమయానుకూలముగా ... మాత యాశ్రయమును సంపాదించుటకై వచ్చినప్పుడు యీతని గ్రంథములు, సంగ్రహములు తన వెంటనే తీసుకొనివచ్చెను. భారతీయుల దౌర్భాగ్యవశమున యీ అమూల్య గ్రంథ రాజములు యీతని పుత్రుని ప్రయాణమైన ... మిగిలిన గ్రంథ రత్నములు సోమరితనము వలన నశించెను.

షాజహాన్, ఔరంగజేబు చక్రవర్తుల ... చేత గ్రంథ సంపాదనము మిక్కిలి ప్రీతికరముగా ... డెను. షాజహాన్ చక్రవర్తికి క్రీ. శ. ౧౬... సంవత్సరమున "సుల్తానలీ అలమ్ షాహ" యొక్క గ్రంథరాజమొకటి లభించినది. ఆ గ్రంథమును తన గ్రంథమున జేర్చుచు దానిపై నిటుల లిఖించెను:—

"బిస్మిల్లా రహిమాన్ రహీమ్. బతారీఖు పంచమ్ మా హె బహమన్ ఫొరసిము తాబిఖ్ హస్రత్ ... ఖార్ జమార్ అల్మాని హసన్ ౧౦౩౪ హిజిరి ... జెజుహాసెదు భావకస్త్. రాఖిల్ కితాబ్ ఖానే ... యాజ్ఞాంద్ దర్గా హెషున్. షాహబొద్దీన్ మహ... న్ షాహజహాన్ బాన్ షాహ ఇబ్నెజహాంగీర్ బా...

ఇబ్నె అక్బర్ బాద్‌షాహ సఖీముక్ ఎకొహజార్ పన్సద్ రూప్య"

అనగా „పరమాత్ముని పేరున కృపాళు, దయానిధి. ఫారసి నెల బహమన్ ౨౫వ తేదికి సరియగు 8వ జమాద్ ౧౦౩౪ హిజిరి రాజ్యాభిషేక సంవత్సరము జయమగు గాక! నా గ్రంథాలయమునందీ గ్రంథము చేర్చబడినది. సనాతనము షాహబొద్దీన్ మహమ్మద్ షాహజహాన్ చక్రవర్తి కుమారుడు జహంగీరు చక్రవర్తి కుమారుడు అక్బరు చక్రవర్తి" యని యర్థమగును.

భారత వర్షము మొగలు ఛత్రము క్రింద కాలము గడుపు దినములలో ఈరాని కళయందు భారతీయ చిహ్నములు మొలకలెత్త ప్రారంభించెను. ఈ రెండు దేశముల సభ్యతులలో యంతగా భేదము లేకుండుటచేత యీ కళయొక్క నూతన పరివర్తనము త్వరలో అనాయాసముగా వృద్ధిగాంచ గలిగెను. ఆ కాలమున మహమ్మదీయులను హిందూ మతముపై పూర్తిగా నమ్మకము గలిగియున్నను తమ మతమును విసర్జింపక „సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" యను చరణమునైన మెలగుచు హిందూ మతమున శుద్ధిసంస్కార క్రియలు ప్రబలనందున „యథా నద్యః స్యన్దమానాస్సముద్రే అస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ" యను సూత్రమును నవలంబించుచుండిరి. ఖుసురో, రహీమ్ మొదలగు భారతీయ మహమ్మదీయులు ఈరానునకేగి అచ్చట కళకొక నూతన రూపమేర్పరచిరి. ఈరాని కళయందు మహమూదు యను వాడు భారతీయ కళానైపుణ్యమును, బహాలూలను వాడు కాశ్మీరపు నడక మొదలగు నూతన పోకడలను స్థిరముగా నేర్పరచిరి. రాను రాను భారతీయ సాంప్రదాయము ఈరాని కళ యనుసరించెను. ఏం. పర్మసింహవర్మ యభిప్రాయానుసారము „ఖుసురో" మతమున మహమ్మదీయుడైనను అంతస్సునందు మాత్రము శుద్ధ హిందువే యని యతని క్రియలు దెలుపుచున్నవి. ఈరాను నందితనికి మిక్కిలి గౌరవము కలిగియుండెను. ఈతని ప్రభావము చేతనే ఈరాను కళాకన్య నూతనవసన ధారిణియయ్యెను. బహార్ మొదలగు చిత్రకారులు బయలు వెడలి తమ కళా కౌశలత్వము ప్రపంచమున ప్రకటించిరి.

వీరి చిత్రించిన చిత్రములు భారతీయ చిత్రముల ప్రతిబింబములనుటకెట్టి సందేహము లేదు. ఈతడు చిత్రించిన „ఆదమ్‌హవ్వాల' చిత్రము పూర్తిగా రాధాకృష్ణుల చిత్రములను ప్రతియనవచ్చును. మైకర్ మధుసూదన దత్తుగారి „వ్రజాంగన' యను గ్రంథము జదివిన కొందరు వైష్ణవాగ్రేసరులు గ్రంథకర్త కేవలము పరవైష్ణవుడని భ్రమజెందిన కలకత్తాను దర్శనార్థము వచ్చినటుల వీరి చిత్రములు కేవలము రాధాకృష్ణులని భారతీయులు యపోహపాలగుట వింతగాదు. ఈతడు నిజముగా ఈరానీయుడా యను సందేహము కొందరిని బాధించుచున్నది. ఏ మత సాంప్రదాయకుడైనను మనస్సునందు మాత్రము హిందూ దేవతల యారాధనము సంపూర్ణము గాగలదనుట నిశ్చయము. „ఈ వ్యాస సాధు' యను మరొక చిత్రమీతనిది కలదు. ఇదియు భారతీయుల యాదర్శమునే ప్రకటించుచున్నది

పై విషయములనుబట్టి ఈరాని కళను రెండు భాగములలో విభజింపవచ్చును. ౧. స్వచ్ఛమగు ఈరాని కళ. అనగా యితర దేశముల కళలతో మిళితము గాక స్వతంత్రముగ వృద్ధిజెందిన దేశీయ కళ. రెండవది మిశ్రిత కళ. కొంతకాలము మంగోలీయుల కళా చిహ్నములు దీనిలో వికసించినను తుదకు నశించినవి. భారతీయ పోకడలు మిక్కుటమై ఈ చిత్రకళలో మార్పుగలిగించినవి. నేటికిని యిదే స్థితి గలదు. దీనికి „భారతీయ యీరాని కళ" యనిన మిగుల సమంజసముగా నుండును. ఈ రెండవ భాగమునే భారతీయులు „మొగలుకళ" యని వ్యవహరించుచున్నారు.

షియాశాఖవారు ఈరానునందు తమ నివాసమేర్పరచుకొనకుండిన కళ పూర్తిగా నశించియుండెడిది. సున్నీ శాఖవారు చిత్రకళను గర్హితత్వముగ వీరి మూలముననే బహుకాలమువరకు యీ కళ దేశమునందు వృద్ధిజెందక నిలిచిపోయినది. దేశ సుకృతమో యన షియావారి సంఖ్య దేశమునందు వృద్ధిగా జొచ్చెను. ఇస్లాము మతమునందీ శాఖ కలుగకుండిన మహమ్మదీయులకు, చిత్రకళకు భూమ్యాకాశ భేదముండెడిది. మహమ్మదీయ జాతిచరిత్రను నిష్కళంకముగా నొనర్చిన షియాశాఖవారే నమస్యులు.







# ప్రజాభివృద్ధి—జీవనాధారములు

కే. రాములుగారు

ఏ దేశమందైనను, ఏ కాలమందైనను, ప్రజాభివృద్ధికిని, జీవ నాధారములకును పరస్పర సంబంధ ముండి తీరినది. ప్రజాభి వృద్ధినిబట్టి, జీవ నాధారములు లేనియెడల, క్షామ దేవత యవతరించుట సిద్ధము. రానురాను మృత్యు దేవతగ బరిణమించు ఈ క్షామదేవతకు బలి యగుటకన్న, సాంఘిక ధర్మములకు బద్ధులమై, ప్రజావృద్ధిని తగ్గించుకొనుట యుక్తమని కొంద రార్థిక శాస్త్రజ్ఞు లభిప్రాయ మిచ్చియున్నారు. కొంతవఱకు, యుద్ధములు, క్షామము, జాడ్యములు, అప్పుడప్పుడు పొడసూపి, ప్రజా క్షయమునకు గారణమగుట మన మేలుకొరకనియే తలచవలయును. దీనినే భారతీయులమగు మనము భగవత్సంకల్పమని నమ్మెదము. ఏదెట్లున్నను, జీవ నాధారములు లేని ఆ దేశములందు, ప్రజావృద్ధి పరిమితి దాటగూడదనుట సత్యపూరితము. ఇక జీవన సౌకర్యములుగల తావులందు, ప్రజావృద్ధి యొకింత పరిమితి దాటినను, భయముండదు. ఐరోపా మున్నగు ఖండాంతరములలో, ప్రజావృద్ధి పరిమితికి వచ్చినను, పరిశ్రమాభివృద్ధి తృప్తి కరముగ నుండు కారణమున, నెక్కువ యిబ్బందులకు వీలు లేకున్నది. రెండవ కారణమేమన, స్వపరి పాలనానుకూలములు వారికి సంపూర్ణముగ నుండుటవలన, జీవ యాత్రకు సరిపోగా, మిగిలిన పంటనుర్వి నియోగ మగుటలేదు.

ఈ ప్రమాణము ప్రకారము, ఇండియాయొక్క పరిస్థితుల విచారించితిమేని. అవి తదితర దేశములకన్న భిన్నమై యున్నట్లు తెలియుచున్నది. ఇండియా దేశము ముఖ్యముగ, వ్యవసాయ దేశము కావున నీ దేశపు జీవితావసరములన్నియు, వ్యవసాయము మూలముననే తీ[illegible] గానవలసి యున్నవి. దైనం దినాభివృద్ధి నొందు[illegible] నిచ్చటి ప్రజల కాపాడ వలయునన్న, వ్యవసాయ[illegible] మున నే. తిను బండములు విస్తారముగ నుండవలయు[illegible] యూరోపు ఖండపు పరిశ్రమాభివృద్ధితో బోల్చి[illegible] నయెడల, ప్రస్తుతము ఇండియా దేశపు పరిశ్రమలు[illegible] ఇండియా పరిశ్రామికముగ సంపూర్ణాభివృద్ధిని [illegible] రాష్ట్రేతరపు తినుబండములపై తన యధికారము[illegible] యించ వలయునన్న మొదలు తన పంటలవలన [illegible] నెట్లు కాపాడగలదో యను సమస్యను విడదీసి [illegible] యును. కావున, మనము ఇండియా దేశమున పండు[illegible] ఇచ్చటి ప్రజాసంఖ్య, మున్నగు లెక్కలను బరిశీలి[illegible] గాక. 1921 సంవత్సరపు జనాభా లెక్కల ప్రకా[illegible] ఇండియాలో:—

99,832,096=పదియైను సంవత్సరముల వయస్సు [illegible] పురు[illegible]

94, 657, 077 ,, ,, స్త్రీ[illegible]

124, 453, 307 ,, లోపుగ బా[illegible]

కలరు కావున, ప్రతిదినము ఒక్క మనుష్యునకు 2 [illegible] ధాన్యముచొప్పున, అవసరమగు మొత్తము...33[illegible] టన్[illegible]

ప్రతిదినము, ఒక స్త్రీకి 1¾ పౌండ్ల చొ॥ ,, 27044[illegible]

,, ఒక శిశువుకు, 1 ,, ,, ,, 2074[illegible]

మొత్తము 81,064,462 టన్[illegible]

గడచిన 22 సంవత్సరముల సగటు ధాన్య [illegible] మిలియను టన్నులలెక్క న ( 10 లక్షలు=ఒక మి[illegible]

| | | | | |
|---|---|---|---|---|
| బియ్యము | 32·3 | దీనిలో | 2·2 | ఎగుమతి |
| గోధుమలు | 8·7 | ,, | 1·3 | ,, |
| బార్లీ(యవలు) | 3·3 | | | |
| జొన్నలు | 7·2 | | | |
| సజ్జలు | 3·5 | | | |
| రాగులు | 3·2 | | 1·0 | ,, |
| మక్క | 2·5 | | | |
| శనిగలు | 4·8 | | | |
| ఇతరములు | 10.5 | | | |
| మొత్తము | 760 | | 4.5 | [76·0—4·5] 71.5 |

ఈ లెక్కల ప్రకారము, ఇండియాలో సంవత్సరము పేరట 71·5 మిల్యనులు అనగా 7 కోట్ల 15 లక్షల టన్నుల ధాన్యము పండుచున్నది. కాని దీనిలో,

| | | |
|---|---|---|
| నూటికి పది యవవంతు మర్వ్యయము, చెత్త, త్రొక్కుడుక్రింద—అనగా | 7·6 | మిల్యనులు |
| పశువుల ఆహారముక్రింద | 12·2 | ,, |
| విత్తనములక్రింద | 2·0 | ,, |
| ఎగుమతిక్రింద | 4·5 | ,, |
| మొత్తము | 26.3 | |

అనగా సంవత్సరమునకు, ఇండియా దేశమునకు కావలసిన 8 కోట్ల 10 లక్షల టన్నుల ధాన్యమునకు బదులు [76·0—26·3] =49·7 లేక 4 కోట్ల 97 లక్షల ధాన్యము మాత్రమే లభించుచున్నది, కావలసిన దానికన్న నూటికి దాదాపు 38·7 ధాన్యము తక్కువపండుచున్నది. కావున, ఇండియాలో ప్రజలకు తినుటకు ఆహారము సరిగ లభించుటలేదని తేలుచున్నది. దీనినిబట్టి ప్రతి మూడు ప్రాణులలో నొక్కప్రాణి తప్పక నుపవాస వ్రతము సలుపుచున్న దనియో, లేక ఒక్కప్రాణికి గావలసిన ప్రతి మూడుసారుల ఆహారముకుండి ఒక్కసారి భోజనము మాత్రమే లభించు చున్నదనియో, చెప్పవలసి యుండును.

కడుపునిండ తిండిలేక, ఒకప్రక్క మాడుచున్న భారతీయుల శారీరకస్థితి యెట్లుండునో ఈ సందర్భమున మనము యూహింపవలసి యున్నది. మొత్తముమీద, ఇండియా దేశస్థుల దురదృష్టమునకు మేరలేదు. ఇతరావసరములమాట అటుండనిండు, ప్రభుత్వమువారు బాటలబాగుచేయించుట, ఆసుపత్రుల నిర్మించుట, మునిసిపాలిటీ యేర్పాటుల గావించుట, మున్నగు మహోపకారముల జేయు చున్నారనుట నిక్కువమే కాని, కడుపునిండ తిండి, ఒంటినిండ బట్టలేని భారతీయుల దురదృష్టమున కెవ్వరు జవాబుదారులు? ఈ విషయమై, ఇండియాయొక్క స్థితిగతులను బాగుగ గుర్తెరింగి, తదభివృద్ధికై పాటుపడుచున్న యభిమానుల యభిప్రాయములగూడ మనము తెలిసికొనుట అవసరము. న్యూయార్కు పట్టణమందుండిన, ఇండియా పరిస్థితు లందెక్కువ యభిమానము చూపుచున్న Dr. Sunderland (సండర్ ల్యాండ్) గారు తన India America and Brotherhood యను గ్రంధమం దిట్లు వ్రాసియున్నారు:—

,,ఇండియాలో క్షామములు శాశ్వతములై పోయినవి. వర్షములు పుష్కలముగ గురిసినను, పైరుపంటలు సక్రమముగ నున్నను, ఏదోయొక ప్రాంతమున క్షామముండియే తీరును. ఇక ప్లేగు ఇన్ఫ్లుయంజా మున్నగు జాడ్యములు ప్రబలి యున్నప్పుడు యావజ్జీవనోప వాసములభయంకర మృత్యువునకు గారణ మగుచున్నవి''

అసాము చీఫు కమిష్నరగు ,సర్ చార్లెసు ఎల్యటు' ఇట్లభిప్రాయ మిచ్చియున్నాడు:—

,,ఇండియాలో సంవత్సరము యొక్కతుది ఆరు నెలలు, 'కడుపునిండ తిండి' (Full meal) యన్న నేమో అర్థకర్షక ప్రపంచమునకు దెలియదు.''

ఇక ప్రజా దురవస్థకు ప్రభుత్వమెట్లు జవాబుదారియై యుండునో జాన్ బ్రైటు ఇట్లు విశదీకరించి యున్నాడు:—

,,ఏదేశమందైనను, భూములు వివిధ సస్యముల బండింప నంతటి సారవంతములైనను ప్రజ, దురవస్థకు బాలై, అష్ట కష్టముల ననుభవించు చున్నప్పుడు, ఆదేశపు ప్రభుత్వ మందేదో లోపమున్నదని తలంచుట కవకాశమున్నది.''

సేద్యము చేసినచో, ఆహార పదార్థముల నిప్పటికన్న నెక్కువగ బండించి, ప్రజా సంరక్షణకు గారణమగునట్టి సారవంతమగు భూమి యెంతెంతో గలదని ప్రభుత్వము లెక్కల ప్రకారము తెలియుచున్నది. ఈ క్రింది

౧౯౨౧-౧౯౨౨ సంవత్సరపు లెక్కలీ సందర్భమున గమనింపదగి యున్నవి:—

౧౯౨౧-౧౯౨౨ లో జేయబడిన కొలత ప్రకారము ౬౦౬,౬౧౯,౦౦౦ ఎకరములు.

౧౯౨౧-౧౯౨౨ పల్లెటూళ్ల కాగిత పత్రముల దాఖలా ౬౬౩,౫౦౭,౦౦౦ ఎకరములు

౧౯౨౧-౧౯౨౨ అటవీ ప్రదేశములవలన మరుగుపడి యున్నభూమి. ౮౫,౪౧౯,౦౦౦ ఎకరములు

సేద్యమునకు యోగ్యమై నిరుపయోగకారిగ నున్న భూమి, ౧౫౧,౧౪౩,౦౦౦ ఎకరములు సేద్యమునకు లభింపని భూమి ౧౫౩,౧౪౭,౦౦౦ ఎకరములు.

పడావా భూములు ౫౦,౫౫౪,౦౦౦ ఎకరములు

విత్తనములు నాటబడిన భూమి. (Area Sown) ౨౬౩,౧౭౪,౦౦౦ ఎకరములు

సిస్తు చేయబడిన మాగానిభూములు (Area Irrigated) ౪౪,౪౯౦,౨౦౦ ఎకరములు

ఆహారపదార్థ సంబంధమగు పంటలక్రింద సేద్యము చేయబడిన భూమి (Area under food crops) ౨౧౫,౫౦౭,౦౦౦ ఎకరములు.

వర్తక సంబంధమగు పంటలక్రింద సేద్యముచేయబడినభూమి (Area under commercial crosp) ౪౦,౪౩౧,౦౦౧, ఎకరములు.

ఈ సంఖ్యలబట్టి, ఇండియాలో వ్యవసాయమునకు లభించు భూమి మొత్తముపైన, మూడవ వంతే సేద్యము చేయబడుచున్నదని తెలుచున్నది. అడవులవలననేమి, లేక రోడ్లు, రేల్వే, నదుల, వలననేమి, సేద్యమునకు లభింపని భూమిని వదలినను, మరియంతభూమి తిరిగి సేద్యమునకు లభించు అవకాశముగలదు. రికార్డియను సూత్రము (Recordian Theory) ప్రకారము, ఈ యెక్కువ) భూమివలన ప్రస్తుతము సేద్యమగుచున్న భూమియొక్క 2/3వ భాగము పంటబండుననుకొందము. అట్లయిన, పైజెప్పబడినట్లు మొత్తము పంటయగు ౪౬.౧ మిల్యను టన్నులయొక్క 2/3వ భాగము ౩౦.౬ మిల్యను టన్నుల తిరిగి, ఇదివరకు ముందు జెప్పబడిన ౨౬.౩ మిలియను టన్నులయొక్క 2/3 వ భాగము సుర్వ్యము (పశువుల మేత) ఎగుమతి, మున్నగు వానిక్రింద తీసివేసినను. ౩౭.౮ మిల్యను ధాన్యము మిగిలియుండును. అనగా ౪౯.౪+౩౭.౮ మొత్తము ౮౭.౫౦ టన్నుల ధాన్యము లభ్యమగును. ఇండియాకు గావలసినది గూడనింతయే. ఈతీరున ఇండియా, యొక్క ప్రస్తుతపు జనసంఖ్యకు గావలసినంత, ధాన్యమును, తాను అనాయాసముగ బండించు కొన గలదు. కాని, జనసంఖ్య ఈ పరిమితిని దాటినప్పుడేమి గతి? ఈసంఖ్య పెరగకమానదుకదా! అప్పుడు మనము జనసంఖ్యను తగ్గించుటకై Law of Diminishing Returns ను అమలులో బెట్టవలసియుండును. ... రు పంటల సమస్య యెంత విడదీయ బడినను, జనపరి... సమస్య మాత్రమట్లే నిలిచియుండును. Sir James Caird తెక్కిన ౩౧వ అక్టోబరు ౧౮౭౯ నివేదిక ఇండియా స్థితిగతుల గురించి యిట్లవ్రాసి యున్నారు.

"వ్యవసాయవిషయమై కానుకూలములు తగ్గి ... భివృద్ధితగ్గవలయును........"

ఇట్టితరి నీసమస్య యెట్లు పరిష్కరింపబడవలయును?

దీనికి మూడు విషయములు గలవు. ఈ మూడింటిపైననే దీని పరిష్కారమాధారపడి యున్నది. మొదటిది భారతీయులమగు మనము తమ సంతతిని పెరగకుండ [Birth Control] జేయునట్లు చూడవలయును. కాని మనము మత ధర్మమువలన విపరీతముగ బంధింపబడినారము. ఇంతటి దుస్థిత మరెచ్చటను లేదు. రెండవ విషయము ఆర్థిక స్థితి జక్క బెట్టుకొనుటకు స్వపరిపాలనమే పరమ సాధనము. తాను స్వయముగా నుపవాసము సలుపుచు, తన పైరు పంటలవలన విదేశీయుల పొట్ట పిండి శ్రమాభివృద్ధికి భంగము గలుగకుండుటకు ఖండమునకు తగినంత స్వాతంత్ర్యము గావలసి యున్నది. మూడవ విషయము వలస బోవుట వలనగూడ ప్రజాసంఖ్య తగ్గుచున్నది. కాని, యీ యలవాట శ్వేతజాతి శ్వేతా స్ట్రేలియనుల పద్ధతి ననుసరించి కాగూడదు. మానవకోటి యంతయు నొక్కటే యనియు, విశేషితలేక, తను బలదములు విభజన పట్ల మానవులకు సమానమగు హక్కు గలదను విషయమును గ్రహింపజాలకున్నారు.

నిక్కముగ, రాజ్యాంగముకన్న మానవ వ్యాపార సమస్యలే యెక్కువ ప్రాముఖ్యత గలదియై యున్నది. ఏలన మానవ విముక్తికిదియే మూలాధారము యు, ఏప్రభుత్వము కష్టజీవులగు తన ప్రజలయొక్క తనయును బారదోలుటకు శ్రద్ధ వహింపదో ఆ ప్రభుత్వమునకు, నాగరక ప్రభుత్వ మనబడుటకు అర్హతలేదు. భారతీయుల ఆర్థిక సమస్య నేడొక భయంకరమగు ప్రాణాంతక సమస్యగ బరిణమించుచున్నది కాని మరదృష్టవశమున, భరతఖండమున జాతీయ నాయకుల దృష్టి రాజ్యాంగమువైపే మరలి యున్నది. వారు ఆర్థికసమస్యల నెదుర్కొన ప్రయత్నించెదరు గాక!

(అనువాదము)




ఎం. ఆర్. కె. శాస్త్రిగారు

౧

'నాయినా ప్రకాశం! తీరా ఇంతదూరం వచ్చిన తరువాత ఇప్పుడు కార్యం ఆభాసచేసి నన్ను నలుగురిలో తలఎత్తుకుని తిరిగేందుకు వీలు లేకుండా చేస్తావురా?

పిల్లకేం, కన్నువంకరా? కాలువంకరా? బంగారు తల్లిలా గాఉంది చక్కగా చదువుకున్నది. దాన్ని వదిలిపెట్టి ఎక్కడో కొండమీది కోతికావాలని కూర్చుంటే ఎట్లాగురా?—లేచికూర్చో, మా నాయినకదూ, చెప్పినమాట వినవూ!—

'చూడు నాన్నా, నేననేదొకటి నీవు చెప్పేదొకటి. రాజేశ్వరి చక్కనిదే కావచ్చు, బాగా చదువుకున్నదే అయిఉండవచ్చు: కాని నాకు యిష్టంలేని సంబంధం చేయడం ఎందుకూ? మేనమామ కూతురైతే చేసుకు తీరాలని ఎక్కడన్నా రాసిపెట్టిఉందా?— నాకు తెలుసులే. అమ్మకు కోపంవస్తుందని జడుస్తున్నావు. నేను ఆమెతో చెప్పి ఒప్పిస్తానుకదూ!'

'ఇంకా ఇప్పుడు ఒప్పుకునేదేమిటిరా, రేపురాత్రికే లగ్నమయితే—'

'అయితేనేం?'—

అని ప్రకాశం లేచిలోపలికి వెళ్ళిపోయినాడు. రాఘవయ్యగారు సణుగుకుంటూ వచ్చివీధి అరుగుమీద కూర్చున్నాడు.

లేక లేక ఎంతో కాలానికి కలగడంవల్లా, ఆడపిల్లలందరికన్నా కడసారి వాడవడంచేత, ప్రకాశం ఎంతో గారాబంగా పెరిగాడు చిన్నప్పటినుండీ. రాఘవయ్యగారు అగ్రహారీకుడు. చుట్టుపక్కల పాతిక గ్రామాలకల్లా మోతెబరి అసామి. కొడుకంటే తగని ప్రాణం; చిన్నప్పటినుండీ కూడా, కాలుక్రింద పెట్టనియకుండా పెంచాడు, పెద్దవాడయి, చదువుకు చెన్నపట్నం వెళ్లినప్పుడు కూడా, వంటరిగా పంపడానికి యిష్టములేకనూ, అదీగాకుండా, వేళకు భోజన వసతి ఉండదేమోనని, తనభార్యని పిల్లల్నీకూడా అతని వెంట నేపంపి, ఆనాలు గేళ్లూ తానే స్వయంపాకము చేసుకుంటూండేవాడు. ప్రకాశం పరీక్షలన్నీ ప్యాసయి యింటికి వచ్చిన తరువాతకూడా చిన్నప్పుడంత గారాబమూ, చేస్తూండేవాడు.

రాఘవయ్యగారు తమా షామనిషి. పూర్వాచారపరాయణుడై బిళ్లగోచీ, పిలకా వదిలిపెట్టలేక పోయినా, ఊహాలు, ఉద్దేశాలూ, అన్నీ యీకాలానివే, ఆయిన చర్యలు చూస్తే, ఆయినయందు విపరీతమైన భక్తీ గౌరవం ఉన్నవాళ్లకే నవ్వు వచ్చేది. కొందరు పిచ్చివాడనుకునే వాళ్లు.

ఒకనాడు ఆయిన భార్యకి వంట్లో జబ్బుచేసి, కూరలూ అవీ లేకుండా అన్నంమాత్రం వండి ఊరికున్నదట. రాఘవయ్యగారికి, ఉత్త అన్నం భగవంతుడికి నివేదనచేయడానికి యిష్టంలేక, ఆనాటినుంచీ, భగవంతుడి భోజనానికీ, కాఫీహోటలుకూ అయ్యేఖర్చు దిబ్బెనలో వేస్తూ ఏడాదికొకసారి ఆ మొత్తంతో సమారాధనచేస్తూండేవాడు. ఆయిన కొడుకే, ఆయినంతవాడే ప్రకాశం;

రాజేశ్వరి రాఘవయ్యగారి బావమరది కూతురు. అంతగా కలిగిన సంసారం కాకపోవడంచేత నగానాణా లూ పెట్టలేక పోయినా, ఎలాగో కష్టపడి చక్కగా చదువుమట్టుకు చెప్పించాడు తండ్రి. పిల్లచక్కనిదీ, మంచి సాంప్రదాయములోనిది. అని ఎందరో సంపన్న గృహస్థులు, తమ కోడల్నిగా చేసుకుందామని చూసినా రాఘవయ్యగారి భార్యపట్టుబట్టి, ప్రకాశానికి యిస్తే నే కాని వీలులేదని కూర్చున్నది.

రాజేశ్వరితండ్రికి ప్రకాశం ఒప్పుకోడని తెలిసినా చెల్లెలు పట్టుదలమీద ఒప్పుకున్నాడు. వివాహానికయ్యే సొమ్మంతరాఘవయ్యగారే పెట్టడానికి సిద్ధపడ్డారు. ప్రకాశం, ఎంతపెంకెపట్టుపట్టినా, తల్లి అసంబంధం కాకపోతే ఏనుయ్యో గొయ్యో చూసుకుంటానని బెదిరించడం వల్ల, ఆమెకు మారుమాట చెప్పలేక ఊరుకున్నాడు. కన బడ్డప్పుడల్లా తండ్రితో చెపుతున్నా, ఆయనపాపం, భార్యనీ, కుమారుణ్ణీ ఒప్పించ లేక లోలోపల కుమిలిపోతు న్నాడు.

ఏలాగైతేనేం స్నాతకం అయిపోయింది. భోజనాలు చేసికూర్చున్న తరువాతది ఇందాకటి సంభాషణ:

రాఘవయ్యగారు వీధిలో అరుగుమీద కూర్చున్న కొంచెం సేపటికి లోపలనుంచి రాజేశ్వరి తండ్రి వచ్చాడు. 'ప్రకాశం ఎక్కడున్నాడురా, రాముడూ? అని ఆయన్ని అడిగాడు రాఘవయ్యగారు. 'ఏమో తెలియదు బావా. ఇందాకనుంచీ ఇక్కడనే పడుకున్నాడుకదూ? ఒకవేళ లోపలికి వెళ్లాడేమో!'

'అది కాదురా, యింట్లోఉన్నాడా అని నేనడిగింది. సరేగాని, ఇట్లావచ్చి కూర్చో'—

కూర్చున్నతరువాత,

'ప్రకాశం మళ్లా మొదలు పెట్టాడురా, నాకేం తోచకుండాఉంది. ఆవేశపు వాడేం అఘాయిత్యం చేస్తాడోఅని, పోనీ మానేయిమంటే నీతోడ బుట్టింది వినదాయెను. నేను చస్తూన్నానురా ఎవరికీ సమాధానం చెప్పలేక!

'నాపనీ అలాగేఉంది బావా! రాజేశ్వరికి ఎలాగో తెలిసింది ప్రకాశం సంగతి. ఇందాక నన్ను చూసి తలవంచుకొని లోపలికి వెళ్లిపోయింది. వ్యక్తత వచ్చిన పిల్లగదా, ఎంతవిచారిస్తూందో. అయినా మనం అనుకుని మట్టుకు ఏంచేస్తాం ఎలాకానుందో!'

అవునులే. అయినా, నీవు ప్రకాశాన్ని ఒకకంటి తో కనిపెట్టి చూస్తూండు. ఆ ముడి కాస్తా పడిపోతే, వాళ్లే తరువాత సుఖంగా కాలక్షేపం చేస్తారు. మనం ఎంతమందిని చూడటం లేదు?

౨

రాత్రిచాలా ప్రొద్దుపోయింది. అందరూ [భోజ]నాలు చేసిపడుకున్నారు. సంజచీకటిపోయి పండు[వెన్నెల] వచ్చింది.

ప్రకాశం నిమ్మళంగా పక్కమీదనుంచి [లేచి] దొడ్లోకి వచ్చాడు. ఎవరన్నా చూస్తారేమోనని వెంటనే నక్కినక్కి నడుస్తూ వెనకవైపు వసారా[లోకి] చేరి ప్రక్క కిటికీలోంచి తొంగిచూశాడు. లోప[ల చా]లామంది ఆడవాళ్లు పడుకునిఉన్నారు. వారందరిలో [రా]జేశ్వరిని గుర్తించడానికి కొంతసేపు పట్టింది. దగ్గర[ఉన్న] చెట్టు పూవొకటికోసి ఆమెమీదికి విసిరాడు: ఉ[లిక్కి] పడిలేచి, కూర్చున్నది. బయటికి రమ్మని సంజ్ఞచేశా[డు.] ఒక నిమిషం అనుమానిస్తున్నదానిలాగా కదలక[ుండా] నిలవబడ్డది. కాని వెంటనే బదులు చెప్పకుండా, లే[చి] తీసుకుని ప్రకాశం నిలుచున్న చోటికి వచ్చింది.

వెన్నెలలో నిలవబడి, ఒకక్షణం ఒకరినొకరు [చూ]చుకున్నారు. ప్రకాశం మాట్లాడకుండా ముందరికి [నడి]చాడు. రాజేశ్వరికూడా వెంటనే వెళ్లింది. జామ[చెట్టు] దగ్గర నాపరాళ్లు పరచి ఉన్న చోటికి వెళ్లి కూ[ర్చు]న్నారు..

'నేనెందుకు పిలిచానో తెలుసునానీకు?' అన్నా[డు] ప్రకాశం.'

'తెలుసును. మీరు పిలవకపోతే నేనే పిలిచే[దా]న్ని:—మరి, మీకెన్నేళ్లు ఇప్పుడు?'

'ఇరవైమూడు. నీకో?'

'పదిహేను: సరే, మీయెదుట బిడియపడకుం[డా] నేను చెప్పేది వినండి మేనత్త మేనమామ బిడ్డలమై[నా] మనయిద్దరికీ స్నేహంలేదు. ఒకర్నిఒకరు సరీగా [చూ]నన్నా ఎరుగము. ఇక ప్రేమా—అసలే సున్నాగ[ద]. అందుచేత ఈ పెళ్లి ఎందుకు చేసుకోవాలి?'

'అవును. ఎందుకుచేసుకోవాలీ, నాకూ[ఇ]ష్టంలేదు—నీవు నన్ను ప్రేమించవన్నమాట?'

'నేననేమాట మీరు గ్రహించలేదూ?' నా[కు ఈ] విషయంలో నాకు మాత్రం స్వాతంత్ర్యమన్నా [ఉం]డక్కర్లేదూ?'

'నేనూ స్వాతంత్ర్యము కోసమే పెనుగులా[డు]తున్నాను, ఎన్నాళ్లనుంచో—నా సంగతి చెప్ప[మంటే] కోపం లేకుండా వింటావా?'

'కోపం ఎవరిమీద? చెప్పండి'

'ఇప్పటికి ఎనిమిది తొమ్మిదేళ్ల క్రిందటి సం[గతి]. అప్పుడు నేను ఏదో చిన్న క్లాసు చదువుతున్నాను.

యేడు నాకు జబ్బుచేసింది. నీళ్లు మారిస్తే మంచిదని, వేసగిసెలవల్లో, నన్నూ, నాకు చదువుచెప్పే ఒక పంతులుండేవాడు ఆయన్నీ, మా ముసలి కమతగాడిని......ఊరు పంపించాడు మానాన్న. చుట్టు పక్కల పచ్చని జనప చేలూ, మంచి తోటలు, దగ్గరలో మంచి నీళ్ల కాలువలూ,—చూడటానికి ఎంతో బావుండేది ఆఊరు. అక్కడకు వెళ్లిన తరువాత మా నాన్నభయం లేదుగనుక పంతులు కూడా నేను చదువుకున్నా చదువుకోక పోయినా ఏమీ అనే వాడుకాదు మధ్యాహ్నం భోజనం చేయడంతోనే ఆయన నిద్రపోయేవాడు. నేను—చెప్పడం మరిచిపోయినాను, నా దగ్గర ఒక మంచి కుక్క ఉండేది. అది నన్నెప్పుడూ వదలకండా నా వెంటే ఉండి ఎక్కడికి పడితే అక్కడికి తయారయ్యేది—నా కుక్క, నేను చుట్టుపక్కల పొలాల్లోను, కాలవగట్లు వెంబడి తిరిగి సాయంత్రానికి యింటికి చేరుకునే వాళ్లము. ఎవరూ మా కోసం వెదికేవాళ్లు కాదు. ఆలస్యంగా వచ్చినా కోప్పడేవాళ్లుకాదు. నాకు కూడా బాగా ఆరోగ్యంగా ఉండి క్రొత్త నెత్తురు పట్టింది—సరేదానికేం—ఒక నాడు మామూలు మాదిరిగానే, నేనూ, కుక్కా, తిరగడానికి బయలుదేరాం. ఆనాడు చాలా ఎండగా ఉంది. అందుచేత చేలల్లోనడవకండా కాలవగట్టు పుచ్చుకొని చాలా దూరం పోయినాం. అక్కడ ఒక చోట'——

'ఒక పిల్ల కనబడ్డది'

'నీ కెల్లా తెలిసింది?'

'కథఅంతే—తరువాత చెప్పండి'

'నిజమే ఒకపిల్ల కనబడ్డది. పదేళ్లుంటాయి. చామనచాయగా సన్నంగా ఉంది. తలవిరబోసుకుని ఉంది,—పట్టు కుచ్చుల్లాగా వెండ్రుకలు భుజాలమీద కమ్ముకున్నాయి. చక్కని ముఖం, పెద్ద పెద్ద కళ్లూ, మాట్లాడితే గొంతుకూడా చాలా బాగా ఉంది.

'కాలవ ఒడ్డున రాళ్లమీద పరికిణీ చొక్కా ఉదుక్కుంటోంది. నేను దగ్గరకు వెళ్లి, నేను నీళ్లు పిండి ఇస్తాను, నా చేతికా ఉతుకుతూన్న గుడ్డలు ఈయమని అడిగాను ఆ పిల్ల నావంక న్నా చూడకండా, తలవంచుకుని తన పనేదో తాను చూసుకొంటోంది. కొంతసేపటికి, నేను ఒడ్డునకూర్చుని ఆ అమ్మాయితో మాట్లాడటం మొదలెట్టాను. ఎన్నో సంగతులు గబ గబ చెప్పాను. నామాటలన్నీ వింటూ, చాలా సంతోషంతో నా దగ్గరగా వచ్చికూర్చున్నది. బట్టలు ఆరేవరకూ అక్కడ నేకూర్చుని ఆలాగే కబుర్లు చెప్పుకుంటూన్నాము. నాకు ఎంతో సంతోషంగా ఉంది ఆ కొంతసేపూ.

తన సంగతంతా నాతో చెప్పింది. తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయినారట. అందుచేత మేనమామ పెంచుతున్నాట్ట. అక్కడికి దగ్గరలోనే వాళ్లయిల్లున్నదని చెప్పింది. తరువాత నన్ను గురించి కూడా ఆ పిల్లతో చెప్పాను. కాని నాకు వ్యవసాయం చేయడం, పొలంలో పనిచేయడం చేత కాదని ఎంత చెప్పినా నమ్మింది కాదు. వాళ్ల మొగాళ్లందరూ కష్టపడి పని చేయడం ఎరుగున్నది. అందుచేత నేనాపనులేమీ చేయలేను, చదువుకుంటున్నానని చెపితే ఎంతో సేపటిదాకా అర్థంచేసుకో లేకపోయింది; కష్టించి పనిచేయ లేని వాళ్లు మొగాళ్లుకాదని ఆమె నమ్మకమన్నట్లు ఆ చూపులో నేను గ్రహించాను!

'తరువాత'

'తరువాత, ఆ పిల్లమీద నాకెంతో ప్రేమ ఉందని చెప్పాను. కాని అంత చిన్న పిల్లకు ఆమాటలేం అర్థమవుతాయి. నాకు మాత్రం——'

'చివరకు ఎలా తెలిసేట్ట చెప్పారో, చెప్పండి.'

'ముద్దుపెట్టుకున్నాను.'

'అప్పుడు తెలిసిందా'

'ఆఁ'

'అవును. అంతే—మిగతా కథ చెప్పండి'.

'చీకటి పడ్డతరువాత ఎవరి త్రోవను వాళ్లు వచ్చేశాం: మరునాడు సాయంకాలం నేను ఒక్కడినే అక్కడికి వెళ్లాను. చాలా ప్రొద్దుపోయేదాకా అక్కడకూర్చున్నాం. తరువాత వాళ్లయింటికి వెళ్లాము. ఆపిల్ల యింట్లోకి వెళ్లిపోయింది. నేను దొడ్లో గడ్డి వాముమీద ఎక్కి కూర్చున్నాను: మేనమామ నిద్రపోయిన తరువాత నాకు తాగడానికి పాలు తెచ్చియిచ్చింది. తెల్లవార్లూ ఒకరి సరసను ఒకరు కూర్చుని మాట్లాడుకుంటూ గడిపాం: నేను పెద్దవాణ్ణయిన తరువాత నన్ను పెళ్లిచేసుకునేటట్టూ ఈలోగా నేను వాళ్ల మేనమామదగ్గర పని చేయడానికి చేరేటట్టు—ఎన్నో, ఈ మాదిరిగానే. అర్థంలేని మాటలు చెప్పుకున్నాం. ఆలోచించడం అంటూ లేదు. ఆ అమ్మాయితో మాట్లాడటమే ఎంతో సరదా అనిపించింది.

తెల్లవారింది. ఆపిల్ల యింట్లోకి వెళ్లిపోయింది. నేనింకా అక్కడే నక్కి కూర్చున్నాను. ఇంతలో క్రిందమా పంతులుగారి గొంతు వినపడ్డది. ఇక్కడకెందుకొస్తాడయ్యా. ఏడే, మాయిల్లంతా చూడండి. పిల్లాపూసాఏమన్నా కనబడక పోవడానికి అని ఆఅమ్మాయి మేనమామ దగ్గర గాలిస్తున్నాడు.

‚ఆ పిల్లవాడికుక్క, యింత దూరందాకా తీసుకు వచ్చిందయ్యా అందుచేత ఇక్కడ ఏ మూలనన్నా దాక్కున్నాడేమో నని—

అని మాపంతులు జవాబు చెపుతుండగానే, నేనున్న స్థలం గుర్తించి కుక్క అరుస్తూ గడ్డివామిమీదికి వచ్చింది. దానివెంబడే అందరూ వచ్చారు.

నన్ను చూడటంతోనే ఆతను 'దొంగ వెధవా, ఇక్కడేం చేస్తూన్నావు' అని కర్రపైకెత్తాడు. మాపంతులు అడ్డంవెళ్లి తొందర పడకోయి!' అని మానాన్న పేరుచెప్పాడు. ఆతడు నిర్ఘాంత పోయినాడు. ఇంతలో ఈ సందడివిని ఆ అమ్మాయి బయటికి వచ్చింది ఆమెను చూడటంతోనే ఆతనికి కోపం ఆగిందికాదు. నా కులానికి అప్రతిష్ట తెస్తావుటే చిన్నతనంనుంచి ఈ మాదిరి బుద్ధులా. చంపేస్తా జాగ్రత్త! అని తరుముకు వెళ్లాడు. కొడతాడేమోనని నాకు చాలా భయంవేసింది. కాని ఆ అమ్మాయి చాలా దూరంపోయింది. ఆతడు రొజుకుంటూ తిరిగివచ్చి! ‚ఈ మా రెన్నడైనా ఈ చుట్టుపక్కల కనబడ్డావంటేనా— అని మిగతవాక్యం కర్రతో అభినయించి చూపాడు. మేమందరం అక్కడ నిలవకండా వచ్చేశాం. మళ్లా ఎన్నడూ అక్కడికి వెళ్లలేను.

‚తరువాత ఆ అమ్మాయిని చూడలేను'

చూడకేం కళ్లు మూసు కున్నప్పుడల్లా కనబడుతూనే ఉంటుంది. ఈ పాటికి పెరిగిపెద్దదై సుఖంగా ఉండి ఉంటుంది. నేనుమాత్రం ఆ ప్రయోజకుణ్ణిగానే ఉన్నాను''

* * * *

ప్రకాశం రాజేశ్వరివైపు తిరిగి ఆమె ముఖంవంక చూశాడు. రెప్ప వాల్చకుండా ఆతనివైపే చూస్తూన్నది. ముఖంచిట్లించుకుని తల ప్రక్కకు తిప్పుకున్నాడు.

‚నీవుతప్ప మరెవ్వరికీ తెలియను ఈ సంగతి మా పంతులు ఎవరిలోనూ చెప్పలేను. అసలు—నిజంగాబడితే నీకుకూడా చెప్పకండా ఉండాలిసిందే, అన్నాడు.

‚అంటే?'

‚నా సంగతికూడా మీకు చెప్పకపోతే'—‚బలేబాగుంటుంది. చెప్పు వింటాను?

‚—ఆతను—ఆతను, నేనెరుగున్న...చూసిన—వాళ్లందరిలోకీ'

‚ఎవరు?'

‚ఆతను'

సరే, తెలిసింది.

—‚చాలా బాగుండేవాడు. నేను మొట్ట టిసారి చూచింది, మా గొడ్ల సావిడిలో ఒకపోట్ట కట్టి వేస్తూండగా. మానాన్న అనాడే దాన్ని వచ్చాడు. కాని అది మహా అల్లరిచేసింది. ఎవరు కు వెళ్లినా లొంగిందికాదు. ఆ వైపుకు వచ్చినవాళ్ కొమ్ములతో కుమ్మేసేది, చివరకు ఆతను లొంగదీ దానిని. ఒకగంటసేపు అది పెట్టిన తిప్పలల్లా పడ్డా కన్నా మొండివాడు దొరికాడని అదిలోబడ్డది. లకు తాడువేసి, లోపలికి తీసుకువెళ్లి కట్టేసి, దాని మీద చరిచి ఇక ఎప్పుడూ అల్లరిచేయబోక, అని షికి చెప్పినట్లుగా బుజ్జగించిచెప్పి, ఇవతలికి వచ్చా నాకు ఆతన్ని చూసేటప్పటికి ఒళ్లు పొంగిపోయింది. గెత్తుకువెళ్లి దగ్గరగానుంచుని, బలేమంచి కుర్రోడ త భయం లేనివాడిని నేనెక్కడా చూడలేను. అన్నా

సరేగాని, ఇదిజరిగి ఎన్నాళ్లయింది!

అన్నాడు ప్రకాశం.

‚ఆరేళ్లు'

‚ఊఁ;—సరేగాని తరువాత కథచెప్పు

‚ఆ పిల్లవాడు నవ్వాడు. భయం ఏమిటి. ఈ త్రం దాన్నే కట్టు కొయ్యదగ్గరకి లాక్కు వెళ్లలే నా తెలివి ఎందుకూ: ఇక ఎప్పుడూ అల్లరిచేయ అన్నాడు.

‚ఆతను ఎవరో చెప్పావుకాదు' అని ప్ర ప్రశ్నించాడు.

‚అవును మరచిపోయినాను వాళ్ల తండ్రి లం చేస్తాడు:—అది వరకు ఎంత మందినో చూ గాని, ఆతన్ని చూసినప్పుడు కలిగిన సంతోషంవే నసులో అదేదో మాదిరిగా. తమాషాగా అనిపించి

‚నా వైపుచూస్తూ నాతో మాట్లాడుతాడేమో కున్నాను. కాని నేనెవరినైతే మాత్రం ఆతనికేం! త్రమూ లక్ష్యము చేయకండా దూరంగా నిలుచు నేనూ ఆతను ఉన్నచోటికి వెళ్లి దబాయించి చూ ‚ఎద్దుపొడుస్తుందేమోనని భయంలేస్తూందా?—అ నీ ముఖం చూస్తేనే తెలుస్తూంది' అని రెచ్చ మొదలు పెట్టాను. ఆతను. కొంతసేపటికి నా వంక లంగా చూసి ‚నిన్ను ఇప్పుడు ముద్దుపెట్టు కుంటే స్తుంది ఎవరికి భయం లేస్తుందో' అన్నాడు. ‚ఓ కో చూద్దాం'— ఇంతలోకే సిగ్గు బడ్డాను—ఇప్పుడు ప్రొద్దుగూకిన తరువాత రా, నీకు ధైర్యం ఉంటే!— వస్తాను!' అని ఆతను వెళ్లిపోయినాడు.

'వచ్చాడా ఆవేళకి?' అని అడిగాడు ప్రకాశం

రాజేశ్వరిముఖం ఎర్రబడ్డది.

కళ్లవెంబడి నీరువచ్చింది.

'వచ్చారు. నేనుకూడా అతనికోసం ఎదురుచూస్తూ నిలుచున్నాను. అతన్ని చూడటంతోనే పరుగెత్తుకువెళ్లి' రాజేశ్వరి వెక్కి వెక్కి ఏడుస్తూ మొదలు పెట్టింది. ఓదార్చడానికి యత్నిస్తే మరింత దుఃఖం వస్తుందేమోనని ప్రకాశం మాట్లాడకుండా కూర్చున్నాడు—కొంతసేపటికి కళ్లు తుడుచుకొని, చెప్పడం మొదలుపెట్టింది.

'అతను చేతులు జాపుతూ నావంకకు వస్తున్నాడు నేను ఆ చేతుల్లో పడదామని పరుగెత్తుకు వెళ్లాను. ఇంతలో మా తాతయ్య వచ్చాడు:—అందుచేత నేనెవరినైతే చిన్నప్పుడు ప్రేమించానో అతడు నన్ను ముద్దు పెట్టుకోలేదు. ఇక ఎప్పటికీ ఆ ఆశలేదు—'

రాజేశ్వరి మౌనం వాల్చింది

'మనవాళ్లందరికీ తెలిసిందా?—'

'ఇంకా ఎవరికి తెలియాలి? తాతయ్యకు తెలిస్తే చాలదూ?

తరువాత కొద్ది రోజుల్లో అతనితండ్రిని మా చేను లోంచి తప్పించారు. వాళ్లిద్దరూ ఎక్కడికో వెళ్లిపోయినారు.

'అప్పటినుంచి ఎన్నడూ చూడలేదూ?'

లేదు వాళ్లు ఏవూరు వెళ్లారో కనుక్కున్నాను గాని వెళ్లడానికి ఏలా వీలవుతుంది—వీలుకాదు కదూ?'

'నిజమే'

అందుచేత, ఇష్టం ఉన్నా లేకపోయినా, పెళ్లి చేసుకుని, ఒకరితో ఒకరు——చూడండి, మన యిద్దరికీ యిష్టంలేదు. ఎందుకు ఒప్పుకోవాలి?

'అదే నేనూ ఆలోచిస్తున్నాను'.

'మీరు నా భర్తగా ఉండడానికి యిష్టంలేదు. నాకు మీ భార్యనవడానికి యిష్టంలేదు'.

'అంతే'

'ఎవరిలాగా వారే ఉండిపోవాలి'

'అవును'

'ఎందుచేత అలా ఉండకూడదూ?'

ఏమీతోచని వాడిలాగా రాజేశ్వరి వైపు చూశాడు

'మన పెద్దవాళ్ల మర్యాద—'

'మన మర్యాదో— వినండి చెపుతాను!'

అంటూ రాజేశ్వరి గబ గబ మాట్లాడటం మొదలు పెట్టింది. ప్రకాశం తన ధోరణిలో నే ఉన్నాడు కాని ఆ అమ్మాయి ఏమి చెపుతూన్నదో తెలియదు. ఇంతలో యింటిలో చప్పుడైనది. ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. ప్రకాశం లేచి నిలుచుని రాజేశ్వరి చేయి పట్టుకుని 'సరే' అని తల వంచుకుని యింటివైపుకు నడిచివెళ్లి పోయినాడు:

(సశేషము)





# పరికూర్చిన పువ్వులు

## ఆరవీడు వంశావళి

రివరెండు ఫాదరు హేరాసుగారు స్పెయిను దేశస్థులు. బొంబాయిలోని సెంటు జేవియర్సు ఉన్నత కళాశాల ప్రధానాచార్యులు. ఈ పండితుఁడు ఆంధ్రుల చరిత్రనుగూర్చి గొప్ప పరిశోధనలు జరిపి ఆరవీడు వంశావళి యను పేరుతో ప్రథమ భాగముగ నొకగొప్ప గ్రంథమును ఇంగ్లీషులో ప్రకటించి యున్నాడు. వీరిని సన్మానించుటకై బొంబాయి ఆంధ్ర సమాజమువారు సమావేశము చేసిన సభయందు ఈ పాశ్చాత్య పండితుఁడు ఆంధ్రుల నిట్లు కీర్తించి యున్నాఁడు.—

"హిందూదేశ చరిత్ర అభిమాన విషయముగా గైకొని పరిశోధించిన కొలఁది, విజయనగర సామ్రాజ్య చరిత్ర భాగము నన్నెక్కువగ నాకర్షించినది. పరిపాలనా దక్షత యందేమి, విదేశ వ్యవహారములందేమి, సైనిక చారిత్రయందేమి కళా వాఙ్మయముల వృద్ధియందేమి, తెలుగు చారిత్రముతో సమానమయినది మరియొకటి లేదని నేను పరిశోధనా పూర్వకముగఁ గనుగొని యున్నాను. ఒక విధముగా దైవముకూడ నాకు దోడ్పడి యున్నాడు. ఇంతవరకు ఎవ్వరు కనుగొనని యపూర్వ చారిత్రాంశములు నాకు లభించినవి. వీనివల్ల ఆంధ్రుల ఔన్నత్యము, పౌరుషము వెల్లడియై, హిందూదేశ చారిత్రములోని ప్రాముఖ్య ప్రకరణ మునుగూర్చిన కల్లబొల్లి కథలు పటాపంచలు కాగలవు."

(తెలుగు సమాచార్)

ఈ పండితుఁడు స్థాపించిన చరిత్ర సంఘమునకు ఆంధ్ర మహాశయులగు వినోబా పుపాబగారు రు 300—0—0 లు విరాళ మొసగుటయేగాక ఒక సంవత్సరము వరకు నెలకు రు 30—౧—౧ ల చొప్పున సహాయము చేయుటకు వాగ్దానము చేసియున్నారు. "ఆరవీడు వంశావళి" మిగత భాగములు త్వరలో వెలువడును గాక!

---

## హిందూ మసల్మానుల అన్యోన్యము.

'జయంతి' పత్రికలో "అమీను ఖానుఁడు" అను వ్యాసమునందు ఆడవి శంకరరావుగారు క్రీ. శ. ౧౬ వ శతాబ్దమున, నాంధ్ర దేశమందలి హిందూ ముసల్మానుల యన్యోన్య సహనమును గుఱించి యిట్లు వ్రాసిరి:—

తెలుఁగు కావ్యములలో, మధ్యమ యుగము బయలుదేరిన కవుల వ్రాఁతలలో, మహమ్మదీయ మతద్వేషణము మిక్కుటముగా గన్పట్టుచు, ఆనాటి వైషమ్యములను బ్రకటించుచున్నది. కాని తల్లికోట యనంతరము మహమ్మదీయ రాజ్యము లాంఛనాంటితో దీకొనుటచే మహమ్మదీయ మతమునకును, రాజ్య పాలనకును, సంబంధము విడిపోయినది. అందుచేతనే యీ కాలములో ఇబ్రహీము కుతుబుషాకు తపతీ సంవరణో పాఖ్యానము, అమీను ఖానునకు యయాతి చరిత్రమును కృతి నిచ్చుటయు, ఈ కావ్యములలో మహమ్మదీయ పాత్రస్తోత్రములు మాత్రమేగాక, మహమ్మదీయ మతముకూడఁ గొంతవఱకుఁ బొగడఁ బడుటయు దటస్థించినవి.

---

## కొన్ని పంటలు

శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'భారతి'లో వ్యవసాయ చరిత్రమును గురించి వ్రాయుచు కొన్ని పంటలగుఱించి యిట్లు వ్రాసిరి.

### మిరెపకాయ

ఇదియును విదేశమునుండి దిగుమతి చేయబడినది. ౧౬, ౧౭ వ శతాబ్దములలో పోర్చుగీసువారు, దక్షిణ అమెరికాలోనిదగు 'చిలీ' దేశమునుండి దీనిని దెచ్చిరి. అందువలననే దీనికి నింగ్లీషులో "చిలీస్" అనిపేరు. మన ప్రాచీనులు కారమునకు మిరియములు, ఇంగువ మొదలగువానినే వాడుచుండిరి. ఈ మిరెపకాయ దినదినమైన పిన్నమట్టను వాటి ప్రాముఖ్య మడుగంటి వీసె టిక్కి ౦—౬—౦ అమ్మినను దీనిని వదలలేక, దీనినే బాల గోపాలము కొనుచున్నారు.

### ఫిరంగిదుంప

ఇది ఫ్రాన్సు దేశపుదని నామమే చెప్పుచున్నది. ఫ్రాన్సుదేశీయులకు 'సుఖరోగములు' మెండు. వారీ దేశమునకు వచ్చినపుడు తమరోగ నివృత్తికిగాను, ఫ్రాన్సు నుండి దీనిని దమతో దెచ్చుకొనిరి. అదిమన దేశమునందు నిసుక నేలలలో బైరుబెట్ట వచ్చును. దీనిని తెనుగు వైద్యులు "ఫిరంకిచెక్క" యనెదరు. మనవైద్యులు దీని గుణాతిశయముం గనిపెట్టి పైత్యవ్యాధుల కుపయోగించు చున్నారు.

## చెఱకుపంట

ప్రపంచంలో చెఱకు పండే పొలాల్లో ఇంచు మించు సగంపాలికి ఇండియాలోనే ఉన్నవి ఇండియాలో చెఱకు ఎక్కువగా పైరయినా ప్రపంచంలో అంతా చెఱకువల్ల తయారయ్యే చక్కెరలో నాలుగోవంతు మాత్రమే అక్కడ ఉత్పత్తి అవుతూ వుంది. జర్మనిలో ఒక్కొక్క మనిషీ సరాసరి ౫౦ పౌనుల చక్కెర ఉపయోగిస్తారు. బ్రిటిషు దేశంలో ౪౦ పౌనులు ఉపయోగిస్తారు. ఇండియాలో ౨౦ పౌనులు మాత్రమే ఉపయోగిస్తారు. ఇంత తక్కువగా ఉపయోగించినా, జనసంఖ్య ఎక్కువ కావడంచేత, ఇండియాదేశము ప్రపంచంలో, చక్కెర ఎక్కువగ ఉపయోగించే దేశాల్లో రెండవదిగా పరిగణింప బడుచున్నది. ప్రపంచంలో చెఱకు పండే పొలాల్లో సగం పొలాలు ఉన్నా, 'జావా,' 'మారిషసు' లనుండి ఇండియాకు ఏడాదికి ౧౫ కోట్ల రూపాయిల వెలగల చక్కెరను తెప్పించుకోవలసి ఉంది.

ఇండియాలోని ౨౪౫౦౦౦౦ ఎకరముల విస్తీర్ణము గల చెఱకు తోటలలో ౧౪౫౦౦౦౦ ఎకరములు విస్తీర్ణము గలవి బీహారు సంయుక్త రాష్ట్రములలోనున్నవి.

కోయంబత్తూరు కార్యాలయంలో ఉండే ప్రభుత్వంవారి ఇక్షుశాస్త్ర నిపుణుడు (Imperial sugarcane expert) చేయుచున్న పరిశోధనల ఫలితాలు ఇండియాలోను, విదేశాల్లోను, అందరి దృష్టిని ఎక్కువగా ఆకర్షిస్తున్నవి. మరియు విదేశములలో ఇవే పద్ధతుల ననుసరించి కావించెడి ప్రత్యేక పరిశోధనల ఫలితాలు, ఇండియాలోను, విదేశాల్లోను అందరి దృష్టిని ఎక్కువగా ఆకర్షిస్తున్నవి. మరియు విదేశములలో ఇవే పద్ధతుల ననుసరించి కావించెడి ప్రత్యేక పరిశోధనల ఫలితములకు ఇవి సరిగా సరిపోవుచుండడం వింతగా ఉన్నది. మంచి రకమైన దళసరి చెఱుకు మొక్కలను ఉత్పత్తి చేయడానికి బొంబాయి చెన్నపుర రాష్ట్రములలో ఇప్పటికింకా అట్టే ప్రయత్నించ లేదు. అయితే ఈ సంవత్సరం రెండు రాష్ట్రములలోను అందుకొరకు ప్రయత్నించి ప్రారంభం చేసినారు. ఇక్షుశాస్త్రజ్ఞుడు ఈ క్రొత్త పద్ధతిలోను వెనుకటి వలెనే మంచి ఫలితములే సమకూర గలవని గట్టి నమ్మకము గలిగి యున్నట్లు తెలియవచ్చుచున్నది.

---

## విగ్రహారాధనము

జె. యన్. ఫర్కుహార్ అను విద్వాంసుడు రాయల్ ఏషియాటిక్ సొసైటి పత్రికయందు (౧౯౨౭ జనవరి) విగ్రహారాధనమును గూర్చి పుట్టుపూర్వోత్తరములను చర్చించుచు, వ్యాససారాంశము నీక్రింది విధముగా సంగ్రహించి యున్నాడు:—

౧. దేవమందిర పూజావిధానము వేదములందు లేకపోవుట.

౨. పూజారుల కాకాలములో సంఘము నందుగల న్యూనత.

3 ఎన్నో శతాబ్దముల వరకు శ్రౌతబ్రాహ్మణులు (శృతినే ప్రమాణముగా గైకొను బ్రాహ్మణులు) విగ్రహారాధనము నెడ అపవిత్రతా భావము కలిగియుండుట.

౪. క్రీస్తుశకారంభమునుండి స్మార్తుల (స్మృతులను ప్రమాణముగా గైకొనువారల) మతాచరణము.

౫. ప్రాచీన భారతదేశములో లలితకళలకుగల అత్యంత నీచస్థానము. (లలితకళలకు సంబంధించిన విగ్రహములను శూద్రులే నిర్మాణము చేయుచుండి రనియు, అందుచే నగ్రజాతిత్రయము ఆకళలను గౌరవింప లేదనియు వ్యాసకర్త అభిప్రాయము)

ఇవన్నియుం గలసి విగ్రహారాధనము సాంప్రదాయ సిద్ధమను వాదమునకు బలమిచ్చు చున్నవి. అందుచేత దేవర మందిర విగ్రహారాధనము శూద్రులలో ప్రాదుర్భవించెననియు, క్రీస్తుకు పూర్వము రమారమి ౪౦౦ సంవత్సరముల ప్రాంతమున మాకు ఆర్య జాతులవా రవలంబించిరనియు, తరువాత క్రమేణ వృద్ధిచెంది, ఇప్పటి అత్యున్నతస్థితికి వచ్చెననియు తేలుచున్నది,





# ఖాజీపేట శాసనము

## ఆంధ్ర పరిశోధక సంఘము-హైద్రాబాదు

శాసన సంఖ్య ౧౬. ఇది హనుమకొండ నుండి ఖాజీపేటకుఁ బోవు త్రోవలో పోలీసు నాకా వద్ద ప్రాతపడి యున్నది. అడుగు భాగము విరిగిపోయినది. ముక్క కనుపింపదు. ఒక వైపు (తూర్పువైపు) ౫-౬-౭ పంక్తులకు కలిసి వచ్చునట్లు రోలుకొట్టఁబడినది. శాసన శిల మిక్కిలి జీర్ణావస్థలో నున్నది.

### తూర్పు వైపు

౧ స్వస్తిశ్రీ స్తనపీత
౨ చారుగుచిభిః సమ్మిశ్రి
౩ తోంశోమణిద్యోతై రంజన
౪ పుంజశుభ్ర కలినా నాత్యున్న
౫ తోరస్థ * * * * గవిగిం
౬ ఆత * * * * జాతత్రారా
౭ పథం। ఖ్యాతోజ్ఞ * * సివఃపురా
౮ ణపురుష శ్రీశౌర్య్య నారాయణః
౯ జయతిచలమర్తి గణ్డస్సను
౧౦ రజయ శ్రీవిభాసభూపాదణ్డః
౧౧ దుజ్జ్యకులాబ్ధి చంద్రస్సత్యా
౧౨ ధీనస్సకలచేతనరేం
౧౩ ద్రః॥ తత్పుత్రః ప్రోలనృపఃప
౧౪ రధరణి పాళిమాళిరాజితచ
౧౫ రణస్సిందూరముద్రి కాంకాంచ
౧౬ క్రంచక్రేశ్వరస్యసకల ధరిత్రీః
౧౭ విశ్రుత సంగరసుకీత విక్రా
౧౮ ంత్త నిజకీర్త్తి ధవలితాశాపూ
౧౯ ర్తిః చక్రేసముద్రసుయశశ్చ
౨౦ న్ద్రిః సరిసముద్ర * * * *
౨౧ శః॥ తత

### ఉత్తరం

౧ సమస్తభువనాశ్రయ
౨ శ్రీ ప్రిధ్వీవల్లభమహారా
౩ జాధిరాజపరమేశ్వర
౪ పరమభట్టారక సత్యా
౫ శ్రయకులతిలక చ
౬ ళుక్యాభరణః శ్రీమ
౭ త్రిభువనమల్లదేవ
౮ విజయరాజ్యమాచం
౯ ద్రార్కతారంగులత్తవి
౧౦ ర। తత్పాద పద్మోపజీవి
౧౧ సమధిగత పంచమహా
౧౨ శబ్దమహా మండలేశ్వరా
౧౩ నమకుణ్డాపుర వరేశ్వర
౧౪ పరమమాహేశ్వరపతి
౧౫ హితచరితం। వినయవిభూ
౧౬ షణం శ్రీమన్మహామణ్డ
౧౭ లేశ్వరం కాకతీయ వేతే
౧౮ శ సంతన్నతన్డే మహీమండ
౧౯ లేశరం పోళలరలే

### పడమర

౧ * సంవత్సర మార్గశి
౨ ర శుద్ధ ద్వాదశియుం బృహస్ప
౩ తి వారదద్దువరుణ ప్రతిష్ఠా
౪ * ల దొల్చి లిసిద శాసనగంచ

౫ మర్యాధ్యాక్ దేదేవ చాగ్గపప్పన
౬ * పకాలియుంసెట్టకెలియ
౭ పాటిగాగు * డకెలెగ
౮ పొలమొదలాగొడసది
౯ సముద్రసిరద * వేడి
౧౦ * డెల్లమగ సరపావ్వ
౧౧ * న్నకకర రవిదేయ

ఇంక నెన్మిది పంక్తులు కన్నడ భాషావాక్యములు స్ఫుటముగా లేక పోవుట చేతను చరిత్రాంశము లేక పోవుట చేతను విడిచితిమి.

దక్షిణము

౧ మద్వంశజాఃపరమ
౨ హీపతి వంశజావా
౩ పాపాద పేతమన
౪ సోభువిభావిభూ
౫ పాఃమోపాల యన్తి
౬ మమధర్మాక్ మిమం
౭ సమస్తంతేపాంమ
౮ యా విరచితోంజలి
౯ శేషమూర్ధ్నిక్

షరా:—తూర్పు భాగమున బేతనపుఁ గాకతీయ ప్రోలరాజు కుమారుఁడని చెప్పఁబడెను. కాకతీయులు దుర్జయవంశజులని యీ శాసనమువలన గ్రహింపవలెను ఉత్తరదిక్కు శాసనమువలన ప్రోలరాజు తండ్రియగు బేతేశుఁడు పశ్చిమ చాళుక్య వంశజాతుఁడగు త్రిభువనమల్లదేవుని వద్ద దండనాయకుఁడనియు గ్రహింప వీలుకలుగుచున్నది. ప్రోలరాజుకాలము నుండి కాకతీయులు స్వతంత్రులైరి. దీనికిఁ దార్కాణగా బేతరాజు చాళుక్యపాదపద్మోపజీవియని ప్రశంసింపబడుటయుఁ బ్రోలరాజు నెడనట్టి విశేషములు కానరాకుండుటయు గ్రహింపనగును. మొదట శాసనము కాకతి బేతరాజు తూర్పు దక్కు కడమ మూడు వైపులఁ జెక్కించెను. తరువాత ప్రోలరాజు తూర్పువైపు తానొక శాసనము వ్రాసెను.



# గ్రంథ విమర్శనము

## 3 కాంతం కథలు

గ్రంథకర్త: ముని మాణిక్యం నరసింహారావు, బి. ఎ., ఎల్. టి. ప్రకాశకులు: సరస్వతీ గ్రంథమండలి, రాజమహేంద్రవరం. వెల: రు ౧—౦—౦

తెలుగు వాండ్లలో కథలు వినేకుతూహలం, చెప్పే ఉత్సాహం, పూర్వంనుంచీ వున్నను, రాతలో కవి వచ్చి చాలా దినాలు కాలేదు. ఆకారణాన మంచి రాతకాండ్లు యింతోమంది అగుపడరు. గుడిపాటి వెంకటాచలం, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రీ, వేలూరి శివరామశాస్త్రి, మాడపాటి హనుమంతరావు మొక్కపాటి నృసింహ శాస్త్రి పై గ్రంథకర్త ఇప్పుడు చిన్నకథ రాసేవాండ్లలో ముఖ్యులు. వీరికి తెలుగు వాండ్లెంతో కృతజ్ఞత చూపాలి సి..యుంది.

మునిమాణిక్యం నరసింహారావు చతుర మతియైన పెండ్లాన్ని సృష్టించడంలో నిపుణుడు. సంసారంలో సామాన్య విషయాలను కండ్లకట్టినట్లు దించే చిత్రకారుడు. తనకాంతాన్నెప్పుడూ సంతోష పెట్టాలని ప్రయత్నించే వెంకట్రావుపై చదువరులకు జాలి పుట్టించే ప్రజ్ఞావంతుడు. కథా నియమాలను సరిగా పోషించే లాక్షణికుడు. సంభాషణ ద్వారా పాత్రల గుణాలను వ్యక్తపరుచడం మంచి కథకుని లక్షణం. సంగ్రహంగా కథను రాయడం మరొక భాధ్యత. తన కథను చదివిన పాఠకునిలో నూతన భావాలను స్ఫురింపచేయుడం మరొక కర్తవ్యం. ఇవన్నీ నరసింహారావుకు స్వాధీనమైన విషయాలే. ‚కాంతం కథలు' వారిదివరకు ‚సాహితి'లో ప్రచురించిన కథలే, ఇదివరకే ఆంధ్ర లోకంలో అవి

తమ ప్రతిభను స్థాపించుకొనినవి. కథపై అభిరుచి కల వారెవరైనా వాని నిదివరకు చదువకుండా ఉంటే ముందు చదువగలరు.

## ౪ మునిమాపు

గ్రంథకర్త: సహదేవ సూర్య ప్రకాశరావుగారు. సరస్వతీ పవర్ ప్రెస్సు. రాజమండ్రి.

భావ కవిత్వ సంబంధమైన పద్యావళులు. ఇందలి కథాంశమును గూర్చి శ్రీకృష్ణ శాస్త్రిగారు గ్రంథమునం దిట్లు తెలిపియున్నారు.

„ఈ మునిమాపులో నేమో విషాదమో
సందేహమో నన్ను జ్వాలయై దహియించు
వెలుగులో, చీకట్లో, వీని కౌగిళ్లలో
కనలునే, నల్లనల్లని వేడిరక్తాలు.”

చక్కని ముద్రణము. ఫెదరువైటు పేపరు.

## ౫ "బుద్ధ"

ఇది యారంకముల నాటకము. గ్రంథకర్త కోటంరాజు సత్య నారాయణగారు, గాంధిపేట, గుంటూరు, పుటలు ౧౧౦. వెల రు ౧-౦-౦.

బుద్ధ భగవానుని దివ్య చారిత్రమును ప్రవర్తించు పవిత్ర గ్రంథము. ముఖ్యముగా శ్రీయుత చంద్రరాజ భండారీ విశారదుని యొక్కయు, కొంతవరకు గిరీశ చంద్రఘోషు యొక్కయు హిందీ నాటకముల ననుసరించి యనువదింపఁ బడినది. ఉత్తర భాగమునందు కల్ప నాపటిమ తక్కువగా నున్నది. సుజాత, బుద్ధ పా[త్ర]ము చక్కగ పోషింపఁ బడలేదు.

ఈ గ్రంథమునందు ప్రేమ బలము, పశు[బలము] అను పదములు అర్థము లేకుండ నుపయోగింపఁ బ[డెను]. ప్రేమ బలమునకే యాత్మిక శక్తియని యొకచో[ట] యున్నారు. ఈ పదములను ఇప్పటి గాంధీ మహా[త్ముని] యహింసా తత్వమును మనసు నందిడుకొని గ్రంథ[ము] వాడినట్లుగా మాకు దోఁచుచున్నది. కాని వీని [ఉదా]హరణముగా గల గ్రంథమునందలి ఘట్టములు అ[...] నమునకు సరిపడవు. చూడుడు:—సిద్ధార్థుడు దేవదత్తు[ని]గి[...]తి యుద్ధ మొనర్చి యాతని నోడించెనఁట. అ[...] యుద్ధములో నోడించెనఁట. ఇవి ప్రేమ బలమునకు [...] ఆత్మిక శక్తికి నుదాహరణములు అయితే „ఏ శ[...] మున సశస్త్రులగు వైరులకు నిరాయుధుఁడై [...] తన పక్షమును జూపునో యట్టి యాత్మిక శక్తి [...] ప్రేమ బలము ముందు ప్రపంచమున నే శక్తి పరా[జితము] కాకుండును?” అని పలికిన సిద్ధార్థుఁడు తన భుజ[బలము] చేతనే ప్రతి పక్షీయులను జయించి యశోధరను [పొంద]యాడఁ గలిగెనని చూపుటలో గల యర్థమేమి?

ఇందు పద్యములు, హిందీపాటలు గలవు. [...] వర్ణనలు హృద్యములు గానున్నవి. ఇందలిబుద్ధ [చరి]త్రమును గ్రోలుటయే గాక, హిందీసాహిత్యము[నందలి] ఉద్గ్రంథములను భాషాంతరీకరించి, ఆంధ్రసాహి[త్యము] నలంకరించుటకు గ్రంథకర్తకు ఆంధ్రమహాశయుల [ప్రో]త్సాహ మొసంగవలెను!



# సంపాదకీయములు

## శ్రీ మహారాజాగారి పర్యటనము-

### జనులలో ప్రబోధము

మన ప్రధాన మంత్రిగారగు మహారాజా సర్ కృష్ణప్రసాదు బహద్దరు, యమీను స్సల్తనత్ గారు జనవరి మాసపు తుది భాగమున నారంభించిన పర్యటన మూలమున రాష్ట్రములోని ప్రజలందు నూతన ప్రబోధము వెల్లడియగుట సంతోషావహము. ఉస్మానాబాదు, గుల్బర్గా, తుల్జాపురము మున్నగు తావులందు ప్రజలు శ్రీవారికి వినతి పత్రములను సమర్పించుకొనిరి. ఇదివరకు గొప్ప అధికారులును, మంత్రులును, జిల్లాలలోనికి పర్యటనమునకై వెల్లినప్పుడు జనులు వినతి పత్రముల నర్పించుకొను నలవాటు అంతగా గాన్పించలేదు. దరఖాస్తులిచ్చుకొనినను అవి ఏదేని సాధారణ విషయమును గూర్చినవై యుండెడివి. అట్లుకాక, ఇటీవలి వినతి పత్రములందు, రాజ్యాంగ సంస్కరణములు కావలయునని జనుల పక్షమున కోరబడినది. తాలూకా జిల్లా లోకల్ఫండు సంఘములందు సభా సదులను ఎన్నుకొను పద్ధతిని ప్రవేశ పెట్ట వలసినదనియు, విశాలమగు జన సంఖ్యగల పురములందు పురపాలక సంఘముల (మజ్లిసెసఫాయీ) లను స్థాపింప వలయునని యు, శాసన సభయందు ప్రజాపద్ధతి నేర్పరచి ప్రజాభిప్రాయమునకు ప్రభుత్వము లోబడునట్లు చేయ వలసినదనియు, ప్రజలు ప్రధాన మంత్రిగారిని ప్రార్థించుట నిశ్చయముగా నవ్య ప్రబోధమని చెప్పగలము. ఇట్టి వినతి పత్రములకు శ్రీవారు ఆశా జనకములగు ప్రత్యుత్తరము లిచ్చుచు, ప్రజల కోరికలను నెరవేర్ప యత్నించెదమని విస్పష్టముగ సెలవిచ్చుట ఉదాసీనత వహించియున్న మన రాష్ట్రీయులలో నూతనోత్సాహము వ్యాపింప చేయుననుట నిస్సంశయము.

యదార్థము విచారించి చూచినచో, ప్రజలవలంబించిన పై విధానము రాష్ట్రముయొక్క యిప్పటి స్థితిలో తప్పదయ్యెను. పత్రికలలోను, ఉపన్యాస వేదికలపైనను మన రాష్ట్రవాసు లప్పుడప్పుడు తమ కోర్కెలను వెల్లడించుచున్నమాట వాస్తవమే, కాని ప్రభుత్వము వారినుండి యిట్టి ప్రార్థనలకు ముఖాముఖిగా ప్రత్యుత్తరముల బొందు నవకాశము మన దేశీయులకు ఇంతకు పూర్వము ఉండనేలేదు. మౌన మర్ధాంగీకారమను లోకోక్తిననుసరించిరని సంతసించు వారు సంతసింపగల్గి యుండిరేమో, ప్రభుత్వమువారికి తమ ఆశయములు దెల్పి వారినుండి ప్రత్యుత్తరముల బడయుటకు బ్రిటిషు హిందూ దేశములోగల శాసన సభలవంటి యంశములు మనకు ప్రాప్తము లేక పోవుటవలన, మన ప్రార్థన లరణ్య రోదనము లగుచున్నవనియే పెక్కండ్రు భావించుచు నిరాశావశులగు చుండరి! కాని ఇటీవల ఆరంభింపబడిన వినతి పత్రముల పద్ధతి పై లోపమును కొంతవరకైన తొలగింప గలిగినది. రాష్ట్రవాసులీ పద్ధతివలని లాభమును గ్రహించి, ప్రధాన మంత్రిగారుగాని, శాఖా మంత్రులుగాని జిల్లాలకు దయచేసినపుడు తమ యాశయములను ఉస్మానాబాదు, గుల్బర్గా జిల్లా ప్రజలవలెనే వినతి పత్రములద్వారా ప్రకటించి ప్రభుత్వమువారి యుత్తరము బడయుచుండెదరు గాక!

## స్త్రీవిద్యా మహాసభ

ఢిల్లీ నగరమున జరుగనున్న అఖిలభారత మహిళా మహాసభకు ప్రాంతీయ శాఖయగు హైదరాబాదు మహిళా సంఘమువారు ఇటీవల నొక మహాసభను సమావేశపరచి ఉపయుక్తములగు తీర్మానముల నంగీకరించిన వార్త మన రాష్ట్రము లోని స్త్రీ విద్యాభిమానుల కానందము. యందు పాల్గొనినవిదుషీమణులు సంపన్నులును, అధికార ధూర్వహులునునగు మహాశయుల భార్య లగుటవలన వీరి తీర్మానములు ప్రభుత్వా దరణమునకు పాత్రములగునని తోచుచున్నది. మన ఆర్థిక (ఫైనాన్సు) మంత్రిగారగు నవాబ్ హైదర్ నవాజ్ జంగ్ బహద్దరుగారి సతీమణియు, కరోడ్గిరి నాజిము గారగు రుస్తుంజీగారి యర్ధాంగియు, విశ్వవిఖ్యాతయగు శ్రీమతి సరోజినీ దేవిగారును శ్రీమతి మనోరంజిత పిళ్లెగారును, మాల్వీ హుమాయూన్ మిర్జాగారి భర్యయు, యీ మహాసభయం దెక్కువ శ్రద్ధతో పాల్గొని యుండిరి. మధ్య తరగతికి చెందిన స్త్రీలు ఈ సభయం దెక్కువ జేరుటకు అవకాశములు లేక పోయెనను లోప మొకటి తప్ప, ఈ మహాసభ జయప్రదముగ నెరవేరిన దనుటకెట్టి సంశయమును లేదు.

తీర్మానములలో ముఖ్యము లైనవివి:—
(౧) రాష్ట్రములోని బాలికలకు సర్బంధముగా ప్రారంభ విద్యను గరుప వలయును. (౨) పదునారు వత్సరములకు ముందు బాలికలకు వివాహములు కాకుండ నిషేధింప వలయును.

(3) పాఠ శాలలో జరుపు చున్న బాలిక యారోగ్యమును పరీక్షించు చుండవలయును. ఈ విషయములనుగూర్చి ప్రభుత్వమువా మహా సభవారు ప్రార్థించి యుండిరి. పురుషు చేయు వానింటె స్త్రీలు చేయు ప్రార్థనము ప్రభుత్వమునకు ఎక్కువ ఆదర ణీయము గ నుండుట నైసర్గిక మగుటవలనను, స్త్రీ యభ్యు దయమునుగూర్చి స్త్రీలే విన్నవించు నినచో అట్టి విన్నపముల ప్రభావము ఎక్కు ప్రబలముగా నుండును కనుకను ప్రభుత్వము రి యంగీకారము నీ ప్రార్థనలు సులభముగ డయ గల్గునని నమ్ముచు, ప్రజాహిత జీవన వైపు ముందంజ వేయుచున్న మా సోదరీ ణులను మేము ఉత్సాహ పూర్వకముగ నభి దించు చున్నాము.

## సంస్థానాధి పతులకు వారియాస్తి నప్పగించు

శ్రీ రాజారాయ్ రాయాన్ గారి జాగీరు కాలమునకు వారికి అప్పగింపబడిన వార్త ష్ట్రియులందు సంతోష తరంగములను జని చేయుననుట నిర్వివాదాంశము. శ్రీ రాజా రాయాన్ గారి నయస్సు ౨౧ సంవత్స ములు దాటియు కొన్ని వత్సరములు గడి యుండెను. విన్నపములు కొన్ని పరంప నంపు కొనినపిదప ఇట్టి ఫలితము లభించు ప్రభుత్వమువారి యధీనమున నుంచుకొన బ మరికొన్ని సంస్థానముల విషయమును దేశీయులందు ఆశాజ్యోతిని వెలిగించు దని మేము విశ్వసించుచున్నాము.

Edited, Printed and Published by K. BALAKRISHNA REDDY at the Golakonda Patrika Press, Troop Bazar, Hyderabad, (Dn.)

Reg No. N. 51

March 1928

# సుజాత

సంపుటము ౨ సచిత్రమాసపత్రిక సంచిక ౩

మార్చి ౧౯౨౮



వార్షికమూల్యము రు. 3 దక్షిణహైద్రాబాదు

సూచన:___

ప్రతిక విషయమై వ్రాయువారు తమచందా నంబరు తెలుపని యెడల జవాబురాజాలదు. ఈనంబరు పైనచు బడిన కాగితముపై, చిరునామాకు ముందుండును.

## విషయసూచిక



రెడ్డి గ్రంథాలయము, హైదరాబాదు.

( రెడ్డిహాస్టల్ వారి అనుమతితో )



హైదరాబాదు మార్చి ౧౯౨౮

సంపుటము ౨ ప్రభవ సంవత్సర ఫాల్గుణము సంఖ్య 3

# ఆంధ్రి పుత్రి!

మల్లాది వేంకట నాగభూషణముగారు

శాతవాహను సహధర్మచారిణియును
సకలవిద్యా నిపుణమతి శక్తి వర్మ
తనయ భర్తృ ప్రబోధిని ఘనయశంబు
నందు రాణిని నెంచుమో యాంధ్రపుత్ర!

ఆంధ్రభూమిని పాలించి యశముగాంచి
నీతిరత్న ఖనియనఁ బ్రఖ్యాతిఁగన్న
సప్తశతి మహారాష్ట్రి భాషను లిఖించు
హాలుని శాతకర్ణుని నెంచుమాంధ్రపుత్ర!

ఆంధ్ర విష్ణు దేవాలయం బమర గల్గి
యాంధ్రవిష్ణు నివాసమై చులరియుండి
దాణ గాంచిన ప్రథమాంధ్ర రాజధాని
యైన శ్రీకాకుళము నెంచు మాంధ్రపుత్ర!

శాతవాహన వంశము ఖ్యాతిగాంచి
యాంధ్ర దేశంబు పాలించు నాటపట్టు
బుద్ధ హిందూమతస్తుల పుణ్యనిలయ
మైన ధరణికోటను నెంచు మాంధ్రపుత్ర!

ఆంధ్ర దేశంపు ప్రాగ్ద్వార మనఁగ వెలసి
ప్రబల విఖ్యాతిగాంచిన పట్టణంబు
నోడలాగెడు రేవౌచు మల్లసిల్లు
నట్టి మోటుపల్లిని నెంచుమాంధ్రపుత్ర!

అల మహారాష్ట్రి పాలన మణచివైచి
విభవమొప్పారగా నిల్చి వేంగిపురిని
నాంధ్ర రాజ్యంబు నిల్పియు యశముగాంచి
నట్టి విష్ణువర్ధను నెంచు మాంధ్రపుత్ర!



# కావ్యముంబట్టి

## కవి గుణశీల విమర్శనము

### దుద్దాల సుబ్రహ్మణ్య శర్మగారు

లోకమునఁ గరచరణాదులందలి రేఖలను గాంచియు, మేని తిలకాదికము లరసియు, సాముద్రికులు పురుషుల గుణశీల నిర్ణయము సేయుచున్నారు. పురుషునిచే నచిరధృతములైన యంగుళీయకాదుల సంస్పర్శనముచే నాధునిక వైజ్ఞానికులు కొందఱు తద్గుణ శీలములఁ జెప్ప సమర్థులగుచున్నారు. జనన కాలమున నభోమండలమున నున్న గ్రహ తారకాది గతుల పరిగణనముచే, జ్యోతిష్కులు పురుషుల గుణశీలములు మాత్రమ్మె గాక వారి వృత్తాంతము లాద్యంతము గనుంగొన నలంతులగుచున్నారు. ఇంతకన్నను నిపుణులైన యిదానీంతనులు కొందఱు, వ్రాయసము మాచియే యొక పురుషుని స్వభావానుభావముల గుర్తింపఁ గలమని ప్రకటించుకొనుచున్నారు. ఇట్లు పురుషునకు మునుముట్టు సంబంధము లేనియు, ఇంచుకయే సంబంధము గల యట్టియు, సాధనముల పరామర్శచేఁ దదీయ గుణశీల నిరూపణము సాధ్యమే యని నమ్మఁబడుచుండగా, కొన్ని యెడల నిరూపింపఁబడుచును నుండఁగా దేని నిర్మితియందు మహాకవి తన యపార లోకజ్ఞానమును అనుభవమును వినియోగించుచున్నాఁడో, దేని యందుఁ దన జీవనాడుల సంచరింపఁజేయు నిర్భరాశయముల నెల్ల నిక్షేపించుచున్నాఁడో, యట్టి కావ్య సంపుటముంబట్టి యా కవి గుణశీలములు కొంత వఱకేని యేర్పఱుప రాకుండునా? అనునది విమర్శకులకే ప్రోత్పాదకమైన విషయమని విన్నవించుచున్నాఁడను. 'Style is th man' (కావ్య రీతియే-కవిస్వరూపము) అని యొక; 'Style is the physiognomy of th mind and a surer index to the char cter than the face' (ముఖ విలాసముల కవుల రచనా రీతులే వారి గుణశీలముల తెలు స్ఫుటతరములైన సాధనములు) అని యింకొకరును సిద్ధులగు పాశ్చాత్య తత్త్వజ్ఞులు స్వాశయముల వెల్ల యున్నారు. 'Shakespeare the man' ఇత్యా ప్రాభిష్ఠ వ్యాసములలోను, 'Life and Socie series' అను పేరికలా విమర్శక గ్రంథ పరం లోను, రీతులంబట్టియు గ్రంథాంతర్గతము నితర సామగ్రిం బట్టియు, కవి స్వరూపాదికములు కొంత గనుఁగొనుట సాధ్యమని యాంగ్ల తత్త్వవేత్తలు నిర్ణ చియున్నారు. ఈ విషయమున నాంగ్లేయులకు మన నెక్కువ సౌకర్యములు కలవు. వారిలో జీవిత చ లనఁగాఁ గవుల శైశవము మొదలుకొని మరణ పర్యం జరిగిన సకల వృత్తముల యథావస్థితముగా వ్రాసి కొను నాచారము కలదు. దీని వలనఁ గవుల స్వ ములు ప్రత్యేకముగానే తెలియఁగా ఆ స్వభావ లు వారి కృతులయందే మాత్రము పొడకట్టుచున్నవో రించు కొనుటకును వినిశ్చయించు కొనుట వారికి సాధ్యమైనది. మనకట్టి

ప్తి శూన్యము. కవులఁగూర్చి గతానుగతికముగా గొన్ని యెడల నత్యంతాతిశయోక్తులతోను, కొన్నియెడల నసంగత ప్రసంగములతోను, చెప్పు గాథలు తక్క మనకు వారినిఁ గూర్చి నిరూఢముగాఁ దెలియవచ్చు విషయ మత్యల్పముగా నున్నది. కొందఱు కవి ప్రకాండుల దేశ కాల నిర్ణయమునకే యుపస్థితి చాలకుండఁగా, వారిస్వభావాదికమునకు బహిస్సాక్ష్యమును వెదకుట శశవిషాణాన్వేషణముగదా! బమ్మెర పోతరాజు హాలికుఁడైన యొక విరక్త భక్తుఁడనియు, శ్రీనాథుఁడు ధనికుల ప్రాపుగాంచి విషయ భోగార్ణవమున నోలలాడుచుండిన యొక యైహిక సుఖ పరతంత్రుఁడనియు, నన్నయ, అవిరళ జపహోమతత్పరుఁడైన యొక వైదికుఁడనియు, తిక్కన రాజ్యాంగ నిర్వహణచణమైన మంత్ర కౌశలముతో వైదికాచార వైభవము వియ్యమందిన యుభయ విద్యా విదగ్ధుఁడైన యొక వ్యవహర్తయనియు, ఇట్టి కొన్ని పోలికలు తత్తద్గ్రంథములలోఁ గవులు స్వంతముగాఁ జెప్పుకొన్న వానింబట్టియు, కొంతదనుక నైతిహ్యములఁ బట్టియు మనకుఁ దెలిసియున్నది. ఇంతకన్న నెక్కువగానే కవుల వృత్తాంతములేని యెఱుఁగుటకు మనకు సాధనములు మృగ్యములు కావునఁ గావ్య పరిశీలనమునఁ దత్తత్కావ్యకర్తల గుణ స్వభావముల గుఱించి మనము నేయు నూహ సంస్థాపించుకొనుటకితర ప్రమాణములు లేవని యేల చెప్పవచ్చును. పోనీ! కొంతవఱకేని కొందఱి గుణములు వ్యక్తములై యున్నవిగదా, ఆ గుణములనేని యాకవుల గ్రంథ రీత్యాదులనుండి మన మేరుకొనగలిగి యున్న అది మన ప్రకృత విమర్శకు సహకారము కావచ్చును. కాని, యిటఁగూడ సాధన సామగ్రికన్నఁ బ్రతిబంధ సామగ్రియే బహుళముగా నున్నది

౧. మనలోఁ బ్రాయికముగా సద్గ్రంథములన్నియు భాషాంతరీకరణములుగా నున్నవి. భారత భాగవత రామాయణములు భాషాంతరీకరణములు. కాశీఖండాది స్థల పురాణములు భాషాంతరీకరణములు నైషధ కిరాతార్జునీయాది కావ్యములు భాషాంతరీకరణములు. వీనిలోఁ గవి మాతృకలోని యర్థముపై దృష్టి పెట్టవలసినవాఁడుగా నుండుఁగావున, [illegible] తని కవకాశ మల్పము. ఇందుఁగవి గుణ విశేషములరయు టెట్లు సాధ్యమగును?

౨. మనుచరిత్ర, వసుచరిత్ర, మాంధాతృ చరిత్ర, ఇట్టి గ్రంథములు భాషాంతరీకరణములు గాకున్నను, వీనిలోని యితివృత్తములు ప్రఖ్యాతములు కావున నెంతవఱకు కవి మూల గ్రంథముల ననువర్తించుచున్నవో, యంతవఱకందుఁ గవీశ్వరుని స్వాతంత్ర్య మేమియును గానరాదు. పోఁగాఁ గవి యా వస్తువునకుఁ గూర్చిన మెఱుఁగు తెఱుఁగులను బట్టియే యాతని గుణవైశిష్ట్యము కని పెట్టవలసి యుండును. కాఁబట్టి యీకార్యములలో అభీప్సిత విమర్శకవకాశములు పరిమితము లగుచున్నవి.

౩. నాటకములలో నేమాట పట్టినను పాత్రముఖముననే చెప్పింపవలసి యునికిచేతను, కవిస్వంతముగా శ్రవ్యములందుఁబోలె నర్థాంతరన్యాసముఖముననేని తన భావమును దెల్పుకొన వెరవు లేకపోవుట చేతను, అటఁ గవి స్వరూపము కథా పురుషుల ప్రకృతి ప్రసంగములచే నావృతమై గురితింప రాకయుండును. వీని యన్నింటి కంటె బలవత్తరమైన ప్రతిబంధము వేఱొకటి గలదు. అదియేదన,

౪. మనకవులు ప్రాయికముగా సమయ శృంఖలములచే బద్ధులైన యస్వతంత్రులు. ఆచారమునకు దాసులైన గతానుగతికులు. ఈ విషయమున పాశ్చాత్యులకును మనకును అపారమైన భేదము కలదు. ఏకావ్యము రచింపఁ గడఁగినను, మనకు నాయకుఁడు ఉత్తమ ప్రకృతిగా నుండవలయును. కథావసానము లోకప్రచారమున కెంత విరుద్ధముగా నున్నను, నీతినే ప్రతిపాదింప వలయును. గ్రంథాంతమున దుష్టులకుఁ గష్టము, శిష్టులకు శ్రేయము, ఒనఁగూడియే తీరవలయును. ఈ మర్యాద ఆంగ్లగ్రంథముల యందనియతముగా నున్నది ఎట్లుండుట శ్రేయము అను విషయము నేనిటఁ బరామర్శింపను. కాని కవులగుణ శీలముల నిర్ణయించు విషయమున, ఈయాచార పారతంత్ర్యము—ఈ స్వాతంత్ర్యాభావము—వారిచిత్తవృత్తులను మనకు మఱుఁగుపరచు చున్నది. ఆజ్ఞా నిర్వహణ సూత్రపరుఁడైన యస్వతంత్రుఁడు స్వీయాభిరుచుల నెట్లావిష్కరించుకొనఁ గలఁడు?

౫. ప్రాచ్య పాశ్చాత్య గ్రంథముల వేఱుపఱచు పూర్వోక్త విభేదము లట్లుండఁగా, మానవ ప్రకృతినే యంటియున్న ప్రబల తమాంతరాయము కొండొకటి గలదు.. కవి తానెంత భీరువైనను, వీరమునే యుత్కర్షించి వర్ణించును. తానెంత లుబ్ధుఁడైనను, ఔదార్యమునే యగ్గించును; తానెంత దుర్నీతి పరుఁడైనను సదాచారమునే సంస్తుతించును తానెంత క్రూరుఁడైనను, దయాదికమునే కొండాడును. ఇట్టిచోట, కవివాక్కులనుదాటి, యాతని యంతరంగమును జొచ్చుటెట్లు?

౬. ఇంతేకాదు, కవితాను రచించు గ్రంథములలో, రచనా కాలిక దేశకాల పరిస్థితులనో, కథా పురుషుల దేశకాల పరిస్థితులఁ దానూహింపఁగల యంతవఱకో, వర్ణించుంగాని, అతని కృతి తద్దేశ తత్కాల ప్రతిబింబముగానుండుఁ గాని, స్వీయాభిప్రాయప్రతిచ్ఛాయగా నుండదుగదా! మఱి, అట్టి కృతులఁబట్టి కవుల గుట్టు కనిపట్టుట యెట్లు పొసఁగును?

౭. పెక్కండ్రు కవులు, తమ కృతార్థత కొఱకును, తమ యాశయముల లోకమునకు వెల్లడించుట కొఱకును గాక, కృతిభర్తల ముఖోల్లాసము కొఱకును, ప్రజల యాదరము వడయు కొఱకును, తమ గ్రంథముల వ్రాయుచున్నారు. ఇట్టిచోట, వారు తమ భావముల నడఁచుకొని, శ్రోతల ప్రీతికెది పాత్రము లగునని తోఁచునో యట్టివాని నూనవలసిన వారుగా నున్నారు. వీనిలోఁ గవిస్వరూపమును గనుఁగొనుట యెట్లు?

ఇట్లు మన విమర్శనోద్యమమునకు విఘ్నములు పెల్లుగా నున్నవి. వీనినెల్ల మనము కడకొత్త నేరమనుట తెల్లము. ఐనను, ఈ యావరణ సప్తకమునుండియుఁ గవిస్వరూపము కొంచెమో గొప్పో, ఋజువుగానో, కాకయరోళముగానో మనము గుఱతింపఁ గలమనియే నానమ్మకము.

భాషాంతరీకరణములు:— వీనిలో మన భాగ్యవశమునఁ బూర్వకవులు మిక్కిలి స్వాతంత్ర్యము నవలంబించి యున్నారు. 'మక్కికిమక్కి' గానే వారు తెనిఁగించియున్న, అకృతు లెన్నఁడో యడుగంటి పోయియుండును. తిక్కనది యాంధ్రీకరణమే యైనను, ఆయన

„వ॥ తనకావించిన సృష్టితక్కఁ దుని
చేతంగాదు నానేముఖం
బునఁదాఁబల్కిన పల్కు"

వేదముగా స్వాచ్ఛంద్యము నవలంబించి యున్నాఁడు. పోతనయు కొండలు తెలియని దేశములో, 'విబుధ జనుల వలన విన్నంత' యేగాక 'గన్నంత'యుఁ దనకుఁ 'దెలియ వచ్చినంత' యుఁ ... పఱచియున్నాఁడు. ఇట్లే యితరులును; కాఁబట్టి ... మును గుఱించి యెచ్చుపెచ్చుట నిమ్మహానియుఁ ... సొంతశిల్పముం బ్రపంచించి యున్నారో, అచ్చటన్ వీరి స్వస్వరూపమును బ్రత్యక్షీకరించుకొన నవ... చున్నది. ఆవివరము లెల్ల నిటఁ దడవుట యనవసరము; దిక్ప్రదర్శనముగా నొండు రెండుదాహరణముల ... మొసఁగెదను.

౧ నన్నయ భట్టారకుని భావమున— ఆదికొన్న ... అర్జునుని తీర్థయాత్రా ప్రకరణములోని యాక్రింది ప... మున, వేఁగి దేశ మహత్త్వ మభివర్ణింపఁబడి యున్నది.

సీ॥ దక్షిణగంగనాఁ దద్దయునొప్పిన
గోదావరియు జగదా[illegible]రైన
భీమేశ్వరంబును బెడఁగనుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్త మాగ్ర్యరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీ దేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
తే॥ ణాంబురాశితీరంబున కరిగి సరిత
హారియైన కావేరి మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుచేసి కృతార్థుఁడగుచు"

ఈ వర్ణనమే గాక వేఁగిదేశ ప్రస్తావమే మూ... గ్రంథమున లేదనియు నన్నయ వేఁగి దేశపువాఁడు గా... స్వదేశాభిమాన ప్రేరితుఁడై యీ వర్ణనము చేసెననియు కవి చరిత్రకారులు సిద్ధాంతీకరించి యున్నారు. నన్న... నాఁటి సంస్కృత భారతపుఁ బ్రతులలో నిక్కము... వేఁగిదేశ ప్రస్తావమే లేక యున్న, నది భట్టారకుఁడే ...

ప్పించియున్న, ఆకవి యసమానదేశాభిమానమునకు నింతకన్న వేఱు తార్కాణము కావలయునా? ఆంధ్ర శబ్ద చింతామణియు నన్నయ విరచితమే యని నిరూపిత మగునేని,

"శ్లో॥ స్వస్థాన వేషభాషా
భిమతాస్సంతో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యంతే
వైకృత కావ్యాని చాన్యదపహాయ"

అనునార్యదాని రూఢిసేయు వేఱొక సాధనము గావలెండునా? ఈ రెండు నిదర్శనములుం జాలవా యప్పుడు నన్నయ స్వదేశాభిమానియని యొత్తి చెప్పుటకు?

౨. ఇఁక పోతన తిక్కన విషయములలో, ఇర్వురు చుల్యముగాఁ గావించిన భీష్మస్తవాది ప్రకరణములంబట్టి అనువాద పరతంత్రతకుఁ బోవలయు నెడముపోఁగా పోతన తత్త్వము భక్తిప్రవణమనియు, తిక్కన జ్ఞానప్రవణుఁడనియు, విశదమగు చుండలేదా? భగవత్ స్తోత్రపరములగు భాగములలోఁ బోతన్నగారి విపుల ప్రపంచనము 'ధనమదాంధుల కొలువేల తాపసులకు?' ఇత్యాది భావములలోని నిరంకుశోక్తి వైశద్యము, ఇవివిరక్తభక్తుని మనమ్మోల సాక్షాత్కరింపఁ జేయుచుండలేవా? ఉద్యోగ పర్వములోని రాయబార ప్రసంగములు, యుద్ధపంచక విరాటపర్వములంగనుపట్టు వ్యూహ నిర్మాణ ప్రదేశాది వర్ణనావైచిత్రి, శాంతిత్రయము నందలి కర్మబ్రహ్మప్రతిపాదక వివిధకథా విధానములు, మాతృకాయత్తతనుఁ జెందవలయు మేరనంతయుం దొలంచినను, తిక్కనను రాజ్యాంగ వ్యవహార నిపుణునిగాను, రణరంగ ప్రకృతియుం దెలిసిన వీరునిగాను, లోక సంగ్రహార్థము కర్మపరుఁడైన జ్ఞానింగాను జాటుచుండలేదా? కావున భాషాంతరీకరణములు కవిని మఱుఁగు పరుచునవియే యైనను, మహాకవులు తద్బంధమునుండి వెలువడి యొక్కొక్కయెడ స్వతంత్ర కవులకంటెను విశదతరముగాఁ దమ స్వరూపము మనకుం జూపుచున్నారు.

తిక్కన ప్రతిబంధములకును నివృత్త్యుపాయము లిట్టివేకలవు. మన్వా ముక్తాదులు ఇతివృత్తమాత్రమునిర్వాహణ పరములుగాక, రసైక పరములగు వర్ణనాంశములతోఁ గూడి కొన్నవి. కావున నటంగూడఁ గవిస్వరూపము, నించుకయే యగుఁగాక, తానన్మాత్రమేని గుఱితింపఁగల మనుట నిరవద్యము. నాటకములలోఁగవి యవిరళ యవనికాంతరితుఁడై యున్నను, తాను ప్రవేశపెట్టు పాత్రముల చేతను, తాను బొసంగించు సంవిధానము చేతను, తాను జేయు సృష్టిచేతను, తాను వెలయించు సంభాషణ క్రమముచేతను, తనస్వభావమును, ఎంత మెలంకువ కలవాఁడైనను, కొంత వెలిపుచ్చుకొనకుండ నేరఁడు. ఆచారముచే స్వచ్ఛందత యెంత కుంఠితమై యున్నను, కవికి ఏయే పాత్రములతోడి సహానుభూతి కలదో, యేయే సందర్భముల యందు మరతి క్రమమై కవిస్వభావము ప్రకట మగుచున్నదో, యదియు గుఱితింప వచ్చును. ఈ యంశములనెల్ల లక్ష్య పూర్వముగా నిరూపింప వలయునన్న వ్యాస మత్యంత విస్తృత మగును. కావున నప్పనిమాని మొత్తము మీఁద నొక్క మాట చెప్పుచున్నాఁడను. ఒకే సందర్భమును వర్ణించు నిర్వురు కవులలో ఆ సందర్భము నొక్కఁడు మనస్సునకెక్క వర్ణింపఁ గలుగుటయు, నొక్కఁడు మందముగానే వర్ణించుటయు మనము చూచుచున్నారము. భాగవతము లోని ప్రహ్లాద చరిత్రము మన డెందముల బందిగొన్నట్లు నృసింహ పురాణములోని తచ్చరిత్రము మన డెందముల నాకర్షింప దేల? ఇది, విషయ వైలక్షణ్యముం బట్టి గాక, వక్తృవైలక్షణ్యముం బట్టియే యని యొప్పు కొనక తప్పదు. ఒకట వర్ణించువాఁడు, ప్రహ్లాద నారద పరాశరాదుల యీడువాఁడైన భక్తాగ్రేసరుఁడనియు, రెండవదాని వర్ణించువాఁడు నానావోన్మేష మతి ధురంధరుడైన మహాకవి యనియు స్ఫురణములు కలుగుచున్నవి.

"తే॥ యతి విటుఁడుఁగాక పోవుటెట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనా కర్ణనమున?
విటుఁడు యతిగాకపోవునే వెసమదీయ
కావ్యవైరాగ్య వర్ణనాకర్ణనమున!"

అని కొందఱుతుల్యప్రజ్ఞా ప్రతిజ్ఞ వలార్చియున్నను, నూత్నమతులైన పాఠకులు ఈ రెంట నెందుంగవి కృతార్థతరుఁడయ్యెనో కనుంగొనఁ జాలిరే యున్నారు. ఒక కవి కరుణముం జక్కఁగాఁ దీర్పఁగలఁడు, వేఱొకఁడు

శృంగారముఁ జిత్రింపఁగలఁడు. ఒకఁడు హాస్యము నల పఱుపఁగలఁడు. వేఱొకఁడు రౌద్రమును రూపింపఁగ లఁడు. ఒకఁడు వీరమును, వేఱొకఁడు భయానకమును, ఈ భేదములేల? ఎట్లువచ్చినవి? అని ప్రశ్నించు కొందు మేని, 'కవుల యనుభావ భేదములఁబట్టి' యని ప్రత్యు త్తర మొదవుచున్నది. విశ్వవిఖ్యాతు (విశ్వమయులు). విశ్వాత్ములు, అని పేరొందఁదగిన వాల్మీకి, వ్యాసహోమర్ షేక్స్పియ రాది మహానుభావుల గ్రంథము లందును, ఈ వైలక్ష ణ్యము గానవచ్చుచునే యున్నది. ఇహ జన్మమునఁనో, పూర్వజన్మముల నొక్కటనో యనుభవమునకు వచ్చి తన చిత్తమున వాసనా రూపమున నెలకొన్న వృత్తములంగాని కవీశ్వరుఁడు చక్కఁగాఁ జిత్రింప నేరఁడు. ఆ సంస్కార మెంతెంత గాఢమో, వాక్యంతంత తీవ్రి యయ్యఁ జెప్పసమర్థమగు చున్నది. అనుభూతిలేనికవి, చక్క కారముగూర్చి నోపునేమోకాని, రచనకు జీవకళ ము కల్పింప నేరఁడు.

'శ్లో॥ కుసుమానిలిఖంతు నామచిత్రే
కతిచిత్ కారువిశేష రూఢశిక్షాః
సురభిత్వమమూని కింలభంతే
కిముచ్చైతేషురసంపిబంతి భృంగాః''

''శక్తిర్నిపుణతాలోకశాస్త్రకావ్యాద్యవేక్షణా'' అని యాలంకారికు లుగ్గడించిన శక్తిస్వరూప రహ మిదియే.



## సుకవి!

గవ్వా అమృతరెడ్డిగారు

కలికికోమల ముఖకాంతిఁ గాంచినీవు
తన్మయుండవు కాకుము ధాత్రిలోన
ఘన వియోగానఁ గన్నీరుఁ గార్చుచున్న
యింతి హృదయాన విహరించుమెపుడు సుకవి!

జగమునందు విశేష విజ్ఞానరాశిఁ
గూర్చి శాంతినిఁ బొందక గోడుఁజెందు
తాత్త్వికుని స్వాంత పద్మంబుఁ దడుపుమయ్య
శాంతగీతామృతంబును జల్లి సుకవి!

కుసుమకాంతకు బిడ్డ చేకూరుటెట్టు
లనెడి జిజ్ఞాసనీకేల, అనుఁగు సఖుఁడ!
పూవుపిందెకు మధ్య సంపూర్ణ రాగ
భవ్యసూత్రంబుఁగని శాంతి వడయుమయ్య!

ధరణిరాజ్యంబుఁ బాలనా దండధాటి
నేల యత్నింపకోయి? కవీశ! నీదు
ప్రేమపాశంబు నొకసారి వివిధగతుల
విసరిననుజాలు సర్వంబు వివశమగును.

సౌఖ్యసౌధంబునకుఁ గష్ట సాధ్యమైన
కఠినసోపానములఁ గూర్ప కష్టపడకు!
మతులితానంద రాజ్యవిహారణాను
కూల పక్షంబులనువిప్పఁ జాలదీవు!!





# ప్రేమ భావము

ఎం. ఆర్. కే. శాస్త్రిగారు

(గత సంచిక తరువాయి)

## 3

ఎంతవేగంగా నడిచే ఎద్దయినా గంటకు మూడు మైళ్లకన్న ఎక్కువదూరం పోలేదు. మామూలు కంకర రోడ్లమీద నయితేనే ఆమాత్రమన్నా. పల్లెటిదిక్కు పట్టి రోడ్లమీద నడక అంతకన్నా నిమ్మళంగా సాగుతుంది.

ప్రకాశం, రాజేశ్వరీ, తెల్లవారకముందే బయలు దేరారు. బండివాడిని ఎంత తొందర పెట్టినా వాడు ఎద్దుల ఎంత హింసించినా, మధ్యాహ్నానికిగాని ముప్పై అయిదు మైళ్లదూరం వెళ్లలేక పోయినారు. వారు అను కున్న స్థలం చేరేటప్పటికి, ఎద్దుకూడా కుంటినడకతో నాలుగయిదు అడుగులుసాగి అమీద కూలబడ్డది.

ప్రకాశం ఇంకా చాలాదూరం పోవాలి. రాజే శ్వరి మాత్రం ఆ ప్రాంతాల్లోనే ఉండిపోతుంది. ఆదివర కంతా ఎంతో ధైర్యంతో ఉన్నవాళ్లిల్లా ఒకరినొకరు ఎడబాస్తున్నారని, జన్మలో ఎన్నడూ కలుసుకోరని తెలుసుకునేటప్పటికి గుండె గుభేలుమన్నది. ఒకరివైపు ఒకరు చూడలేక పోయినారు. గద్గద స్వరంతో 'ఇక వెళుతాను' అని ప్రకాశం తొందరగా ముందుకు నడిచాడు. 'ప్రకాశం!' అని దిక్కులన్నీ మారు మ్రోగేటంత బిగ్గరగా కేక వినబడ్డది. నిర్విణ్ణుడై, రాజేశ్వరివైపు తిరిగి నిలబడ్డాడు. ఆమె ఎంతో దీనంగా అతనివంక చూస్తూ న్నది. ఒక్కపాటున పరుగెత్తుకువెళ్లి ఆమెను కౌగిటిలో అదుముకోవాలననుకున్నాడు. కాని అంతలో అతని సంగతి జ్ఞాపకం వచ్చింది. వెళ్లిపో అని అర్థం వచ్చేటట్లు చేయివిసిరి అతను వెళ్లిపోయినాడు. రాజేశ్వరికూడా అతను పోయిన దోవవైపే చాలా సేపుచూసి వెళ్లిపో యింది.

* * * *

అప్పటికిప్రొద్దెమాత్రమో లేదు. రాజేశ్వరి చేల గట్లవెంబడి ఊరున్నవైపుకు వెళ్లింది. దోవలో కొందరు గొడ్లను తోలుకు వెళుతూన్న కుఱ్ఱవాళ్లను, అతని తండ్రి ఎక్కడ ఉంటాడని అడిగింది. 'అదుగదిగో! మీకు నూటి గా తాళ్లు కనబడుతున్నాయే, వాటికి కుడివైపుగా వాళ్ల చేనుంది. అక్కడనే ఉంటారు ముసలాయన ఆయన కొడుకూను. ఈ బోదెప్రక్కనుంచే సన్నగా అక్కడికే వెళుతుంది' అని చెప్పారు. ఆమార్గాన్నే అతనున్న పొలందగ్గరకు చేరింది. చేనులో కొంతముందు పనివాళ్లు గడ్డి తీస్తున్నారు. వాళ్లలో ఒకడిచేత అతనికి కబురంపింది.

అతడు వచ్చాడు. దూరాన చూచి పోల్చుకోలేక పోయింది రాజేశ్వరి. ఎంతో మోటగానూ అనాకారి లాగానూ కనిపించాడు.

'నేనెవరో ఎరగవా!' అని అతను దగ్గరకు రావడం తోనే, రాజేశ్వరి అడిగింది.

అతనికిమాత్రం జ్ఞాపకం రాలేదు. వెఱ్ఱివాడిలా గా ఆమెవంక చూశాడు. ఇంతలో ఆమె ఎవరో స్ఫు రణకువచ్చింది. ఉలికిపడి రెండడుగులు వెనక్కివేశాడు.

'మీరా—మీరు, ఇక్కడికి ఎందుకు వచ్చారూ?' అని సవినయంగా అడిగాడు.

రాజేశ్వరి నవ్వింది. 'నీకు తెలియదూ నేను ఎందుకువచ్చానో! నీకోసమే! ఆరోజున—'

'ఇక చాలించమ'నే ధోరణిలో చేయిచూపాడు. 'అమ్మా! నా అజ్ఞానాన్ని మన్నించండి. ఆనాటి బుద్ధి పొరపాటు, ఇంతవరకూ కోలుకోలేను. అక్కడ సుఖంగా కాలక్షేపం చేస్తున్నవాళ్లని ఇక్కడకు తరిమివేశారు. రోజల్లా కష్టపడ్డా పొట్టనిండటం లేదు. మీలాటి గొప్పవారి మీద ఆశలు పెట్టుకున్నందుకే ఇంత చేటు మూడింది.'

'నీవనేదేమో నాకు సరిగా బోధపడటంలేదు.'

'ఏ ముందీ. చిన్నతనంచేత ఏదో ఎరుగక చేసిన దానికి ఇంతవరకూ అనుభవిస్తున్నాను. ఇప్పుడు నాకు భార్యాబిడ్డలూ ఉన్నారు, చిన్నతనం అంతా అంతరించి పోయింది—'

'నన్ను ఇప్పుడేమి చేయమంటావు?'

'మీకు కోపంరాకపోతే—ఇక్కడనుంచి త్వరగా వెళ్లిపోండి. అదే మీరు నాకు చేసేమేలు—'

రాజేశ్వరి ఇక అక్కడ నిలవలేదు. 'ఇప్పుడు ఎక్కడికి వెళ్లుతారు? ఎవరినన్నా తోడుగా పంపనా?' అని అతడు అడిగినా వినిపించుకోకుండా ఒక్క పరుగున ప్రకాశం తాను విడిపోయిన చోటికి వచ్చింది. అక్కడ కూలబడి గుండె పగిలేటట్టు దుఃఖించింది

ఒక గంటసేపయింది. చీకటి పడ్డది. రాజేశ్వరికి ఏమి చేయడానికీ తోచలేదు. అక్కడ నుంచి మాత్రం వెళ్లలేదు. పుట్టింటికా?—వీలులేదు. ప్రకాశం తండ్రి యింటికా? అంత దూరం ఏలా వెళ్లగలదూ, చీకట్లో తోడెవరూ లేకుండా—ప్రకాశం ఏంచేస్తున్నాడో, అతనికి కూడా తనలాగే ఆశా భంగం కలిగిందేమో? అతడుకూడా యింటికి చేరుకుందామని వస్తున్నాడేమో—ఏమైనా సరే అక్కడికి వెళ్లి పోవాలనుకున్నది.

స్త్రీ పురుషుడి అంత ఆలోచిస్తూ కాలంగడపదు. మనసులో అనుకోవడంతోనే రాజేశ్వరి అక్కడినుంచి లేచి రోడ్డు వెంట పరుగెత్తడం మొదలు పెట్టింది. అలా గుఎంత దూరం, ఎన్నిగంటల సేపు పరుగెత్తి చేరుకోగలదు?

పది నిమిషాలు పరుగెత్తి, ఆయాసం పట్టలేక ఒక చోట కూర్చున్నది. ఏమీ ఆలోచన తోచ తల దిమ్మెక్కి పోయింది. అంతదూరం, అవేళ ఏలాగు?——

గుర్రపు డెక్కల చప్పుడు వినబడ్డది. ప్రాణంలేచి వచ్చినట్లయింది. లేచి దోవకు అడ్డం చుని రెండు చేతులూ చాచి 'ఆపండి' అని కేక నిలుచున్నది.

గుర్రం సమీపించింది. దోవలో మనిషి న్నట్టు గ్రహించి రౌతు క్రిందకు దిగి 'ఎవరా న్నది?' అని దగ్గరకు వచ్చాడు. చీకట్లో ముఖం కనబడక పోయినా, అతడు నల్లబై ఏళ్లు పై బడ్డవా జేశ్వరి గ్రహించింది. అతని కాళ్లదగ్గర కూలబడి న్నూ, 'తెలివి తక్కువవాన్ని, చిన్న తనంచేత గొప్ప పొరపాటు చేశాను. నా బ్రతుకంతా పాడయి పో మీకు కూతురిననుకుని, కూతురి మర్యాదనూ గౌ కాపాడటం విధాయకమైతే నన్ను మీగుర్రంమీ కు వెళ్లండి'.

'సరే. మీది ఏ ఊరు? ఎందుకిక్కడ ఉ డు ఉన్నావు? మీవాళ్లు——'

'అంతా దోవలో చెపుతాను. నేను కులా వంపు తెచ్చే పనేం చేయలేదు.'

అతడు వేరేమీ మాటాడలేదు. రాజేశ్వ ముమీద ఎక్కించి తానుకూడా ఎక్కి

ముహూర్తానికి ఒకగంట వ్యవధి ఉన్న అవూరు దగ్గరకు చేరారు. దోవ పొడుగునా, నప్పుడల్లా కథకథంతా రాజేశ్వరి అతనికి చెప్పింది.

ఊరిబయట మర్రి చెట్టుదగ్గర ఆమెను దిం 'అమ్మాయీ! ఇకనీవు మీ యింటికి వెళ్లిపో, ఊళ్లోకివస్తే అందరికీ తెలుస్తుంది. జాగ్రత్త అని గుర్రంఎక్కి ముందుకు సాగి, ఇవతలో ము!' అని కేక వేశాడు. రాజేశ్వరి ఆగింది. ట్టాన్ని ఆమె దగ్గరగా రానిచ్చి, నవ్వుతూ

మరచి పోకమ్మా. మనమడికి నా పేరు పెడతావు కాదూ!, అని వెళ్లిపోయినాడు.

రాజేశ్వరి ఎంతో ఉత్సాహంతో యింటికి వెళుదామని ముందుకు నాలు గడుగులు వేసిందో లేదో, రోజంతా శ్రమపడి ఉండటంచేత సొమ్మసిలి క్రింద పడిపోయింది.

ఎంతసేపల్లా పడిఉన్నదో తెలియదు కాని, ఎవరో తనకు ఉపచారం చేస్తున్నట్టు తోచింది. క్రమంగా కళ్లు తెరచి చూసింది. చీకటి గనుక ఏమి కనబడలేదు. కాని. నిజంగానే ఎవరో తన తల నిమురుతూన్నారు. 'రాజా' అని సన్నని గొంతుతో వినబడ్డది. 'ఎలెక్ట్రిక్ షాక్' తగిలిన దానిలాగా 'ప్రకాశం!' అని అరచి అతన్ని కౌగలించుకున్నది.

ఒకరిచేతులలో ఒకరుచేయేసుకుని అక్కడనే కూర్చున్నారు. రాజేశ్వరి, తన సంగతంతా ఏమి దాచకుండా అతనితో చెప్పింది:! 'మీరుకూడా వచ్చేశారేం?' అని అతన్ని అడిగింది.

'నేనుమాత్రం నీకన్న తెలివిగల వాడినా? నీలాగే ఉన్నదీ నా స్థితికూడా:—చూడు రాజా కొన్ని విషయాలు మనం తెలుసుకుని ఆనందించాలిసినవే ఉంటాయి. అవి ప్రత్యక్షం చేసు కుందామంటే విఫల మనోరథులం కావాలిసి వస్తుంది. అంతేకదూ?'

'అవును అయితే మరిక్కడికెల్లా జేరుకున్నారు?'

'నీమాదిరిగానే. కాని నేను ఒక్కడినే గుట్టమీద వచ్చాను. దాని దోవలో ఒకరికి అప్పగించి, యింటికి వెద్దామని వస్తూంటే నీవు కనబడ్డావు. ఎంత సేపటికీ తెలివి రాలేదు. ఇదొక కొత్త చిక్కు వచ్చిందేమా అని ఆలోచిస్తుంటే ఇంతలో కళ్లు తెరిచావు. కానిఈ మాదిరిగా జరుగుతుందని కలలోఅయినా అనుకోలేదు సుమా. నీవు వెళ్లిపోయిన తరువాత నాకు తెలిసింది. నిన్ను వదిలి వెళ్లడమంటే ఏమిటో!'

'అందుచేతనే కాదూ, మీరు తిరిగి వస్తారేమోనని పిలిచాను, ఎంతరాతిగుండె మీది? నేను పడేవేదన నా ముఖంలో కనబడుతూన్నాకూడా, జాలి లేకుండా వెళ్లి పోయినారే?

'..........

'వెనుకటి సంగతులన్నీ తలపనద్దు. ఇక ఎప్పటికిఈలాగు పారిపోంకదూ? అప్పుడు ఈమాత్రం ఆలోచనే లేకపోయింది. శుద్ధ తెలివితక్కువ వాళ్లం అయిపోయినాం,'

'ఇప్పుడో?'

'ఇప్పుడా, నీవు నారాజావు నేను నీప్రకాశాన్ని,'

'నేను మీవాన్నని మీరు అనుకుంటారని నాకు తెలిసేది ఏలాగు?'

'నేను చెప్తూన్నాను కామా? నామాట నమ్మవూ?'

'అంతేనాఇంకా తెలిసేటట్టు చెప్పలేరూ?'
అని ఆతనివైపుచూసి నవ్వింది.
అతను గ్రహించాడు— తెలిసేటట్టు చెప్పాడు.
ఒకరిచేతులు విడవకుండానే యింటికి బయలు దేరారు.

౪

'పోతేపోనీ, ఎందాకా ఏడవను, వీళ్లకోసరం? ఇద్దరూ బుద్ధి తెలిసిన వారుకానిపసిపాపలు కారుకదా? నిన్నల్లా కూర్చోపెట్టి చిలక్కి చెప్పినట్లు చెప్పాను కదా? చదివిన చదువంతా ఏ నీట్లో కలిపాడో—'అని గొణుగు కుంటూ రాఘవయ్యగారు యింటిముందర పచారు చేస్తూన్నాడు.

ఇంకా సరీగా తెల్లవారలేదు నౌకరులుమాత్రం నిద్ర లేచారు. పెళ్లివారెవరూ నిద్ర లేవలేదు.

'అమ్మో! ఇంకేమున్నదండీ!' అని గుండె కొట్టుకుంటూ ప్రకాశం తల్లి రాఘవయ్యగారు వున్నచోటికి వచ్చింది ఆయన ఆమెవంక తేరి పారజూచి 'ఏమిటే ఉండేది!' అని తెరుబడిగా అడిగాడు. ఏమి టేమిటండీ నాతలకాయి!పిల్లలిద్దరూ కనపడలేదు. పక్కలు నలిగినట్లుగాలేవు. యెక్కడికెళ్లారో—ఏమో—' అని ఏడుపు మొదలుపెట్టింది.

'ఇదుగో నే, ఈ మాత్రానికేనా యీ హంగామంతా? మనవాళ్లిద్దరూ జాగ్రత్తే బాగుండదు. యెక్కడికి వెళుతారు? వాళ్లేమన్న చిన్నపిల్లలా తప్పి పోవడానికి? వాళ్లంతట వాళ్లే వస్తారు. మరేం భయము లేదులే'

'ఏమోనండీ— మళ్లా యెందుకు వస్తారు? ఈ మాదిరిగా,

,నేను చెపుతున్నాను కాదూ యెక్కడికి వెళ్లారో నాకు తెలుసును. రేపు ఉదయానికల్లా రాజేశ్వరి మెడను పుస్తె ముడి పడకపోతే నన్నప్పుడను'

ఆమె లోపలికి వెళ్లిపోయింది. రాఘవయ్యగారు చాలా భయపడుతున్నాడు. ఇద్దరూ ఏమయినారో, యెక్కడకు వెళ్లారో ఆలోచించిన కొద్దీ మరింత దిగులెక్కువయింది. భగవంతుడిమీద భారం వేసి ఏలాకానున్నాదో చూద్దామని కూర్చున్నాడు.

మరి కొంతసేపటికి యింట్లోవ రందరికీ తెలిసింది. ఆడవాళ్లందరూ రాగాలు మొదలెట్టారు. మొగవాళ్లందరూ, తలకొకరు తలోక ఊరికి వెదకడానికి వెళ్లారు.

సాయంత్రమైనది. క్రమంగా రాత్రి అయింది. చుట్టుప్రక్కలఊళ్లనుంచి జనంవచ్చి సావడిఅంతా క్రిక్కిరిసి ఉంది, పురోహితుడు పెండ్లికుమారుడి రాకను లక్షిస్తూ కూర్చుని ఉన్నాడు. కాని అతడేడీ?

ముహూర్తము వేళ సమీపించింది. ఇక రాఘవయ్యగారికి దుఃఖ మాగిందికాదు. వారిద్దరూ తన్నుమోసంచేసి పారిపోతున్నరు. ఇక తప్పటికి ... అని నిశ్చయించుకున్నాడు. పొరుగూరినుంచి వచ్చి ... నందరినీ ఏలాగో సమాధానపరచి పంపాలికా...

రాఘవయ్యగారు లేచి నిలుచుని నాలుగ్ని... చూశాడు అందరూ సందడి చేయకూడా ... ఆయనగొంతు సవరించుకుని ఏదో చెప్పడానికి ... పెడుతూ—ఇంతలోలోపల సందడిఅయింది. ప్రకా... కొడుకు వేషంతో వచ్చి పీటలమీద కూర్చున్నా... దరూ ఒకమారి మాట్లాడేటప్పటికి చాలా ధ్వని... దానికి తోడు భజంత్రీవాళ్లు ఉత్సాహంతో వా... న్నారు. రాఘవయ్యగారు తలతిరిగి పడిపోయినా...

కొంత సేపటికి మెల్లిగా లేచి కూర్చుని ... కలగంటున్నాడో, లేక నిజంగా ప్రకాశం ... మోనని చూశాడు. నిజమే ప్రకాశం తండ్రినిజూ... నవ్వునవ్వి, కనుసైగతో క్షమించమని కోరాడు.

రాజేశ్వరి ఏదీ, వచ్చిందో—రాలేదో—రాఘ... గారు లోపలికి పరుగెత్తారు—ఇంతవరకూ వచ్చి... త్రం పెండ్లిలో కూతురు లేనిది పెండ్లి జరగడం ఏలా?... శ్వరి తట్టిలో కూర్చుని గౌరీపూజ చేసుకొంటోంది.

,వెఱ్ఱివేషాలు,|అనిసణుగుకుంటూ రాఘవయ్య... ,ఏమేవ్' అని భార్యను పిలుస్తూ బయటికి వచ్చా...



# తాపము

మామునూరు నాగభూషణరావుగారు

నీవని భ్రమజెంది తుదకు
  ఎందుకో తపియించుచుంగు...నీవని...

వలుద తెమ్మెరల బుడుతలు
పలుకరించు పులకలకును,
కలికి కోయిలలు బాడెడి
వలపుసోలపు తలపులకును,.........నీవని...

కొదమతేటి రొదలనణగు
కుచ్చితంపు గుసగుసలకు,

గాలికడలి కనులసోలి
ప్రాలుకురుల లీలలకును,............నీవని...

తీయని నా తెనుగుపాట
తేర్చిన మృదుగేయములను
పాయని అనురక్తి గొలుపు
ప్రణయ భావములకెల్లను,.........నీవని...

కలవలె నిలకడలు లేక
నలిగెడి నామానసంబు.............నీవని...

# రెండవ హరిహరరాయలు

పాలకోడేటి వేంకట్రామశర్మగారు బి. ఏ.

(గత సంచిక తరువాయి)

క్రీ. శ. ౧౩౯౭ సంవత్సరమున మహమ్మదుషా కాలధర్మమొందెను. సుల్తాను కుమారులు ధైర్య సాహసములు గాని రాజనీతి గాని లేని వారగుటచే లాల్చీను యనబడు బానిసకు, బానిసలై యుండిరి. జ్యేష్ఠుడును యువరాజునగు ఘాజీయుద్దీను ఆరు మాసములు రాజ్యపాలనము గావించెను. అటుపిమ్మట ద్రోహియగు లాల్చీనుడు అతని కండ్లూడ బెఱికించి సాందూరు కోటలో ఖైదీగా నుంచెను. రాణి భయపడి బానిస గావించు దుష్కార్యములకు ప్రతిభంగము గావింపజాలక అతనికి బానిసగా నుండెను. రెండవ కుమారుడగు షమ్సుద్దీనుని లాల్చీనుడు సింహాసనముపై గూర్చుండబెట్టి తాను రాజ్యపాలన గావించుచుండెను.

సర్దారులు సామంతులు మొదలగు వారు బానిస చేయు దుర్మార్గములను గాంచియు నతని యందలి భయముచే మిన్నకుండిరి. దావూద్ఖానుని పుత్రులు మహమ్మదుషా యొక్క నల్లుండ్రును, బల ధైర్య సాహసాదులు కలవారగుటచే నీబానిసను తొలగించుటకై యుపాయములను బన్నుచుండిరి. వీరు భార్యల ప్రోత్సాహముచే లాల్చీనుని దుదముట్టించుటకు కుట్ర చేయుచుండుట లాల్చీను తెలుసుకొనెను. అందుచే దావూద్ఖానుని పుత్రులగు ఫిరోజిఖాన్ అహమ్మదుఖాన్ అను వారలు గుల్బర్గానుండి పారిపోయి సాందూరు కోటను బట్టుకొని అచట దాగియుండిరి. అచట ఘజీయుద్దీనునకు ధైర్యము చెప్పి మఱొక బానిస సహాయమున సైన్యమును కూడబలిచి గుల్బర్గాను ముట్టడించుటకై చనెను. లాల్చీను వీరి నడవడికను చారులచె తెలుసుకొని వారి సైన్యమును కొంది దూరముననే తాకి కలవఱపఱచెను, ఇట్లు సుల్తాను అల్లుండ్రు యోడిపోయి సాందూరుకోటలో తిరిగి శరణుజొచ్చిరి. వీరు ఈ బానిస వాని కుతంత్రములచే లాల్చీనుని ఎట్లయిన దుదముట్టింప నిశ్చయించుకొని యపజయములచే ధైర్యమును విడనాడక జాగరూకులై మెలగుచుండిరి.

ఒకనాడు సాందూరు కోటను వీడి యొకదూత గుల్బర్గా కోటయందు ప్రవేశించి రెండు ఉత్తరములను—ఒకటి లాల్చీనునకును। రెండవది సుల్తాను తల్లికిని అందజేసెను. లాల్చీను చాల సంతోషించెను. ఆ సుల్తాను అల్లుండ్రు, తమ తప్పులు మన్నింప వలసినదనియు, తామిక నెన్నడు నతనిపై నెట్టి కుట్రలు చేయమనియు తనకు గుల్బర్గా యందుండుట కనుజ్ఞ నీయ వలసినదనియు వారు రాణిని, బానిసను వేడుకొనిరి. శత్రువులగు దావూద్ఖాను పుత్రులుచేత జిక్కినచో తనకెట్టిభయ ముండజాలదని సంతసించి వారు గుల్బర్గాకు వచ్చుట కనుజ్ఞ యిచ్చెను.

రాకుమారులు కోటయందు ప్రవేశించిరి. రాణిని, లాల్చీనుని కలుసుకొనిరి. ఒకవారము పది దినములు వారేవిధమగు ననుమానమునకు కారణములేకుండ ప్రవర్తించిరి. లాల్చీనుడు నిజముగ వారు పశ్చాత్తాప పడిరని యభిప్రాయపడి జాగ్రతయందు లేకుండెను. ఒకరోజున నకస్మాత్తుగ ఫిరోజిఖాన్‌ను మూడువందల యోధులతో కోటయందు జొచ్చి ద్వార పాలకులను బంధింపజేసి, పండ్రెండ్రుగురు సాహసులగు యోధులతో విచ్చు కత్తులబూని దర్బారు హాలులో ప్రవేశించి నడ్డగించిన వారినెల్ల నఱుకుట కారంభించిరి. లాల్చీను కుమారులును పటిలొందఱును యీ యుపద్రవమును గాంచి యేమియు

తోచక వారి నెదిర్చి ప్రాణములను గోల్పోయిరి. లాల్చి నుపారి పోవుటకు యత్నించియు విఫల మనోరథుడై పట్టుబడెను. అంత ఫిరోజీఖానుని యాజ్ఞలచే నినుప గొలుసులచే బంధింపబడి బందిఖానాలో నుంచబడెను.

సాందూరు కోటనుండి ఘాజియుద్దీను గుల్బర్గాకు వచ్చెను, బందిఖానా యందున్న లాల్చినుని భటులు దీసుకొని వచ్చి యతని పాదములవద్ద బడవేసిరి. అప్పుడు గ్రుడ్డిగా జేయబడిన ఘాజియిద్దీను కత్తి చేబూని యొక వేటుతో లాల్చినుని నరికివేసెను. తదనంతరము ఘాజీ మక్కాకు బోదలచి సహాయమును కోరగా దావూద్ఖాను ని పుత్రు లంగీకరించి తగు మర్యాదలు గావించి యతనిని మక్కాకు బంపివేసిరి.

పేరునకు మాత్రము సుల్తానుగా నుండిన షిమ్సుద్దీనుని కండ్లూడ బెఱికించి బందీకృతుని గావించినపిమ్మట ఫిరోజీఖానుడు ఫిరోజిషా యను బిరుదముతో గుల్బర్గా సింహాసనముపై నిర్భయుడై గూర్చుండెను. ప్రజలను యితని ధైర్య సాహసములకు మెచ్చి సంతుష్టులైరి.

అప్పటికిని శత్రువులు తన కపాయము జేయకుండ నుండుటకై దేశమందు నూతనోత్సాహము గలిగింపజొచ్చెను. విజయనగర సామ్రాజ్యము దినదినాభివృద్ధి గాంచుటయు, గుల్బర్గా రాజ్యము క్షీణించుటయు దక్కను మహమ్మదీయులకు కష్టముగా నుండెను. మఱియు పూర్వము తమ స్వాధీనమందున్న రాయచూరు ముద్గలు మండలములు రాయల స్వాధీనములో నుండుట షిమ్సుద్దీనుని యుద్దేశమున కనుకూలముగా నుండెను. ఇంతవరకు గుల్బర్గా రాజ్యము గృహ కలహములచే రెండవహరి హరరాయల కోరికలను బంగ పరుపజాలక పోయిరి. రెండవ హరి హరరాయలు తన పట్టుదలచేతను, రాజ నీతిచేతను, సులభముగా రాయచూరు ముద్గలు మండలములను స్వాధీన పఱచుకొని తన కోరిక నెరవేర్చుకొనెను.

గుల్బర్గాయందు పరిస్థితులు శాంతి పడుటయు ఫిరోజ షాయుద్ధ సన్నాహములు చేయించుచుండుటయు రాయలు తెలుసుకొనియే ముద్గలకోట సంరక్షణార్థము కొంత సైన్యమును బుత్తెంచెను, అంతటితో నూరకొనక గుల్బర్గా సుల్తానునకు సామంతుడును బలవంతుడు నగు నరసింహరాయలను పురికొల్పెను. సుల్తానుని న్నడు కృష్ణావేణిని దాటెనో నపుడే నరసింహరాయలు బీదరు రాజ్యమును నాక్రమింప నారంభించె.

సుల్తాను తన సైన్యముతో కృష్ణవేణి దరిజేరు ఆ నది పొంగి పొరలుచు శత్రువును మ్రింగునా యను గర్జనలతో ప్రవహించు చుండెను. సుల్తాను సైన్యము నదిని దాటజాలకుండెను. నదిని దాటించు పడవలు లగునవి రాయల యాజ్ఞచే నావలి యొడ్డున కట్టి యుం బడెను. మంత్రులు దండనాధులు మొదలగు వారు ప్రతించి నదిని దాటు నుపాయము నన్వేషించిరి. గా వారికేవిధ మగునాలోచనయు తట్టలేదు. ఇట్లు వీరు పటాయించుచుండగా ఖాజీయొకడు సుల్తానును దర్శిం మఱి యేడుగురు శూరులతో తాను నదిని మారువేష దాటి హిందూ నాయకుని శిబిరము జొచ్చి యతనిని సైన్యమును కలవర పరచెదమని వాగ్దానము జేసె సుల్తాను సరదారులు నతనిసాహసమును యుక్తిని మెచ్చి యనుజ్ఞ యిచ్చి పంపి వేసిరి.

హిందూ సైనికులు విందులతోను, సరస సల్లాప లతోను కాలక్షేపము చేయుచుండిరి. హిందూ సేనా భోగ విశేషములం దత్యంత ప్రియుడగుటచే నప్రమత్త యుండెను. శత్రు సైన్యము నది కావలి ప్రక్కనుండు గాంచియు నే విధమగు జాగ్రతను దీసుకొనక నిర్భయము క్రీడా వినోదములతో కాలము గడుపుచుండెను. దండ నాథులు కూడ నట్లే మెలగుచుండిరి. సైనికు గూడ తమ నాయకుని ననుసరించిరి. నదిని కావలి యున్న సైనికులు హాయిగ నిద్ర జెందుచుండిరి.

సుల్తాను నదిని దాటుటకు పడవలను నుండి దెప్పించుచుండెను. ఖాజీయును నతని భటులు భయంకరముగ బ్రవహించుచున్న ప్రవాహమును యందు దాటి మారువేషములతో దేవదాసీలందు గు ములం జొచ్చిరి. వీరందఱు సంగీత సాహిత్యము లందు కత్తి విద్యయందును, మల్ల విద్యయందును గూడ లగుటచేతను సుల్తాను వారికి ఆవసరమగు ధనమును నొసగి యుండుటచేతను, హిందువుల మాదిరి

దొడగి యుండుటచేతను, దేవదాసులు వారికి దాసులైరి. ఖాజీవారి మేళనాయకురాలిని బుజ్జగించి తన విద్యలను జూపి మెప్పించి, లాలించి, తానుగూడ మేళముతో నామె వెంట దండనాథుని కడకు బోనయుజ్ఞ బడసెను.

ఇట్లు భోగము మేళముతో ఖాజీ దండనాథుని శిబిరము ప్రవేశింపగా నతని యనుచరులు బయటచేరి యుండిరి. ఖాజీ తన సంగీత సాహిత్యములచేతను, యుక్తి వచనముల చేతను, నటనా కౌశలము చేతను బిద్ధృక్షులను వ్యామోహమున ముంచె. సాము చేయుదునని కత్తి చేబూని పలు విధములగు చిత్ర చర్యలచే ప్రజల నానందాబ్ధినిముంచి, బిరబిర కత్తి ఝుళిపించుచు ముందునకురికి, దండనాథుని శిరస్సు నరికెను. ,,పట్టుడు! కొట్టుడు'' అను ఆహా రావములు గుడారంబుననుబయటనుగూడ చెల రేగెను. హిందువులుగూడ విచ్చు కత్తులతో నద్దుగాత్ముని చంపుటకు యత్నించు చుండిరి. ఇంతలో దీపము ఆర్ప బడెను. 'శత్రువులు! శత్రువులు!' అని కేకలు మిన్నుముట్టెను. ఆచీకటిలో ననేకులు హతులైరి. హిందువులు హిందువులనే శత్రువులని తలచి యొకరినొకరు కలియబడి సంహరించు కొనిరి. అనేకులు నాయకుడు లేని కతమున యుద్ధ సామగ్రిని వీడి ప్రాణరక్షణార్థము పారిపోయిరి. తెల్లవారులోపున సుల్తాను కూడ నదిని దాటెను, కాని యెదిరించు శత్రువు లేనందున నవ్వుకొని తన బంటుయగు ఖాజీ యొక్క సాహసమును మిగుల కొనియాడెను, యుద్ధము చేయకనే, తన యోధులకు బని గలుగకనే, శత్రువు లోడింప బడుటయు, వారి యుద్ధసామగ్రియు, ధనమును తనకు సులభముగ దొరకుటయు, నాశ్చర్యమును సంతసమును గలుగజేసెను. మఱియు సుల్తానుచే ననేకులు బట్టుబడిరి. వారిలో బ్రాహ్మణులుగూడ గలరు.

రెండవ హరిహరుడు తుంగభద్రానది యొద్ద వేచి యుండియుండును. అతడు తనకు గలిగిన పరాభవమునకు మిగుల చింతించి సామదాన భేద దండోపాయంబుల సుల్తానును వశపఱచు కొనదలచి దూతల బంపెను. ముద్గల్లుకోటను స్వాధీన పఱచుట కతడు అంగీకరింపజాలడు. బ్రాహ్మణ భక్తుడగుహరిహర రాయలు, బ్రాహ్మణులనువదిలి వేయునట్లు, సుల్తాను సైన్యంబుతో కృష్ణా నదిని దాటి పోవుటకును సంధి గావించుకొనెను. ఇందులకై నమిత ధనమును రాయలు సుల్తానునకిచ్చుట కంగీకరించెను.

సుల్తాను కూడ రాయలు దగ్గఱలో మహా సైన్యముతో నుండినటుల విని సంధియే తన కన్ని విధముల యుత్తమమని యాలోచించెను. యుద్ధ సామగ్రియా దొరకెను. ధనమమితముగా లభించెను. రాయలు నోడింపబడెను. అదియునుగాక బీరారు రాజ్యమంతయు నాంధ్ర ప్రభువగు నరసింహ రాయలకు జిక్కెను. అతని దాడి నరికట్టినగాని గుల్బర్గా రాజ్యము నిలువజాలదు. తన సైన్యముల నచటికి బంపవలెను. ఈ కారణములచే రాయచూరు ముద్గల మండలములు స్వాధీనము గావించుగొనుటకు బట్టుపట్టలేదు. అంతటితో సంతసించి సుల్తాను తన సైన్యములను బీరారునకు మరల్చెను.

సుల్తాను మొదలంప పిన సైన్యము నరసింహ రాయలు నిమర్కొన జాలకుండెను. ఇప్పుడు ఫిరోజిషా సైన్యములు నత్యుత్సాహముతో నరసింహరాయు నెదుర్కొనుటకై మరలెను. నరసింహ రాయలు, విజయనగర చక్రవర్తి యిట్లు సులభముగా సుల్తాను విడుచునని భావింపలేదు. రాయలతో యుద్ధము చేసినచో సుల్తాను యొక్క సైన్య బలము క్షీణించుననియు తన బాహు బలముచే గొప్ప హిందూరాజ్యమును స్థాపింప గలుగుదునని యు యూహించెను. కాని రాయలు యెదుటయు సారధి గావించుకొనుటయు, సుల్తానుయొక్క సైన్యమునకెట్టి విపత్తుగలుగ కుండుటయువిని, సుల్తాను సైన్యములను తాకుటకు వెరచి కార్లే కోటలో సుల్తాను ముట్టడికై వేచియుండెను. ఇచ్చట ఉభయులకును ఘోర సంగ్రామము జరిగెను. ఇరు పక్షములం దనేకులు హతులైరి. కోట స్వాధీన పడలేదు. కాని సుల్తాను ముట్టడి మాన్పలేదు. ఇట్లుండగా కోటలోని యుద్ధ సామగ్రియును భాండారములును తగ్గజొచ్చెను. అందుచే నరసింహ రాయలు సుల్తానునకు లొంగిపోవుటకై నిశ్చయించుకొని రాయబారము జరిపెను. తాను సుల్తానునకు సామంతుని గా నుండుట కంగీకరించెను సుల్తాను అపుడు యెలిచి

పురమున నుండుటచే నరసింహరాయలు నచటకు జని సుల్తానాజ్ఞలకు బద్ధుడనై యుండుననియు వాగ్దత్తము గావించెను. తదనంతరము నరసింహ రాయలు సుల్తాను యందు భక్తి గలిగి మెలగెను.

ఇట్లు ఫిరోజిషా సింహాసనారూఢుడైన పిమ్మట నరసింహరాయల గర్వము నణచియు, విజయనగర సార్వభౌముని పరాభవించియు, గుల్బర్గా రాజ్యవైభవము వృద్ధిపఱచెను.

రెండవ హరిహర రాయలు విజయనగర పూర్వ చక్రవర్తులలో ననేక విధముల నుత్తముడు. సామాన్యముగ ,మహీమండలేశ్వర' బిరుదమును విడనాడి ,మహారాజాధి రాజ రాజ, పరమేశ్వర' బిరుదమును స్వీకరించి కృష్ణవేణి పర్యంతము తనరాజ్యమును వృద్ధిపఱచి విజయనగర సామ్రాజ్య వైభవమును నలుదిక్కుల వ్యాపింప జేసెను. పరదేశీయులు నితనిమైత్రి నభిలషించిరి. విజయనగర వైభవమును మిగుల కొనియాడిరి. ఇతడు అలంకార ప్రియుడగుటచే, ధనవ్యయమునకు వెనుకక గొప్పగొప్ప సౌధములను నిర్మించి పురసౌందర్యమును ద్విగుణీకృతము గావించెను. విజయనగరమును చిత్ర వైచిత్రములతో నలంకరించి కనులపండు వగునటుల గావించినదితడే. ఇతనికి దేవ బ్రాహ్మణ భక్తి మెండు. అందుచే నతడనేక దానములు గావించెను. ఇతడు పండితులను సత్కరించి మెప్పువడసెను. పట్టణమును విద్యాలయములను గట్టించియు, పరదేశీయుల గౌరవించియు ప్రజల శాగోగులను గమనించియు, నష్టములేకుండ నేదోవిధమున శత్రువునైన సంతోష పెట్టియు రాజ్యపాలనము గావించి స్థిరకీర్తి ని సంపాదించెను.

అట్టి హాసముతో, నలంకారములతో, మహాణమేదియో పోవుచుండెనాయను భావము జనుల హృదయముల గగుర్పాటు గలుగజేయునటుల తన సైన్యవారమును యుద్ధరంగమునకు దీసుకొని పోవును—యా హరిహరరాయలు. హరిహరరాయలు గాని దండనాథులు యుద్ధరంగమున బ్రవేశించుచో బ్రాహ్మణులు, గాయకులు, ఏనుగులు, లొట్టిపిట్టలు, పశువులు, భోగపడుచులు, చిత్రవిచిత్రములతో గూడిన వస్తువులు మొదలగున విన్నియు నుండవలెను. ఆ స్థలము నొక మహోత్సవలె వెలయు. ఇతనికి పూర్వమిట్టి యట్టహాసముతో యుద్ధములకు బోయిన చక్రవర్తులు లేరనియే చెప్పవలెను.

రెండవహరిహరునకు విద్యాధరునివంటి మంత్రిగాని, మల్లినాథునివంటి వీరుడుగాని బుక్క రాయవంటి యువరాజుగాని లేడు. దండనాథులు తమ చక్రవర్తి యొక్క శ్రేయస్సును గమనించి మెలకువతో నుండుటకు మారు యుద్ధరంగమున శత్రువులు దాపునసేయు సమయముల క్రీడా వినోదములతోను సరస సల్లాపములతోను కాలము వృథా గావించి నపకీర్తి పాలైరి. అయినను రాయలు రాజనీతి విశారదుడగుటచేత, యుద్ధములందోడినను, శత్రువునెట్లు దేశమునుండి బయటకు పంపుటయునో, తనకెట్టి నష్టము గలుగకుండ సంధిగావించుటయు వలయునో గ్రహింపు గలవాడు.

ఇట్టి విఖ్యాతుడు క్రీ. శ. ౧౪౦౪ సంII పరలోక గతుడాయెను.



# జీవన్మృతుఁడు

## కృష్ణమాచార్లు గారు

బలిహరిశ్చంద్రవిఖ్యాత ప్రభులుఁదొల్లి
న్యాయదాన ధర్మంబుల నియతిమెలఁగి;
శమము, దమమును, సత్యంబు శౌచశౌర్య
మాదిగాఁగల్గు సుగుణంబు లమరఁదమదు

వర్తనంబుల జగతికి వన్నెవెట్ట
బ్రభలమిరుమిట్లుఁగొన్న ఆ భరతమాత!
జీవితాశయుఁబోవ! విశీర్ణవివృత
మృదులవేణీ భరముఁదాల్చి; మేల్మిరుచులు

బారల దశదిశల్ప్రసరించు వదనమండ
లంబు వాడి కళావిహీనంబుఁగాఁగ
విమల తేజోవిలాసిత వీక్షణములు
వెడలుకన్నుదమ్ముల నైజ విభవమెడల;

దీప్త కోమలమౌ మేను తెరపిలేని
ఘోరపుశతఘ్ని కాచ్యుత గోళవహ్ని
దూంట్లు వడిరక్తరేఖలఁ దోఁగియాడ;
ఆత్మఘాతకుల, జనుల నైకమత్య

హీనుల, స్వలాభకాంక్షుల, హేయనీచ
దాస్యశృంఖలారతుఁగాంచి, తలనువంచి
ప్రాణధనములభక్తితోఁ బాదపీఠి
నర్పణనుచేయు ఆపుత్రు లందె జీవ

ములనిలిపి; యేకులై యశ్రుజలము పారఁ
శోకభారంబుతోఁ గ్రుక్కి సొంపుఁదక్కి
రక్తమేలేక జీవచ్ఛవంబువోలె
లేవకుండినమాతృమూర్తినిఁగనంగ

మెదలకుండిన జన్మభూమినిఁగనంగ
హృదయముద్రవింప; తోడ్తోనెఁబెదవులెండ;
పలుకుఁదడఁబడ; కన్నీరుపారవడిగ;
కంపమొందంగ నొడలు ప్రకంపనోద్ధ

తిధ్రదెల్లు మహీజంబు విధమునంది
నరగభువిఁగూలకుండెడి నరుఁడుఁగలడె?
కలఁడె త్రిభువనంబులలోనఁగలఁడె! అట్టి
కఠినకర్కశ పాషాణకలితహృదయు

డెందుఁబోయిన సౌఖ్యంబు నందఁబోడు
కడుభయంకరనిర్జన కాళరాత్రిఁ
జూపుమేరనుగన్పట్టు జ్యోతివోలె;
సుధలఁగురియుచు జనమనో వ్యథలమాన్పి

తన్మయతఁగూర్చు దివ్యౌషధంబువోలె;
దివ్యమగుశరత్కాల చంద్రికలక్రింద
ముగ్ధనలయించి పతికొన మోహపడెడు
పసలమీరెడి ప్రథమ చుంబనమువోలె;

జనులకిల్లనుబాఁ వశ్యంబుఁగూర్చు
తనమనోహర, స్వేచ్ఛగీతములనేని ఁ
గవితకన్యక వానిని కలపలేదు.
ధన, కనక, వస్తువాహనతతులుగల్గి

బిరుదులెన్నియొ కల్గుసబేరుఁడైన;
వన్నమాత్రాన జగములు సాగిలఁబడి
విశ్వమేలెడి భోగదేవేంద్రుఁడైన;
శౌర్యగర్వ ఘూర్వహుఁడైన, సార్వభౌముఁ

డైన, దివినుండిపడ్డవాఁడైననేమి?
రౌరవాది మహాఘోర నరకవాస
నార్హుఁడౌ కృతఘ్నుఁగనఁగ నఘముదగులు
అధముఁడతఁడు జీవన్మృతుఁడాఖలుండు.





# వైదేహుల కాలములోని దక్షిణ దేశము

బి. ఎన్. శర్మగారు, బి. ఏ

రాజద్రోహ నేరముక్రింద ఆర్యావర్తమునుండి తరిమి వేయబడిన నేరస్థులు నివసించు ప్రదేశము దక్షిణాపథమని ఆకాలములో వాడబడు చుండెను. ఋగ్వేదమునందీ శబ్ద మీయర్థములోనే వాడబడినది. ఆర్యావర్తమునకు దక్షిణ దిశయం దుండు భాగమే దక్షిణాపథము లేక దాక్షిణాత్యమని ఆకాలములో వ్యవహరింపబడు చుండెనని పలువురి పండితుల యభిప్రాయము. పాణిని గూడ సహితము దాక్షిణాత్యమను శబ్దము ప్రయోగింపబడినది. బౌద్ధాయనమునందు సౌరాష్ట్రముతో పాటు దాక్షిణాత్యమట్టి వాడబడినది.

ఈ శబ్దముల కర్థమేమైనను వైదేహుల కాలములోనో, అంతకు పూర్వమో ఆర్యులు వింధ్య పర్వతములు దాటి రాజ్యములు స్థాపించి యుండుట చరిత్రాంశము. ఈ దక్షిణ దేశమునందు అనగా వింధ్య పర్వతమునకు కీవలి భాగములో విదర్భ రాజ్యము విదేహ దేశపు రాజగు నిమీ చక్రవర్తి కాలములో ముఖ్యస్థానము వహించియుండెను. ప్రస్తుత మీభాగమే బేరారని వ్యవహరింపబడుచున్నది. గాంధారము రాజగు నాగనాజిత్తుడు, విదేహ చక్రవర్తియైన నిమీ చక్రవర్తి సమకాలికుడని కుంభకార జాతకము, ఉత్తరాధ్యాయమున దెలుపుచున్నవి. ఐతరేయ బ్రాహ్మణమునందు విదర్భ రాజగు భీముడు, నాగనాజిత్తుడు సమకాలికులనుటకు ప్రబలమైన నిదర్శనము గలదు. నిమీచక్రవర్తి కాలములో నీ విదర్భరాజ్యము స్వతంత్ర రాజ్యముగా నుండెనని జైమినీయ యుపనిషద్బ్రాహ్మణమునందు దెలుపబడినది. ఆ కాలములో

నీప్రదేశము పులుల వేంటకు వేట కు... భారత వర్షమున ప్రసిద్ధి వడసి యుండెను. ... షత్తువలన విదర్భ రాజ్యమున అశ్వలాయనుని ... లికుడగు భార్గవి ఋషియున్నటుల, బృహదారణ్య... నిషత్తువలన విదర్భ కౌండిన్యుడను మరొక ప్రసి... శ్వయు డుండెనని కలదు. విదర్భ రాజధానియగు ... నగరమునుండియీ నామము ఈఋషి పొంది... నటుల ననుమానము కలుగుచున్నది. ... తాలూకా (అమరావతి) లోని వార్ధానది ... డిన్య పురమే ఆ కాలమున కౌండీ నగరమై ... వచ్చును. ఈ విదర్భరాజులు మత్స్య వాయు ... అవలన యదు వంశస్థులని తెలుచున్నది.

కుంభకార జాతక విషయములు చరిత్రాన్వే... నమ్మినచో విదేహ చక్రవర్తియగు నిమీ, గాంధా... గు నాగనాజిత్తుడు, విదర్భరాజగు భీముడు క... గు కరండునికి సమకాలికు లనుట నిశ్చయము. ... కళింగ రాజ్యము నిమీ కాలమున, బ్రాహ్మణ... దలి యితర సమకాలికు లగు రాజుల కాలము... నటుల దెలుచున్నది. ఈ జాతక విషయము నే... ధ్యాయన సూత్రములు బలపరచు చున్నవి. ... రాజగుసత్తభుడు కాశీరాజైన ధృతరాష్ట్రు... లానగరపు రాజైన రేణుకకు సమకాలిక ... గోవింద సుత్తంతము (బుద్ధుని సంభాషణము... నిదర్శనముగలదు. కొంతవర కీవిషయము ... ... చే కళింగ రాజ్యము బ్రాహ్...

గమునందు ఉత్కళ రాష్ట్రము మొదలి వైతరిణి నదినుండి ఆంధ్ర సామ్రాజ్యము వరకు ప్రబలి స్వతంత్ర రాజ్యముగా నుండి యుండెను. కళింగ రాజధాని దంతపుర నగరమని జాతకములు, రాజపురమని మహాభారతము, కంచనపురమని జైన చరిత్రకారుల రచనలు తెలుపుచున్నవి. ఈ మూడు నామములలో నేది రాజధాని నామమో యిదమిత్థమని తెలుపుటకు వేరు చరిత్రాధారములు కనుపించుటలేదు.

ఈ బుద్ధుని సంభాషణలవలన అస్సాకమను మరొక రాజ్యము రేణు, ధృతరాష్ట్రుల కాలములో నుండెనని తెలియుచున్నది. బ్రహ్మదత్తుడను రాజు పోతన నగరము రాజధానిగా జేసికొని యీ రాజ్యము పాలించినటుల తెలియుచున్నది. దక్షిణ దేశమున విదర్భ, కళింగ, అస్సాక రాజ్యములు నిమి కాలములో నుండెనని స్పష్టపడుచున్నది.

ఈ దక్షిణా పథమందలి రాజులు 'భోజు'లనియు ప్రజలు 'శతవతు'లని ఆకాలములో వ్యవహరింపబడు చుండినటుల ఐతరేయ బ్రాహ్మణము వలన గలదు. అశ్వమేధ యాగమునకై విడువబడిన సర్వాలంకారశ్వేతాశ్వము భరతుడు పట్టుకొని యీ శతవతులను యుద్ధమునందోడించినటుల శతపథ బ్రాహ్మణమున నుండుటచేసి యీ శతవతుల రాజ్యము గంగాయమునలకు మధ్యన భరత రాజ్యమునకు సమీపమున నుండి యుండవలయును. కాని ఐతరేయ బ్రాహ్మణ యుగమువరకీ రాజ్యము దక్షిణ ప్రాంతమునకు జరిగి యుండవచ్చును. 'భోజులు' 'శతవతులు' యను వంశ సంజాతులనియు, 'వైదర్భులతో వీరికి సంబంధ బాంధవ్యము లుండినటుల మత్స్య వాయు, విష్ణు పురాణములవలన తెలియుచున్నది. మహాభారతము, హరివంశమున, విదర్భ రాజ్యమున భోజకటకమను ప్రదేశ ముండినటు లగలదు. ద్వితీయ ప్రవరసేనుని చమ్మకరాన శాసనమువలన యీ భోజకులకు ప్రస్తుతపు ఇలిచ్‌పూర్ జిల్లాపై యుండినటుల తెలియుచున్నది. అశోకుని శాసనములబట్టి పూర్వ మొకప్పుడు రాజ్యము లేలిన భోజుల జ్ఞాపకార్థమీ భోజకులకు (భోజకుర్గము)



అను పేరుతోక రాష్ట్రమునకు వ్యవహరింపబడు చుండెనని డాక్టర్ స్మిథు యభిమానమై యున్నది. కాళిదాసుడు తన రఘు వంశమునందొక రాజును (విదర్భ) భోజుడని సంబోధించినందు మాత్రమున విదర్భయే భోజరాజ్యముగాక దక్షిణ ప్రాంతపు రాజులందరు భోజులనే పిలువబడు చుండిరనుటకు ఐతరేయ బ్రాహ్మణపు పై సూక్తమే ప్రబల నిదర్శనము. ఈ దండక ప్రాంతములో కొందరు భోజులు రాజ్య పరిపాలనము చేసినటుల అర్థశాస్త్రము తెలుపుచున్నది.

"దాండక్యో నామ భోజః కామాత్ బ్రాహ్మణకన్యాం అభిమన్యమాన సబంధురాష్ట్రో వినాశః..." అనగా దాండక్యుడను నొక దండక రాజు—భోజుడు— కామాంధుడై బ్రాహ్మణకన్యను చెరచినందున బంధువుల సహా రాజ్యములో నశించెనని యర్థము. కుంభావతి నగరము రాజధానిగా గల దండకి యను రాజ్య మాకాలములో నున్నటుల శరభంగజాతకము వలన తెలియుచున్నది. కాని యీ రాజ్యమునకే మధుమంత నగరము రాజధానిగా నుండినటుల రామాయణమునందు గలదు.

బ్రాహ్మణ యుగమునందు, చివర వైదేహ రాజుల కాలములో దక్షిణ దేశమున దండక, అస్సాక, విదర్భ, కళింగ మొదలగు భోజ రాజ్యములేగాక ఆంధ్రుల, పుళిందుల, శబరుల, ములుబుల రాజ్యము లుండినటుల తెలియుచున్నది. చివర నాలుగు జాతులవారు దస్యులని అనగా అనార్యులని— ఐతరేయ బ్రాహ్మణమునందు గలదు. ఆంధ్రులు ద్రావిడులని స్మిత్ యభిప్రాయమై యున్నను శ్రీచిలుకూరి నారాయణరావు పంతులుగారి పరిశోధనలవలన ప్రాచీనాంధ్రులు ఆర్యులని నిశ్చయింపబడినది. ఆంధ్రులు వింధ్య ప్రాంతులనియు, వింధ్య పర్వతమునకు పశ్చిమమున నుండి గోదావరీ కృష్ణల (Valleys)వరకు వీరి సామ్రాజ్యముండెనని పి. టి. శ్రీనివాసయ్యంగారు తెలిపియున్నారు. తెలవాహానదిపై ఆంధ్రపురము లేక ఆంధ్రుల రాజధానియుండెనని సేరివాణిజ జాతకము నందుండుటవలన యీ భాగము మద్రాసురాజధానికి మధ్య రాష్ట్రములకు మధ్య ప్రదేశమై యుండవచ్చును.

మత్స్య వాయు పురాణముల వలననేమి, మహా భారతము వలననేమి శబరులు, పుళిందులు, వైదర్భులు దండకులు. ఆంధ్రులు దక్షిణా పథ నివాసులని దెల్లమగు చున్నది.

పుళిందనగరము—పుళిందరాజుల రాజధాని నగరము—దశార్ధకు ఆనగా విదిశా రాజ్యమున కాగ్నేయమున నుండి యుండును. పురాణములందు కాని యితర గ్రంథములందు కాని మతిజుల విషయమై ఏమియు లేదు. సాంఖ్యాయన శ్రౌతసూత్రములందు మూతిబ చ్ఛివుల విషయముగలదు. మార్కండేయ పురాణమందు ముషికులగురించి గలదు. ఈ ముచ్ఛివులు, మతిజులై యుందురేమో! కాని యిట్టి యూహాలయు చరిత్రాంశములు లభింపకున్నవి. భావి నూతనాంశములు బయలు పడగలవని విశ్వసించుచున్నాము.



# నైరాశ్యము

పుడిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి)

ఈవు నిరతమ్ము నావలెనే నిజమ్ము
జనబహిష్కృత దౌర్భాగ్య జనునికరణి
శిథిలహృదయమ్ముతోడ నిశీదివములు
గడపెదవటంచు నూహింతు; కాని, జగతి
విశ్వపతి! నీయలౌకిక ప్రేమగోరి
త్వన్మనోహరాకృతికి ముగ్ధత్వమంది
త్వన్మురళిగానమునను విశ్వమ్ము మఱచి
త్వద్గుణమ్ముల వినిమోద వార్ధిదేలి
త్వన్మహాకృత్యములకు విభ్రాంతిజెంది
త్వత్పదమ్ముల సర్వమర్పణమొనర్చ
నందకత్తెలు ముగ్ధ వయస్కగాంధ్రు
విలసదనురాగ పూరిత విమలమతులు.

ఘనవశీకరణౌషధ జ్ఞానవతులు
వందలకొలందిగలరు నిరీబడసినిన్ను
నిరుపమానూనదివ్య మాణిక్యహర్మ్య
తలములను హంసతూలికా తల్పములను
మేనురానల్పహర్ష సమృద్ధిదేల్చి
పూర్ణ సంతృప్తి బడయుకపోరు; నీవు
భగ్నహృదయనునన్నులవమ్ముకూడ
స్వప్నమునసేనియును దలపంగబోవు
ప్రతిసుమముఁ జేరు నిందిందిరమును నిన్ను
బొందఁగోరితి, శేలనై మోసపోతి.—





# దాసబోధ

## సమర్థ రామదాస ప్రణీతము

### శ్రీ శేషాద్రి రమణకవులు శతావధానులుగార్లు.

లోకోత్తర పురుషుడనియు నాంజనేయావ తారమనియు విశ్వసింపఁబడు సమర్థ రామదాసు వ్రాసిన మహారాష్ట్ర గ్రంథమునకిది ఆంధ్రీకరణము. సమర్థ రామదాసు దాసబోధను మహారాష్ట్ర భాషయందు ౭౭౫౧ పద్యములలో రచించెను. ఈ గ్రంథమున నైహికము పారమార్థికము జీవులకెట్లుఁ జేకూడునో స్పష్టముగాఁ జెప్పబడినది. జ్ఞానభక్తి కర్మ వ్యవహారములను గూర్చిన నిరూపణములిందు పెక్కులు గలవు. గ్రంథకర్తయగు సమర్థ రామదాసు మహారాష్ట్ర బ్రాహ్మణుఁడు. మహారాష్ట్ర సింహమని లోకోత్తర కీర్తిఁ గాంచిన శ్రీ శివాజీ మహారాజునకు గురువు. లోక జ్ఞానమునందును వేదాంతానుభవమునందును రాజ్య పాలనమునందును శివాజీకి సమర్థ రామదాసు పలుమారుపదేశికుఁడుగ నుండి తన యుపదేశానుసారముగా నీ మహా గ్రంథమును బూర్తిజేసినాఁడు. మహారాష్ట్ర దేశము—నాఁడాపుగా హిందూదేశము యవనాక్రాంతమై ఆర్య ధర్మము నంతరించి జనులు మతాంతరులై పోవుతరి ధర్మ సంస్థాపనార్థము సమర్థ రామదాసు అవతరించి హిందూదేశ ప్రశస్తియు, దేశభక్తియొక్క యావశ్యకము, పరమార్థ నిర్ణయము దాసబోధ ముఖమున లోకమున కుపదేశించి జాతీయతను గాపాడెను. ఈయమూల్య గ్రంథ రత్నమున పదునేడవ శతాబ్దమునాటి పరిస్థితులు ప్రజా కల్లోలములు సుబోధమగుటయే గాక మతమునకు రాజ్యమునకు అవినాభావ సంబంధమున్నట్లుఁగూడ స్పష్టమగును. మొత్తమున నీ గ్రంథము రెండు భాగములుగ నిర్ణయింపవచ్చును. పూర్వార్ధమునఁ బిండోత్పత్తి గృహస్థాశ్రమము కష్టములు త్రిగుణములు ఆరాధనావిధానములు: పరమార్థ నిర్ణయము లోనగు నుపయుక్తాంశములు పెక్కు గలవు. ఉత్తరార్థమున మనుష్య జన్మము వలని ప్రయోజనము ఈశ్వర సందర్శన మార్గము పరమార్థప్రాప్తి కర్మయోగము మున్నగు నమూల్యాంశములు గలవు. గ్రంథమునందుఁ గుటుంబమునందుండి సాధకుఁడు దేశమును జాతిని తరింపఁజేసి తాను తరించు మార్గములు మనోహరముగ సంక్షిప్తముగఁ జెప్పఁబడినవి. శ్రీ శివాజీ కొఱకై ప్రత్యేకించి కావించిన రాజకీయ నైతిక పారమార్థిక బోధన లిందు పెక్కులు గలవు. ప్రత్యంశము ఆధునిక విజ్ఞానములతో శాస్త్రీయ రహస్యములతో నిరూపింపఁబడి పరమ ప్రమాణములుగ నున్నవి. దాసబోధ కేవల మత విషయిక గ్రంథమే గాక రాజనీతి శాస్త్రముగ నితిహాసముగ వేదాంత శాస్త్రముగ నున్నది. చరిత్రకారుల కాకాలపు బరిస్థితులు, కవుల

కమూల్య భావములు పరమార్థ విసులకు తత్వ నిరూపణము దేశభక్తులకు రాజకీయ విజ్ఞానము ప్రసాదించుటలో నిది యమోఘ మగు చింతామణి. సమర్థ రామదాసు లోకోద్ధరణమునకు మూడు మార్గములను జెప్పెను. ౧ నీతి స్థాపనము ౨ ధర్మ స్థాపనము ౩ రాజ్య స్థాపనము. ఈ మూడు ధర్మములలో మొదటి రెండును తాను నెలకొల్పి రాజ్య స్థాపనము శివాజీ చేత జేయించి తన్మతమునకు ప్రాణ భిక్ష బెట్టెను.

మానవ జీవితమునకు నైతిక ధార్మిక రాజకీయ, స్వాతంత్ర్యము లెంత యావశ్యకమో వానిని సాధించు విధ మెద్దియో, ఈ గ్రంథమున సులలితముగా నిరూపింపబడినది. సర్వ వేదాంత గ్రంథములందలి భావము ఈ దాస బోధలో సమన్వయింపబడి జ్ఞాని కుటుంబమున నుండి సంఘమునకెట్టుల సేవగావింప వలయునో నిరూపింపబడినది. ఉపనిషత్తులు, భగవద్గీత జ్ఞానవాశిష్ఠము త్రిమత భాష్యములు, బ్రహ్మ సూత్రములు, మున్నగు వేదాంత గ్రంథములందలి రహస్యములు తేటతెల్లముగా సుబోధముగా సమర్థ రామదాసు చెప్పియున్నాడు. రాష్ట్రాభ్యుదయ సూచకములు, పరమార్థ బోధకములు నగు నంశముల సమర్థుడు యుక్తియుక్తముగా నింపుగ బలుతావుల బ్రసక్తి గలుగ జేసికొని చెప్పినాడు.

సమర్థరామదాసు శివాజీకి సమకాలికుడు. శివాజీ రుద్రాంశమున, సమర్థుడు ఆంజనేయాంశమునను జనించిరి. సమర్థుడు పదురెండవయేట బ్రహ్మచర్యమున నిల్లువిడిచి పండ్రెండేండ్లు ఘోరతపస్సు గావించి శ్రీ రామచంద్ర సాక్షాత్కారము బడసి భరతఖండము నందన్ని భాగములయందుగల పండిత పామరులకు బరమార్థ బోధజేసి దేశమునందంతటను అద్వితీయ మగు ప్రబోధము గావించెను. తన ప్రపంచానుభవము. పరమార్థానుభవము లోకము నుద్ధరించుటకు గ్రంథరూపముగా దాసబోధ యను పేర బ్రచురించెను. క్రీ. శ. ౧౬౭౩ ప్రాంతము నాంధ్రదేశమున కనదివ్య సందేశమును దేశమున జాటనెంచి శివరాముడ ను వానిని దీతాధిపతిని గావించి తంజాపురికేగి శివాజీ సోదరుడగు ఏకోజీకి శ్రీ రామ మంత్రోపదేశము జేసి వేదాంత రహస్య బోధించెను.

శివాజీ చక్రవర్తి సమర్థరామదాసు వద్ద మంత్ర ముపదేశమొంది తనరాజ్య మంతయును ధారపోసెను. ధర్మసంస్థాప నావసరము దెలిసి ఈ రాజ్యమును శివాజీకి తిరుగనిచ్చి తనపేర కొమ్మని కాషాయవస్త్రము నిచ్చెను. అది మొదలు మహారాష్ట్ర రాజ్యమునకు గాషాయ వస్త్రము చిహ్నముగా నున్నది. శివాజీకి రామదాసు గావించిన రాజకీయ బోధనములు వేదాంత బోధనములు. సర్వకాల సర్వస్థలములందును హిందువులకు బఠనీయములై యుపాసనీయ ధనములై యున్నవి.

శివాజీ ఖడ్గ సాధనముచే నూతన రాజ్యము స్థాపించి దేశమును గాపాడ నుద్దేశించిన మహావీరుడు. సమర్థుడు మతవ్యాపకము తృష్ణానిరసనము నైతిక జీవనము పరమార్థ సంపాదనము మానవ ధర్మములని చెప్పి జనంత నుద్ధరించుటకు బూనిన మహోపదేశకుడు. యుభయుల భావము లీదాస బోధలో బ్రతిఫలించుచున్నవి కేవల శుష్క వేదాంతములుగాక ఆచరణ యోగ్యమగు నంతరింద్రియ నిగ్రహము, పరమాత్మ ధ్యానము, మాయానిరాసనము, లోనగు నపూర్వాంశము సమర్థుడు హేతు గర్భితముగా జెప్పినాడు. విద్వాంసులు దాసబోధను రాజనీతి శాస్త్రమని, వేదాంత శాస్త్రమని, పసనేడవ శతాబ్దము చరిత్ర నైతిక గ్రంథమని తలచి యభిమత రహస్యము లబడయుచున్నారు. ఆత్మ స్వాతంత్ర్యము తపించుచున్న సోదరులకీ గ్రంథము సర్వ విషయ బోధకము పఠనీయము. ఆచరణీయము, అపూర్వ కర్తవ్య పరమార్థ దాయక మనుటకు సంశయము లేదు.

కవులకీ గ్రంథమున మధుర భావములు, మహానుభవముగల వారికి వేదాంతచర్చలు రాజకీయ వేత్తలకు చరిత్రాంశములు, కర్తవ్య నిర్ణయమునకు బ్రోత్సాహము జాతీ యాభ్యున్నతికి కారణములు కాగలవు.

కర్మయోగ మై శ్రీకృష్ణుని వమిత మనుటలో మహాశయులీ దాసబోధనే పలుతావుల గీతా రహ

నము సాధారణముగా గొనెను. హిందీ గుజరాతి బెంగాలీ భాషలలో గ్రంథము పరిశుద్ధతమై పూజనీయముగా నున్నది. యావజ్జీవితము పఠించి గ్రహింపవలసిన మతవిషయకర హస్యము లిందనేకములు గలవు. లోకమాన్య బాల గంగాధర తిలకువంటి వేత్తను కర్మయోగిని, త్యాగధనుని స్వరాజ్యము నాజన్మహక్కని పోరాడిన జాతీయ నాయకుని ఆధునిక యుగమునకు ప్రసాదించినది సమర్థ రామదాసు తేజోలేశమగు దాసబోధయే. ఈ యుత్తమ గ్రంథము సులలితముగా బ్రహ్మశ్రీ కొణకంచి చక్రధరరావు పంతులు వారిచే ఆంధ్రమునం బరివర్తితమై ముద్రణమునందున్నది. గ్రంథారంభమున సమర్థ రామదాసు జీవిత చరిత్రము, మతచర్చ, సమకాలిక స్థితులు తెలుపు పీఠికలు గలవు. అందనేక వేదాంత రహస్యములు శివాజీ రామదాసుల సాంఘిక జీవితములు ఆ కాలపు బరిస్థితులు గలవు. సంఘమునకు, వేదాంతమునకు, చరిత్రమునకు, కవిత్వమునకు, దాసబోధ కేంద్ర స్థానమై యున్న విధము పీఠికలో విపులముగాం జర్చింపబడి యున్నవి. ఇట్టి యపూర్వ గ్రంథమింత వఱకాంధ్ర భాషలో వెడలియుండదు. సర్వకాల సర్వావస్థలయందును వివిధ భావానుభావములు గలవారికి గ్రంథరాజము కల్పతరువు—రమారమి గ్రంథము డిమ్మీ సైజులో ౧౦౦౦ పేజీలకు మించియుండును. ఇందలి యంశములు అద్వైత ప్రతిపాదకములుగా దోచినను సర్వమతములవారికిగణనీయములనుటకు సంశయముండదు. ప్రాపకుడు రాజవాడె, భగవాను బాలగంగాధరతిలకు లోకమాన్యకృష్ణలోఖలే. గాంధిమహాత్ముడు మొదలగువారు దాసబోధను సత్ప్రథగునం బొగడుటచే గ్రంథ ప్రశస్తికీ దార్యమను. విన్యా రణ్యులవలె ప్రత్యేక రాజ్యమున్నగాని హిందూమత ధర్మములు నిర్వర్తింపం బడవని తన యాదర్శములలో శివాజీని నిలిపి ధర్మ సంస్థాపనముం గావించి. దేశమునందంతటను దనయమూల్య సందేశములను నాటుటకుం బీఠములను నెలకొల్పిన మహానుభావుడును, జ్ఞాన శిరోమణియునగు సమర్థ రామదాసును దేశమంతయు భగవానుని యవతారముగా భావించు చున్నది. ఇట్టి యవతార పురుషుని జీవితము. ధర్మోపదేశములు, వేదాంతబోధ సర్వకాలములకు సరిపడునదిగా నున్నది. కర్మములను ఫలాశతోం గావింపక గృహస్థాశ్రమమునందుండి మోక్షమును గడించు విధమీ గ్రంథమునందుం జెప్పంబడినటులం బ్రపంచములోని యే గ్రంథమునందును జెప్ప బడలేదని విద్యాధికుల యభిప్రాయము. నీతి, రాజకీయము, సాంఘిక జీవనము, దేశ చరిత్రము, ధర్మాభిరతి, విరాగము, కార్యదీక్ష, పరమాత్మ సందర్శనము మున్నగు నే యుత్తమ గుణములు గోరువారేని యీ గ్రంథమును గాంచిన తరింపంగలరు. ఈ యుత్తమ గ్రంథమును మేము మూలానుసారముగ సంస్కరించి విపులమగు పీఠికతో నాంధ్ర సోదరుల హస్తములం దలంకరించి కృతార్థులము కానున్నారము.

---

## వాంఛ

ఆలపాటి కామేశ్వరరావుగారు

(కవిమండలి)

రమ్యతరమైన శారద రాత్రులందు
ధూమయోనిచయంబెల్లం దూలిపోవ
నాయతాంబరమందు నీహారకాంతి
దారకలుగూడి కుముద బాంధవుడు తేనగ
నతులితానంద రససాగరాంత చలద
నూనవీచీగణంబుల నోలలాడి
యమితమంజుల మధుర స్వరముల సలిపి
వీనులకు పరభృతములు విందుగూర్ప
ఘనతర తరంగిణీ తీరమునకు తావ
కానుపమభవ్య మోహన వేణుగాన
సుచిర విమలామృతంబు నే గ్రోలవచ్చి
యుంటి మద్వాంఛం గృపదీర్పు మోయి కృష్ణ!

"ఆనందలహరి" నుండి



# రక్తమూల్యము

## డాక్టరు ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు

౧



వేరయినను శేషించలేని యొకానొక యుద్యానవనమునందలి యేదో యొక జాతివృక్షమునను గలిగిన దా పుష్పము. ఆపుష్పము మధుర సౌరభపూరితము, హృదయాకర్షణ ప్రతిభగలది. అతిసుందర మైనది. వసతియేదియో తలిదండ్రు లెవరో తెలియకుండుటచే జనులాబాలు 'నబోధ' యని పిలచు చుందురు.

పట్టణమునకు వెలుపల రాజమార్గమునకు ప్రక్క నొక్క సుందరమగు నుద్యానము. ఆ యుద్యానము నందే యొకచోట నా యుద్యాన పాలకుఁడొక కుటీరము— మిక్కిలి చిన్న కుటీరము నా యబోధుని కొఱకు నిర్మించెను. అపుడపుడా యుద్యాన పాలకుఁ డబోధునిగుఱించి శ్రద్ధగైకొను చుండును.

ఆబాలున కా కుటీరము స్వర్గతుల్యమై యున్నది. ఆబాలుని విహ్వలసంగీత మాబాటనుండి పోవువారి నొక క్షణకాలమైన నాపును. సజీవమగు హృదయాకర్షణా శక్తి యాతని స్వరమున గలదు.

అలసిపోయిన యాత్రాయాత్ర జనమాబాలుని యొద్ద కొంతసేపు విశ్రమించెదరు. బాలుడా గంతుకులకు ప్రేమతో చల్లని నీరును ద్రావించును. నింబపల్లవములచే విసరి శీతలవాత సమర్పణ మొనరించును. అమృత పూర్ణ తన మధురగానమును వినిపించును. ఇట్టి యుపచారములను బాలుని వలన స్వీకరించి అలసివచ్చిన వా... మనంతను మఱచిపోవు చుందురు. వారచ్చోట నా... నపుడ బోధునకేదయిన నిచ్చిపోవు చుందురు. దాని బాలుఁడు స్వీకరించు చుండును. కాని యాసమయ... నందా బాలుని నేత్రములు సజలము లగుచుండును.

పదేనువర్షములు గడచినవి; ఇంకను పనితనపు... లా బాలుని సాంగత్యము చేయుచునే యున్నవి. సంతోష, సరళముల జ్యోతియెల్లపు డాతని ముఖ... దాండవించు చుండును. ఈ విధముననే యాతడు కాలమును వ్యయించు చున్నాఁడు.

అతఁడొక నాఁడు తన సంగీతమునందు మగ్న... యుండగా 'అబోధ' యను పిలుపాతని కర్ణముల... రించెను. బాలుఁ డులికిపడెను. కనులఁదెఱచి చూ... నప్పటికి యుద్యాన పాలకుఁడు కట్టెదుట నిలచి... న్నాఁడు. ఏమియాజ్ఞ! యని పలుకుచు బాలుఁడు... చెను.

„నేడు నాతో పట్టణమునకు వచ్చెదవా?"

„ఏల రాకుందును? పని యేదయినఁ గలదా?"

„నీతో పనియేదియును లేదు. రాజుగారి యుద్యా... నేటిదినము ... ఫలములను జేర్చఁబోవు చున్నాఁడను.

ను వెంటఁగొని పోవలఁచితిని. వచ్చెదరా?''

'వచ్చెద' ననుచు బాలుఁడు కుటీరమును నిర్గమించెను.

2

ఉద్యానమున కధికారియగు దినేశబాబుగారు పట్టణమునందలి కీర్తిగాంచిన పెద్దమనుష్యులలో నొకరు. సంగీత సాహిత్యములయందు మిక్కిలి ప్రేమగలవారు. హృదయ ధనాఢ్యుఁడు, మధుర స్వభావము గలవారు. ముప్పది వత్సరములవయస్సుగలవాఁడు. వడియందు మూఁడు వత్సరముల పుత్రుఁడు గలఁడు. అతి సుందరుండగు నా బాలుని 'విధుర' యని జనులు పిలుచు చుందురు.

ఉద్యాన పాలకుఁడు ప్రతిదిన మచ్చటికి వచ్చుచుండును. కాని అతని యొద్ద కేనాఁడుగాని యాబాలుఁడు పోయినట్లెవరు గాని చూచినవారులేరు. ఆనాఁడు మాత్ర ముద్యాన పాలకుని వెంటనున్న బాలుఁడు ఆబాలుని దన వైపున కాకర్షించెను. హృదయ వ్యాపారము నందు బాలురును పటుత్వము గలవారుగనే యుందురు. బాలుఁడటులిటు మాటల బలుకుచు పండ్లగంప యొద్దకు చేరెను. అబోధుని వైపుచూచుచు నీపండ్లన్నిటిని దీసికొని పరువెత్తెన? అని ముద్దుమాటలతో బలికెను.

'మరి — నేనిట్లు నిన్ను పట్టి యుంచినచో?' అనుచు అబోధు డాబాలుని దనబాహువులతో మెలవేసెను. కొంతసేపు వఱకా బాలుఁడు అబోధుని బాహు లతలతో గింజుకొనియెను. కాని ద్రాక్షపండ్లు గుత్తియొకటి చేకొంబడగ నాతని యొడిలోనకు తిన్నగజేరి కూర్చుండెను.

సరిగ నాసమయమున కేజ నేంద్రబాబుగారు నాప్రదేశమునకు వచ్చిచేరిరి. పిల్లల సరళక్రీడలు స్వర్గీయానంద స్రోతస్విని యనఁజెల్లును. అవని యందీనులాఁడుచు దినేశ బాబుగారు పుత్రుఁడగు బాలునుద్దేశించి 'విధుర! ఈ నీ క్రొత్తస్నేహితుని వెంట యుద్యానమునకేగి యుందువా!' యనియెను.

'అఁ — బాబు! ఇంకను మాయమ్మను కూడ వెంట దీసుకొని పోయెదను'

'మరి — నన్ను లేదా!' యనుచు దినేశ బాబుగారు పడిపడి నవ్విరి.

హాస్యమేదో అనవలసినమాట యేదో తెలిసికొన దగిన జ్ఞానము బాలురయందు గలదు. తండ్రియనిన మాటయందలి మర్మము గ్రహించి విధురుఁడు లజ్జనందెను. తక్షణమే అబోధుని యొడినుండి లేచివచ్చెను.

తెచ్చిన ఫలములు గృహములో నకుబంపబడెను. ఫలములు స్వీకరింపఁబడిన పిమ్మట రిక్తమైనతట్ట నొకఁడు దెచ్చి యుద్యానపాలునకీయబడెను. ఉద్యానపాలకు డాతట్టను స్వీకరించి దినేశ బాబుగారికి నమస్కరించి యచ్చోట బాసెను. మెల్లమెల్లన బోధుఁడాతని ననుసరించెను. విధురుఁడు మౌనముగా నిలిచి యాతనివైపు జూచుచుండెను.

3

అబోధుఁడు ప్రతిదిన మక్కడకు వచ్చి పోవఁదొడఁగెను. బాలకుల హృదయములు రెండును ఏకమై పోయెను. గాఢమైన ప్రీతి వారియందు పాదుకొని పోయినది. దినేశ బాబుగారబోధునలి ప్రీతితో జూచుచుండిరి. ప్రతిదిన ముద్యాన పాలకునకగి విధురునికొఱకేదో యొక క్రొత్త ఫలము దెచ్చి యబోధుఁడతి ప్రేమతో దానిని విధురునకు దినిపించును. అబోధుని రాకడలోనే నాడైన కొంచెమాలస్య మగునేని విధురుని స్వభావము వికలమై పోవును; అతని కేదియు తోపదు. అబోధ విధురుల ప్రేమను మానియుకుసలే యపూర్వ సుఖ మనుభవించుచున్నారు.

దినములు గడుఁచఁజొచ్చెను. విధురుఁడొక ఆంగ్లేయ పాఠశాలయందు ప్రవేశించెను. దినేశ బాబుగార బోధునిఁ గూడా చదివించుటకుగాను పాఠశాలకు బంపఁ జూచిరి. కాని అబోధున కావిషయమునందాసక్తి మాత్రము నుదయింపలేదు దినేశ బాబుగారేమి చేయఁగలరు? విధురుఁడు క్రమముగా నున్నత పాఠశాల ప్రవేశించెను. అబోధుఁ డింకను కుటీరమునందే యున్నాఁడు. అయినను అబోధ విధురుల విజ్ఞాన వివేకములయందమిత మగు నంతరము గలదు. అబోధుని బుద్ధిని, గభీరతను జూచి లోకులందఱు ముగ్ధులగుచుందురు. తమ గృహమునందే నివాస మేర్పరచుకొనుటకు విధురుఁడబోధు ననేక పర్యా

యములు కోరెను. కాని అతఁడా కుటీరమును విడల లేను.

సాయంతన మగుటకొక గడియకాలము కావలసి యున్నది. అబోధుఁడా యుద్యానమునందే తిరుగుచు సం… చున్నాఁడు. అతని ముఖమునందు వికలత, స్వరమునందు వివశత తోఁచుచున్నది. ఏదో కారణమున నాతని హృదయమునం దస్థిరత రాజ్యమేలు చున్నటుల దోఁచుచున్నది! అబోధుఁడా ప్రదేశమందే యొక శిలాఖండముపైఁ గూర్చుండినాఁడు; కాని యాతఁడు సంగీతము నందు లీనమై యున్నాఁడు. అకస్మికముగా నొకబండి నడచుచు వచ్చుచున్న శబ్దము నాతఁడు వినెను. చూచు నప్పటి కాబండి దినేశ బాబుగారిది. హృదయము కొట్టుకొనదొడఁగెను. ఇంతలో నొక సేవకుఁడు బండినిదిగి శీఘ్రముగా నడుగు లిడుచు నబోధుని డాసెను; వచ్చుచునే యా సేవకుఁడు కంపిత స్వరముతో "చిన్న బాబుగారి నోట నెత్తురు—" అని పైమాట నాడఁజాలక పోయెను.

అయసంపూర్ణ శబ్దమును—సేవకునినోట కాతర స్వరముతో వెడలిన ఆ యసంపూర్ణశబ్దమును—వినిన అబోధుఁడు తటాలున శిలాఖండమునుండి లేచి మతి భ్రష్టుని పగిది పరుగున బోయి బండిలోఁ గూర్చుండెను. ఆ సమయమున నాతనిపై యేదశ యావహించిన దెవరెఱుఁగ గలరు?

౮

"నేటికొక సప్తాహ మయ్యెను. విధురుఁడు మంచముపైబడి రోగబాధ ననుభవించుచున్నాఁడు. అతని శరీరమందలి శక్తి యంతయు వ్యయించి పోయినది. శక్తి యను పేరయినను శేషించి లేదు. సర్వదా విస్మృతిలో నుండును. ఆవిస్మృతిలో పిచ్చిమాటలాడును. ఎపుడయిన స్మృతి గలిగెనో కొంచెము కనుల దెఱచును. అబోధుఁడు రాత్రిందివములు విధురుని మంచముకడనే పడియున్నాఁడు. నిద్ర, అన్నము, నీరు మొదలగువాని నన్నిటిని మఱచెను. అతని ప్రాణములు విధురుని యందే వసతి నేర్పరచుకొనినవి; కావుననే యాతనికి స్వశరీరమందు లవమాత్రమైనను శ్రద్ధ లేదు. ఎవని జీవనమే యితరుని కొఱకు వినియోగింపబడునో అట్టివానికి తన్ను గురించి చింతయేల?

డునాఁడు దినేశ బాబుగారు తన యేక పుత్రునకు ప… చిన యీ దశను చూచి మతి భ్రష్టుఁడయ్యెను. … పెద్దపెద్ద వైద్యరాజులు పిలిపింపఁ బడిరి. నా… వివిధ రీతుల నుపచరించిరి. ఏమియు కార్యకా… తుదకు వారందఱుఁగలసి విచారించి "సబలుఁ… మునుండి రక్తముదీసి రోగి శరీరమునం దెక్కించి… రోగము నిమ్మళము కాఁగల" దని దినేశ బాబుగా… డించిరి. ఈ కృత్యమునందే విధురుని జీవితాశ గల…

అందఱును విచారమును భజించుచుండి… టిలో నార్తారావము చెలరేగెను. ఎవఁడు తనశరీ… కరికొఱకు చెఱుచుకొనజాలును? ఒకని మొగ… చూచుకొనఁ దొడఁగిరి. కాని ఏమియు పలుక… డిరి. అంతేవాసికు మౌనము భజించుచుండిన అబో… సత్వరమున లేచి, ముందునకు నడచి "ఈ శరీరము… రక్తమునకంటె శుద్ధ రక్తము మఱెక్కడ ల… వైద్య మహాశయులారా! లెండు. మఱి మీ… నుపక్రమించుఁడు," అనియెను.

అందఱు చకితులై పోయిరి. ఈ విచిత్ర… గుఱించుట కెవనికిని ధైర్యము లేదు. … ప్రత్యేక శబ్దమునందు సత్యము—హృదయము… ప్రత్యేక భాగము సంపూర్ణ బలముతో… దినేశ బాబుగారు అదటి పడిరి. "నాకతని… యెట్టి యధికారము గలదు? సత్పురుషునికొఱకై… నము నేల చెఱుచ వలయును? లోకు లేమనిరో… అని తలచెను. దినేశుని పుత్ర ప్రేమ యుద్దీప్త… అతఁడు నిరాఘాటకముగా నిట్లు బలికెను:—

"వలదు! నేనింకను జీవించి యున్నాను. … రక్తము కావలసి యున్నదో నా శరీరము… నుండు, వేరొకని రక్తముతో పనిలేదు."

"బాబుగారు! మీరు నన్నేల యవమాన… చుచున్నారు?" అని బాలునివలె నబోధుఁడు… మారంభించెను.

"వలదు. పుత్రా! నీవును విధురుఁడును… మానము. నీవు రక్తదాన మొనరించుట… జాలదు."



అవంతీశ్వర దేవాలయము,   అవంతీపురము ( కాశ్మీరము )



గృహనౌక (Hcuse Boat) ఝీలమునది. ( కాశ్మీరము )

'నా కనులుమాత్ర మాపనికి సిద్ధముగనుండునా? అదియునుగాక నా శరీరమునందుగల యింత రక్తమింకే కార్యమున కక్కఱకువచ్చును?'

'మతి—నా—'

ఇంతలో వైద్యుఁడేతెంచి పరీక్షించెను. అబోధునియందు విధురునకమితానురాగ ముండుటచే తండ్రి రక్తమునకంటె పుత్రునిరక్తము—అందు నిష్కలంకమగు యువకురక్తము మిక్కిలి యుపయోగకరమని తీర్మానింపబడుటచే అక్కడనున్నవారు బైటకు బంపఁబడిరి, గది తలుపులు మూయఁబడియెను.

కొంచెము సేపులో నిద్దరు మనుష్యులొక వ్యక్తిని మోసుకొని వెలుపలికి వచ్చుచుండిరి. అతఁడబోధుఁడు శవప్రాయుఁడై యున్నవాఁడు. ముఖమునందలి కళను బట్టి మాత్రమే ఇతఁడింకను జీవించి యున్నవాఁడని తోచుచున్నది. తత్క్షణమే అబోధుని వైద్యశాలకు గొనిపోబడియెను.

౫

ఇపుడిరువురును ఆరోగ్యమందిరి. సమయము ప్రాతఃకాలము—ప్రాతఃకాల శోభ రామణీయకముగ నున్నది ప్రాభాత సౌరభ సమీరము మంద మందముగ వీచుచున్నది. కంపిత స్వరముతో విధురు డబోధునితో 'అబోధా, నీ ఋణమునుండి నే నెన్నటికైన విముక్తుఁడను కూడ నగుదునా?' యనెను.

'విధురా! ఏ ఋణమునుండి?'

'దేని భారముచే నన్నణచి పట్టితివో'

'ఏమి? దానిని నిపుడు నీపై నుంచదలచితివా?'

ఈమాట బలుకునపు డబోధుని వాణియందు తీవ్ర వేదన చూపట్టెను.

'కాదుకాదు, నాభావ మదిగాకుండెను. అదిగో! అదేమి? అబోధ, నీ వేడ్చుచుంటివేల?'

'వడ్డిసొమ్మునదిని జీవించు మహాజనునిగా నీవు దలచుటచేత,

౪

'మంచిది. మరల నిట్టి యనాలోచనము జరుగదు. కాని నాదయితే—'

'ఏమి? నీ యాశయము రెండవ విధముగా నున్నదియా?'

'ఇదియే కదా.—శాశ్వతము పై నీకు ప్రబలాధారములగలవు. ఏ పనికయిన నీవు చెప్పుము—దాని నుత్సాహముగ నొనరించెదను. నీ రక్తముచే మర్యాదగాంచిన నా జీవితమునందు కళంకము గలుగనీయను.'

అబోధుని ముఖమునందొక స్వర్గీయ కళ తాండవించెను. అబోధు డిట్లనియెను;

'పని నీవరయిన నొనరింపవలసినదే. కాని స్వకర్తవ్య పాలనమునందు కఠోరుండై యుండవలయును. దానికొఱకు నీవు నాశనమును పొందెదవేని విచలితుఁడవు కాఁగూడదు. కర్తవ్య పాలనమే నా రక్తముయొక్క నిజమైన మూల్యము.'

విధురుఁడు తలవంచి యీ మాటలను తనహృదయ ఫలకముపై వ్రాసుకొను చున్నాడు. అబోధుఁడు మౌనము భజించెను. కొంచెము సేపునకు నిశ్శబ్దమునకు భంగము గలిగెను.

'నీవునన్నెట్లు విడచిపోయి యెచ్చటనుందువో, అబోధా! చెప్పుము.' అని విధురుఁడడిగెను.

'దాని తెలియుటచే నీవు కొంచెమయినను అధీరుఁడ వయ్యెదవేని నాకు మిగుల దుఃఖముగలుగును. జీవనమును, మోహపాశ బంధమున గట్టియుంచుట మంచిది కాదు.'

'ఇటుల తెలిసికొనఁ గోరుటయును మోహమే నా?'

'పెద్ద మోహము—దీనికంటె పెద్దదియు లేదు.'

విధురుఁడింకేదియు ప్రశ్నింపఁజాలడయ్యె! అతని హృదయమందు తుపానుబుట్టెను.

అబోధుఁడు లేచినిలిచి, 'మంచిది. ఆయితే నేను నిన్ను విడచుచున్నాఁడను.' అనెను,

విధుఁడు శిలా ప్రతిమయై నిలిచియుండెను. ఆతనికను లాతని హృదయమునందలి ప్రేమ రసమును బైటకు దెచ్చి మంట గలుపుచుండెను.

'పోవుచున్నాఁడను' అబోధుఁడు మఱలబలికెను.

'పొమ్మ'ని చెప్పుచు విధురుఁడు తన చేతియుంగరము దీసి యబోధుని వేలునకిడెను. ఇఁక నాతని ప్రేమ నొక శబ్దమునైనను బలుకఁ జాలడయ్యెను. అబోధుఁడు కనులను దుడచికొనుచు అచ్చోటు వాసిపోయెను. మఱల వెనుకకైనఁ దిరిగి చూడలేదు.

౬

ఇరువురు మిత్రుల నెడబాపిన కాలము క్రమముగా నడచుచునే యున్నది. ఇంతలోనే విధురుడేదియే యుద్యోగములనో యొనరించెను. ఆతని న్యాయబుద్ధిని గాంచి ప్రజయేమి, పై యధికారులేమి 'ఈతడు త్వరలో న్యాయాధిపతియైన బాగుండునని' తలచుచుండిరి.

దేశమునందు రాజనైతిక విప్లవము అతివేగముగ నడువజొచ్చెను. దాని నడచుట కఠినమై కనుపట్టుచుండెను. ప్రభుత్వమొకదిక్కు తన యాపచ్ఛక్తిని వినియోగించి దమన చక్రమును నడపించుచున్నది. రెండవవైపు దేశమందలి యువకులు రాష్ట్రీయ యజ్ఞమునందు తమ ప్రాణములను సంతోషముతో నాహుతి నిచ్చుచుండిరి. పశుత్వము దిగంబరియై నాట్యమొనరించుచున్నది. మనుష్యత్వము దుఃఖించుచుండెను. దాని కనులనీరును దుడువ యత్నించెడువారు దుస్తరముగ వేసట బెట్టబడుచుండిరి. న్యాయదత్తువులు పగిలిపోయినవి. సత్యము చైతన్యహీనమై యెక్కడనో కూలబడి పోయినది. ధర్మము యొక్క ప్రాణము తొక్కులాడుచున్నది. అపరాధులతో పాటు నిరపరాధులెందఱో కారాగార ఘట్టములయందు విసరబడుచున్నారు; శృంఖలాబద్ధులగుచున్నారు; ఉరులలో దవుల్కొని ప్రాణముల విడచుచున్నారు, అశాంతి యనెడునగ్ని దేశమును కాల్చి బూడిదిచేయుచున్నది, భీషణ హాహాకారములు ప్రతిధ్వనించుచున్నవి.

అన్వేషకుల హడావడి మిక్కుటముగ పోలీసుల కనులు కర్మచారి ప్రజ్ఞానక్షుప్రత్తై వారికి చతుర్దిశలనుండి అస్త్రశస్త్ర గుప్తభాండాగారములు కాన్పించుచున్నవి.

స్వామి అబోధానందుని గూడ యీరాజ విప్లవాందోళన నేరమునఁబట్టుకొనుటకు సంకల్పింపనైనది. పట్టణమునకు కొంచెము దూరమునఁగల పర్వతముపై నాతని యాశ్రమమున్నది. స్వామి ప్రజ మిక్కిలి నచ్చుచు పోవుచున్నది. ప్రాంతమంతట స్వామి అబోధానంధుని సమ్మానము వ్యాపించి యున్నది. ఎందఱో దీనులు, దుఃఖితులాతని నాశ్రమ స్వీకార మొనరించుచున్నారు. నాయక్షయము నందుచిట్టి జనమంతయు పోలీసు వారికిఁ దోఁ భయానకము ప్రాదుర్భవించుచున్నది. పోలీసు దృష్టి వారియందు దక్కినది. వారే యీ విప్లవమునకు టికిమూల కారకులని వారికి స్ఫురించినది. అసలు ననే-ఆయాశ్రమ ప్రాంతమందే రెండు మూడు రాజనైతిక హత్యలు జరిగినవి. ఎన్నియో దోపిడీలు జరిగినవి. స్వామి ఆబోధానందు డీ నేరమున పట్టుకొనఁబడెను. స్వామి కుటీరమును పరిశోధించునపుడెట్లు దొరికెనో గాని రెండు మూఁడు చిన్నతుపాకులు దొరకెను.

స్వామివారు న్యాయస్థానమునకు గొనిపోబడిరి. వారిపై సామ్రాట్టునకు విరుద్ధముగా యుద్ధమును ప్రేరేపించుట, రాజనైతిక హత్యల నొనరించుట, దోపిడీల నొనరించుట అను నేరములను స్థాపించి యభియోగము జరుపఁబడియెను. కొన్ని దినములు న్యాయస్థానములో ప్రదర్శింపబడినది. పిమ్మట నీయభియోగము ముఖ్యన్యాయస్థానమునకు బంపఁబడియెను.

న్యాయాధీశుని కర్తవ్యమేదియో స్పష్టమగుచున్నది. అభియుక్తునకు విరుద్ధముగా ప్రమాణములన్నియు సబలములై యున్నవి అభియుక్తుడెన్ని సాక్ష్యములో ప్రశ్నింపఁబడియెను. కాని ప్రత్యుత్తరమేదియు నొసగలేదు. తీర్పు చెప్పఁబడియెను. అబోధానందునకు శిక్ష విధింపఁబడియెను.

అభియుక్తుని గొని రక్షకభటులు న్యాయస్థాన

నుండి వెలుపలకిగొని పోవుచుండిరి. న్యాయాధిపతి పీఠము నుండి లేచి వెడలిపోవుటకు సంసిద్ధుఁడై యుండెను. న్యాయవాదులందఱు పీఠములనుండి లేచి నిలిచి యుండిరి. న్యాయాధిపతి న్యాయస్థానమును విడచుటకు మెట్లు దిగుచుండెను. ఇంతలో నాతని కనులకొక యుంగరము మేజాబల్లపై కాన్పించెను. ఆతురతతో నాయుంగరము నెత్తి యాశ్చర్యముతో దానిపై చెక్కఁబడిన 'విధుర' యను పేరును లోలోన చదువుకొనియెను.

న్యాయాధిపతి మనస్సునందు పెద్ద తుపాను లేచెను. రక్షకభటులు గొనిపోవుచున్న అభియుక్తునిపై నాతఁడు వెఱ్ఱివానివలె చూచెను. క్షణకాలమట్లు చూచి న్యాయాధిపతి నిశ్చేతనుఁడై క్రిందబడి పోయెను. ఆతనినోట రక్తము వెడలుచుండెను.

౨

ఉరిదీయు సమయము వచ్చినది. 'మరణించుటకు పూర్వము నీవేమి కోరుకొనియెద?' వని అభియుక్తు నడిగిరి. అభియుక్తుఁడిటుల ప్రత్యుత్తర మిచ్చెను:

'ఉరిశిక్ష విధించిన మన న్యాయాధికారి నొకసారి చూడఁ గోరెదను.'

'వారు రాజాలరు. చాల జబ్బుగ నున్నారు. నోట రక్తము పడుచున్నది.'

అభియుక్తుని ముఖము వివర్ణమయ్యెను. అధీరుఁడై 'ఏ విధముగ నైననేమి నాకొకసారి యాతని దర్శనము లభింపఁ జేయుఁడు. నా ప్రార్థన విని ఆయన అవశ్యము దర్శనమిచ్చుటకు వచ్చెదరు.'

అభియుక్తుని శబ్దములయందు స్నేహముయొక్క కాతరత, విశ్వాసము యొక్క దృఢత నిండియున్నవి. తక్షణమే యొక భటుఁడు న్యాయాధిపతియొద్దకు వెడలియెను.

న్యాయాధిపతి వచ్చి చేరెను. అభియుక్తుఁడు మతిభ్రష్టుఁడై న్యాయపతిపై పునకరికెను. న్యాయాధిపతి ఆవేగముతో నెదురు నడచెను.

'నా ప్రియుఁడా! నా అబోధుఁడా!' యనుచు న్యాయాధిపతి అభియుక్తుని పాదములపైబడి పోయెను.

అదియే ఆతని నోట వెడలిన కడసారి శబ్దము. ఆతనినోట రక్త ప్రవాహము తప్ప నింకేదియు వెడలుట లేదు.

'నా ప్రియుఁడా! విధురా! నేడు నా రక్తము యొక్క మూల్యము నాకు దొఱకినది. లెమ్ము. ఒకసారి ప్రేమతో నాలింగన మొనరించుకొననిమ్ము. ఉరిదీయు సమయము దగ్గరించినది.' అని అభియుక్తుఁడనెను.

విధురుఁడు మఱల లేవనేలేదు. అబోధుఁడిక తాళఁజాలఁడయ్యెను. దబాలున విధురుని శవముపైపడి పోయెను. అబోధుని నోటినుండియు రక్తము ప్రవహింపఁ దొడఁగెను. మిత్రుఁడగు విధురుని వెంట నబోధుఁడు నడచెను.

సంతప్త హృదయులగు నిపురి రక్త మూల్యావన సంయోగ రహస్య మెవరెఱుఁగఁ జాలకపోయిరి. దానిమూల్య మెంతయో యెవరేమి యెఱుఁగుదురు?

---



# చంద్ర మండలపు చోద్యములు

ఎల్. శంకరనారాయణ రావుగారు బి. ఏ. (ఆనర్సు)

రాత్రి ఎనిమిది గంటలు. నేను, అమెరికా దేశమునకు ఉన్నత విద్యాభ్యాసమునకై బోయి తిరిగి వచ్చిన నా స్నేహితుడును, మఱి కొందఱు మిత్రులును, భోజనము జేసి, కాచీగూడా స్టేషను వైపువాహ్యాళి నడలి రైలుకట్ట మీది పెద్దవంతెనమీద గూర్చుంటిమి. నాడు పూర్ణిమ యగుటచే చంద్రుడు తన వెన్నెల వర్షముచే ప్రపంచమంతటిని ముంచి వేయుచుండెను. ప్రకృతి ప్రశాంతమై, వెన్నెలల గ్రోలి సొక్కి-సోలి పోయినట్లుండెను. దగ్గరనున్న రావిచెట్టు ఆకులు కొన్ని గాలికి గదలుచు నిగనిగ లీనుచుండెను. వంతెనక్రింద మడ్డిమడువులో దేరుకొన్న నీరుగూడ తళతళమని మెఱయజొచ్చెను. ఆకాశము వంక దృష్టిబఱుప, అనంత విశాలరంగమున అవాచ్య మాధురీ మహిమతో చంద్రుడు శోభించుచు తన కాంతి కిరణములను సంతతావిరళధారలుగా నలుగడల గ్రుమ్మరించుచుండెను. ఈ దృశ్యమును గాంచి కొంతతడి మేమానంద విభ్రమములచే మాటలుమాని నిశ్శబ్దముగ గూరుచుంటిమి. అంతమాలో నొకడు,

"తలచి చూడంగ నీవు జోడైనవగుచు
భువిమనోజ్ఞంబులగు వస్తువులు రెండె;
వలపు నల్లకలికి [illegible] యొకటి,
నుదిగఅంచు ఫున్నమచంద మామయొకటి;"

యని గొంతెత్తి పాడదొడగెను. దానితో సంభాషణ మరల ప్రారంభమయ్యెను.

"ఇట్టి శోభ గలుగుటచేతనే గ్రీకులు చంద్ర దేవతగా బూజించుచుండిరి."

"ఈ అవాచ్య మాధుర్యమును గాంచియే కవులు వలపు కన్నెమోమును చంద్రునితో సరిపోల్చి[illegible]"

"ఇటలీనాసులీ లావణ్యముజూచియే [illegible] ని (Queen of Night) యని [illegible]"

ఇట్లెవరికి దోచినట్లు వారు ప్రశంసింప[illegible] అంత, నాటి మా సభాధ్యక్షుడగు అమెరికను విద్యా[illegible] వ్వనవ్వుచు,

"చంద్రమండలములోని నిజపరిస్థితులు [illegible] మీకు విత్వమంతయు మాయమయి ఏమట్టి[illegible] నో!" యని ప్రశ్నించెను.

"నీవు పాశ్చాత్య భౌతిక విజ్ఞానము [illegible] కెక్కినది. అందుచే ప్రకృతి సౌందర్యమును [illegible] నేరకున్నావు. ముమ్మాయినా ఆనందించనిమ్ము" [illegible] డు ప్రత్యుత్తర మిచ్చెను.

"ప్రకృతి సౌందర్యముగూర్చి నాకు [illegible] పోలేదు. కాని చంద్రునికి సంబంధించిన సత్య[illegible] [illegible], [illegible] అమ్మలక్కలు సలుపు [illegible] ములు కొన్ని [illegible]మగును. కొందఱు [illegible] ద్రుడు పిల్లలకు బువ్వగుడుపు జాబిల్లికాడు. వస్తువుకాడు. అనంత, అసహ్య, కర్కశ శిలా[illegible] ఘోర భయంకర అగ్నిపర్వతముల కాలవాలము[illegible]

న్నతపర్వతశ్రేణులకు నిలయమును, మానవజీవనమున కయో గ్యమును, నగు మరుభూమి. తెలుపవలెనన్న ఇదియొక పెద్దకథ. వినుటకు మీకు శ్రద్ధలేదు. చెప్పుటకు నాకోపిక లేదు"

"కవిత్వము, మేమెఱిగిన పాటలే. పురాణములు ప్రాతకథలే. ఇక నాకు తెలియని ఈక్రొత్త విశేషముల చెప్పుమ"ని మేమాయనను బలవంతపెట్టితిమి: మధ్య మధ్య ప్రశ్నలువేయుచు సంశయములను నివారించుకొనుచు ప్రాతయభిప్రాయములను సవరించుకొనుచు, మే మాతనినుండి సంగ్రహించిన గాథ యిది:—

## చరిత్ర.

చంద్రమండలముగూర్చి పాశ్చాత్యులలో మొట్ట మొదట పరిశోధన సలిపినవాడు ఎనగ్సా గొరస్ యను గ్రీకువిద్వాంసుడు. చంద్రుడు కొండలు, గట్టులు, పుట్టలు, నదులు, వాగులు గల యొక లోకము గాని, దేవతగాదని యితడు సిద్ధాంతీకరించుటచే దైవభక్తి పరాయణులగు గ్రీకులు, పాపమాతని నాస్తికునిగ దలచి ప్రవాసమున కంపిరి. తరువాత 17 వ శతాబ్దము ప్రారంభమువరకు కొద్దిగనో గొప్పగనో పరిశోధన జరుగుచునే యుండెను గాని, ఎన్నదగిన యంత్రము లేవియు కనుగొనబడలేదు. 1608వ సంగమున గ్యాలిలయోయను ఇటలీదేశపు పండితుడు సూక్ష్మదర్శిని (Telescope) కనిపెట్టెను. దానిమూలమున చంద్రలోకముయొక్క భూగోళపటము (Map) కొకదానిని తయారుచేసెను అతని తరువాత వచ్చినవారు దీనిని అనేకవిధముల సవరించి పెంపొందించిరి. ఆధునిక కాలమున అసమాన శక్తివంతములగు సూక్ష్మదర్శినులను, వైజ్ఞానిక యంత్రములను సహాయముగ గొని నక్షత్రలోకము గూర్చి యనేకులు పరిశోధన సలుపుచున్నారు. కాని వీరిలో నధిక సంఖ్యాకులు సూర్యుడు తదితర గ్రహములను గూర్చియే శ్రద్ధ వహించుచున్నారు. ఏయిద్దరు ముగ్గురు మాత్రమో చంద్రునిగూర్చి పట్టుదలతో పనిచేయుచున్నారు. కాని వీరందరిలో నగ్రగణ్యుడు గత ౭౦ సంవత్సరములనుండి తన శక్తిసామర్థ్యముల నన్నిటిని ధారవోసి విధివిరామములేక, ఒకేపట్టున పరిశోధన సలుపుచున్న ప్రొఫెసరు విలియము పికెరింగు' ఈతడు మొదట కేంబ్రిడ్జిలోను, తరువాత పెరుచు సెట్సులోను; తదనంతరము పెరు, కాలిఫోర్నియా ప్రదేశములలోను 18 సంగరములు చంద్రుని పరీక్షించెను. ప్రస్తుతము 18 సంవత్సరములనుండి జమైకాదీవిలో మాండెవిలీ గ్రామమున. రెండు వేలయిదువదియైదు యడుగుల యెత్తుగల ప్రదేశమున, తన సూక్ష్మదర్శిని నెలకొల్పి తన పరిశోధన సాగించుచున్నాడు. నేడు మన మెఱిగిన చంద్రలోకపు వింతలన్నియు ముఖ్యముగా నితడు కనుగొనినవే.

"అయితే మన భారతీయులు చంద్రునిగూర్చి వైజ్ఞానికముగా నేమియు నెఱుగరా?" యని యొకడు ప్రశ్నించెను.

"ఏమియు నెఱుగరని కాదు. భారత దేశమున ఖగోళశాస్త్రము (Astronomy) మిక్కిలి ఉచ్ఛదశ గాంచెను. అలెగ్జాండరు వెంట మన దేశమునకు వచ్చిన గ్రీకు విద్వాంసులెన్నియో క్రొత్త విషయములను మనవారివద్ద నేర్చుకొనిరి. ప్రపంచమునందెచ్చటను, ఎవ్వరును కలగనక పూర్వమే, మనవారు సూర్య చంద్రుల గమనము, గ్రహణములకు కారణము, కనిపెట్టిరి. వరాహమిహిర, ఆర్యభట్టుని పేరులు కలకాలము నిలిచి పోవును కాని ౧౦ వ శతాబ్దము తరువాత ఆ శాస్త్రమును శ్రద్ధతో నభివృద్ధి పఱచినటుల చరిత్రలో కానరాదు. ఇంతేకాక, మనవారు; రానురాను జ్యోతిష్యము మీదికి తమ దృష్టి నంతటిని మఱల్చిరిగాని ప్రత్యేకముగా నొక్కొక్క గ్రహముయొక్క ప్రకృతిని (Physical form) గూర్చి పరీక్ష సలుపలేదు. అది మొన్న మొన్నటి వఱకు మన దేశములోనే కాక అరేబియా, యూరపులో గూడ జరిగి యుండలేదు. గత ౩౦ యేండ్లనుండియే దీనిగూర్చి పరిశోధన జరుగుచున్నది. అట్టి వారందఱిలో మిక్కిలి విజయము గాంచినవాడు ప్రొఫెసరు పికెరింగే'యని చెప్పవలెను. ఆతడు పరిశోధన సలుపునవి, చంద్ర మండలము, అంగారక నక్షత్రము (Mars). అతని కృషి ఫలితముగ నేడు మనకు, భూలోకములోని కొన్నిచూరు మూలలకంటె, చంద్రలోకము గూర్చి యెక్కువ విశేషములు తెలియును.

"చంద్ర మండలము గూర్చి యెంతవఱకు మనకు దెలియును?"

యని మాలోనొకడు ప్రశ్నించెను.

చంద్రగోళము యొక్క ఒకప్రక్క గూర్చియే మనము సూక్ష్మముగ నెఱుగుదుము. రెండవ వైపు విశేషములు మనకు దెలియవు. భూమిచుట్టు తిరుగుటకు తనకెంతకాలము బట్టునో, ఆకాలములోనే చంద్రగ్రహము తన అక్షరేఖ (Axis) చుట్టు తాను తిరుగును. అందుచేత ఎల్లప్పుడు ఒకే అర్ధభాగము మనకు గోచర మగుచుండును. కాని ఒక్కొక్కప్పుడు మాత్రము, చంద్రుడుభూమి చుట్టు తిరుగుతతి, తన గమనములో, నించుక వంకర టింకరగా సాగుచుండును. అప్పుడు, మనకు సాధారణ దృశ్యముకాని రెండవ భాగములోని కొన్ని ప్రదేశములు కనబడును. మొత్తముమీద చంద్రలోకములోని నూటికి అరువది తొమ్మిదివంతు మాత్రమే మనకు కనబడును. తక్కిన భాగము గూర్చి మనకేమియు దెలియదు. ఈ యదృశ్య భాగము కూడ మనకు ప్రతిదినము దృశ్యమగుచున్న ప్రాంతపు పరిస్థితులనే గలిగి యుండవచ్చును. కాని యిది నిశ్చయముగ ప్రస్తుతము చెప్ప వీలులేదు. దీని గూర్చి 'ఎడ్గారు అలను పో'యను గ్రంథకర్త "హాన్సు ఫాలుయొక్క విచిత్ర వీర కృత్యములు" అనునొక కథ వ్రాసెను; హెచ్. జి. వెల్సు 'చంద్రలోకపు అది మవాసుల' ను వేరొక కథ వ్రాసెను; జూల్సు వెర్నెసు మున్నగు తదితర గ్రంథకర్తలు కూడ తమకల్పనా చాతుర్యముచే, మనకగోచరమగు చంద్రభాగము గూర్చి, వివిధ విశేషములను ఊహించి వ్రాసిరి. కాని ఊహా జనితమగు నీ విషయములు నిశ్చిత వైజ్ఞానికాంశములు కానేరవు. అమెరికాలో నొక వైజ్ఞానికుడు చంద్రలోకమునకు ప్రయాణము సలుపుటకై నొక విమానమును తయారు చేయుచున్నాడు. కాని యింతవఱకు నీ ప్రయత్నము సఫలత గాంచలేదు. వీటి యన్నిటి కంటె ప్రస్తుతము సూక్ష్మదర్శి నియే చంద్రమండలపు రహస్యముల నెఱుగ రాచమార్గమని ప్రొఫెసరు పికెరింగు యభిప్రాయ పడుచున్నాడు. [illegible]

త్మ్యదర్శిని చంద్రుని దాదాపు వేయి మైళ్ల దూర[ము] చెప్పును. అప్పుడు చంద్ర మండలములోని నూరు గుల వెడల్పుగల ప్రతి వస్తువును జూడవచ్చును.

## చంద్రలోక సమాలోకనము

సూక్ష్మదర్శిని ద్వారా చంద్రుని జూచినచో, దృష్టికి గోచరించునటుల చంద్రుడు చదునగు పెనము (Disc) గాక నారింజ పండువంటి గో[ళముగా] విశదమగును. గోళమంతయు సముజ్జ్వల శీతల కాం[తితో] విరాజిల్లుచు అనంతాకాశమున తేలియాడు[చున్నట్లు] కాన్పించును. చూచుటకు చంద్రగ్రహ మొకచోట ఆకాశమున వ్రేలాడియున్నట్లు కాన్పించినను అది త[న అక్ష] రేఖ [Axis] చుట్టు అమిత వేగముతో దిరుగు[ట]యే కాక తత్పరివేష్టితాకాశమున గంటకు [illegible] మైళ్ల చొప్పున పరుగిడుచుండునని గ్రహించవలెను.

ఇక, మనము పొన్న చెట్టు, చెవుల పిల్లి[యని యను]ను నల్లమచ్చపై సూక్ష్మ దర్శిని గురిచేసి, చూ[చిన] నది, కొండలు, గుట్టలు, శిఖరములు, సారంగ[ములు], భూ ఖండములు, తళతళ మెరయు కాంతి [illegible] నల్లని, చీకటి తావులు గల విచిత్ర ప్రదేశమ[ని విదిత] మగును. ఒకప్పుడు చంద్రలోకమంతయు అగ్ని [పర్వ]తములతో నిండియుండెను. అగ్ని జ్వాలా[క్రా]ంతమున 'లావా' యను బఱువు శిలాద్రావకము [అగ్నిపర్వ]తముఖములనుండి వెలువడెను. ఇది ప్రవహించు[ట]మున, పర్వతపు అంచులను ఒరసికొని గంభీర[ములు] విశాలములునగు సారంగములను తయారుచేసెను. శతాబ్దములు గడచిన వెనుక ఈ శిలా ద్రావకము గట్టి పడుటచే పరిసరపు ప్రదేశములన్నియు [illegible]నుకు భూములుగ పరిణమించెను. అమెరికాలోని [illegible]షో, మొంటానా మరు ప్రదేశములు కూడ [ఇట్లే] తయారయినవి.

చంద్ర మండలపు అడ్డు కొలత సుమారు ౨౧౬౩ మైళ్లు. ఇది భూలోకము యొక్క అడ్డు[కొలత]లో పావు మాత్రమే యయినను, అందులో గల [illegible] శిఖరములు మన లోకములో కొచ్చటను [illegible] భూలోకములో అత్యున్నతమయిన ఎవరెస్టు

౨౫౦౧౦ అడుగులు ఎత్తు గలది. కాని చంద్ర మండలములో ౨౫ వేలు మొదలుకొని 30 వేలు అడుగుల వఱకు ఎత్తుగల పర్వత శిఖరములనేకములు గలవు.

ఇక అగ్నిపర్వత సారంగముల ప్రమాణమింతను మించియున్నది. న్యూటను సారంగము ౧౪౩ మైళ్లు పొడుగును, ౭౯ మైళ్లు వెడల్పును, ౨౪ వేల అడుగులలోతును గలిగి యున్నది. ౫౦ మైళ్లు అడ్డు కొలతగల సారంగములెన్నియేని గలవు. భూలోకమంతటికి పెద్దదియగు జపానులోని 'వాల్కానో' అగ్ని పర్వత సారంగము 3౫ మైళ్లు అడ్డుకొలత మాత్రమే గలిగి యున్నది. ఇట్లు భయానక, అద్భుత, ప్రకృతి దృశ్యముల కాలవాలమై చంద్రలోక మొప్పుచున్నది.

'చంద్రమండల మిచ్చటి కెంత దూరములో నున్నది?' యని మాలో నొకడు ప్రశ్నించెను.

ఇతర గ్రహము లన్నిటికంటె చంద్ర మండలము భూమికి సమీపమున నున్నది. అందుచేతనే, అసదృశ శక్తివంతమగు సూక్ష్మదర్శిని సహాయమున మనమితర నక్షత్రముల స్వరూపము గూర్చి దెలిసికొనగలదానికంటె స్థూలదృష్టితోడనే, ఎట్టియంత్ర సహాయము లేకయే చంద్రమండల స్వరూపమును గూర్చి ఎక్కువ విశేషములను దెలిసికొను చున్నాము. చంద్రగ్రహము భూమి కతి సమీపమున నున్నప్పటికి, గంటకు ౨౦౦ మైళ్లు చొప్పున ప్రయాణము సలుపు విమానముతో బయలు దేరినచో చంద్రలోకమును ౫౩ దినములలో జేరగలుగుదుము. కాని యితర గ్రహము లన్నిటిలో మనకతి సామీప్యమున నున్న వేరొక గ్రహమునకు, ఈ విమానములోనే చేయుటకు ౧౪ సంవత్సరముల, పది నెలల, ఆరు దినములు పట్టును.

## చంద్రుని పుట్టుక

చంద్రుని పుట్టుక గూర్చి ఒకప్పుడనేక సిద్ధాంతములుండెను. ఆకాశమున అద్భుతగమనముతో పయనించి పోవుచున్న యొక గ్రహమును, భూమి తన గురుత్వాకర్షణశక్తిచే ఈడ్చి, బంధించి, తనచుట్టు నిల్చు త్రిప్పుచున్నదని కొందఱి యభిప్రాయమై యుండెను. మఱికొందఱు, చిందరవందరగా చెదరియున్న ఛిన్నాభిన్న గ్రహములు కూడికవలన చంద్రగ్రహము జనించినదని సిద్ధాంతీకరించిరి. కాని యీసిద్ధాంతములు సూక్ష్మపరీక్షకు తాళజాలవు. నేటి పరిశోధనవలన బయలుబడిన యంశములకు సమ్మతముగ కూడ లేవు.

ఇప్పుడందఱు ఖగోళశాస్త్రజ్ఞుల (Atronomers) చేత ఆమోదింపబడుచున్నది సర్ జార్జి డార్విను గారి సిద్ధాంతము. దీనివలన చంద్రమండలము, భూలోకమున కతి సన్నిహితగ్రహమే గాక, తోడబుట్టువని కూడ దెలియుచున్నది. వీనసు నక్షత్రమునుండి జూచినచో భూ చంద్రమండలములు, అనంతవినీలాంబరమున ఒక అద్భుతమార్గములో సముజ్వల కాంతితో తేలిపోవుచున్న ఈడు జోడైన రెండు గ్రహములుగ గోచరించును.

డార్విను గారి సిద్ధాంతము ప్రకారము చంద్రమండలము భూమినుండి తెగి, తూలిపోయిన భూఖండము. ఒకప్పుడిది భూగోళములోని భాగమే.

“ఇది నిశ్చయమని రూఢి తెలియుటెట్లు?”

తెలియుట నిజమే. కాని బుద్ధికి నచ్చినట్టి కారణము లనేకములీ సిద్ధాంతములను బలపఱచుచున్నవి.

సుమారు ఆయిదున్నర కోట్ల సంవత్సరములకు పూర్వము భూమి ద్రవీభూతస్థితిలో నుండెను. భూలోకాంతర్గతలోహములు, వస్తుపదార్థము (Matter) ద్రావకమై యుండెను. దాని మీదిభాగము బరువైన లోహద్రావకముపైన తేలియాడుచున్న పలచని మడ్డితెరయై యుండెను. ఆదినములలో భూమి అసమాన వేగముతో దిరుగుచుండుటచే, నేటివలె సూర్యు డుదయించి అస్తమించుటకు ౧౨ గంటలుకాక మూడున్నర గంటలే పట్టుచుండెను. ఇట్లీగమనగమనమువలన, భూమి ధ్రువముల (Poles) చదునై, నుబ్బి, మట్టసమయి భూమధ్యరేఖ (Equator) వద్ద పైకి నుబ్బిపోయి, యొక కొండ్రిగుడ్డు ఆకృతిని దాల్చెను. అప్పుడే భూలోక చంద్రలోక విభజనము సంభవించెను. సూర్యునియొక్క ఆతిశయాకర్షణశక్తియే, పైకి ఉబికియున్న భూప్రదేశమును ఈడ్చి, త్రెంచివైచియుండును. లేదా పరిసరమున దిరుగుచున్న వేరొక చిన్న గ్రహమైన నిటుల జేసియుండును.

ఏది యెట్టులైనను, బాహ్యశక్తి యొకటిటుల పనిచేయు ట మాత్రము నిశ్చయము. తత్ఫలితముగ ౫ వేల క్యూబిక్ మైళ్ల వస్తువు భూమినుండి చీలిపోయెను. ఈ భాగమే తరువాత చంద్రగ్రహముగ బరిణమించెను.

ఇది చంద్రుని జన్మవృత్తాంతము. కాని, పురాణమతమువారు దీనిని నమ్మెదురా? పాలకడలిలో వెన్నపూస వలె మందర మర్దనము వలన బుట్టిన 'చిన్ని వెన్నెల కందు' వట్టి మట్టిముద్దయని చెప్పినచో వారికి కష్టముగ నుండదా? చంద్రగ్రహణము నాడు చిట్టిశశాంకుని ఆపదకు హాహాకారములు చేయు మనఅవ్వలు అమ్మలు దీనిని విన్న నేమందురో?

'ఏమందురు? చెప్పిన నిన్ను, విన్న నన్ను, ఈ సిద్ధాంత కర్తను, పాశ్చాత్య విద్యను, అన్నిటిని శపింతురు. కేడు గాలము దాపురించెనని విసిగి కొందురు.'

మేమందరము నవ్వితిమి.

పరిణామము

"ఇట్లు విరిగిపోయిన వంకరటింకర భూ ఖండము ఎట్లు గుండ్రని గోళమయి నేటి చంద్ర మండలముగ బరిణమించెను?" అని యొకడు "ఆకాశమున దాని స్థానమెట్లు నిర్ణీతమయ్యెన"ని యింకొకడు, 'దీనిని ఆకర్షించిన గ్రహము పూర్తిగ ఎందుకు తనలోనికీడ్చుకొని పోలేద'ని మూడవవాడు ప్రశ్నించిరి.

ప్రప్రథమమున, చంద్ర మండల పదార్థము, భూగోళములో వొక భాగమైయుండి, భూగోళముతో, సహా తిరుగుచుండెను కదా! ఆ ఉద్వేగమే చీలినపుడు, ఆటు తరువాతకూడ ఆ ఖండమును గిఱ్ఱున తిరుగునట్లు విధించెను.

ఇది యిట్లుండ భూచంద్ర గ్రహముల బలద్విభజనము క్షణములో జరిగిన కార్యము. ఉత్తర క్షణముననే భూమి తన ఆకర్షణ శక్తిచే చీలిపోయిన భూఖండమును ఈడ్చి అది అనంతాకాశమున బడి తన యిష్టము వచ్చినట్లు పరుగిడకుండ, లాగిపట్టెను.

ఇట్లు భూమిచే బంధింపబడి చంద్రు[illegible] భూమిచుట్టు వలయాకారముగ దిరుగజొచ్చెను. [illegible] గమనపథము, స్థానము ఇవ్విధముగ నిర్ణీతమయ్యె[illegible]

క్రమముగా ద్రవరూపకమగు చంద్ర[illegible] చల్లారి గట్టిపడెను. ఏ ప్రకృతి ధర్మము వలన [illegible] వడగళ్లు గుండ్రమయినవో అధర్మశాసనము వలన [illegible] మండలము కూడ గోళాకృతి దాల్చెను.

ప్రళయ ఫలితములు

'చంద్రలోక నిర్మాణమునకు కారణభూత[illegible] ఈ భూ ప్రళయము జరుగకున్నచో భూలోక [illegible] డిదో!'

ఈ ప్రళయము వలన భూలోకపరిస్థిత[illegible] మూడుపాళ్ళు లూడిపోయెను. తత్ఫలితముగనే [illegible] భూలోకము మూడుపాళ్లు సముద్రమయమయి[illegible] ఈ ప్రళయమే సంభవింపకున్నచో బహుశః [illegible] మున ఎత్తుపల్లములులేక యుండెడివి. మనగ్రహ[illegible] ల్లారిన కొలది, జల ధూమములు నీటి చుక్కలు[illegible] వర్ష రూపముగా ప్రపంచమంతటను కురిసి[illegible] అప్పుడు నేటిద్వీపములు. ఆశియా, అమెరికా [illegible] లేక యుండెడివి. లోకమంతె జలమయము[illegible] డెడిది.

'అట్లయిన మన భూచరజీవ రాసియంతయు [illegible] ప్రుని వలననే గలిగినదని చెప్పవలెనుగదా!'

అటులనే చెప్పవలసి యున్నది. యుగము[illegible] చిన కొలది భూలోకపు అంతర్భాగములలోను, [illegible] గములలోను ఎట్టి మార్పులు జరిగియుండెడివో [illegible] గాని, మన భావనా కల్పనలకు స్వేచ్ఛ [illegible] చినచో, ఈ ప్రళయము సంభవింపకుండిన, మన[illegible] చేపలు, తిమింగలములు, మున్నగు జలచర జం[illegible] తిరుగుచుండవలసినదే.

ఇది యిట్లుండనిచ్చి యిక చంద్రునిగూర్చి [illegible] టింతము. చంద్ర మండలమొకటి సిద్ధమయిన [illegible] [illegible], భూగ్రహమునకును అన్యోన్య సమరము [illegible]

మయ్యెను. భూమియొక వైపునకు చంద్రుడింకొక వైపునకు లాగజొచ్చెను. ఈ అన్యోన్య ఆకర్షణ శక్తుల ఘర్షణ వలన రెండు గ్రహముల చలన వేగము తగ్గిపోయెను. భూగ్రహము చంద్ర మండలము కంటె బరువైనది యగుటచే, చంద్రుని గమన వేగమును ఎక్కువగ నణచివేసెను. ఇట్లు భూగోళముయొక్క కదలిక పడి మూడున్నర గంటలనుండి ౨౪ గంటలకు తగ్గిపోయెను. చంద్రుని గమనము ౨౯ దినములకు పడిపోయెను.

ఇదికాక ఈ యన్యోన్యాకర్షణ సంరంభము మూలమున నింకొక పర్యవసానము తేలెను. భూ చంద్రులమధ్య దూరము పెరిగిపోయెను. తన అక్షరేఖచుట్టు చంద్రుని గమన వేగము తరిగిపోయిన కొలది, దానికి భూమిచుట్టు ప్రదక్షిణము చేయుట కెక్కువ కాలమవసర మయ్యెను. దీనిఫలితముగ చంద్రుడంతకంతకు భూమికి దూరముగ దరలిపోజొచ్చెను. చంద్రుని పథమొక సంపూర్ణ వలయము కాదు. ఇదియొంచుక కోలగా నుండును. ఈ దారిని చంద్రుడు పోవుచు భూమికి అతి సమీపమున నున్నప్పుడు ౨ లక్షల ౨౧ వేల ౬ వందల మైళ్ల దూరమున నుండును. అతిదూరమున నున్నప్పుడు ౨ లక్షల ౫౩ వేల మైళ్ల దూరములో నుండును.

ఈచంద్రపథము కలకాలమునకు నిఖరమయినిలిచి యుండుటలేదు. లెక్కలవలన ఇది ప్రతివత్సరము కొలదియడుగుల దూరము డొదవ్వల కరగుచున్నట్లు తెలియుచున్నది. ఇట్లిది సుమారు పదిలక్షల మైళ్లదూరము వఱకు బోవును.

"కాని యిది యిట్లెందుకు జరుగవలెను?"

భూమి తన అతిశయాకర్షణశక్తివలన చంద్రుని గమనము నిరోధించినది. చంద్రుడుకూడ నటులే భూచలన వేగము నతికట్టుచున్నాడు. చంద్రుని ఆకర్షణశక్తిచే భూగ్రహములోని సముద్రపు కెరటములు లేగుచున్నవి. వీని నిరోధక శక్తి సగటున ౨ వేలకోట్ల అశ్వశక్తి (Horse Power) యని లెక్క వేయబడియున్నది. ఈ యసమాన నిరోధకశక్తివలన భూగమన వేగమించుక మందగించిన కొలదనే చంద్రగ్రహము యొక్క భూప్రదక్షిణ వేగ మించుకను వృద్ధియై యది కొంతంతదూరము భూమినుండి జరిగిపోవును.

ఇట్లు భూగమనము స్రుక్కి స్రుక్కి తుదకు పరిపూర్ణముగ తనయక్షరేఖచుట్టు తిరుగుటకు మూడు లేక నాలుగు నెలలుపట్టును. అనగా అప్పుడు భూలోకములో మూడునాలుగు నెలలు పరిమితిగల దివారాత్రము లుండునన్నమాట మన మూహింప శక్యముగాని వేడిమి పగటిపూటను, దుర్భరమగు చలి రాత్రియందు నుండును.

ఆ కాలమున భూ చంద్ర మండలముల గమన వేగము సరిసమానముగా నుండును, వాని రెండింటమధ్య యిప్పటి కంటె నాలుగు రెట్లధికమగు దూరముండును. భూలోకమునుండి చంద్రుడొక చిన్న, మసక మసకమను చున్న వస్తువుగా గోచరించును. అది ఆకాశమున ఒకే స్థలమున, భూలోకమున ఒక అర్ధ భాగము వారికే కాన్పించును.

"భూలోకమున, నొకదినము మూడు నాలుగు నెలలకు వఱకు పెరిగిపోయినచో ఎండలో లోకమంతయు మలమల మాడవలసినదే కదా! ఈ యగ్ని ప్రళయమున కప్పజెప్పుటకేనా చంద్రమండలము మనలను జలప్రళయమునుండి ఉద్ధరించినది?"

"ఈ అపద సంభవించుటకెన్నియో యుగములు గడువవలెను. లక్ష సంవత్సరములకొక క్షణికము (Second)లో నొకాంశము చొప్పున భూ గమనము మందగించునుగాన, దానిగూర్చి మనమిప్పుడు భయపడ నవసరములేదు. అదియునుంగాక ఈ మధ్యలో ఎన్నియో మార్పులు జరుగవచ్చును. (సశేషము)



# సాయంకాలము:—వెన్నెలరాత్రి

ఆవంత్స వేంకట రంగారావుగారు బి. ఏ.

ఇనుఁడు గగనాబ్ధిలో నీది యీఁది బడలి
చరమ గిరికూటమునకేగు సమయమందు,
ప్రకృతి సౌందర్యముంజూడ బయలు దేరి
కూరుచుంటిని మాపల్లెటూరిబయల.

సంజల పట్టుమేఘముల చక్కనిరంగులు తోచ కింకిణీ
సింజితముల్ వినంబడె విశేష వికాసముఁజూపు మల్లికా
కుంజములందు; ప్రేయసియుఁ గూడెననుం జలితాభ్ర మాలికా
మంజువినీల ఛాయతతి మాటికి కొండల నెక్కరోజునన్.

ఇర్వురముఁగూడి యచ్చోట నేకతమున
వివిధదృశ్యములను నిరూపించుచుండ
ముసలి ప్రకృతి చీకటి ముసుగువైవ
తారకలతోడ చంద్రుండు తరలివచ్చె

రేయి యంతకంతకు వెండి రేయియయ్యె
వెల్ల వసనాల మేమును వెండివిగ్ర
హములుగా మారిపోయితి మంతభూమి
గడియలోపల వెండి లోకముగఁదోచె.

రమణీయంబగు వృక్షవాటికలలో రాజిల్లు శృంగార ప
త్రములంజొచ్చిన చంద్రికా వితతి తోరంబౌచు భాసిల్ల, చం
క్రమముల్ సల్పితి వెండిలోకమున భాగ్యంగూడి యిచ్ఛా విధిన్
విమలాంభఃపరిపూర్ణ నిర్ఝర తటీవేదీ సమీపంబులన్.

తళ్కుమనియెడు వివిధ పత్రములుచూచి
వెండికొబ్బరి రేకుల వెలుఁగునరసి
జలముపైఁదేలు వెండిరేకులనుఁగాంచి
ప్రేయసిని గూడి యింటికి వెడలిపోతి.

(భావకవితా తరంగిణి)





# వాత్సల్య ప్రాభృతము

వెంపటి నాగభూషణం గారు

౧

అతను రాజ్యానికి వచ్చి పదిఏళ్లయింది. రాజ్య పాలనమూ సర్వ జనాంగీ కారముగానే యున్నది. దేశంలో యెక్కడా అసంతృప్తి, అసహనం, లేదు. ప్రజలెల్ల రనవరత భోగలాలస పరాయణులై ఆనంద జగత్తులో కాలం గడుపుతున్నారు. కాని రాజుకు మాత్రం యెక్కడా సౌఖ్యంలేదు. అనూహ్యమైన ఆవేదన అతని అంతరంగాన్ని పీల్చి పిప్పి చేస్తోంది.........పరిణయమై అయిదు వత్సరాలైనా సంతానమే కలుగలేదు తన తదనంతరము రాజ్యము నందుకుని వంశంపేరు స్థిరస్థాయిగా చేయడానికి ఎవ్వరూ లేరని అతను బెంగపడ్డాడు.

ఎక్కడెక్కడ నుండో జ్యోతిష్కులను, సిద్ధాంతులను, మంత్ర వేత్తలను, యోగీశ్వరులను, ఋషి పుంగవులను పిలిపించి ప్రశ్నించాడు. కాని యెవ్వరూ తగు సమాధానం చెప్పలేక పోయినారు. అందరూ సంతాన ప్రాప్తి విషయం సందేహాస్పదంగా విడిచారు.

రాజు, అతనిభార్య ఎన్నెన్నో వ్రతాలు, నోములు, దానాలు, ధర్మాలు, అభిషేకాలు, పూజలు చేశారు. ఎవరేది చేయమంటే అదల్లా శ్రద్ధాభక్తులతో చేశారు. దేవుళ్లకి మ్రొక్కుకున్నారు. తీర్థ యాత్రలు వెళ్లారు. ఉపవాసాలు చేశారు. కాని అన్నీ నిష్ఫలము లైనయి. వారి మనోవాంఛాసిద్ధి చిహ్నాలు ఏమాత్రం గోచరింపలేదు. రాజ దంపతుల విచారం దినదినం ఎక్కువై వారిని గ్రసం గదీస్తోంది.

ఇదిట్లా వుండగా, రెండోపెళ్లి చేసుకుంటే పిల్లలు కలుగుతారు, అని అన్నారు యెవరో. అది రాజుకు తెలిసింది. భార్యకు తెలుస్తే ఆమెకేమి కష్టంగా వుంటుందో యని అతను భయపడ్డాడు. కాని యీ సంగతి ఆమెతో చెప్పక తప్పింది గాదు. ఆమెను మొదలు విచారం కల్గినా, దాన్ని దిగమ్రింగి తన భర్తయొక్క సంతోషానికి ఆటంకము లేకుండా వుండడానికి స్థిరపరచు కొంది. రెండో వివాహమునకు ఆమె సమ్మతిని తెల్పింది.

౨

మహా వైభవంలో రాజుగారు రెండోపెళ్లి చేసుకున్నారు. ఆదేమి చిత్రమో, చేసుకొన్న వత్సరానికే సంతానం కల్గింది. శుభ ముహూర్తంలో ఆడ శిశువు జన్మించింది. తారామణియని పేరు పెట్టుకున్నారు.

దేశమంతా ఆనందించింది. లేక లేక తమ రాజుగారికి సంతాన ప్రాప్తి కల్గినందులకు ప్రజలందరూ ఉత్సవం చేశారు. రాజుకు మితిలేని సంతోషం. స్వప్నంలో గాంచిన పెన్నిధిని చేతులార అనుభవించినప్పుడే సంతోషం...... .

అతనెప్పుడూ ఆమెను చూస్తూ కూర్చుండేవాడుక. ఒక్కక్షణం యెడబాటు యుగంలా గుండేది. రాజ్యకార్య నిర్వహణం అమాత్య శేఖరులకు విడిచి వేశాడు. ఎల్లప్పుడూ రాకొమారి చెంతనే వుండేవాడు. ఆమె బాల్యక్రీడలు, బాల్య సంజల్పాలు అతనికి అమితామోదం సమకూర్చినాయి.

తారామణి అయిదేండ్లది. ముద్దులు మాట గట్టుతోంది. తనకు పెట్టిన పేరును సార్థకం చేసింది. ఆమెకు తండ్రిని చూస్తే ఆపేక్ష. ఎప్పుడూ అతని చెంతనే వుండేది. అతనెక్కడికి వెళ్లినా, తారామణి వెంట ఉంటుంది. వారిద్దరూ ఎప్పుడూ విడిచి యుండరు. ఆమెను

చూస్తే తండ్రికి సంతోషం. అయన్ని చూస్తే కొమా
ర్తెకు సంతోషం. ఆ సంతోషంలో తల్లిమాట బొత్తిగా
మరచి పోయింది. ఒక్కమారైనా తల్లిదగ్గరకు పోదు.

౩

తారామణికి విద్యాభ్యాసం చేయడానికి ఆచా
ర్యుడు నియమింపబడ్డాడు. ఆమె చూపిస్తే, అందుకు
పొయ్యేది. ఎట్టి ఉద్గ్రంథమునైనా అనాయాసముగా
చదివి అవలీలగా కంఠగతము చేసేది. వీణ వాయించి
నప్పుడు నారద తుంబురులు తలలు వంచుకునేవారు. సర
స్వతి తన కచ్ఛపిని విసర్జించేది. చిత్రపటము వ్రాసెనా
బ్రహ్మ వంచితుడన్న మాటయే! సృష్టిరూపము చిదిపి దీప
ము పెట్టినట్లుండేది. సర్వ శాస్త్రములందు ప్రావీణ్యత
సంపాదించింది. ఆమె విజ్ఞాన సంపత్తి ప్రతిభ దేశమంతా
వ్యాపించింది.

రాజుకు కొమార్తెయందు అనురాగ మెక్కువైంది.
వేటకు పోయినా, సభకుపోయినా, యుద్ధానికి పోయినా
సంచారానికి పోయినా—తారామణివెంట వుండవలసిందే!
ఆమె లేకపోతే అతనికెంతో కష్టంగా వుంటుంది. ఆమె
కూడా అట్లాగే భావించేది.

౪

దేశంలో ప్రజలందరూ విచిత్రంగా చెప్పుకొన
సాగారు. కాని యెవరేమనుకొంటే రాజుకేమిభయం!
కాల మట్లాగే జరిగిపోయింది.

తారామణికి యిప్పుడిరువదవ యేడు. పెండ్లియీడు.
శరశ్చంద్రుని యమృత కిరణ రేఖరీతి, విశాల విశ్వ సౌం
దర్య సముజ్జ్వలకాంతి భంగి, గగనపథ ప్రకాశిత సౌదా
మిని ప్రతిభవోలె యున్న దారాకొమారి. ఆమెసౌందర్య
విశిఖం విదున్నిభమై రాజ కుమారుల హృదయాకాశాల
జారబడ్డది. ఆమెకు అన్ని లక్షణాలు వున్నాయి.
విద్యావంతురాలు; సౌందర్యవతి. అందుచే పెక్కుమం
దికి ఆమెను పెళ్లాడవలెనని ఆశకల్గింది.

కాని ఆమెను విడుచుటకు రాజు ఒప్పుకొనడు.
ఆతన్ని విడుచుటకు ఆమె వొప్పుకోదు. ఒండొరుల అను
రాగ బంధము లట్టివి. వనాంతర నికుంజములలోని లతల
యట్లల్లుకొని పోయినవి. ఒకరిని నొకరు విడిచి
టకు ఏమాత్రం యిష్టపడలేదు. అటువంటి సంకట
వారున్నపుడు, రాచ బిడ్డల వివాహ వార్తలన్నీ
యైనవి.

ఎందరోవచ్చి తారామణికి పెండ్లిసేయ
గా చెప్పారు. రాణిచెప్పినది. మంత్రి చెప్పినా
కొందరో చెప్పారు. కాని రాజు అవి లక్ష్యం చేయ
తారామణి వలన తనకు కలిగే సంతోషాన్ని
యిచ్చి వేయడంగాని; లేక వారితో విభజించు
అతని ప్రాణంతో వొప్పుకోడు. లేక లేక కలిగిన
ర్తెను, గారాబంతో పెంచి పెద్దదాన్ని చేసిన
ర్తెను, తానేచూచి ఆనందించాలి. తారామణికి
అదే ఆలోచన. తన్నింత గారాబంతో పెంచిన
విడచి వేయడం ఆమెకు యిష్టంలేదు. ఎవరే మను
సరే, ఎవరెన్ని చెప్పినాసరే! తండ్రి కొమార్తెల
గం తక్కిన విషయాలను గుర్తింపలేదు. వివాహ
వారి నంతగా బాధింపలేదు.

౫

తారామణి దేహంలో రుగ్మత ప్రవేశ
రాజు భయకంపితుడైనాడు. దేశదేశాలనుండి వైద్యు
వచ్చారు. ఎవరి శక్త్యానుసారం వారు మందులిచ్చి
చారు. కాని అన్నీ వృథా యైనవి. దినదినం వ్యాధి
దిరింది. రాకొమారి ముఖ కమల కింజల్కాలు వా
యినాయి. శరీరము కృశించింది. కళ్లలోని ఆనం
తి, అనిమేషత్వం అంతరించినాయి.........
వైద్యులు వచ్చారు. ఇంకను క్రొత్త ఓషధు లి
కాని మృత్యు గహ్వరంలో పడ్తున్న వారిని ఆపు
తారామణి తేజోవిహీనమై, కృశించి, శల్యమై
రించినది. ఆమె యాత్మ లీలా విలోల మందయా
దేవమందిర సోపాన పరంపరల నధిరోహించుచు
నీలాకాశ విలాస వైఖరులలో విలీనమైంది.

రాజు శూన్య మనస్కుడు. భగ్న హృదయు
దుర్భర విషాద విభావరీ పుటముల మాటు వడి వా
వల్లికి అంత్య ప్రాభృతం నివేదించాడు!

# కవితాకుమారి

పాలూరి సీతాపతిరావుగారు (లలిత కవితా కుటీరము)

భక్తితో ప్రేమతోడ నాసక్తితోడ
నర్పణముఁజేయు స్వాగతమందు మమ్మ
విమల కరుణాన్విత విలోకనములు మెఱయ
సరసగుణపేటి! ఆంధ్రభాషావధూటి.

భారతరచనాసుధారస సారకాసారాంతరమున మజ్జన మొనర్చి
నైషధాఖ్య ప్రబంధదుకూలరాజంబు రమణీయ మృదుశరీరమున దాల్చి
భాగవతాది కావ్య వినూత్న రత్నదీపిత భూషణంబుల వేడ్కఁ దాల్చి
భాసుర మనుసంభవ గ్రంథరాజంబు కస్తూరి తిలకంబుగా నమర్చి

ఆధునిక కవిరచితకావ్య వ్రజంబు
చామరములిడ నాంధ్రదేశా ప్రజాహృ
దంతరస్థానసంబున నలరుతల్లి
స్వాగతము నీకు! ఆంధ్రభాషాలతాంగి!

దయసేయుమోయమ్మ తావక సద్భక్త సముదయంబుల వందనములనంద
కదలిరావమ్మ నీవదనేందుమండలహాస చంద్రికలు మమ్మాదరింప
అరుదేరుమోయమ్మ యాంధ్రదేశ ప్రజాశ్రేయంబుకొఱకు నాశీర్వదింప
వెడలిరమ్మోయమ్మ విఖ్యాతకవి హృదయాబ్జంబులందు నాట్యంబొనర్ప

దర్శనమొసంగుమోయమ్మ త్వత్పదాబ్జ
చింతనానంద పరవశ స్వాంతుల మిటు
స్వాగతంబిచ్చుచుంటిమి భవ్యలీల
తళుకుల మిటారి! యో కవితాకుమారి!




కోణకంచి చక్రధర రావుగారు

ఆసియా ఖండమునందలి సనాతనవస్తు పరిశోధనములో గత దినములలోని ముఖ్యవిషయము మంగోలియా విజేతయును, తన దౌష్ట్యము వలన చారిత్రమునందు ప్రసిద్ధినొందిన వాడును నగు చంగీజుఖానని సమాధి. ఇది గోబీయొక్క పాడుపడిన యొకపట్టణమునందు కనిపెట్టబడినది. ఈ సమాధి కనిపెట్టిన గౌరవము ప్రొఫెసర్ 'కోజ్‌లూవు' అను పరిశోధకునికి జెందియున్నది. ఈతడు ౧౮౮౩ క్రీ. శ. నుండి ఏషియా ఖండమున పరిశోధన మొనర్చు చుండెను. ఇరువది వత్సరముల కాల మీతడు చంగీజుఖానుని సమాధిని గూర్చి యన్వేషింపు చుండెను.

## సమాధి

చంగీజుఖానుని శవము పెట్టబడి యున్న పెట్టె వెండిది. దానికోళ్లకు ౭౮ కిరీటము లున్నవి. ఇవి చంగేజుఖానుడు రక్తపిపాసులగు తన సైనికులచే నాశనము గావింపబడిన ప్రభువులవి. సమాధిలో నొక గదిగలదు. దానిలో పెట్టె యుంచబడి యున్నది. ద్వారముకడ నేడుగురు లామాలను మతగురువులు పహరానిచ్చు చుందురు. ప్రతిగురువును ఏడుగంటల పిమ్మట నొక పెద్దగంటను ఏడుమారులు వాయించును. ఏడు నూర్ల సంవత్సరములనుండి బుద్ధమత పురో[హి]తులు ఈ సమాధిని గుప్తముగ దాచి[యు]న్నారు.

## గుప్తదశనుండి వెలివరచిన ప్రయత్నము

ప్రొఫెసర్ కోజ్‌లూవు ఇట్లు వ్రాయు న్నాడు. "ఇరువది వత్సరముల దనుక నే సమాధిని వెదకెడి ప్రయత్నము నందుండి ప్రయాణములను జేయుచు అందందు త్రవ్వించు పరిశోధింపు చుంటిని. ఆ పిమ్మట నాకు కృత[ా]ర్థుడనగు భాగ్యము లభించినది. నేనీ మధ్య కాలమున మంగోలియాలోని లామాలతో [...] ప్రముఖులతోడను, స్నేహసంబంధమును [...]గించుకొను చుంటిని. చివరకొక లామా [...] ప్రతివత్సరము మూడవ మాసములోని ౨౧ తారీఖున గొప్పగొప్ప మొగలు సర్దారులు [...] చంగీజుఖానుని వంశీయులును, సమాధి యొ[...] కూడెద రనియును ఆ దినమున అర్పణములు [...]వించెద రనియును నాకు తెలిసెను.

## శవపేటిక యొక్క స్థితి

చంగేజుఖానుకు పిమ్మట పదునెనిమిద[వ] తరమువాడగు నొక సరదార్ఖను గలడు. అత[డు] కోజ్‌లూవుకు సమాధిని గూర్చిన వివరము[...]

తెలిపెను. ఆతని మూలముననే ప్రొఫెసర్ కోజ్‌లూవు సమాధికడకు చేరగలిగెను.

యూర్ఆక్ వంశమునకు జెందిన చీనా చారిత్రకారులు "చంగీజుఖానుని మృతస్థితి కొన్ని రాచకీయ హేతువుల వలన గుప్తముగ నుంచబడినది" అని నుడువుచున్నారు.

ప్రొఫెసర్ కోజ్‌లూవు ఇట్లు వ్రాయుచున్నాడు "సమాధి మందిరము పర్వతము యొక్క యొకభాగము త్రవ్వి నిర్మింపబడినది. దాని దనుక చేరెడిమార్గము మిక్కిలి చిక్కులతో గూడినదిగ నున్నది. శవపేటిక పెట్టబడి యున్న గది యొక్క వైశాల్యము దాదాపు ౪౦ చదరపు టడుగు లుండును. ఘనపు వర్ణముగల కట్టెతో నొక పెద్ద పేటిక గలదు. ఈ పేటిక మిగుల సుందరముగనున్నది. దీని లో వెండి శవపేటిక పెట్టబడియున్నది. శవపేటిక యొక్క దళసరి వస్త్రముతో కప్పబడియున్నది ఈ వస్త్రము సుమారు పది యడుగుల పొడవును నాలుగడుగుల వెడలుపును గలిగి యుండును. దీని మీద చంగీజుఖానుని రూప చిహ్నమమర్పబడియున్నది. శవపేటిక కోళ్లు ౭౮ కిరీటములతో చేయబడినవి.

చంగీజుఖానుని ఇతర చిహ్నములు

ఈ గది వెనుకతట్టున నొకసమాధియున్నది. దానిలో చంగీజుఖానుని ఆయుధములన్నియును సమాధి గావింపబడి యున్నవి. దీనిలో గొప్ప మూల్యవంతములగు ఖడ్గములు గలవు. వాని పిడులు గొప్ప విలువగల రత్నములతో నలంకరింపబడియున్నవి. సమీపముననే ఏనుగు దంతముతో జేసిన యొక సింహాసనముగలదు. ఇది హిందూస్థానమునుండి కొల్లగొట్టి తెచ్చినది. చంగీజుఖాను దుపయోగించుకొను భోజన సాధనములు గూడ నచ్చటనే పెట్టబడియున్నవి. మరియొక గదిలో చంగీజుఖానుని ప్రతిబింబము గలదు. ఒక మేజా బల్లపైని ౧౦౦ పుటలుగల యొక పుస్తకమున్నది. దీనిలో చంగీజుఖానుని జీవితమునందలి గొప్పగొప్ప వృత్తాంతములన్నియును వ్రాయబడియున్నవి. దీని ప్రతి పుట మీదను నాతని ముహరును సంతకమును నున్నవి. దీనిని చంగీజుఖానుడు స్వయముగ చెప్పి వ్రాయించుచు ప్రతి పుట మీదను తన ముద్రను, సంతకమును జేయుచుండెను. కావున దీనిని చంగీజుఖానుని స్వీయచరిత్రయని నుడువవచ్చును.

చంగీజుని స్వీయ చారిత్రము

ప్రొఫెసర్ కోజ్‌లూవు దీని ప్రతిపుట యొక్క ప్రతి బింబమును (ఫోటో) తీసికొనగోరెను. కాని లామాలు అంగీకరింపకపోయిరి. తనకా సమాధిని చూచెడి భాగ్యమును లభియింపజేసిన సర్దారు నెన్నెన్ని విధములుగనో నిర్బంధపరచి ఎట్లైన తానా ప్రతిబింబములను దీసికొనుట కవకాశమును గల్పింప నడుమనని కోజ్‌లూవు ప్రార్థించెను మరియు లామాలకు గొప్పగొప్ప బహుమానములను లంచముగ నిచ్చి పుస్తకములోని కొన్ని భాగముల విషయములను నోటు చేసికొనుట కనుమతి నార్జించెను.

భవిష్యద్వాణి

శవపేటిక గల గదిలోని కరుగుటకు ముందుగ నున్న గదిలో నా మహావీరుని గుఱ్ఱపు ప్రతి రూపము నిలుపబడియున్నది. ప్రతి వత్సరము చనిపోయిన తారీఖున చంగీజుఖానుని యాత్మ యేతెంచుననియును, తన రాకకు నిదర్శనముగ దీపము నార్పివేయుననియును, ఆ పిమ్మట పెద్ద లామాను తనతో లోనికి గొం

పోయి యొక నల్లని రాతిమీద రాబోయెడి సంవత్సరమున జరుగగల ముఖ్య విషయములకు సంబంధించిన భవిష్యత్తును వ్రాసియిచ్చునని యును లామాలు చెప్పెదరు. కొన్ని భవిష్య ద్వాక్యములను [illegible]జులూపునకు గూడ చూపిరట. ఇతర వస్తువులుగాక కోజలూపు గతిచెన శతాబ్ద మున నొక యాంగ్లేయ పాదిరీచే, తోలు కాగి దములపైని వ్రాయబడిన బైబిలును గూడ చూ చెను. మరియు సుప్రసిద్ధ యాత్రికుడగు మార్కోఫోలో యర్పించిన బహుమానము గూడ నున్నది.

దోలారాణియొక్క సమాధి

చంగీజుఖానుని ప్రియురాలగు "దోలా"ను లామా గురువులు తమ పితృదేవతలలో నొక దానిగ పరిగణించుకొని యుండిరి. ఆమెకొక బంగారపు ప్రతి బింబమును నిర్మించిరి. దోలా రాణి యొక్క సమాధి చంగీజుఖానుని సమాధి నుండి రెండు మైళ్ల దూరమున నున్నది. ప్రొ ఫెసర్ కోజులూపు ఈ సమాధిని గూడ చూ చెను. దీని శవపేటిక మీద చీనా భాషలో నీ క్రింది విధముగ వ్రాసియున్నది:—

"ఇది దోలా మహారాణి యొక్క విశ్రాంతి స్థానము. ఈమె చంగీజుఖానుని యంతిమ క్షణ ములయందు ఖానునితో అతనికంటె ముందు రెండవ లోకమున కరిగి స్వాగత సన్నాహ ముల నొనర్చుటకై తనను చంపివేయవలయు నని ప్రార్థించెను. ఈ ప్రార్థన సంగీకరించి ఖానుడు ఆమె హృదయమును ఖడ్గముతో పొడిచెను. ఈ రూపముగ నీమె ఖానుని మరణమునకు ఏడు దినములు ముందుగ నాతని కట్టెదుట మరణించెను"

చంగీజుఖానుడు ౧౧౬౨ క్రీ.శ.లో జన్మించి ౧౨౨౭ లో మృతినొందెను.

(రియాసత్ పత్రికనుండి తెనిగింపబడినది)



# పరికూర్చిన పువ్వులు

## వస్త్రాభరణములు - నాగరికత

"గృహలక్ష్మి" మార్చి (౧౯-౨౭) సంచికయందు రావు బహద్దరు మైదవోలు చంగయ్య పంతులుగారు బి. ఎ. బి. ఎల్, వస్త్రములు ధరించని జాతులవారిని యనాగరికులని దలంచుట భావ్యము కాదని తెలుపుచు ఉదాహరణముగా నిట్లు వ్రాయుచున్నారు:—

"వస్త్రాచ్ఛాదనము నెఱుంగని ప్యూజియనులు ఆస్ట్రేలియనులు మొదలగు ఆదిమ జాతులవారు వస్త్రములను ధరింప కుండినను నాగరికుల యందుండు విధముననే బుద్ధి వ్యాపారమును సంఘ నియమములును గలిగి యున్నారు. బుద్ధి బలమున నెన్నికెక్కిన పురాతన యవనులు (Greeks) అల్ప వస్త్ర ధారులై యుండిరి. నాగరికతయందు ఖ్యాతిచెందిన జపాను దేశమునందు స్త్రీ పురుషులొక్క చోటనే యొట్టి వికారమును గలుగక స్నానము చేయుచుందురు. గతించిన శతాబ్దమందు రష్యా దేశస్థులిట్టి యాచారమునే గలిగియుండిరి......

......మళయాళ దేశీయులు సౌందర్యము, బుద్ధి, పట్టుదల మొదలగు వానియందు పరిపూర్ణులు...వారు తమ దేశమందు చిన్న వస్త్రములు ధరింతు వారయ్యును స్వదేశమును వీడినంతనే అచ్చటచ్చటనుండు ఆచారానుసారము వస్త్ర ధారణంబొనర్చుచున్నారు. అమెరికాలో అమెజాను నది యొడ్డున నివసించెడు కొన్ని జాతులయందు స్త్రీలు మాత్రమే మొలకొక గుడ్డను కట్టికొనెదరు. న్యూకెలడోనియా దేశస్థులును న్యూ హెబ్రిడీ దేశస్థులయందు పురుషులు మాత్రమే అల్ప వస్త్రధారులై యున్నారు. కాఫర్ స్త్రీలు మాత్రము చిన్ని చర్మపు పట్టను గోచీగ పెట్టుకొందురు. చైనా దేశపు స్త్రీలు వారి పాదములితరులు, చూడకుండ కాపాడుకొను చుందురు. యూరపియనులు వక్షస్థలమును, అరేబియా వారు మోమును ఎక్కువగా భావింతురు."

## హిందూ చిత్రలేఖనము

"ఆంధ్ర భారతి" ౧౯-౨౭ ఫిబ్రవరి సంచికలో ఆవంత్స వేంకట రంగారావు, బి. ఏ. గారు ఇట్లు వ్రాయుచున్నారు:—

"ప్రస్తుతము హిందూ చిత్రకారులు దేవాలయము, లందును, గుహాలయందును పురాణ రంజకులచే చిత్రింపబడిన పటముల ననుసరించి, చిత్రించుచుండుటచే నీ నూతన విధానము హైందవ మనబడును. పాశ్చాత్య సాంప్రదాయము వెలుతురు, చీకటి (Light & Shade) ననుసరించియుండును. మన చిత్రములలో నవియుండవు. అవి యనవసరము.........

కవితకు భావమెట్లు ప్రధానమో యట్లే చిత్రమునకు గూడ భావము ముఖ్యమగుయు, వెలుతురు, చీకటులు లేక భావములు విశదీకరింపవచ్చునని (మన) వారట్లు చిత్రించి యున్నారని నేను తలంచుచున్నాను. కాని మన చిత్రకారుల చిత్రములందు గర్భితమైనది యాడుబిడ్డయో మగబిడ్డయో గ్రహించుట సామాన్యులకు బహు కష్టము. కాని చిత్ర గర్భమందొక దేదీప్యమానమయిన శిశువు నిగూఢమయి యుండుట మమ్మాటికి నిక్కువము.

చిత్రముల వంక జూడనైన జూడక పాశ్చాత్య చిత్రము
లను మెచ్చుకొనుచున్నారు.

హైందవ చిత్ర లేఖనము ఆత్మానంద మొనగూర్చును,
పాశ్చాత్యము నేత్రానందకరము మాత్రమే. హైందవ
ఆది గ్రహించ గలిగిన వారు హైందవ చిత్ర లేఖన ము
సత్కృష్ట మయినదనుచున్నారు. గ్రహించని వారా
చిత్రలేఖనము పతివ్రత వంటిది. పాశ్చాత్య చిత్ర లేఖ
నము సర్వాంగ సౌందర్యము గల యొక స్త్రీ వంటిది.

కాని మన చిత్ర లేఖనము దేవతా విగ్రహములు
ఉపకరించదేమోయని నా తలంపు, ఏలన, వెలుగు చీక
టులు లేక మానవ చిత్రమొకటి రచించినచో నదియా
మానవుని చిత్రము గాం గనుపించదు. అప్పుడు మనకు
పాశ్చాత్య సాంప్రదాయమే పనికి వచ్చును"

---

## హిందూమత స్వీకరణము.

సర్ తుకోజి మహారాజావారిని పెండ్లాడిన
మిల్లరు కన్యయను అమెరికా దేశపు క్రైస్తవ
యువతికి ౧౯౨౮ మార్చి ౧౦ వ తేదీని నాశి
కకు చేరువనున్న గంగా పురములో శ్రీ కరవీర
పీఠ శంకరాచార్య స్వాముల వారు హిందూ
మత తీర్థ నొసంగి శర్మిష్ఠా దేవియని పేరు
పెట్టిరి. శ్రీ స్వాములవారు ఏతత్కార్యమును
సమర్థించుచు తమ యభిప్రాయముల నిట్లు
తెలిపిరి:—

"మత విషయమున శాస్త్రజ్ఞులపై నాధారపడవలసి
యుండును, ఇటులశుద్ధి సంస్కరణముచేసి, మతాంతరుల
ను అనగా క్రైస్తవులు మహమ్మదీయులు మున్నగు వా
రిని హిందూ మతమున చేర్చుటకు శాస్త్ర ప్రమాణ మే
మున్నది? అని వారడుగుచున్నారు. మన శాస్త్రములు
వ్రాయబడిన కాలమునందు మహమ్మదీయ మతము …
మతము మున్నగు మతములు లేనేలేవు కాని అవైది…
ములను గూర్చి శాస్త్రములలో వివరింప బడెను. హిం…
మతమునకు శ్రుతి స్మృతులును సదా చారమును …
ములై యున్నవి. పాషండులను గూర్చి శాస్త్రము…
కలరు. వారే అవైదిక మతముల వారు. వారు హిం…
మతములో చేర గోరినచో వెంటనే వారిని చేర్చుకొ…
నే యుండిరి. దస్యూసుల (పాషండులు) నెటుల …
వలెనని మాంధాత యింద్రు నడుగగా వారు …
లకు సేవచేయుచు వేదధర్మ క్రియలను గూడ చేయవ…
యింద్రుడు తెలిపెను. అని శ్రీ మన్మహాభారతమున …
తిపర్వమునందు వివరింప బడెను. క్రైస్తవులు మహ…
దీయులు మున్నగు అవైదిక మతముల వారందరును పా…
డులలోనే చేరుదురు. వారిని హిందూమతమున …
కొనుటకు స్పష్టములగు ప్రమాణములుగలవు.

* * * * *

చారిత్రకముగా చూచినను యిందెట్టి దోషము
లేదు. అవైదిక ధర్మము నవలంబించుట అ…
విషయముకాదు. ఋగ్వేదమున రిభ్వులను గూర్చియు
అధర్వవేదమున వ్రాత్యులను గూర్చియు, ఉదాహరణ…
లు గలవు. వీరు అవైదికులే. అధర్వవేదమునందు …
కాండములో వ్రాత్యులనుగూర్చి వివరింపబడెను. …
ము వారిని మిక్కిలి ప్రశంసించెను. వ్రాత్య మహా…
వ్రాత్య దేవప్రియ, వ్రాత్య దేవాదిదేవ మున్నగు ప…
లందు ప్రయోగింపబడెను. భగవంతుడు ప్రపంచము
నిర్మించెనని యితరమతములు తెలుపుచున్నవి. అంత…
భగవత్స్వరూపమే గాని మరేమియును లేనేలేదని హిం…
మతము తెలుపుచున్నది. ఆనుశాలననే జరత్కారు…
ఋషి యొక నాగకన్యను వివాహము చేసికొనెను. పా…
డవ మధ్యముడగు అర్జునుడు ఉలిపీయను నాగకన్యను …
చెను. అర్జునుని అగ్రజుడగు భీమసేనుడు హిడింబ…
రాక్షసిని వివాహము చేసికొనెను. చంద్రగుప్తుడు …
కర్లాలో కెప్స అను గ్రీకు కన్యను పెండ్లియా…
గ్రీకులు (గ్రీసు దేశీయులు) పలువురు వైదిక ధర్మము…

లంబించిరి. క్రీస్తు పుట్టుటకు రెండు శతాబ్దములకు పూర్వము హేలియో దొరయను గ్రీసు దేశీయుడు హిందూ మతమును స్వీకరించెను. అతనికి భాగవతుడని పేరుపెట్టిరి. అతడు గరుడ ధ్వజునకు (శ్రీ మహావిష్ణు) దేవాలయమును, కట్టించెను. ఆబహోరులు, శకనులు, హైహైయులు హూణులు మున్నగు విదేశీయులుకూడను హిందూ మతము నవలంబించిరి.''

## ఆంధ్ర స్త్రీలు

### అవికలు—పైటలు

జయంతి పత్రిక ప్రభవ హేమంతర్తువు సంచికయందు, సాతవాహనులు ఆంధ్రులే యనియు, సాత వాహనులకును ఆంధ్ర దేశమునకును సంబంధము కలదనియు నిరూపించుచు, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాయుచు, నిదర్శనముగా ఆంధ్ర స్త్రీల అవికల, పైటల యుత్పత్తిని గూర్చి యిట్లు వ్రాసి యున్నారు:—

''సంస్కృత, దేశ భాషాకృతులలోఁ దెక్కుంటనాంధ్ర స్త్రీల కుచసౌభాగ్య మసాధారణ మైనదిగా వర్ణితమయ్యెను. ఆవర్ణన మన్వర్థ మైనదని యమరావతీస్తూపశిల్పములు ప్రతిపాదించుచున్నవి. ఆస్తూప నిర్మాణ కాలమునఁ నాంధ్ర స్త్రీలకుఁ గుచాచ్ఛాదనము లేకుండుటయు గూడ నమరావత్యాదిస్తూప రూపములు నిరూపించు చున్నవి. అవికలులేని యాంధ్ర స్త్రీలు ప్రతిష్ఠానమున కేగిన పిదప నతి నిగూఢ కుచలగు ఘూర్జర మహారాష్ట్ర స్త్రీల సంగతిచేఁ గ్రొత్త నాగరకత బలసి అవికలను పైటలను సంచుకొన సాగిరి పైట పదము ప్రతిష్ఠాన పదభవమే. ప్రతిష్ఠానమున నుండి యలవడినది గానను చాచ్ఛాదనమునకు నానగరము పేరే దద్జ్ఞాపకముగా పేరయ్యెను. అవికలకుఁ గూడఁ పైఠిణీ అవికలనియే పేరు. పైఠిణీ పదముకూడఁ బ్రతిష్ఠాన పదభవమే. సంస్కృతమున 'కంచుక' మను పదమున్నను, నది స్త్రీ పురుష సామాన్య మయిన 'అంగిరకా' కు పేరుగా నున్నది. సాత వాహన సప్తశతిలో నది ఘూర్జ రాంగనలు వేసికొను మేలి ముసుఁగు (ముఖమునకుఁ గూడ నుండును) పర్యాయము గాఁగలదు. ఆంధ్ర, ద్రవిడ, కర్ణాట, మళయాళ స్త్రీలానాఁడు అవికలు లేనివారే! ప్రతిష్ఠాన సంగతిచే నంధ్ర కర్ణాటాంగనలు పైటలను అవికలను దాల్చిరి గాని యదిలేం ద్రవిడ మళయాళ స్త్రీలు, నేటికిని వానిని దాల్పని వారుగానే యున్నారు. పురుషులు వోలె స్త్రీలును (నేఁడును మళయాళమున నున్నట్లు) కొన్ని సమయములంగు ఉత్తరీయమును దాల్చుటే కాని, అవికలఁ దాల్చుట యాకాలమున దక్షిణ భారత దేశమున లేదు. ప్రతిష్ఠాన సంబంధము సాత వాహనుల తర్వాత నాంధ్ర దేశమునకులేదు. సాతవాహనుల తర్వాతఁ బ్రతిష్ఠాన నగరము పాడుపడి పల్లెటూరయినది. పైఠిణీ రవికలును పైటలును బ్రతిష్ఠానము రాజధానిగా నొప్పుచున్నప్పుడే వెలయుటసంగతము ''

### నాయఁడులు తెనుఁగువారే!

అని నిరూపించుచు ఆంధ్ర సాహిత్య సరస్వతి శిరిపి ఆంజనేయులుగారు బొంబాయి తెలుగు సమాచార్ (ఇంగ్లీషు) ఫిబ్రవరి సంచిక యందు ఇట్లు వ్రాయుచున్నారు:—

''ఆంధ్ర దేశములో కీర్తి శిఖరము నారోహించిన పెక్కు కులజులలో కమ్మ, కాపు, బలిజ వెలమ శాఖీయులను ముఖ్యముగా చెప్పుకొనవలయును. ఈ నాలుగు సంఘముల వారును ఆంధ్ర దేశములో జన్మ [illegible] నుండి నివసించి యుండి యుద్ధరంగమునందు పటు ప్రతాపమును జూపి రాజులుగను, ధురంధరులుగను పెన్నికెక్కియున్నారు, వారి విధముగా ఇతర సంఘీయుల కంటె నెక్కువగా, చెలుఁగు దేశపు కీర్తి వైభవములకుఁ దోడ్పడియున్నారు. క్రీ. పూ. ౪౦౦ లో మగధ రాజ్యమును [illegible] కృష్ణా గోదావరీ నదుల మధ్య

ప్రదేశమును నాయఁడులను రాజులే యేలుచుండిరి. వీరు అమరావతి, గణపతికోట, శ్రీకాకుళము మొదలగు వానిని రాజధానులుగా చేసికొనిరి. ఆ కాలములోఁ గూడ కమ్మ, కాపు, బలిజ, వెలమ సంఘీయులు వైభవోన్నతులై యుండిరి. కాబట్టి ఈ సమయమునందే కమ్మ ప్రముఖులు చౌదరీలుగను, కాపు ప్రముఖులు రెడ్లుగను, వెలమ ప్రముఖులు రావులు, నాయకులు గను, పిలుచుకొన సాగిరి. ఈ బిరుదములన్నియు 'నాయక' శబ్దముయొక్క వేర్వేరు రూపములే. అసలు నాయఁడు శబ్దము తెలుగు పదమే కాని. మరి వేరు కాదు. ఇట్టి సందర్భములో 'నాయఁడు' అని వ్రాసికొనుట అంగ్రేజులకెట్లు వీలగును? జన్మతః నాయఁడు సంఘీయులు తెలుఁగువారు. అనేక శతాబ్దముల కాలము తెలుగుదేశమును జన్మ భూమిగాఁ జేసికొనిరి. ఉత్తరాంధ్ర భూభాగమందు వారు 'తెలగా'లుగా వ్యవహరింప బడుచున్నారు. తెలగ అనగా తెలు[illegible] వీరినే దత్తమండలములందు సెట్టి బలిజలని పిలచెద[illegible] ఉత్తరాంధ్ర దేశమునందు 'ఈడిగ'లు కూడ శెట్టి [illegible] లని పిలుచుకొనుచున్నట్లు తెలియుచున్నది. కాని [illegible] మాంధ్రదేశమునందు ఈడిగలు వేరు, శెట్టి బలిజలు [illegible] కాఁబట్టి వారి పేర్ల పర్యాయ పదములు కా[illegible] తెలగాలనుడు, బలిజలనుడు, శెట్టి బలిజలనుడు; వీర[illegible] రొక్క తెగకు చెందినవారే. వీరందరు పెట్టుకొ[illegible] నాయుడు పదమొక గౌరవ సూచిక బిరుదమే య[illegible] న్నది. ఇటీవల భోగమువారు కూడ నాయఁడులుగా [illegible] హరించుకొనుచున్నరు, అట్లు పిలుచుకొనుటకు వా[illegible] హక్కులేదని నేను నొక్కి చెప్పగలను."





# పోచంచెర్ల శాసనము

## ఆంధ్ర పరిశోధక సంఘము హైదరాబాదు

శాసన సంఖ్య ౪౪, ఈ పోచంచెర్లను హుజూరు నగరని యిప్పుడు వ్యవహరించు చున్నారు. ఇది నల్లగొండ జిల్లాలోని తాలూకా గ్రామము. గ్రామమునకు దక్షిణమున నున్న శివాలయ ద్వారమునకీ శాసనశిల యానింపబడి యున్నది. మరియొక చోటినుండి గొనివచ్చి దీని నిచ్చట చేర్చినటుల దోచుచున్నది. శిలకొక వైపు మాత్రమే వ్రాయబడి యున్నది.

౧ స్వస్తిశ్రీ మదనన్త పౌర్షది ధనాధి సస్యసు ప్రీతే
మాను జపేయ ద్విపిజీ

౨ వంసమా + ససుంకథా శ్రీక్రిష్ణ రాయాత్మజః
ధాత్రిస్త్రీ మండలేశ

౩ పుత్రే + + రపార పారాయణః శ్రీ చాళుక్య
నిధిఃశ్యభాతి మపని

౪ శోపపదాధిపః ॥ శ్రీ

౫ శ్రీ స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభమ

౬ హారాజాధిరాజ రాజ పరమేశ్వర పరమభట్టారక
సత్యాశ్ర

౭ యకులతిలక చాళుక్యాభరణ శ్రీమత్త్రిభువన

౮ మల్లదేవర విజయరాజ్య ముత్త రోత్త రాభి
వ్రిద్ధిర్ ప్రవ

౯ ర్ధర్ మాన మాచంద్రార్కతారం కళ్యాణపురం
ద లేలేబిజినో

౧౦ సుఖసంకథా వినోదధి శయ్యం తమిలె తత్పాద
పద్మో

౧౧ పజీవులయ్ను శ్రీ మన్మహా ప్రధానిమ్మనె పెగ్గర్డ
బాణ వంశ ద

౧౨ ణ్డనాయక వనస్త పుణ్యంబు శ్రీ మన్మహా ప్రధా
ని ద

౧౩ ణ్డనాయకిం గోవింద రాజులు కొన్డపల్లి ౩౦౦
నలు బంటిభూమి + +

౧౪ [illegible] కాళిమయ్య [illegible] తూర్పున
చెఱువున + +

౧౫ నకాలేశ్వర దేవరకు సక వర్షంబులు ౧౦౪౫
అగు సోభకృతు సంవత్సర

౧౬ మున కార్తీక సుద్ధ ౬ సోమవారమునాండుత్త
రాయణమున .

౧౭ గోవిందరాజులు దేవాంగ భోగమునకుం కుడి
బెడచెఱు .

౧౮ పు తూర్పు కందిబండ తెఱువుకు తీరమున విడి
చిన నేలఖండము

౧౯ ఖ ౭ ఆదేవర నివేద్యానకు చింతల చెఱువు వెను
కనున్న + + +

౨౦ ఆ దేవరగుడి పడమటిసాని దిబ్బపూసారి కొల్వ
దు ౪ లు ఆదేవ

౨౧ ర నంద దీపమునకు గాను ౧ ఆదేవరాళయమున
తోంటపట్టు యీధ

౨౨ మ్మ౯ం దేశమల్లిపరాజులు సాజ నాయకులు
ధమ్మర్ను

౨౩ దస్పపోనడిపిరేని పెనుగ్గురు బ్రాహ్మలకు

౨౪ ణ్డనిచ్చిన ఫలము బోమరు + + + తమెవ్వర

౨౫ + + గణనగ గంగకఱు తనం నిధి ఫలలైనకుల్లు
బ్రాహ్మల జంపిన పాపానపో

౨౬ వువారు దేముడుగుడి దేవర గుడిసున్న వెట్టి + +

౨౭ నడపిడియు పడిసల్పకకు ద్బనేని దేవగురు గొరగల
జంపి

౨౮ న పాపానపోవు॥ స్వదత్తాం పరదత్తాం వాయో
హ రేతవసుం

౨౯ ధరాం షష్టి వర్షసహస్రాణి విష్టాయాం
జాయతే క్రిమిః

మరా

ఇంను నిమ్మన ప్రగడ బాణస వంశజుడని చెప్పబడినది. చాళుక్యుల కాల బ్రాహ్మణులలో బాణస వంశ్యులకలరు.

# గ్రంథ విమర్శనము

## గృహలక్ష్మి

క్రొత్త మాసపత్రిక, సంపాదకులు డాక్టరు కే. ఎన్. కేసరిగారు మద్రాసు, చందా సం॥ రు ౪ లు. విడి సంచిక ౬ ౬ లు.

ఇది స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుట కేర్పడిన సచిత్ర మాసపత్రిక. డాక్టరు బిసెంటు జీవితము, దయార్ద్ర హృదయ (కథ), శారద లేఖలు, ఈ మూటిని విదుషీమణులు వ్రాసియున్నారు. ద్రౌపది గుణశీలములు, వస్త్రాభరణములు నాగరకత అను వ్యాసములు హృదయంగమములుగా నున్నవి. ఇవిగాక స్త్రీలు గమనింప వలసిన పెక్కు విషయములు గలవు. పత్రిక యొక్క అంతర్బహిరాకారము అందముగా నున్నది.

"జీవిత యాత్రయందు స్త్రీ పురుషులు సమాన వ్యక్తులని నిరూపించుటయే మా యాశయము. శరీర మనోబలములయందు స్త్రీలు పురుషులకంటె తక్కువవారు కారని నిరూపించుటయే మా సంకల్పము.........ఎల్ల విధముల స్త్రీ యుద్యమమునకు దోడ్పడుటయే మా పత్రిక యొక్క ముఖ్యోద్దేశము. ఇది యశాస్త్రీయము గాదు; విజాతీయమును గాదు" అని సంపాదకులు స్వవిషయమునందు వ్రాసియున్నారు. "గృహలక్ష్మి" దివ్య సందేశము ప్రతి గృహిణియు గమనించును గాక!

## ఐరావతి

ఆంధ్రభాషా మతల్లి పాదద్వయసేవ శక్తి గొలుపుటకై నవీనంబుగ నూతనాలంకారములతో 3౬.. వీధి రంగూనునుండి ప్రతి మంగళవారము, శనివారము ప్రకటింపబడు వార్తా పత్రిక. చందా సంవత్సరమునకు రు ౫-౦-౦ లు. పోస్టు కర్చులతో రు ౬-౮-౦ లు.

ఐరావతి తన యభిమతమును జయప్రదముగ సాధించును గాక!

---

# అజ్ఞాత వేదన

శ్రీ శ్రీనివాసరావుగారు (కవితాసమితి)

ఎవ్వఁడను నేను! నా కొఱ కేల మీరు
వెదకికొని వచ్చుచున్నారు వెఱ్ఱులట్లు?
నా కొఱకు మీరు వెదకుచున్నారటన్న,
బలుకరానంత కష్టమ్ము కలుగు నాకు!

అడ్డుపడకుఁడు, నా దారులందు మీరు!
నా కొసంగుఁడొకింతయే కాకితనము!
వచ్చినది నాకు నజ్ఞాతవాసమయ
మింకఁ గాన్పింపఁ బోను నేనెవ్వరికిని!

ఏవివిక్తస్థలమ్ములందో వసించి,
ఏ పురాతన జీర్ణ విస్మృత పథాంత
రాళతలమో మదీయాశ్రు జాలకములఁ
దడిపి వైతును కాలమ్ముఁ గడపివైతు!

ఏఱులై పారు నాయశ్రుధారలందుఁ
బ్రతిఫలించెడు నారూప పటముఁ గాంచి
నాయవజ్ఞతకై నేనెసవ్వకొందు!

* * *

నా హృదయమిట్లె నవసిదైనందినమ్మ
నేకశకలోప శకలమ్ములై కృశించి,
గాలికెగసి రూపము నూసి, కాలగర్భ
మందుఁ దుదనశియింప నున్నప్పుడైన,

నక్షి దుర్లక్ష్యమానములగు నణువులు
కూడ గీనవుఁ బాటలు పాడిపాడి
యావినూతన దివ్య గతావితాన
జనితమాధురీలహరీ విశాల గర్భ
వీథులందున విహరించి వితతలాస్య
గతులఁ ద్రుళ్ళుచు ద్రెళ్లు నెక్కడనో చిక్కి!

("ప్రభవ" నుండి)

# సంపాదకీయములు

## బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి షష్ఠిపూర్తి.

ఈ మాసమున ఆంధ్రదేశమందు జరుపబడిన యుత్సవములలో విఖ్యాత ఆంధ్రభాషా సేవకులగు బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి షష్ఠిపూర్త్యుత్సవము ముఖ్యాతిముఖ్యమైనది. పంథొమ్మిదవ శతాబ్దముయొక్క తుది యర్ధభాగమున నారంభమైన నవీనాంధ్ర వాఙ్మయ నిర్మాణ కార్యమున కీ. శే. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి తరువాత, ప్రశంసింపదగిన మహాశయులు శ్రీ లక్ష్మీనరసింహముగారేయని చెప్పుటకు సందేహింప బనిలేదు. ఆంధ్రమహాశయులలో షష్ఠిపూర్తి యుత్సవము మొట్టమొదట శ్రీ వీరేశలింగముగారి గౌరవార్థము నేటికి ౧౦ సంవత్సరముల క్రింద జరిగియుండెను. కాని తరువాత నిట్టి గౌరవమును పొందిన వారు శ్రీ లక్ష్మీనరసింహముగారే యగుట యెంతయు సమంజసముగ నున్నది.

శ్రీ లక్ష్మీనరసింహముగారి సేవ ఆంధ్రదేశమున నజరామరమగు కీర్తి గడించినదను సంగతి నిర్వివాదము. గ్రంథ రచయితగను, సంఘ సంస్కారపరాయణుడుగను, పత్రికాధిపతిగను, వక్తగను, జాతీయవాదిగను వీరి నెరుగని ఆంధ్రులు అరుదని చెప్పవచ్చును. నవలా రచనలో వీరు మున్ముందు దారిచూపినవారైరి. మృదుమధురమగు వీరి శైలి, ఆంగ్ల విద్యావ్యామోహము మేర మీరియున్న కాలమున నాంధ్ర వాచక వర్గమును నిర్మించి తద్వ్యాప్తికి అమితముగ తోడుపడినది. ఆ కాలమున నవీనముగా దలంపబడిన వీరి మనోరమా మాసపత్రిక తరువాతి మాస పత్రికలకు మార్గదర్శకమైనది. ఇట్టి మహాశయుని షష్ఠి పూర్త్యుత్సవము ఆంధ్ర వాఙ్మయ వికాసమునకు కేంద్రమనదగు రాజమహేంద్రవరమున, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యధ్యక్షతతో జరుగుట ఆంధ్ర దేశమునకు కీర్తి ప్రదమని చెప్పవలయును.

అయినను, జీవితమంతయు మాతృ భాషా సేవకై గడపిన శ్రీ లక్ష్మీనరసింహముగారిని, నిస్సహాయ కరమగు వార్ధక దశయందు, ఆంధ్ర సోదరులు తగిన విధముగ గౌరవింపలేదనియే మా యభిప్రాయము. షష్ఠిపూర్త్యుత్సవ సంఘ వారు సుమారైన మొత్తమును శ్రీ లక్ష్మీనరసింహముగారికి ఈ సందర్భమున సర్పింప సంకల్పించి యుండిరికాని యది నెరవేరినట్లు పత్రికలలోని యుదంతములు కానవచ్చుటలేదు. బహుశః ఈసంకల్పము భవిష్యత్కాలమునకై యాపి యుంచబడినదేమో! ఎట్లయినను, సర్వ విధముల ముఖ్యమగు నీ యంశమును షష్ఠిపూర్త్యుత్సవ సంఘమువారు మరువదగదని మేము సవినయముగ సూచించుచున్నాము.

ఈ సందర్భమున షష్ఠిపూర్తి కార్యమును ఆలోచించి జయప్రదముగ నిర్వహించిన శ్రీ రాజా నాయని వేంకట రంగరావు మునగాల

జమీాందారుగారినీ, శ్రీయుత పాలకోడేటి గురుమూర్తి, వేమూరు విశ్వనాథశర్మగార్లను, శ్రీ లక్ష్మీనరసింహముగారి గ్రంథ సంపుటములను కొనిన దేశీయుల, సుమారు ౧౦౦ సంపుటముల గొని తమ భక్తిని ప్రకటించిన నిజాం రాష్ట్రములోని ఆంధ్రసోదరులను అభినందించుచున్నాము.

## ఉస్మానియా విశ్వవిద్యాలయ భవననిర్మాణము.

మహా ఘనత వహించిన మన ప్రభుత్వమువారు ఉస్మానియా విశ్వ విద్యాలయమునకు స్వంత భవనముల నిర్మించటకై కోటి రూపాయలంగీకరించినట్లును, త్వరలో మందిరములును ఆరామమును, మసీదును నిర్మించ నున్నట్లును బొంబాయిలోని "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రిక ప్రకటించినది. ఈ వార్త స్థానిక పత్రికలలో ప్రకటితము కానందున వివరముల గూర్చి నిశ్చయముగ జెప్పజాలముకాని, ఇది నిజమే యైనచో విఖ్యాతమైన మన యీ విశ్వ విద్యాలయమునకిప్పుడున్న యొకగొప్ప లోపము తొలగిపోగలదని మాత్రము నక్కాణించుచున్నాము.

ఆధునిక కాలమున విశ్వ విద్యాలయముల వెనువెంట దేవాలయములును, మసీదులును కట్టుట సంప్రదాయముగ కానరాదు. బ్రిటిషు ఇండియాలో ప్రభుత్వమువారు స్థాపించిన వి విద్యాలయములందేకాక, విద్యావిధానము దను, సర్వ మత సమత్వమును నిల్పుటకై విద్యకు గాని మత సంబంధమగు మందిర కుగాని ప్రవేశము గలిగింపక వారు వా విడిగా నుంచియున్నారు. ప్రత్యేక మత లకు చెందినవారి కొరకు స్థాపింపబడిన అలీ మహమ్మదీయ విశ్వ విద్యాలయమును, కా నగరమున నెలకొల్పబడిన హిందూ వి విద్యాలయమును మాత్రము పైన చెప్పిన ధారణ నియమములకు భిన్నముగానున్న ఉస్మానియా విశ్వ విద్యాలయము ప్రత్యేక మ మువారి కొరకుద్దేశింపబడినదికాక రాష్ట్ర ప్ర లకందరికిని సమముగ నుపయోగించునదై యు న్నది. కనుక మా యభిప్రాయమున, మత సం బంధమైన మందిరములకు తన్మూలముగ మ ప్రచారమునకు తావిచ్చుట అంత సమంజసము కాన్పించదు. అయినను ప్రభుత్వమువారు విశ్వ విద్యాలయముయొక్క విలక్షణతను ఇట్టి మందిరములుంచుట మంచిదని భావిం చో మసీదును, హిందూ విద్యార్థుల కనుకూ ముగ నుంచునట్లు దానితో పాటు సర్వ వి కధిష్ఠాన దేవతయగు సరస్వతీ దేవ్యాలయము నిర్మించిన బాగుగ నుండునని మేము సూ చుచున్నాము.

Edited, Printed and Published by K. BALAKRISHNA REDDY at the
Golakonda Patrika Press, Troop Bazar, Hyderabad, (Dn.)

# విషయ సూచిక



## విజ్ఞప్తి!

సుజాత మార్చి నెల సంచిక వెడలి నేటికి రెండునెలలు గడచినను, ఇంతవరకీ సంచికను ప్రకటింప జాలనందులకు మేము చింతించు చున్నాము.

మార్చినెల సంచికయే రెండు నెల లాలస్యముగా వెలువడి యుండెను. దానికి కారణము ప్లేగు వలన, కంపాజిటర్లు సరిగా రాకపోవుట యని పాఠకుల కిదివరకే తెలిపి యుంటిమి.

ఇదివరకు అచ్చువేయుచున్న గోలకొండ ముద్రాక్షరశాలవారు, తమకు తీరికలేనందున, దీని నింకొక చోట అచ్చు వేయింపుడని సలహా నొసంగినందున, రెండవ దానికై వెతికి చివరకు; గౌలీగుడెములోని చంద్రికాంత ప్రెస్సునకు జేరితిమి.

వారియొద్ద తెనుగక్షరములు తక్కువగా నున్నందున, వానిని తెప్పించుట కింత యాలస్యమైనది. ఇప్పుడు సాధనము లన్నియు వచ్చినవి. కావున కొలదిరోజులలోనే పాఠకులకు మే, జూన్. జూలై, సంచిక లొసంగ గలమను నమ్మకమున్నదని విన్నవించుచు, అనివార్యమగు నీ యాలస్యమునకు మమ్ము క్షమింప వేడుచున్నాము.

చందా పూర్తియైనవారు త్వరలో తమచందా నంపి మా యుద్యమమును ప్రోత్సహింప ప్రార్థన! కొలది రోజులలో డబ్బు చేరనియెడల కార్డు వి. పి. పంపుచున్నాము. తిరగగొట్టి మాకనవసర వ్యయముల జేయకుందురని వేడుచున్నాము.

వ్యవస్థాపకుడు.



By the courtesy of the Publisher of "Pictorial Hyderabad".

ఉస్మానియా పార్కులో నొక దృశ్యము,

అఫ్జల్‌గంజు, దక్షిణ హైదరాబాదు.



హైదరాబాదు ఏప్రిలు ౧౯౨౮

సంపుటము ౧ విభవ సంవత్సర చైత్రము సంఖ్య ౪

# స్వాగతము

బూర్గుల రామకృష్ణారావు బి. ఏ., ఎల్ ఎల్. బి.

ప్రభవా ! నీకిదెవీడుకోలు ! సమయప్రాప్తాదమ్మున్ వీడుమే
విభవంబొల్లక రాత్రివేళను మనోవీథిన్ బడన్ జూడలా
శుభరేఖాళియుమాసివిస్మృతిగనున్ సుంతేనిగాన్పింపకే
విభవా ! నీకిదెస్వాగతంబు ! కరుణన్ వీక్షింపుమావిశ్వమున్

జీవితమునందుజనియించుచేదుతనము
మధురపరిణయామృతంబుచేమాఱుగుచుల
నొసగునీరీతియన నింబకుసుమసహిత
చూతఫలసారమధురమంజులరసంబు
నేడుగైకొంటిమేము వినీతభక్తి
స్వాగతమొసర్చి భావివత్సరఫలంబు
మధురమొఱకైదన గేనుమంచు మొక్కి
అదియెయర్ఘింతు నీకుపాయసముగాగ !

కవులకు నూత్నభావముల కానుకలిచ్చి ధరిత్రి నేలు భూ
ధవులకు క్రొత్త దిగ్విజయధాటి యొసంగి స్వతంత్రశక్తి సం
భవమగు తీవ్ర సంచలన భావము ప్రజ్వరిల్ల ప్రజాళిఁ వెల్
దవిలి నవీనమార్గములఁ దార్చుచు మార్చుచు నల్లనల్లన్

రమ్ము ! యగాధకాలతిమిరాంబుధి మున్గెను వత్సరంబిల్ల
గ్రిమ్మరరాదు; నూతనయుగాదిని త్రుళ్ళిన యాశలెల్ల భూ
జమ్ముల మాడ్కి క్రొన్ననల చాళ్ళను దాల్చి నవీన వాసనల్
జిమ్ముచు క్రొత్త తావులను జేర్చుచు క్రొత్త విలాససంపదల్
గుమ్ముచునుంప నో విభవ ! కూర్మిని రమ్ము శుభంబులీయగన్

ఎండిన మ్రానులున్ జివురులెత్తగ మానవ మానసాబ్జమం
దుండిన సుప్తి జెందునె సదూహలు క్రొత్తగ రేకులెత్తకే ?
పండిన యాశలున్ కుదురబండని యాశలు రెండు గూడవే
రెండు స్వరూపముల్ బడసి యుజ్వల కాంతుల దాల్చు నిత్తరిన్

వత్సరంబొకటి నా వయసున్ జెల్లెనం
చని తాత మూలన గొణుగుకొనగ
పదియేళ్ళ పిల్లామె పరిణయం బెప్డని
భర్త నాతుర పెట్ట భార్యసనగ
ఈసాలు లాభంబు లెంత వచ్చెనటంచు
యజమాని లెక్కలరుజావు జూడ
'పండుగకై క్రొత్త పంచ లేవే నాన్న'
యని బాలుడొక వంక యలిగిపోవ

రోజు సంసారబాధల కోటిపాట
యుండు నిట్టులె యైనను పండుగనుచు
వత్సరారంభమనుచు రవంత కాల
మందొక వంక సందడిన్ విందుజేయ

రమ్ము ! విశాలభారతధరాతలమించుక నొక్క చూడ్కి సే
దమ్ము జనింపగాంచి [illegible] లరాల్చె హమ్మవే

గమ్మునమాతృసేవకయికంకణబద్ధుఁడవై క్రియావిశే
షమ్మునఁబూజసల్పననిశమ్ముగ నాంధ్రకుమార ! భక్తిచేఁ

‘ ఇంతకుచేసినట్టికృషి నేమిఫలంబొనగూడె ’ నంచునా
నంతయుచింతసేయకుమవారితభక్తి నిక్రొత్తనెత్తురుఁ
సంతనఁజేయుమయ్య; శుభసంపదలిచ్చుయుగాది; రమ్మిదే
పంతముజేసిసుస్థిరతఁ భారతమాతకుసేవసల్పఁగన్

# నీతిపంచకము

సురవరము ప్రతాపరెడ్డి, బి. ఏ., బి. యల్.

మలయజమునీడ సర్పంబుమసలినట్లు
గర్వమొప్పును బండిత గ్రామణులకు
స్వర్ణభూషణమందుండు వజ్రమటుల
వినయమొప్పును విద్యావివేకులకును !

జ్ఞానియగువాఁడు సమ్రతఁబూనియుండు
ధాన్యభరమునఁదలయొగ్గు దంటువడపు
అల్పుఁడెప్పుడు వాచాలుఁడై తనర్చు
డమడమధ్వనిచేయు పటహవిధంబు !

పిరికిపందలచెల్మిచే వీరమతులు
శీఘ్రమేతాము పెంపెది చెడుటనిజము
పక్వఫలములలోఁజెడు ఫలముజేరె
నేని నన్నింటిఁజెఱుపక యేలయుండు !

కాక కోకిల రూప మొక్కటియెసుమ్ము
కూతమాత్రము భిన్నమై కొఱలుచుండు
మనుజులందును నీచోత్తమత్వములను
చెయ్దములచేతనే విమర్శింపవలయు !

అనిశముమాతృదేశహిత మాత్మనుగోరెడివాఁడె భక్తుఁడౌ
తనతనువర్థధనంబును ముదంబున నర్పణసేయునట్టియా
మనుజుఁడె త్యాగి; బ్రాహ్మణుల మాలలనొక్కవిధంబుజూచునా
జనుఁడె మనీషి; దుర్మదము శత్రువెశూర వతంసుఁడెన్నఁగన్ !







హారూన్ ఖాన్ షేర్వాని


౧

రాజనీతి శాస్త్రమునందలి ముఖ్యమైన సమస్యలలో ఆధిపత్యము (Sovereignty) నకు సంబంధించిన సమస్య యొకటి. విశుద్ధ తర్కముతో నిండిన రాజకీయ సమస్యలలో నీసమస్య అగ్రస్థానమువహించినది. కాని ఈమధ్య అధిపత్యమును గురించిన అభిప్రాయములలో కొంత మార్పుగలుగుచున్నది. ప్రొఫెసరులాస్కి దానినిగురించి తన యభిప్రాయము వెల్లడిచేయుచు, నది శాసనముయొక్క నైతిక బలముపైననే ఆధారపడియున్నదని నుడివెను. ప్రొఫెసరు రాధాకమల్ ముఖర్జీ 'రాజ్యము శాసనబద్ధులయొక్క కూడిక' యని సిద్ధాంతపరచెను. ఇదిగాక ప్రజాస్వామిక (Democratic) సంస్థలపై తిరుగుబాటు జరుగుచున్న యీకాలములో, స్వేచ్ఛాయుత అధ్యక్షత స్థాపితమైన నీసమయమునందు, ఫాసిను తత్త్వమము మొగమెత్తిన నీయుగమున, క్ష్యమింపటంగు పక్షమునకు విజయము కలిగిన నీకాలమున, అధికార గర్వభంగము చేయు సమస్య ఐరోపా మహా సంగ్రామానంతరము ముఖ్యముగ ముందునకు వచ్చినది, మరియు నీసమయమున ఆధిపత్య సమస్యను ప్రతిదిన రాజకీయములనుండి వేరుచేయ వీలులేకుండ నైనది. అనాదినుండియు స్వాతంత్ర్య జీవనము గడపిన ప్రాగ్దేశీయులమగు మనకిప్పుడు దైవఘటనవలన పాశ్చాత్యులకు లోబడవలసి వచ్చినందున, పూర్వావస్థను, ఇప్పటిస్థితిని, రాజనీతి శాస్త్రముయొక్క ముఖ్యమైన నీసమస్యద్వారా పరికించుట చాల... ముగ నుండును.

రెండువేల వత్సరములనుండి జననమొంది ... జెందిన రాజనీతి వేత్తలనెల్లర దృష్టిని మరల్పగలి... స్య యిది యొకటేకనుక, దీనిప్రాముఖ్యత సుస్పష్ట... న్నది. బహుశః అధిపత్యమును గురించి ప్రస్తా... సూచించినవాడు అర్థశాస్త్రకర్త; ఆతడు అధిపత్యము... క్క విభజన నిటులచేసెను:— స్వామి, అమాత్యుడు, పదము (దేశము) దుర్గము, కోశము, మిత్రులు.

సుప్రసిద్ధ మహమ్మదీయ చరిత్రకారుడగు ... ఖల్దూన్ ప్రతిరాజ్యమునందొక 'శక్తి' యుండును... అది వివిధములగు చిన్నచిన్న శక్తుల కూడిక... దానికంటె మించిన శక్తి మరొకటి దేశమున... యు వాక్రుచ్చెను. క్రీ. శ. పదునారవ శతా... నందు, జీన్ బొదీన్ తన 'డి రిపబ్లికా' యందీ స... పైచర్చించుటకంటె పూర్వము, యూరపు ఖండము... దెవ్వరును దానిని సరిగా గ్రహించలేదు. అది ప్ర... శమునందలి శాసనములకు లోబడనివాడు మాత్రమే... నియు, ఆతడు శాసన కర్త కూడననియు జీన్ ... సిద్ధాంతపరచెను. కాని, అధిపతి, దైవము చేసిన, ... కృతి చేతను నిర్ణయింపబడిన శాసనములకు, ...యుద్ధము... లేడని తన్నుదానే ఖండించుకొనెను. ఆం...

థామసు హాబ్సు తన ' లెవియాథన్ ' అను పుస్తకమును, అధిపతి యొక్క నిరంకుశత్వముపై నాధారము చేసెను. ఆతని అధిపతి అసమానుడగు శాసనకర్త. ప్రతిలేని కార్యనిర్వాహకుడు. అడ్డులేని న్యాయాధ్యక్షుడు. నిజముగా ' లెవియాథనే ' [ భీముడు ( giant ) రాక్షసుడు కాడు ]. ప్రపంచేశ్వరుడే యని యత డనును. ఈశ్వరునికిని, ఆతనికిని భేదమేమన: నాతడు మృత్యుంజయుడు మాత్రము కాడు.

హాబ్సు అధిపతి యొక్క కఠినతర నిరంకుశత్వముపై తిరుగుబాటు జరుగుట సహజమైన విషయమై యుండెను. జాన్ లాక్ అంతటి గొప్ప రాజనీతి శాస్త్రజ్ఞుడు తనపుస్తకము ' సివిల్ గవర్నమెంటు ' నందు అధిపత్యమను శబ్దము నొకసారయినను వ్రాసికొనలేదు. శాసన బద్ధుడు కాక రాజ్యముచేయు అధికారియే ' నిరంకుశ శక్తి ' యనిపించుకొను నని మాత్రము తెలియజేసెను. స్వాతంత్ర్యదేవి నారాధించు భక్తాగ్రేసరుడును అప్పుడే ' రాజద్రోహుల ' చే పూజింప బడు వాడును, అప్పుడే రాజపూజ్యులచే ఖండింప బడువాడును నగు జీన్ జాక్ రూసో తిరిగి తినదేశీయుడగు బోదీన్ నిర్మించిన స్థానముపై అధిపతి కభిషేకోత్సవము సల్పెను. కాని ఉభయులకును భేదమేమన రూసో ఒకవ్యక్తినుండి అధిపత్యమును ' లాగి ' వేసి జాతియంతకును పంచి పెట్టెను. రాజనీతిపరులకీ ' Volonte Generale' ( వొలాంతె జెనరాలె అంటటి యిష్టము) వంటి అగోచరమగు శబ్దము సర్వగోచర కార్యములకు జన్మస్థానమని నమ్మక పోయిరి. రాజనీతి సిద్ధాంతు లందరును సగోచరుడగు అధిపతి స్థానమేదని పరిశోధన చేయసాగిరి. ఈ పరిశోధనయే కాబోలు జాన్ ఆస్టిన్‌ను అధిపతి ప్రత్యేకించి ఒక మనుష్యశ్రేష్ఠుడే యుండవలెననియు, ఆతడు ఇతరుల యధీనము నందుండు వాడు కాకూడ దనియు, సంఘము అతని యాజ్ఞలను పరిపాలించు నట్టిదిగా నుండవలె ననియు, నుడువ జేసినది. దానినే టి. ఎచ్. గ్రీన్ సూత్ర ప్రాయముగ అధిపతి, హక్కులను ఆచరణ యందు బెట్టెడు అధికారి యని వ్రాసెను; కాని యధిపతిని విడదీసి పరీక్షించినచో చివర కాతడు సంఘ రూపమునో, లేక ఒకటే పర్యవసానమును కోరునట్టి సంఘ మనబడు ఒకటే సర్వజ నైకాభిప్రాయముననో వెల్లడియగును.

ఆధిపత్యమును గురించి ఆధునిక సిద్ధాంతములేవో విచారింతము. పందొమ్మిదవ శతాబ్దమునందలి రాజనీతి ధురంధరులు రాజ్యమే ( state ) అధిపతి యని నమ్మినను, శాసనాధిపత్యము ( Legal Sovereinty ) రాజ్యమునం దెక్కడుండునో యాలోచించక పోయిరి. శాసనాధిపత్యము శాసనకర్తల చేత నున్నదని యనుట సులభముగనే యుండెను. కాని వాని నిర్మాణము నందగ్రస్థానము గల అధికార మెక్కడున్నదో తెలిసికొనుట కష్టమైన విషయమై యుండెను. ఆధిపత్యమును చర్చించిన యూరపుఖండ రాజనీతి వేత్తలలో ప్రథముడగు జాన్ బోదీన్ కూడ పవిత్రమైన రోమా సామ్రాజ్యము యొక్క ఏకచ్ఛత్రాధిపత్యము లేని కూడికను, ఇంగ్లండు నందలి ట్యూడరు రాజులు తమ నిరంకుశత్వమును ప్రబలింప జేయుటకై పార్లమెంటుపై చూపిన ఉదాహరణను చూచి అగోచరమగు ఆధిపత్య సమస్యను, గోచరమగు అనుభవముతో పోల్చి అచ్చెరు వొందెను. పందొమ్మిదవ శతాబ్దమున అపర సరస్వతి యని ప్రసిద్ధి గాంచిన జేమ్సు బ్రైస్ శాశన సమ్మతి మాత్రము బడిసిన (De - jure ) అధిపతికిని, నిజమైన అధిపతికిని (De facto

Sovereign ) భేదము నిరూపించి చూపించెను. ఆతడు కావించిన చర్చయందీ ద్వివిధాధిపతుల పరస్పర సంబంధమును విమర్శక దృష్టితో వాదించెను. ఇంతే కాక మొదటి యధిపతి రెండవ యధిపతిగా నెటులు పరిణమించునో వెల్లడిచేసెను. ఇంకను ఇటీవలి రాజనీతి వేత్తలగు ప్రొఫెసరు డైసీ, ప్రొ. హాలండు అధిపతి యొక్క అవిభజనా గుణమును సంశయ దృష్టితో చూచిరి. ప్రొ. హాలండు రాజ్యము ( state ) ను సంపూర్ణాధిపత్యము గలవిగను ఉండునని వాక్రుచ్చెను. కొన్ని రాజ్యములు పూర్తిగ పరజాతి యధీనమునందు కూడ నుండవచ్చునని ఆతడు నుడివెను. ప్రొఫెసరు డైసీ క్రీ. శ. ౧౯౧౧ నందు హౌస్ ఆఫ్ కామన్స్ నకు లభించిన ''పార్లమెంటు ఆక్టు'' వలన దాని ఆధిపత్యమునందు వృద్ధి కలిగిన దని అభిప్రాయ పడెను,

ఆధిపత్యము ద్వివిధములుగ పరిగణింప బడుచున్నది.

శాసనాధిపత్యము ( Legal Sovereignty )

రాజకీయాధిపత్యము ( Political Sovereignty )

శాసనముల నేశక్తి చేయునో అది శాసనాధిపత్య మన బడును. శాసన నిర్మాణాభిలాషను, నిర్మాణమును చేయుటకై పురికొల్పిన నానా విధములగు పలుకు బడుల(Influences)ను రాజకీయాధిపతి యందురు. శాసనాధిపత్య మేవ్యక్తియందున్నదో, ఏప్రత్యేక సంస్థయందున్నదో, తెలిసికొనుట యెంత కష్టమైన పనిగాని అంతకంటె వేయి రెట్లు ఆ పలుకుబడులు జననమొంది, శాసనాధిపతిని నిర్బంధింప చేయు స్థలమును కనిపెట్టుట కష్టము. వాని అతీతమైన సంఖ్యవలన ప్రతిదినము అక్కరకు వచ్చునట్టి శాసనాధిపతిని మాత్రమే మనము కొంతవరకు తెలిసికొన గలము. ఈ కఠిన [illegible] ఖండించుట ఆధిపత్య సమస్యలను గురించి విమర్శ చేయు[illegible]రందరును గొప్ప యవస్థలో బడిపోవు చుందురు. [illegible] గోళముతో నిండిన రాజకీయాధిపతి యొక్క [illegible] మనుష్యమాత్రునికి అర్థముకాదని యనిపించును.

౨

ప్రభుత్వము యొక్క పరిస్థితి యవసరమును [illegible] చేయు నవీన సిద్ధాంతము తెలుపుటకు పూర్వము [illegible] హెన్రీ మేన్ నుడివిన ఒక సత్యమును తెలిసి[illegible] ఉత్తమము. ఆస్టిన్ చర్చించిన ఆధిపత్య సమస్య[illegible] విమర్శించుచు ప్రపంచము నందలి కొన్ని రాజ్యముల[illegible] కుల ప్రభువులు తమ దేశము లందలి ఆచార శాస[illegible] మాత్రము త్రోసివేయలేక పోయిరని వ్రాసెను. [illegible] ఉదాహరణము వలన తెలియు విశేషమేమన సర్వ[illegible]రములుగల అధిపతి కూడ దైవ నియమములను దాట[illegible]

ఆధిపత్య సమస్య రాజకీయ శాస్త్రము నం[illegible] ప్రాముఖ్యత యేలవహించినది ? ప్రశ్న[illegible] దీయుటకు రెండుమార్గములు గలవు: ఒకటి, శాస్త్ర మార్గము. రెండవది, అనుభవమార్గము. శాస్త్ర మార్గము ద్వారా పైప్రశ్నను విడదీయునప్పుడు రా[illegible]మునందు ప్రతికార్యము జన్మించు స్థలమేదో తెలిసికొను[illegible] ముఖ్యము. ఏశక్తివలన రాజనీతి చక్రము తిరుగు[illegible]డునో, ఏశక్తి రాజ్యావసరముల పూర్తి చేయునో, ఏ[illegible] దానిని నియమబద్ధముగ నుంచునో, ఏశక్తి రాజ్య[illegible]నందలి సంచలనమును తన అదుపునందుంచునో, తెలి[illegible] కొన వలసి యుండును. అనుభవమార్గము ద్వారా [illegible] ప్రశ్నను తెలిసికొన దలచిన వారింకొక త్రోవ త్రొ[illegible] వలసియుందురు. రాజ్యమునందలి యేసంస్థపై రాజ్య[illegible] యొక్క క్షేమ మాధార పడియున్న దని పౌరుడు [illegible]

ట్టుకొని యుండునో, దేనివలన రాజ్యాభివృద్ధి కరమగు సంస్కరణములు జరుగునో తెలుసుకొనుట ముఖ్యము. పై రెండు మార్గముల ద్వారా యీ సమస్యను విచక్షించి చూచెదము.

మనుష్యుని ప్రకృతిని తిలకించినచో అతని జీవితము యొక్క రెండు వేర్వేరు ఉద్దేశము లగుపడును. మొదటి ఉద్దేశమును పూర్తి చేయు చున్నప్పు డాతడు తన చుట్టు ముట్టేమి జరుగు చున్నదో పరికించడు. భోజనము చేయును, నీళ్లు త్రాగును, వ్యాయామము చేయును, పడుకొనును, తనయవసరములను ఉత్తమవిధముగ పూర్తి చేసికొన ప్రయత్నించు చుండును. ఈ ఉద్దేశమును నెరవేర్చునప్పు డాతడు స్వతంత్రుడు. తనజీవితముకొఱకు తాను చేసుకొను యీసామాన్య విషయములందితరులు జోక్యము కలిగించు కొనరు. అతని నొక సమూహము యొక్క సభ్యునిగా తలంచగనే కష్ట సమస్యలన్నియు ముందునకువచ్చును. అరిస్టాటల్ శిష్యులము మనము కాకపోయినను ఆతడు ఘంటాపథముగ చెప్పిన ఒక విషయమును తలవంచుకొని స్వీకరింప వలసి వచ్చును. మానవుడు ఒంటరిగా, ఇతర మానవుల సంపర్కములేక జీవించలేడు. లైంగికావసరముల మాట యటుంచి మనుష్యుడు మనుష్యుని వలె నుండ దలచినచో యితరులతో కలియకుండ చుండుట యసంభవము. ఆత్మరక్షణకొఱకో లేక తుదకు చమత్కారము కొఱకైనను ఇతర మానవుల కలయిక ముఖ్యము. మానవుని సాంఘిక వృత్తి, సాంఘిక ప్రకృతి చర్చించునప్పుడే రాజనీతి శాస్త్రమును, అధిపత్య సమస్యయు జనన మొందును..

పైన విచక్షించిన రెండు విధములగు ఉద్దేశముల తో పరస్పర యుద్ధము జరుగు చుండును. ఆత్మ రక్షణయు, సంఘ ( రాజ్య ) సంరక్షణయు నగు రెండు విధముల కోరికలు మనుష్యుని యందున్న వని మనకు తెలిసిన విషయమే! ఒకొకసారి ఒకొక కోరిక రెండవకోరికను మించిపోవును. రాజకీయ సమూహములు (Political groups) రాజకీయ సంస్థలు(Bodies Politic) ఒకచో నున్నప్పుడు తప్పక వ్యక్తి ఉద్దేశములకును సంఘోద్దేశములకును సంఘర్షణ జరుగును. అప్పుడు మొదటిది రెండవ దానికి లొంగవలసి యుండును. మనుష్యుల ప్రకృతులు భిన్న భిన్నములుగ నున్నవి, కనుక ఒకని యందున్న త్యాగబుద్ధి మరొకని యందుండదు. అందఱి గుణములు ఒకటే విధముగ లేనందున బలముగల యొక శక్తి యవసరము కలిగినది. సంఘపు కోరికలను వ్యక్తి కోరికలపై ప్రాధాన్యత యొసంగుటకై దాని యునికి చాల యవసరము. మానవ ప్రకృతు లెట్లు భిన్నములైనవో వాని అభ్యాసములును, జీవిత విధానములును భిన్నములే. ప్రతి దేశమునందు బుద్ధిమంతులు బుద్ధిహీనులు ధనవంతులు, దరిద్రులు పెద్దలు, పిన్నలు, ఉందురు; ఆ విధముగనే కొందఱియందు కార్యనిర్వాహకశక్తియుండును, మరికొందరియందది ఉండదు; దేశము బాగుపడవలెనని కొందరి యుద్దేశ మున్నను, బాగుపఱచు శక్తి వారి యందుండదు. భిన్నప్రకృతులు గల ఒక జన సమూహము వారి హక్కులను ఆచరణయందు బెట్టునట్టి, వారి కర్తవ్యములను చేయుటకై నిర్బంధ పెట్టునట్టి శక్తిని తీసివేసి తమయోగ క్షేమ విషయముల దామే నిరూపించుకొ, డని వదిలిపెట్టినచో వారి సాంఘికజీవనము కొన్ని దినములలోనే నిర్మూలమై పోవును. అందువలన

అసమాన శక్తియొక్క యునికి రాజ్యమో, జాతియో ఉండుటకు చాల అవసరము (Sine qua non).

ఈశక్తి వ్యక్తుల యొక్క ధిక్కారములను మించి నట్టిదైననే కాని తన యుద్దేశము నేరవేర్ప లేదు. రాజ్యమునందు కొందఱు బలవంతులు, మరికొందరు గొప్పబొట్టు కలవారు, కొందరు పెద్దవారలతో సంబంధము కలవారు, కొందరు జమీందారులు, కొందరు వర్తకులు, ఉందురు. వీరందఱిని మంచిపౌరులుగా నుండునట్లు చేయు చతురతయు, వారందరేకమై ధిక్కరించినచో అణపగల శక్తియు అధిపతియందుండవలెను. ఈ అప్రతిమాన శక్తి ఆదేశమునందలి సర్వజనుల యిష్టమునందే యుండగలదు. ఈ మనఃశ్రేణియే వ్యక్తుల దౌర్జన్యము నణచి యుంచగలదు.

రూసో యొక్క "Volonte Generale" (సర్వజన మానసము) వివిధమానసముల కూడిక కానేరదు. రెండవదానియందు వ్యక్తియొక్క కోరికకు ప్రాధాన్యము కలుగుచున్నది. మొదటి దానివలన సంఘ క్షేమములభించును. దేశమునందన్నిటికంటెఅగ్రస్థానము వహించిన శక్తి రాజ్యాధిపతి. క్రొత్తమనుష్యుడు రాజ్యమునందు కాలిడగనే అతడక్కడి అధిపతి యధీనమున చేరిపోవును. అట్లుకానిచో అతని మనస్సునకు రాజ్యపతి మనస్సునకును సంఘర్షణజరుగును. దానివలన క్షీణించిపోవుట (Disintegration) ప్రారంభమగును. కొన్నిరాజ్యములకు ఇతరరాజ్యముల వ్యవహారములలో జోక్యముకలదు. ఉదాహరణార్థము లాసెన్ సంధికి పూర్వము టర్కీస్థితి; చైనాయందలి సంధిరేవు ఇట్టిస్థితిలో అట్టిరాజ్యములు తమ యధీకారములలో కొన్నిటిని పరరాజ్య స్వాధీనము చేయును. మొదట స్వతంత్రముగనుండి ఇప్పుడు పరవశములైన రాజ్యముల స్థితికూడ నిట్టిదే! ఇట్టితరి మనము విమర్శించి చూచినచో ఆయా దేశముల జాతీయశక్తి తిరుగబాటు చేయు వ్యక్తుల బలముల నణగద్రొక్క లేక స్వతంత్రముగ నుండు విధములులేక పోవుటవలన యితర రాజ్యముల స్వాధనమై పోవును. కాని పరతంత్రములై శక్తిని కూడ పోగొట్టుకొనిన తెమశక్తులు గడించి పరరాజ్య అగ్రత్వము తొలగించి తిరిగి స్వతంత్రరాజ్యములై యవచ్చును. *

(సశేషము)



* ప్రొఫెసరు హరూన్ ఖాన్ షేర్వానీ గారు ఉస్మానియా యునివర్సిటీ లాయూనియనునందు వ్యాసము చదివిరి. వారి వ్యాసము యొక్క శీర్షిక 'ఆధిపత్యము యొక్క నవీనసిద్ధాంతము,, అది చాల పెద్దదిగ నున్నది. అధిపతిని గురించి ఇదివరకు శాస్త్రజ్ఞుల యభిప్రాయములను తెలిపిన భాగమును 'ఆధిపత్యము' ను శీర్షిక క్రింద ప్రచురించితిమి. వారి నవీన సిద్ధాంతమును రాబోవు సంచికయందు ప్రకటించగలము.



# బాష్పకంకణము

వర్ఘుల వేంకటేశ్వర కవి

అమలశ్యామల తారకాపథ విహారాయాత్త చంద్రస్ఫుర
త్కమనీయస్ఫుట కౌముదీతళతళత్కాంతార కాంతప్రదే
శమునంబొల్చు లతాంతమా ! చలితయుష్మన్మంజు పత్రంబులన్
హిమబాష్పాంబుకణంబులం గటకటా ! యిట్లేటికిన్ రాల్చెదో ?

మలయసమీరతస్కర కుమారుఁడు తావక భవ్యపత్రసం
కలిత సుగంధ సంపదలఁగైకొని పోయెడు వాఁడటంచునీ
వలిగితివో? మనంబున ననంతవిచారముఁగొంటివో? యిటుల్
జలజలబాష్పకంకణములం గడు రాల్చెదవేల పుష్పమా !

కమ్మని చిన్నపూవ ! కడు గండు తనమ్మునమీరు చొక్కపుం
దుమ్మెద దిమ్మరీఁడు బహుధూర్త మతిం భవదీయపత్రగ
ర్భమ్మున నొప్పుభాసుర మరందముఁ గైకొనుటన్ ఘటిల్లుదుః
ఖమ్మున నశ్రుబిందువులఁగార్చుచు నుంటివొ కాని చెప్పుమా !

ఇదిసంపూర్ణ సుధాకరప్రభలతో నింపారురాత్రంబు; ష
ట్పద! సంగీత రవంబొకింత వినిపింపన్ లేదునేఁడియ్యెడన్ ;
హృదయోద్భూత విచార భార జనితార్తిం దెల్పుచున్నట్లువం
చెదవేలాశిరముల్? సమస్త సుమన స్సీమంతినీరత్నమా !

వెన్నలరేని. వెన్నెలలు వెల్లువలై ప్రవహింప నందులో
సన్ననిపిల్ల తెమ్మరలఁ జక్కగ మెల్లనఁదేలు నొకయో

యున్న వితంబునన్ మివుల హాయిగఁబొల్చు లతాంతరాజమా !
విన్నదనంబుగల్గి విలపింపఁగ నేమికతంబు? సెప్పుమా !

పవమానాంకురజాల చాలిత సరోవాఃపూర గర్భంబునన్
భవదీయప్రతిబింబముం గని జలాంతర్మగ్నుఁడై యెయ్యెడన్
ధవుఁడున్నాఁడను భ్రాంతి ముద్దిడుటకున్ మస్తంబటుల్ వంచుచుం
టివో, దుఃఖంబునఁ గార్చుచుంటివో కదా నీహారబాష్పాంబువుల్ ?

మహిత లతాంతకాంత ! నవమంజుళ పల్లవ సుందరీ సుఖా
వహకవితావలంబమున భాసిలుచుండియుఁ గోమలత్వముం
బహుసుకుమార భావ విభవంబు, విలాస వికాస వాసనా
మహిమముఁగల్గి పేర్వడియు మాటికినశ్రులఁగార్చెదేటికిన్ ?

భవదీయామల రాగయుక్తదళముల్ భవ్యోదితామోదసం
స్తవనీయస్థితిఁబొల్చుఁగాదె సుమనశ్శ్యామామణీ ! చంద్రికా
ధవళస్ఫూర్తి, తళత్తళత్కృత భవత్ప్రాలేయ బాష్పాంబువుల్
నవముక్తాఫలజాలసంకలిత మాలాలీల దీపించునో ?

శీతలవాతపోత విటశేఖరుఁడో కుసుమాంగి ! నిన్ను సం
ప్రీతిగ ముద్దువెట్టుకొను వేళఁ ద్రపాగత నవ్యరాగహే
లాతిశయాప్తి, మేనఁ బులకాళిజనింపఁగ, నప్రయత్నసం
భూతహిమాశ్రు కంకణ సమూహములంగడు రాల్చుచుంటివా ?

ఈసుకుమారసంపదయు నీసువికాసము, నీవిలాసమీ
వాసన శాశ్వతంబె ? క్షణ భంగురమే కద,యంచు నీవు సం
తోసమెయందినావా? మది దుఃఖమె యందితో కాకపుష్పమా !
యీసరణిన్ హిమాశ్రువుల నెందులకుం గడు రాల్చుచుండుటల్ ?

మృదుళసుమాంగి బాష్పముల నేటికిరాల్చెదు ? నిన్నుఁజూచినా
హృదయము ప్రేమభావము వహించుచునున్నది, రమ్మ మత్కరా
స్పదసుఖసంపదల్ గొనుము; బాష్పకణంబుల నార్చివై చెదన్,
ముదమువహించి లేతసవు మొల్కల నిల్పెదుగాక మోవిపై.

# అనురాగము

' ఆత్రేయ '

౧

ఎందుకొఱకే అంటారేమో, పెద్ద వాళ్లతో సంబంధం చేయకూడదని? అల్లేకాసించో ప్రపంచంలో 'నాది' యనుకొనుట కాటంకం లేనట్టిదైన ఒక్కనామస్సునుకూడ తనదిగా చేసుకొని, నాశరీరాన్ని అంధకారంలో వదలి తానుమాత్రం అకాశాన్ని ధిక్కరించే రాచనగళ్లలో ఉయ్యాలలూగుచు నన్నెందుకీ క్షోభ పెట్టడం? .........మరిచిపోతిని. ఛప్పన్నారు దేశాలనుండి వారియింటిపై వరులు యిరుగబడు తున్నారట. ఏపాపం మెరుగని షట్పదుణ్ణి చిన్నప్పటి నుంచి తనకొఱకై కూర్చుకొనిన మధువుపై నుండి తఱిమి వేసి తమ పొట్టనింపికొనుట యేటిన్యాయమో? .........ఇదుగో, వస్తానని చెప్పింది; యింతవరకూరాలేదు. ఈవాన యెడ తెఱపి లేకుండా పడేటట్టు కనబడుతున్నది. గాలి వాన వలన నేనెల్లా వొణికిపోతున్నానో అల్లేయిన్ని దినాలనుండి 'పాహిమాం' అని ఆశ్రయించిన నన్ను కాపాడిన యీపూరి గుడిసెకూడా ముసలిదై వూగుతున్నది. ఎప్పుడు కూలిపోవునో? .........అబ్బ చప్పుళ్లేమిటి? ఎవరో వాళ్లయింటినుండి వెళ్లిపోతున్నట్లున్నది. ఎన్ని ఖంస్లు? .........వీళ్లందర్లోకేసారి ఆమెకు వుస్తె కట్టుదురేమో? .. ......అబ్బ! గుండెలదిరే వురుములచప్పుడు! యిప్పుడే యీ చుక్కల మెరుగుడు కూడాను.........ఈభయంకర సమయాన ఆమె వచ్చునా? ఏమో, మఱచిపోయి యుండును. పెద్ద పెద్ద రాకొమార్లను, ఆగొప్ప గొప్ప భవనాలలోని వైభోగాలను వదిలిపెట్టి యిక్కడేముందని వస్తుంది? ఇంతట్లోనే నన్ను మరచిపోయిందా? ఆమె తన నోటితో అనకున్నా, ఆమెకళ్లు, కార్యదీక్షను వ్యక్తపరిచే ఆ కళ్లు, 'నిన్నువదలదు, ముమ్మాటికిని ఆమె నిన్ను వదలదు' అని సూచించలేదు? అయితే యింతవరకూ రాలేదేం? పాపం, తనుమాత్రం యేంచేస్తుంది? వాళ్లు వీళ్లొస్తే ఎల్లా వస్తుంది? కాని ఈ పాడుమర్యాదనా ప్రాణాన్ని తీసి వేస్తున్నదే! .........ఈ వుప్పిల్లు దీపాన్ని మింగివేసేట్టు కనబడుతున్నది. అంధకారంలో మరింత అంధకారం.........ఆ చప్పుడేంది? మెట్టల చప్పుడువలె తోస్తోంది......... "క్రిచ్. క్రిచ్" కృష్ణ, కృష్ణ, బల్లి అరుస్తున్నది. ఒకొకసారి ఆకాశవాణంత పనిచేస్తుందిట, దీనిపలుకు. అయితే నా యీప్సితం పూర్తౌతుందో? చప్పుడెక్కువౌతుంది. నల్లని మేఘాలలో మెరుపుతీగె మొలకెత్తితే చాటసారి కెంత ఆనందం కలుగుతుందో నా కట్టే ఔతున్నది. అయితే వస్తున్నదేమో? "

## ౨

అని ఆగుడిసెలోనున్న పురుషుడు తల పోయుచుండగా, నీలవసనమును కట్టుకొనిన ఒక యువతి, ఆకాశమును భూమిని లెక్కలేని త్రాళ్లతో కట్టివేసి నట్లగుపడుచున్న వానను త్రెంపివైచుచు, తడిసి ముద్దయై లోన ప్రవేశించెను. కొనప్రాణములో తల్లడిల్లుచున్న రోగిష్ఠిని దీర్ఘాయుష్మంతునిచేయ ప్రయత్నించు వైద్యునివలె నాయువిద లోన ప్రవేశించగనే ఆరి పోవుచున్న దీపపువత్తిని సరిచేసెను. అటుపిదప అటునిటు చూడగా తనకై నిరీక్షించుచు నొక మూలయందు చతికిల బడియున్న పురుషునిపై ఆమె దృష్టి పడెను. కుత్తుక వరకు నిండుకొని వచ్చిన......అదేమిటో—పేరులేనిది—దాని నాపుకొనలేక చాచుకొనియున్న ఆవ్యక్తి హస్తములలో కూలెను. ఒకరిలో నొకరు అల్లుకొని భూమిపై వారిరువురును తూలిరి. ఉభయుల నోటినుండి ఒకశబ్దమైనా వెళ్లలేదు. భావము శబ్దస్వరూపము దాల్పకమున్నే మాయమై పోవుచుండెను. ప్రపంచమునందలి కోరికలన్నియు ఆయాలింగనములో వారికి తీరిపోయినవి. ఆయువతి రాక పూర్వ మాపురుషుని నూపి వదలిన ఆలోచనానిల తరంగములు ఎక్కడి వక్కడ ఆగిపోయినవి.

## 3

ఒక గడియ యీవిధముగనే గడచినది. కొంతతగ్గిన వాన తిరిగి హెచ్చు గాజొచ్చెను. గుడిసె చుట్టు వాననీళ్లు గొప్ప నదులవలె ప్రవహింప దొడగెను. ఆప్రవాహమున గుడిసె నిలువదేమోయని తోచుచుండెను. మబ్బుల యురుములకును, మెఱుపులకును హద్దులే[illegible] నయ్యెను. మేఘముల దౌర్జన్యమునణ[illegible] యత్నించిన గాలి దేవుని యాటలేమియు [illegible] రకుగాలేదు. గాలిమెక్కువ వీచినకొలది ఆకాశ[illegible] మరింతదట్టముగాసాగెను. ఈప్రకృతియొక్క ఆ[illegible] టములవలననాపురుషునికి మెళకువ యయ్యె[illegible] మెల్లగలేచి ఆయువతి నాతడు తనయంక[illegible] భద్రముగజేర్చి, ముఖమువంక తదేకదృష్టి[illegible] కొంతసేపు వీక్షించి, వానచే తడిసిన ఆమె[illegible] గు పొడుగు కురులను రెండుపాయలుగా చేసి[illegible] నితో నామెకంఠమును బంధించెను! ఆమె[illegible] త్తయినను చలించలేదు. ఇంతలో మోహ[illegible] చే దీపమును మ్రింగి వేయవలెనని వచ్చిన పు[illegible] ను అనాయాసముగ తననోట వేసుకొనుట[illegible] కాపెట్టుకొనియున్న ఒకబల్లిహటాత్తుగ వా[illegible] దూకెను. దానిశరీరము దీపపుప్రమిదకు త[illegible] దీపమారిపోయెను. క్షణకాలమాపురుషుడు[illegible] ఆలోచనా నిమగ్నుడై తుదకు కేశముల నా[illegible] గళమునకు మరింత యురివేసెను! మేఘముల[illegible] లి మెరుపుతీవయు ఆమె కంఠమునందలి ప్రా[illegible] మును ఒక్కటేసారి మాయమైపోయెను. [illegible] మ్యాకాశమును, ఈయుభయులును ఏకక్షణ[illegible] నంధకారమునందు లీనమైపోయిరి. ఆపురు[illegible] డానందములో గొణిగికొనిన ఈక్రింది [illegible] లు మాత్రము చెవినిబడినవి:

«ఇప్పుడామె మనస్సు సంతోషించి[illegible] తన జన్మసార్థకం అయిందనేమో ఆమె[illegible] వికాసమింకా అంతర్హితం కాలేదు. నేను[illegible] తార్థుడ నైతిని. నేనిప్పుడు చేసిన కార్యా[illegible] దేవుడుచూచి మెచ్చుకుంటాడు. సురులు[illegible] పుష్పాలను కురిపిస్తారు......ఆకాశవాణి[illegible]

పలకడంలేదేం?......ఏమిా? దేవలోకం సంతో షింపలేదా? దేవా! దీనజనరక్షకా!! నేనొనరించి న కార్యాన్ని నీవెందుకు మెచ్చుకోవడంలేదు? మనుష్యునిలో కలిగే పరిపక్వావస్థ నొకదానిని నేనుస్థిరంగా నిలిచేటట్లుచేసితిని. ఈనా కార్యాన్ని దేవుడుమెచ్చుకోడా?......ఇదిగో నేనే వచ్చు చున్నాను. ప్రత్యక్షంగా నిన్నే విచారిం చెద......" *

* రాబర్టు బ్రౌనింగ్ యొక్క 'పారి ఫిరియాస్ లవర్' అనుగీతము నందలి ముఖ్య భావానుకరణము.





## యామర్తి సూర్య ప్రకాశరావు

స్నిగ్ధ చేలాంచలం బొక చేతబూని,
రజిత కలశంబు వామ కరాన దాల్చి,
సంభ్రమముగ, సంభ్రమముగ, దేవి ! నడచినావు
నాసి కాపుట యుగ్మంబు సవ్వచుండ.

తానకార్థమై తొలగితి ద్వారమందు
అంజలీబద్ధుడై వినయంబు గాను
రాజసంబుగ, దేవి ! మరాళ విధము
అభిముఖంబుగ వచ్చి నీ వాగినావు.

*　　*　　*　　*

అతిభయంకర లోకైక పతుని కఠిన
హస్త దండంబు గాంచియు నస్మదాత్మ
వెరచు టెన్నడై నను, దేవి ! ఎరుగదమ్మ;
స్మేర వదనుడై శిశును స్వీకరింతు.

రత్న మాణిక్య ఖచిత విరాజమాన
దివ్య వీధిదిత్యోద్ధూత సత్తీత్క్షణోన్న
తోన్నత మనోజ్ఞసింహాసన నొలగమున
వంచిమెరుగను జానువు లార్వరిజాక్షి!

రాజరాజాధి కారుల రాజ్యశాస
నానిరంకుశమే వెరువ నమ్మ, నేను;
విశ్వ ధిక్కారణంబె నావృత్తి, దేవి!
అమితగర్వివి: అభిమాన మమిత మమ్మ.

*　　*　　*　　*

వక్షమందున ముడచి మద్బాహు యుగళి,
వాడిన సరోరుహావిధి గ్రీవంబువాల్చి,
నిలచి యుంటి నాముస్మిం నేత్రు డగుచు
తావకీన దర్శనముకై ద్వార మందు.

మత్త మాతంగ గమనోప మానగమన
వగుచు, సమ్రమ్ముగా, దేవి! వచ్చినిలచి,
అంబరోన్ముఖ ముఖబింబ మంతదిప్పి
వీక్షణాశీస్సుల ర్పించి వెడలినావు!

యుష్మదీయ నిర్గమన దివ్యోత్సవమ్ము
దృష్టిపథమును దాటి నదృశ్యమొందు
వరకు, నిలచి యున్నాను నేనరయుచుంటి!
కడకు నీసవిమోగాశుప్రిపుల్ కార్చినాను!

(అమావాస్య)



# చంద్రమండలపు చోద్యములు

లో. శంకరనారాయణ, బి. ఏ. (ఆనర్సు)

( గతసంచిక తరువాయి )

### వాతావరణము

చంద్రలోకములో నేదియో యొక విధమగు వాతావరణము(Atmosphere) ఉన్నదని నిశ్చయముగ జెప్పవచ్చును. కాని ఇది మిక్కిలి పలచనై యున్నది. దీనికి చంద్రమండలపు ఆకర్షణ శక్తియొక్క స్వల్పదనమే కారణము. ప్రతిధూమమునకు (gas)ను ఒక చలనవేగముగలదు. ఈ ధూమాణువుల నదిమిపట్టి, వాని సంచలనము నిరోధించు ఆకర్షణశక్తి ప్రతిగ్రహమున కుండవలెను. లేదా యాధూమాణువులు ఆకాశమున కెగిరిపోయి మాయమగును, ఉదాహరణముగ దీనిని జూడుడు:— ఒక సెకండుకు ఏడుమైళ్లు చలన వేగముగల ధూమములను అణచియుంచు ఆకర్షణ శక్తి భూగోళమునకు గలదు. చంద్రుడు మాత్రము సెకండుకు ఒకటిన్నర మైళ్లచొప్పున బోవు ధూమములనే బట్టియుంచగలడు. కాని ఆక్సిజను, నైట్రిజను, జలధూమము, మ... వాని గమనవేగ మింతకుమించి యుం... యవి చంద్రమండలములో నిమిడి యు... లేదు.

వాతావరణ మింత పలచగ నుం... యనేక చిత్రములు జరుగుచున్నవి. ... వాని యొకడు చంద్రలోకమున కేగిన... గంభీర నిశ్శబ్ద ప్రపంచము గాంచును. ... డే మాత్రపు ధ్వనియును వినబడదు. ... కారణ. మచ్చట ధ్వనితరంగముల (... waves ) గొంపోవుటకు దగిన వాయువు... పోవుటయే!

ఇంకొక చోద్యమేమన, చంద్రలో... న పట్టపగలే సూర్యునితో బాటు ... మిక్కిలి ప్రకాశమానముగ గనబడును; ... యొక్క తుదిమొదలు గనరాని నల్లని,

తెరవలె నుండును. అందొక పెద్దజ్యోతివలె సూర్యుడు ప్రజ్వలించు చుండును. తారలు తళతళమెఱియు చిన్నదీపమువలె కానిపించును. భూగోళము కాంతివంతమగు గొప్పచంద్రునివలె గనుపించును.

మొదట చంద్రలోకమున $14\frac{1}{2}$ దినములోకే తీరున, విరామములేక సూర్యుడఖండ తేజముతో ప్రకాశించును. అప్పుడు ఎండవేడిమి 160 డిగ్రీలవఱకు హెచ్చును. తరువాత $14\frac{1}{2}$ దినముల రాత్రి ప్రవేశించును. అప్పుడు చలి మంచుకు మించియుండును. థెర్మామీటరులోని పాదరసము సున్నాకంటె క్రిందికి దిగిపోవును.

చంద్రలోకమున దివారాత్రముల పరిమాణ మతి శీఘ్రముగా, ఆకస్మికముగా జరుగును. రాత్రిచీకట్లు క్రమక్రమముగా తరలిపోయి, మెల్లగా, చల్లగా తెల్లవారి, పగలు ప్రవేశముగుటలేదు, రాత్రి కారుచీకట్లనుండి పగటి విశుద్ధవెలుగున క్షొక్క్షణకంతు. ఒక్కత్రుటిలో నీమార్పు జరిగిపోవును. నీడలు పాఁగిన ప్రదేశములు అగాధములగు నల్లని గుహలుగ గోచరించును. సూర్యునికిరణము లేయేచోట్ల తిన్నగా, సూటిగా వాలునో ఆయాస్థలములే వెలుతురుగలిగి, చూచుటకు వీలుగలుగును. వెలుతురును మొట్టమొదటతనలోని కీష్చుకొని, తదుపరి నలుదిశలవెదజల్లి, వివిధ తరగతుల కాంతులను, చీకట్లను గలుగజేయు వాతావరణ ముచ్చట లేకపోవుటయే యీవిచిత్ర పరిస్థితులకు కారణము.

ఈవాతావరణ దారిద్ర్యము మూలముననే చంద్రలో ఉపరితలమున జలముశూన్యము. $14\frac{1}{2}$ దినములు సూర్యుడ ఖండతేజముతో, ఎండగాయునప్పుడు, ఈప్రబల సూర్యాతపమును గ్రహించి, చల్లార్చుటకు వాతావరణముగాని, మేఘమాలగాని లేకపోవుటచే నీటి ఆవిరులు నిలుచుటకు తావులేక అనంతావకాశమున మాయమయి పోవును"

"ఇట్లనవరతము ఆవిరిరూపమున నీటిని గోలుపోవుచుండుటచే చంద్రమండలము నేటికి సంపూర్తిగా ఎండిపోయి యుండవలెను ?"

"అటుకాదు. చంద్రలోకమున ఉపరిస్థలమున (Surface) గడ్డకట్టిన మంచుతప్ప, వేరునీరు లేకపోవుట నిజమే. ఈమంచులో కొంతకొంతసేపు పూట కరిగి, మరిగి, ఆవిరియై విరిగిపోవుటకూడ సత్యమే, అయినను చంద్రమండల అంతర్భాగములలో నీటిపట్లు లుండవలెను, చంద్ర గ్రహముయొక్క భూపదార్థము, సిరానుపీల్చుకాగితమువలె సూక్ష్మాతి సూక్ష్మరంధ్రములు గలిగి యుండవచ్చును, అంతర్గత నీటి పట్టుల నుండి నీటిధూమ మీరంధ్రములద్వార సాగి బయటబడి, మంచుగ గడ్డకట్టి పోవును.

చంద్ర మండలపు భూస్థలము

చంద్ర మండలములోన మన కగుపడుచున్న భాగమంతయు మరుభూమియే! ఎన్నియో యుగముల క్రిందట ప్రజ్వలించిన అగ్నిపర్వతముల నుండి ప్రవహించిన శిలాద్రావక మీ ప్రదేశమునంతటిని కప్పివైచినది. భూభాగమంతయు అతి విస్తారమగు కఠినశిలా ప్రదేశమే !

పౌర్ణమినాడు, సూక్ష్మదర్శినితో జూచి నచో మూడు ప్రదేశములనుండి తళతళ కాంతు లు బయలుదేరి నలుదెస లలము కొనుచుండు ను. ఈమూడు పరిదేశములు అగ్ని పర్వతముఖ ములు (Craters వీనిని కోపర్నికస్, టికొ కో, కెప్లర్ యందురు. ఇవి కొన్నివేల మైళ్ల పొడుగు గలిగి యున్నవి. ఈసముజ్వల కాంతు లందుండి బయలుదేరుట కవి హిమ మయము లా?, ఈపరిశ్న చంద్రగ్రిహపరి శోధకు లందరిని కలతబెట్టుచున్నది. ఇదమిత్థమని ఇంక నేమియు తేలలేదు. ఈయగ్ని పర్వత ముఖములు మంచు తోగాక సన్నని శిలాద్రావక చూర్ణముతో గప్ప బడియున్నవని పికెరింగు గారి సిద్ధాంతము. కాని యిది యింకను నిర్ధారణ కాలేదు.

### చెట్లు చేమలు

“ చంద్రి లోకములో ఆకులలములు, చెట్లుచేమలు, గలవా? ”

“అచ్చట వృక్షజీవనము కలదనియే పలువురు శాస్త్రజ్ఞుల యభిప్రాయము. సుమారు నూరు సంవత్సరములకు పూర్వము మీడ్లరుఅను జెర్మను శాస్త్రజ్ఞుడు, చంద్రమం డలములో ఏటేట భిన్న స్వరూపములు గలకొ న్ని పరిదేశముల గనిపెట్టి, చంద్రలోకమున వృ క్షజీవనము గలదేమోయని తనసంశయము వెలి బుచ్చెను. అటు తరువాత జరిగిన పరిశోధన వలన ఈఅనుమానము నానాటికి బలపడి, నేడు ప్రొఫెసరు పికెరింగు గారు నిశ్చయముగ చం ద్రగ్రిహములోచెట్టుచేమ గలదని బలపరచు చున్నారు.

మొట్టమొదట ౧౮౯౧ వసంవత్సరమున ప్రొఫెసరు పికెరింగుగారు, చంద్ర మండలము లోని హాస్టీను సొరంగమున నొక నల్లని మచ్చ ను గనిపెట్టిరి. మరుసటి దినము రాత్రి మరల జూచునప్పుడీ మచ్చయాకృతిలో, కొంత మార్పు గుపడెను. దీనిరహస్య మేమియో కనుగొన వారికి కుతూహలము, క్రిమముగా పట్టుదల హెచ్చుయ్యెను.

౧౯౦౦ సం॥ న హేల్ యను సొరంగ మున నానాటికి మార్పులు గలుగుచుండు ప్ర దేశమును గాంచెను. ఇంతకు మించిన ప్రదేశ ములను, విస్పష్టముగు, దినదినాను గతస్వరూప బేధములను పికెరింగు ఇరాటొస్థెనీసు సొరంగ ములో గనిపెట్టెను. ఈసొరంగము 32 మైళ్ల అడ్డు కొలవగలిగియున్నది. ఒకచదును ... లుపరిదేశమును, వానిమధ్య నొక ఉన్నత పర్వ త శిఖరమును, ఇందిమిడి యున్నవి. లోపలిభాగ ముననే మరి కొన్ని చిన్న చిన్న శిఖరములున్న వు. భూగర్భమున నిమిడియున్న నీటిపొగలనుం డి చెమ్మ, నీటిధూమము, సూక్ష్మరంధ్రముల చీలలు, పగుళ్లగుండా పైకివచ్చి, భూతలమున ప్రాకును. దానితో చెట్టుచేను పుట్టును. కొన్ని చెట్లపొదలు పెక్కులుగా నిలము కొన్నప్పుడు మన కాప్రదేశములు నల్లని మచ్చలువలె గన్పిం చును. అవిముప్పిరిగొంచి, వాలిపోయినపుడు మరల ఆ పరిదేశములు యథాప్రకారము మామూలు మివలె యగుపడును. ఈమార్పులు అవిచ్ఛిన్నక్ర మబద్ధముగా ప్రతి చంద్రపక్షములోను జరుగు చుండును.

చంద్రలోకములోని చెట్టుచేమలు అవి బూడిదవన్నెయై పచ్చనివి యుండవు.

లేక యించుక నలుపుగనో యుండును. గ్రీష్మా ర్థి సొరంగమట్టము మాత్రమే కాసంత యాకు పచ్చగ గన్పించును. ఇక చంద్రలోకమున వేరొకచోట ఎక్కడను ఈరంగు కానరాదు.

ఇంతేకాక చంద్రమండలమున కొన్ని చాలులు ( Canals ) కనబడును. అంగారగ్రహము ( Mars ) లో నీచాలులు గాంచి యవి వృక్ష జీవన సూచకములని పండితులు సిద్ధాంతీకరించిరి. ఆ యాధారము మీదనే, చంద్రమండలములోని చాలులను గూడ వృక్ష జీవనసూచకము లని నిర్ధారణ చేయవచ్చును.,,

,,ఈనల్లని ప్రదేశములు, పర్వత శిఖరము లనీడలని ఏలతలంచరాదు?,,

"అట్లుతలంచుటకు వీలులేదు. మిట్ట మధ్యాహ్నమున, చంద్రలోకమున సూర్యుడు తలపై నిలిచి, సూటిగా, తిన్నగా, తనకిరణములను వెదజల్లు నపుడు, ఎచ్చటను కాసంత నీడలు కూడ లేనప్పుడీప్రదేశములు దృగ్గోచరమగును. అదియునుంగాక చంద్రలోక ప్రాతఃసమయమున గాని సాయంకాలమునగాని, సూర్యకిరణములు ఏటవాలుగా బడి నీడలులెక్కకు మిక్కిలియై యున్నతఱి ఈనల్లని ప్రదేశములు సూర్యకిరణములు సోకి, విస్పష్టముగా గానబడును. అందుచే సంశయమునకు దావులేదు,,

జంతు జీవము

"చంద్రగ్రహములో జంతుజీవము గలదా?"

"ఏదియో నొక విధమగు జీవరాశి గల దనియే ప్రొఫెసరు పిక్కెరింగు గారి యనుమానము. ఇరటోస్థినీసు సొరంగములో నల్లని, నడయాడు, నిజమైన మచ్చలు ప్రొఫెసరు పికెరింగుగారు కనిపెట్టిరి. సాధారణముగా చెట్టు పుట్టలచే నిండిన ప్రదేశము పదినుండి ౫౦ చదరపుమైళ్ల వైశాల్యము గలిగి ఒకచోట స్థిరముగ నుండును. కాని యివి యాస్థలములకంటె చాల చిన్నవిగను చల్లగను, కదలుచునుండును. వీనిలో నన్నిటికంటె పెద్దది ౧౦ మైళ్ల పొడుగును ౫ వందల యడుగుల వెడల్పును మాత్రమే గలిగి యున్నది. అందుచే వీనిని చెట్టు చేమ యని చెప్పుటకు వీలులేదు."

"అయితే యివి యేమయియుండును?"

" మీరాలోచించి చెప్పుడు. కనుచూపు మేరదూరములో నున్న పర్వతముమీద నల్లని పదార్థములు కదలి పోవుచున్నవానిని మీరేమని దలంతురు?"

" మేఘములు "

" అవును. అవి కాకపోయినచో? "

" జంతువుల సమూహము "

"ఈ సూత్రము ననుసరించియే, చంద్రమండలమున మేఘములులేవు గాన, యీనల్లని నడయాడు ప్రదేశములను జంతు సమూహములని యూహింప వలసియున్నవి. వీని సంచలనముల పటములను ప్రొఫెసరు పికెరింగు తయారుచేసియున్నారు. వీనిలో నొకటి ఉత్తర దిశాభిముఖమై 3 మైళ్లు చని యింకొక మచ్చతో

# చిన్నకథపై

'నరసింహం'



ముని మాణిక్యం నరసింహారావుగారి కాంతంకథలను సుజాత, సంపుటము-౨ సంచిక-౨లో విమర్శించుచు విమర్శకులు తెలుగువారలకు పూర్వమునుండి కథలు చెప్పకొనుశక్తి యున్నను, వ్రాయునట్టి అలవాటు మాత్రము లేకుండెనని సెలవిచ్చిరి. అవును. అదినిజము. ఇటీవలనే తెలుగువారు కథలను వ్రాయ నేర్చుకొనుచున్నారు. పలు పత్రికలందు వారు తమ కథలను ప్రచురించు చుండినను వానిలో నతిస్వల్పసంఖ్యకే మెప్పుదల లభించుచున్నది. దీనికి ముఖ్యకారణము అనుభవము లేనివారందఱును ఈకఠిన కార్యమును తలపెట్టుటయే. నియమము తెలియక వ్రాయబడిన కథల వలన వానిని వ్రాయువారికి మాత్రమే నష్టము కలుగుటలేదు. పాఠకుల అభిరుచికూడ సంకర మగుచున్నది. చిన్నకథను వ్రాయునప్పుడు పాటింపదగిన ముఖ్యములైన నియమముల కొన్నిటి నీక్రింద చర్చింపనైనది.

నవలయందెన్ని చిత్రవిచిత్రములగు వస్తువు (Plot) లగుపడుచుండునో చిన్నకథయందుకూడ నగుపడును. కాని చిన్నకథ చిన్న నవలమాత్రముకాదు. చిన్నకథ ఇంతపెద్దదిగా నుండవలెనని ఖండితముగ నెక్కడను వ్రాయబడకున్నను, మితిలేకుండ మించిపోవుట ఉచితము కాదు. సహజముగ నుత్తమకథ ఒకటి రెండు ప్రకరణములలో పూర్తియగును. చిన్న కథలయందలి పాత్రలు నవలయందలి పాత్రలవలెనే జీవకళను చిమ్ముచుండవలెను. నవల చాల పెద్దదిగానుండును, కనుక పాత్రలకు గుణవిశేషములను సంపూర్ణముగ చేయుటకు మంచి యవకాశముండును. కథయందటులకాదు. అతిస్వల్ప స్థలమందంతే ఉత్తమముగ పాత్రపోషణ జరుగుచుండును. అందువలన నవలకంటె చిన్నకథ వ్రాయుట కష్టతరమైనది.

నవలయందు వస్తువు (Plot) నకు ప్రాముఖ్యతకలదు. చిన్నకథయందు పెద్ద... తో మొదలుపెట్టుట చాలపొరపాటు. దా... గందరగోళముతప్ప లాభ మేదియు కలుగదు. చిన్నకథయందలి పాత్రములు పాఠకుల ... తికలపై నిలచిపోవలెను. ఇదియే గొప్ప... చాతుర్యము. నవలాకర్త విశేషశ్రద్ధ... తన పాత్ర నలంకరించును. చిన్న... వ్రాయువానికి సౌకర్యములేదు. హెన్రీ... వ్రాసిన కథలను సామాన్యులుచదివి వస్తు... దందురు. కాని ఆతను చిత్రించిన... సజీవములై నిలచిపోయినవి. స్మృతిగహ...

న నవిమెప్పుడు తాండవమాడుచునే యుండును.

వర్ణనకంటె సంభాషణ ద్వారా పాత్రి పోషణ చేయుట కఠినమైన విషయము. సంభాషణద్వారా చదువరులకు పాత్రయందలి విశేషము వెల్లడిచేయుటయే ఉత్తమమైనవిధానము. పాఠకుడు స్వయముగ గ్రహించుకొనును. వర్ణన యందాతడు చేయున దేదియు నుండదు. అది ఉపన్యాసము వలెనే ఉండును. మనుష్యులు భిన్న ప్రకృతులు కలవారు, కనుక భిన్నభిన్న సంభాషణా విధానములున్నవి. వానిని వెల్లడిచేయుట గొప్పకళ. సంభాషణను కల్పించి పాఠకుని హృదయము వశముచేసికొనుట మంచి కథకుని విశేషము. నవలయందు రసహీనము లగు కొన్నివాక్యము లున్నను, చర్వితచర్వణములైన విషయములున్నను, చెల్లిపోవును. చిన్నకథయందవి గొప్పలోపములుగ గణింపబడును.

నవలాపఠనముచే పాఠకుడు తృప్తిజెందును. ఉత్తమ కథావలోకనము వలన నాతడుత్సాహవంతుడగును. నవలను చదివినవాడు సింహావలోకనము గావించును. ఆతడు కోరినవస్తువును సాధించిన వాడగును. పునఃస్మరణ తప్ప నాతని కింకేపని యుండదు. చిన్నకథను చదివినవాని భావములు కథతో కట్టివేయబడవు. అవి ముందుముందుకు దూకును. క్రొత్తభావములతో స్నేహముచేయ తత్తరపడును. కథకుడు సూచించిన భావములతో కథనుండి వెలుపలికి లంఘించి తాండవ మాడుచుండును. కాని ఇట్లగుటకు పాఠకుడుకూడ కల్పనాశక్తి కలవాడుగా నుండవలెను. లేనిచో వెలుపలివాని ముందుశంఖము నూదినట్లే. నవలాకర్తచేత మిగుల నుదారముగ పాఠకునికిచ్చి తగినంత బదులు కోరును. కథాకర్తచేత ఈ విషయమున చాలలోభి. పాఠకుని కాత డొసంగునది చాల తక్కువ. కాని తా నిచ్చినదానికంటె పదిరెట్లెక్కువ పనిని పాఠకునికొఱకు కల్పించి పెట్టును.

ప్రతిభావము తన సామీప్య భావములను స్ఫురింప జేయును, అందువలన కథకుడు అత్యుత్తమభావములనే చేకూర్చవలెను. ఈవిశేషము ప్రయత్నముతో సాధింపదగినది కాకపోయినను దానియునికి మంచికథకునియందు చాల అవసరము.

కవికి, నాటకకర్తకు, చిన్నకథల వారియు వానికి తమతమ కథలను వెల్లడిచేయుటకై సరియైన అవకాశము లభింప వలెను. ముఖ్యముగ చిన్నకథ కెక్కువసానుభూతిచూపునట్టి పాఠకు లుండవలెను. వానికి కొంతవరకు తెలివిగలపాఠకులే కావలెను. ఏలన ఉత్తమకథ యందు నూతనభావములను స్ఫురింపచేసి, కథకుడు, వానిని పాఠకులు స్వయముగ గ్రహింతురని వదిలిపెట్టును. కళకు కథాపర్యవసానముతో అక్కరలేదు. కథయందు చిత్రించిన విచిత్రపాత్రల చర్యలయొక్క నీతిని గుఱించి వితర్కించుటకూడ దానిపనికాదు.

కథ చాల చిన్నగ నుండును, కనుక పాఠకుడు, కథకుడు గావించిన సూచనలను తక్షణమే గ్రహించునట్టివాడుగా నుండవలెను, అతడు కొంతవర కుద్రేకము (Emotional)

గలవాడుగా కూడ నుండినచో కథకుని గొప్ప దనము త్వరగా నాతనికి బోధపడును. ఉత్తమము లని యనిపించు కొనినకథలు సహజముగ జన సామాన్యమునకు తెలియవు. అయిన నట్టికథ లను వ్రాయకూడదని యనుట శ్రేయస్కరము కాదు, వసుచరిత్రాకారుడు పుస్తకము వ్రాయు నప్పుడు పండిత సామాన్యమునకు బోధపడ వ్రాయలేదని ఆతనిని మనము నిందింపగల ఆతని పుస్తకమును కొందరైనా చదివి దింతురు. అంతే చాలును ఆతనియు పూర్తైనది.

# ప్రేమోత్కర్షము

కాటికలపూడి రామేశ్వర రావు

భువనమోహనమైన నీ మూర్తిఁ జూడఁ
గాంక్షనొందెడునాదగు కన్నుదోయి
మేఘములఁబోలు నల్లని మేనితోడ
కల్వలనుమించియొప్పారు కనులతోడ
రమ్యమణిభూషణముల తురాయి వెలుఁగ
కరమునందున వేణువు గ్రాలుచుండ
సొగసుఁగుల్కెడుదుస్తులు శోభఁగూర్ప
చిలుకగవ్రులేత పెదవిపైఁ జిందులాడ
సరసగతి నట్టె మందహాసంబుఁ జేసి
తేజమయమైన నీదగు దివ్యమూర్తిఁ
గాన్పు మొకమారు పాపిష్టి కన్నులకును
తనవిఁదీరఁగఁగాంచి సంతసముఁగందు
దర్శనమె కాదు భవదీయ దాస్యమొసఁగి
పాపములఁబాపి నీదగు ప్రాపుఁజూపు
జాలమేలర రమ్ము గోపాలబాల !

* * * *

విశ్వవిఖ్యాతమైన నీ వేణువార్త
ఱాలఁగరగించు చక్కని రాగములను
పణియనాదంబు వానిలోపలధ్వనింప
నెండుమోడులు చిగిరించి మేపుమీఱ
బచ్చికబయళ్ల మేయుచు పరుగులిడెడు
నాలమందలు నిల్చుచు నాలకింప
చేతనాచేతనంబులు చెలఁగి కరుగ
ప్రకృతియెల్లను వివశతఁ బరగుచుండ
సరసమాధురీ తేఁగన్న రసాయనముగఁ
బాడుమో కృష్ణ! వేడుకగోడుయేల!
ఎన్నినాళ్లాయె కన్నార నిన్నుఁజూచి
గడియనొక్కొక్క యుగముగఁ గడపుచుంటి
గోపికాలోల! నాదు సంతాప ముడిపి
ప్రణయ కథలనుఁ దెల్పు నాపజ్జఁజేరి
విమలమౌ నాదు మానస వీథియందు
నీదుకళ్యాణ రూపంబె నెగడుచుండు
హృదయపీఠాన నిన్నిడి యధికభక్తి
పూజలొనరింతు సద్భావ పుష్పములను
మనసునంతయు నీదుకో ధనకునిడితి
పాపములఁబాపి నీదగు ప్రాపుఁజూపు
జాలమేలర! రమ్ము! గోపాలబాల!!



# కర్మఫలితము

సోమంచి అన్నపూర్ణేశ్వరశాస్త్రి



ఇంకను బాగుగ వెలుగు రాలేదు. ఒక యరణ్య ప్రాంతమున నొక పొలమం దొకరైతు నేల దున్నుచుండెను. ఆరైతున కాకస్మికముగా నొక పులి తనమీద పడుచుండుట కానుపించెను. అతడు వణకుచు క్రిందబడెను.

ఇంతలో నొకమానవుడు వచ్చి యా రైతును లేవనెత్తెను. ఆపులి యా నూతన పురుషుని నై పూరక చూచుచుండెను. అదిగాంచి రైతు మిక్కిలి యాశ్చర్యపడెను. అతనికి పులిని మరల చూచినంతనే భయమయ్యెను. కాని యా నూత నాగంతుకుడు రైతునకు ధైర్యము చెప్పి, యీపులినై పునకు రెండడుగులువేయగా నది పారిపోయెను.

ఆమనుజుని చూచినంతనే యారైతున కాతని నెచటనో చూచినటుల యుండెను. కాని యెపుడో, యెచ్చటనో జ్ఞప్తికి వచ్చినదికాదు. అందుచేత నా రైతు నూతనపురుషుని గూర్చి తెలిసికొన బ్రయత్నించెను. అపుడా పురుషుడు రైతుతో “ అయ్యా ! నేనును మీరు నీప్రాంతారణ్యమున నొకసారి గలసికొనియుంటిమి, మీకు జ్ఞాపకములేదా?” అని పలికెను. రైతున కపుడాసంగతి స్ఫురణకు వచ్చెను. పురుషుడీదివడకే యాయరణ్యమం దుపకారము చేసియుండుటవల్ల నాతని నారైతు గారవింపనెంచెను గాని, ఆపులి భయమువలన గలిగిన వణకు తగ్గిపోవుటచే, లేచినిలువబడుటకైన నసమర్థుడయ్యెను. ఇట్లాతడశక్తుడగుటజూచి యాపురుషుడు రైతుయొక్కనాగలిని బుచ్చుకొని నేలదున్న బ్రారంభించెను.

అట్లు నాలుగుఘడియల పొద్దెక్కువఱకు నాతడు పొలముదున్నెను. రైతుమాత్రము కూరుచుండెను. తరువాత వారిద్దఱును గలసి రైతు నింటికిపోయిరి. రైతుభార్యయు నాతని సంగతిని విని, యాపురుషుని మిక్కిలి గారవించెను.

వారందఱును గంజి యన్నమునుదిని విశ్రమించిరి. ఒక ఘడియసేపటుల విశ్రమించిన తరువాత నారైతు నూతనాగంతుకునితో నెదియో మాట్లాడుచు, నాతని యుపకారమున

కాతనిబొగడుచు, ,,అయ్యా! తమరెందుకిటుల నావిషయమై యింతశ్రద్ధ తీసికొంటిరో దెలియనే నశక్తుడను. మీకు నామీద నుదయించిన యకారణప్రేమకు హేతువేమి? " అని యాతని నడిగెను.

పురు:— మీరు నన్నిటుల గౌరవించుటకు హేతువేమి?

రైతు:— అయ్యా! అట్లనుచుంటిరేమి? నాప్రాణదాతను నేనుపూజింపక కేవలమును కొలదిగ మర్యాద చేయుటలోని ఘనతయేమి?

పురు:— అయ్యా! మీరు పొరబడుచుంటిరి. నేను నావిధిని నెరవేర్చితిని. మీరీవిశ్వమందున్న జీవకోటిలో నొకరు. ఈప్రపంచమందున ప్రతిజీవియును తదితరజీవులను ప్రేమించుటయే పరమావధి. పరమధర్మము! అది లేకపోవుటవలననే లోకము దుఃఖమయమగుచున్నది.

రైతు:— అయ్యా! నాకొక విషయమాశ్చర్యము గలిగించినది. మిమ్ముల నా పులి జూచినంతనే శాంతి గలదయ్యెనే! దానికికారణమేమి?

పురు:— తండ్రీ! మానవుని విజిగీష మహత్తరమైనది! అతడు తనజీవితము చాల స్వల్పమైనదని తెలిసికొనినను, త్వరలోననే తానొక యంధకారమున బడుచున్నటుల దెలిసికొనినను, ఈ యనంతవిశ్వమున నొక పురుగుకంటె, నొక చీమకంటె, నొక చతుష్పాదముకంటె నెక్కువగా నుండజూచును. అందులకు భగీరథ ప్రయ

త్నమొనరించును. అతడు గూడ ... బాటు మరలనీ బూడిదయందు గలియు... వాడే! అయిననేమి! మానవుని కాశ మొ... మునర్వదా యీయనంతమగు కాలము... మైనంతవఱకు తనస్వాధీనమున ను... యీయనంతుని శక్తియందు సృష్టి... నేప్రాణికంటెను ఘనమగుశక్తిని దీసికొని... పులకంటెను మహత్తరముగ జీవింప... అదియేమానవునియాశ!— కాని యె... మునంతయును దనవలె జూచునో యా... విశ్వమంతటి చేతను ప్రేమింపబడును.

ఈపరమేశ్వరుని ప్రేమరాజ్యము... చేతనే జయింపనగును. అందువలన... నన్నేమియు చేయక శాంతిగలదైనది.

ఇట్లు చెప్పిన యాపురుషుని యా... గౌరవించెను. ఆపురుషునకు తనగృహ... నివాస మేర్పరచెను. ఆతడును ఆపురు... ప్రతిదినమును పొలమునకు కలసి పోవు... రైతుతోబాటాపురుషుడును ప్రతిది... ముక్కలి పాటుబడుచుండెను. ఇట్లు... షుని సహాయము న రైతునకు కష్ట... నొర్పు తగ్గిపోయెను. అతడెపుడు... సంతయు నుపయోగించి పని జేయు... లేదు. అతడు ప్రతిదానియందును ... జెందుచుండెను. కాని యాపు... మాత్రము రైతుకంటె ముందుగ పొల... బోవ సిద్ధపడుచుండుట గాంచి బాగుగ... నుకొని రైతును బొలమునకు బోవుచు...

ఇట్లు జరుగుచుండ, నొకనాడు... నిర్లక్ష్యముగ దున్నుచుండ నెద్దులు ...

నుండి పో జూచు చుండ, రైతు వానిని మరలించు యత్నమున నుండ, నొకపెట్టె పెల్లగిలెను. భూమియందు దొరకిన యా పెట్టె నా రైతు చూచియాశ్చర్యపడి యా పురుషునకు జూపెను. ఆ పురుషు డా పెట్టెను పగులగొట్టి దాని మూత దెఱచెను. దాని నిండ బంగారు కాసు లుండ జూచి, రైతు వానికై యాసపడెను. కాని యా పురుషుడు వానిని తీసికొన వద్దని యాతని నిషేధించెను. రైతు తీమాటకు చెవియొగ్గ లేదు. ఆతని స్నేహితు డగు నా పురుషుడు మాత్రి మా రైతు పాప పంకిలమున బడు చున్నటులఁ వగచెను.

* * * *

రైతునకు భాగ్య విశేషమున పెద్ద యిండ్లు వాకిండ్లు గలిగెను. ధాన్యపు రాసు లెక్కువ యయ్యెను. రైతు దీనిని జూచి మరింత సోమరియై, పనిచేయుట మాని చాల మంది పాలేరుల నియమించెను. ఇదివఱ కాతని కుండెడి యావియు నుపకారబుద్ధియు గూడ సౌభాగ్య మదమున మాయ మయ్యెను. ఆతడు తన యింటి ముందఱ యాకటిచే మాడుచున్న యాచకుల దక్షిణమివేయ జొచ్చెను. అట్టి భిక్షుకు లెంత దుస్థితియందుండి బాధ పడు చున్నను వారిని కరుణతో జూచుట లేదు.

కాని యారైతు హితుడును, ప్రాణ దాతయు నగు నాపురుషుడు మాత్రి మిదిచూచి యూరకొన జాలక, నొక దినమున రైతుతో "అయ్యా! ఏమానవుడైన నీవి వలననే సౌఖ్యమును బొందును. ఏ మతమందైనను పరోపకారమే ముఖ్య ధర్మము. అట్టి దానినే మీరు నిర్లక్ష్యముగ జూచు చున్నారు.

మానవు డెంత భక్తుడైనను, దైవభీతి గల వాడైనను లాభములేదు. ఆత డెప్పుడును తా నొకానొక దినమున నా ధర్మసాక్షి నెదుట నిలచి తాఁ జేసిన పనులకు వాఙ్మూల మీయ వలసి యుండునని నమ్మనో, యట్టి మానవుడే యా వాఙ్మూలమును తన వీధిగుమ్మము వద్దను, ప్రతి వీధి ప్రక్కను, కూడ నీయుటకు సిద్ధముగ నుండవలెను. మన కాలి క్రిందన లుగు చుండిన ప్రతి పురుగును, మనము పీల్చుచుండిన వాయువు నందుండిన సూక్ష్మ శరీరులును గూడ మనకు ధర్మ సాక్షులే. నిజమైన మతాభిలాషు లెప్పుడును పరోపకారమే పరమ ధర్మమని గ్రహింపవలెను" అని పలికెను.

అరైతు మాత్ర మీ మాటలను విని చాల నాశ్చర్య పడియు, ననాదర భావమున మిన్నకుండెను. ఆ పురుషుడు నాతని యనాదరభావముజూచి, చింతించి, మరల నాతనితో "తండ్రీ! నేనుచెప్పిన మాటలను మీరువినుట లేదని నా కవగాహమైనది. పోనిమ్ము! కాని యొక విషయము! నీ వెన్నటికిని సుఖ మనుభవింపజాలవు! ఎవ్వడు తన కష్టపు వలన చెమ్మట యూడ్చి సంపాదించికొనిన దానివలన నుదర పోషణ గావించుకొనునో, యట్టి మానవునకే సుఖ మలవడును. దురాశ యున్న మానవున కన్నియును గష్టములే. ఎపుడును జీవిత మందు పరాజయమే!

ఎపుడును గష్టజీవులే యీలోకమున కుపకారము జేయు వ్యక్తులు. ఎవ్వడు తానుజేయదలచిన పనిని తన శక్తినంతయు నుపయోగించి, ఫలము నాసింపక పనిజేయునో,

యెవ్వఁడు తాను శరీరకష్టమున సంపాదించిన యన్నమునే దిని తుష్టుఁడై జీవించు చుండునో, యెవ్వఁడు తోటిజీవులను ప్రేమించి వారి కుపకారము జేయ దలచుచుండునో, యాతడే పరమేశ్వరుని భక్తుఁడు! అతడే ప్రపంచమున కుపకారి! ఎంతభిక్షుకుడైనను, యెంత కష్టజీవియైనను, యెంతటి యధమజాతియం దుద్భవించినను నాతడే సకలజీవులకును సౌఖ్యరహస్యమును బోధించు వ్యక్తి! అందుచేత నెవఁడు కష్టములకు వెఱువక యెల్లపుడును తన విధిని నెరవేర్చుకొనుచు, సకలజీవులను దనవలె జూచుచు, బీదసాదల కుపకృతి జేయుచుండునో, యాతడే ధన్యుఁడు! తండ్రీ! మీరీ సంగతిమాత్రము జ్ఞప్తియం దుంచుకొనుఁడు. " అనిపలికెను.

కాని మరల నా రైతునవ్వి యూరకొనెను.

ఆమరుసటి దినమున నాపురుషు డా రైతునింట గానరాలేదు. రైతు మాత్రమమాతని పోగొట్టుకొనుటకై ఏగచి, యెల్లచోటుల వెదకించెను. కాని ఆపురుషుఁడు—ఆహితుఁడు—ఆమిత్రుఁడు-ఆరైతున కదృష్టదేవత యెచటను గానుపింపలేదు.

రైతు చాల విచారించెను గాని, చేయునది లేక యూరకొనెను. ఆతని మనస్సంతయు పాడై పోయినది. అత డెల్లప్పుడు నేదియో శంకించుచు, భయముతో మెలగుచుండెను. ఆహితుఁడుచెప్పిన మాట లాతని చెవులం దెపుడును, ప్రతిధ్వనించు చుండెను గాని వాని కొఱ కాతఁడు లెక్క సేయలేదు.

* * * *

తరువాత చాల దినములు గడిచె[illegible] రైతు ప్రకృతి మాత్రము మారలేదు.

ఆసంవత్సరము పైరులు బాగుగా [illegible]డెను. పంటలు బాగుగా పండెను. [illegible] కోసి కుప్పలు పేర్చినారు. రైతు తన [illegible] మనుకొని చాల సంతసించినాఁడు!

కాని యీలోపున నా చుట్టు[illegible] దొంగలు ప్రబలినారు. అది విని, రైతు యింటనున్న సొత్తు పోవునేమో భయ[illegible] నౌకరిద్దఱను మాత్రము పొలమునునుంచి [illegible] పాలేరుల నందరను తన యింటనే కావలి[illegible] చుండెను.

ఇట్లుండ నాప్రాంతమున పులి[illegible] యల్లరి విశేషముగ నుండుటవలన నా[illegible] భయపడి పొలమునందు పసుల రక్షించు[illegible] పాలేరుల నందఱను పొలమున బరుండ[illegible] రైతుయొక్క చదమును గర్వమును [illegible] శూన్యతను జూచి యాతనికి శత్రువులు [illegible] సందున నాతఁడు చాల భయపడు చుండెను.

ఒకనాటిరాత్రి పాలేరులందఱును ని[illegible] చుచుండగా, వారికి పసులలో గలిగిన గ[illegible] ఘోషమువలన మెలకువ వచ్చెను. [illegible] మేలుకొని చూచుసరికి, కొన్ని పశువులు [illegible] తెంచికొని పాఱి పోవుచుండెను. కొన్ని[illegible] పులి చంపివేసెను. వారికించుక దూర[illegible] నొక పశువును దినుచున్న పులిని గాంచి[illegible] పాలేరులందఱును బిక్క మొగములతో [illegible] నౌకరు జూచుకొనుచు తమ ప్రాణము[illegible] దాగిరి. ఇట్టి సమయముననే యా[illegible]

యొక పెద్దమంట కానవయ్యెను. పాలేరు లటకు కేకలిడుచు పర్వెత్తిరి. అచటి కోత కుప్పల న్నియు నంటుకొని మండుచుండెను. ఈ గడు బిడలో పులి భయపడి పాఱిపోవుట చూచిన తరువాత గాని యామంట నార్పుటకు పాలేరు లకు కాళ్లాడిపవిగావు. పులిపోయిన తరువాత వారందఱును పసులదొడ్డికి దగ్గఱనున్న నూతి నొద్దకుపోయి నీరుతోడి మంటల చల్లగ నార్పుట కారంభించిరి. గాని విఫల మనోరథులైరి. కుప్పలన్నియు చాలవఱకు మండిపోయెను.

అంతట పాలేఱును రైతు కోపపడు నేమో యను భయమున సందేహించుచు, మెల్లగ తెల్లవారు నప్పటికి రైతునింటికి పోయిరి. అచటికి వారు పోయిచూడగా రైతుచావడిలో నొక స్తంభమునకు కట్టబడి యుండెను. ఆతని భార్యకుకూడ నట్టి యవస్థయే కలిగెను. పాలే రులట్లు దొంగల దురంతమునుజూచి, విచారించి తమ యజమానుని కట్టువిప్పి, దెబ్బలకునూనె రాచి, యాతఁడు కొలఁదిగ సేద దేరిన తరువాత వానితో పొలమున రాత్రిజరిగిన సంగతి యంత యును జెప్పిరి.

అప్పు డారైతు పశ్చాత్తప్తుడై, విచార ముతో, దీనుడై, మోకరించి ,, ఓ పరమే శ్వరా! బుద్ధి వచ్చినది! " యని దుఃఖించి మరల మిక్కిలి విచారముతో ,, ఓ పరమపురుషా! నీవుచెప్పిన మాటలను పెడచెవిని బెట్టితిని. నీకు నాపై నిదివఱకును గలిగిన యకారణ కరుణ యెటకు పోయినది? ఇప్పుడునన్ను విపత్తునందు ముంప వెడలిపోతివా? దేవా !" అని విలపింప నారంభించెను.



# గోలుమాలు లో దానిని గోలుపోటమె

నాదూరు బుచ్చి బంగారయ్య

మిసమిసల పసజూపు యీ పసిమి బిడ్డ
చిక్కనం బాలు గారెడి చిన్నికూన
నవన వోన్మేషరుచుల వి నాట్యమాడ
ముద్దు గారెడి పసిపాప ముద్దుబాల
యిన్నినాళ్లును యెందుంటి వన్న నీవు
యెంత హాయిగ నుంటివో యేపుమీర
యెన్ని నిధు లున్నవట నోయి కన్నతండ్రి
తప్పి జారుచు వే తోవ్రివఁదప్పి యిటకు
భాగ్యహీనత రసహీన పాల్పడగ
మర్త్యలోకంబు జేరితా మమతెగ్రిమ్మ

అయ్యయో క్యారుమనుచుంటివా, అదేమి?
నిర్మలానంద జ్యోతి తా నిన్ను విడెనె?
ప్రేమదభుక్కొత్తు బంధువు వీడినాడె?
సొంపునింపారు నిధులెల్ల మరిగెనొక్కొ?
అయిన నిదియేల పిడికిలి యట్టెబడితి

వేమి తెచ్చితి విట కోయి యూశునుంచి?
వస్తువుల కెల్ల మూలమా వస్తులేమొ?
ఆదు లన్నిటికి నానాదియైన దేమొ?
పదిల మది సుమ్ము మెటనై ... బారైతు
దాచియభివృద్ధి నందించు దానిమిగుల

కటకటా తాత నైనావె యిటుల నుంటి
వయ్యయో దీరిపోయెనా యాయు వెల్ల
తాత యొక ప్రశ్న కిటు సదుత్తరము నిమ్మ
యెటుల గడిపితి నీ వయఃపటిమ నెల్ల
తిరిగి చెడితివి గాబోలు దిమ్మరిగను
నేర్చికొంటివి కాబోలు నీచ వృత్తి
అభ్యసించితి గాబోలు నార్త బాధ
తెచ్చికొంటివి గాబోలు దిట్టతనము
చేసినాడవు కాబోలు చెడ్డ మైత్రి

అయిన చూపుమ నీ తెచ్చినట్టి ధనము
పెంపుజేస్తివ యేమైన తెంపుజేసి
వృద్ధి గాకున్న మానె యా కొద్దిమైన
వెంట గొంచును నేగు దా జంటగూడి?

యేల మోమటు వంచితి వేల జెపుమ
కంట దడివెట్టు దది యేమికారణంబు?
ప్రశ్నకును మారువచనంబు బల్కవేమి?
అయ్యొ పాపము అవసాన మాక్రమించె
సాయపడుటకు శరణంబు జారిపోయె

లేసదు నిక్షేపముం గొనుచుం దరల లేదు
చేతు లవి విప్పి చూపుచు చెల్లిపోయె

భూమి పతనంబు వరకు దా బ్రాగ్ణ గతిని
సచ్చి దానంద మూర్తితో సఖ్యముండి
కర్మ గతి కింక వేరు మార్గంబు లేక
పుడమి పై బుట్ట కన్యథా చెడకు గనుక
యెట్ట కేలకు పుట్టగా దిట్ట దేరి
స్వామి సేవను తప్ప కే జన్మమందు
పూర్తి జేసుకొ సంపూర్ణ ముక్తిఁజెంద
కాల చక్రంపు కడగండ్ల గాంచకుండ
తెచ్చుకొనెదాను సద్భక్తి మచ్చు మాట
చప్పననుఁ జేరె నీ యింద్రజాల మందు
యెన్ని జూచుచు కొట్లన్ని యెక్కి దిగుచు
మధ్యఁ గన్పడు వింతల నమగ్న డయ్యె
అట్టె కనుకట్టునందున గట్టుపడియె
మతి చెడంగను బాజారు మధ్యమందు
తెచ్చి కొన్నట్టు మచ్చుకై విచ్చి జూచె
రామరామ యా దెచ్చటో రాలిపోయె
గోలుమాలు లో దానినిఁ గోలుపోయె





# కృష్ణార్జున చరిత్రము

వజ్ఝుల వేంకటేశ్వర కవి



## గ్రంథకర్త

సారస్వత ప్రపంచము నలంకరించిన ద్వ్యర్థి కావ్యములలో మంత్రిప్రెగడ సూర్యప్రకాశ కవి రచితమగు కృష్ణార్జున చరిత్ర మొకటి. ఇది రాధానాథున కంకితము చేయఁబడిన రెండాశ్వాసముల ప్రబంధము. ఏతత్కావ్య కర్తయే సీతారామ చరిత్రము' భీమలింగ శతకము లను రెండితర గ్రంథములఁ గూడ రచించెను.

సీ॥ మంత్రిప్రెగడ వంశ మహితాబ్ధి శశి వేంక
యామాత్యునకును జోగాంబికకును
బౌత్రుండ; వినుతి చారిత్రుఁడౌ శరభ రా
జునకు సీతాంబకు సుతుఁడ, మరియు
విస్సప్రెగడ వంశ విమలాబ్జ భాగుఁడౌ
జోగిరాజునకును సుగుణరత్న
గరితయౌ చెల్లాంబికకును దౌహిత్రుండ
హరితస గోత్రుండ నార్యహితుఁడ
ధరణి సూర్య ప్రకా శాభిధానమూని
యలరు నేను గృతీశ్వరుండై తనర్చు
రాధికానాథు పాద నీరజయుగళము
మనములోఁ జేర్చి భక్తి వందనము లిడుచు॥

ఈపద్యమును బట్టి యీకవి వేంకయామాత్య,జోగాంబికా పౌత్రుఁ డనియు, శరభరాజామాత్య సీతాంబికా పుత్రుఁ డనియు, విస్సప్రెగడ జోగిరాజు, చెల్లాంబికా దౌహిత్రుఁ డనియు,హరితస గోత్రుఁ డనియు, గద్యము వలన నాపస్తంబ సూత్రుఁడనియు, దెలియు చున్నది. అమాత్య బిరుదము, గృహనామము. ఇతఁడారువేల నియోగి యని చెప్పక చెప్పుచున్నవి.

శా॥ సీతారామ పదారవింద యుగళీ
సేవాపరుం డాత్మవి
ద్యా తస్వీ వశవర్తి మానసుఁడు కం
దర్పాన్వ యాం భోజ ఖ
ద్యోతుం డాశ్రిత శిష్య వత్సలుఁడు స
ద్భావాసుఁడౌ మద్గురుల్
సీతారామ సుధీమణిం దలతు స
త్కీర్ణ ప్రభా వాన్వితుల్ ॥

చ॥ దివిజ గురు ప్రసిద్ధ మతి దేవులప
ల్లికులాబ్ధి చంద్రు మా
ననపతి వర్గ పూజ్యు సుజ
న ప్రియ పూత చరిత్రు నిందిరా
ధవ పదపద్మ భక్తియుతు
దానవవైరి పురీ నివాసు స
త్కవి జన వంద్యు మద్గురుసెఁ
దమ్మయసూరివరుల్ భజించెదన్ ॥

శా. ఆచా రాన్విత వాడపల్లి కుల
పారావార తారాధిపుర్
మోచాంచ త్ఫల మాధురీ విలసి తా
మోఘార్థయు క్సాహితీ
నాచా నిగ్గిత నిర్జరాధిప గురుర్
నై ఖానసుం పద్మనా
భా చార్యం బ్రిణుతింతు మాధవ పదా
యత్తాత్ము నస్మద్గురుర్ .

పై మూఁడు పద్యములఁ బట్టి సూర్యప్రకాశ కవికిఁ గందర్ప సీతారామాఖ్యుఁడు, దేవుల పల్లి తమ్మయ్య, వాడపల్లి పద్మనాభుఁడు నాఁబడు మువ్వురు గురువులు కలరని స్పష్ట మగుచున్నది. ఈయన మాఁడుగొల్లు సంస్థానమునఁ గృష్ణ భూపతి గారి యాస్థాన కవి. కాని యీతఁడు తన గ్రంథములలోఁ నొకటియుఁ గృష్ణ భూపతి కంకితము చేయలేదు.

సీ. మహితాత్మ విను మున్ను మామక సూక్తి సీ
తారామ చరితంబుఁ దగనొనర్చి
భీమ లింగేశ్వర స్వామికి నంకితం
బొనరించినట్టి ధన్యుండ వీవు
కావున నింకొక్క కావ్యంబు రచియింప
వలయు రెండర్థముల్ గలుగు దాని
నా కావ్యమునకుఁ గృష్ణార్జున చారిత్ర
మనెడు నామంబు సేయంగ వలయు
మరియు రాధాది నాథ సమాఖ్య దైవ
దైవ చూడామణికి నంకితంబు సేయ
వలయు నీ పద్ధతులు చెప్పఁ దలఁచి యిపుడు
పేర్మి నిన్నిట కేఁ బిలిపించినాఁడ.

అనుపద్యమునుంబట్టి కృష్ణభూపతి ప్రోత్సాహమున రచించిన సీతారామ చరిత్రము ... భీమలింగేశ్వర స్వామికి గృతియిచ్చి నట్లున్న ఇప్పటి కావ్యమగు కృష్ణార్జునచరిత్రముఁ గూడ నతని ప్రోత్సాహముననే రాధానాథునకుఁ గృతి యిచ్చు చున్నట్లు తెలియు చున్నది. ఈతఁడు కృష్ణభూపతి యాస్థాన కవి యగుట చేతను, ...వ్యాంతమున రచించిన,

సీ॥ వసుధ లోపల శాలివాహన శకమున
శర కరి గిరి చంద్ర సంఖ్య నమరు
దుందుభి వత్సర మందు ఫాల్గునమున
శ్రీకృష్ణ భూపాల శేఖ రోక్తి
సరవిఁ గృష్ణార్జున చరితమ్ముఁ ద్వ్యర్థి ప్ర
బంధమే నొనరించి......

అనుపద్యము బట్టియు నేతత్కవి, పదు మ్మిదవ శతాబ్దము మధ్యకాలము నాటివాఁడు అనగా 70, 80 వత్సరముల క్రిందటి వాఁడని తెలియుచున్నది.

కథాభాగము

ఏత త్కావ్య కథ కృష్ణార్జునుల గురించినది. ఒక యర్థమునఁ గృష్ణుని కథయు, రెండవ యర్థమున నర్జునుని కథయు, నిందుఁ జమత్కారముగా వర్ణింపబడినవి. కృష్ణుని కథ యనఁగా నంది తిమ్మ కవిచే రచింపఁ బడిన పారిజాత పహరణము నందలి కథ. అర్జునుని కథ యనఁగాఁ జేమకూర వేంకట కవిచే రచింపఁ బడిన విజయ విలాసము నందలి కథ. ఈ రెండు కథలను జమత్కారముగాఁ గలుపుటలో సూర్యప్రకాశకవి చాలవరకుఁ దన నేర్పును జూపెను. ఏతత్కావ్య రచనమున, గ్రంథకర్త

తుర్యము, గ్రంథకర్త పడినకష్టము, చదువరులకు విశదము కాఁగలదు. కృష్ణార్జున కథల జోడిం చిన విధము తెలియుటకై యీక్రింద వేర్వేరుగా రెండుకథలను బొందుపరచు చున్నాఁడను.

## ప్రథమాశ్వాసము

### కృష్ణ చరిత్రము

కృష్ణుఁడు రుక్మిణీ సత్యాది భార్యలతో సుఖముగా ద్వారక నేలుచుండెను. (ప॥56-70.)

కృష్ణుఁడు రుక్మిణి కడ కేఁగి యామెతో భాషించు తరి నారదుఁ డేతెంచి, కృష్ణునితో బ్రసంగించి, పారిజాత సుమము నిచ్చుటయు దానిఁ గృష్ణుండు రుక్మిణి కొసఁగ నామె దాని ధరించి నారదుని వలనఁ దత్ప్రభావము నెఱింగెను. ( ప॥ 71-91. )

సత్యభామ, యాసంగతి నెఱిఁగి కుపితయై కోపాగారమున కరిగెను. కృష్ణుఁడు రుక్మిణి యనుజ్ఞఁబడసి, చనిచని కడకుఁ దత్సౌధముఁ గనెను. (ప॥ 92-110.)

కృష్ణుఁడు సత్యభామం బ్రార్థించెను. ఆమె యతని కిరీటముం గాలితోఁ దన్నెను. అతఁడు మరలఁ బ్రార్థించి, పుష్పముఁ దెచ్చి యిత్తు ననుటయు నామె యను గ్రహించెను. అట్లు కొన్నాళ్లు గడచెను. ( ప॥111-130. )

### అర్జున చరిత్రము.

ధర్మరాజు, ద్రౌపది తోడను, భీమ, విజయాదులగు తమ్ములతోడను సుఖముగా నింద్రప్రస్థ మేలు చుండెను.

గదుఁడు ధర్మరాజు కడ కేఁగి యతనితో భాషించు తరి నర్జునుఁడేతెంచి ప్రసంగించుటయు, గదుఁ డతనికి సుభద్రా హృదయము నిడ, నర్జునుఁడు సంతోషించుటయుఁ బిదప, గదుఁడు, నర్జున పరిణయము సుభద్రకెరింగించెను.

ఇంతలో గోవ్రఁ బాసిన బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి యది యర్జునునకుఁ దెల్ప, నర్జునుఁడు కుపితుఁడై, ధర్మజ కేళీసౌధ ప్రాంతమందలి తన ధనుర్బాణములు దీసికొని దొంగలఁ జంపి బ్రాహ్మణునకు గోవు నొసంగెను. పిదప, బ్రతిజ్ఞాభంగ మగుటను నతఁడు ధర్మజు ననుజ్ఞఁ దీర్థ యాత్రాపరుఁడై చనిచని కడకు గంగానదిని గనుంగొనెను.

అర్జునుఁడు గంగం బ్రార్థించెను. గంగ తన జలంబుల నతని శీర్షమున జల్లెను. అతఁడు మరల గంగం బ్రార్థించుటయు గంగ యనుగ్రహించెను. అట్లు కొన్నాళ్లుగ డచెను.

అంత నారదుఁడు వచ్చెను. నరకాసురుఁ జంపి, తన కడ దాచిన యదితి కుండలములఁ దెచ్చి యింద్రున కిత్తుననుు వార్త నింద్రున కెఱిఁగింపఁ గృష్ణుఁడు నారదునిఁ బంపెను. ( ప॥ 131-143. )

సాయంకాల వర్ణనము. (ప॥144-147.)

సత్య, కృష్ణునిఁ గని కేళీగృహము నకు దీసికొని పోయి యతనితోఁ గ్రీడించెను. వారు నిద్రించిరి. సూర్యోదయ మయ్యెను. ( ప॥ 148-184. )

అంత విశారదుఁడు వచ్చెను. సోమ సురుఁ జంపి కృష్ణుఁడు శాపాడిన వేదముల క్ర ము ననుసరించి, సూర్యునిఁ బ్రార్థించెద యర్జునుఁ డతనితో ననెను. (ఇది యనవసర

సాయంకాల వర్ణనము.

ఉలూచి యను నాగకన్య, యర్జు గని, పాతాళ లోకమున భోగవతీ పురమునం కేళీ గృహమునకుఁ దీసికొని పోయెను. వా క్రీడించి నిద్రించిరి. సూర్యోదయ మయ్యెను.

ద్వితీయాశ్వాసము

మరునాఁడు గరుత్మంతు నధిష్ఠించి, మేరుగిరికి భార్యతో నరిగి యామె కచ్చటి వింతలఁ జూపుచుండెను. ఇంతలో నమరావతిని వారు చేరిరి. నందన వన విహారముఁజేయు సత్యం గృష్ణుఁడు ప్రశంసించెను. ( ప॥ 1-18. )

ప॥ 19-33. నారదునిచేఁ గృష్ణుని రాక నెఱిఁగి, యిందుఁడు కృష్ణుని దర్శించి, వానిని బురిలోనికిఁ దోడ్కొని పోయెను. కృష్ణుఁ డదితి కడ కేఁగి, కుండల ములనిడి దీవనలఁ బడసెను. కృష్ణుఁడు సత్యతోఁ గ్రీడించెను. కొన్నాళ్లు గడచెను.

సత్యభామ, పారిజాతము నిమ్మని పట్టుపట్టి, భర్తను వేడుకొనెను. (ప॥ 34-48. )

కృష్ణుఁడు సత్యకుఁ బూలిచ్చి, యామెతో సరసుఁడై గ్రీడించెను. అతఁడు పారిజాతమునకుఁ బ్రియత్నించి, పక్షిరథమున నాకపురిఁ బ్రవేశించెను. [illegible] సూర్యోదయ మయ్యెను. యించెను. (ప॥ 49-62.)

మరునాఁడు విశారదునితో నర్జునుఁ డుంచు కొండ కరిగి తద్విశేషముల జూపెను. పిదప నతఁడు మలయ భూ పురంబుఁ జేరి యుద్యానమున విహరించు పుత్రిక యగు చిత్రాంగదం బ్రశంసించెను.

విశారదునిచే నర్జును రాక నెఱిఁగి, యధ్వజుఁ డర్జునుని దర్శించి, వానిఁ బురిలో దోడ్కొని పోయెను. అర్జునుఁడు చిత్రాంగద కడ కేఁగి యామెకు హృదయము నిడి, గ ముగాఁ బెండ్లాడెను. కొడుకుఁ బడసెను.

క్షేత్ర యాత్రాపరుఁడగు నర్జునుఁడు మొసలి పట్టుకొని, శాప విముక్తమై, లల శాప విముక్తికి వేడుకొనెను. అర్జునుఁ డట్లు

అర్జునుఁడు గోకరణ క్షేత్రము బూజించి ప్రభాస తీర్థమునఁ గుఱింకిడి, గల కృష్ణుని చెల్లెలగు సుభద్రకై యతి ప్రయత్నించి ద్వారకోద్యానముఁ బ్రవేశిం సూర్యుఁడుదయ మయ్యెను.

కృష్ణుఁడు పారిజాతముఁ బెకలించి, యిం ద్రునకుఁ దెలియకుండఁ బక్షినెక్కి వచ్చుచు మార్గమున నింద్రాదులతోఁ బోరి యింద్రు నోడించెను. ఇంద్రుఁడు పారిజాతము నర్పిం చుటయుఁ గృష్ణుఁడు నిజపురిఁ జేరెను. (ప॥63-81.)

కృష్ణుఁడు గోవర్ధన గిరిఁ బెకలించెను. కృష్ణు ననుమతి నర్జునుఁడు సుభద్రతో రథ మునైఁ బోవుచు మార్గమునఁ బృధుశ్రవసు నితో బోరి వాని నోడించెను. అతఁడు సుభద్ర నర్పించుటయు నిజపురిఁ జేరెను.

సత్యభామ తన యారామమునఁ బారి జాతమును నాటించెను. ఇంతలో నారదుఁ డరుదెంచెను. కృష్ణుఁడు సత్యయుఁ బుణ్యక వ్రతముఁ గావించిరి. నారదుఁడు కృష్ణునిఁ గీర్తించెను. సత్యభామాకృష్ణులు సుఖంబుం డి. కృష్ణుఁడు జితశైరి యను సొంపుఁ గానెను. ఈరీతి భార్యలతోఁ గృష్ణుఁడు సుఖంచెను. (ప॥ 82-121.)

అర్జునుఁడు సుభద్రతో సుఖంబుండెను. అంత బలరాముఁ డరుదెంచెను. సుభద్రా ర్జున వివాహోత్సవముఁ గావించిరి. ధర్మ జుఁడు కృష్ణునిఁ గీర్తించెను. సుభద్రార్జునులు సుఖంబుండిరి. అర్జునుఁ డభిమన్యుఁ డను కొమరునిఁ బడసెను. ఈరీతి భార్యతో నర్జు నుఁడు సుఖంచెను.

---

పై రెండు కథలం బట్టి యెంత చమ త్కారముగాఁ గవి రెండు కథల జోడింపఁ గలి గెనో చదువరులే యూహింపఁ గలరు.

కథారచనము

ఈ కృష్ణార్జున చరిత్రము నందలి యవతా రిక యందే కృష్ణభూపతి,

గీ॥ అవనిలోఁ బారిజాతాపహరణ మనెడు
కృతియు విజయవిలాసమన్ కృతియు మిగుల
భవ్యములు గోపసుత కథాపాది సరస
సత్కవీంద్ర వచో విశేషంబు లగుట.

క॥ అరయ నీ కృష్ణార్జున
చారిత్రము వినెడు సుకవి జనులకు మదిలో
నా రెండు కృతుల యర్థము
లారూఢిగఁ దోఁప వలయు నార్య స్తుత్యా॥

అని తనతో వక్కాణించి నట్లు కవి రచిం చినాఁడు. అతఁ డిట్లూరక రచించుట లేదు. ఈ చరిత్రమునఁ గృష్ణార్జున చరిత్రములు నిజ ముగాఁ బారిజాతాపహరణ విజయవిలాసముల ననుసరించియే యున్నవి. మొత్తము మీఁదఁ గథలో మార్పులెవ్వియు లేకపోయినను, ఆయా యంశముల రచియించుట యందక్కడక్కడ నించుక యనవసర ప్రసంగములు కన్పట్టు చున్నవి. సత్యభామా కృష్ణుల సంవాద సమ యమున, నర్జునుఁడు గంగానదిని సందర్శించుట యత్యధికముగా వర్ణింపఁ బడినది. మరియు, నర్జునుఁ డులూచీ చిత్రాంగదా సుభద్రల వర్ణించు నపుడెల్ల, కృష్ణుఁడు సత్యభామా వర్ణ నముఁ గావింపక తప్పినదికాదు. అర్జునుఁ డులూచీ చిత్రాంగదలతోఁ గ్రీడించు సందర్భ మునఁ గృష్ణుఁడు సత్యతోఁ గ్రీడించునట్లు వర్ణిం పక తప్పినదికాదు. కాని ద్వ్యర్థికావ్యమునఁ

గథానుగుణ్యముగా నట్టి వర్ణనములం గావింపక పప్పదు. ఇంతకుం దప్పక గథా సందర్భమున నెట్టి మార్పులను గల్గింపక చమత్కారముగాం గథాద్వయము జోడించి కావ్యము రచించుటచే సూర్యప్రకాశ కవి యెంతయుం బ్రశంసార్హుఁడు.

దోషములు

ఇది ద్వ్యర్థి కావ్య మగుటచే నింతె, సామాన్యముగా ననేక కవి కృతములగు వ్యాకరణ దుష్ట ప్రయోగములు కానవచ్చు చున్నవి. వాని నీక్రిందం బొందుపరచు చున్నాను:—

నాకు * గోప రహితత్వము.
శ్రీ పర * గంగ నతంను.
గీరతినే * తగను.
భావనురాగంబు తోడ * బతిమాలి.

పైనం జుక్కలు గల చోట్ల నొక యర్థమున నర్థానుస్వార మొండవలయును. రెండవయర్థమున ననవసరము. ఇట్టి యర్థానుస్వార లోపదోషము లింకను గలవు. మరియు,

ఫలదశంతనుండే నుమ్మీ ( ఫలదశ+ అంతనుండేనుమ్మీ ) ఏభంగినైన ( ఏభంగిని+ ఐన ) తన్వా రందఱు ( తనవారి+ అందరు ) గుబ్బలెదం జేర్చుచు ( గుబ్బలి+ఎదంజేర్చుచు )

పై చోట్ల సంధి దోషములు కలవు. మరియు నక్కడక్కడం గచటతపలు గసడదవలుగా నూరక మార్చం బడినవి.

ఘనమోదమున నె దమ్ముని తోడ
అయ్యవసరంబునందు గన్నీటి కాలువలు
సంతుష్టహృదయుండై దాన వాగ్రముక.

క్రిందగీతలు గల పై యక్షరము మార్చంబడినవి. మరియు,

సద్ద్వీప వాహనుండగుచు
సద్ద్వీపంబునొక్క చక్కి డిగ్గి
తద్ద్వారవతీ సమీపంబున

ఈ చోట్ల, క్రింద గీతలు గల యక్షరములలో ద్విత్వ దకార మొక యర్థమున న... బయ్యు, రెండవ యర్థమున నన... బైయున్నది. కావున నిది యొక దోషము. మరియు 'వాగీరతి' యనుటకు 'భా...' యని యుండుటచే వబ ల కభేదము క... బడినది. మరియు, "అచ్చెఱు (రు) నున్నవారు" అనుచో రేఫ అకార ... పాటింపం బడలేదు. మరియు "...కుండి మోదంబు రాజిలుచుండ" ... "దండముకు" అని ప్రయోగింపం బడి...

పై నుదాహరింపం బడిన ప్రయో...లన్నియు సాధారణముగాం గన్పట్టుచుండ... ద్వ్యర్థి ప్రబంధమునం గన్పట్టుట యా... కానేరదు. మరియు నయ్యవి, సామాన్య ... గములే యగుటచే, మహా దోషము... బరిగణింపం బడరాదు,

శైలి

సూర్యప్రకాశ కవి కవిత్వము ... మధురమై మనోహరమై యలరారు చుం... ద్వ్యర్థి కావ్య మగుటచే నీకవి తరచుగా ... క్షర పదములం బ్రయోగింపు చుండును ... వున రాఘవ పాండవీ యాదుల యందలి ... త్కృతి యిందుండ దని వక్కాణింప నంద... ననవసరము లేదు.

గీ॥ అనఘు పింగళి సూర కవ్యాది సుమతు
లవని రాఘవపాండవీ యాది కృతులఁ
జేసి రద్భుతముగ నట్లుచేయఁ గలనే
ద్వ్యర్థి కావ్యంబు నే నతి స్వల్పమతిని.

*  *  *  *

చ॥ గుణ నిధులార! నాకు నతి
గూఢ పదార్థ సమర్థ నాను స
ర్పిణి యగు బుద్ధి లేదరయఁ
బింగళి సూరన యట్లు, రామ భూ
షణకవి మాడ్కి, సాధుజన
సన్నుతుఁడై తగు పిండిప్రోలి ల
క్ష్మణ కవి రీతి నర్థ యుగ
సంగత కావ్య మొనర్ప నేర్తునే॥

అని కావ్యారంభమునఁ గవియే వక్కాణించినాఁడు. ఏతత్కావ్యమున సాయంకాలాది వర్ణనము లక్కడక్కడఁ గావింపఁ బడినవి. ఆపద్యములఁ బట్టి యీతని శైలి గ్రహింప వచ్చును. శైలి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించెదను,

చ॥ కుముదిని యంద మెల్లఁ జెడఁ
గొట్టె నితండని తన్నెఱింగినం
గుముద హితుండు రాజగుటఁ
గొట్టునొ తిట్టునొ యంచు భీతిఁ బ
శ్చిమగిరి చాటుఁ జేరె నర
సీజ హితుం; డిల నున్న వేకదా
కుమతులు రాజ భీతులయి
కొండలఁ గోనల డాగియుండుటల్(౧౪.)

చ॥ కమలము లుమ్మలింప నన
కైరవము ల్వికసింపఁ జక్రివా
కము లెదఁ దల్లడింపఁ బత
గధ్వజ నందనుఁ డుల్లసింప భూ
జములు సుఖింపఁ దస్కరులు
జంకు వహింప వియోగినీ సమూ
హము చలియింప వేలుపుల
యన్నపు గంప తగె న్నుతింపఁగ(౧౫)

చ॥ తరణికిఁ బద్మినీ సతికిఁ
దప్పక పెండ్లి యొనర్చు టొప్పఁ బు
ష్కరగతు లౌట నీరలకుఁ
గల్గును సామ్య మంటంచు నెంచి త
త్పరిణయ మాచరించుచుఁ
బ్రభాత పురోహితుఁ డుచ్చరించు భా
స్వరనిగమోక్త మంత్రముల
చందమునం దగె హంస నాదముల్(౨౪)

చ॥ కమలము నీదు నెమ్మొగము
గల్వలు నీ కనుదోయి చక్రినా
కములు భవ త్కుచ ద్వయము
కంబు గళం బలి పాళి మౌళి ని
క్కము దలఁపఁ సరస్వతివిగా
యిఁక సందియ మెందుకంచు వా
గ్రమణి నుతించు దామరస
గర్భుఁడు మాకుఁ జిరాయు వీవుత(౧౪)

పై పద్యము లీతని కవిత్వము నందలి ధారాళత్వము, భావగుంభనము, పదలాలిత్యము, మార్దవము, మాధుర్యము, వెల్లడించు చున్నవి. తెనుఁగల్గిన పాండిత్యము,కవితా నైపుణ్యము,వ్యర్థముఁ గానీక, భాషాదేవిని బోషించి సారస్వత సేవఁ గావించిన మహనీయుండగు మంత్రి ప్రెగడ సూర్యప్రకాశ కవికి నమస్కార సహస్రముల నర్పించుచు నింతటితో నా వ్యాసము ముగించు చున్నాఁడను.



# వటయోగి*

ఆవంత్స వెంకట రంగారావు, బి. ఏ.

చండ భాను మయూఖ పేక్షితను కొంత
పొలఁగ జేసిన దక్షిణా నిలము వీచి
హాయి నొన గూర్చు చండ వాహ్యాళి గోరి
సందె సమయాన ప్రేమంపు సఖులతోడ
బయలు దేరఁగ పర్వత ప్రాంత భూమి
సవిధ సంస్థిత శాద్వల స్థలములకును
గగన పథమంత జలధ రాక్రాంత మయ్యె;
స్తనిత నిర్ఘోషముల ధరాధరము లన్ని
మారు మ్రోయఁగ నొడలు కంపమ్ము నొందె
గాని, యిష్ట గాఢ సమాధి మేను మరచి,
గగన వీధికి నెత్తిన కర చయమ్ము
ఖగ కదంబక వాస యోగ్యమ్ము లైన
నిలయములు గాఁగ, సరుణమై యలకరాజి
జడలుగా గట్టి భూమిపై జారియాఁగ
తనువు వల్మీక వితతికిం తావుగాఁగ
సంత తాభ్యాస యోగ దీక్షాజుషుండు
వట తపోధనుండు పలాశ వసన ధారి
అవగతుం డయ్యె నాకు సంధ్యాంత మందు.

*మఱ్ఱిచెట్టు మీద చెప్పిన పద్యము.



ఆలర్ మర్గ్ దృశ్యము ౧ ( కాశ్మీరము )



ఆలర్ మర్గ్ దృశ్యము ౨ ( కాశ్మీరము )



# లక్ష్మి వుత్తరం

గుడిపాటి వేంకటచలం, బి. ఏ., ఎల్. టి.



యింక మీ మొహాన్ని యీ జన్మానికి చూడననుకుంటె, మీరు మన సల్లాపాలూ, ప్రేమా, అన్నీ మరచిపోతారనుకుంటే, కొద్దిరోజుల్లో మళ్లీ పెళ్లి చేసుకుని, నన్ను పిలిచిన ముద్దుపేర్లన్నిటితోనూ యింకెవర్నో పిలిచి, నా బుగ్గమీద వేళ్లేసినట్టే అట్లానే దాని బుగ్గ మీద వేసి లాలిస్తారనుకుంటే యెంతో బాధ కలుగుతుంది. వారం రోజులనించి ఆలోచించుకుని ఆలోచించుకుని, యీ బాధంతా రాత్రింబవళ్లు మనసులో అనుభవించి, చివరికి తప్పని సరిగా మీకు వ్రాస్తున్నాను.

నేను యీ రాత్రి చచ్చిపోవడానికి నిశ్చయించుకున్నాను. మీకోసం, నాకోసం, అందరి క్షేమంకోసం, ఆలోచించే నిశ్చయించుకున్నాను. నాకోసం అట్టే దుఃఖించకండి, యీ వుత్తరమంతా చదివినప్పుడు, నా చావు మీకు కొంత శాంతిని కూడా కలిగిస్తుందేమో! కాని జాలన్నా పడరూ? పడతారు. మీ హృదయం నాకు తెలుసు. నాకు తెలీకపోతే యింకెవరికి తెలుస్తుంది? నా ప్రేమని మాత్రం— నిశ్చలమైన నా ప్రేమని మాత్రం – సందేహించకండి. అది నేను సహించలేను. సందేహించలేదని మీ దగ్గిర్నించి వుత్తరం వొచ్చి, నన్ను ఆపుతారని భయం, మీ విధి అనుకుని ఆపుతారు కాని, జాలిపడి క్షమించానంటారు గాని, మీరు భరించలేరని నాకు తెలుసు. మీ హృదయం నాకు తెలీదూ.? తరవాత మనిద్దరి జీవితం దుర్భరమౌతుంది. నాకే మీ మీద అంత ప్రేమ లేకపోతే, మీకే నా మీద అంత కాంక్ష లేకపోతే, లోకంలో అందరిమల్లే వుంటే... యెట్లాగో కాపరం చేసేవాండ్లమే... యీ పని జరిగింతరవాత కూడా... కాని అంత గాఢమైన నిర్మలమైన ప్రేమలో కొంచెం అనృత దోషం, కొంచెం అపవిత్ర దోషం, అనుమాన దోషం, తగిలినా, అంతా విషంగా పరిణమిస్తుంది. వీల్లేదు. చావుతోనే పరిహారం చెయ్యాలి, యీ ఆక్రమాన్ని. విధి, మిమ్మల్నీ, నన్ను, మన ప్రేమనీ మింగి, నాశనం చేసి, క్రూరంగా నవ్వుతో హృదయం లేకండా, యిద్దర్నీ ఆరు సంవత్సరాలు, సుందరమైన సంవత్సరాలు, కలిపి మధుర బంధనాలతో కట్టి, యేకం చేసి, ఒకటి చేసి, ఒక్క నిమిషంలో చీల్చి, విడతీసి చెరోమూల, యీ అనంత ప్రపంచ వైశాల్యంలో యెక్కడో—యింక ఒకరికి ఒకరం అందకండా—యెంత యేడ్చినా, యెంత చేతులు జాచి వెతికినా, లాభం లేకండా—పారేస్తుం

ది ! ...లేపెక్కడ కళ్లు తెరుస్తానో ! ఒకవేళ నా ఆత్మ మీదగ్గిరికి రాగలిగితే, మీకు తెలియచేయగలిగితే, యీ వుత్తరం చదివేప్పుడు మీదగ్గిర వుండగలిగితే... మీ విచారం చూడగలనా, నేను దగ్గిరే వున్నానని తెలపగలనా? ...నాప్రేమని మీరు సందేహించవొద్దు. మీ దగ్గిరికి వొచ్చి, ఒక్కసారి, ఒక్కనిమషంవొచ్చి, నాప్రేమతో కన్నీళ్లతో పరిమాణాలతో, నాహృదయ మంతా మీదేనని, నా దేహం మలినమైనా, నాప్రేమ నిర్మలమని తెలియ చేయాలని యెంతో వుంది. ఒక్కసారి మళ్లీ మీ నవ్వే మొహన్ని చూడాలని, నా వేపు కొంటెగా, మోహంతో, చూసే, మీచూపు ననుభవించాలని, ప్రేమతో ఒక్కసారి పిలిపించుకోవాలని వుంది. యెట్లా ! .. నిజమండీ, ఒక్క నిమిషం కలలోనన్నా, మనసులోనన్నా, యింకెవరినీ నేను కోరలేదు. యెప్పుడూ, మొదట నన్ను మీరు చూడ్డానికి వొచ్చిన నాటినించీ కూడా నా ఆలోచనలు, కోర్కెలు అన్నీ మీమీదనే. మీరు నమ్మరూ ? చచ్చిపోతున్నాగా!...యిప్పుడు నిజంచెప్పడానికింకేం ? ఆవాళ సుబ్బారావు విషయమై, మీరు అనుమాన పడ్డారుకదూ ? నిర్మలమైన మీకళ్లలో ఆస్వల్ప మాలిన్యమే చెప్పింది నాకు. కాని మీరు వొప్పుకోలేదు. నిజమండీ, ఆసుబ్బారావు నాకేం లెఖ్ఖ ! అందమైన వాడని తెలుసు. అందమైనవాణ్ణని అతనికి తెలిసి, స్త్రీలందరూ తనని వలిచి వొళ్లో పడతారన్నట్టుచూస్తాడు. నావంకా అట్లానే చూశాడు. మరంత ఆప్యాయంగా అతని పరచయం నాకుచేస్తే, అట్లాంటి భావంతో అతను చూస్తే, నాకెంతో డోకొచ్చింది ! మీరు నమ్మరు కాదు. అతను, ఆ వెంకటచలం గారి కథ చదువుతో వుంటే, ఆకథలో ప్రేమ, నాప్రేమ వలెనే వుంటే జ్ఞాపకం లేదూ, మెడ కింద చెయ్యేసి ముఖం పైకెత్తడం_ మనమల్లేనే యింకా ..పోనీండీ ఇప్పుడెందుకు ? — అందుకని శ్రద్ధతో కళ్లీతని మీదనే పెట్టుకుని విని వుంటాను. కాని అనుబ్బారావు మీద మనసను కున్నారు నాకు ! యిప్పుడన్నా నమ్ముతారా ? ...... యెన్నో

అనుకున్నాను, మీకు ప్రమోషన్ కాగానే, మ... న్న డాబాయిల్లు అద్దెకి తీసుకోడం, ఆవీధి ... మన మంచమూ, అద్దమూ, పెట్టుకోడమూ, రాత్రి క్లబ్బునించి వొచ్చేప్పటికి, నేను... యెందుకు ... వన్నీ ! నాకోసం అట్టే యేడవకండి.

ఆరాత్రి మీరు, రెండు నెల్ల కిందట నన్ను ... పైటికి వెళ్లారు ఆరాత్రి జ్ఞాపకముందా ? అం... ప్రతివారమూ, మీరువొస్తారు వొస్తారని యెదురు... చూసి నిరాశ చెందిన్నాను. చివరికి ఆనా... ఆరోజు మధ్యాహ్నంవొచ్చి, అరాత్రే మెయిలుకి ... న్నారు.. మీ మొహం చూస్తోవుంటే సంతో... మిమ్మల్ని మళ్లీ నెలరోజులు వొదలాలనే దుఃఖం... మాయమై పోయింది. బాధతో లాక్కుపోతు... డెల దడ దడని అణచుకుని, మీకు నెదిమలోని... నే కనపరిచాను.

అలిసి వొచ్చిన మీరు రాత్రి మంచం మీద... గానే, నిద్రపోయినారు. యెన్ని సార్లో ... తలుచుకుని ఉవ్విళ్లూరిన మీసాన్ని ధ్యాన్ని ... కాపిలించుకుని మహా దానందంతో, మీ ... తలపెట్టుకుని కళ్లుమూసుకున్నాను. రాత్రంత ... ముఖాన్నీ, మీ పెద్దకనుబొమ్మలీన్నీ, పల్చని ... మీ గట్టి భుజాన్నీ, సన్ననిదీపపువెలుగులో చూస్తూ ... కున్నాను. అలారం గడియారం నిముషాల్ని ... టే చప్పుడు చేస్తోంది. దాన్ని విసిరిపగలకొట్టి ... కాని పాపం పొద్దున్నే మీ మొహం లో ... భయాన్ని చూడగలనా?... మీ భుజం మీద ... దాన్నికూడా ప్రేమించా నారాత్రి. అదికూడా ... న్ని ప్రేమించి వొచ్చినట్టే కనపడ్డది. అట్లానే ... భారంతో కళ్లుమూసుకుని, మీ భుజంమీదే ... నాను. నిద్రపోతున్నా, రెండైనట్టూ మీరు ... పోతున్నట్టే, నాకు కల వొచ్చి చప్పునలేచాను !

యీ చక్క_ని దేహం నా చేతులకింద పడుకునే వుంది. మెల్లిగా లేచి గడియారంలోకి చూస్తే వొంటి గంటయింది. యింకా ఒక గంట. మిమ్మల్ని గట్టిగా ముద్దు పెట్టుకుంటే, మీ రొమ్ము మీద నా తలని అదుముకుంటే, మీకు మెళుకువ వొచ్చి, అప్పుడే ప్రయాణానికి సిద్ధ మౌతా రని భయం కదలకుండా మీ గుండ్రని గడ్డం తోసి కొంచెం చంపల కేసి, నువ్వని గోళ్లలో కొనలు తేలే వేళ్లకేసి, చూస్తున్నాను. మళ్లీ కునుకుపట్టడమూ, అలారం కొడతున్న చప్పుడైనట్టే ఐ మెళకువ రావడమూ మిమ్మల్ని చిన్న చిన్న తేలికముద్దులు పెట్టు కోడను, గడియారం వంక చూడడంతోనూ గడిచింది, అసాంత కాలమూ. టంగ్ టంగ్ మన్నట్టు అనుకుని అనుకుని భయపడి గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఆశాభ భరించలేక మిమ్మల్ని లేపి పంపెయ్యాలనిపించింది.

నిద్ర కళ్లతో నన్ను కడసారి చూసి వెళ్లిపోయినారు. బండివెడుతోవుంటే నేనుకూడా మీతోవొస్తో వుంటే యెంతబావుండేది అనుకుని ఆశపడ్డాను. కిటికీలోంచి తొంగి చూశాను. దీపం వెలుతురులో మీ కాలు చివరమాత్రం కనపడ్డది. అదే ఆఖరుసారి మిమ్మల్ని చూడడం, మనజన్మాలకి. మీనుంచి విరహం భరించలేక, మీరు పడుకున్నచోటే, కొంచెం సిగరెట్టు వాసన వేసే ఆపక్క మీద, మీవంక తిరిగి మీరున్నట్టుగా భావించుకుంటూ పడుకున్నాను. మీరున్నట్టే ఆయింది, మీ చేతులు నాచుట్టూ వున్నట్టే, మిమ్మని అనుకున్నట్టే అనుకున్నాను.........................................

..........................................................

యెంత సేపయింది. కలలో మీరుతిరిగివచ్చి నన్ను ముద్దుపెట్టుకున్నట్లు తోచింది. మెలకువవచ్చింది,కొంచెంగా నన్ను కావలించుకుని యెదురుగా వున్నారనుకున్నాను. యింకా కలా! ఆనందంలో సుఖాను భవంలో నాదేహం మూర్ఛపోతోంది. యెంతోశాంతి వొచ్చింది నా నరాలకి.

"మళ్లీ వొచ్చారేం ?"

మాట్లాడలేదు. ప్రేమతో నాచేతులు మెడ చుట్టూవేసి దగ్గరికి యింకా అదుముకున్నాను. చంపల మీద చేతులు వేశాను. మీసాలులేవు. యెవరిది? వొదిలించుకో బోయినాను. పెనుగులాడా లనుకున్నాను. కాని నా నరాలు నాకెదురుతిరిగాయి. నా శరీరమే నాకు తిరగబడి ద్రోహం చేసింది. మీరు మోహంతో నన్ను రేకింపచేసి, తృప్తి పరచక, వొదిలిన నిరాశవల్ల నాదేహం నాకు ఎదురుతిరిగింది. యెంతప్రయత్నించినాకదలలేను.ఆయ్యో నాభర్త! నాప్రేమ! అంటాను, అరుచుకుంటాను. మూడు నెల్లనించి మిమ్మల్ని తలుచుకుంటో అణిచి పట్టినమోహ తీవ్రత, మీరా రాత్రి సంతృప్తి పరచని నావేదన, అంతా నన్ను మంచేసి, దాసురాల్నిచేసి, నా నిశ్చయశక్తిని నోరు నొక్కనన్నిట్లాచేసింది...........వాడు, మీ పరమాత్ప....పోనీలెండి, వాడెవరైతేనేం, యెందుకు?

ఆరోజునించి జాగ్రత్తగా వున్నాను. తలుపు గడియ వేసుకుంటున్నాను. వెంటనే మీ దగ్గరికివొచ్చి మీతో అంతా చెప్పేసి, మీ కాళ్లమీద పడియేడిస్తే, మీరు కరుణిస్తారేమో నని ఆశ పుట్టింది. మీ దగ్గరికి వొస్తానని కూడా రాశాను జ్ఞాపకముందీ?కాని పూరినించి పూరికి తిరుగుతో మీరు వీల్లేదన్నారు. మీకీ సంగతి రాయాలా. రాయకూడదా అని సందేహం పట్టుకుంది. చెపితే నన్ను వొదిలేస్తారా? అప్పుడు నే నెట్లాబతకను? అనుకున్నాను. అందుకునే మీకు రాశాను కూడాను.జ్ఞాపకముందీ?,, ఒకానొక యింకొకడితో సంబంధంపెట్టుకుని తరవాత పశ్చాత్తాప పడ్డది. భర్తవొది వెయ్యాలా; కూడదా? యేది ధర్మం? మీ అభిప్రాయమేమిటి?'' అని. మీ జవాబు చదివితే మీరు క్షమార్పణ చూపెటట్టు కనపడలేదు. మీరు విపరీతమైన బాధ పడతారని తెలుసు. మీరు నన్ను వొంటిమీద ముద్దు పెట్టుకుంటో ,, యిదంతా నాదేకదూ ! యింకోరు తాకకూడదు!'' అన్నప్పటి యీర్ష్యతో

నిండిన మీ చూపులు జ్ఞాపక మొచ్చాయి. ఆలోచించి ఆలోచించి, మీతో చెప్పకూడ దనుకున్నాను. యెందుకు చెప్పడం ? యేంలాభం చెప్పి ? యింక మూణ్ణెల్లల్లో యిద్దరం యెపుడూ కలిసే వుంటాం, మీకు ప్రమోషన్ కాగానే ! యింక వాడేంచేస్తాడు అనుకున్నాను. కాని నాఅదృష్టం యిట్లా పరిణమించింది, నాఆశలన్నీ, సంతోషమంతా యిట్లా బుగ్గిలో కలిసింది. నెలరోజుల కిందటే మొదటి అనుమానం కలిగింది. నిజమే నేమో అని భయంతో, గిజగిజ లాడాను. యేదో వొకటి తేలిందాకా రోజూ రోజూ యెట్లా గడిపాననీ, ప్రతి రోజూ యెదురు చుస్తో, తప్పు లెఖ్ఖ పెట్టా నేమోనని కొన్నాళ్లూ; ఆలిస్యానికి కారణం కల్పించుకుంటో, కొన్నాళ్లూ; ఆశలేని ఆశతో గడిపాను, కాని మెల్లిగా స్థిరపడ్డది ! యింక మీతో బొంకేదెట్లా ? యెన్నడు లేనిది యిప్పుడే యిది రావాలీ? పోనీ యెట్లానన్నా మిమ్మన్ని మోసపుచ్చి మీతోవుండేవిధమే వుండకూడదూ? మావాళ్లకి తెలిసింది. మీకు సంతోషంగా వుత్తరం వ్రాశారు, యీరోజు. ఆవుత్తరం తరవాత యిది అందితే మీమనసు యెట్లా వుంటుంది ? యీపాటికే న[illegible] దేహిస్తో వుంటారు మీరు–యీవుత్తరం అందేటప్ప[illegible] పోనీ బతికి వుండామా అనుకుంటా ! చచ్చిపోతు[illegible] గనక నేను రాశిన యీసంగతులు నమ్ముతా రేమో[illegible] బతికివుండి మీతో చెప్పితే నమ్ముతారా ? వేష్ట[illegible] వలసిచేసి, యీపన్నాగం పన్నా ననుకుంటారు. దు. నీళ్లల్లో పడతా నీరాత్రే.

శెలవు మరి. యింక మళ్లీ మీ మొహం చూ[illegible] వొచ్చే జన్మంలో మీరెవరో నేనెవరో! యీచి[illegible] షాలలో, మీతో గడిపిన అదృష్టపు దినాలు, ఆ[illegible] కాలమూ అంతా జ్ఞాపక మొస్తోంది. ఆరోజు [illegible] కట్ట.....వొద్దులెండి. యెందుకదంతా యిప్పుడు! మళ్లీ పెళ్లి చేసుకుంటారా?...చేసుకోండి...కాని [illegible] తూ వివాహం చేసుకో వొద్దు. నాకు చిషవ [illegible] య్యరూ ?

మీ పాద సేవకురాలు,

విజయ లక్ష్మి



# పరికూర్చిన పువ్వులు

### నక్షత్ర మండలము:

మేఘములతో నావరింప బడక స్వచ్ఛముగా నుండు ఆకాశమున రాత్రులందు మిణుగురు పురుగుల వలె అసంఖ్యాకము లైన తేజోరాసులు ప్రకాశించుచున్నవి. వీనిలో మిణుకు మిణుకుమను నవి కొన్నియు, నిశ్చలమగు కాంతితో ప్రకాశించు నవి కొన్నియు కన్నులకు నగు పడుచుండును. మొదటి తరగతి వానిని నక్షత్రము లనియు, రెండవ వానిని గ్రహము లనియు శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. చూచుట కీ నక్షత్రములు మనకు సమీపమున నున్నటుల గోచరించినను భూమండలమునకు వీనికి గల దూరము సంఖ్యలలో దెలుపుట అసంభవమని దోచక మానదు.

ప్రకాశమానము బట్టి యీనక్షత్రములలో నిరువది నక్షత్రములు ముఖ్యస్థానము వహించియున్నవి. వీనినే పారిభాషిక వాడుకలో ప్రథమ తరగతి నక్షత్రము లనియెదరు.

'సిరియస్' యను నక్షత్రము భూమండలమునకు సమీపమున నున్నందున అధికముగా ప్రకాశమానమై కనుబడుచున్నది. దక్షిణ దిశయందు తేజోవంతమగు 'క్యానోపస్' యను నక్షత్రము సూర్యుని కంటె ఎన్నియో రెట్లధికముగా నున్నను దూర ముండుటజేసి మిణుకు మిణుకు మనుచుండును. సూర్యునికన్న రెండింతలుండు 'అల్ఫా సెంట్వరి' యను నక్షత్రము క్యానోపస్ కన్న సమీపమున నున్నను ప్రకాశము నందు రెండు సమానముగా నున్నవి. 'పట్లైర్' యను నక్షత్రము సూర్యబింబము కన్న ౧౨ రెట్లు, పొలకస్, ౧౨౫ రెట్లు, కొపెలా, ౨౦౦ రెట్లు అంటారెస్, ౨౦౦౦ రెట్లు, రిజెల్, ౪౦౦౦ రెట్లధికముగా నున్నను, అతి దూరములో నుండుటజేసి మినుకు మినుకు మని ప్రకాశించుచున్నవి. ఈనక్షత్ర నామములు మనపూర్వులు మనకు తెలియుటకు లిఖించి యుంచకుండుట శోచనీయము.

అమెరికానుండి వెలువడు, 'సైంటిఫిక్ అమెరికా' యనుపత్రికలో కొంత కాలమునకు పూర్వము నక్షత్రముల గురించి యొక వ్యాసము ప్రకటింప బడినది. దానిలో భూమికిని, నక్షత్రములలో కొన్నింటికిని గల దూరము సంఖ్యలలో దెలుప బడెను. అవి మిక్కిలి యాశ్చర్య కరములుగా నుండెను. భావ ప్రపంచమున గూడ అను మానమునకు తట్టని సంఖ్యలు లెఖ్ఖలమూలమున దేల్చ బడినవి. క్యానోపసి, నకు భూమండలమునకు గల దూరము పది యారంకెలు గల సంఖ్యతో దెలుప బడినది, అనగా వీని మధ్య దూరము 3,00,00,00,00,00,00,000 మైళ్లు గలదని నిశ్చయించ బడినది. కోట్లపర కైనను, శంఖ పద్మముల వరకైనను అనుమానము కలుగవచ్చును గాని యిట్టిసంఖ్య

విషయమై కలుగుటసంభవము.

భూమండలమునకు నక్షత్రము లింత దూరముగా నున్నను వాటి కాంతి మనవరకు వచ్చువరకు సంవత్సరము లవసరములు లేవు. కాని కొంత సమయము పట్టుటమాత్రము నిశ్చయము. ప్రకాశ గమనము సెకండునకు ౧౮౬-౩౨౦ మైళ్లు. అనగా సుమారు లక్ష యేబదిలవే మైళ్ల దూరము ప్రకాశము ( Light ) ప్రసరించుటకు సెకండు కాలముపట్టును. సూర్యరశ్మి భూమండలము చేరుటకు ౭ నిమిషముల కన్న యెక్కువ కాలము పట్టుచున్నది. మొత్తము మీద ప్రకాశము గంటకాలములో 67 కోట్ల 7 ½ లక్షల మైళ్లదూరము వరకు ప్రసరించిపోవును.

భారత వర్షము కాశ్మీరమునుండి కన్యాకుమారి వరకు ౧౮౦౦ మైళ్లుగలదు. ఇట్టివి 3 లక్షల ౭౩ వేల భారత వర్షము లొకదాని తర్వాత నొకటి యుంచిన మొత్తము ప్రదేశముపై ప్రకాశము గంట కాలములో ప్రసరి పోవును. ద్రుత గామియగు యిట్టి ప్రకాశము, 'అల్ఫా సెంట్వారి' నుండి భూమిపైకి వచ్చుటకు నాలుగు సంవత్సరముల నాలుగు మాసములు పట్టుననిన యసంభవమా! ఇతర నక్షత్రములకన్న సమీపముగా నుండి ఈనక్షత్రపు కిరణములు మనవరకు వచ్చుటకు ౪ సంవత్సరములగుచున్నవి. సిరియస్, అల్టైర్, ఔసియస్, యను నక్షత్రము లితరుల కంటె సమీపమున నుండును. అల్టైర్, నక్షత్రపు కిరణములు భూమిపైకి వచ్చుటకు ౧౪ వర్షములు కావలసియున్నవి. పై విషయములం బట్టి సమీప, శబ్దమున కగుభావము పాఠక వర్గమునకు స్ఫురించి యుండవచ్చును.

ఇక దూరములోనుండు నక్షత్రములలో, 'అంటారెస్, కిరణములు మనవరకు వచ్చుటకు ౧౦౦ వర్షములు గడచు చున్నవి. * ఇట్టి నక్షత్ర గురించి యూలో చించుటగాని, వాని యాకార గురించి భావించుటగాని స్వతః అసంభవముగా కానికి క్యనోపస్, నక్షత్రముయొక్క కిరణము భూమి ౬౦౦ ల వత్సరముల పిదప రాగలుగు చున్నది.

' అల్ఫా సెంట్వారి, నక్షత్రము మనకు సమీప గలదు. అంతవరకు మనము రైలుమార్గము వేయ గలమని యనుకొనిన దానిపై గంటకు ౬౦ మైళ్ల తోనడుచు మేలుబండి నడిచిన అచ్చటికి చేరుట కోట్ల సంవత్సరముల కాలము పట్టును. దీనిపట్టి ఎం త దూరమున గలదో యాలోచించ వలయును.

ఇట్టి యనంతకోటి నిత్యములు సృష్టిం పరమేశ్వరుని బూజించుట మానవుని విధ్యుక్త ధ గాదా?

(బి. ఎన్. శర్మ, బి.

## అపూర్వ గ్రంథము.

ఆంధ్ర పరిశోధక విశ్వ విద్యాలయ పుస్తకా గారమున భీమపురాణం బను అముద్రిత గ్ర బయలు పడినది. ఇమ్మహా కావ్యంబు నెవ్వరు ప్రచురింపక పోవుటచే నే నకార్యంబునకు తిని. తత్కావ్యమున రచనా చమత్కృతి తెలి నీ క్రింది పద్యముల నుదహరించు చున్నాను.

(మం. రా. గోపాల శాస్త్రి, బి.

* దూరవర్తి నక్షత్రముల పిదప గగనమండలము తారహీనమైయున్నది. ఆ పైనుండు నక్షత్రముల గతి యవలంబించినను వానికిరణములు మనవరకు వచ్చుటకు ౧౨ కోట్ల సంవత్సరముల కాలము కావలసియు

భీమ పురాణము—రమణోపాఖ్యానము.

*	*	*

వ॥ అంత నష్టాదశాది విద్యా రహస్య శిక్షాకృత కృత్య శిష్య పరిషత్పరివేష్టితుండై యున్న రామకృష్ణశర్మను దత్పరివారం వారమున నొక్కరుండు రమణుని కథ వినిపింపుఁ డనిన నక్కు సురాగ్రణి యిక్కరణి వక్కాణించె:—

క॥ భారతదేశము నంగల
వారలలో నెల్లవంటవారలె తగురా
నేరుపు లన్నియు నేర్చిన
వారలు తొలివేల్పు వశమె వారల బొగడన్.

క॥ మును ద్వాపరమును గలియుగ
మును గలయుచు నున్న సమయమున నుద
మను కులమున ఘనుడును స	[యించెన్
జ్జనుఁడును నగు పాకశర్మ క్ష్మాతల మందున్.

క॥ పాకర హస్త్యాంశముల న
నేకములను బ్రాకటముగ నేరిచి తన వి
ద్యాకౌశల ప్రదర్శన
శ్రీకృపయును ఖ్యాతిఁగాంచె చెలువారంగన్

వ॥ అమ్మహానుభావుం డద్భుతైక లీల బూరెలఁ గల్పింప సమరుండౌటయు దిగంత విశ్రాంత మగు ఖ్యాతియు నమూల్యంబగు మూల్యంబు నంది, బూరెల శర్మ యనియు నభినవ భీముండనియుఁ బలు పలు నామధేయంబుల వాసింగాంచె దదనంతరంబ,

మ॥ క్రమమై యొక్కటి వెంట నిం
కొకటి పారావారవీచిర జా
లమునందుం దరఁగల్ తగన్ జనుచు నీ
లంగ్రవ్వడిం బాతెనం
తము విశ్రాంత మొకింత లేక
దినముల్, ధాత్రీతలం బెల్లఁ గా
లముతో పాటుగ మారుటల్ సహజమే
లక్ష్మీ నివాస స్థితిన్.

ఆ॥ వె॥ పాక శర్మ చనియెఁ బ్రాయంబుకై వ్రాల
నతని వెంటనంటి రతని పుత్రి
పౌత్రు లెల్ల నిట్లు పలుతరంబుల వారు
చనఁగఁ జనగఁ దుది రమణుడు మిగిలె.

ఆ॥ వె॥ పాక శర్మ మున్ను బ్రాకటంబుగ గొన్న
మాన్య శతము లన్ని మాసి చన్న
నింక బూరెల కై యింటిపేరే యున్న
కైన యాస్తి యున్నరాధమునకు.

క॥ దారిద్ర్యము దుర్గుణ పరి
వారముతో నచ్చి యాలవాలంబుగ శ్రీ
బూరెల రమణుం గైకొనె
నేరికిఁ బూర్వకృతిఫలము లిలలోఁ దప్పున్.

తే॥ గీ॥ తలిరు ప్రాయంబునుండి స్వోదరము పోష
ణార్థమై రమణుండు మర్యాద నడుగు
కొరకు యాచించి యాచించి తెచ్చుకూడు
కుడుచుచు నుదినదినములు కడపుచుండు.

వ॥ ఇట్టి జీవితము తనకును నిద్యంబుగదోఁచి రమణుండు చదువరి యను వేషముఁ దాల్చి విద్యా విషయక వాదార్థంబునయ్యు సభలఁగూర్చుటకు నలయు విత్తంబు శ్రీమంతుల యొద్ద యాచింప,

క॥ కొందఱు దంభము కొఱకై
కొందఱు స్నేహంబుచేత నొందరు కృపచేఁ
గొందఱు మోమోటముచే
నిందాలు నొంగ సందు సగము హరించున్.

వ॥ అంతతోఁ దృష్టి నొందక తత్ విద్యా విశేషము
చూపఁజూచు.

మ॥ మనమం దించుకయైన నాంధ్రకవితా
మాధుర్యముం బ్రౌఢిమం
బును స్వారస్య వచోచమత్కృతుల స
మ్మోదంబు చేకూర్ప నో
పని మాహాత్మ్యము మున్నుకా
కము కలాప్రవాతముం జేరు లీ
లనె చేరంగఁ గవీంద్రులా సలువుహే
లా లీల యత్నంబులన్.

తే॥ గీ॥ కుశిచి కుడిచి బిచ్చపుకూటఁ గ్రొవ్వి క్రొవ్వి
కావ్య దావాగ్ని శిఖలను గాంగి క్రాంగి
ప్రేమ వల్లరి పాడుచుఁ బ్రీతి చెందుఁ
దనదు కలకంఠ రవమును దాన వినుచుఁ
గాక మొట్టులఁ గావని కాంచు ముదము.

చ॥ అదియును జేతఁగాని సమ
యంబునఁ బెద్దలఁ దూలనాడుటే
పదిలము కీర్తిదాయకము
భాగ్య మటంచు గణించు, వారియం
దొదవెను తప్పు లెన్నకయె
యూరకయుండుట మెవ్వి, చెప్పునీ
చదువరులన్గణించి మును
సంస్కృతమున్ భవభూతి వాక్యముల్.

వ॥ అనుటయు నాశిష్యులలో నొక్కరుండు
"ఏనామ కేచి దిహనః ప్రథయంత్యవజ్ఞాం ..."
అను శ్లోకంబు చదివె ననంతరంబు రామకృష్ణ
శర్మయు నిట్లనియె,

చ॥ ఘనతగ భావవైభవ వికాసము
మాధురము కానలేమి యె
వ్వని దగు లోటు? భర్తృహరి
వాక్యములం జదువంగ లేదొకో?
యనుటయు శిష్యుడొక్కఁడహహా
యని నవ్వుచు బల్కె నిట్టులన్
"గనుగవ మూసికొన్నఁ ద్రిజగం
బులుఁ జీకటు లయ్యె పిల్లికిన్."

"శ్లో॥ వ్యాళంబాల మృణాళతంతుభి రసౌ
రోద్ధుం సముజ్జృంభతే
ఛేత్తుం వజ్రమణిం శిరీష కుసుమ
ప్రాంతేన సన్నహ్యతే
మాధుర్యం మధుబిందునా రచయితుం
క్షారాంబుధే రీహతే
మూర్ఖాన్యః ప్రతినేతు మిచ్ఛతి బలా
త్సూక్తైః సుధా స్యందిభిః"

వ॥ నావుడు రామకృష్ణ శర్మ మనంబున ఘనం
బగు మోదంబు నంది రమణుని పై వృత్తాంతంబు
నిత్తెఱంగునఁ జెప్పందొడంగె.

× × × ×



# ముదిమాణిక్య శాసనములు

ఆంధ్ర పరిశోధక సంఘము, హైద్రాబాదు.

౮౭

భోగీశ్వరాలయమునకు ముఖభాగమందు ప్రాతియున్న శాసనము. ఇది చెఱువునకు సంబంధించినది. క్రింద బడియుండగాఁ దెచ్చి గ్రామవాసులు దేవాలయమందు జేర్చిరి.

మొదటి వైపు.

౧ స్వస్తి శ్రీ జయ దేవాళ్చ
౨ వసుబాణార్క ౧౨౫౮ సం
౩ యుతే । ధాతాబ్దే శ్రీవ
౪ ణే శుక్ల పుష్యమ్యర్క స్య
౫ వాసరే ॥ భోభుజ్యమాన
౬ శ్రీరాజ్యం శ్వేతగ్రామం
౭ మహాయశః ॥ ఎల్లుతెం
౮ శేతి విఖ్యాతః ప్రిజాపాల
౯ న తత్పరః ॥ మద్దప్ప కు
౧౦ ల జాతాద్యా ఎట్టి
౧౧ పోతాఖ్య నాయకా
౧౨ త్ । మల్లాంబా లభతః సూ
౧౩ నుం మల్లిశెట్టీతి నామ
౧౪ కం । తస్యాగ్రిజాతస్తన
౧౫ యో । వాసులంకేతి కీర్తితః
౧౬ తస్య నామ్నాత డాకం
౧౭ శ్రీవాసాబ్ధి రితి కీర్తిదం
౧౮ వృద్ధ పూర్వక రత్నాఖ్య
౧౯ గ్రామాత్ పశ్చిమ తోది
౨౦ శ

రెండవ వైపు

౧ పుత్రి ప్రేష్ణాత
౨ డాగంతం మల్లి
౩ సెట్టి రసుజ్యాత ॥ మాల్లాం
౪ శా మహనియ్యా రా
౫ జ దుదర క్షీణంబు
౬ రాశే రసా ॥ జాతో భూ
౭ సుర భూరిదాన చతు
౮ రః శ్రీ మల్లిసెట్టి + +
౯ రత్న్యంత్వేన మహాగ
౧౦ వం సురగణ బ్రిహ్మ
౧౧ దయో మాతరం సూ
౧౨ ర్యార్కాది గ్రిహమండల
౧౩ శ్చ సహాజే స్త్రీ పుత్ర పౌత్రి
౧౪ న్వితం ॥ ఈశ్వరా
౧౫ ర్యార్కాను పుత్రేణ మా
౧౬ ధవాఖ్యేన సూరి
౧౭ ణా ధమార్కర్థ
౧౮ సిద్ధ్యర్థం ప్రోలకం స్వా
౧౯ సన ముత్తమం ।
౨౦ श्री रामचंद्राय नमः

౮౮

భోగీశ్వరాలయమునకు బైట పాతిబడియున్న రాతిపై నీక్రింది విధముగా నొక్క వైపుననే వ్రాయబడి యున్నది.

౧ స్వస్తి సమస్త
౨ భువన గణప
౩ తిదేవ మహార
౪ జు X కట్టినలకు
౫ రాయచ గవనా
౬ య నాదేయ
౭ లుతు ఇటుకల
౮ చెఱ్వు వార పూ
౯ ర్వము చేసిన
౧౦ డు బోగము
౧౧ దేవరకు నిచ్చె ద్రౌ
౧౨ గిత్తేవ ఈ [illegible]

# సంపాదకీయములు.

బట్లరు కమిషన్

స్వాతంత్ర్య రుచుల చవిగొన్న దేశ మె న్నటికైనను స్వాతంత్ర్యము బడసి తీరును. అంత వరకును దానికి శాంతి యుండదు. సంతోష ముండదు. తృప్తి యుండదు. భారతీయులు సాగించు స్వాతంత్ర్య సమరమున కిప్పుడు కొన్ని కారణముల వలన నవరోధములు కలిగినను దానిని నిస్సంశయముగ వారు తుద ముట్టింప గలరు. ఇది భారతీయులకు నమ్మకమే! పర దేశీయులు కూడ నీయభిప్రాయమే పడుచున్నారు. బ్రిటిషు ప్రభుత్వమునకు గూడ నటుల జరుగు నేమోయను భీతి పుట్టినది. ఐనను వీలున్నన్ని దినములు అదిమిపట్టుటయే ఉత్తమ మని చిత్రవిచిత్రములైన పన్నాగములు వారు పన్నుచున్నారు. సైమన్ కమిషన్ అట్టి పన్నాగ ములలో నొకటి. బట్లరు కమిషన్ రెండవది. మొదటి దాని కంటె రెండవ దానికి విశేషమైన ప్రాముఖ్యత కలదు.

ఒక రాజకీయవేత్త యనినటుల బ్రిటిషు రాజ్య వీరులకు బ్రిటిషు యిండియా వాసుల బలముకంటె విశేషముగ సంస్థానముల బలము పైననే ఆధార పడవలసి యున్నది. బ్రిటిషు ఇండి యా ప్రజలు దినదినము పరరాజ్యము లందలి వివిధ స్వాతంత్ర్య సంచలములను గురించి యాకర్ణించుచు, తాము కూడ వానినన్నంటిని బడయవలెనని ఉత్సాహ పడుచున్నారు. అక్కడి విశ్వవిద్యాల యములం దార్థిక స్థితిని బాగు పరచు విద్యలను గరపక పోయినను వారిభావములను ఉద్రేక పూరితములుగ చేయునట్టి విద్య మాత్రము ప్రసాదించి నందున, బ్రిటిషు వారికి తాము పేనిన త్రాడు తమ మెడకే యురియై పరిణమించినది. ఇక వారెన్ని విరుగుడులు ప్రయోగించ దలచినను బ్రిటిషు యిండియా 'సూర్యుడు గ్రుంకని సామ్రాజ్యములో' నెల్లప్పటికి నిలిచి యుండుట నిత్యము కాని ముచ్చట. సైమన్ కమిషన్ చేయనున్న కృషిచే ఫలించనున్న సంస్కరణములు ౧౯౧౯ వ సంవత్సరము సంస్కరణముల కంటె నెక్కువ లాభ దాయకములుగా జాలవు. అక్కడి ప్రజలు అంతటితో తృప్తి పొంద యుండ జాలరు.

కాని దేశీయ సంస్థానముల స్థితి అట్లు కాదు. విద్యయందు అర్థిక, స్థితులందు, [illegible] షము నందు అక్కడి ప్రజలు నెనుక బడి స్వతంత్ర జీవనాభిలాష లేక క్రుంగి పోవుచున్నారు

వారిని పాలించు ప్రభువులు తామెవరో తమ పాలితు లెట్టి సితి యందున్నారో విచారించక కూపస్థ మండూకముల మాదిరి తమ కాలము వ్యర్థపరుచు చున్నారు. తమ శాంతమునకు భంగము కలిగించనట్టి నిరుపద్రవ కరములగు ప్రజాందోళన లేవైన మొలకలెత్తిన-చో తక్షణం వానిని పెకిలింపించి ధర్మ సంస్థాపన, మొనరించుట వారు కూడ నేర్చుకొనుచున్నారు. ప్రపంచ స్థితులు ప్రతి క్షణ మెటుల మారు చున్నవో సంస్థాన ప్రజలకు తెలియకుండ నైపోయినది. 'మ్యాకి వెలి' చూపిన రాజకీయ సూత్రముల నన్నిటి నాచరణ యందు పెట్టుచున్న బ్రిటిషు సామ్రాజ్య సారథులు పూర్వము నుండియు తమ పాదముల క్రింద నణచి యుంచిన సంస్థానములలో నిప్పుడు లాభమును పొంద దలచినారు. దేశీయ సంస్థానప్రభువుల యొక్కయు, ప్రజలయొక్కయు దౌర్బల్యములు వారి కపార సహాయ వంతములుగ పరిణ మింప నున్నవి. బట్లరుకమిషను నేర్పరుచుటలో దేశీయ ప్రభువులకు సర్వ స్వాతంత్ర్య మొసంగు త్యాగ బుద్ధి యుండి యుండలేదు. పాలకులకును పాలితులకును సంఘీభావ ముదయింప జేయ నేర్పాటైన సంస్థ అసలే కాదని వారే చాటిరి. ఆకస్మికముగ ఇప్పటి బ్రిటిషు యిండియా తమ స్వాధీనము నుండి సడలి పోయిన-చో వారికి హిందూస్థానము నందు నిలుచుటకు నీడ, తిరిగి ముందెన్నటికి హిందూస్థానమును సాధించుటకు స్థావర ముండదు. ఈ యిబ్బందులు తొలగించుటకే బట్లరు కమిషను యొక్క ప్రతిష్ఠాపన మావశ్యకమగు చున్నది.

దేశీయ సంస్థానాధీశులకు కమిషను లాభ ప్రదమైన దెన్నటికిని కాదు. ఇప్పటి స్వేచ్ఛలో కూడ వారికి భంగము కలుగునేమో యని తోచుచున్నది. స్వతంత్ర భారతము నందు వారు పాల్గొనకుండ నిప్పటినుండే కట్టు దిట్టములు మొదలిడబడినవి. దేశీయ ప్రభువులీ వలలో చిక్కిన-చో వారిస్థితి చాల యాభాస కరముగ పరిణమించును. ఇటు తమ ప్రజలలో హాస్యాస్పదు లగుదురు. అటు బ్రిటిషు యిండియా ప్రజలలో గౌరవమును గోల్పోయెదరు. ఏబ్రిటిషువారి వలన కూడ వారికి ఘనమైన పద వేదియు లభించు యవకాశము లేదు. తమ ప్రజల నెంతవరకు మెప్పించి తమ సాహాయకుల జేసికొనరో అంతవరకు వారి యునికి స్థిరమైనదిగను, కీర్తివంతముగను ఉండజాలదు. ఏమార్గము నవలంబింతురో జూతుముగాక!

## శ్రీ శర్మిష్ఠాదేవి

శ్రీ హోల్కారు మహారాజుగారి నవీన వివాహము హిందూస్థాన చరిత్రకు నూతన విషయము కాక పోయినను యిటీవలి సంతతి వారిని మాత్రము చాల యాందోళ నమునందు బడద్రోసినది. ఇట్టి యాందోళనము నందు బడిన మనవారు పూర్వాచారమును తమ పితృ పితామహులవరకే నిర్బంధించినందు వలన నీయవస్థ వారికి ప్రాప్తించినది. దైవము వారి సంకుచిత దృష్టిని తొలగించి యట్టి మహోత్సవ సమయముల సంతోషించు వారితో కలసి సంతస మొందుటకై త్వరగా తోడ్పడు గాత! వారికొఱకు మే మింతకంటె నిర్మల మైన

ప్రార్థన మరొక దానిని చేయజాలము. ఆరంభము నుండి కూడ హిందూ మతము తన విశాల భావములను బట్టి, ఉన్నతా దర్శముల కారణమున, గభీర తర్కములకు పాత్రములై నెగ్గిన సూత్రము లుంటచే, చండ ప్రచండులైన నాస్తికుల కఠిన విమర్శనలకు లోనై మడియ నందున, ప్రపంచము నందలి ధీమంతులదృష్టిని తనకడ కర్పించుచు వచ్చినది. ఒకానొక కాలమున హిందూమతము నామమాత్రావశిష్టమై ఆపేరు కూడలేక నిర్మూలమై పోవునేమో యను సంశయ మొదవ జేసెను. కాని దాని సహజ గుణములం బట్టి వైరి మతమే పేరులేకుండ నశించెను. ఇప్పుడా మతస్థాపకుడు పుట్టిన స్థలమును దర్శించుటకు వచ్చు పరదేశ యాత్రికులు తప్ప మన దేశమున ఆ మతావలంబకులు చుచ్చుట కొఱకు, కూడ దొరకరు. ఈచర్చతోనీ మతము మంచిది అదిచెడ్డది అను ఉద్దేశము మాదకాదు. హిందూ మతము యొక్క సహజత్వ మేదో తెల్పుటయే మా యుద్దేశము.

శ్రీ శర్మిష్ఠాదేవి అమెరికా దేశపు ఒక దవ్యవంతుని యింటి ముద్దుల బిడ్డ. కావలెన్న ఆమెకు వరులు విశేషముగ నక్కడనే దొరకు చుండిరి. కాని ఆమె కాకస్మికముగ హిందూమతము పై కలిగిన అభిమానమే, ఆమె నీవివాహము నకు పురికొల్పినది. ఇటీవల చరిత్రయందు హిందూ మతమున కింతకంటెనెక్కువ విజయ మెప్పుడును సభవింపలేదు. సనాతన ధర్మావలంబకులగు పిత్రుపితామహాచార ప్రియులీ వార్తను విని అసంతృప్తి చెందవచ్చును. దేశకాల పాత్రములను దిగదన్ని గాలియందెగర దలచిన ఆధునికులు మెచ్చుకొనవచ్చును; కాని హిందూ మత సిద్ధాంతములపై నొక విదేశ విదుషీమణికి గలిగిన అభిమానమును స్మరించు కొన్నచో విశాలధాభిప్రాయములు గలవారందరు నేకమై నూతన వివాహమును ప్రశంసింపక తప్పదు.



Edited and Published by K. Balakrishna Reddy at The Chandrakanth Press Gowliguda, Hyderabad (Deccan.)

# విషయ సూచిక

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక

పోస్టు బాక్సు 752, ఎగ్మూరు, మదరాసు.

“గృహలక్ష్మి” యను సచిత్ర మాసపత్రిక యీ సంవత్సరము మార్చి నెల నుండి వెలువడుచున్నది. ఇందు ముఖ్యముగా భారత నారీమ తల్లుల ఆయురారోగ్యముల పెంపొందించు విషయములు చర్చింపబడును. స్త్రీలు పురుషులతో సమాన వ్యక్తులనియు శరీర మనోబలముల యందెంతయు తక్కువవారు కారనియు నిరూపించుటయు నాయుద్దేశము. ఎల్లభంగుల స్త్రీయుద్యమమునకు దోడ్పడుటయే మా యభిప్రాయము. స్త్రీలు స్వీయ స్వాతంత్ర్యమునకై ప్రయత్నింపుచుండు యిప్పటి పరిస్థితులబట్టి మా గృహలక్ష్మి వంటి పత్రిక యత్యంతావశ్యక మనుట తెలియగలదు. ప్రతిమాస సంచికయందును, స్త్రీల కెంతయు హితమొసంగు వ్యాసములు, కథలు, నవలలు, పద్యములు, వివిధ విషయములు, మరియు నిట్టివియేయగు అంశములు గలవు. చిత్ర విచిత్ర పటములతో కూడి మేలుకాగితములపై ముద్దులొలుకుచక్కని కూర్పులతో ముద్రింపబడి ప్రచురింపబడును. ప్రతివనితారత్నమును తప్పక చదివియే తీరవలెను. ఈ పత్రికకు చందాదారులుగ జేరియు, వ్యాసముల వ్రాసి పంపియు, మా యుద్యమమునకు తోడ్పడునట్లు దేశాభిమానులగు సోదర సోదరీమణులను కోరుచున్నాము. స్త్రీల యశోవృద్ధికి స్త్రీలే కొంతవడి శ్రమబూని తోడ్పడిన, బంగారమునకు పరిమళ మబ్బినట్లు గృహలక్ష్మి ప్రతి గృహమునందును లక్ష్మియై విరాజిల్ల గలదు.

సం॥ చందా రు. 4 డాక్టరు. కే.ఎన్. కేసరి. సంపాదకుడు.

విడిపత్రిక. అణాలు 6.

---

## త్రివర్ణ చరిత్రములు

పలువురు కోరినందున మరల ముద్రింప బడినవి. కొలది ప్రతులు మాత్రమే

త్వర పడుడు! ఆలసించిన విచారపడవలసి వచ్చును!

శ్రీ మురళీ కృష్ణుడు (సుజాతలో వేయుటకు ప్రత్యేకముగా కలకత్తానుండి తెప్పించబడినది) ప్రతి 1కి వెల 0-1-0

మేనక (సుప్రసిద్ధ విదుషీమణియగు శ్రీమతి రత్నాల కృష్ణాబాయి, బి.ఏ. గారిచే చిత్రింపబడిన మనోహరమగు త్రివర్ణచిత్రము. ప్రతివారును చూడదగినది.) ప్రతి 1కి వెల 0-2-0

ప్రభావతీ ప్రద్యుమ్నులు (సుజాత కొరకు ప్రత్యేకముగ, బందరు జాతీయ కళాశాలయందు చిత్రలేఖనమభ్యసించిన, శ్రీమాన్ కె. రామాచారిగారిచే చిత్రింప బడినది.) ప్రతి 1 కి వెల 0-1-0

రత్నాల కృష్ణాబాయి, శివరాజబహద్దురు, భద్రాచల దేవాలయము, గోదావరీ దృశ్యములు, కాశ్మీర దృశ్యములు, రామప్ప దేవాలయములోని విగ్రహములు, ఓరుగల్లు లోని కృంగిపోయిన దేవాలయము, ఓరుగల్లు ప్రాకారపై నాట్యమాడుచున్న వినాయకుడు, కాకతీయ రాజ మందిరము, సహస్రస్తంభ దేవాలయము—హనుమకొండ మొదలగునవి.

ప్రతి ఒక్కంటికి 0-0-6

సూచన:—అర్ధరూపాయకు మించని బొమ్మలు తెప్పించుకొనువారు ముందుగనే డబ్బు, పోస్టేజికి గాను అణా సహా టిక్కట్లు రూపమున పంపిన సులభము. లేనియెడల చాల ఖర్చగును.

ప్రకటన రేట్లు పలువురు కోరినందున తగ్గింపబడినవి. వివరములకు నేడే వ్రాయుడు. ఉత్తర ప్రత్యుత్తరములు, మనియార్డర్లు మొదలగునవన్నియు, ఈక్రింది వారిపేర వ్రాయవలెను.

మేనేజరు, “సుజాత” గౌలీగూడ, హైదరాబాద్ (దక్కన్)



హైదరాబాదు, మే ౧౯౨౮

సంపుటము ౧ శా. శ. ౧౮౫౦ విభవ సంవత్సర వైశాఖము. సంచిక ౫

# శ్రీ కృష్ణదేవరాయల కవితా సన్మానము

గాడేపల్లి సూర్యప్రకాశ రావు, ఎం. ఏ., ఎల్. టి.

ఎదురైనచోఁ దన మద కరీంద్రము డిగ్గి,
కేలూత యిచ్చి యెక్కించుకొనియె
మనుచరిత్రంబందుకొను వేళ పురమేగ,
పల్లకి తా కేల బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని దానె పాదమున దొడిగె
గోకట గ్రామాద్య నేకాగ్రహారము,
లడిగిన సీమలందు నిచ్చె,
నాంధ్రకవితా పితామహ యల్లసాని
పెద్దనామాత్యయని నన్ను పిలుచునట్టి
కృష్ణరాయలతోఁ దివికేగలేక
బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు.

కృష్ణదేవరాయల గూర్చి అల్లసాని పెద్దనామాత్యుడు చెప్పిన పద్యము కాదిది. తన్నుద్ధరించి, తన పేరు ప్రతిష్ఠల జగంబంత చాటిన పావన చరిత్రుని, సుపుత్రుని గోల్పోయి, ఆంధ్రకవితా జనని పెట్టిన పుత్రశోకము. తన్నె నగుల నెక్కించి, పల్లకుల నూరేగించి, సర్వాభరణ భూషితనుజేసి అఖాఢైశ్వర్యముల నోలలాడించిన కృష్ణదేవుని వంటి పుత్రరత్నమును గోల్పోయి, హృదయశోక మానలను తరి, ఆంధ్ర కవితామతల్లికి జీవితము మరణ ప్రాయముగ దోచుట సహజము. లోకమునందు భుజ ప్రాక్రమాఢ్యులు, సుందర విగ్రహులు, తేజోరాసులు, ఐశ్వర్యవంతులు, ధీశాలులు, ప్రత్యేకముగ నెందరేని యుండవచ్చును గాని, ఈ యన్ని భాగ్యము లొక్కచో [illegible] సాధారణముగ గాంచము. ఈ

యసాధారణ మహాభాగులలోని వాడు కృష్ణ దేవుడు. మహాధీశాలి. తన భుజ పరాక్రమాగ్నులచే విజయనగర సామ్రాజ్యమును, తన పాలనమున నుచ్చ స్థితికి దెచ్చి, తన్నామమును, తత్కీర్తి సౌరభమును, దేశపు నల్దిక్కులనేగాక, దేశ దేశాంతరముల గూడ గుబులుకొనునట్లు చేసెను. అతని సౌందర్య గంభీర విగ్రహమును గూర్చి, కథల వర్ణన లటుండనిచ్చి పాశ్చాత్య యాత్రికుల వ్రాతలే ప్రబల సాక్షులు. మనము జూచుచున్న యాతని చిత్రపటమే యింకొక సాక్షి. ఆ విశాల ఫాలము, తేజోవంతమగు నేత్రద్వయము, అతుల పరాక్రమ సూచకమగు యాదృక్కోణము, విగ్రహము నంతను అవరించియున్న ఆ ధీప్రకటనము; ఆంధ్రమాత నోములపంట యీ చక్రవర్తియని చాటుచున్నవి. ఇక నీతని యైశ్వర్యమును గూర్చిన విషయములు చరిత్రా సుప్రసిద్ధములే. విదేశ యాత్రికుల వర్ణనలు తార్కాణములు. విజయనగర సామ్రాజ్య లక్ష్మిని చూరగొన, నిరంతర దండయాత్రాదులచే కట్టకడకు రాజ్యము నాశనమొనర్చిన తురకల దుండగములే ప్రమాణములు. తమ శిల్ప సౌందర్యముచే నెక్కడలేని కళా విశారదుల నిర్వైర పాటొనర్చు వారి దేవాలయాదులు, నశించి మూలబడియు నిప్పటికిని. చూపరుల విభ్రమింపజేయు సౌందర్యమును గల్గియుంటయు; వజ్ర వైఢూర్యాది మణిరాశులు వీధులందు బాహాటముగ నంగళ్ల నమ్మబడెడివను చారిత్రక విషయములు ఇతరనిదర్శనములు. ఒకచారిత్రకుడే సామ్రాజ్యమును 'మరపునకు వచ్చిన సామ్రాజ్యము' (The forgotten Empire) అని పేరిడి వ్రాసినాడు. వేరొకరు దీనిని 'మరపు వీలులేని సామ్రాజ్యము' (The Never to be forgotten Empire) అనిరి. దీని నామము విజయనగరము. నామాంతరము విద్యానగరము. అన్నియు యదార్థములే యనునట్లు జేసెను కృష్ణదేవుడు. విజయముల నందెను. విద్యల కొలవాలము చేసెను. మరపునకు రాకుండజేసెను, తనయొక్కయు తనసామ్రాజ్యము యొక్కయు ఘననామములు.

ప్రస్తుత మీ చిన్ని వ్యాసమున, నెన్నో విషయముల గూర్చి చర్చింప వీలుండదు. గాన రాయల కవి సన్మానమును గూర్చియు, నాతని రసజ్ఞతను గూర్చియు యొక్కింత జూచి విడచెదము. ఈ విషయములగూర్చి చెప్పునప్పుడు, అతని కవితాశక్తిని పాండిత్యమును గూర్చి కూడ కొంచమైన చెప్పక విడుటకు వీలుండదు. గాన నీ రెండు విషయములగూర్చి కొంచెము విచారింతము.

కృష్ణదేవునకు కవిత్వమందును, కవుల యందును గల ఘన గౌరవము ఆరంభమున నుడివిన పద్యమే స్పష్టపరచుచున్నది. పూర్వమున మహా కవులకు, మహారాజు లక్షర లక్షల నిచ్చిరనియు అర్థ సింహాసనాధీశుల జేసిరనియు విందుము. అవి యెంత వరకు యదార్థములో జెప్పజాలము కాని, కృష్ణదేవుడు మాత్రము తన రాజ్యమును ఐశ్వర్యమును అర్ధభాగము దేశపరిపాలన ప్రణాళికయందును, మిగిలినయర్ధము కవి సన్మాన కార్యముల యందును వినియోగించెనా యని తోచక మానదు. ఇది యెంత వరకు ధర్మమని రాజనీతిజ్ఞులు ప్రశ్నింతురో జెప్పజాలను గాని, దేశాదాయమునందర్ధభాగము మించు ద్రవ్యమును రక్షక భటులకును, సేవలకునై వెచ్చించుట కన్న నిస్సందేహముగ శ్రేష్ఠతరమని నొక్కి వక్కాణింపగలను. ఎక్కడ జదివినను కొనసుల పల్లెరములు, ...ల కంఠహారములు, పచ్చని అగ్రహారములు, కవుల మీద కురిపించె ననియే విందుము. ఎచ్చటను భోయినము... తా గోష్ఠులందు కాలము పుచ్చినట్లే విందుము. ఈతడే గాక కవి చక్రవర్తి బిరుదము ఇంకొకరి కీయదగునా? పూర్వము భోజుడు సంస్కృత విద్యను పోషించి కాళిదాసును గౌరవించి అమృతత్వము గడించెను. ఆంధ్ర...మునకు భోజుడు కృష్ణదేవుడు. కాళిదాసు, పెద్దన. ... నామములు విడదీయ వీలులేదు. రసజ్ఞుడగు రాజునకే కవి...తను కురిపించెను పెద్దన. అతుల ధీశాలియగు కవిని ...వించి కృతార్థుడయ్యెను కృష్ణరాయడు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రయందు చిరంజీవులు వీరిగువురును.

కృష్ణదేవుని యాస్థానమున దిగ్గజములను బిరుద...లవహించిన ఎనమండ్రు కవులుండెడివారను ప్రతీతి... దగ్రగణ్యుడు పెద్దన. మనుచరిత్రమును వ్రాసి తనకంకితమిచ్చి, ప్రబంధరచనమునకు పునాది వేసెను.

తని కవనమును గూర్చి విస్తరించి చెప్పుట కనువగు సమయము కాదిది. తెనిగో సంస్కృతాంధ్రములం దీతనికి సమానము నభిమాన పాండిత్య కవనధోరణులుండివ నగలిని, ఈతని సహజ మృదు మధురమగు శైలిని, అల్లిక జిగిబిగి'ని గూర్చి చెప్పియుండుటను వీలిచ్చెడిద. కృష్ణరాయల యాస్థానమందలి మరియొక కవుని నామము ముక్కు తిమ్మన. ప్రారంభమున నీతని గృహనామము నంది వారయినప్పటికిని, ముక్కును సంపంగిపూవుతో బోల్చి యీయన చెప్పిన ప్రసిద్ధమగు పద్యమువలన ముక్కు వారనునది యీయనకు ప్రసిద్ధగృహనామమయి నట్లు నాడుక. పారిజాతాపహరణ మహాప్రబంధమును ముద్దులొలుకు మాటలతో వ్రాసి కృష్ణదేవున కంకిత మొనర్చెను. (ఎంతటి యదృష్టవంతుడో కదా కృష్ణదేవుడు యిట్టి గ్రంథ రాజముల నంకిత మొందివాడలను!) ఇతర కవులను గూర్చి మిక్కిలిగా జెప్పుట కవకాశము లేదు. వారి నామముల మాత్రము జెప్పిన జాలును. మాదయ్యగారి మల్లన్న, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటికవి. ఈ కడపటి కవి సుప్రసిద్ధమగు కాళహస్తీ మహాత్మ్యము వ్రాసి కృష్ణరాయని యంతటి ధీరునిచే నాతని పల్కులు 'అతులిత మాధురీమహిమా' యంతములని మెప్పు వడసెను. అష్టదిగ్గజములలోని వారినిగా తెనాలి రామకృష్ణుని, రామరాజ భూషణుని, పింగళి సూరనార్యుని కూడ జేర్చెదరు. మహా కవులేవీరును. కాని ముఖ్యముగ కృష్ణరాయల కాలము వారు కారని, గ్రంథాధారములజూపి, సహేతుకముగ సిద్ధాంతీకరించిరి, వీరేశలింగము గారు. యీ కవులందరును విజయనగర సంస్థానకవులగుటచే వివిధకాలములయందుండినప్పటికిని, చరిత్రజ్ఞానములేని యనవారు వీరి నామములన్నిటినేకము చేసి వారికీ నామమిచ్చిరేమో యని తలంపవచ్చును. గావున ఈ నామమును వదలుటకు నవకిష్టములేదేని, వీరిని కృష్ణదేవుని యాస్థానపు యష్ట దిగ్గజములుగాక, విజయనగర సామ్రాజ్యపు అష్టదిగ్గజములనిన సమంజసముగా నుండును.

వీరినందరి నిట్లేకముచేసి, ఏకకాలము వారిగ భావించుటచే వీరినిగూర్చి యనేక గాథలు ... పబడినవి. ఎందులకీ కథలు కల్పింపబడినవో చెప్పుట కష్టము. కల్పనాశక్తి హృదయాంతరమున కట్టు బడియుండుట కిష్టపడదు. భావనామహాత్మ్యము నేకరీతుల బయల్పరచు చుండును. ఈ కథాకల్పనల కింతకన్న కారణము నరయుట కష్టము. గావున యీ కథలన్నియు నవిశ్వసనీయములేయని తెలిసియు, కవితాచమత్కృతిని చూపుచు కృష్ణరాయలతో సంబంధించియుండుటచే, నొకటి రెండింటిని, చమత్కారార్థము మనవి జేసెదను.

౧. కృష్ణరాయ లొకనాడు నిండోలగంబుండి, నరాల పల్లెరమును బుంపించి, నిర్దుష్టమగు పద్యము నెవ్వడైన జెప్పిన వానలర్ధాని కిత్తుననెను. పెద్దన:

"శర-సంధాన బల క్షమాది విభవైశ్వర్యంబు
లన్ గల్గి దుర్భర షండత్వ బిల ప్రవేశ చలనబ్ర
హ్మాజ్ఞ తలన్ మానినన్ । నర, సింహ, క్షితి మండ
లేశ్వరుల నెన్నన్ వచ్చు నీరీతిగా । నరసింహ
క్షితిమండలేశ్వరుని కృష్ణా! రాజకంఠీరవా!"

అనగా, అర్జునుడు బాణమెక్కు పెట్టుటయందును, సింగము బలమునందును, భూమి జరిమియందును ప్రసిద్ధములయ్యు, అర్జునునకు నపుంసకత్వము, భూమికి చలనము అను దోషములుండుటచే, వాటి దోషములు నీయందు లేక, వాటియైశ్వర్యముల నన్నిటినిగల్గి, వాటినిమించి ప్రకాశించుచున్నావని స్తోత్ర పూర్వకముగా, కృష్ణదేవుని 'రాజకంఠీరవా!' యని సంబోధించి పద్యము జెప్పెను. కృష్ణదేవుడును సభ్యులును ఈ భావముల కెంతయు మెచ్చగా, పెద్దనార్యుడు నరాల పల్లెరమునందు కొనబోవుచుండెనట, కాని రాజకంఠీరవా అనుటలో రాజునకు సింహమునకును సామ్యమును జూపుటచే, సింహమునకు సింహ బిరుదమును పద్యము మొదటి భూషించి, సింహ బిరుదమును రాజునకిచ్చుట పద్యమందు దోషమనిజూపి, తెనాలి రామలింగడు లేచి, 'ఆగాగు! బిలమునోనికి బోవుచున్న కంఠీరవమును, తోక పట్టుక పైకిలాగదవేలో?' అని ఎత్తిపొడిచి, తానిక్రింది పద్యము నాశుధారగ జదివెనట,

౹౹కలనఁ దావక ఖడ్గ ఖండిత రిపు క్ష్మాభర్త మార్తాండమం। డలభేదం బొనరించినేగు నెడ దన్మధ్యంబునఁ హార కుం। డల కేయూర కిరీట భూషితుని శ్రీ నారాయణుఁగాంచి లో గఁగం బారుచు నేగె నీవయను శంకన్ కృష్ణరాయాధిపా!"

అనగా, యుద్ధమున కృష్ణరాయనిచే ఖండింపబడిన శత్రురాజొకడు, యుద్ధమున మరణించుటచే, వీరస్వర్గమునకుబోవుచు, నద్దానికి ద్రోవ సూర్యమండలములోనుండి యగుటచే నల్లుబోవుచు, దన్మధ్యమున హారకుండల కేయూరకిరీట భూషణముల దాల్చి విష్ణువుండుట జూచి, అతడే కృష్ణదేవుడని భయపడి, ఇచటికి వచ్చినను ఈతడే తిరిగి సిద్ధమయ్యెనాయని వెరగొంది, వీరస్వర్గమును వదలుకొని వెనుకకు పారిపోయెనట! అద్భుతభావనా చమత్కృతి! కృష్ణదేవుడు విష్ణుదేవుడని చెప్పుట గూడ చాల చక్కగ నున్నది. ఒక్క యక్షరభేదమే గదా! కృష్ణ విష్ణుల ఏకత్వమును రామలింగనికి బాగుగ సహాయమైనది.

రెండవది. ముక్కుతిమ్మన పారిజాతాపహరణమును వ్రాసి కృష్ణదేవుని కంకిత మీయగా, సంతసించి రాజాతనికి అగ్రహారములను, మణికుండలములను, బహుమతిగా నిచ్చెనట! తిమ్మనార్యుడా కుండలముల ధరించి యింటనుండగా నొక భట్టువచ్చి యాతని పొగడుచు:

౹౹మా కొలది జానపదులకు
నీకవితాశక్తి? యబ్బు నేరూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ నంది సింగయ తిమ్మా!"

యని తన వంటి యల్పజ్ఞులకు, అంతటి కవిత్వమెట్లబ్బునని చెప్పుటలో, తన్ను నూతిలోనుండు మండూకముతోడను, తిమ్మకవి కవితాశక్తి, మందాకినీ వీచికల చల్లదనము తోడను పోల్చెను. ఇందులకు మెచ్చి తిమ్మకవి యా భట్టునకు పారితోషికమీయక, సమయమునకు వేరేమియు గానరాకుంటచే చెవినున్న కుండలములలో

దానినియిచ్చివేసెనటమరునాడు వీరిరువురును రాజు… వ, జరిగినవృత్తాంతమునువిని, రాజాపద్యమునందలి… అను మాటకు 'నాక' యను మాటనుంచి 'నాకధుని శీకరముల చెమ్మనంది సింగయ… యను చక్కని మెరుగును బెట్టెనట. అంతట… సించిన యీ కవులిరువురను, తమ యొంటికంబపు… జతచేసి రాజుముందరనుంచి స్వీకరింపుమని… వారి సరసతను మెచ్చి రాజతనికి… ముల నొసగెనట! ఓహో, ఏమి యా… నే! ఏమి వారల భాగ్యము!

ఇవి నే చెప్పదలచిన కథలు. వాటి… పరీక్షనటుండనిచ్చి వాటి యంతరార్థములనే… వీటియందు కృష్ణదేవుని గంభీర విగ్రహ… కవితానురక్తి, అతని రసజ్ఞత, అతని… చక్కగ సూచింప బడియున్నవి.

కృష్ణరాయల యాస్థాన కవులగూర్చి… చాతుర్యముల గూర్చి కాని విస్తార మిచ్చుట… లేదు. కాని యొక్కటి మాత్రము చెప్పవచ్చు… తులవల్లనో పరమార్థము కొరకో ఎన్నెన్ని… సంపర్కమునొందు చున్నను ఎన్నిభాషల… యందు పాండిత్యమునంది, వాటియందే… చున్నను, ఆంధ్రుల కాంధ్రమునందుగల… ఎన్నటికిని తగ్గుటలేదు. తగ్గదు. ఇందులకు… మన భాషా సౌకుమార్యమే కారణ. మను చరిత్ర… జాతాపహరణాది, యుద్ధగ్రంథముల మోహన… యేమని చెప్పుటయందతిశయోక్తి లేశమాత్రము… తెనుగుభాష మాధురి అప్రతిమానము. లోకపు… ధ కవితా పితామహ బిరుదము'ను అల్లసాని… ని కొసంగిన యా రసికత్వము తోడనే, '… దు తెలుగు లెస్స'యను బిరుదమును ఆంధ్ర… సంగెను, కృష్ణరాయలు. అట్టి సుకుమారి… రతి. ఆల్లి క్రోడమును వదలి ఎచ్చట… మనము! ఈమె కధరా జ్యమును, సర్వ… …డ గౌరవమును జూపిన కృష్ణ…

హృదయ సింహాసనములం దర్ధరాజ్య గౌరవమునందుట క
వశ్య మర్హుడు.

ఈ ప్రబంధములనుండి యొకటి రెండు పద్యముల
నుదాహరింతమాయని యున్నది. కాని ఆరంభించినచో
నొకటి పదియయి, పది యిరువదియగు వరకు వదలుట
అశక్యము, గావున కష్టముతో నా కోరికను నిగ్రహించు
కొనుచున్నాను.

తలపెట్టిన ఏ కార్యమందు నపజయమునునది యె
రుంగక దిగ్విజయ పరంపరల నంది విజయనగర రాజ్య
మును విద్యానగర రాజ్యము నేకముగ నేలి రెండు నామ
ముల సార్థకముగ జేసెను కృష్ణరాయలని యిదివరలో నుడి
వితిని. శివుడు పార్వతిని తన యర్ధ శరీరము జేసికొని
పురుష స్వభావమగు పౌరుషమును, స్త్రీ సహజమగు కో
మలత్వమును ఏకము చేసి తన యందిమిడ్చుకొని ఆదర్శ
పురుషుడైనట్లు, కృష్ణదేవుడు ఒకవంక కవితను పోషించి
కృతులకు భర్తయై, వేరొకవంక రాజ్యము నేలి రాజాధి
రాజై, ఒకవంక శత్రు భీకరుడై, వేరొక వంక కవికల్ప
తరువై, ఒకవంక సకల రాజ్యాంగ వేత్తయై, వేరొక
వంక కవి వతంసుడై రాజుల కాదర్శుడాయెను. ఈతని
బోలిన వారలరుదు, రాజ్యము లేలిన వారలలో.

ఈ సంగతులన్నియు నెంచిచూడ నాశ్చర్యము దో
చును, కృష్ణదేవుని కాలమందు విజయనగర మెట్లుండెడిదో
యని. మనుచరిత్ర కృతినందిననాడు యెంతశోభావంతము
గానుండెడిదో రాజసభ, యనుపించును! ఒక్కొక్క కవి
యేతెంచినప్పుడు, ఎట్టి యుత్సాహ కోలాహలము జనిం
చియుండెడిదో పట్టణమున! ఆ కవి దిగ్గజములు వీథులం
దిరుగాడునపుడుగాని, సాయంతన సంధ్యావందనములకో,
శీతవాయు చుంబనములకో తుంగభద్రా తీరమునకుం
బోవునపుడుగాని, రాజదర్శనార్థమై నగరులోని కేతెంచు
నపుడుగాని, విజయనగరపు వీథులు, తుంగభద్రాప్రశాంత
తరంగములు, రాయల హర్మ్య ప్రాసాద ప్రాంతములు,
ఉత్సాహముతో నూగుచుండెడివి కాబోలు! అట్టి మహా
మహుల నందరిని యొక్కసారి యెట్లు ధరించినదో యీ
నగరము! రాయలు రాజాగ్రణుక నే యనువైనదా కవిపూజ.
నిశ్శంకముగ, నవలీలగ నగ్రహారముల కనకరాశుల గురి
పించెడు దాతలుండుట చేతనే సరస్వతి తాండవమాడి
నది పురమున, నారోజులందు.

అంతయు పోయినదిగదా, మటుమాయమై యిపు
డు! అయ్యో, కండ్ల నశ్రుధారలు కారునే, అచ్చోటికి
బోయి ఆ నాశనమును జూడ, ఆ సరస్వతీ కేళీ గృహ
మిప్పుడు స్మశాన వాటికను బోలి భయావహమగుచున్నది.
ఏబండమీదనో యొక గోపురమును జూపి తెనాలి రామ
లింగని గోపురమందురు, ఏ మూలనో యొక దిమ్మను
జూపి రాయల గద్దెయుండిన స్థలమందురు, సభలు దీర్చిన
సావడియందురు. మొండి మొగము! రాళ్ల మయము!
రాత్రుల నక్కల, కోతుల, లంబాడుల యెల్లరులు! ఎం
దరు కవులు గానము చేసిరో యా చోటులందు. పోయి
నవి! అన్నియు పోయినవి!! కృష్ణరాయుడు పోయినలోప
నే బోయినవి; తమ్మేలిన ప్రభువు వెంట. నేటికిని వెరప
గును. ఆ చోటులందు నడువ భయభక్తులు దోచును. ఎట్టి
ప్రాంతములవి! అందున్న కాలమంతయు పెద్దన పద్య
ములే జ్ఞప్తికి వచ్చును; రామలింగని వింత కథలే మనసున
మసలుచుండును. కవితాలక్ష్మి ఆ చోటుల వదలిపోయి
నదందురే కాని అదియును సరికాదు. ఇప్పటికైనను
యొకతూరి, యా తుంగభద్రా తటమున, సాయంతనవేళ
కోదండరాముని యాలయ ప్రాంగణమున, చల్లగాలి వీల్చు
చు కూరుచుండి, ఎదుట కొండగుట్టలు, దూరమున విరిగి
పడిన పూర్వపు వంతెనలు గన్పట్టుచుండ, నది గర్భమునం
దలి బండల ప్రక్కనుండి జలజలలాడుచు జలములు ప్రవ
హించుచుండ, ఏ మొరకునకు హృదయము చలింపదు?
ఎవ్వాని హృదయ కుహరమునందొక వింత వికాసము
తోపదు? తిరిగి అచ్చటి యా కమల మహాలును గాని,
జలక్రీడలకై, నిర్మింపబడినయా స్నాన గృహముల గాని
దర్శించుతరి భావమెన్నెన్ని రీతుల నెగరదు. ఈ భావో
ద్రేకమందు గాక, కవితాంకురము లింకెందు గలవు? కవి
తాలక్ష్మి కదలిపోలేదు. ఆ ప్రాంతముల వదలి యుండ్లే
దను, రాత్రైనను, వదలదా చోట్లను. హంపి బోవు వారికి
రాళ్ల గుట్టల యందచ్చటచ్చట కొన్ని చారల జూపి,
రావణుడు సీతమ్మ నెత్తుక పోవునపుడు, ఆ ప్రాంతము

నుండి భోయెననియు, నాను చీరచెరగు, భూమిని ప్రాలి ఆట్లాడవాలు పడెననియు నందురు. ఇంకొక మూల జూపి, ఆమె నగల మూటగట్టి భూమిని విసర నచ్చో పడెననియుందురు. సీతమ్మ అంత ఆస రాతిని మించిన పదనుగల అంచు చీరను గట్టినట్లు చెప్పుట నాకిష్టము లేదు కాని, కృష్ణదేవుడును, తన కవి దిగ్గజములును భూమిని వదలి పోవునపుడు మాత్రము, తమ కవితామృతధారల నందంతను జిలికి పోయిరని చెప్పవలసియున్నది. ఇప్పటికిని అంత భావోద్రేకమును గల్గించుశక్తి యా వాతావరణమునం దున్నది. హంపికి బోవుచో అమితోత్సాహము కలుగును. (సుఖము మాట ఒకక్షణము మరచిన యెడల) బండరాళ్లలో, ఆ ముండ్లతుప్పలం గుల్ల గర్భాలయము లందిప్పటికిని అమూల్యమణులు పడి యున్నవం దురు. నా కవి కనుపించలేదు. కాని, వాటినిమించిన భావమణులు, జిగ్ జిగ్ మనుచు, ప్రతి సందులను ప్రకాశించుచున్నవచట.

ఇవే, కృష్ణరాయ లేనుగు లెక్కి యూరేగిన చోట్లు?
ఇవే, పెద్దనతిమ్మనాదులు నడచిన వీధులు!!
ఇవే, కవిగాయక ప్రసంగములతో ప్రతి ధ్వనించిన ప్రదేశములు!

అని ఏమోయొక వెర్రి ఆనందము పుట్టును. అయితే ఏమున్నది, దానియం దందురు కొందరు. ఏమిటో! ఏదియో యొక చెప్పలేని యుద్రేకమున్నది. ఎట్లు చెప్పుట దానిని? అవర్ణనీయమగు దానిని వర్ణించుటెట్లు? ఇచ్చటి కవితాలక్ష్మి మన హృదయములం జేయు పర్యటనమే అయి యుండవలెను!

రవీంద్రనాథుడు 'ఆకలిగొన్న రాళ్లు' (Hungry Stones) అను కథను వ్రాయుచు, మితిమీరిన భోగముల కాలవాలమయిన యొక సౌధాంతరమున నిప్పటికిని ఆ భోగముల శక్తి అద్దాని శిలల కూడ నాశ్రయించి వదలుట లేదని వర్ణించి వాటి యాకలి దీర్చినాడు. అట్లే విజయనగర సామ్రాజ్య స్మశానమగు హంపియందు కూడ, కవితాశక్తి సహస్ర పాదములతో సంచారము చేయుచున్నది. ఆ చెట్లయందు పుట్టయందు, నలుని వీడిన దమయంతివలె, వెర్రిదై, దీన హృదయయై, విలపించుచున్నది. ఆత్మశాంతిలేక, బ్రోచువారు లేక ఆందోళన గాంచుచున్నది. ఏ ఆంధ్ర రవీంద్రుడో కదా, ఈ యాకలి గొన్న శాలల కాకలి దీర్చుట! ఈ యాందోళితాత్మకు శాంతి నొసగూర్చుట!

అంతటి యనుపమాన ప్రభతో విరాజిల్లినది విజయనగరము, కృష్ణదేవుని కాలమందు, గానములతో, సన్మానములతో.

ఆ విజయ నగర సామ్రాజ్యలక్ష్మి, ఆ యాంధ్ర కవితా లక్ష్మి చచ్చిపోలేదు. స్వరూపము మాత్రము మారినది. నేటికిని హంపి యందొక మూల సగము మాత్రము కట్టబడి, మిగిలిన సగమట్లే పడియుండిన ఒక విజయద్వారము కానవచ్చును. ఆ పడియుండిన రాళ్లను జూడ, పనివార లింటికి బోయిరి కాబోలు, ఇప్పుడే తిరిగివత్తురని పించును. నిజమే. ఇప్పుడే వచ్చెదరు! కాల చక్రభ్రమణమునందు నాలుగువందలేండ్లేమి లెక్క? ఒక చిన్నచిటుకు! వారి మాట కేమి గాని, వచ్చును, కవితాలక్ష్మి తిరిగి ఆంధ్ర హృదయములలోనికి వచ్చుచున్నది, అప్పుడే వచ్చి వదంతందు. ఈ ౧౦, ౧౫, సంవత్సరములలో కురిసిన నవలలు, నాటకములు, కథలు, కల్పనలు; ఇప్పుడిప్పుడు బయలు దేరుచున్న ఆంధ్ర యువకుల భావగీతములు, వేణుగానములు, మన ఏకాంతసేవలు, ప్రణయ సమర్పణలు, సాహితీ సమితులు, శకుంతల సంతానములు, భారతులు, సుజాతలు అన్నియు నా లక్ష్మి అందెల మ్రోతలే! ఆంధ్రమాతకు తిరిగి అదృష్ట దినములాసన్నమయినవి. విజయ నగర రాజ్యము, విద్యానగర భాగ్యము, తుంగభద్రా తటముననే నిలచియుండిన చాలదని, మారుతరూపధారణము జేసి, ఆంధ్రవాతావరణమున తాండవమాడుచున్నది. పూర్వము విస్తృతమైనది, యిప్పుడు సంక్షిప్తమై అగాధమైనది. పూర్వము బహిర్గతమైనది, ఇప్పుడంతరీకృతమైనది. స్థూలము సూక్ష్మమైనది. ఇదే పైన చెప్పిన స్వరూప భేదము. ఇందులోనే పరిణామ తత్వమున్నది.

ఇపుడు కృష్ణరాయల కవితా పాండిత్యములను గూర్చి అతిక్లుప్తముగ విచారించి యీ వ్యాసమును ముగించెద

ను. కృష్ణరాయలు కవుల నాదరించి కవితను పోషించిన రీతి జూచితిమి. ఇతర రాజులును చేసిరీ కార్యముల, వాటి నే కొంత ఘనతరముగు రీతిని ఈతను గావించెనని చెప్ప వచ్చుకొందము. కాని, ఈతనియందు కొంత విశేష మున్నది. ఈతనికీర్తి ఈయొక్క విషయము మీద నేకాదు ఆధారపడి యున్నది. కృష్ణరాయలు చేసినది, కవులసభలకు రప్పించి, గానముల నాకర్ణించి, తలయూపి, భళీ, యని వారిని సన్మానించుట యేకాదు. వారిచే జేయించిన ఆభరణముల భాషాజననికి సమర్పించి, తనవి దీరక తానును కవియై దనమోపినకొలది, స్వయముగ పూజయొనర్చెను స్వహస్తములతో కవితాలక్ష్మి గర్భాలయమున.

"సప్తసంతానములలో ప్రశస్తి గాంచి, ఖిలముగా కుండునది యొక్క కృతియె గాన, కృతిరచింపుము మాకు శిరీషకుసుమ పేశల సుధామయోక్తుల పెద్దనార్య" అని పెద్దనార్యునిచే మనుచరిత్రము వ్రాయించుటయేగాక దాను స్వయముగ సంస్కృతాంధ్రములయందు కృతుల రచించిధన్యుడాయెనని ఆముక్తమాల్యద యందు గలదు. కాని ఈతని సంస్కృత గ్రంథము లేవియును ఇప్పుడు గానరావు. ఉన్న ఆ ఆముక్తమాల్యదయైనను ఈతనిచే రచింపబడక, పెద్దనార్యునిచే నాతని పేర రచింపబడినదని కొందరి యూహ. కాని వీరేశలింగముగారు, తమ కవుల చరిత్రయందు ఈ విషయమును విమర్శించి కృష్ణరాయలే యీగ్రంథము వ్రాసినట్లు తమ యూహయని వెల్లడిచేసిరి. తరువాత ననేకులుకూడ వారితో నేకీభవించి, తమ యభిప్రాయములతో నేకీభవింపవారిపై వీరేశలింగముగారు కూడ చూపని ఆగ్రహమును జూపుచు కొన్ని వ్రాతల వ్రాసిరి. ప్రస్తుతము మనకీ విమర్శనలతో గాని, యాగ్రహ (దురాగ్రహము లనుటకూడసాహసము గాదు) ములతో గాని, యీ విమర్శఖండనములతో గాని, యీ ఆగ్రహ నిగ్రహములతో కాని పని లేదు పనిపెట్టుకున్నను త్వరలో దీరునదిగాదు. గావున మనమా జోలికి పోవలదిపుడు. సందేహములు జనించిన దానికి కారణము, సాధారణముగ భూమినేలు రాజులు చిన్ననాట గారాబమున, ఐశ్వర్యమున బెరుగుట చేతను, పెద్దనాట రాజ్యాంగ వ్యాపారములందు నిమగ్నులై యుండుటచేతను, విద్యా సంపాదనమునకు, తద్వినియోగమునకు, అవకాశములు లేనివారై యుండుటను సాధారణ విషయమై యుండనోపు. అందును, ఆముక్తమాల్యద సాధారణ గ్రంథము కాక, మహా ప్రబంధములలో చేరినదగుటచే సందేహము బలీయమయి యుండవచ్చును. ఇందు సంస్కృత భూయిష్టములౌ పద్యము లెన్నియో గలవు. ప్రబంధలక్షణములు మన్నింప బడినవి. అచ్చటచ్చట శైలి కటువు గన్పట్టినను, వ్యాకరణ దోషములున్నను, వర్ణనలు స్వాభావికములై, పద్యములర్థ గాంభీర్యము గలవై మృదుమధుర పదగుంభితములై యున్నట్లు, వీరేశలింగముగారే వ్రాసిరి. గావున యిట్టి యుద్గ్రంథమును వ్రాయుటకు వలయు సాధన సంపత్తి నేవాట సంగ్రహించెనో కృష్ణరాయలని సందేహము జనించుటయు సహజమే! వీరేశలింగముగారు చేసిన ఖండనయు సవిస్తరముగాక యున్నదనే తోచును. స్తనశల్య పరీక్ష జేయు యీయన యీ విషయమున నెవరో రెండు మూడు పుక్కిటి కథలను ఖండించియు, ముక్కు తిమ్మన కృష్ణరాయని "కవితా ప్రావీణ్య ఫణీశా!" యని తన పారిజాతాపహరణమునందు సంబోధించెననియు, పెద్దన కవిత్వమునకును ఆముక్తమాల్యదలోని కవిత్వమునకును భేదమున్నదనియు ఆముక్తమాల్యదలో కృష్ణదేవుని చేతనే యా గ్రంథము వ్రాయబడినట్లున్నదనియు జూపి, కృష్ణరాయల కృతియే యీ గ్రంథమని సిద్ధాంతీకరింప జూచుట అంత తృప్తికరముగ లేదు. ఇంకయు నెన్నో యున్నవి పరీక్షించుటకు ఈవలి పక్షము వారికి పూర్తిగ న్యాయము జరుగకయే యీ అంశము నిర్వివాదాంశమయినట్లు భావింప బడుచున్నదేమోయని తోచుచున్నది. ఈ విమర్శ వేరొకప్పుడు జూచుకొనవచ్చును గాని, ప్రస్తుతమీ విషయములో సంబాధము లేకయే కృష్ణదేవుడు తప్పక పండితుడును కవియును అని తలపవచ్చును. ఈ గ్రంథమును పైవారెవరైన వ్రాసి కృష్ణరాయని పేరు పెట్టిరని యొప్పుకొన్నను, యాతనికి కవితాశక్తి యున్నట్లు ఈ విషయముననే సహాయముగ దీసుకొని జూపవచ్చును. ఏలయన, చాకలి పేరిగానిని ప్రతాపరుద్రునని జెప్ప నేయుగంధరుడో సాహసించును గాని (వినను ముఖములందత్యంతము పోలికయుం

డుటచేతనే నతడైనట్లు సాహసించినది) అక్షరజ్ఞానములేని వానిని పండితుడని చెప్ప నెంత సాహసియు సాహసింపడు. గనుక ఆముక్తమాల్యద వ్రాయునంతటి మహాపాండిత్య ప్రకర్ష లేకపోయినను, అందర్థాంశమైనను కృష్ణదేవున కుండియుండ వలెనని యూహింపవచ్చును. అదిచాలు అసంఖ్యాకములగు రాజ్యవ్యాపారములందును, నిరంతర దండయాత్రాదులందును మునిగి తేలుచుండెడి రాజునందు మనకు విభ్రమ గౌరవముల కల్గించుటకు. హృదయమునందు కవితాంకురములే లేకపోవుచో నంత కవి సన్మాన మెట్లు చేసి యుండును. ఆంగ్లఋషి 'కార్లైల్', మహాశయుడు చెప్పినట్లు ఇతరులయందలి గుణముల గ్రహించుటకు మనయందుకూడ నాగుణముల లేశమయినను లేనిచో దుస్తరము. కవి చక్రవర్తి కనుకనే, అఖండ గౌరవమును జూపెను, కవితకు కృష్ణరాయలు.

N.B. ఆముక్తమాల్యదను గురించి విస్తారము వ్రాయుచుంటకిది సమయముగాదు. గావున నా కార్యమునకు గడంగుటలేదు. కృష్ణరాయలుకవియని స్థిరపరచుకొంటిమి. అదియచాలు. అతని చిత్రపటము- ముఖ్యముగ వశార్యాధుడైయున్న యాతని చిత్రపటము చెప్పక చెప్పు నీసంగతిని. దానింజూడ నొక పండితుని దెచ్చి కూర్చొన బెట్టెరా, విజయనగర రాజ్య సింహాసనమున అనిపించుచు, విద్యయొసంగు యా యున్నత కళ తప్పక యొప్పుచున్న దాముఖమండలమున. ఇతడట్టి పండిత చక్రవర్తి యగుటంజేసియే కాబోలు దిగ్గజముల వంటి కవులేకాని సాధారణు లీతని జేర సాహసించినట్లు వినము. కృష్ణరాయలే గాక, యాతని కుమార్తెలును, సంగీత సాహిత్యములందు నిపుణురాండ్రనియు, అందు మోహనాంగి యనునామె మరీచీపరిణయమను గ్రంథమొకటి వ్రాసెననియు ప్రతీతి గలదు. ఈకథలన్నిటి యందును ఒకటే సత్యము. అది కృష్ణరాయని పాండిత్య సాంప్రదాయ ప్రకటనమే.

ఇట్టి ఘనుడు కృష్ణదేవరాయలు. యుగమునకొక్కడు ఇట్టిధీశాలియుదయించుట యేదేశమునందైనను యేమినోముల నోచినదో ఆంధ్రమాత, అసమాన తేజోరాశుల గన్నది. యనేకుల. అగ్రగణ్యుండందరిలోను, సుప్రతిభాశాలి "ప్రబల రాజాధి రాజ వీరప్రతాప రాజ పరమేశ్వరాత్థ దుర్గానటీశ సాహితీ సమరాంగణ సార్వభౌమ, కృష్ణరాయేంద్ర చంద్రు,, డప్రతిమ యశుడు.



# నిరీక్షణము

'భూషణం'



లలితపు తమ్మి రేకుల విలాసములన్ గికురించు పాల బు
గ్గల పయి పుల్కరించెడి నిగారపు పిన్నని మందహాసముల్
దలకొని యొక్కటొక్కటిగ ద్రావుచు తన్మయతన్ మనోజ్ఞమా
చెలియ మనోహరంపు నును చెక్కిళులన్ శయనించు టెన్నడో!

కలికి పిసాళి నవ్వుల వికాసము క్రేవల శార నీక క్రొం
దళుకుల నిగ్గు లన్నియును దార్చి మనోగత సీసు యందు సొం
పులు విరజిమ్మ, తత్ప్రణయ పూరిత నిర్మల భావ మెల్ల వె
న్నెల వులుగాచు దాని నెర నీటుల గ్రోలుట యెన్నడో గదా!!

జిలిబిలి పల్కులన్ వలపు జిల్కెడి నిద్దపు వాలు చూపులన్
తెలిచిఱు నవ్వులన్ కడు విధేయత జూపెడి ప్రేమ భాగ్యముల్
చెలియ మెఱుంగు నెమ్మొగ విశేషమునన్ దిగజారి యున్మనో
ఫలకము నాశ్రయించె నను భాగ్యము నేకుదు టెన్నడో! గ—!!

అలతి పిసాళి చూపుల నొయ్యార దువారములన్ గమించి నె
చ్చెలి హృదయార్ద్ర సేచన సుచేతను క్రేవల ప్రీతి పొవ్వు చం
చలమగు జీవిత ప్రణయ సారము తీయని తెన్గు పాటలో
గలపి తదీయ భావముల గానము జేయుట యెన్నడో గదా!!

(తొలి పూత నుండి)



# ప్రాచీనార్యులలో వర్ణవ్యవస్థ

సురవరము ప్రతాప రెడ్డి, బి. ఏ. బి. యల్.



హిందూమతము వ్యాపక మతము (Proseletysing religion) కాదని నేటి హిందువుల యాచార వ్యవహారముల గమనించువారు చెప్పుచున్నారు. ఇది హిందూమత శైథిల్య చిహ్నము గాని వేరుకాదు. ప్రాచీనార్యులలో నిట్టి సంకుచిత భావము అంతగా లేకుండెననియే భావింప వలయును. ప్రపంచముయొక్క సర్వభాగములందు సముద్రవ్యాపారము చేసిన కాలమందుగాని, దూరదూర దేశములందు విశాల భారతిని (Greater India) నెలకొల్పిన నాడుగాని ప్రాచ్యప్రతీచ్య దేశములందు మత బోధలు చేసి హిందూ బౌద్ధమతములలోనికి దద్దేశీయుల బరివర్తనము (Conversion) చేసిననాడుగాని ప్రాచీనార్యులలో, నేటిరీతి జాతివైషమ్యము, హ్రస్వదృష్టి హృదయ దౌర్బల్యము, సాంఘిక పతనము లేకుండెను.

హిందూ మతమందు జేరిన స్త్రీ శూద్రులు వేదమును విన గూడదు, చదువగూడదు అను కుత్సిత తర్కము లీమధ్యకాలముననే బయలు దేరెనుగాని ప్రాచీనకాలమందు లేకుండెను. క్రీ. శ. ౧౯౦౭ వ సంవత్సరమున జర్మన్ పండితుడగు హ్యూగోవింక్లర్ కనిపెట్టిన బోగజ్ కోయి (Beghaz Keui) అను శాసనమందు కపదోషియ దేశమందు అనార్యజాతులగు హిట్టైవారును, మిట్టన్నిజాతివారును సంధి కుదుర్చుకొని నప్పుడు మిత్ర, వరుణ, ఇంద్రాది దేవతలను సాక్షులుగా గోరికొనిరనియు, ... డుజాతుల రాజులు బాంధవ్యమును గుదిర్చికొని ... ములజేసికొను కాలమున 'నాసత్యుల' (అశ్వినుల) ... పూర్వకముగా నాహ్వానించిరనియు నున్నది. ఎక్కడి ... డోసియా? మరియెక్కడ నార్యావర్తము? ఈ గ్ర ... ములోని విషయములు క్రీస్తునకు బూర్వము ... సంవత్సముననాడు జరిగెను. అంతటి ప్రాచీన కాల ... వేదమతమెట్లు ప్రచారము చేయబడెనో యూహిం ... వచ్చును.

బౌద్ధ మత ప్రచారము నానా దిగంతము ... ప్రచారము గావింపబడెనో చరిత్రజ్ఞులకు విదితమే ... లయొక్క ప్రాచీన గ్రంథములగు "జాతక ... హిందూవర్ణ వ్యవస్థను గురించిన విషయము ... కలవు. రిస్ డేవిడ్సు పండితుడు తన (Budhist India) గ్రంథమున నిట్లు వ్రాసియున్నాడు "ఈ గ్రంథ ... హరణముల వలన నా కాలమున జాతులలో సమ్మిశ్రణము ధారాళముగా జరిగెనని విశద మగుచున్నది:—

౧. ఒక క్షత్రియుడు క్రమముగా కుమ్మరి వాని దగ్గఱ, మేదరవాని దగ్గఱ పుష్పలావిక దగ్గఱ; వానిసీని దగ్గఱ, పనులను నేర్చుకొనెను. కాని వానికి కులముతప్పు పట్టిన వారెవ్వరును లేరు. (జాతకము ౨, ౫, ౪౯౦)

౨. ఒక రాజు రాజ్యము వదలి బేరి యయ్యెను. (జాత. ౨, ౭౩)

౩. ఒక బాపడు వ్యాపారము చేయుచుండెను. (జాత. ౪, ౧౫)

౪. బ్రాహ్మణులు, వేటకాండ్రు (బోయలు)గా, పసుల కాపరులు(గొల్లలు)గా, నుండిరి. (జాత. ౨, ౨౦౦)

౫. ఒక క్షత్రియుడు వదలి పెట్టిన భార్యను బ్రాహ్మణుడొక్కడు పెండ్లియాడెను. (జాత. ౫, ౨౭౦)

పై యంశములవంటి వనేకములు వందల కొలదిగా జాతకములందు పరిశోధించువారికి గోచరించును. అకాలమున మొదటి తరగతిలో క్షత్రియులను, రెండవ తరగతిలో బ్రాహ్మణులను, జైన, బౌద్ధ లుంచినట్లు తెలియును స్మృతి, జాతకములలో బ్రాహ్మణులు హీనజాతి (హీన జచ్చో-పాళి) వారుగా ననేక స్థలములందు సంబోధింప బడియున్నారు. జైన గ్రంథములలో క్షత్రియులే యగ్రజాతివారనియు, వ్రాసినట్లు రిస్ డేవిడ్ పండితుడు సెలవిచ్చి యున్నాడు. ఈ సందర్భమున ప్రాచీ నార్యులతో కలసి మెలసియుండి కొంత కాలమునకు భిన్నాభిప్రాయులై వేఱపడి ప్రస్తుత పర్షియా దేశము నకేరిన జరత్వష్ట మతమువారగు పార్సీల భాషలోని కొన్ని పదముల విమర్శనము గమనింప దగియున్నది.

ఆధునిక ఉర్దూపండితులగు అజాద్ గారు తమ "సఖున్ దానె ఫారిస్ (سخندان فارس) అను గ్రంథమున ౭౬వ పుటలో నిట్లు వ్రాసి యున్నారు:—

"ఆర్య:—విచిత్రమేమనగా పర్షియా దేశపు ప్రాచీన గ్రంథములలో ఆర్యకు లేక ఈరాన్ పదమునకు జ్ఞాని (ار) పెద్ద మనుష్యుడు (شریف) మఱియు తెలివిగలవాడు అను నర్థములు చేసియున్నారు.

జాండాల్:—ఫార్సీలో పనికి మాలిన వారి గుంపునకు, నీచునకు, మరియు త్రాగుబోతునకు అర్థము చేసి యున్నారు. సంస్కృతములో నీచుని "చండాల"యనిపిలుతురు. ఈ జనులు మొదట కల్లు గీయుచుండిరి. పందుల మేపుచుండిరి. మఱియు సర్వవిధములగు నీచకార్యముల చేయుచుండిరి."

హిందువు లితర మతస్థులను తమ మతములోనికి దీసికొనవచ్చునా, యను ప్రశ్న నేడు చాల చర్చింప బడుచున్నది. అనాది ప్రశ్నయే లేకుండెను. ఇతర మతస్థు లనేకులు హిందువులై యుండిరి. కపడోషియాలోని జాతులు వేదకాలపు దేవతల బూజించుచుండిరని నివేదించి యుంటిని. ఆ జాతులను నార్యులు మ్లేచ్ఛులని వ్యవహరించుచుండిరి. మ్లేచ్ఛులన సాధారణముగా ముసల్మానులని వ్యవహరింతురు. అది తప్పు. సుమారు ౨౩౦౦ సంవత్సరముల క్రిందట నుండిన పతంజలి మహర్షి తమ పాణినీయ మహాభాష్యములో పశ్పశాహ్నికములో. వ్యాకరణమును జదువుటవలని ప్రయోజనములలో నొకటిగా "మ్లేచ్ఛో నావ భాషితవై" యని యుదహరించి యున్నారు. అనగా మ్లేచ్ఛులవలె మాట్లాడకుండుటకై, వ్యాకరణము చదువ వలెను అని భావము. అనగా మ్లేచ్ఛులు సంస్కృతముకన్న వేరగు భాషను వ్యవహరించుచుండిరనియు, నయ్యది యపభ్రంశముగా నుండెననియు, నట్టి భాషను మాట్లాడుజాతులు మ్లేచ్ఛులుగా బరిగణింప బడుచుండిరనియు నీజాతులుకూడ హిందూ మతమును స్వీకరించి యుండిరనియు విశదమగును.

అలెగ్జాండరు కాలములో గ్రీకుదేశమునకు ఆర్యావర్తమునకు నుండిన సంబంధము అలెగ్జాండర్ చక్రవర్తి మనదేశముపై దండెత్తివచ్చి పోయిన తర్వాత నింకను విశేషమయ్యెను. చంద్రగుప్తుడు (క్రీ. పూ. ౩౩౦—౨౯౮) దనపై దాడివచ్చిన గ్రీకుసేనానియగు సెల్యూకస్ నికేటర్ అనువానిని యుద్ధమందోడించి వానినుండి కెడ్రోషియా, ఏరియా, అరకోసియా మున్నగు రాష్ట్రములను లాగి కొనెను. క్రీ. పూ. ౩౦౦ వ సంవత్సరమున నీ గ్రీకు దేశీయుడగు సెల్యూకస్ బిడ్డను పెండ్లియాడెను. ఒక హిందూ

చక్రవర్తి యొక యవన స్త్రీని పెండ్లియాడిన నాక్షేపించిన వారే లేరు.

కాళిదాసు తన శకుంతలా నాటకములో నొక రంగమందు దుష్యంతుడు యవన స్త్రీలచే పరివృతుడై కణ్వాశ్రమమున వేటాడినట్లు నిరూపించినాడు.

"విదూషకుడు:— ఏష ఖలు బాణాసన హస్తాభి ర్యవనపుష్పమాలా ధారణీభి ర్యవనీభిః పరివృత ఇతఏవా గచ్ఛతి వయస్యః!" దీనివలన కాళిదాసు కాలములో జాల యవన స్త్రీలను దాసు నగరులందుంచి యుండిరని యూహింపవచ్చును. యవన పదము ఆయోనియన్ దేశీయులకు [Greek] సంస్కృతములో వాడి యున్నారు.

కీ. శే. ఆచార్య భండార్కర్ గారు ౧౯౧౧ లో నిట్లు వ్రాసియుండిరి.. "చిత్ర మేమన విదేశీయులు హిందూ మతమును స్వీకరించినదే కాక కొందఱు హిందూ నామములను గూడ బెట్టుకొనిరి. ఇండో పార్థియన్ శాఖకు మూల పురుషుడగు గొండఫేరిస్ తన నాణెముల పై నొక ప్రక్క త్రిశూలధారియైన శివుని విగ్రహమును, చెక్కించి యుండెను, ఇదే ప్రకారము వేమకాడ్ఫిసీస్ అనువాని నాణెములపై శివవిగ్రహము లున్నవి. కనిష్క, హువిష్క, వాసుదేవ, అనువారు వైవాని వంశీయులు. వీరు సిథియన్ జాతివారైనను హిందూ నామముల ధరించిరి. మఱియు సోఫిటీస్ అను గ్రీసు దేశీయుడు తనపేరును సౌభూతి యని మార్చుకొనెను.

కాంబోడియా దేశమును ఆ దేశీయులు ఫునాన్ అని యందురు. దీనినే సంస్కృతమున కాంబోజ యని వ్యవహరించిరి. క్రీ. శ. ప్రథమ శతాబ్దములో హున్ టైన్ అను బ్రాహ్మణుడీ దేశస్థులను హిందూ మతములోనికి పరివర్తనము చేసెను. ఈ హున్ టైన్ అనువాడే 'కౌండిన్యుడు' అని పండితులు నిశ్చయించినారు. కాంబోడియా దేశములో నీప్రకారమొక గాథకలదు: అచ్చట నొక రాణి 'యేలియో' యను చిన్నది రాజ్యము చేయుచుండెననియు, దానిని జయించి కౌండిన్యుడు పెండ్లియాడెననియు తర్వాతి రాజులు వీరి సంతతియే యనియు నీగాథ చెప్పుచున్నది.

కుషనులు, హూణులు అను తెగలు ప్రసిద్ధులై యుండెను. క్రీ. శ. ౩౯౯—౪౧౪ కాలముల మధ్య నీ తెగలు హిందూమతములో చేరిపోయెను. కుషన్ వంశమునకుఁ జేరిన కనిష్క రాజు సంస్కృత వాఙ్మయ ప్రియుఁడు బాగుగాఁ దెలియఁ దగినవాఁడు. జగద్విఖ్యాతుఁడగు చరక పండితుఁడు (వైద్య గ్రంథకర్త)ను, కాత్యాయని పుత్రుఁడును, నితని శిష్యుఁడగు అశ్వఘోషుఁడును, నీరాజు నా శ్రయించి యుండిరి.

కచయను దేశము పాలించిన రాణి కుమారజీవుఁడను హిందూ యువకుని ప్రేమించి పెండ్లియాడెను. వీరికి కుమారజీవుఁడు అను కొడుకు జనించెను. ఈతని వాని దల్లిదండ్రులు కాశ్మీర దేశమునకుఁ బంపిరి. వీడు క్రీ. శ. ౪౧౩ సంవత్సరములో మరణించెను.

తిబ్బెట్టు దేశము (త్రివిష్టపము)ను క్రీ. శ. ౬౫౦ నుండి ౬౯౮ వరకు పాలించిన గంపో యనురాజు నేపాళ దేశపు రాజుబిడ్డను, చీనా దేశపు కన్యకను, నిద్దఱను పెండ్లియాడెను; కాని హిందూ రాజగు నేపాళరాజు నితనిని వెలిబెట్టినవారు లేరు.

సముద్ర ప్రయాణము హిందువులు చేయకూడదని కొన్ని తప్పుడు శాస్త్రములు కలవు. కాని ప్రాచీన కాలముచుండి మొగలు రాజుల ప్రభుత్వము వఱకు—పదునాఱవ శతాబ్దాదివఱకు హిందువులు సముద్ర వ్యాపారము చేసినట్లు వేనవేలు నిదర్శనములు కలవు. అదృష్టకాలము మారిన తోడనే స్వాతంత్ర్యము, దేశసంపద, ఆత్మగౌరవము అన్నియు నశించెను. కథా సరిత్సాగరమందలి కథలు అనేకములు సముద్ర సాహసములను సూచించుచున్నవి. నేటి యు ఈజిప్టు దేశపు శవముల (Mummies) ను బట్టలతో కప్పినది భారత దేశము. గ్రీకు దేశములోను, రోము యొండ్ల క్రిందట వ్యాపారము చేసినదియు, ఇటలీ దేశ సంపదను జూరగొనినదియు, జావా, బలి, బోర్నియో, సుమత్రా దేశములతో సంబంధములు చేసినదియు, ఈ భారత దేశమే! చీనా దేశములో బౌద్ధమత వ్యాప్తి చేయుటకు పండితులా దేశమున బోధించి వచ్చిరి. క్రీ. శ. ౬౦౦ లో తంగ, ధర్మరక్ష, అనువారు చీనాలో ప్రచారము చేసిరి. జావా మున్నగు ద్వీపములలో, హిందూ దేవాలయము

భారతమువంటి హిందూ పురాణములు నేటికిని హిందువుల ప్రాచీనౌన్నత్య నిదర్శకములుగా వెలయుచున్నవి. క్రీస్తునకు పూర్వము ౧౫౦ సంవత్సరముల నాడు (అనగా ౨౧౦౦ ఏండ్ల క్రిందట) ఒక యవన (గ్రీసు) రాజు వైష్ణవ మత మవలంభించెనని ప్రసిద్ధమైన బాస్నగర్ శాసనము ప్రపంచమునకు నేటికిని చాటుచున్నది. మఱియు మిళింద పంథ (Questions of minondar) యను గ్రంథములో బౌద్ధబోధ లున్నవని పండితుల యభిప్రాయము.

సూత్రకాలము హిందూ మతముయొక్క క్షీణదశను సూచించు కాలము. ఈ కాలమందే యెవరికి దోచినట్లు వారు శాసింప మొదలిడిరి. ఈ కాలమందే అనులోమ ప్రతిలోమ వివాహములు నిరూపింపబడి సవర్ణ వివాహములు, సవర్ణ భోజనములు విశదీకరింప బడెను. ఈ కాలమందే శూద్రులను, స్త్రీలను, అస్పృశ్యులను కఠినముగా నన్యాయముగా జూడ మొదలిడిరి. అయినను నచ్చటచ్చట కొన్నిసూత్రములలో వర్ణభేదము లంతగా పాటింపకుండిన విషయములు గొన్ని గోచరించుచున్నవి. ఒక యుదాహరణమును జూపెద: ఆపస్తంబ సూత్ర గ్రంథములో ప్రశ్న ౨, పటలము ౨, ఖండము ౩, సూత్రము ౪, ౫, ౬, ౭, ౮, ౯ జదివినచో నందు శూద్రులచే వండబడిన యన్నమును పైమూడు జాతులవారు భుజించుచుండిరని తెలియగలదు.

శంఖ లిఖిత స్మృతి యందు హిందువులను మ్లేచ్ఛాదిజాతులు బలవంతముగా తమ తమ మతములో చేర్చుకొనినట్లైన వారిని మరల ప్రాయశ్చిత్తముతో హిందువులనుగా జేయవచ్చునని ప్రమాణములున్నవి. మతాంతరములో జేరిన వారిని మొన్న మొన్నటివఱకుకూడ హిందువులు పునస్స్వీకారము చేయుచుండిరి. "క్రీ. శ. ౧౭౫౬ లో బసాలత్ జంగ్ అను నతడు ఆదోని నవాబుగానుండెను. ఇతనికి-పత్తికొండ పటేలు పట్వారీలగు సోమిరెడ్డి, పంగనామాల చిన్నతిమ్మన్నయను వారు పన్నులు చెల్లించజాలకపోయినందున వారిని బసాలతు జంగ్ బాధింపగా నందు చిన్న తిమ్మన్న తన భార్యను, పిల్లలను జమానతుగా నవాబు దగ్గఱనుంచి పోయెను. వీరికి బసాలతుజంగ్ బలవంతముగా తమ భోజనము తినిపించెను. పూనా పేష్వాయగు శ్రీనాథ యను నత డీవార్తవిని తక్షణమే యీ కరణముయొక్క భార్యను పిల్లలను నవాబు వశమునుండి వదలించెను. అందు వాసప్పయను బాలుని మాత్రము బసాలతుజంగ్ భార్య తన దగ్గఱనే యుంచి కొనెను. మిగత వారిని ప్రాయశ్చిత్తముతో బ్రాహ్మణులు స్వీకరించిరి." (కర్నూల్ జిల్లా మాన్యు అల్)

పై కొన్ని యంశముల వలన ప్రాచీనార్యులలో వర్ణవ్యవస్థ నేడుండినంతటి కఠినముగా లేకుండెనని చెప్పవచ్చును. హిందువులు మగల తమ పూర్వౌన్నత్యమును నభిలషించిరేని జాతి మత వైషమ్యముల వదలి విశాల హృదయులై మతాంతరవ్యాప్తి నిగావించవలసియుండును. కాలమెంతో తీవ్రముగా మారునో హిందువులుకూడ నంత తీవ్రముగా మారవలెను. తుర్కీ, అఫ్గనిస్థాన్, చీనా, ఈజిప్టుల చరిత్ర నించుక విమర్శించి చూచుకొన వలయును.



# ఓ లతా!

వఝ్ఝుల వేంకటేశ్వర కవి

ఓ లతా! యెన్నఁడో, విరిసిన
శ్వేత నవ్వు మొలకలు మొలిచిన విరుల
ద్వాంతరల లోననే పులకింతు వేమొ!
యెన్నఁడో!—ఓ దృఢాను రాగైక రాజ్య
చక్రవర్తినీ! ఓ కృపాశాలిని! నను
దలఁచి తలఁచి, తలఁపు చేత, వలపు చేత
విరిసి పులకింతు వేమొ!

ఈ విపుల విశ్వ
మందు; ఈ యనంత నభో విహార తత్వ
రానిలాంకూర లేశంబు నందు; నిలువ
నీడ లేక, యరుగ నొక్క జాడ లేక,
వగచి వగచి, సన్నగిలి సన్నగిలి, కలఁగి
కలఁగి, యీ కష్టజీవి, యీ కఠిన జీవి,
యీ కలుష జీవి, యీ శోక లోక జీవి,
యీ విధుర జీవి, యీ వ్యర్థ జీవి, తోడు
లేక, దిక్కు లేక, సుఖము లేక, కుందు,
అకట! యే హృద యాంతరా ళాంధకార
మందొ; ఏ జీవ రాగ రేఖాంకురంబు
నందొ; ఏ ప్రాణ వాయూర్మి కాగ్ర రంగ
మందొ; కోర్కు లన్నియు నడుగంట, భావ
పటముఁ జిత్రించు:

ఓ పరిస్ఫుట పవిత్ర
నిర్మల ప్రేమ మూర్తీ! గణింపఁ బోకు
మీ నరుని, శూన్య హృదయుండు, దీనుఁడు.
బహుజీర్ణ "శీర్య ద్గాశావృంత శిథిలితాసు"
కుసుమ మసియాడు.

ఎప్పుడో, కోమలీ! త్వ
దీయ పావన పాద ప్రదేశమునకు
నర్పితంబగుఁ బ్రేమ భావా సవమ్ము
తోడ, రెండు కన్నీటి బిందువుల తోడ.



# పరిక్షలు

గుడిపాటి వెంకటచలం బి. ఏ., ఎల్. టి.

డాక్టర్, మీ చూపులో నా మీద తృణీకారభావం కనపడుతోంది. సుఖరోగిని చూస్తే మీకు లోకువ. వొళ్లుమదమెక్కి, చపలుడై, కోరి, తెచ్చుకున్న వ్యాధిలాగు కనపడుతుంది. మీకు, యీ రోడు నా యూనివర్సిటీ పరిక్షల్లా డాక్టరు పరిక్ష క్రింద తేలింది.

మొదటి ప్రశ్న—నీకేం జబ్బు?

జవాబు—మీకే తెలుసు.

రెండో ప్రశ్న—నీ కెట్లా వొచ్చింది?

జవాబు—హోటలు భోజనం చాలక చిక్కిపోతున్నానని మీరే కదా నన్ను రాత్రులు పాలు త్రాగమన్నారు! ఆ సలహా వల్లనే అసలు కలిగింది, యీ అంటు బాధ్యానికి కారణం. కనక దీంటో మీకు కూడా వుంది బాధ్యత. 'బిల్' పంపేటప్పుడా సంగతి జ్ఞాపకముంచుకోండి. మా సందు మధ్య చిన్న పాక వుంది. అది మీరు చూసి వుండవచ్చు. దాని వెనుక దిబ్బమీద ఆవులు కట్టేసి వుంటాయి. దాంటో అప్ప చెల్లెళ్లిద్దరున్నారు. వాళ్ల దగ్గిరే నేను పాల వాడిక పెట్టాను. అదిగో, యెదో వుద్దేశ్యంతో పెట్టాననుకుంటున్నారప్పుడే! యేమీ లేదు. చుట్టు పక్కల యిళ్లవాళ్లందరూ వాళ్ల దగ్గిరే పాలుపోయించుకుంటారు. ఒక వారం రోజులయిం తరవాత నాగదికి వాళ్లు రాకపోక లెక్కువైనాయి. ఒకామె పొద్దున్నే పాలు తీసుకొచ్చేది. మళ్లీ యింకా కావాలా అని రెండో ఆమె వొచ్చి అడిగేది; తరవాత మొదటి ఆమె పాలచెంబుకోసం వొచ్చేది. రాత్రులూ యింతే........పాల చెంబుకోసం మొదటిఆమె వొచ్చి తీసికెళ్లేప్పటికి రాత్రి పదయ్యేది.

నాతో గదిలో వున్న సీతయ్య వేళాకోళాలు మొదలు పెట్టాడు. వాళ్లనీ నన్నూ కలిపి. నాకు కొంచెం సంతోషంగానే వుంది. వాళ్లు పెద్దవాళ్లైనా, వాళ్లమీద నాకేమీ అట్లాంటి అభిప్రాయం లేక పోయినా, నన్ను యిద్దరో స్త్రీలు కోరి, నా చుట్టూ తిరుగుతున్నారంటే కొంచెం గర్వంగావుండదూ? నాకేమిటి, మీకుండదూ నాగదికి వొచ్చే స్నేహితులతో చెప్పి, వాళ్లతో కలిసి హాస్యాలు చేశాడు తరవాత.

"పోనీ పాపం, వాళ్లంతగా, పరితపిస్తో వుంటే, నీ దేం పోయింది...............'' అనీ,

"కోరిన స్త్రీని గాని స్త్రీలని గాని, నిరాకరించడం పాపమని ధర్మశాస్త్రాల్లో వుందా"నీ,

"మేం కూడా పాలవాడిక లిక్కడే పెడతామ"నీ యిట్లా నవ్వేవారు.

పదిహేను రోజుల్లో సెలవులకి యింటికి వెళ్లాడు. నేను రెండో సంవత్సరం క్లాసులో వుండడంవల్ల, వుండిపోయినాను [illegible]యర్నాడే, పెద్దామె—

'మీరక్షకుడు వూరికి వెళ్లాడా?' అంత తరవా చూడండి, పాలకివొచ్చి వాళ్లు కదలరు. 'స్టవ్' తమాషా చూస్తో, కొంత సేపు, పాల చెంబు కడుగుతో కొంచెంసేపూ, ఆవులకి గడ్డీ, దాణా ధర లెక్కువైన సంగతీ పాడుగువాళ్లతో తగాదాల సంగతీ మాట్లాడతో కొంచంసేపూ. వొచ్చినప్పుడల్లా ఒక అర గంటన్నా వుండి పొయ్యేవారు. యెవరన్నా చూసి యేమను కుంటారో అని ఒకటే భయం నాకు. వాళ్ళిద్దరూ వయసు ముదిరిన వాళ్ళే, ఒకామెకి నలభై, యింకో ఆమెకి కొంచెం తక్కువ వయసుంటుంది. వాళ్లచూపులు గాఢంగా వున్నాయి. యింత తెలివితక్కువ వాడేమా, కొంచెమైనా అర్థం కాదేమా, అని నవ్వుకుంటున్నారని తెలిసి సిగ్గుపడి, రోషపడి, నాకు అర్థమయిందిగాని, మీవంటి వాళ్ళు నాకు పనికిరారు, నేను పోకిరి వనుకున్నారా, మా కుటుంబం, మర్యాదా, శిష్టాచారం, మావూరువొస్తే మీకే తెలుస్తుంది! అని వాళ్లకి తెలియ చెయ్యాలని వుండేది. ఒక్కొక్కరోజు మరీ వొంటరిగా వుండి, కొంచెం మతి చలనం కలిగినప్పుడు, పోనీ యింతలో పోయిందే మనిపించేది గాని, యెవరికన్నా తెలుస్తుందనీ, వాళ్లదగ్గిర రోగాలుంటా యేమో ననే భీయాలు; నన్ను కట్టేసేవి. ఒక్కొక్కప్పుడు, వాళ్ళమీదా, వాళ్లుపడే ప్రయాసమీదా, జాలి కలిగేది. నాకిటికీ దగ్గిర్నించి వెడుతో, తనబాధకీ, తన అక్కబాధకీ, గడ్డిధరలు హెచ్చడానికీ, వాళ్ల గొడ్లు బందెల దొడ్డిలో పడడానికీ, అంతకీ నేనే కారణమైనట్లు, విచారంతో చూసేది నావంక. యింకోసారి వాళ్లతో ఆకొత్త అనుభవంకోసం, యెట్లా వుంటుందో, అనే విచిత్రపు కోర్కెతో వూటలూరేది మనసు.

ఆరాత్రి "మిల్టన్" పూర్తి చెయ్యాలనే నిశ్చయంతో, 'టీ' తాగి కూచున్నాను. పగలంతా తీవ్రమైన యెండకాసి, ప్రాణులమీద జాలి కలిగినట్లు, గాలి వీస్తోంది. దీపంవెలుతుర్ని మించిన వెన్నెల కిటికీలోంచి వెల్లువలై పడతోంది. తలుపుకొట్టిన చప్పుడయింది. యెవరో తెలుసు, కాని,

'యెవరు?' అన్నాను.

'పాలచెంబియ్యండి' అంది. చిన్నామె కంఠం. వొచ్చిమాటలుపెట్టి 'డిస్టర్బ్' చేస్తుందని, నేను, క్రాంప్ కాట్, మీద నించిలేచి, చెంబు తీసుకుని, యివ్వడానికి తలుపు తెరిచే సరికి, తోసుకుని, లోపలికొచ్చింది, ఆమె.

"యేం చేస్తున్నారు?"

"చదువుకుంటున్నాను. యిదుగో చెంబు."

"అయ్యో! అంత తొందరేమండి! పాలు కావాలన్నారా, యివాళ?"

"ఆ."

"యేమెండ కాసిందండీ? చచ్చిపోయినా మనమండి, మేము, మీకెట్లావుందో కాని! ........దీపం మండుతోందండీ................"

"లేమలే."

"అయ్యో, మండుతోందండి...చూడండి."

లోపలికి వెడుతోంది. నాకు గుండెలు కొట్టుకుంటున్నాయి. భయంకంటె, సంతోషమూ, ఆతృత యెక్కువవుతున్నాయి. దీపం బాగా తగ్గించింది. ఆరాత్రి నన్ను వొదల తలుచుకోలేదు. వెన్నెలతో గది నిండింది.

ఒక సంవత్సరం నించి యింటికి వెళ్లలేదు. బ్రహ్మచారి జీవితంగడుపుతున్నా. నెలరోజులనుంచి పుష్టి అనుభవమూ గల యిద్దరు స్త్రీలు నాచుట్టూ తిరుగుతున్నారు. నీ వివేక మంతా నశించి, యెందుకిట్లాంటి అవస్థ తెచ్చుకున్నావంటే, యింకేం చెప్పను?

"అబ్బా! యెంత వుక్కగా వుందండీ యీ గదిలో! లోప లెట్లా పడుకుంటారో గాని!".

కని పెడతున్నట్టే వుంది, నామనో సంచలనము. ఒక్క నెల వోపిక పట్టింది, యింక తనే ప్రారంభించవలసిన ఆత్యావసరం కలిగింది. దగ్గిక వొస్తో, మాట్లాడతో దోవలోనే, తన మెడ దగ్గిర గుండీ విప్పింది.

"పేలుడి కేమన్నా మందుందరండీ మీ దగ్గిర? మాడండి, యెట్లా పేలిందో!"

# సుజాత

శివాజి:—మాస్టరు రామకృష్ణ శాస్త్రి.
జవాహరి:—రంగ నక్షత్ర, శాలగాన సరస్వతి,
బిరుదు పొందిన పైడి బాబు.

రామోజి, జవాహరి, శివాజి.
రామోజి:—మాస్టరు సూరి



"నాథా! పరులు చూచెద రేమో యని దుడుకు నొందు చున్నావేమో, అట్లు వలదు. మనము రహస్యముగానే మెలగ వచ్చును."



,,ఛారా! రామోజి! తుఛ్చా!మ్లేఛ్చా! యెంతటి సా కృత్యమునకు వొడి కట్టితివిరా! నిన్ను చంపి నాదేశ నిష్కళంక మొనర్చెద! భవానీ! హర, హర, మహాదేవ్."

(బాలమిత్ర నాటక సభ.—గుంటూరు వారి యనుమతి

అని చేతికి చూపించింది. దాంతో భారద్వాజ, మైత్రేయ, వశిష్ట యిత్యాది ఋషి వంశ తిలకం, హిందూ మత పునరుద్ధారక బద్ధ కంకణుడు, పడి పోయినాడు, ఒక్కసారిగా.

*   *   *   *

*   *   *   *

అయిదు నిమిషాల్లో తలుపు కొట్టారెవరో. యెవరో వొచ్చారు, చూస్తాగా, నాగతేమిటని, నాగుండె కంప మెత్తింది. మా నాన్న, మామ గారు, 'ప్రిన్సిపాల్ ముగ్గురూ కలిసి నన్ను ప్రేమతో అర్ధరాత్రి చూడ వొచ్చారని నిశ్చయ మయింది. నాలిక అంగటి కంటుకుని మాట రాలేదు, ఆరు చేతులూ తలుపు కొడుతున్నాయి.

"యింకెవరు? ఆ ముండే!" అంది నా 'రూమ్ మేట్.'

"పాల చెంబండీ!" అంది పెద్దామె గొంతు. మా అత్త గారూ, పోలీసు సూపరింటెండెంటూ, పై ముగ్గురూ కలిసి వొస్తే నేనను కున్నా.

"నీ చెల్లెలు తీసికెళ్లింది. వెళ్లమనండి" అందియామె. అన్నాను, హీన స్వరంతో. ఒక్క రవ్వనే పూసు కొని,

"పొద్దున్నటి చెంబిక్కడే వుండాలండి." అంది

"లేదు."

"వుంది. చూస్తాగా, తలుపు తీద్దురూ."

పూసుకున్నాను. ఒక నిముషముండి,

"మా చెల్లెలుందండీ, లోపల?" అని అరిచింది. హడిలి పోయినాను. చుట్టూవున్న యిళ్లలో, తలుపులు, కిటికీలు తీసుకుని, స్త్రీలు, పురుషులు, అనేక సంగల వుంది వింటున్నట్టుంది. బంక కోసలను, తొరగా వెళ్లి తలుపు తీశాను. పెద్దామె, లోపలికి వచ్చి, వెంటనే గ్రహించి, "అమ్మ, దొంగా!" అని నన్ను పట్టుకుంది. ఆ రాత్రి ముగ్గురు మా అన్నని క్యాంప్ కాట్ మీద యిరికాము .................

తరవాత మూడు రోజులు యేమైనానో, యేంచేస్తున్నానో, యెక్కడున్నానో, చెప్పలేను. యిద్దరూ వొక సారే వొచ్చేవారు, వొకసారే వెళ్ళేవారు. ఒకరి తరవాత ఒకరు రాకూడదా అని సూచించారు. చిన్నప్పటినించి కూడా, వాళ్ళిద్దరికీ శరీరాలు వేరన్న మాటేగాని, ఆత్మలూ, కలచాలూ, మనసులూ, మంచాలూ, ఆలోచనలూ, భావాలూ, స్నేహితులూ, కాలువలూ, అన్నీ ఏకమే ననిన్నీ, ఒకర్ని విడచి వేరుగా, వేరకాలమంను, యింకోరు అనుభవించమనిన్నీ చెప్పారు. ఒక రోజు మధ్యాహ్నం పెద్దామెవొచ్చి,

'దాంతో యెక్కువ సాహసం చెయ్యకండి తంటా అంది.

'యేం?'

'దాన్ని పుంచుకున్న వాడికి అనుమానంగా వున్నట్టుంది. కనుక్కున్నా డంటే.................'

'నేనేం రమ్మన్నానా, నీ చెల్లెల్ని?'

'కాని, వొళ్ళు తెలీక, ట్రైసుని పేరంతా క్యాక తేస్తూ వొచ్చినప్పుడు, వాడితో అనండి. ఆమాట! నాతో యెందుకు?'

ఆసాయంత్రమే, చిన్నామె

'మా అక్కయ్యతో జాగ్రత్తండోయ్! అట్టే రానీకండి!'

'యేం?'

'యిట్లానే మనుష్యుల్ని మరిగించి, నమ్మించి, నట్టేలున వొదిలేసిపోతుంది. తరవాత మీ అవస్థ యేం చెప్పను? అనేకమంది పురేసుకున్నారు. నామాట వినండి'

యీ యిద్దరిమాటలూ వొక్కసారిగా, అక్కడి చెల్లెలితోనూ, చెల్లెలి అక్కతోనూ చెప్పేశాను. యింక నాగతిలో వాళ్ళు సలిపిన యుద్ధం యేం చెప్పను, మహాప్రభో! వర్ణనాతీతం. అరవడానికివీల్లేదు. బుగ్గలు నొక్కడాలూ, పాముల్లాగ బుస్సులుకొట్టడాలూ, రహస్యాలు చెప్పుకుంటున్నట్టు చెవుల్లో తిట్లూ, నన్ను సాక్షిలూ, నన్ను గొప్పలా ...

తో ఒకర్నిమించి వొకరు నన్ను పొగడడం, నన్ను కావిలించుకోడం, ఒకర్నొకరు రక్కడం నామీద వొళ్లే సుకోడం నా బుగ్గలు ప్రేమతో నొక్కడం కొంతసేపు జరిగించారు. రవికలు చింపుకుని జుట్టుపీక్కుని అలిసి యిద్దరూ చప్పుడు లేకండా నామీద పడ్డారు.

ఐదో రోజున బాధ మొదలు పెట్టింది నాకు. నా కోపంలో, రోషంలో, అసహ్యంలో, యిద్దర్నీ తన్నాను.

,,నేను చెప్పలా, మీతో! మొదటే చెప్పలా! యీమాట అన లేకే, యీ సంగతి చెప్పలేకే, అవాంత పెట్టి, యీ రండ ముండతో సంబంధం వొద్దంటే విన్నారూ?'' రెండోది యింతే అన్నది.

,,నాకా! నాకా! దానికే నండీ! మీ మీద యెంత వొట్టు పడితే అంత వొట్టు......పోస్టుజవాను సాయెబు లేడండీ......వాడి దగ్గిర్నుంచి యిది............''

రెండోది యిదే ధోరణి.

\+ + + + +

గది వొదిలి పెట్టి పారి పోయి వొచ్చి, మీ శరణు చొచ్చాను.



# పరిభ్రమణము

శ్రీ వేంకట కాళిదాస కవులు

కమనీయోజ్జ్వల చంద్రికా తళతళ త్కాసార కాఃపూర గ
ర్భమునన్ నీల ఘనావకుంఠన చర ద్రాకా నిశా రాజ బిం
బము వీక్షించి హసించు మన్నయన భాస్వత్కైరవానీకముల్
రమణీ మాలక యుక్త తావక ముఖ భ్రాంతిం బ్రఫుల్లంబులై.

కానన సీమ నిన్నుఁ గనఁగా నిలుచంబడి యంతఁ గోకిలా
గాన కుహూ కుహూ సుధలు కాల్వలు గట్టుచు నుండఁ నందులో
దానము నాడి మైమరచి తన్మయతం గని నీవె గానమున్
వీచుల విందు గాగ వినిపించితి వంచుఁ బరిభ్రమించెదన్.

కైరవిణీ మనోహర వికస్వర చంద్రిక లూట లూరు కాం
తారము నందు నిల్చి గగనంబున దృష్టులు నిల్పి యౌవన
శ్రీ రమణీయమౌ ప్రకృతి రేఖ విలీనము నొందు తావక
స్మేర వినోద రేఖఁ గని చిత్తమునందుఁ బరిభ్రమించెదన్.



# తపాల బిళ్లలు

(౧)

బి. ఎన్. శర్మ, బి. ఏ.



గడచిన మూడు నాలుగు సంవత్సరములనుండి యూరపు, అమెరికా దేశములందు తపాల బిళ్లల ప్రదర్శనములు(Phila telic-Exhibitions) విరివిగా జరుపబడుచున్నవి. గడచినవాకన్న జరుగనున్న ప్రదర్శనము లత్యుత్తమముగా, ఆకర్షణీయముగా నుండుటకు తీవ్రముగా ప్రయత్నములు సలుప బడుచున్నవి. ౧౯౩౭ వ సంవత్సరము మే ౨౧ వ తేదినుండి ౧౨ వ తేదివరకు ప్యారిసు నగరమున జరిగిన అంతర్జాతీయ తపాల బిళ్లల ప్రదర్శనము* లోకులలో నూతనోత్సాహము కలుగ జేసినది. ప్రాచీన నాణెములు సమకూర్చు ఖ్యాతము లోకులలో కలిగినటుల, యీ బిళ్లల సమకూర్చు నభిలాష నానాటికి ప్రజలలో ప్రబలుచున్నది ఇంతేగాక యీ అంతర్జాతీయ ప్రదర్శనము జరిగిన రెండు మాసములకే బాల్టిమోర్ నగరమందలి 'మెరిలాండ్' వైజ్ఞానిక విద్యాపరిషత్తు (Maryland's accademy of the science) నందొక ప్రత్యేక సభ దీని విషయమై నెలకొల్పబడినది. + ఈ విద్యాపీఠమువారు విద్యార్థులకు గ్రాహ్యమగు నటుల దీని వివరము లన్నియు శాస్త్రీయ రూపమున బోధపరచు చున్నారు.

తపాలా పద్ధతి పూర్వమునుండి యమలులో నున్నటుల చరిత్రలు దెలుపు చున్నవి. ప్రతి నాగరక దేశమునందు దీని యవసరముండి యుండెడిది. వర్తమాన కాలమునం దుత్తరముపై తపాలాబిళ్ల అంటించు పద్ధతి పూర్వకాలమునందు లేకుండెడిది. ఈపద్ధతి క్రీ.శ. ౧౮౪౦ వ సంవత్సరమున యమలులోనికి తేబడినది. ఇంతకు పూర్వ మింగ్లాండులో నుత్తరములపై సుంకము నాణ్యము రూపముగా గైకొనువాడుక. ౧ మే, ౧౮౪౦ నాడాపివేయ బడి వీనికి బదు లుత్తరములపై తపాల బిళ్ల లంటించవలయునని ప్రకటింప బడినది. ÷ ఆకాలమునం దుత్తరముల బరువుపై బిళ్లలవెల నిర్ణయింపబడక దూరసమీపములంబట్టి సుంకము బిళ్లల రూపమున నియమింపబడు చుండెను. ప్రథమమున యీదేశమునందు పెన్నిబిళ్లనల్లరంగులో తయారు చేయబడినది $ మూక్సికో, మరికొన్ని రాజ్యములవారు దీనిని యనుకరించిరి. వర్తమానకాలమునందు ౨౦౦ లకన్న నెక్కువ రాజ్యములలో తపాలా బిళ్లల పద్ధతులుగలవు ‡

* స్టాన్లి గిబ్బన్స్ మాసపత్రిక ౧౯౩౬ జూన్ సంచిక, పుట ౨౦౦

\+ ,, ,, జూలై ,, ,, ౨౩౭

÷ స్టాన్లి గిబ్బన్స్ పట్టిక (Stanely Gibbons catalogue పుట ౧.

$ ,, మాస పత్రిక. ౧౯౩౮ డిసెంబరు సంచిక పుట ౫౪

‡ ,, వివిధరాజ్యముల పట్టిక.

ఇంగ్లాండునందలి స్టాన్లిగిబ్బన్స్ కంపెనివారు యీ వివిధ దేశములందు ప్రకటించిన తపాల బిళ్లల సమకూర్పు క్లుప్తముగా వాని చరిత్రతో నొక సంపుటము తయారు జేసి యున్నారు. ఫెబ్రవరి ౧౯౨౬ వరకు దీనియందు ౧ లక్ష ౬౦ వేల విధముల తపాల బిళ్లలు చేర్చ బడినవి. † ఈ సంపుటమునకు ప్రతి మాసము అధమము ౬౦ విధముల నూతన బిళ్లలు చేర్చబడు చున్నవి. ముద్రణా లోపములు, కాగిత భేదములు, ఛిద్ర భేదముల బిళ్లలు ప్రత్యేక సంపుటమునందు గలవు. పై సంఖ్యలో వీనిని గూడ చేర్చియే యున్నారు. సహజముగా ముద్రణా లోపములుగల బిళ్లలు కనుగొనుట కొంతవరకు అసంభవము. దృష్టికి భేదము స్ఫురించని యీ లోపములు గల బిళ్లలెన్నియో వాడుకలో నుండి యుండును. హైద్రాబాదునందలి మహమ్మదు హమీదొద్దీన్ గారి యొద్ద కొన్ని యమూల్యమైన బిళ్లలు గలవు, ఈ విషయములో పేరుపొందిన యే కంపెని పట్టికయందిట్టివి కనబడుటలేవు. భారత ప్రభుత్వము వారు తపాలా శాఖను నడుపుచున్న నష్టము భరించలేక వెల రెట్టింపజేసిరి. పావణాకు లభించు కార్డుమీద మరి పావణా బిళ్ల నంటించ వలయునని యాజ్ఞాపించిరి. అనగా కార్డువెల అర్ధణాకు మార్చివేసిరి. తపాలశాఖలో పావణా బిళ్లలు లేనందున అర్ధణా బిళ్లలపై 1/4 అణా ముద్రించిరి. ముద్రణా లోపమువలన కొన్ని బిళ్లలపై (11) అనియు, మరికొన్నిటిపై (44) అనియు ముద్రింపబడినవి. ఇట్టి బిళ్ల లేపత్రికయందును చేర్చబడలేదు. ఇట్టి యపూర్వపు బిళ్లలకు అధికమైన వెలకలుగుటలో నాశ్చర్యము లేదు.

హిందూదేశమునందు మొట్టమొదట సింధు ప్రాంతపు కమిషనరగు సర్ బార్టిల్ ఫ్రేయర్ గారి యనుజ్ఞపైన జూలై ౧౮౫౨ వ సంవత్సరమున సింధు నగరమునందు తపాలా బిళ్ల ప్రకటింప బడినది. దానిపై అంగ్ల భాషయందు 'సింధు జిల్లా తపాల బిళ్ల' (Sindh District post)', 'అర్ధణా' (1/2 Anna) ముద్రింపబడెను. హిందూదేశాంగ్ల ప్రభుత్వమువారు తపాలా బిళ్ల పద్ధతి హిందూదేశమునకంతటికి నియమించి నాలుగైదు సంవత్సరములలో యీ బిళ్లల వాడుక ఆపివేయ బడినది. హైద్రాబాదునందీ పద్ధతి క్రీ. శ. ౧౮౬౯ వ సంవత్సరమున ప్రారంభింప బడినది. ప్రథమమున సమకోణాకారముపై ఆకుపచ్చని రంగులో అణా బిళ్ల వెలువడినది. ప్రస్తుతము వాడుకలో నున్న అణా బిళ్లకన్న పెద్దదిగా నుండెను. దీనిపై నుర్దూభాషలో 'ఆసఫియా ప్రభుత్వము, ఒక అణా ౧౨౮౩ హిజిరి.'

سرکار آصفیہ ایک آنہ

سنہ ۱۲۸۳ یుండెడిది.

లండను నగరమునందు మొదలు తపాల బిళ్లకు పెన్ని నిర్ణయింపబడినది. స్ట్రేటు సెటిల్మెంటు ప్రభుత్వమువారు ప్రపంచములో వెలగల ౧౦౦ డాలర్ల బిళ్ల ప్రకటించిరి. నేటికిని యీ బిళ్ల వాడుకలో గలదు. ఫరాసు అధినివేశ రాజ్యములో చాల చిన్న వెల బిళ్ల గలదు. అది సాంతిమ్ × లో నిరువదియైదవ భాగపు వెల గలదై యున్నది. (అనగా నొక పాయి యందు 3/25 భాగము) అచ్చట చలామణిలో గల ఫ్రాంకు నాణెము ధర మారుచుండు హెచ్చుతగ్గులనుబట్టి నొక్కొక సారి దీని వెల మరింత తగ్గిపోవును. ప్రపంచములో మరెచ్చటను యింత చిన్న వెల బిళ్ల లేదు. జర్మనీలో మహాయుద్ధానంతరము తగ్గినప్పుడు ఒక్కొక్కటి వెలగల బిళ్ల ౫౦ మిల్లియనులకు విక్రయింప బడినది. ఆ కాలమునందు పాలకుల కర యుద్ధముల మార్కులు బజారులో లభించుచుండెను.

ఇంతవరకు హైద్రాబాదు ప్రభుత్వమువారు ముప్పది రు ౩౭౫ విధముల తపాల బిళ్లలు ప్రకటించి

† స్టాన్లి గిబ్బన్స్ మాస పత్రిక. ఫెబ్రవరి ౧౯౨౬ అనుబంధము

S. గిబ్బన్స్ పట్టిక: మొదటి సంపుటము. ౧౯౨౦ పుట ౧౯౬

* ,, ,, ,, ,, 380

× ఎవర్టెట్ టెలియర్స్ పట్టిక. (Yevertet Tolliers Catalogue)

ను. + వీనిలో కొన్ని ముద్రణా లోపముల బిళ్లలు గల వు. బిళ్లలన్నిటిలో 3 పాయిల బిళ్ల తమ్చు వెలది. యీ పాయిబిళ్ల వెల కలసియై వాడుకలో నున్నది ప్రస్తుతము వాడుకలో మాత్రము, ౪౫ విధముల బిళ్లలు గలవు. ప్రభుత్వపు కార్యాలయములలో గూడ యిన్ని విధములవే వాడబడుచున్నవి. అమెరికాదేశమునం దింతవరకు ౧౫౦౦౦ విధముల బిళ్లలు ప్రకటింప బడినవి ÷ కుర్కీయందు సుమారు ౧౪౦౦౦ విధములవి ప్రకటింపబడినవి. క్రీ. శ. ౧౮౭౮వ సంవత్సరమున యిచ్చటి వార్తాపత్రికలకు, మాసపత్రికలకు ప్రత్యేకమైన తపాలా బిళ్ళలు వెలువడి యుండెను.

గ్వాలియరు, చంబా, ఫరీదుకోట, పటియాలా, నాభా, ఝండ్ యీ ఉస్వదేశ సంస్థానములలో భారత ప్రభుత్వపు బిళ్లలే వాడబడు చుండెను. కాని వీనిపై ఆ సంస్థానముల పేరులు ముద్రింపబడు చుండెను. నేటికిని గ్వాలియరు పటియాలా రాజ్యములలో యీ పద్ధతియే గలదు. ఇతర స్వదేశ సంస్థానములలో ఆయా ప్రభుత్వము వారు తమ స్వంత బిళ్లలు ప్రకటించి యున్నారు. వీని యుపయోగము ఆయా సంస్థానముల వరకే గలదు. కాని హైదరాబాదు ప్రభుత్వపు బిళ్లలకు బ్రిటిషు ప్రభుత్వపు కార్యాలయములలో చలామణి కలదు. వీనిపై యుర్దూ భాషలో

ప్రభుత్వము سرکار అని ముద్రింపబడి యుండును. భారత ప్రభుత్వపు వానిపై మొదలు 'On H. M. S.' యని యుండెడిది. ఇప్పుడు వానిపై 'Service' మాత్ర మున్నది. ఈ ప్రభుత్వపు బిళ్లలు ఈరానునందు 'రస్మి' మిసరునందు 'అమీరీ' యని వ్యవహరింపబడుచున్నవి. ఏదో కారణమువలన వాడుకలో ఆపివేయబడిన వివిధదేశముల తపాల బిళ్లల వెల అభివృద్ధి కలిగి సమకూర్చువారి వలన హెచ్చు చున్నది. హైద్రాబాద్ మరికొన్ని సంస్థానముల ప్రాచీన బిళ్లల వెలయు వృద్ధి చెందుచున్నది. దీని కొక ప్రత్యేకమైన కారణము గలదు. ఆయా సంస్థానముల వరకే వీని వాడుక యుండెను. ప్రజలు యుత్సాహముగా వీనిని విరివిగా వాడలేదు. ఇతర దేశములకు వీనిని గనుటకై సమయము లభించలేదు ప్రభుత్వమువారు పైకారణము వలన అధిక సంఖ్యలో ప్రకటించలేదు. కాలానుసారము వీనియం దభిలాష గలవారికి వీటి యవసరము పెరుగుచున్నది తమ్చు సంఖ్యలో నివి మిగిలియుండుటవలన నానాటికి వీని వెల హెచ్చుచున్నది.

ప్రపంచములో నింగ్లాండు ప్రభువుగారి వద్దగల తపాల బిళ్లల సంపుట మత్యుత్తమ మైనది వీరికి బాల్యము నుండి దీనియం దమితమైన ప్రీతి. బహుకాలము వరకు వీరు లండను నగరమందలి 'రాయల్ తపాలా బిళ్లల సంఘము' (Royal philatelic society of London) నకధ్యక్షులుగా నుండిరి. ప్రస్తుతము వీరి పోషకత్వమున యిది నడుపబడుచున్నది. వీనిని సమకూర్చుటలో వీరి పితతండ్రియగు డ్యూక్ ఆఫ్ ఎడింబ్రో గారు సాయ మొనర్చి యున్నారు. క్రీ.శ. ౧౮౯౧వ సంవత్సమున వీరీసంఘమునందు సభ్యులుగా చేరిరి. క్రీ.శ. ౧౮౯౬ సంవత్సరమున వీరు యేకగ్రీవముతో యధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. పలుసారులు వీరీ సంఘమునందు దీని విషయమై యమూల్యమైన వ్యాసముల జదివి యున్నారు. వీరు హిందూదేశము, ఆస్ట్రేలియా, కెనడా, మిసర్ వెళ్లినప్పుడు కొన్ని అపరూపమైన బిళ్లల సంపాదింప గలిగిరి. మొరీషి ద్వీపపు బిళ్లపై పొరపాటున 'పోస్టాఫీసు' అని ముద్రింపబడిన బిళ్ల, జర్మని జాతీయ ప్రభుత్వము వారు ౧౪౫౦ పౌండ్లకు గైకొన మున్ముందెన ప్పుడు వీరు ౧౪౫౦ పౌండ్లకు కొని యున్నారు ‡ నేడు రోజు దీని వెల హెచ్చుచున్నది. R యువరాజునకు గూడ దీని యందమితమైన ప్రేమ. వీరి వద్ద యు కొన్ని యమూల్యమైన బిళ్లలు గలవు. లండన్ విచిత్ర ప్రదర్శన శాలలో గల

§ గిబ్బన్స్ పట్టిక.
+ ,, పుట ౧౪౦
÷ ,,
‡ ఎరిన్గ్టన్, మార్టిన్ కంపెని పట్టిక ౧౯౧౪ పుట ౧౦౦
R దీని వెల ప్రస్తుతము ౨౫ వేల పౌండ్లు. యిటివే మరిరెండు బిళ్లలు గలవు.

సంపుటము రెండవ స్థాన మాక్రమించు చున్నది. పార్ల
మెంటు మెంబరగు టాప్లింగుగారిచే యిది సమకూర్చ బడి
నది. దీనిని ప్రదర్శనాలయమువారు జాతీయ చందాల
మూలమున లక్షపౌండ్లకు ఖరీదు చేసియున్నారు. × జర్మ
నీ [illegible] ప్రభుత్వమువారు సమకూర్చిన సంపుటము ప్ర
ఖ్యాతి జెందినదే!

తపాలశాఖవారు ముద్రణ వేసిన బిళ్లలు లాభము
గడించవవే! ఇవి సహజముగా ౧౦ లేక ౧౨ అణాలకు
వేయి లభించును. ఈకాలములో యితర ప్రాంతము
లందు వీని వ్యాపారము సాగించిన మంచి లాభము కలు
గు నవకాశములు గలవు. ఇతర దేశపు తపాల బిళ్లల
స్థితి నిటులనే గలదు. బిళ్ల, చినుగక, ఛిద్రములు చెద
రక యుండిన వెల గలదై యుండును.

ముద్రణాలోపములుగల బిళ్లలుయపరూప తపాలా
బిళ్ల లని వ్యవహరింప బడుచున్నవి. మారేషు ద్వీపపు
తపాల బిళ్లపై 'టప్పా' (Postage) కు బదులు
'తపాలాఫీసు' (Post-Office) యని పొరపాటున
ముద్రింప బడినది. ఈ పొరపాటును గాంచిన
వెంటనే ప్రభుత్వమువారు వీని చలామణి నిషేధిం
చిరి. వీని వెలలు ౧, ౨ పెన్నిలై యుండెను. ప్రస్తు
త మీనిషేధింపబడిన బిళ్లలు ౩౨౫౦, ౪౦౦౦ పౌండ్ల
కు బజారులో విక్రయింప బడుచున్నవి. హైదరాబాదు
ప్రభుత్వపు కొన్ని బిళ్లలపై 'ప్రభుత్వము'ను పదము తల
క్రిందుగా ముద్రింప బడియుండెను. వీని వెల రోజురోజు
హెచ్చుచున్నది. మొన్న మొన్న భారత ప్రభుత్వమువా
రు ప్రకటించిన ౯ పాయిల బిళ్లలో కొన్ని ముద్రణా
లోపములు గలవు. కొన్నిటిపై ౯ పాయిలకుమారు ౯. ౯.
అనియు, మరికొన్నిటిపై పాయి. పాయి. యని ము
ద్రింప బడినవి నేడీ బిళ్లలు బజారులో ౨౦౦ రూప్య
ములకు విక్రయింప బడుచున్నవి. మరికొన్నిటిపై ౯,
పాయిలు రెండు మార్లు ముద్రింపబడినవి.

ఛిద్రములహెచ్చు తగ్గ సంఖ్యలు బిళ్లల వెలల
మార్చుచుండును. అంగుళములో ౧౨౪౦ ఛిద్రములు
మారి ౧౩ ఛిద్రములుగల బిళ్లలు చాలాకాలమువాడబడ
పైవాని వెల హెచ్చిపోవును. కాగితము నకిలీ చిహ్న
ముబట్టి బిళ్లల వెల తారుమారగు చుండును. రంగుభేదము
గూడా వెల హెచ్చించును.

ఈ బిళ్లల వెలలు లోకుల యవసరముబట్టి యుండు
ను. ప్రభుత్వమువారు నిర్ణయించిన వెల మారకున్నను సమ
కూర్చువారి యభిరుచిపై వెలలు హెచ్చుచుండును. ముద్ర
ణా లోపములున్నను లేకున్నను ప్రభుత్వమువారు ము
మునిర్ణీతమైన వెలకే విక్రయించెదరు. భూపాల రాష్ట్ర
పు కొన్ని బిళ్ళలపై 'బేగము' కు మారు 'బేగసు' ముద్రిం
ప బడిన బిళ్ళలు ప్రభుత్వము వారొక వెలకే విక్రయించు
ను బజారులో మాత్రము రెండవదాని వెల హెచ్చిపోవు
నది.

ఈ తపాల బిళ్ళలు సమకూర్చుటలో నెన్నియో
నూతనాంశములు బహిర్గత మగుచున్నవి. వీనికి కొంత చా
రిత్రిక ప్రాముఖ్యత కలదు. దీని మూలమున ఆయా దేశ
పు యాచారములు, పరిస్థితులు, నాగరక చిహ్నములు
విశద మగుచున్నవి. యవన దేశములో ప్రతి బిళ్ల
మొక దేవత యాధీనమున జేర్చబడు చుండెను. ఈ దేశ
బిళ్లలపై అప్సరస స్త్రీల దేవత విగ్రహముల చిత్ర
లుండును. యురుగాయి (Uragauy) రాష్ట్రబిళ్ల
లపై లతాలంకారములకు మారు నగ్నస్త్రీలవిగ్రహముల
ముద్రణజేసి యవనాచారముల వారనుకరించి నటులుతేట
పరచుచున్నది. ఇటలీదేశబిళ్ళలపై రోము పౌరాణిక చిహ్నములు
గలవు. చక్రవర్తుల పరిపాలనముక్రింద ప్రకటింపబడిన
బిళ్ళలపై సర్పవిగ్రహ ముండుట వలన ఆజాతివారు సర్ప
మును నొక దేవతగా భావించు విషయము విశదమగు
చున్నది. ఈ బిళ్ళల మూలమున ఆదేశపు పరిపాలన
పద్ధతియు, భాషావిషయము హృద్గోచర మగును. బిళ్ళ
లపై చక్రవర్తుల ప్రజా పరిపాల నాధ్యక్షుల చిత్రము
గాక జాతీయ మహాపురుషుల చిత్రములును ముద్రింప
బడుచున్నవి. జర్మనీ బిళ్ళలపై ఫ్రెడ్రిక్ ది గ్రేటు బిస్మార్కు
షిల్లర్, గటె మొదలగు మహాపురుషుల చిత్రములు

× ఇరింగ్టన్ మార్టిన్ కంపెనీ వెల పట్టిక.

ముద్రింపబడుచున్నవి. తపాలాబిళ్లల ప్రదర్శన సమయము లందుగాని లేక కొన్ని ముఖ్య సమయములందుగాని ప్రత్యేక బిళ్లలు ప్రకటింపబడుచుండును. ప్యారిస్ నగరమునందు జరిగిన అంతర్జాతీయ ప్రదర్శన సమయమున ప్రత్యేకముగా ఫరాసీయులకు మనో సంతోషము కలుగు గంధర్వ విగ్రహములు యీ ప్రత్యేక బిళ్ళలపై ముద్రింపబడినవి. వెంబ్లి సామ్రాజ్య ప్రదర్శన సమయమున దీని జ్ఞాపకార్థము రెండు ప్రత్యేక బిళ్ళలు ప్రకటింప బడియుండెను. అఫ్ఘనిస్థానపు 8వ స్వాతంత్ర్య వార్షికోత్సవపు సమయమున ప్రత్యేకమైన బిళ్ల ప్రకటింప బడినది. బుడతకీచు హిందూదేశ ప్రాంతములందలి బిళ్ళలపై, హిందూదేశమునకు సముద్రపుదోవ కనుగొనిన సంగతి సచిత్రముగా తెలుపఁబడినది. జపాను దేశమునందొక బిళ్లపై యచటి యువరాజు వివాహ మహోత్సవము సచిత్రముగా ప్రకటింపబడినది. అమెరికా దేశపుబిళ్లలపై కొలంబస్ చరిత్ర, స్వాతంత్ర ప్రచురణముగాని వాషింగ్టన్, లింకన్, ఫ్రాంక్లిన్ చిత్రములు ముద్రింపబడినవి. కొలంబస్ చరిత్రయందు యెజబెల మహారాజ్ఞి దర్బారునుండి ముఖ్యమైన విషయములన్నియు ౧౬ చిత్రములలో వివరింప బడినవి. ఇవేగాక అచటి ఆర్థిక, వ్యవహారిక జీవితపు ముఖ్యవిషయముల తోబాటు సౌందర్యము లలిత కళా కౌశల చిహ్నములు బిళ్లలపై చిత్రింపబడినవి కెనడాయందు విక్టోరియా మహారాజ్ఞి జూబ్లియుత్సవము, పెరూయందు రోమినియా యుద్ధపు ద్వై శతాబ్దముత్సవము, పోర్చుగల్‌నందు వాస్కోడి గామా చిత్రము, జిహూ యందు సుల్తాన్ యిబ్రాహిం చిత్రములు లభించుచున్నవి. మొత్తము మీద వీని మూలమున నెన్నియో నూతనాంశములు తెలియున్నవి. స్విట్జర్లాండు బిళ్లల వలన అచటి ఆరోగ్య ప్రదమగు ప్రదేశములు, వాని చరిత్ర తెలియుచున్నది. ఇటులనే ఆ యా దేశముల బిళ్లల వలన జంతు జాలముల చరిత్ర తెలియుచున్నదనుటకు, మెక్సికో వానిపై పక్షిరాజు, ఆస్ట్రేలియా వానిపై కాంగ్రో, న్యూఫౌండ్లాండు వానిపై కుక్క, గయానా చీమల భుజించు జంతువుల చిత్రములు, ప్రబల నిదర్శనములు.

ఈ తపాల బిళ్లలు బాలురకు విద్య గరపుటయందు సాయ మొనరించుచున్నవి. విద్యార్థులకు కొలది కాలములో వీని మూలమున ప్రపంచపు మార్పులు బోధించుటకవకాశములు గలవు. ఎన్నియో గహన విషయములు కొద్ది పరిశ్రమతో పూసగ్రుచ్చినట్లు దెలుపవచ్చును. భూగోళ శాస్త్రాభ్యసనమునందభిరుచిగల విద్యార్థులకు పాశ్చాత్య దేశములందు వీని మూలమున విద్య గరుపబడుచున్నది సహజముగా తపాలాబిళ్లలలో రాజ్యాభిషేక సమయముననో, రాజ్యాంగ పరివర్తన సమయములలోనో; దేశమునం దసమానమైన యభివృద్ధి కలిగినపుడో మార్పు గలుగుచున్నది వీనిని సమకూర్చిన కొంతవరకీ విషయములు దెలుసుకొన వీలు కలుగుచున్నది. విమర్శన దృష్టితో నభ్యసించిన ప్రపంచపు విషయములు సుబోధకములగును. తుర్కీ దేశపు ప్రథమ బిళ్లల వలన అచ్చటి సంపూర్ణ ప్రాచ్యత్వము విశదమగుచున్నది అన్నియు అరబీ లిపిలో తురుష్క భాష యందు లిఖింప బడియున్నవి. వర్తమాన కాలమున వానిపై సుల్తాన్ రషాద్, సుల్తాన్ వహీదొద్దీన్ గాజీ కమాల్ పాషా చిత్రములేగాక దేశమునందారించి యున్న ప్రతీచత్వము దెలియుచున్నది. వీని వలన యచ్చటి రాజకీయ మార్పులు, దేశ పరిస్థితులు దెలియనగును. మిసర్ వానిపై అహరామ్, అబుల్‌హౌల్ తోబాటు షాహఫవార్ చిత్రములు చిత్రింపబడు చున్నవి. కాని దుర దృష్ట వశమున హైదరాబాద్ బిళ్లలు యచ్చటి యభివృద్ధి నేమాత్రము కను పరచుట లేవు. ప్రపంచమున ప్రఖ్యాతి గాంచిన ఎల్లోరా గుహలు, అజంటా చిత్రములు, గోలకొండ, ఓరుగల్లు, దేవగిరి దుర్గములు, ప్రాచీనాంధ్రుల కళా కౌశలము ప్రదర్శించు దేవాలయములందలి శిల్ప చాతుర్యములు యీ దేశమునందు గడుగునవు నెన్నియో గలవు. వీనిని ప్రకటించుటకు యాటంకములేయున్న, మహమ్మదీయ పరిపాలనములలో సిద్ధ పరచిన యెన్ని యొ రమ్యమైన దృశ్యములు గలవు. హైదరాబాద్ నగరమునందలి చార్మినారు, మక్కామసీదు, హైకోర్టు భవనము, వైద్యశాల, టోలీచౌకి మసీదు, మూసీనది అనకట్టులు; గుల్బర్గా దౌలతాబాద్ రోజాలు, బీదరు విశ్వవిద్యాలసౌధముల చిత్రములు వీని మూలమున ప్రకటింప బడిన ప్రపంచమున కెంతయో మేలయ్యెడిది.

ప్రపంచమున కంతటికీ విషయములో మార్గదర్శ [illegible] వహించి లోకులలో నభిరుచి పెంపొందింప జేసి

నది లండన్ నగరమందలి స్టాన్లి గిబ్బన్స్ కంపెని. వీరు, మొదట మందుల వ్యాపారము చేయుచుండిరి. కొద్ది ధనముతో వీరీ వ్యవహారము మొదలిడిరి. రానురాను వృద్ధి చెందినేడి కంపెనివారు ౪౦౦ వేల పౌండ్ల సరకు కొనునంత శక్తివంతులై పేరొందసిరి. వీని వ్యవహారముజేయు గొప్ప కంపెనీలవారు ప్రతి వత్సరము లక్షలకొలది పట్టికలు ప్రచురించు చున్నారు. అవసరము బట్టిఅనుబంధ సంచికలు ప్రకటింప బడుచున్నవి. ఈ విషయమై వివిధ దేశములందు వేల కొలది సచిత్ర మాసపత్రికలు ప్రకటింప బడుచున్నవి అవసరమగు విషయము లన్నియు నుత్తర ప్రత్యుత్తరముల ద్వారా కనుగొనుటకు యీపత్రికాధి పతులు తమపత్రికల యందు ప్రత్యేక స్థానము సర్దయించి యున్నారు

గత వత్సర మీగిబ్బన్స్ కంపెనీవారు అత్యుత్తమ రీతిని నొక తపాలబిళ్ల తయారుజేయు పోటీపరీక్ష నేర్పరచిరి. లక్షలకొలది నమూనాలు బంపబడినవి. బహుమానము బడసిన చిత్రములో నిద్దరు స్త్రీలు భూగోళమున కిరువైపుల నిలుచుండి నుత్తర ప్రత్యుత్తరములు సలుపుచున్నటుల చిత్రింపబడినది ప్రపంచపు భావి యభివృద్ధి ప్రాక్ప్రతీచి సమ్మేళనముపై యాధారపడి యున్నదనే భావము దీనిలో చిత్రింప బడినది.

హైదరాబాదునందీ యుద్యమమున పేర్గాంచిన కొందరు మహాశయులు గలరు. వీరిలో (ఇనుప బంగ్లాకు సమీపమున గల) ముబార్క్ గారు గణ్యులు. వీరివద్ద గల సంపుటము లక్షరూప్యములకు మించినదై యున్నది. సుమారేబది వత్సరములనుండి వీరు సమకూర్చు చున్నారు. అఫ్జల్ గంజునందలి ఖాజి కంపెనివారివద్ద ౬౦ వేల రూప్యములకు మించిన సంపుటము గలదు. విశ్వ విద్యాలయపు యాంగ్లపండితులగు ఇ. ఇ. స్పేట్ గారి వద్ద నొక యమూల్యమైన సంపుటము గలదు. మొన్న మొన్ననే వీరొక హైదరాబాదీయుని వద్దనుండి సుమారు ౩౦౦౦ రూప్యముల సరకు గొని యున్నారు. నగర వాలా (సారాయి వర్తకులు, తోపులభట్టి) వద్ద ౫౦ వేల వెలజేయు సంపుటము గలదు. వీరేగాక నిజాం కాలేజి యాంగ్ల పండితులగు మౌల్వీ అహమ్మదబ్దుల్లా, మహమ్మద్ హమీదుల్లా బి. ఏ. గార్లవద్దకూడా గొప్పసరకు గలదు. మరి కొందరుండ వచ్చును. వివరముగా దెలియనందున పేరులు దెలుప బడలేదు.



# ఘటన

మల్లాది వేంకటకృష్ణశర్మ

కాకి రెక్కల గాడుపులకే
కనక పర్వత మెగిరి పోయిన,
ఏకులను బంధించు టెంతర యేన్గు గములను సోదరా!

క్షుద్ర మండూకంబు జలనిధిఁ
జూరఁ ద్రావిన కాల మందున,
భద్ర గత సింహంబు హరిణికి భోజనం బగు టెంతరా!

తుచ్ఛ మక్షిక మీల్గి గూలిన
తోడనే ధర కంప మొందిన
స్వేచ్ఛ చీమల వీపు పైని మహీ స్థలంబును నిల్పరా!

ఫేనమును చేఁ బూని కవచముఁ
ద్రేల నేసిన కాల మందున
బూని మానవు నీడ నణికియు భూత శత్రుఁడ నౌదురా!

సాంద్ర శీతల చంద్రికలకే
సాగరము నిర్జలత నొందిన
నింద్ర నీలము చేత వజ్రము నెనసి గోయుట దెంతరా!

కోమల ప్రసవాభి హతి మద
ఘూర్ణితంబగు హస్తి జచ్చిన
పాముచే గరిపించి శంబునిఁ బరగ నేడె వధింతురా!

సుమ్కు బుద్ధిని మెచ్చి దైవము
శోభనంబులు గూర్చు నప్పుడు
పుష్కలంబుగ కోటి దేవుల పూని సృష్టి యొనర్తురా!



# కారణం

మల్లాది రామకృష్ణ శాస్త్రి

## ౧



ఆ అమ్మాయిని భర్త వదిలి వేశాడని ఊళ్లో అందరూ చెప్పు కుంటు న్నారు.

చదువుకున్నదీ, చక్కందీ, అయిన యింట పుట్టిన పిల్లా, ఒకరి చేత వేలు ఎంపించుకోకుండా, అదుపు, ఆజ్ఞలో ఉండి అన్నాళ్లనుంచి కాపురం చేస్తున్న భార్యను, అమాంతం, అతను, ఎందుకు వదిలి పెట్టేశాడో?

ఎందుకో—అదే ఎవరికీ తెలియు లేదు.

ఇరుగు పొరుగు వాళ్లెవరైనా, ఆ అమ్మాయి తండ్రిని, ,ఏమిటండీ, బాబుగారూ! సంగతి? అందరూ ఎవరికి తోచినట్లు వాళ్లు చెప్పుకుంటున్నారు; నిజం మట్టుకు—' యింకా మాటపూర్తిగా అడగక ముందే, ఆయన కళ్లనీళ్ల పర్యంతమూ అయి ,ఏయినా! మా యింటి గొడవ తలపెట్టుకోకండి. మా ప్రారబ్ధము మాది. అని తల వంచుకునేవాడు. ఇక ఆ మనను కదిలిస్తే బాగుండదని, ,ఉత్తమ బ్రాహ్మణుడు ఎంత క్షోభపడుతున్నాడో పాపం!, అనుకుంటూ, ఎవరి దోవను వాళ్లు లేచిపోయేవారు, అక్కడ చేరిన వాళ్లంతా, వచ్చినప్పుడు ఎంత తెలుసో, వెళ్లేటప్పుడూ అంతేనే ఉండేవాళ్లు [illegible] వాళ్లు.

పోనీ, ఆడవాళ్ల దగ్గర మాట దాగదు కదా, అది అయినా—అంటే ఆ అమ్మాయి తల్లి—ఏమన్నా బయట పెడుతుందేమో నంటే ఎక్కడాలేని గీరత్వంతో, నోరు విప్పితే, ఎక్కడ ముత్యాలు రాలిపోతాయో అన్నట్లు ఉండేది.

ఇక మిగిలింది ఆ అమ్మాయి.

'ఏమే కాముడూ! ఏమిటే యీ చిన్నతనం చేస్తూ! అవేటె కాయేడు వచ్చినకొద్దీ మరీ మతిపోతూ [illegible] అందరిచేత అవుననిపించు కుంటున్న దానవు. యిప్పుడీ కర్మమేమిటే!—ఏమాటా చెప్పకుండా అల్లా బెల్లం కొట్టినరాయిలా గా, ఊం ఆం అనకుండా ఉంటే ఎట్లాగే!'

అని మనసుపట్టలేక, ఏ ముసలమ్మయినా నిలవేసి పెట్టి అడిగినా, కాముడు కళ్లనీళ్లు పెట్టుకుని, [illegible] నవ్వు తెచ్చుకుని ఎందుకులే యిప్పుడు అసాదంతా! అంటూ లోపలికి పారిపోయేది

ఉమాపతి—కామమ్మభర్త—అసలే ఎవరికీ కనబడటం మానేశాడు.

ఎవరిదో తప్పు ఎల్లా తెలుస్తుంది?

## ౨

పెళ్లి అయిన ఏడాదికే కామమ్మ కాపురానికి వెళ్లింది. అప్పటికి పదునాలుగేండ్లున్నా నిండ లేదు. అదీ శుభం, తెలియని ఆయీనుకే, సహధర్మచారిణి అన్నమాట సార్థకం చేయాలని, ఉమాపతితో చెన్నపట్నం [illegible]

ఆవిషయంలో ఆ అమ్మాయి తల్లి చాలా పట్టుపట్టింది. పాపం, ఆ బ్రాహ్మణునికి కూతురుని అప్పుడే కాపురానికి పంపించడం ఎంత యిష్టంలేదో, ఉమాపతికి కూడా అంత చిన్నపిల్లను తనతో పాటుగూడా తీసుకుని వెళ్లి కాపురం పెట్టే చదువు చెడగొట్టుకోవాలని ఎన్నడూ లేదు. ఏ రెండేళ్లకో తాను ప్రయోజకుడైన తరువాత భార్యను తీసుకువెళ్లి సుఖపడవచ్చునని నేనాడు — కాని ఆడవాళ్ల ఆలోచన వేరు. అందులో ఆ అమ్మాయి తల్లి దడాక మనం. తనకు తోచింది చేయడమే ప్రధానంగాని, ఎవరి మాటా, చివరకు కాయిన నన్నా, లక్ష్యపెట్టేదికాదు, ఆవిడ. కూతుర్ని తక్షణం, మొగుడు దగ్గరకు పంపి వే యాలని పూనుకుంది. కూతురూ, అల్లుడూ రైలుకు వెళ్లే దాకా నిద్రపోయింది కాదు.

కామమ్మ తల్లి చాలా విపరీతం మనిషి. కూతురంటే ఎంతో ప్రేమ. ఇక ఆ ప్రేమకు, గారాబానికి, అంతులేదు, సాటిలేదు. ఎంత ప్రేమగా ఉండేదో, కోపం వస్తే, అంత ఉద్రేకమూ చూపించేది. ముద్దు చేసినప్పుడు నెత్తికెక్కించుకోవడం, కోపం వచ్చినప్పుడు చావ చితకకొట్టడం......తల్లి పోషణలో కాముడుకి పనిపాటా అబ్బక పోయినా, ఒళ్లు గట్టిపడ్డది. తగిన సహనం అబ్బింది.

ఎందుకో, ఒకనాడు ఉన్నట్టుగా ఉండి కూతురి మీద పట్టరానంత కోపం వచ్చేసింది ఆమెకి. కొట్టడంతో, తిట్టడంతో, తృప్తి పొందలేదు. 'నీవు తక్షణంవచ్చి నీ భార్యను తీసుకువెళ్ల వలసింది. ఈడొచ్చిన పిల్లను యింట్లో పెట్టుకుని కూర్చుంటే, చూసినవాళ్లందరూ తలొక మాట అంటున్నారు. నీవు చదువుకుంటున్నవాడవు. వేరే విస్తరించి వ్రాయాలిసిన పనిలేదు. వెంటనే బయలుదేరి వస్తావని అనుకుంటూన్నాము. లేకపోతే మేమే నీభార్యను తీసుకువచ్చి అప్పగించి వెడుతాము. ఏది మర్యాదో బాగా ఆలోచించవలెను.' అని, ఆయన పేరుపెట్టి అల్లుడికి ఉత్తరం వ్రాయించింది.

ఆయన ఎన్నోవిధాల బ్రతిమాలుకున్నాడు. చివరకు సన్యసిస్తా నన్నాడు.

'మీరు సన్యాసులూ కావద్దు, బైరాగులూ కావద్దు, మా అమ్మ కడుపు మాడ్చుకుని నేనే పోతాను, అప్పుడు సుఖంగా కూతుర్ని పెట్టుకుని కులుకుతూ కూర్చుందురు కాని; నన్ను భరించడానికి ఆ గంగాభవానమ్మ తల్లే ఉంది, ప్రాణం పుట్టెడా తట్టెడా, నాలుగు మునకలు వేసేటప్పటికి నా కష్టం కాస్తా తీరిపోతుంది, అని, ఇంకా ఏమేమో, నానా మాటలూ అన్నది. ఆయన, తనకు మీరి పోయింది, లాభంలేదని, భగవంతుడిమీద భారంవేసి ఊరుకున్నాడు.

కామమ్మ తల్లిని ఆడిగింది. 'అమ్మా! నాకు వంట చేతకాదే, నేను ఒక్కర్తెనూ వెళ్ళి అక్కడ ఉండలేను. యిప్పుడే పంపించవద్దే' అని.

'నీకేం పోయేకాలం వచ్చిందే. మొగుణ్ణి వదిలిపెట్టి యిక్కడ కూర్చుని కులుకుతూందామనుకున్నావూ? నీతోటివాళ్లంతా బిడ్డా, పాపా కంటూ ఎన్నాళ్లనుంచో కాపురం చేస్తూంటే నీవు నావంశానికి అప్రతిష్ఠ తెస్తావుటే! నీతాతలూ, మీనాన్న ఆజలూ సాగనిస్తానను కున్నావే, మెడ కాయ విరిచి అవతలపారేస్తా, జాగ్రత్త! పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే చూసు!' కామమ్మ మళ్లా నోరెత్తలేదు. తల్లి ఎదట నిలువలేదు.

ఉమాపతి వచ్చాడు.

'మానాయనా! నాకు నచ్చినవాడవోయ్. బుద్ధిమంతుడవు' అంది, ఆమె.

అతడు ముఖం చిట్లించుకుని వెళ్ళి పోయినాడు.

కాముడూ, ...నూ రైలుకు వెళ్లబోతూన్నప్పుడు, 'అత్త గారూ! మీరు మాకు తీరని అపకారం చేశా రండీ. మాసుఖం ఆలోచించినట్లైతే, ఈ మాదిరిగా యిబ్బంది పెట్టరు, అన్నాడు, ఉమాపతి.

అతన్ని అమాంతం మింగేదామన్న కోపమంతా ఒక్క చూపులో మెరిపించి, పళ్లుకొరుకుతూ ఆమె ఘెళ్లున తలుపు వేసుకున్నది.

ముట్టుకొట్టు, మూ... వచ్చినదం... రంభా, తెల్ల బోయినాడు.

ఆయన, కూతురూ, అల్లుడుతో స్టేషనుదాకా వెళ్ళాడు. రైలు కదిలేదాకా, ఏమి మాట్లాడకుండా వాళ్ల బండిలో కూర్చున్నాడు చివరకి దిగుతూ, కూతురిని చెప్పవాల్పకుండా రెండునిమిషాలు చూసి,కాముడు ! అన్నాడు. ఆ గొంతులో గాద్గదికం, కళ్ళల్లో నీళ్లు, నిండాయి. ,నాన్నా!, తండ్రి భుజంమీద కాముడు చేయి వేసింది. ఆయన తలవంచుకుని యింటికి వచ్చేశాడు

అప్పటికీ, ఆమెకు, అల్లుడిమీద కాముడిమీద, కోపం తగ్గలేదు

3

డిశంబరు శెలవులలో ఆమె చెన్నపట్నం వెళ్లింది.

కాముడు తల్లిని చూసి చాలా సంతోషించింది. ఉమాపతి కూడా ఎంతో మర్యాద చేశాడు.

,వస్తావని ముందుగా ఉత్తరం అన్నా వ్రాయించక పోయినావా అమ్మా?, అంది, కాముడు తల్లిని.

,ఏమో, నేను మట్టుకు అనుకున్నానా, వస్తానని; నిన్న ప్రొద్దున మా చిట్టి తల్లిని చూడాలని బుద్ధి పుట్టింది. సాయంత్రం బయలుదేరి వచ్చాను.'

ఉమాపతి కూడా అక్కడే నిలుచున్నాడు. అతడు నవ్వాడు.

,ఎందుకయ్యా అంత నవ్వు. పెద్దవాళ్లని చూస్తే వేళాకోళమా?, అంది, ఆమె.

లేదండీ. మీరు పెద్దవాళ్ళయినా, తొందర తగ్గలేదు, అని నవ్వు వచ్చింది—అని మళ్లా నవ్వాడు.

ఆమెకు, కోపం వచ్చింది.

'ఆయన మాటలకేమిలే, లోపలికి వచ్చి భోజనం చేయి, స్నానం చేసిరా' అని ఉమాపతికి ,ఊరుకో' మ్మని కనుసైగచేసి, తల్లిని లోపలికి తీసుకు వెళ్లిపోయింది, కాముడు.

మరునాడు, పార్కులో, జంతువులని చూపించడానికి ఉమాపతి అత్తగారిని తీసుకువెళ్లాడు. కాముడు మీదటరానని తరువాత వెళ్లింది.

,అదేమిటే అమ్మాయీ! అని ఒక చిన్న బోనులో ఏదో జంతువును చూపించి అడిగింది ఆమె. కాముడు ప్రక్కపలకమీద పేరుచదివి ,కాంగారు' అన్నది.

ఉమాపతి చప్పున అందుకుని—

,కాదు, అత్తగారూ...'

ఆమెకు ఎక్కడలేని కోపమూ వచ్చింది.

'అవును నాయినా, మీ యింటికి రావడము నాకే బుద్ధితక్కువ. అంత ఎగతాళా?— అయినా, పరువూ మర్యాదా తెలియని వాళ్లయింటికి రాకూడదు.' అని శోకం పెట్టున రాగాలు మొదలు పెట్టింది.

'అయ్యో! మీరు పొరబడుతున్నారండీ. మీ అమ్మాయి చెప్పినపేరు, సరికాదని నేను చెప్పబోతున్నాను. మీరు సాంతం వినకుండా తప్పుగా అర్థం చేసుకుని —'

,నా దేతప్పు— తప్పుకాదూమరి, నిక్షేపంలాంటి పిల్లను నీ చేతులో పెట్టి నిన్నొక యింటివాణ్ణి చేసి, నీవు సుఖపడుతూంటే చూసి సంతోషించడం కూడా తప్పే! నీవు ఎంత చదువుకున్న వాడివైనా, నేనెంత తెలివి తక్కువ దాన్నైనా, అంత మాత్రం కనుక్కోలేమా! అను నాయనా, అను! అత్తగారని పట్టుకుని, కోతి, కొండముచ్చూ—అను'—

,అమ్మ చెపితే వినిపించుకోకుండా ఎందుకీ వాదనంతా?' అని కాముడు తల్లిని సమాధాన పరచబోయింది.

'అవునమ్మా! అయినా నీవు ఏకం కాదూ! ఎంతో పెంచినా మా మీద ఎందుకుంటుందీ నీకు!' అని కూతురి మీద మొదలు పెట్టింది.

తల్లికోపం తీరడానికీ, ఒకమారు చూడడానికీ కాముడు కూడా బయలుదేరింది. ఉమాపతి వాళ్లను రైలులో ఎక్కించి తన స్నేహితులని సాయమిచ్చి పంపాడు.

కూతుర్ని తిరిగి పంపడానికి ఎన్నో తిప్పలు పెట్టింది. దిఃరికాతడు ప్రాణం విసిగి ఊరుకున్న తరువాత ఆమెకు యిష్టంవచ్చి నప్పుడు పంపించింది.

కాముడు ఉమాపతితో ఒట్టు వేసుకుంది, ఇక ఎప్పుడూ పుట్టింటికి వెళ్లనని.

'మా నాన్నని చాలా వేధిస్తూందండీ మా అమ్మ'
అన్నది, చాలా విచారంతో.

'పోనీ, ఆయిన కూడా మనదగ్గరవచ్చి నాలుగు రోజులు ఉంటాడేమో'

'ఆవిడ ఒప్పుకుంటేనా?'

'అయినా రమ్మని వ్రాయి. తరువాత చూద్దాము.'

కాముడు తండ్రికి ఉత్తరము వ్రాసింది. రెండు మూడు రోజులకు 'మీతల్లికి చాలా జబ్బుగ ఉంది జీవించను, అమ్మాయిని పిలిపించమంటూంది. నీవూ, ఉమాపతి తక్షణం బయలుదేరి వస్తేనే కాని, చూపైనా అందదేమోనని అనుకుంటూన్నది' అని ఉత్తరం వచ్చింది.

ఆ ఆతుర్దాలో, కాముడు ఒట్టుసంగతి మరచిపోయింది. ఉమాపతి జ్ఞాపకమూ చేయలేదు.

ఇద్దరూ బండి దిగేటప్పటికి, ఆమె గుమ్మంలో నిలుచుని ఉంది.

'అమ్మా!' అని కాముడు తల్లిని కౌగలించుకుంది.

'ఒంట్లో ఎలా ఉందండీ' అని ఉమాపతి అడిగాడు.

'ఏమో నాయినా, బ్రతుకుతా ననుకోలేదు. ఇంత మట్టుకు దైవకటాక్షం వల్ల—'

ఉమాపతి నవ్వాడు.

రెండురోజుల తరువాత ఉమాపతి వెన్నెట్లో బయటపడుకుని ఉండగా, కాముడు చప్పుడు చేయకుండా వచ్చి మంచంమీద కూర్చుని, మెల్లిగా 'ఏమండోయ్!' అంది.

అతడు 'ఏం?' అన్నట్టు తలఊపాడు.

'నిమ్మళంగా మాట్లాడండి:——మళ్ళా పెద్ద చిక్కు వచ్చింది, అమ్మకి మీ మీద ఎందుకో అంతకసి? నన్ను తనయిష్టం వచ్చినట్టుగా, తీసుకువచ్చి, పంపిస్తూ మిమ్మల్ని యిబ్బంది పెడుతూంటే, మీరు లొంగి ఆమెకు లొంగి ఆకుపలకి మడుగులొత్తుతారేమో ననుకుంటూంది. అయితే నేను బుద్ధి తక్కువవాన్ని ఏమంటే ఏం అఘాయిత్యం చేస్తుందోనని, తానాడినదల్లా ఆట, పాడినదల్లా పాటగా, పోనీ ఎందుకని ఊరుకుంటే మరీ వేధిస్తూంది. ఇప్పుడు నన్ను మీ వెంట వెళ్ళవద్దంటూంది.——వెళ్ళితే—,

'పోనీ రామాక!'

'మీదంతా మరీ చోద్యం లేస్తూరూ! రాక ఏం చేయను?'

'మీఅమ్మ ముద్దుముచ్చటా తీర్చి, తరువాత—,

'మీరూ నేనూ ఒకచోట ఉంటే చూడటం ముచ్చటా? లేక మిమ్మల్ని నన్ను ఏడిపించడం ముచ్చటా?'

'ఆమెకు అదిముచ్చట'

'అయితే మానిపిద్దాం'

'మీనాన్న ఏమంటాడు!'

'ఏమంటాడు? అమ్మమాటకు ఎదురు చెప్పలేక కుమిలి పోతున్నాడు. మనని పెట్టే తిప్పలన్నీ చూస్తూనే ఏమీ చేయలేకుండా ఉన్నాడు.'

'అసలు మీఅమ్మది ఏమిటాతత్త్వం?'

'మరేమీలేదు. చేదస్తంలో రంగరించిన మొండితనం. చిన్నప్పటి మంకుతనం యింకా విడిచిపెట్టలేదు— నామీద ప్రేమే యీవిధంగా పరిణమించిం దనుకోండి. అదే పిచ్చిగా మారింది ఆవిడకూ సంతోషంలేదు. మనకూ సుఖంలేదు.

''ఎట్లా మంచిదోవకు తెచ్చేవిధం ఆమెని?''

''చెప్పతాను. చేస్తారా?''

'తప్పకుండా!'

'సరీగా ఆలోచించుకోండి.'

'మాట తప్పను'

'అయితే—నన్ను వదిలి పెట్టేయండి'

'ఊహుఁ—అది తప్ప'

'తప్పితే ఉపాయం లేదు!'

'ఏం చిత్రంగా మాట్లాడుతున్నావు! నిన్ను వదిలిపెడితే మీ అమ్మ మతం మారుతుందీ? అప్పుడు నేనేంకాను! ఆవిడ ఎల్లకాలం అలాగే ఉంటుంది— మనమిద్దరం చెప్పకుండా వెళ్ళిపోదాం—రా—'

'నేనూ అన్నీ ఆలోచించాను. నేను చెప్పకుండా, తనకు యిష్టంలేకుండా, వెళితే, భావిలో పడతానంది. అన్నంత పని చేసి తీరుతుంది—ఆమె తెలివి తక్కువది

కావి, అదంతా గడుసు తనం కాదు—'

'ఏ తరం అయితే నేం!—అందుచేత'.

'మనం ఇదివరకు ఆమెకు సలాంలు చేస్తూ, గౌరవిస్తాంటే నెత్తికెక్కుతూంది. మీరు తిరగబడితే, చెప్పినట్లు వింటూంది.'

'సరే! ఏం చేయమంటావు?'

'శెలవు తీసుకు వెళ్తానని చెప్పండి.—సరే తెలిసిందే కదా! యిప్పుడు కాదంటుంది. అప్పుడో నుంచి, మీరు పెద్దపెట్టున కేకలు వేసి, యీ పెండ్లాం నాకు అక్కర్లేదు, ఇన్నాళ్ళనుంచీ మీరు పెట్టే తిప్పల్ని సహించాను. ఇక ఊరుకోను. మీకూతుర్ని మీ వెంటే తీసుకోండి— అని, నా కేప్పుచూపి 'ఇన్నాళ్ళకు నా పీడ వదిలిపోయింది. పోనీ, అని వెళ్ళిపోండి. నేను ఒక పదిహేను రోజులు యిట్లో అమ్మని వేధిస్తాను. 'నా కాపురం పాడు చేశావు. ఆయన ఎవరినన్నా మళ్ళీ పెళ్ళి చేసుకుని సుఖంగా ఉంటారు. నా కర్మం——' అని. ఊళ్ళో అందరూ ఎవరికి తోచినట్లు వాళ్ళు చెప్పుకుంటారు. నేనేమీ మాట్లాడను—,

'తరువాత?'

'ఏముందీ అప్పటికి అమ్మకి తెలివి వస్తుంది. ఇంతలో నాన్నకూడా ఎనుకతిరిగి, కాశీకేచి పోతానని కూర్చుంటాడు'

'నిజంగానా మీ నాన్నకు కూడా ఇదంతా చెప్తావా!'

'ఆ. ఆయన యిష్టం మీదనే యీ నాటకమంతా ఆడబోయేది. తరువాత, అమ్మనూ, నాన్ననూ, వెంటబెట్టుకుని వస్తాను. వాళ్ళు, కాశీకో, రామేశ్వరమో వెళ్తారు. మనం—'

'మనం, బెంగుళూరు వెళ్ళి ఒక నెలరోజులు ఉండి వద్దాం'

౪

మరునాడు, రోజంతా కాముకు ఉమాపతి కనబడనే లేదు.

అయిదున్నర దాటింది. పెట్టెలూ బండీలో ఎక్కించి, భార్యను రమ్మని పిలిచాడు, ఉమాపతి.

'అదికూడా ఎక్కడికి, ఇప్పుడు?' అన్నది, అత్త.

'ఎక్కడికా. నేను వెళ్ళిపోతా!'

'తరువాత పంపిస్తాంలే. ఏం రావడం, వెళ్ళడం పట్టుమని పదిరోజులన్నా ఉండకుండా ఒక్కమారైనా? ఇప్పుడుమించిపోయిందా. ఏం తొందర? ఏం చేస్తుంది?

'రాక యిక్కడ ఏం చేస్తుంది?'

మరి నేర్చుకుంటున్నావే, మాటలు! ప్రతి నాలుగు రోజులపాటు ఉంచుకుంటే ఎప్పుడూ అలాగే! నీసొమ్మంతా పడిపోయినట్టు గుంజుకుంటావే!

'నాకు చాలా యిబ్బంది, ఒంటిగా ఉండలేను!'

'అయితే ఇదివరకల్లానో?'

'అత్తగారూ! అనవసరంగా అక్కర్లేని మాటలు మాట్లాడబోకండి. నా భార్యను నా వెంట పంపుతారా, లేదా?'

'సంపాదించావు లేస్తూ! ఎలాగైతే నేం భార్య నీకే ఉంది, ఇక ఎవరికీ భార్యలు లేరు, కాపురాలు చేయలేరు!'

'పంపుతారా లేదా?'

'ఏం ఆదేపట్టుకు వదలవేం?'

'నాకు ఇన్ని మాటలక్కర్లేదు. పంపుతారా లేదా?'

'ఇప్పుడు కాదు. పదిరోజులుపోని ఏమంతతొందర?'

'ఇప్పుడు కాదు, అయితే ఎప్పుడు కాదు. మీ అమ్మాయిని మీరే ఉంచుకోండి!'

'ఇదుగో! నోటికి తిన్నగా రానియ్యకుమా! ఏమిటా ఒళ్ళు తెలియని మాటలు? పోనీలే ఉంచుకుంటాము, మాకు చేదు కాదులే! నీదగ్గర చాకిరీ చేయడంకన్న—

ఏమిటండీ. ఊరుకున్నకొద్దీ మరీమరీ పోతు న్నారు. ఇన్నాళ్లనుంచి ఓపికపట్టి చూశాను. నన్ను మోసపెడుతున్న తిప్పరేనా, పెద్దమనుష్యులలో చెప్పండి. యేమంటారో! యిప్పటికి నాకష్టాలన్నీ తీరిపోయినాయి. పొండి! మీకూతురికి ఒక సలాం'

ఉమాపతి బండిలో ఎక్కి వెళ్లిపోయినాడు. ఆయన అరుగుమీదనే, మ్రాన్పడి కూర్చుని ఉన్నాడు. భార్యనూ, వారించలేను, అల్లుడితో మాటాడలేదు.

ఆమె ఉమాపతి బండిఎక్కి వెళ్లిపోగానే, ముఖానికి చీరచెంగు అడ్డంపెట్టుకుని దుఃఖిస్తూన్న కూతుర్ని లోపలికి లాక్కుని తలుపు వేసింది.

ఎక్కడికి పోతాడు?—రేపే పాటికి చేరుతాడు. అని లోపలనుంచి ఆమెగొంతు వినవచ్చింది.

* * * * *

ఆ అమ్మాయిని భర్త వదిలేశాడని ఊళ్లో అందరూ చెప్పుకుంటున్నారు.



# సంతాపము

యడ్లపాటి వేంకట సుబ్బారావు, బి. ఏ.

హృదయ సంతాప మింతేని వదిల వడదు
మరచి పోవుద మన్నను మరపు రాదు
భృంగ రాజమ! నీ కెట్టి మృత్యు వకట
సంభవించెను! నాదు దౌర్భాగ్యంబు కతన.

సీ. బాల భాస్కర కర లీలల విరిసిన
మకరంద మధుర కోరకము లందు
స్వేచ్ఛా విహార విశేష సమార్జిత
రస భావ కలన నిర్గమన వగుచు
తన్మయ మధుర గీతారావ సంభృత
ఝుంకార నినద విస్పష్ట వగుచు
బహు విధోదంచిత భ్రమణ లీలా గతి
నమోద్మద కారణ సహిత వగుచు

తే. గీ. అస్మదీయ గృహాంగణ మందు లలిత
రీతి జరియించు నిన్ను నా చేత నున్న
ఉత్తరీయంపు కొంగున నునుచు పాయ
గొట్టి నట్టి మహా పాతకుండ నేను,







# చండ భార్గవము

(నాటకము)

భాస్కర రామచంద్ర రావు, బి. ఏ., ఎల్. టి., ఎఫ్. టి. ఎస్

## ప్రథమాంకము

### రంగము: ఆశ్రమ భూమి.

(జమదగ్నియు, వసుమనుఁడు, గౌతముఁడు, సువర్చసు, పరశు రాముఁడును ప్రవేశము)

జమ: కుమారులారా! మీరు సాంగోపాంగ మధ్యయన మొనర్చితిరి సంతోషము! ప్రపంచ వ్యవహారము లందు మోహితులు కాక సూఁటిగాఁ బ్రవర్తించుటకు మార్గ దర్శకము లగు యోగ్యాంశములఁ గొన్నిఁటిఁ దెల్పెదు. వసుమనా! నీ వందఱిలో జ్యేష్ఠుఁడవు. నీవు మొదటఁ జెప్పుము.

వసు: జనకా! మీ యనుగ్రహమున నాకుఁ దోఁచిన యర్థమును మనవిఁ జేయుచున్నాను.

సీ. దేవుఁడే జనయిత్రి; దేవుఁడు జనకుఁడు; దేవుఁ డాచార్యుండు; దేవుఁ డతిథి;
అనవద్య కర్మల నాచరింపఁగఁ జను; వల దితరము లెటు వంటివైన;
బెద్దలు చను త్రోవ ప్రియముఁ బథ్యంబెటు; బెడ దారులను దలఁ బెట్టఁ దగదు;
స్వాధ్యాయ మనిశంబు సలుపంగ వలె; ధర్మ సూక్ష్మ స్వరూపము లూహ్యఁగ వలె;
గీ. సత్యమును భూత దయయుఁ బ్రశాంతిఁ గలిగి । యఖిల కర్మలు పరమేశ్వ రార్పణములు
సేసి; న్యాయంబు త్రోవ నార్జించి ధనము । నర్థతతి వెస సాధింప నగు నరుండు.

జమ: కుమారా! లెస్సగ వచించితివి. ఇఁకఁ గొన్ని పొడి ప్రశ్నలడుగు వాఁడను. మీర లొక్కొక్కరు నొ
వేఁడు నుత్తరము లిందు, చూతము.

కుమారులు: చిత్తము.

జమ: తెలియఁ దగిన దేది? వసుమనా! చెప్పుము.

వసు: బ్రహ్మ వస్తువు.

జమ: గౌతమా! నీ వే మందువు?

గౌత: మాయా స్వరూపము.

వసుదేవుఁడు:—మద్రాసు పౌరులచే ఆంధ్ర చార్లి చాంప్లిను బిరుదు పొందిన మాస్టరు సూరి, ౧౧ ఏండ్ల బాలుఁడు.

శ్రీకృష్ణుఁడు:—మాస్టరు నాగలింగం, ౭ ఏండ్ల బాలుఁడు.



బాలకృష్ణునితో యమునా నదిని దాటుట.



కాళింగ మర్దన.

జమ: మీ శిష్యులు వచించిన వానిలో నాకే మాత్రము భేద మగుపడ లేదు. ఒకటి దెలిసినఁ మఱొక్కటి తెలియక మానదు. బ్రహ్మ వస్తువు నెఱింగిన మాయా స్వరూప మెఱింగి నట్లే! మాయ నెఱింగిన బ్రహ్మ నెఱిగి నట్లే! సువర్చనా! నీ వేమందువు?

సువ: నేను సాక్షి రూపి యగు బ్రహ్మ నని.

జమ: సెబాసు! నీవు నీకును బ్రహ్మమునకు గల సంబంధము సూచించితివి. సరే కాని మీ ప్రత్యుత్తరము లన్నియు నారూఢ జ్ఞానికి ననుభవ వేద్యము లగుం గాని సామాన్యులకుఁ బట్టుపడునవి కావు. రామా! నీవు చెప్పుము చూతము! తెలియఁ దగిన దేది?

పరశురామ: నేను కించిజ్జ్ఞుఁడ నని.

జమ: సెబాసు! తనయా! నీవు ప్రపంచమున కక్కఱకు వచ్చు వాఁడవు. మఱి యొక ప్రశ్న! నేర్చుకొన దగినదేది?

వసు: వేదములు.

గౌతమ: అభ్యసింపఁ దగినది ‘‘యోగము’’

సువ: మంచి నడవడిక.

జమ: రామా! నీవు వచింపుము అభ్యసింపఁ దగిన దేది?

పరశు: విధేయత.

జమ: భళి భళీ! మఱి యొక ప్రశ్న. కట్టుఁ బడఁ దగినది దేనికి? వసుమనా!

వసు: ధర్మమునకు.

గౌత: గురువాజ్ఞకు.

జమ: సువర్చనా! నీవు?

సువ: శిష్టాచారమునకు.

జమ: రామా! నీవు? కట్టు బడఁ దగినది దేనికి?

పరశు: తన నాలుకకు.

జమ: భళి భళీ! రాముని సదుత్తరము లెంతేని కొనియాడఁ దగినవి. మీరలు గ్రంథస్థ వచనముల వల్లించితిరి. రాముఁడు తనలోఁ దా నాలోచించి సదుత్తర మిచ్చెను. ఇది మేధా విశేషము. రాముని ప్రత్యుత్తరము లన్నియు నభ్యాస సాధ్యములు; మీ వట్లు గావు. వేదములను జదివి గురుముఖమున నర్థ విచార మొనర్పుటయు గాక, తన బుద్ధితో విమర్శించి విశేషాంశములం గ్రహించుటే మేధా శాలి లక్షణము.

సీ. భయ భక్తులను నూఁకఁ బచ్చిక మేఁత దిడి, గురువను గోవు దగ్గఱకు జేరి,
సరవిఁ దద్వాగ్దత్త సర సార్థ దుగ్ధముల్ బడసి, స్వబుద్ధిఁ గవ్వముగఁ జేసి,
త్రచ్చి సాధించి తత్సారమౌ వెన్నను మేధావి శిష్యుఁడు మేలు వడయు
నెంతటి గురు వున్న నెన్ని శాస్త్రమ్ములు కడముట్టఁ జదివిన గాని, విద్య

గీ. ఫల మొసంగదు, తన మేధ కలిమి కతన। బొందు నయ్యది ప్రాక్తన పుణ్య వశము
కడలి ముంచిన కడవ యా కడవ మించి। యుదకమును దెచ్చు నెట్లు? మీఁది యరయుఁడు.

మఱచితిని, మీ యమ్మ రేణుక యుదకమును దేనరిగి జాము సేపాయెను గదా? ఇంకను రాని కారణమేమో? గంగ రేవులోఁ గాలుజాఱి పడెనా? లేక మఱియే ప్రమాద మేమయిన సంభవించెనా? కనుగొని రండు. రామా! నీవు హోమమునకు సమిధలం గొని రమ్ము, పొమ్ము!

కుమారులు: చిత్తము! (నిష్క్రమింతురు)

జమ: (తనలో) రేణుక రాని కారణ మేమొకో?! [అని కనులు మూసికొని యోగ దృష్టింగని] హా! హా! యువతు లెంత టి కైనం దగుదురుగదా! ఔరా ఇమ్మదాంధ జలముదేర నరిగి తజ్జల మధ్యమున నిజ జలజ గంధులం గూడి గంధర్వుఁ డొకఁడు జలక్రీడ లాడుచుండఁ జూచుచు నదేక ధ్యానమున నిలిచి కొన్నది గదా, యీబాధకి ఎన్ని కట్టుదిట్టములతో స్త్రీలను గాపాడుచున్నను వారి చాంచల్యమును మానపఁజాలరు కదా. అక్కటా! దీనికేమి చేటు కాలము వచ్చెను.

చం. మహిత వ్రతోపవాస నియమ స్థితి, పల్మఱు వేదగోష్ఠి, ప్ర
త్యహమును గంద మూలములు తప్పని భోజన, మేక భుక్తి, ని
స్పృహ జన మైత్రి; తా గృహిణి; బిడ్డలు గంపెడు; భర్త యుండనే!
రహి నిఁక నమ్మ వచ్చునవునా! యిల గేస్తులు ధర్మపత్నులన్?

{ రేణుక నీటి కడ కడవతోఁ బ్రవేశము.
కుమారు లను గమించుచుందురు }

జమ: (రేణుకం గని, కనులెఱ్ఱజేసి) ఛీ! కులటా! నిలు మచ్చట!

మ. జలముం దేరగ నేగి మే ల్భళి భళీ! సంసారివా? వేశ్యవా?
సలిల క్రీడల జూడ నిల్చితివె? లజ్జా హీనవై పాంసులా!
కుల శీలమ్ములు మూలఁ ద్రోచితివె? చేకూరెం దపస్సిద్ధి నీ
వలనఁ న్నా సరి తాప సోత్తములలో బ్రఖ్యాతి; మిన్నందితిన్.

కుమారులారా! ఈ క్షణమం దీనిం దెగ నఱుకుఁడు.

చం. తనయులు! రండు, దుండగిని, దద్దయు దుష్కృతఁ దాప సాంగనా
వన విష కంటకంబుఁ, గులపాంసనఁ, బాంసులఁ దీని కుత్తుకం
దునుముఁడు, కొండు గొడ్డలిదె, ద్రోహిని మాత యటంచు లేశముం
గని కరముం దలంపకుఁడు, గ్రక్కునఁ గండలు చెక్కవైవుఁడీ!

కుమారులారా! ఎంపుల కట్లు కొయ్యల వలె నిలబడినారు? నఱకుఁడు! తల నఱకుఁడు!

కుమారులు: (తండ్రి పాదములపైఁ బడి) నాయనా! క్షమింపుఁడు! క్షమింపుఁడు! అక్కటా! ఘోరము. ఘోరము

(పరశురాముఁడు సమిధలను మోసికొనివచ్చి దూరమునుండి చూచి)

పరశు: (జనాంతికముగ) ఏమి యీ ప్రమాదము? మహా మహిమోపేతుఁడును బ్రహ్మర్షి చంద్రుఁడు నగు మాతండ్రి కింతటి యుగ్రాకారముగ నెన్నఁడును గని విని యెఱుంగను, ఏలనో పరికింతును గాక.

వసు (లేచి చేతులు మోడ్చి)

మ. తగవే? తండ్రి! విధింపఁ నిట్టి పని, క్రోధం బొప్పునే? మానికిం
దగునే? స్త్రీ వధ, మాతృ హత్య; అకటా! ధర్మజ్ఞుఁడై మాకుఁ గ
ట్టఁగ వేరెద్దియు శిక్ష లేదొ? మదిఁ జూడం రాదె యర్ధాంగియే?
తెగటార్పం దగు నయ్య? పిల్లలను బ్రీతిం గాంచి కాపాడవే!

జమ: (క్రోధముతో) ఛీ! ఛీ! మీరా తనయులా? అవినయులు. అధిక ప్రసంగులు. రామా!.. రామా! రామా! ఎందుంటివి?

పరశు: (సమిధలం బడవైచి) ఏమి నాయనా, ఏమి నాయనా, ఏమి యాజ్ఞ?

జమ: రామా! ఆరాక్షసిని, ఈ యధిక ప్రసంగులను ఖండించి వేయుము.

(పరశురాముఁడు గండ్ర గొడ్డలితో నట్లొనర్ప బోవుట. తెర పడుట. శివశివా ధ్వనులు)

(లోపల, తెర యెత్తగ)

జమ: సెబాసు! సెబాసు! పరశురామా, తనయుఁడవన్న నీవ కదా! చిరంజీవివై, అజేయుఁడవై, అసహాయ శూరుఁడవై జగదేక వీరుఁడవై వర్ధిల్లుము. మెచ్చితిని. మరేమి వరము గలయునో కోరుము.

పరశు: జనకా, మీ వాక్యమప్రతి హతము. ఈ నా చంపిన తల్లిని, సోదరులను, బునర్జీవితులఁ జేసి, దయఁ జూడుము. ఇదియ నే గోరు వరము.

[దేవతలు పుష్ప వృష్టి]

జమ: పుత్రా! మెచ్చితిని నీ భక్తిని, నీ గురురాగమును, నీ విధేయతను, నీ సమయజ్ఞతను. ఇచ్చితిని నీ కోరిన వరము. పునర్జీవితు లగుదురు గాక!

(నిష్క్రమించును)

[సోదరులును, దల్లియుఁ బ్రవేశించి, పరశురాముని గౌగలించుకొని]

తల్లి: నాయనా! పరశూ! మమ్ములను జంపితివి గదా. మఱల మే మెట్లు బ్రతికితిమి?

పరశు: తల్లీ! పరమ కరుణా సముద్ర యగు తల్లిని జంపిన పాపిష్టుఁడు గాను గా? ప్రాణముల సాధించు కిరాతుఁ డుండునా మహా మహిమోపేతుఁడగు మాతండ్రి తపస్సిద్ధి నెఱింగి యట్లొనర్చితిని, గాని అతని యాజ్ఞ నెఱవేర్చిన మాత్ర మున నతని కోప ము పశమించెను. ... [illegible] ... జీవితు లైతిరి. [సభా సదులంగని] మహా జనులారా!

ద్విపద. జనకు నానతిఁ జేసి జనని సోదరుల
దునిమి, రాముఁ, డటంచు, దుడుకుమై నన్న
దమ్ముల జనయిత్రిఁ దగదు చంపఁగను;
నెమ్మది మా తండ్రి నిరుపమ మహిమ
బాగుగ నెఱిఁగిన వాఁడ, నౌ కతన,
నాగతి నొనరించి తంతియు నుండు!

[తల్లిం గని] తల్లీ! తల్లిదండ్రు లిరువురును బుత్రులకు సమాన పూజ్యు లయ్యును, దెలిసియో తెలియకయో యీయెడల నే నాచరించిన సాహస కృత్యమును క్షమించి నన్నాశీర్వదింపుము. [అని ప్రణమిల్లును.]

రేణుక: నాయనా, పరశూ! నే ననాలోచితముగ నాచరించిన మానసిక కిల్బిషము నీ పరశు సంస్పర్శచే నశించి, స్వస్వరూప సిద్ధికి హేతువయ్యెను. అహో మనుజులకు, రౌరవాది నరకములకుఁ, బరశు వేది కదా, నీపరశువు ఇట్లు నాకుఁ బరమోపకారి యైన పుత్ర రత్నమెడల శత్రుత్వ ముండునా! లెమ్ము. లెమ్ము. నీ వఖండ తపో విభూతి హరిహరుల దయకుఁ బాత్రుఁడ వగుదు గాఁక. కల్పావసానమున సప్తర్షి మండలమున నొక్కఁడవై విరాజిల్లెదు గాఁక.

పరశు: తల్లీ! అనుగ్రహింపఁ బడితిని. నీ యాశీర్వచన మప్రతిహత మగుం గాదె? ఇదె నేను శ్రీహరిం గూర్చి తప మాచరించు వాఁడ.

రేణుక: నాయనా వెళ్లిరమ్ము. జయమగుఁ గాఁక.

[తెర పడును]



# చండ భార్గవము

## ద్వితీయాంకము

### రంగము : అడవి.

(తటాక తీరమున కార్తవీర్యార్జునుఁడు ప్రవేశము)

మ. కృత వీర్యాత్మజుఁ డై, జగ ద్విశద సత్కీర్తి ప్రతాప ప్రభా
న్విత సత్క్షత్త్రియ వంశ సంభవుఁడనై, పెంపొందుచు, న్వేఁట్రినే?
యతి రాణ్మౌళిఁ, ద్రిలోక సంస్తుత్యు, ఘను, దత్తాత్రేయు, మూర్తిత్రయా
ద్భుత సత్యాత్మకుఁ, గొల్తుఁ గాఁక! సిరి, రాఁ, బోఁ, ద్రోయు వా, రుందురే?

నిక్కము! నిక్కము! అతఁ డవ్యవధూత శిఖామణి దత్తాత్రేయుఁడే నిక్కము! ''బాలోన్మత్త పిశాచ వత్తు'' ను కరణి, తన స్వరూప మితరులకు బయలు పడనీక, యక్కడక్కడ సంచరించు చుండును. ఆయ్యడవి చెంచు లొక్కొక్కప్పు డిక్కాననములో, నట్టిపిచ్చి వాని నొక్కనిఁ జూచితిమని చెప్పియుండిరి. ఇతఁడే యతఁడు. నిక్కము. నేను, మృగయా వినోదమున వన్య మృగముల వెన్నంటి గ్రుమ్మరి గ్రుమ్మరి పురికిం గ్రమ్మఱుతతిఁ గాక తాళియముఁగ నిచ్చెలువు దరి కరుదెంచితిని. ఒడలి బడలిక సడల నియ్యెడలఁ బుడిసెఁడు పానీయమ్ములఁ గ్రోల హయ మవరోహించి చూడ, యీ పాదుకలు నీ దండ కమండలములు కను పండు వొనర్చెను. అక్కజ పడి చూచు చుండ జల మధ్యమునుండి గోట్టి భాస్కర సాకాశ ముఖారవింద మొకటి పైకిఁ జూపట్టి, నన్నుఁ జూచిన వెంటనే, యుదే బుడుంగ్గని మునిఁగెను. నే నట్లే మొండికి పడి మఱల లేచిన జూతు గాకని నిలిచితిని. ఆరు నెలలను మఱల నొక తూఱిఁ, దల యెత్తి చూచి మున్పటిఁ వలె నీటిలో మునిఁగెను. మఱల నారు నెలల కగుపడెను. మఱల మునిఁగెను. ఆగు నది; కాని నిలిచిన వాఁడ నిలిచి నట్లు ప్రాణమ్ములు త్యజింతు నొండె; అమ్మహాత్ముని సేవించి తదనుగ్రహము బడయుదు నొండె. ఉద్ధృతుల నెందఱ నాశ్రయించిన ఫల మేమి? కనిపెట్టెద కనిపెట్టెద. ఇంకను గని పెట్టెద. ప్రాణము లూడి మేను పడిని బడు నటుల గనిపెట్టెద! అర్జునా! ఈ నిగ్గనాటవి యందే నీ యసువులు విసర్జింతువు గాక! నీవు కృత వీర్య పుత్త్రుఁడవు గాని కృశ వీర్య పుత్త్రుఁడవు గావు కదా! ఇప్పటినుండి కదలను!

(తెరలో ధ్వని)

ఎవఁడవురా! మానవా! ఇన్ని దినములు నర మాంసము లేక చిక్కితిని. నీవు చిక్కితివి. ఎందుఁ బోఁ గలవు? చక్కడించి మెక్కుదు దాన!

(భూతము ప్రవేశము)

కార్త: మెక్కుడగవు గాని రమ్ము. సిద్ధముగా నుంటిని!

భూత: ఓహో! రాజపుత్రా! నీధైర్యమునకు మెచ్చితిని. నేను ధన యక్షిణిని, ఇచ్చటి కనతి దూరమున మహ యొకటి భూగర్భ మయినది కానవచ్చును, దాని నీవశ మొనర్చెదను. రమ్ము!

కార్త: పో పో మ్మాయలకు! నీవు మెచ్చ నక్కఱ లేదు. నీధన మంతకు నక్కర లేదు.

భూత: ఓరి పిచ్చివాడా! శ్రీ రా మోకా లడ్డు వా రుందురా? అర్థ హీన మగు బ్రతుకు వ్యర్థ మని విన ,,అర్థమూల మిదం జగత్తని యెఱుఁగవా? ఎంద ఱెందరు నిరర్థులై, ప్రపంచ మం దెట్టి యెట్టి యవస్థల నవమానముల పొలగుచున్నారు. ,,సర్వే గుణాః కాంచన మాశ్రయంతి.'' ధన మెన్ని మోసముల నైన గప్పుచ్చి లేని సుగుణముల గల్పించును.

కార్త: చాలింపు, నీ యుపన్యాసము! ప్రపంచము నందలి సర్వానర్థము లర్థ మూలము లని యెఱుంగని వా వలదు. వలదు. నన్ను ప్రలోభపెంప వలదు, చనుము. ఇంకఁ బల్కిన దత్తాత్రేయు లాన కలదు!

[భూతము నిష్క్రమించును]

( తెర లో )

మహా పురుషా! రక్షింపుము. రక్షింపుము. ఇమ్మహా వ్యాఘ్రము నన్ను గబళించు చున్నది.

కార్త: (తనలో) ఈ కాంతారమున గాంతా ఆలాప మొకర్తుక యార్తారవము విన వచ్చెను. ఓ వ్యాఘ్రమా! ఈ శబ్దభేది, బాణమున కంత నా శిరము భేదించుఁ గాక! (అని శరము విడుచును)

(మోహిని ప్రవేశము)

మోహిని: అయ్యా! వ్యాఘ్రమును జంపి నన్ను రక్షించితివి. నేను రంభ తోఁబుట్టువగు నప్సరసను. నేను పక్షీ జనంబులు నిచ్చేరుఁగల సరోవరమున వారి కేళులం గూడి యాడు చుండి, మఱల స్వర్గమునకు తఱి, నీ మనోహ రాకార వాగురం దవిలి మచ్చిత్త కీర ముత్తమ పాటునం దత్తరించి ... ముందఱ కడుఁగిడ నేఱక నెచ్చెలులం గనుమఱపించి నన్నిచ్చటికిం గొని వచ్చెను. నీ మీది వలపు ముప్పుగ వచ్చు చున్న నన్నీ గొప్ప ముప్పు నుండి తప్పించితివి. అట్టి నీ కటాక్ష వీక్షణమును మఱిఁ గొంత ప్రసరింప జేసి, నా యావన రాజ్య లక్ష్మిం గైపట్టుము.

కార్త: అబలా! ఇవేటి మాటలు? నీ వప్సరసవే యగుదువు గాక, రంభ తో బుట్టువే యగుదువు గాక, లేక, ... వే యగుదు గాక! నే కై పట్టనోప! ప్రాణ దాత నైన నేను నీకు జనక తుల్యుఁడను. పలికి నా ... వెళ్ళుము!

(మోహిని యదృశ్య మగును. నీటిలో నుండి దత్తాత్రేయుడు లేచి వచ్చి)

దత్తా: సెబాసు! సెబాసు! కార్తవీర్యార్జునా! మెచ్చితిని, నీజితేంద్రియతకు. నీ భక్తిశ్రద్ధలకు, రమ్ము, నీ కేమి కావలె నో కోరుము.

కార్త: (దత్త పాదములపై వ్రాలి) దేవా! నా జన్మ ఫలించెను. నేఁ గృతార్థుఁడ నైతిని. బ్రహ్మాదులకు దుర్లభ మగు భవ ద్దివ్య దర్శనమున నా జన్మ కోటి భవములు భస్మీ పటల మయ్యెను.

దండకము. శ్రీ దత్త దేవా! సుధామాధురీ స్నిగ్ధశుద్ధ స్వభావా! భవాబ్జాతు సంభావి తాంఘ్రి ద్వయా, అద్వయా! సద్దయా రూప విశ్వ స్వరూపా! అరూపా, సురూపా, విరూపాత్మ హృత్సౌధ దీపా, చిదానంద రూపా, యతీ, ధీమతీ, తత్ప దార్థ స్వరూపా, లసద్యోగి హృత్పద్మ వాసా, మహోన్మత్త వేషా, హృషీకేశ! యోగీశ్వరా, యోగి వంద్యా, అలక్ష్మీ వినాశా రమేశా, చిదాకాశ హంసా! అహో అత్రి పుత్రా! లస ద్జ్ఞాన నేత్రా! నమో ఆది నారాయణాయ, మహా జ్ఞాన సామ్రాజ్య విద్యా ప్రదానాయ, విద్యా నిధానాయః పూష్ణే నమో విష్ణవే జిష్ణవే చామృతేశాయ! నమస్తేనసూయానసత్యాయచానందనృత్యాయచాశాంబరాయ! నమః కామ పాలాయ కాంతాయ శాంతాయ కాంతి ద్దాత్రే నమః కామి తార్థ ప్రదాత్రే కృతఘ్న ప్రహర్త్రే, మహా శంభవే జీవ రూపాయ జప్యాయ ఛాయుష్యదాయ సదాధ్యాన సిద్ధాయ నిష్ఠాయ శుద్ధాయ దివ్య గంధాయ ప్రసిద్ధాయ జ్యోతిష్మతే వాగ్మినే భోగరూపా, లస ద్దివ్య గంధాను లేపా, అమేయ ప్రతాపా! జిత క్రోధ దేవాది దేవా! నను బ్రోవ నీవా, గట్టిగా నీ పదాబ్జమ్ములం బట్టితిం! దత్త దేవా! నమస్తే! నమస్తే! నమస్తే నమః!

దత్త: అర్జునా! నీస్తుతికి మెచ్చితి. నీ కేమి వలయునో కోరుము.

కార్త: మహాను భావా!

ఉ. పట్టితి నీ పదాబ్జములు పాలను ముంచెదొ, నీట ముంచెదో!
యెట్టుల నైన సమ్మతమె; యేం గడు ధన్యుడ మిమ్ము బోంట్లు చూ
పట్టుట జన్మ కోటి కృత, పాప చయమ్ములు భస్మ మయ్యె; వే
తెట్టిదిః గోర; నా కొసగవే పద సేవ, భవాబ్ధి దాఁటెదన్.

దత్త: అయిన రమ్ము, నా వెంట!

(నిష్క్రమింతురు)

(రుచికుఁడు, కుశికుఁడు, ఇరువురు ముని పుత్రులు ప్రవేశము)

రుచిక: కుశికా! నీవు సమిధల నేఱితివా?

కుశిక: నీవు బిల్వములను గోయు నంతలో నేఱుదును, అదర్భలను మేయుచున్న కృష్ణ సారములను జూడుము. అవి సగము నమిలిన దర్భలతో వీపులు నిక్క వెట్టి, మన మాటల నాలకించు వాని వలె నెట్లు నిలిచి యున్నవో చూడుఁ!

రుచిక: అ వట మూలమున నే కదా మన భార్గవ రాముఁడు, శ్రీ మహావిష్ణువుం గూర్చి తపస్సు చేసినది! కుశికా! కాల మెట్లు పరు విడు చున్నదో చూడుము. మనము మువ్వురము నొక్క నాడే, ఒక్క ముహూర్తము నందే, యొక్క యాచార్యు నొద్దనే, ఓం నమః లారంభించితిమి కదా! పర్యవసాన మెట్లు బయలు దేఱినదో కని పెట్టితివా మతి?

కుశిక: రుచికా! పూర్వ సంస్కారమును బట్టి వ్యక్తులు భిన్న భిన్నముగ బయలు వెడలు చుందురు. మన భార్గవ రాజ
ని పుణ్యోదయ మట్టిది. మన యదృష్ట మిట్టిది. ఒక తల్లితోనే పొదగఁ బడి, యొక గూటిలోనే పెరుగుచున్న
వే కదా, కాక కోకిలములు? ముప్పురము మునిపుత్రులమే! తొండమున్న మాత్రముననే! దోమ, యేనుఁ గగునా?

రుచిక: ఇప్పుడు మనకును జామదగ్న్యులకు నిజముగా యోగ్యత యందు హస్తి మశకాంతరమే. తపస్సునందేమి,
శాస్త్రమునందేమి, శౌర్య సాహసములందేమి, యసదృశుడన వచ్చును.

కుశిక: అదృష్టమునందు మాత్ర మేమి లోపము? లేని యెడల నంత యచిర కాలమునందే బాలకునకు శ్రీ మహాశివు
వు ప్రత్యక్షమై, యకారణ వాత్సల్య మగు పఱచి, తన శక్తి నంతయు నతని యందు బతిష్ఠించి దీవించి పం
లునా?

రుచిక: ఇప్పుడు పార్వతీ పరమేశ్వరు లిరువురును దమ కుమారుల కన్న నెక్కుడు గారాబముతోఁ బోషించు చున్న
వారఁట కదా?

కుశిక: ఏమి యాశ్చర్యము? గుణవంతునిం గన్న యెట్టి దుర్జనుఁడైనను గౌరవ బుద్ధిం దిలకించు చుండ, సకల సుగు
ముల పుంజమగు పరమ శివుఁడు గౌరవించుటలో నేమి వింత?

గీ. పరఁగ మాణిక్య మురగము ఫణము నందు;
దామసీ రాత్రి శశిని మస్తకము నందుఁ;
దాల్చు టెంతయుఁ గనమె? వింతయె తలంప,
భార్గవుని గారవించుట పరమ శివుఁడు?

రుచిక: అంతయు సరియె కాని ముని పుత్రులకు ధను ర్విద్యాభ్యాస మేల? ఏ రాజుల నెదిరింప వలె? నే శత్రువు
మట్టు వెట్ట వలె? నే దేశములు సాధింప వలె?

కుశిక: రుచికా! నీది పొర పాటు. తప శ్శక్తి యున్నటికి మిన్నయే! సరి కాని యుద్దాని నల్ప కార్యములకై వి
యోగ పెట్టుట సరి కాదు. ప్రపంచ వ్యవహారములతో సంబాధింపక నిస్స్పృహులై యే వన భూములందో కా
ము నెట్టు నిస్సంగులకు నేదియు నవసరము లేకున్నను, స్వధర్మ శీల సంరక్షణము కొఱకు, ప్రపంచమున బా
పడు వ్యక్తికి, నవయవ సౌష్ఠవమును గాయబలము నెంతో సహకారములుగ నుండును. 'శాపా దపి శరా దపి'
యను మాడ్కి నైహిక సముపార్జన కొఱకుఁ గాయిక కృష్యాదులును బరమార్థ లాభమునకుఁ దపస్సు దే
ధారికిఁ జెల్లునని, ద్విజులకు యోగ్యములు కావను టెట్లు?

రుచిక: ఆత్మ బలములో నన్ని బలములు నిమిడి యున్నవి. మానసిక బలమునకు సాధ్యము కాని దెద్దియును లేదు.
కాయ బలము కేవల పశుబల మగుట, వివేకమును మఱుగు పఱచి, లేని యనర్థము లందించును. మానసిక బ
యోగ మూలముననే యది దేహికి భూషణ ప్రాయమై, ధర్మ మార్గ వినియోగార్హమై కలుగు కష్టముల న
నిటి నోపికతో నోర్చుకొనుటకు సహాయ కారియై యుండును.

కుశిక: ఇంతవఱకైన గాయ బల ముపయోగ పడు నని సమ్మతించితివి గదా. శౌర్య ధైర్యము లంగ బలముచే
గలుగు చున్నవి.

రుచిక: అది పొర పాటు! ధైర్య శౌర్యములు మానసిక ధర్మములు గాని, గాయిక ధర్మములు గావు, జన స
కాయ మాత్మ దీపముచే వెలుగును గాని యన్యము గాదు.

కుశిక: రుచికా! ఇన్ని మాట లేల? 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధన' మ్మను వచనాను సారము మన మెన్ని విధముల నాలోచించినను, దేహమును బోషించుకొన వలెను. కాయిక కృషిచేత నది వర్ధిల్లును.

రుచిక: కృషి యను నదే మనో వ్యాపారము. మనస్సు నే యింద్రియమున వెలయింప జేసిన నా యింద్రియము బల పడు ననుట యనుభవ సిద్ధము గదా! కాయ వృద్ధియందే లక్ష్యముంచిన నదియే కాయిక కృషి, కావున నాత్మ బల మన్నిటికిని మూలము, గాని జడ ప్రాయ మగు దేహము కాదు.

కుశిక: కృషి మనో వ్యాపారమే యగు గాక, మనస్సు చేతనే సకలేంద్రియములును బలపడును గాక, పరమేశ్వరుడు ప్రసాదించిన సర్వేంద్రియ పరికర సామగ్రిని, మనో వ్యాపార మను కృషి చేత దుష్ప్రవృత్తి పట్టకుండ బరిశుద్ధములుగా దత్త దుచిత వ్యాపార నిర్వహణ దక్షములుగా నుంచుకొనుట మనలను జెందినది గదా. అట్లు కాయ సిద్ధిని లక్ష్య శుద్ధిచే సాధించి విషయేంద్రియముల దుడుకు దన ముడిపి ప్రశాంత చిత్తుడై మెలగు మహాత్మునకు నైహికాముష్మికములు కరతల బదరీ ఫలములు గావా! తన లోపములను దా గుర్తించి వాని వాని సవరణకు దగు సాధన పరికరముల నతి నిపుణతతో నమర్చి తాను సాక్షీభూతు డగుచు సర్వ శాసకు డగుచు దన గృహమును బరిపాలించుకొన వలెం గదా, యజమానుడు! ఇందులో నేమి విపరీత మున్నయది?

రుచిక: మన మీ సంభాషణములోనే వచ్చిన కార్యమును మఱచితిమి, ప్రొద్దెక్కుచు వచ్చెను. కుశలుడ! సమిధలును దీసికొని వెళ్ళుదము, రమ్ము.

కుశిక: ఔనౌను. ఆచార్యులవా రాగ్రహింతురు. అది యును గాక మన అకృతవ్రణుడు కైలాసము నుండి నిన్నటి రేయి వచ్చినట్లు తెలిసినది. ప్రయాణాయాసము చేత గాఢ నిద్ర జెంది యున్న వానిని మన మేల తొందఱ పెట్ట వలె నని పల్కరింపకయే వేకువనే లేచి వచ్చితిని. పరశురాముని క్షేమ వార్త తెలుప గలడు. వెళ్ళి కనుగొందము. రమ్ము.

(నిష్క్రమింతురు)

(జమదగ్నియు, నకృతవ్రణుడును ప్రవేశము)

జమ: అకృతవ్రణా! అయిన మా రాముడు చక్కగా నమ్మహాదేవునకు శుశ్రూష సలుపు చున్నవాడా? పరమ కరుణా సముద్రులగు జగత్పితరులు, పార్వతీ పరమేశ్వరులు, నా తనయుని బరామర్శించు చున్నవారా? విద్యాభ్యాసము నిర్విఘ్నముగ జరుగు చున్నదియా?

అకృ: ఋషి వర్యా! తమ తనయుల కన్న నెక్కుడు గారాబమున నీ తనయు, నా సనాతన దంపతులు పాలించు చున్నవారు. తత్కరుణా కటాక్షపు బ్రభావమున నెంత మందయు నధిగత సర్వ విద్యానవద్య ప్రభావ సంపన్నుడగుచుండ, వంశ పరంపరాగత తపో మేధా విభవాభిరాముండగు భార్గవ రాముని విషయము చింతనీయాంశ మగునా!

మ. జగదారాధ్యుడు, శంకరుండ తన శస్త్రాచార్యుడై, తద్ధను
ర్నిగమాంతర్గత సాంప్రదాయములు నేర్పింపం; జగద్ధాత్రియా
నగరాట్పుత్రి, గణేశ, షణ్ముఖుల కన్నం, మక్కువం, గంటి త

ప్పంగఁ గన్పట్ట, నఖండ మేఘ, జెలు వొప్ప న్మించు టాశ్చర్యమా!
భృగురాముం డొగి శైవ శాక్త కుళ సంవిత్తంత్ర పారీణుఁడై,
నెగడెన్, శాస్త్రము, శస్త్రముల్, దనదు వాణిం, బాణి రాణింపగన్.

ఇంతియు కాక వినోదమునకు పార్వతీ పరమేశ్వరు లిరువురును నొకప్పుడు సింహాస నాసీనులై రాము, షణ్ముఖులకు ద్వంద్వ యుద్ధమును గల్పించి విలోకించు చుండిరి.

జమ: ఎట్టెట్టూ! నా కుమారునకు నంబికా కుమారునికి యా?

అకృ: ఔ నాను. ఇందులో నాశ్చర్య మేమి?

జమ: అకృతవ్రణా! ఆ మహా వీరుఁడు సుర సేనా నాయకుఁడే? భూసుర బాలకుఁడేఁడీ? ఇంక పర్యవసానమునకు వలసిన దేమున్నది?

అకృ: వాత్సల్యాతిశయ మెంతటి తపోధనుల నైన మోహితులం జేయును గదా! పర్యవసానము మీ ప్రతి నిరీక్షణ విపర్యయముగ బయలు దేఱెను. నీ కుమారుడే యా సేనాని నోడించెను. అంతలకయ్యుమా మహేశ్వ లిరువురును, దిగ్గున గద్దియ నొక్కుమాఱె డిగ్గి, నీ కుమారకు బిగ్గఱ నక్కునఁ గ్రుచ్చి సన్మానించిరి. మహేశ్వరుండు కడు ప్రీతుండై రామునకు నఘోర పాశుపత రౌద్ర నారాయణ మహాస్త్ర రాజములను దన ధనువును నొక దివ్య రథము ననుగ్రహించి యాశీర్వదించె నట!

జమ: నిక్కమా! నిక్కమా! నా కుమారుఁడు శివ పార్వతుల మెప్పుఁ వడసెనా! ఔరా! నా పుణ్యోదయము!

అకృ: మహర్షివర్యా! స్వత స్సుప్రసిద్ధుఁడగు మహర్షిసత్తముఁడగు నీవు, తేజో మూర్తి యగు సత్పుత్ర మూలమున సత్తమోత్తమ ప్రతిష్ఠం బడసితివి

చ. జనకుని పేరిట, న్మనేఁడు దాన పదుం డధముండు; తుల్యు లం
దున, నిజ నామ మాత్ర విదితుం డెవఁ డాతఁడు మధ్యముండు; నం
దనుని ప్రసిద్ధి చేతను సనాతనుఁ డౌ నెడ నుత్తముండు; నీ
వనఘుఁడ పుత్త్రమోత్తముఁడ వైతివి, రాముని కన్న తండ్రివై.

జమ: జనకుఁడు సర్వదా పుత్త్రాదిచ్ఛేత్పరాజయమ్మను వాక్యము సంధాన మొనర్పు నిందును.

అకృ: గృహస్థాశ్రమమునకు ఫలము సత్సంతానము.

జమ: ఈ శుభ వార్తను రామ జననికిం దెలిపి సమ్మోద సాగరమున ముంచి వేయుదను రమ్ము!

(నిష్క్రమింతురు)

రంగము: అడవి, దత్తాత్రేయాశ్రమము.

(దత్తాత్రేయుఁడు శయనించి, కార్తవీర్యార్జునుఁడు పాదపీడన మొనర్చుచుఁ బ్రవేశము)

కార్త: ఈ మూఁడు సంవత్సరములు నిమ్మహానీయుని నా శక్తి కొలఁది భక్తి శ్రద్ధల సేవించు చున్న వాఁడను. కా యొకప్పుడేని నన్ను బల్కరింపఁడు, నీ స్థితియేమి గతి యే మని విచారింపఁడు. మొండ మనదు,

వన ఫలంబులు తెచ్చి సమర్పించిన బుద్ధి పుట్టిన మట్టును, లేకున్న నవి యట్లే పడి యుండును. కౌపీనములను జక్కఁగఁ బులిమి యారఁ వేసి దగ్గఱ నుంచిన నిష్టమున్న ధరించును, లేకున్న నవి చించి చింపులు సేయును. ఇది వలయును, నిది వలదనఁడు. అయిన మునుపటి కంటె నిప్పు డొక విషయమున నయమన వచ్చును. నేనై కొంత సాహసించి కాలోచిత సత్కార్యకలాపం గడంగినఁ బరాఙ్ముఖుఁడైన నీవి గ్రహించి యించుకంత చనవగు పఱచుచున్నాఁడు. మునుపటి పిచ్చి, పది భాగము లుపశమించిన దనఁ గొనవచ్చును. ఇదేమి నిద్రయో! పది దినముల నుండి ప్రక్క వొదలక యొక్క మొగి నిద్రించుచున్నాఁడు. ఒడలెఱుఁగఁడు దీర్ఘము నేదియును లేదు. అతఁ డట్లే నిదురించుచున్నవాఁడు. నే నిట్లే యతని పాదసేవ నొనర్చుచున్నవాఁడను, కాని యిది విపరీత నిద్రగ నున్నది. నిదుర కాదనుటకు మార్గ మేమాత్రమును లేదు. ఇప్పు డొక గంట నుండియు ననుక్షణ మిమ్మహానుభావుని దేహ మందలి యుష్ణ మభివృద్ధి చెంది పాదము లంట రాని తెఱఁగున మంట లెగయుచున్నవి. జ్వరమా? కాదు. సంసార తాపత్రయ జ్వర పరిహారకుఁ డగు నవధూత శిఖామణికి జ్వర మను నేటి మాటలు? అబ్బా! దుస్సహ శీత వాతాతప క్లేశముల నైన సహింప వచ్చును, గాని యిమ్మహాత్ముని యొడలి వేడిమి దుస్సహము. అబ్బబ్బా!

మత్తకోకిల. అంత కంతకు మేసి వేడిమి యగ్నిహోత్ర సమానమై,
చింత నిప్పుక లౌచుఁ జేత స్పృశింప రాని తెఱంగునై,
వింతఁ గొల్పె; నిఁకెట్లు సేయుదు; వెట్ట నెక్కుడు నయ్యె, న
త్యంత భీకరమౌ మహా ప్రళయానిలం బుదయించె. హా!

అక్కటా! అక్కటా! ఇఁక నెట్లిఁక నెట్లు! దుస్సహము! దుస్సహము! ఇది యేమో జ్వాలలా! యోగాగ్నియా! కాల కాలానలమా! అయ్యో! తెగటారె! తెగటారె! దగ్ధమయ్యె. దగ్ధమయ్యె బాహులు! హా! సద్గురు దత్తా! (రోదనము సేయును.)

దత్తా: (నిద్ర లేచి) ఏమి యర్జునా! ఏమి యేమి? ఏల యేడ్చుచున్నావు? ఏమి ప్రమాదము?

కార్త: గురుదేవా!

గీ. పరమ కరుణా సముద్ర! యో గురు వరేణ్య!
భక్త జన పారిజాత! నీ పాద సేవ
కే ననర్హుఁడ నైతి; నిఁక నేల బ్రతుకు?
బాహువులు రెండుఁ గాలె; దౌర్భాగ్యుఁడ నహ!

సద్గురూ! నా బాహు యుగ్మము దగ్ధమాటకుఁ జింతిలను. కాని బ్రహ్మాదులకు దుర్లభము లగు భవత్పాద కమలములఁ జేతు లార సేవించు భాగ్య మస్తమించెఁ గదా యని శోకించుచున్నవాఁడ!

దత్తా: ఏమి యేమి! అర్జునా! నీ రెండు చేతులు దగ్ధ మయ్యెనా! నీవు రెండు కాదు వేయి చేతులు లుదయించుచు గాక!

కార్త: దేవా! అనుగ్రహింపఁ బడితిని.

దత్త: నీవు చక్రవర్తి యగుదువు గాక!

కార్త: సద్గురు దయ!

దత్తా: నీవు మంత్రమూర్తి వగుదువు గాక! యోగీశ్వరేశ్వరుఁడగుదువు గాక! చరాచరాత్మక ప్రపంచమందు నీ సంచారఁ గూడని ప్రదేశము లేకుండుఁ గాక! వెల్గుము అఖండ పరాక్రమ ప్రచండ సహస్ర భుజాదండ మండిత భూమండ లాఖండల వైభవ ధురంధరుండవై, మాహిష్మతీ నగరంబున రాజ్యమేలు చుండుము. చనుము! చనుము! నిలువకుము! తామసింపకుము! మాఱాడకుము! చనుము!

(త్రోయుచు నిష్క్రమింతురు. తెర పడును.)



## శౌరీ!

వోలేటి సీతారామ మూర్తి

కాచెద వట నీభక్తులఁ
బ్రోచెద వట పుణ్యజనుల మదమున, దేవా
నీచుల దండించెద వట,
నీ చరితము పావనంబు నిజముగ శౌరీ!

దుర్మార్గుల దునుమాడి, య
ధర్మము నాశంబు చేసి, తద్దయు వేడ్కన్
ధర్మంబిలపై నిలిపెడి
ధర్మాత్ముని నిన్నుఁ గొలుతు, తప్పక శౌరీ!

వరదా బ్రోవు మటంచును,
గరి వేడిన గరుణ నీవ కాచితి కాదే!
అరయగ విరించికిని నీ
కరుణోదధి లోతు తెలియఁ గష్టము శౌరీ!

వినుదట దీనుల ప్రార్థన
గనుదట ధర్మాత్ము నెపుడు కౌతుక మొప్పన్
నినుఁ గొల్చు వానిఁ బ్రోవఁగఁ
జనుదట నన్నేల లేవె? చయ్యన శౌరీ!

శ్రీకర! నీ కరుణాంబుధి
నేకరణిం దేలియాడు దెంతయు వేడ్కన్
గాకముఁ బ్రోచిన నీ విక
నా కింకను మాన్ప లేవె? నర సఖ శౌరీ!

విజ్ఞాను లగుచు నెప్పుడు
ప్రాజ్ఞులు నినుఁ గొల్చుచుంద్రు రమ్యంబుగ
నా యజ్ఞానులు నేరరు స
ర్వజ్ఞుఁడ వగు నిన్నుఁ దెలియ వరదా శౌరీ!

ఏ రీతి చాన నేలితి
వే రీతి నరాదు గాచి తేరీతి ద్విజున్
గూరిమి ధనికునిఁ జేసితి
వా రీతిని నన్నుఁ బ్రోవుమయ్యా శౌరీ!

నిన్నే యారాధించెద
నిన్నే నే నాశ్రయింతు నీభక్తుఁడనై
నిన్నే నిల్పుదు మనమున
నిన్నే, యత్నైనఁ, జేర నేరుదు శౌరీ!

# దేవీ స్తవము

మల్లాది నాగభూషణం

దేవానీకముఁ బట్టి రాక్షసులు వేధింపన్, భయాక్రాంతులై
దేవేంద్రాదులు భక్తియుక్తు లయి ప్రార్థింపంగ, లక్షింపఁగా
దేవీ మూర్తిని దాల్చి కాచితి గదా దివ్యౌఘు, మాదారి నో
దేవీ! యాంధ్రుల కాంధ్ర తేజము ప్రసాదింపఁ గఁ గే ల్మోడ్చెదన్.

ఆ వింధ్యాంతర సీమ భర్త జిత వాహ్యాళిన్ జరింపంగ బా
ల్యావస్థన్ విలపించు బాలకుని కుయ్యాలించి దీవింపఁ, గా
దా! వాఁడీ భువి శాతవాహనత రాజ్యం బేలె, నాదారి నో
దేవీ! యాంధ్రుల కాంధ్ర తేజము ప్రసాదింపంగఁ గే ల్మోడ్చెదన్.

భావింపన్, ఘన శాతకర్ణుఁడు నిజాంబా పాద రాజీవ సం
సేవా దీక్షితుఁ డౌట నీ కరుణఁ, గాళీ చేర మధ్యావనిన్
జావా ద్వీప సమూహ మేల గలిగెన్ సత్కీర్తి, నాదారి నో
దేవీ! యాంధ్రుల కాంధ్ర తేజము ప్రసాదింపంగఁ గే ల్మోడ్చెదన్.

శైవాచార్యుల సేవఁ జేసియు రహస్యంబైన పంచాక్షరీ
భావం బెంచియు నీదు మూర్తి హృదయాబ్జాతంబునన్ నిల్పఁ గా
దే! వర్ధిల్లెను శూరురాలు రుద్రమా దేవేరి, యాదారి నో
దేవీ! యాంధ్రుల కాంధ్ర తేజము ప్రసాదింపంగఁ గే ల్మోడ్చెదన్.

గోవా శ్వేత ముఖుల్ భజింప, బిజపూర్ గోల్కొండ సుల్తాన్లు సం
భావింపన్ ఘన కాన్కలిచ్చియు విరూపాక్షాది పీఠస్తులున్
దీవింపం గాను కృష్ణరాయలకు శక్తిన్ గూర్చె, తా దారి నో
దేవీ! యాంధ్రుల కాంధ్ర తేజము ప్రసాదింపంగ గే ల్మోడ్చెదన్.





# ఆధిపత్యము

హారూన్ ఖాన్ షేర్వానీ

(గత సంచిక తరువాయి)

## 3

## నవీన సిద్ధాంతము

నిజము విచారించినచో 'రాజ్యము' ఒక భావము తప్ప యితరము కాదు. అది తర్క జనితమైన భావము ఆధిపత్య సింహాసనము పై 'రాజ్యము' నాసీనం జేసినంతన మనము నైజమును కనుగొనిన వారము కాజాలము. ప్రతి దినము జీవితమునం దెక్కడ అధిపతి యగుపడు చుండునో, అది తెలుసుకొనుట ప్రతి మనుజుడు కోరుచుండును, పుస్తకము లందలి తర్క జనితుడైన అధిపతిని గురించి తెలుసుకొనుట అనవసరమే. 'రాజ్యమే' అధిపతి యను విషయమెంత Abstract ఐనను అది స్వతంత్రాభిప్రాయములుకల ఒక 'వ్యక్తి' (Persona) ఒక కార్పొరేషన్ (Corporation) అనుటకు సందేహింప నవసరము లేదు. కాని అమనస్సును, అస్వతంత్రాభిప్రాయములను వెల్లడిచేయుటెట్లు, దాని ఏజెంట్లు (Agents) ఎవరు? దినచర్యలం దెటుల నది ప్రతిబింబించు చుండును? దుర్గుణములకు పాలుగాక అమనస్సు ఏరీతిగ కార్య రంగమున పని చేయుచుండును, ఏమంత్రము యొక్క బలము వలన మనమెల్లరము 'రాజ్యము' మానసము యొక్క రహస్య దుర్గుణములను తెలిసికొందుము? అవసర సమయమున దెటులనది మాట్లాడుచు, తన మనస్సునకు వ్యతిరేకించు వారి నది యెటుల శిక్షించును?

'రాజ్య' మే సంస్థల ద్వారా తన కార్యముల నిర్వర్తించు చుండునో ఆ సంస్థల నిర్మాణమునకై సిద్ధ పరచ బడిన కొన్ని శాసనముల కూడికను 'Constitution' (రాజ్యాంగ నిర్మాణము) అందురు. ఈ రాజ్యాంగ నిర్మాణమే (గ్రంథస్థమైనదియు, కానిదియు, రెండు విధములు కలదియు) రాజ్యము యొక్క నిగూఢమైన పరిశ్రమలు గురించి తెలుపును. ఇదియే అధిపతికి కార్య స్వరూపము ప్రసాదించును. పరిపాలనాంగములు రాజ్యము యొక్క ఏజెంట్లనియు, వాని కర్తవ్యములు నియమితములై యున్నవనియు, వానికి వ్యతిరేకముగ నవి నడువ లేవనియు తెలియగును. అట్టి సమయముననే రాజ్యము యొక్క అభిప్రాయమును, వాని అభిప్రాయమును, ఒకటియని తెలుపబడును. తమ కర్తవ్యములను మీరినచో సామాన్యులను శిక్షించినటుల రాజ్యము వానిని శిక్షించును.

గములలో ,రాజ్యము' యొక్క భృత్యులే కాక (ప్రభుత్వము) రాజ్యాంగ నిర్మాణము ప్రకారము రాజకార్యములందు పాల్గొను వారందరును చేరుదురు. దీనిని బట్టి నిరంకుశ ప్రభుత్వమునందు మంత్రులును, అధికారులును, ప్రజాస్వామిక రాజ్యమునందు, శాసన సభాసదులును, అభిప్రాయముల నిచ్చువారును (Voters) పన్నుల విధంచు వారును, న్యాయము సల్పువారును, శిక్షింపబడుదురు. 'ప్రభుత్వము' ను సంకుచిత నిర్మాణమునకును, విశాలమైన నిర్మాణమునకును భేదము చూపుటకు మేము రెండవ దానికి 'గ్యుబర్ నెటోరియమ'ను నామకరణము చేసితిమి.

'గ్యుబర్ నెటోరియమ్' (Gubernatorium) చలనము కల 'రాజ్యము' (State in action) ను ముందు నడుపుటకు సహాయపడుచున్న పౌరుల కూడిక. దీనియందు మౌనవ్రతము దాల్చి రాజ్యకార్యములందు పాల్గొనని సభ్యులు చేరరు. ఒక నాటకమునందు గ్రంథకర్త, వ్యవస్థాపకుడు, సూత్రధారుడు, నటకులు, ప్రకాశకులు మొదలగు వారొక పక్షమున, దానిని చూచువారు మరొక పక్షమున నెటులుందురో అవిధముగనే రాజ్యమునందు కూడ ౧. ప్రభుత్వాంగములును, (శాసన సభలు, ప్రభుత్వము, న్యాయశాఖ, రాజకీయశాఖ, వోట్లు నిచ్చువారు [వారున్నచో], యితరమార్గముల 'రాజకార్యము' లందు పాల్గొనువారు) ౨. మౌనముగనున్న పౌరులు (రాజకార్యములం దెట్టి సంబంధము కూడ లేనివారు) నుందురు. మొదటి సమూహమునకు 'గ్యుబర్ నెటోరియు' మని పేరు. అనగా చలనము గల రాజ్యము, అనగా దృశ్యమగు రాజ్యము. అదృశ్యమగు రాజ్యము [ప్రజల కూడికకు మరొక పేరు] కాదు. పై కారణములను బట్టి అధిపతి తనకు ప్రతినిధులను నియమింపవచ్చును. తనశక్తులను వివిధసంస్థల స్వాధీనముజేసి తన అధికారమును మిత పరుపవచ్చును. రాజకీయ విషయములు మిగుల కష్టములైనవి కనుక రాజకార్యముల సక్రమముగ నడుపుటకై గ్యుబర్ నెటోరియ'మునకు జవాబు దారగు ప్రభుత్వ నిర్మాణావసరము కలదు. శాసనసభ మొదలగునవి ఏవో కారణముల బట్టి, కొన్ని విషయములయందు తన అధికారము లేనందున ఒక రాజ్యము తన సంపూర్ణాధికారములను (కొన్నియధికారములనో) ఇంకొక రాజ్యస్వాధీనమో వివిధ రాజ్యముల కేంద్రస్థానమునకో యిచ్చివేయవచ్చును. ఉదాహరణార్థము పరరాజ్యము స్వాధీనము చేయుట, Fedoration నకు లోనగుట. మనము ఆధిపత్యమును విభజింప వచ్చునని తెలిసికొనిన తక్షణమే లార్డుబ్రైస్ Lord Bryce నకు టర్కీ నుండి వేరు చేయబడని కాలపు యిజిప్టు యొక్క నిజమైన, (Defacto) మరియు కనబడు (Dejure) అధిపతిని విమర్శించు సమయమున తలిగిన సందేహము, కష్టము అదృశ్యమైపోవును. కొన్ని కారణములను బట్టి టర్కీలో చేరినట్టి యిజిప్టు, చూచుటకు యూరోపు నందలి అనురాజ్యములచేత నుండినను, నిజము విచారించిన గ్రేట్ బ్రిటన్ స్వాధీనమందే యుండెనని అతడు వ్రాసెచ్చెను. అతనికి కలిగిన కష్టము నేను సిద్ధాంత పరచిన పద్ధతి ననుసరించి విచక్షించినచో తొలగిపోవును. లార్డుబ్రైస్ చూపిన పవిధ విషయముల నన్నింటిని నియమిత రాజ్యాంగ నిర్మాణ దృష్టిని అంగీకరించినచో నిజమైన అధీనత శాసన సమ్మతమైన యధీనత యగుచుండెను. రాజ్యాంగ నిర్మాణము నవలోకింపనిచో అధికారము గల శక్తులన్నియు శాసన విరుద్ధము లనియు రాజ్యాంగ నిర్మాణమునకు వ్యతిరేకము లనియు, అనవసరముగ జోక్యము కలిగించుకొని నవియు, భావింపబడును.

పైన సిద్ధాంత పఱచిన విషయమును ఆధునిక కాలపు రాజ్యములపై ప్రయోగించి చూచుట మిగిలి యుండును. రాజ్యములు ద్వివిధములు: ఒకటి కేంద్రీకరింప బడిన (unitary) రాజ్యము. రెండవది సంయుక్త పరుపబడిన (Federal) రాజ్యము. అన్ని విధముల అధికారము

అన్నియు ఒకవో కేంద్రీకరింప బడిన రాజ్యములు మొదటి తెగకు సంబంధించినవి. రెండవ తెగవి స్థానిక సంస్థలలోను, కేంద్రసంస్థలలోను అధికారములు విభజింపబడినట్టివి. ఫ్రాన్సు మొదటి తెగకు సంబంధించినది. రెండవ తెగకు సంబంధించినవి అమెరికా సంయుక్త రాష్ట్రములు. ఫ్రాన్సు రాజ్యమును గురించి మొదలు విచారింతము. ఈ దేశమున రాజ్యాంగ నిర్మాణమునకు సంబంధించిన అనేక శాసనములను శాసనసభ ద్వారా మార్పగలరు, ప్రాతినిధ్య సభయొక్క సంఖ్యలో మార్పుచేయుట మొదలగు విషయములందు రెండు సభల కూడిక యగు జాతీయ సమితి అభిప్రాయము బడయ వలసి యుండును. ఈ సంస్థయందే 'గ్యుబర్ నెటోరియమ్' కలదు.

సంయుక్త రాజ్యములందు తప్పక గ్రంథస్థమైన రాజ్యాంగ నిర్మాణ ముండును. ఆరాజ్యాంగ నిర్మాణమునందు అధిపత్యమును విభజించి యేర్పరచిన వివిధ సంస్థలు విశదీకరింపబడి యుండును. నాణెములను చేయుట, సైన్యము నుంచుట, తపాలా శాఖాపోషణ, స్వరాష్ట్రములకు సంబంధించిన తదితర విషయములు సంయుక్త రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ స్వాధీనము చేయబడినవి.

(అశేషము)



Edited, Printed, & Published by K. Balakrishna Reddy,
at the Golakonda Press, Troop Bazar, Hyderabad (Dn.)

# విషయ సూచిక

---



దౌలతాబాదు దుర్గము

పిక్టోరియల్ హైద్రాబాదు



హైదరాబాదు, జూన్ ౧౯౨౮.

సంపుటము ౨ శా. శ. ౧౮౫౦ విభవ సంవత్సర జ్యేష్ఠము సంఖ్య ౬

# సుకవి

శ్రీ శేషాద్రి రమణ కవులు

అవసరంబైన, భాషకై ప్రాణమైన
ధార పోయంగఁ దగినంత త్యాగ గుణము
సహజ సౌందర్యము గ్రహించు జాణతనము
గలుగు నాతండె నిజమైన కవివరుండు.

ప్రకృతి సిద్ధ మనోహర వస్తువులను
గాంచి తాను గణించిన కౌతుకంబు
పాఠకుని మదిఁ జిత్రించు ప్రజ్ఞ యొకటి
గలిగిన ఘనుండె నిజమైన కవివరుండు.

పాటివారలు తానొందు శ్రమసుఖములు
కథలలోపల వ్యక్తులకడ నిముడ్చి
మానసిక భావములఁ గావ్య మార్గమందు
గన్పఱపఁ జాలుఁ ధన్యుఁడే కవివరుండు.

పదము చెడిన యలంకృతి భగ్నమైన
భావములఁ బోవనీక కాపాడ నేర్చి
తలఁపులను దల్లి బాసలోఁ దెలుపఁ జాలు
కౌశలము గల్గి నాతఁడే కవివరుండు.

చిఱు నగవు వెన్నెలలఁ గాయు చెలువ మోము
ప్రకృతి విభవంబుఁ దెలుపు శాబకుని నుడులు
చిత్రి సృష్టి క్రమము ప్రదర్శించు నేర్పు
కావ్యమునఁ జూపు ధన్యుఁడే కవివరుండు.

కొంత పౌరాణికుని శక్తి కొంత కొంత
చిత్రకారత్వ మనవద్య శేముషియును

ఒండొరులు మాటలాడుచు నుండునట్లు
కావ్యమునఁ బలుక నాతఁడే కవివరుండు.

తాను కావ్యంబులోని పాత్రము నటంచుఁ
దలచిఁ రసభావముల లోనఁ దా మునింగి
తన్మయము నొంది చెప్ప విద్వాంసు డొకడె
గణుతి కెక్కిన నిక్కంపు కవివరుండు.

మానవ మనఃప్రవృత్తుల మార్గ మెఱిఁగి
కావ్య పురుషులు తమ సమకాలికులని
అతిశయోక్తుల జొనుపక యార్య కథలఁ
గావ్యమునఁ దీర్చు నాతఁడే కవివరుండు.

తనకుఁ దా వచ్చు భావముల్ తలఁగ నీక
సులభ శైలిని గైతలో నెలయఁ జేసి
పండితునకును బడఁతికిఁ బామరునకుఁ
గవిత బోధించు ధన్యుఁడే కవివరుండు.

అవసరంబైన పట్టుల యందుఁ బూర్వ
కావ్య ధర్మంబులఁ దొరంగి, గట్టు లొరసి
పొంగి పొరలు ప్రవాహంబు పోల్కి, కవిత
కల్పనము జేయు ధన్యుఁడే కవివరుండు.

గర్భబంధ కవిత్వ శృంఖలలఁ గూర్చి
సుకవితా కన్య ప్రాయంపు సొబఁగు లెల్లఁ
దొలఁగఁ ద్రోయక మృదువుగా బలుకు నట్లు
కవిత రచియించు నాతఁడే కవివరుండు.

తన మనంబున నిండిన తలఁపు లెల్ల
ఆలకించి యవగతంబగు విధాన
తేటతెనుఁగున రచియించు దిట్ట తనము
కబ్బమునఁ జూపు నాతఁడే కవివరుండు.

తన తలంపులు కృతులు నీ తరమె గాక
ముందు తరమున సైతము చెందు నటులఁ
దన వలన సంఘ మొక మార్పు దాల్చు నటులఁ
గవిత రచియించు విబుధుఁడే కవివరుండు.

చిక్కి జీర్ణావశిష్టమై చెలువడఁగిన
ఆత్మ జాతికి సత్కవితామృతమున
విందు బొనరించి జాతీయ విభవములను
గ్రిమ్మఱ ఘటించు నాతఁడే కవివరుండు.

సడలిన శరీరములనుండి క్షాత్ర రక్త
మవసరము వెంటఁ బ్రవహించు నటు లొనర్చి
యతులిత విరాగవంతమౌ నాత్మ జాతి
గౌరవము నిల్పు నాతఁడే కవివరుండు.

భావ పరిపూర్ణమై మించు పద్య మేని
గద్య, మేని రచించి లోకమును దనిపి,
యువకుల మనోంబుజముల, నుజ్జ్వాల లూపు
కౌశల విభాసి యొక్కఁడే కవివరుండు.

సంతతము జూచుచుండెడి సంగతులను
తరుణ మెఱిఁగి మృదూక్తి నుదాహరించి
అర్థమున కంటె ముందుగా నాత్మ భావ
మవగతము జేయు సుకృతియే కవివరుండు.

పతగములఁ జూచి కీటక పంక్తిఁ జూచి
తృణ కణము జూచి తన్మయంతఁ దెలిసికొన్న
మేల్మి భావంబులను నుపమించి ప్రకృతి
గరిమ బోధించు నాతఁడే కవివరుండు.

ఐహిక సుఖంబు, కంటె సురాది జన్య
సమధి కోన్మత్త దశ కంటె, సకియల తొలి
కూటముల కంటె, జాతికిఁ గూర్మి గూర్చు
కథల వాక్రొను వక్తయే కవివరుండు.

శ్రవణ కటువైన పదరాజి సంగ్రహించి
యర్థ నిర్బంధములు గూర్చి [illegible]సి యరసి
పద్యముల నల్లఁ బోవక ప్రకృతి సిద్ధ
కవిత వెలయించు దక్షుఁడే కవివరుండు.

పరులఁ బాత్రంబుల నొనర్చి భావమెల్ల
నితరులకు గుప్తముగ నన్వయింప జేసి
కావ్య ధర్మంబు గంగలోఁ గలుగ కుండఁ
గలము త్రిప్పిన శూరుఁడే కవివరుండు.



# యతి ప్రాసములు

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి



ఈ యతి ప్రాసలను గూర్చి ఆధునిక పండితుల లోను, కవులలోను భిన్నాభిప్రాయము లున్నవి. కావలయు ననువారు కొందఱు, కూడదను వారు, కొందఱు. మొదటి తెగవారు తెల్పు అభిప్రాయము:- ప్రాచీనులు యతి ప్రాసముల నుంచుకొని గ్రంథములు రసమయముగాఁ జెప్పలేదా? వారు సమర్థులగు సర్వతోముఖ పండితులు గనుక యతిప్రాసలకు జంకరైరి. ఆధునికులు భాషా పరిశ్రమలేని వారగుటచేఁ 'గాలికిఁ బోయిన వా రిష్టములేని శాకఫలాదులు విడుచు చున్నట్లే, తమకు గష్టముగా నున్న యతి ప్రాసములు విడువ నెంచు చున్నారు. నదికి ఒడ్డులు వలెఁ బద్యమునకు యతి ప్రాసములు ముఖ్యములు; అని. వీరు కేవల ప్రాచీన సాంప్రదాయికులు నూతన సంప్రదాయ వాసన సోకనివారు. నూతన సాంప్రదాయికులలోఁ గూడ నొక తెగవారు యతి ప్రాసను లుండవలె ననియే వాదింతురు. కాని వారు తెలుపు క్రొత్తయుక్తు లేమియు లేవు. కూడదని తెలుపువారి అభిప్రాయము:- కవిత్వము నకు రసము ప్రధానము. 'వాక్యం రసాత్మకం కావ్యం', అని; సాహిత్య దర్పణ కారుఁడును; 'సాధ్యోహి రసోయథా తథం కవిభిః, అని, ఆంధ్ర శబ్ద చింతామణికర్తయును, ఉచ్చకంఠముతోఁ జాటుచున్నారు. యతిప్రాసములు రసోత్పాదకములు గావు. కొన్ని చోట్ల రస భంజకములు గూడ నగుచున్నవి. మరియుఁ గవిత్వమునకు నిర్బంధములు కూడవు. యతిప్రాసములు నిర్బంధములలోఁ జేరినవి. పింజరము లోని చిట్టవలె భాషా నిర్బంధములలో బద్ధుడగు కవి గిలగిల కొట్టుకొనును. వానికి స్వాతంత్ర్యము కావలెను. ఆంధ్రము నందు వలె సంస్కృతమున యతి ప్రాసలు లేవు. అందు రస స్ఫూర్తి కలుగుట లేదా? ఆంగ్లమునను గొంతమంది మహా కవులు నియమోల్లంఘనముఁ జేసి వ్రాసిన కావ్యములు రస పిండములుగా నుండలేదా? కనుక యతి ప్రాసములు తీసి వేసినచోఁ గవిత్వమునకు హాని రాదు. అది కావ్యము కాకపోదు. యతి ప్రాసములున్న మాత్రమున నే అది పద్యము కాదు. రసవంతమగు పద్యమును గద్యమును గవిత్వమే! "అయినచోఁ బద్య మేల వ్రాయవలెను? రసవంత మగు గద్యమే వ్రాయరాదా? పద్యము వ్రాసినపుడు యతి ప్రాసము లుంచరాదా?" అందురా? అది ప్రశ్న గాదు. కవికిఁ దోఁచిన భావము పద్యమునందు గణ నియమములతో నొక విధముగ సంగీతమునకు బద్ధమై చిత్తా కర్షకతను వహించి మాధుర్యమును గూర్చ

చున్నది. గద్యమునందు గణ నియమము లేక పోవుటచే సంగీతమునకు సాధ్యపడక చిత్తాకర్షణ శక్తిలేనిదై రసస్ఫూర్తియందుఁ గొరవడి యున్నది. మరియు నొక టే భావమును గద్యము నందును పద్యమునందును వ్రాసి చూడుఁడు. ఏది హృద్యతరముగ నుండునో మీకే గోచరింపఁ గలదు. అప్పుడు మీ ప్రశ్నమునకుఁ గల విలువ మీకే బోధ పడును. కనుక యతిప్రాసలు తీసి వేసినచో భాషలో రస పిండములగు కావ్యములు వెడలు ననుట నిస్సంశయము; అని. ఈ మతములందున్న సత్యా సత్యములను మనము విచారింపవలెను. అందు ముందు, ఈ యతిప్రాసల నియమము ఇతర భాషలలోఁ గూడ గలదా? మన భాషయందు వీనిని నియమించినవారి యభిప్రాయ మేమి? అది యెంత సమంజసముగా నున్నది యను విషయములు బరిశీలింతము.

సంస్కృత భాషలో యతి, విశ్రామము, విరతి, విశ్రాంతి, మొదలగునవి పర్యాయ పదములు. 'యతి ర్విశ్రామ సంజ్ఞికా, అని లక్షణము చెప్పఁ బడినది. అనఁగాఁ బద్య పాదమును రెండు భాగములుగాఁ జేసి మొదటి భాగము చివర నాపుట. రెండుభాగములును ఏక సమాసాంతర్గతములైకూడ నుండ వచ్చును. కాని ప్రథమ భాగాంతాక్షరమును ద్వితీయ భాగాద్యక్షరమును ఏకపద గతములై యుండ రాదు. కాని ఆంధ్రము నందు వలె సంస్కృతమున నక్షర మైత్రిలేదు. మరియు సంస్కృతమునఁ బ్రాసము లేనే లేదు. కాని అంత్య ప్రాసము కలదు. "వృద్ధోయాతి గృహీత్వా దండం, తదపి, నముంచ్య త్యాశా పిండం,, అనుచోటు లీయంత్య ప్రాసము లాంధ్ర మందు ( పోతన కవిత్వము నందు ) వలె హృద్యముగా నుండును. యథార్థమునకు మామూలు ప్రాసముకంటె అంత్య ప్రాసము శ్రావ్య తరముగా నుండునని నా తలంపు. ద్రావిడ కర్ణాటక భాషలలోఁ గూడ బ్రాస నియమము కలదు. కాని యతినియమములేదు. "కన్న డుక్కి యతి యిల్ల కోణక్కె మతి యిల్ల" అని కన్నడపు సామెత గలదు. అనఁగా కన్నడమునకు యతి లేదు. దున్నపోతునకు మతి లేదు. అని యర్థము. ద్రావిడ భాష యందును యతిలేదు. ఈ ప్రాస సాంప్రదాయము ద్రావిడ కర్ణాటక భాషల నుండియు, యతి సాంప్రదాయము గైర్వాణము నుండియు, వచ్చి యుండునని నా యభిప్రాయము. యతికి సంస్కృతమునందు వలెనే ఆంధ్రము నందున స్థాన నియమమును మాత్ర, మేర్పఱచిరి కాని ప్రథమ భాగాంతాక్షరమును ద్వితీయ భాగాద్యక్షరము ఏక పద గతములై యుండరాదను నియమమును, శాటిం[...] లేదు. ఆంధ్ర భాషలో నీ యతిప్రాసము లేర్పఱచి వారి యభిప్రాయము ఏమయి యుండునని యడిగిన నితర భాషతో పాటు ఇయ్యదియు నుండవలయు ననియు, దీని వలన రసము గూడ నుప్పతిల్లు ననియు.

తెలుఁగు భాషలోఁ బెక్కు సామెతలు యతిప్రాసములు కలిగి యుండి రసస్ఫూర్తినిఁ గలిగించు చున్నవి.

అంగటిలో అన్నీ ఉన్నవి, అల్లుని నోట శని ఉన్నది.

అప్పు లేక పోతే ఉప్పు గంజి మేలు.
అన్నీ ఉన్నవి ఐదోతనం లేదు.
ఉభయ భ్రష్టుత్వం ఉపరి సన్యాసం.
బ్రాహ్మణులలో చిన్న పెసలలో పెద్ద.
చచ్చినా పైకం దప్ప దచ్చమ్మ నను తిట్టకు

ఇట్టి దావులందు యతిప్రాసలు రసోత్పాదకము గావని యెవ్వరును జెప్పలేరు. ఈ సామెతలందు వలె ఆంధ్ర పద్యములందు యతి ప్రాసములు రసోత్పాదకములు గాలేవు. దానికిఁ గారణములు, మూడు:

౧. ఏ యక్షరమున కా యక్షరమును యతిస్థాన మందుంచవలెను.

౨. యతిస్థానము సంస్కృతమున వలె విశ్రాంతి గావింప బడ కుండుట.

౩. పాదమునకుఁ బాదమునకుఁ బ్రాసాక్షరము మార్చ యుండుట.

ప్రాసాక్షరము సమీప మందున్నచోఁ (అనుప్రాసమువలె) ఇంపు గలుగును. దూరముగా నున్నచోఁ గలుగనేరదు. ఇప్పటి యతులలో వర్గయతి యొక్కటియే శ్రావ్యతను గలిగించును గాని మరి యేదియు గలిగింపదు. సంస్కృతము నందును గొన్ని స్థలము లందీ యతి పై సామెతలందు వలె కనబడుచు శ్రవణ సుఖముగా నున్నది.

వాగర్థావిత సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయె
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.
అథపరిజానామధిపః పరిభాతే
నారాయణాయ నళినాయత లోచనాయ　మె॥

కనుక యతి స్థానమును విభక్తముగావించి ఏయక్షరము నకాయక్షరమును యతిగా నుంచినచో యతి శైలికి సొంపునిచ్చి తద్వారా రసోత్పాదకము కావచ్చును! ఇట్లు వ్రాసి. నాలుఁగు పాదములకు ఏకాక్షరము నే నియమించుటమాని ఆదేపాదమునందు దగ్గరగా చేర్పఁబడినచో శైలికి సొంపును దద్వారా రసమునకు ఉపస్కారము కాఁగలదు. ఎట్లన:—

ఉ. అంతట సంతసం పడుచు
　అంబురుహాననవచ్చి భర్తృపా
దమ్ముల కాదరమ్మెసఁగ
　దండము పెట్టెయుఁ బల్కె, నో ప్రియా!
కన్నులు కఱ్వుదీర నిను
　కాంచుట యెన్నడు కల్గునంచు నా
దేవుని వేవిధంబులను
　దైన్యముతో సతతంబు వేడితిన్

ఈపద్యములో ౧. ౨. ౪. పాదములలో ప్రాసాక్షరము సమీపమందే ప్రాసము వేయఁబడినది. మూడవ పాదములోఁ బ్రాసము లేదు. ఉండ కూడదని నియమము కాదు. కన్నులు కఱ్వుదీర, అనునది తెలుగు జాతీయము ప్రాసకొఱకు దాని విఱిచి వేయుట రస భంజక మగును. కనుకఁ దీసివేయ బడినది. మరియును గద్యమునకును పద్యమునకును ఒక్కటే వ్యాకరణ ముండుట యుక్తమని తోఁచదు. కవికి గద్యమునందుఁ గల స్వాతంత్ర్యము పద్యమునందుండదు. గణ నియమమునకు దాను దైయుండవలయును, అందుచే గద్యమునవలెఁ గాక భాషను స్వతంత్రముగాఁ ద్రిప్పకొన వలసి యుండును, అట్టి సమయములో విసంధి మొదలగునవి దోషములు కావనియు యతిమొదలగు వాని స్పష్ట శ్రవణమునకై విసంధి మొదలగునవి తప్పక ఉండినచే మేలనియు నాకు దోఁచుచున్నది. కనుకనే పైపద్యములో విసంధి చూపింప బడినది. గద్య పద్యములకు ఒకే వ్యాకరణము కూడ దను పరిభాషకు పూర్వకవుల వ్యాకరణ విరుద్ధ ప్రయోగములే జ్ఞాపకత్వమును వహించుచున్నవి.

ఆంధ్ర కవిత్వమునకు యతిని నియమించిన లాక్షణికులు పు, ఫు, బు, భు, ము, లకుఁ బరస్పర మైత్రి చెప్పి ప, ఫ, బ, భ, మ లకుఁ గూడదనిరి. ఈ యక్షరములు ప్రత్యేకముగా వారికిఁ జేసిన మహదపకార మేమియో తెలియదు. మరియు మైత్రినిఁ జెప్పుటలో వ్యంజనములకు స్వర సాహిత్యము గొక్క మైత్రియు, నిర్బంధముగా విధించిరి. పై సామెత లలో ‹‹ బ్రాహ్మణులలో చిన్న బెస్తలలో పెద్ద'' అను సామెతలో బా భేలకు యతి చెప్ప బడినది. అందువలన రసభంగ మగుట లేదు. అందువలన స్వర మైత్రియేల అవశ్యముగానుండవలెనో తెలియకున్నది. కాని దయాపరులగు లాక్షణికులు యతులలో వలెనే ప్రాసలయందు స్వర మైత్రిని విధింపక కవికి స్వాతంత్ర్య మిచ్చినందులకుఁ గవి వారికిఁ గృతజ్ఞత జూపవలసి యున్నది. కనుకఁ బైని నేను సూచించి, నటులు యతి ప్రాసములు పద్యమునకు అందమిచ్చు ననుటలలో సందేహము లేదని నా మతము. ఒకానొక చోఁ రసము కొఱకు యతి ప్రాసములు విడువ వలసి వచ్చినను హానిలేదు, ఈ విషయమున నా వ్రాసిన రెండు పద్యము లుదాహరింతును:—

క. శ్రీ కృష్ణ దేవరాయ
క్ష్మాకాంతుని జన్మదినము మన రాజేశ
క్ష్మాకాంతు నాధిపత్యము
మాకుం బండుగల మీఁద బండుగలు గదా!

మ. కనుచుండంగనె తెంపి యెల్ల విరులన్
గల్పించె బూఁజెట్టు నా
తన నైధవ్యము గొన్న బాలగద యా
దాక్షిణ్యమున్ మాని, యా
తనికిన్ క్రౌర్యము కాదు కూడదని బో
ధల్ సేయదో? యంతరా
త్మ నిగూఢంబుగ నంతరాత్మయును లే
దో? వానికే లేశమున్.

ఈ రెండు పద్యము లందును నాల్గవపాదములందు యతిభ్రష్ట మైనది. కాని యది పోయినదని చెప్పువఱకును దోఁపదు. ఏలన అందు రసముపైకి బుద్ధి పోవును గాని యతిపైకిఁ బోదు. మనము పద్యము చదువగానే బాగుగా నున్నదని చెప్పుదు రనుకొనుఁడు. వారిలో ఎంత మంది రసమున కానందించు చున్నారో? యతి ప్రాసముల కెంతమంది ఆనందించు చున్నారో విచారింపుఁడు. పై మొదటి "పద్యములోని పండుగలమీఁద బండుగలు" అనునది నా నుడి. మాకున్ అను మ కారముతో యతి సిద్ధించుటకై యీ నానుడి యెగుర గొట్టుట భావ్యమా? నానుడి ద్వారా సిద్ధించు రసముకొఱకు యతిని దీసి వేయుట భావ్యమా? లాక్షిణికులారా? యోఁచింపుఁడు. మీరొక వేళఁ బండుగల మీఁదఁ బండుగలుగదా, అను దానిని మార్చి యతి సిద్ధికై మంగళము మీఁద మంగళము అని యనరాదా? అప్పుడు రసముగూడ సిద్ధించును. అందు రేమో! మంచిది కాని పండుగల మీఁద బండుగలు అను దానిలో నున్న రసము మంగళము మీఁద మంగళ

ము అను నుడికారములో లేదనియే నాతలంపు. [illegible] మొదటిది లోకప్రసిద్ధమగు నానుడి. రెండవది [illegible] దానికి సంస్కృతీ కరణము. ఈ రెంటికిని సహజమ[illegible] కును గృత్రిమమునకును గల భేదమే యుండును.

ఇఁక రెండవ పద్యములో నాల్గవ పాదమునం[illegible] యతిసిద్ధికై 'లేదో' అనుదానికి బదులుగా 'లేదా' [illegible] యనరాదా అని మీరడుగవచ్చును. మంచిది. [illegible] లేదా అన్నపు డర్థము వేఱు. లేదో అన్నచో [illegible] అర్థము మాఱినచో అందము చెడును. దానితో రసభ[illegible] మగును. కనుక యతిసిద్ధికై భిన్నార్థమును గల్పి[illegible] రస భంగముఁ జేయుట న్యాయమా? భిన్నార్థము[illegible] రసభంగ మైనను యతిని గాపాడుట న్యాయమా [illegible] జింపుడు. కవిత్వమునకు జీవితము రసమని ఎల్ల[illegible] అంగీక రింతురు మీరును భిన్నమని చెప్పరు. ఇట్టి [illegible] లందు వృత్తము నే మార్చుకొని నానుడులు పోకుండ[illegible] భిన్నార్థము రాకుండను మరి యొక వృత్తములో [illegible] యుమని మీరు చెప్పినచో లక్షణము నందుఁ గల [illegible] మానముచేఁ జెప్పు చున్నారు కాని రసదృష్టితోఁ [illegible] అదియుఁ గాక కవి పద్యమును ఆరంభించి నపుడు [illegible] పద్యమును వ్రాయ వలెనని యనుకొనఁడు. అప్ర[illegible] ముగా నేదో పద్యము ప్రారంభింప బడును. [illegible] నడపు చున్నప్పుడిట్టి నానుడి తోఁచఁ గానే అది [illegible] మునకు సరిపోయి యింపు నింపగాఁ గేవల యతి [illegible] సిద్ధి కొఱకుఁ బద్యమంతయు మరల మార్చి అట్లు [illegible] వృత్తములో వ్రాయు మనుట కేవల లాక్షణికు[illegible] జెల్లును గాని కవులకుఁ జెల్లదని నామనవి. కనుక నా[illegible] లకు భంగము కలుగు నపుడును భిన్నార్థముచే [illegible] మగు నపుడునుఁ మఱేఁధముగా గాని రసము [illegible] లక్షణమును ద్రోసి రాజని రసమును బోషించుట [illegible] ముగాఁ గవికి అర్హ కృత్యమని నా యూహ.

యతి ప్రాసలు తీసి వేసి నిర్బంధములు లో[illegible] నంత మాత్రమునఁ జాలదు. అదియంతయు గవిత్వ[illegible]

నేరదు. యతి ప్రాసములు లేనిచో నంత లేకుండ రసమును సరిపింప వలెను. అప్పుడు గాని యోకవిత్వము కవిత్వము గాదు. నిశ్చయమునకు నిర్బంధము లున్నప్పటి కంటె లేనప్పుడే కష్ట మెక్కువయని నాయభిప్రాయము. అప్పుడు పద్యము నందెక్కువవ్యర్థ పదమున్నను రోత బుట్టించును. ఇప్పుడో యతిప్రాసస్థానము లందవి వ్యర్థ పదములతో సగము పద్యము నిండి యున్నను మనల నడుగు వారు లేరు యతి ప్రాసములు తీసి వైచిన ఆవైలక్షణ్యమును గవిత్వమునం జూప వలయును. కాని చో లాభము లేదు. కావున యతి ప్రాసము లుండుటయే ఆవశ్యక మని యెంచిన వారు పై మార్పులు చేసికొన్నం గాని వారికి వాని వలన రససిద్ధి కానేరదు. ఆనియమముల చేత శైలికి శోభగలిగి తద్వారా రసమునకు హేతువగును. ఆ నియమోల్లంఘనముచే యతి ప్రాసముల పై దృష్టిలో వ్రాయ వచ్చును. ఈయతి ప్రాసనులను వదలి వ్రాసిన నాపద్యములను గొన్నిటి నుదహరింతును. ఇవి యుత్కృష్ట రసవత్తరములని కాదు. నాకుం దోంచినగతిని వ్రాసితిని.

## ద్వీపాంతర వాసము

గీ. భటులు నాపేరు పెట్టి వుమ్మార్లు పిలచి
రేను ధర్మ సభ కేగి కేలుదోయి
కట్టుకొని ప్రాడ్వివాకుని కట్టెదుటను
నిలిచి యుంటిని గుండెలుకొట్టు కొనగ.

గీ. వారు నను గ్రుచ్చి గుచ్చి ప్రశ్నములమీంద
బ్రశ్నములు వేసి దోషిగా నిశ్చయించి
నాకు ద్వీపాంతర ప్రవాసంబు శిక్ష
వేసి పంపిరి నే నెంత మొత్తుకొన్న.

సీ. ఒకసారి రెక్కల నూంగించుచును మింటం
బఱచెడు పులుంగుల బంతింగాంచి
ఒకతేప వాత్యా విధూతంబులై సమం-
గసం బౌఱుతెంచు మేఘములం గాంచి
ఒక మారనంత సాగరము భేదించి యూ
వలి గట్టుం జేరు నావలను గాంచి
ఒక పారి యంత్రి సామగ్రీ బలంబుచేం
జదలం బర్వెడు విమానములం గాంచి

గీ. తద్గతుల నభ్యసింపంగం దలచిం తలచిం
బిక్క మొగమునం బరికించి దిక్కు లకట!
దుర్మ నాయ మానుండనై తొట్రు పడుచు
సంచరించుచు నుంటి నీస్థలము నందె.

గీ. ఇంక నీ జన్మతో నాకు శిక్ష దప్పి
నీముఖాంభోజమును గాంచి యెల్లవెతలు
మఱచి ముచ్చటలను నాడు కొనుచునుండు
భాగ్యమది నాకుం బట్టునే? ప్రాణసఖుడ!

మనుష్య జన్మము ద్వీపాంతర శిక్షగా రూపించి యందున్న వాడుం తనోత్కృష్టమునకు నవస్థ పడుట ఈ పద్యములలోం జెప్పంబడినది. ఇందప్రయత్నముగా యతులు పడినవి. రానిచోటం బ్రయత్నింపలేదు.

కనుక యతిప్రాసములు తీసివేసినచో హానిలేదు. మంచి కావ్యములు వ్రాయవచ్చునని నాతలంపు.



# రాలిన పూలు

పెనుమర్తి వేంకట రత్నము

## ముందుగతి

గడచి పోయిన కాలమే కర్జ మంచుఁ
కష్టమో సౌఖ్యమో చవి గాంచు కతన,
ఆ భవిష్య న్నిలీన రాహస్య గర్భ
మెంత బీభత్సమో యెవం డెఱిఁగినాఁడు?

గడచి పోయిన దుఃఖమే యెడరు వేచు
కొన్న సౌఖ్యమ్ము కంటె సుఖోన్నతంబు
మఱచి పొమ్ము! హృదంచల స్ఫురితమైన
ఆ భవిష్య దాగామి సౌఖ్య ప్రసక్తి!

## యాత్ర

ఒక పురాజన్మ ఫలము నన్నూది వచ్చి
ఆ మధుర మూర్తి నామోలి నాశ్రయించె
పోవుచుంటిమి! లోల వీచీ వితాన
జనన మరణాధిక క్షుభ జలధిలోన.

గాలి యెటు వీవ మాదు నౌకా కుమారి
అటుల పోవు, చుక్కాని లే దాపడవకు!

## ఎచట?

నన్ను తొలిసారి స్వర్గసంతాన పుష్ప
కముఁ బంభర గీత రాగాలఁ బంపి
చందమామ వెన్నెల లేత చాయలందు
బువ్వపుంబంతి గుడిపించి పోయి రెవరో?

నన్ను తొలిసారి గాంగ మంధర సమీర
డోలికా కేళులందు నుయ్యాల లూపి
లేత మొగిళుల తోడ పల్కించి నేను
గికురు వెట్టిన మాయ నర్తకు డెవండు?

శైశవ స్వర్గ వీధి నశ్రాంత గతి
నాఁడుకొనియెడు పసిపాప నైన నన్ను
విషయ విస్తృత బాహిర వీధులందు
నంధ కూపమ్ములో దోసి నెవం! ఆను

హా ప్రదీప్తి మాణిక్య దీవ్యన్మహస్కుఁ
డా జగజ్జాల నాట్య విద్యా గురుండు
ఆ యనారత జీవ సూక్ష్మాంత రాళ
వర్తి పరమాణువౌ భగవానుఁ డెచట?





# రెండవ బుక్క దేవరాయలు

(క్రీ. శ. ౧౪౦౪—౧౪౦౬.)

పాలకోడేటి వేంకటారామ శర్మ, బి. ఏ.

బుక్క రాయలు, శ్రీహరి హర రాయలకు మల్లదేవి వలన గలిగిన పుత్రుడు. ఇతడు తండ్రి జీవిత కాలమందు యువ రాజుగ నుండి రాచ కార్యములందు గాని కొంతయు సహకారిగ నుండెను. ద్వితీయ పుత్రుడగు చిక్క రాయలు ప్రాచ్య మండలములను, తృతీయ పుత్రుడగు విరూపాక్ష రాయలు ఆరగ మండలమును స్వేచ్ఛగా పాలించు చుండిరి. తండ్రి చనిపోవు సమయమున విరూపాక్ష రాయలు తండ్రి సముఖముననే యుండెను. బుక్క రాయలు కూడ విజయ నగరముననే యుండెను. కాని శ్రీహరి హర రాయల నిర్యాణానంతరము విరూపాక్ష రాయలు సర్వాధి కారములతో విజయ నగర సామ్రాజ్యమును శాలించు చుండి నటుల రెండు శాసనముల వలన తెలియు చున్నది.

చరిత్ర కారులందరు యీ కాలమును నిశ్చయించుట కష్టమని చెప్పు చున్నారు. మొదట శ్రీహరిహరరాయల నిర్యాణము క్రీ. శ. ౧౩౯౯ సం॥ లో జరిగెనని సివేలు చరిత్ర కారుని యభి ప్రాయము. శ్రీహరిహరుని పిమ్మట బుక్క రాయలు రాజ్యమునకు వచ్చె నని కొందరును, విరూపాక్ష రాయలు రాజ్యము చేసె నని కొందరును వాదించిరి. మఱియు బుక్క రాయలు, దేవరాయలు, వేశ్వర చక్రవర్తులని సివేలు చరిత్ర కారుని యభిప్రాయమై యున్నది. శాసనములను పరీక్షించి చరిత్ర కారుల విరుద్ధ వాదములగు నీసమస్యను సమర్థించిరి. అందుచే నావిషయములను విమర్శింప వలయును.

మొదట-శ్రీహరి హర రాయల నిర్యాణము నిశ్చయింతము: క్రీ. శ. ౧౩౯౩ తేది గల శాసనము కంచీవర మందు శ్రీహరి హర రాయలు కామాక్షి దేవాలయమునకు విమానమును కట్టించి నటుల తెలుపు చున్నది. (౨) క్రీ. శ. ౧౩౯౮ తేది గల యింకొక శాసన మందు యీ హరిహర రాయలు దేశమును పాలించు చుండగా నతని సోదరుడు మల్లప్ప ఒడయారుని పుత్రుడు నారాయణ దేవ ఒడయారు కావేరి కపిల నదుల సంయోగమందు తన పెత్తండ్రి శ్రీహరి హర రాయలకు దేహ దారుఢ్యమును జయమును గోరుచు ప్రతాప హరిహరపురమును బ్రాహ్మణులకు దానము చేసినటుల గలదు. బహుశః ఆ సంవత్సరమున విజయనగర చక్రవర్తికి శరీర దారుఢ్యమును దప్పియుండ నోపు. కాని యీక్రింది శాసనములను బట్టి యితడు తదనంతరము ఆరోగ్యము గలిగి దేశమును పాలించి నటుల గ్రహింప గలుగుదుము. (౩) క్రీ. శ. ౧౩౯౯ తేది గల వేలూరు శాసనమందు విజనగర సార్వభౌముడు సుఖముగా రాజ్యపాలన గావించు చుండి నటుల గలదు. (౪) క్రీ. శ. ౧౪౦౩ తేదిగల శాసనము

౨.

కూడ నటులనే తెలుపు చుండెను. (౫) క్రీ. శ. ౧౪౦౩ తేదిగల వేలూరు శాసనమందు, శ్రీహరిహర రాయలు న్యాయముగను, విశాలదృష్టితోను, ప్రజలు సౌఖ్యముగ నుండు నటులను రాజ్య పాలన గావించు చుండగా, మంత్రి విరూపాన్న ఒడయారుని పుత్రుడు మంత్రి విట్టన్న ఒడయారు హరిహరరాయల నాజ్ఞచే ఆరగ ప్రాంతమును పాలించు చుండగా, రైతులు కొందఱు యావిట్టన మంత్రికి భూమి దానము చేయగా, నద్దాని నాతడు బ్రాహ్మణులకు దానము చేసె ననియు, అప్పుడు శ్రీహరి హర రాయలు ప్రజలను, బంధుగులను, పర దేశీయులను, యితర మతస్థులను సమాన ప్రేమ తోను వాత్సల్యము తోను సత్కరించె ననియు, నతడు విద్యా వంతులను, బ్రాహ్మణులను, సంగీత సాహిత్యాది కళ లను మిగుల శ్రద్ధతో పోషించె ననియు గలదు. (౬) క్రీ. శ. ౧౪౦౪ తేది గల మద్రాసు శాసనమందు రెండవ హరిహర రాయలు విజయ నగరమున ప్రజా రంజక ముగా పాలించు చుండగా రాయప్ప ఒడయారుని పుత్రుడు వీరప్ప ఒడయారు ఆరగ మండలమును రక్షించు చుండి నటుల గలదు. ఇట్లు శ్రీహరిహర రాయలు క్రీ. శ. ౧౪౦౪ సం॥ వరకు జీవించి యుండి రాజ్య పాలన గావించు చుండి నటుల శాసన ములు తెల్పు చున్నవి గదా. (౭) కాని క్రీ.శ. ౧౪౦౪ తేది గల వేలూరు ముఖ్య దాన శాసనమందిట్లు కలదు. 'తారణ సంవత్సర ఆశ్వయుజ బహుళ యేకాదశి నాడు శ్రీ మహా రాజాధి రాజ రాజ పర మేశ్వర శ్రీహరిహర దేవ రాయలు కాల ధర్మ మొందెను' ఈ శాసనము విట్టన మంత్రిచే చెక్కింప బడెను. శ్రీ రాయల ముక్తి నిమిత్తము పదు నైదవ దినమున ముక్తిహరిహర పురమును విట్టన మంత్రి బ్రాహ్మణులకు దానము చేసెనట అటు పిమ్మట శ్రీహరిహర రాయల సంబంధము గల శాసనములు కాన్పింపవు. ఈపై కారణ ములచే సూర్య నారాయణ రావుగారు రాయల నిర్యాణమును క్రీ. శ. ౧౪౦౪ అగష్టు మాసమని నిశ్చయించిరి. దాని నెరువను ఆక్షేపింప వీలులేదు.

ఇట్లుండగా బుక్క రాయల సామాంతరము [illegible] శాసనములు ౧౪౦౬ సంవత్సరా నంతరము కాన్పించ నందునను, ౧౪౦౬, సం॥ న దేవ రాయలు పట్టాభి షిక్తుడగుట శాసనము వలన తెలియుట చేతను, [illegible] త్రి కారుడు, బుక్క రాయలు ౧౪౦౬ సం॥న [illegible] యి నట్లును, దేవ రాయలు తద నంతరము రాజ్యాభి షిక్తుడై నటులను నిశ్చయించెను. కాని బుక్క రాయలు పట్టాభి షిక్తుడైన కాలము గాని యతని నిర్యాణ కాలము గాని శాసనముల వలన తెలియుట లేదు. [illegible] ఱియు యీ కాలమున విరూపాక్ష రాయలు సర్వాధికారముతో విజయ నగర మును పాలించు చుండి నటుల రెండు శాసనముల వలన తెలియు చున్నది. ఇదియును గాక కొన్ని శాసనము లందు బుక్క రాయలు [illegible] దు పదములుగ నగు పడు చున్నవి. వీర బుక్క దేవ రాయలు, విజయ బుక్క రాయలు, విజయ దేవ రాయలు మొదలగు పేర్లు వాడుకలో నుండెను. ఈ కారణ ములచే బుక్క రాయలును దేవ రాయలును, యొక్క[illegible] యని నమ్మ దగి యున్నది. బుక్క రాయలు క్రీ. శ. ౧౪౦౬ లో పట్టాభి షిక్తుడైన పిమ్మట దేవ రాయ ని బిరుదు నామముతో పిలువ బడెనని శాసన పరీక్ష [illegible] గ్రహింప గలుగుదుము.

శ్రీహరిహర రాయల నిర్యాణము ౧౪౦౪ అగష్టులో జరిగి యుండగా, ౧౪౦౬ నవంబరు వరకు బుక్క రాయలకు పట్టాభి షేకము గాకుండుటయు ౧౪౦౪ నవంబరు, డిసెంబరు మాసములలో విరూపాక్ష రాయలు విజయ నగరమున మహా రాజాధి రాజ రాజ పరమేశ్వర బిరుదులతో పరి పాలించు చుండి నటుల విట్టన మంత్రి శాసనములు తెల్పు చుండుటయు, [illegible] చరిత్ర కారు లీ కాలమును గూర్చి వివిధాభి ప్రాయము లిచ్చుటలో నాశ్చర్యము లేదు. సివేలు చరిత్ర కారు [illegible] యభి ప్రాయాను సారముగ నిక్కాలమున విరూపాక్ష రాయలు, బుక్క రాయలు, దేవ రాయలు మొదలగు [illegible] [illegible] రాజ్యమునకై పోరు సల్పిరి. [illegible]

దేవ రాయలకు జయము లభించుట చే నతడు క్రీ. శ. ౧౪౦౭ నవంబరు మాసము లో పట్టాభిషిక్తు డాయెను. శ్రీ సూర్య నారాయణ రావు గారు సివేలు యభిప్రాయమును ఖండించుచు నిట్లు చెప్పిరి:= దేశమందు సింహాసనమున కై కలహము లుండి నటుల శాసనములు చెప్పుట లేదనియు, బుక్క రాయలు యుద్ధములలో నిమగ్నుడగుటచే విజయ నగరమున విరూపాక్ష రాయలున్నప్పటి యాచారమున కను గుణ్యముగ సర్వ రాజ్య చిహ్నములతో విజయనగర సామ్రాజ్య వ్యవహారములను చక్కబెట్టు చుండెను.

సివేలు చరిత్ర కారుని యూహ యాక్షేపణీయము గానున్న సత్యమని తోచదు. విట్టన మంత్రి ఆరగ ప్రాంతమును చక్క బెట్టుచుండియు విరూపాక్ష రాయలను సగౌరవముగాను భక్తిశ్రద్ధలతోను గౌరవించుట చేత విరూపాక్ష రాయలు జనవిరుద్ధముగా రాజ్యము నపహరించి యుండె ననుటకు వీలులేదు. తండ్రి మరణ కాలమున బుక్క రాయలును విరూపాక్ష రాయలును కూడ విజయ నగరముననే యుండినటుల గాన్పించును.

క్రీ. శ. ౧౪౦౪. నవంబరు మాసమున హీలపట్టాపు గ్రామమును బుక్క రాయలు బ్రాహ్మణులకు దానము చేసెను. అందుచే బుక్క రాయులు సెప్టెంబరు, అక్టోబరు మాసములు విజయ నగరముననే యుండి నవంబరు మాసములో రాజ్యమును సోదరుడగు విరూపాక్షున కొప్పగించి తాను దక్షిణ తీర్థయాత్రాభి ముఖుడై చని యుండును. తండ్రికి యంత్య క్రియలు, మాసికములు మొదలగు నవి జ్యేష్ఠుడే జరుప వలయును. అందుచే మొదటి సంవత్సరము అతడు పట్టాభి షిక్తుడగుట కంగీకరించి యుండలేదు. ఇట్లు దక్షిణ ప్రాంతములకు బోవుచు హేలపట్టారు గ్రామమును బ్రాహ్మణులకు దానము చేసి యుండును. ఈ యాత్రలో నీతడు తన గురువగు శృంగేరీ పీఠస్థులను, రామేశ్వరమున సీతా రామలక్ష్మణులను సేవించి కానుక లిచ్చి యుండును. క్రీ. శ. ౧౪౦౫ నవంబరు మాసములో విజయ నగరమున బుక్క రాయలు రాజ్యభారము వహించి యుండి నటుల శాసనములు తెల్పు చున్నవి. అటు పిమ్మట క్రీ. శ. ౧౪౦౬ నవంబరు మాసము వరకు పట్టాభిషేక మహోత్సవమునకుతగు శుభదినము సందర్భ పడనందుననో గుల్బర్గా సుల్తానుతో జరిగిన యుద్ధముల వలననో రాజ్య భారము వహించియు, సైన్య సమూహములను యుద్ధభూములకు నడిపియు కూడ పట్టాభిషేక మహోత్సవమును జరిపి యుండలేదు. క్రీ. శ. ౧౪౦౬ సం॥ నవంబరు మాసములో మహా వైభవముతో నీ యుత్సవమును జరిపి దేవరాయ బిరుదముతో సింహాసనము నాత డధిష్ఠించెను.

బుక్క రాయలు యాత్రకై బోయి యుండగా విరూపాక్ష రాయలు విజయ నగర సామ్రాజ్యమును పాలించు చుండెను గదా. అప్పు డొక నాడు విజయ నగర రాయల యాస్థానమున కొక బ్రాహ్మణుడరుదెంచెను. అతడు ప్రేతల యను యువతి యొక్క సౌందర్యమును విద్యాతిశయములను మధురముగా వర్ణించి విరూపాక్ష రాయల మనస్సామెపై మరల్చెను. ఆమె ప్రియ వచనములచే రాయల యంతఃపురమున ప్రవేశించుట కీయ కొననందున, విరూ పాక్ష రాయల కామెపై మితిం మోహము గలిగెను. ఆపె నెట్లయిన జేబట్ట నిశ్చయించి ముద్గలు కోట యందున్న ప్రేతలకై ముద్గలు పట్టణమునకు బోదలచెను.

రాయచూరు, ముద్గలు మండలములు శ్రీహరిహర రాయల చాక చక్యముచే విజయ నగర సామ్రాజ్య మునకు జేర్చ బడెను. కాని వాటికి బదులుగ కొంత కప్పమును యేటేట గుల్బర్గా సుల్తానునకు గట్టుటకై యాతడంగీకరించెను. శ్రీహరిహర రాయలు జీవించి యుండగా నీకప్పము నేటేట చెల్లించు చుండెను. కాని గుల్బర్గా యందు సంభ వించిన రాజ్య కలహముల చేతనో, బుక్క రాయల దురహంకారము చేతనో, యీకప్పమును చెల్లించుట మానిరి. అయిదు సంవత్సరముల కప్పము

బకాయి పడెనని ఫరిష్టా చరిత్ర కారుడు చెప్పెను. అనగా క్రీ. శ. ౧౪౦౧ సం॥ నుండి యీ కప్పము గుల్బర్గా సుల్తానునకు చెల్లింప వలసి యుండెను.

క్రీ. శ. ౧౩౯౭ సం॥న ఫిరోజిషా గుల్బర్గాయందు సుల్తానుగా నంగీకరింపబడెను. అతడు రాయచూరు ముద్గలు గైకొనుటకై సైన్యములను వృద్ధి పఱచియు, రాయల యనుచరులకు లంచములిచ్చియు, యత్నింప దొడగెను. పెద్ద పులియగు శ్రీ హరిహర రాయలు క్షీణించి యుండగా నాత డేమియు చేయజాలక నూర కుండెను. మఱియు తన కీయవలసిన కప్పము నేటేట రాయలు పంపుచుండెను. కాని బుక్కరాయల కీకప్ప మైన చెల్లించుట కిష్టము లేకుండెను. క్రీ. శ. ౧౪౦౪ సం॥ న శ్రీ హరి హర రాయలు మృతి నొందుటయు, విరూపాక్ష రాయలు రాచకార్యములను చక్కబెట్టుట యు నీతని యుద్దేశముల కనుకూలముగా నుండెను. కృష్ణ వేణియొద్ద సుల్తాను వేయి గుఱ్ఱపు రౌతులతో గూడిన బలమును జేర్చెను. అది చూచి రాయచూరు ముద్గలు ప్రతి నిధులు తటస్థముగా నుండిరి. వారు యిటు రాయల సైన్యములను, నటు సుల్తాను సైన్యములను గాంచి యుభ యులకు స్నేహితులుగ ప్రవర్తింపదొడగి యుండుదు. ఆ కారణముచే రాయలు సైన్య సహాయముతో వీరితలను వశ పఱచు కొన నిశ్చయించెను.

ఇట్లు రాయలు సైన్యముతో ముద్గలకోట చొచ్చు ట గాంచి సుల్తానునకును రాయలకు నచ్చట యుద్ధము జరుగ గలదని తలచి తమ వస్తు సామగ్ర్యలతో పొలముల లోన, యడవులలోను, యిరుగు పొరుగు గ్రామములలోను ప్రజలు భీతిచే దాగిరి. ఈ పారిపోయిన వారిలో పేరి తలకూడ గలదు. రాయలా మెకై వెదకించెనుగాని. కాన్పిం పలేదు. అందుచే కోపావేశము గలిగి మసీదులు బడగొట్టిం చియు, మహమ్మదీయుల శిక్షించియు నతిక్రూరముగా ప్రవర్తించెను. సుల్తాను సైన్యములు నదిని దాటి రాయ లతో దలపడెను. ఉభయులకు యుద్ధము జరిగెను. అనే కులు హతులైరి. రాయచూరు ముద్గలు మండలము సుల్తాను వశమాయెను. హిందూ యోధులు చాలమంది మడసిరి. విరూపాక్ష రాయలు నిజరాజధానికి పోవ లయెను. పేరితల సుల్తానుకు దొరకుటచే నతడామె విషయలోలుడగు కుమారునకిచ్చి వివాహ మొనర్చెను.

సుల్తాను వెంటనే తన సైన్యములన్నిటిని రప్పించి, విజయనగరమును ముట్టడించెను. ఉభయులకును కోటగో డల సామీప్యమున ఘోరయుద్ధము జరిగెను. విరూపాక్ష రాయలు కోటలోనే యుండెను. హిందూ యోధులు కోటను భక్తి శ్రద్ధలతో కాపాడుచు ప్రాణములను లెక్క సేయక పోరుసల్పిరి. ఫిరోజిషా ఒక హిందూ యోధుని బాణముచే గాయపడెను. అయినను ధైర్య శాలియగు ఫి రోజిషా తన గాయమునకు కట్టుకట్టి పోరుచునే యుండె ను. తుదకు కోటను పట్టజాలక నాలుగు మాసముల వేర్వేఱు వ్యూహములను పన్నుచు కోటయెదుట నున్న మైదానము మీదనే డేరాలు వేయించి కోటలోని కేమ మగిరియు బోకుండ కనిపెట్టుచుండెను. ఇంతలో సుల్తా బింకాపురము కోటను స్వాధీన పఱచుకొని ౬౦,౦౦౦ హిం దువులను చెరసాల యందు బెట్టెను. మఱియు ఆకో కోటను గూడ గట్టిగా ముట్టడించెను.

అప్పుడు విరూపాక్ష రాయలు సుల్తాను కడ దూతను బంపెను. సుల్తానునకు తనకుమార్తెను, ధనము యిచ్చుటకును; బింకాపురపు కోటనుగూడ వశ పఱచుట ను, రాయలు సమ్మతించెను. వివాహ మతి వైభవముతో జరిగెను. దక్షిణ హిందూ రాజు తనకుమార్తెను మహమ్మ దీయ సుల్తానుల కిచ్చి వివాహము చేయుట కిదియే ప్రథ మమని మహమ్మదీయులు మిగుల సంతసించిరి. విరూపా క్షు రాయలు మోహాంధ కారమున సుల్తానులో యుద్ధ తెచ్చుకొనినను విజయనగర కోటను సుల్తాను శాశ్వత వేయ నందులకు విజయనగర పౌరులును సంతసించిరి. యుద్ధా నంతరము బుక్కరాయలు విజయ నగరమునకు వచ్చి సంగతులను విచారించి విరూపాక్ష రాయలను మంత్రు

చియుండును. మఱొకసారి యేటకో బోవుచు బుక్కరా యలు రాజ్యభారమును సదాశివ రాయల కిచ్చెను, కాని విరూపాక్ష రాయల కప్పగింప లేను. మఱియు ఆగర ప్రాంతమునకు విరూపాక్ష రాయలే మండలాధికారి యైనను బుక్కరాయలు రాజ్య భారము వహించిన పిమ్మట గూడ విట్టన మంత్రియే ఆరగ ప్రాంతమును నే లు చుండెను. విట్టన మంత్రియు తన శాసనములందు దేవరాయలను పేర్కొనెనే గాని విరూపాక్షుని యటు పిమ్మట తలచియుండ లేదు.

క్రీ. శ. ౧౪౧౯ సం॥లో ఫిరోజిషా ఓరుగల్లు పై దండెత్తెను. కాని యోడిపోయెను. అప్పుడు బుక్కరా యలు కూడ సుల్తాను నెదుర్కొనుటకై సైన్యములను బంపెను. మీర్ ఫజ్లుల్లా రాయల నోడించియే యుండును కాని రాయలచే బోధితుడైన ఒక మహమ్మదీయ డాత నిని గాయ పఱచెను. అందుచే జయము హిందువులకే చేకూరెను. సుల్తాను అతిప్రయాసతో తప్పించుకొని పారి పోయెను. రాయిచూరు ముద్గలు మండలములు తిర్గి రా యలకు వశపడెను. సుల్తాను ఫిరోజిషా, గుజరాతు సు ల్తానుని సహాయ మపేక్షించెను. కాని లాభము లేకపో యెను. ఇట్లుండగా సుల్తాను సర్దారులలో ధైర్య వంతు డును బల వంతుడు నగు ఖాన్ ఖానాన్ అను నతడు కృష్ణా నదివరకు రాయల సైన్యమును దఱిమి గుల్బర్గా రాజ్యమును శత్రువుల బారినుండి తప్పించెను.

ఫెరోజిషా వృద్ధుడగుటచే ౧౪౨౨ సం॥ న మరణించెను. ఖాన్ ఖానాన్ బల వంతు డగుటచే, సుల్తానును బెదిరించి సింహాసనమును తనకు వచ్చునటుల వ్రాయించు కొనెను. అందుచే నతడు అహమ్మదుషా యను బిరుదుతో గుల్బర్గా సుల్తానుగా చేయబడెను. ఫిరోజిల భర్తకు సింహాసనము దొరక లేదు. ఒక విధ మగు బంది ఖానా లభించెను. అహమ్మదుషా ధైర్య సాహ సాగుణములచే బహిఖ్యాతి పొందెను. ఇపు డాతడు గుల్బర్గా సుల్తానుగ చేయ బడిన పిమ్మట విజయ నగర రాయల బలము వణగ ద్రొక్కుటకై యత్నించెను.

శ్రీ బుక్క దేవ రాయలును క్రీ. శ. ౧౪౨౨ సం॥ ననే కాలధర్మ మొందెను. సివేలు చరిత్రకారుడు యీ దేవ రాయలు క్రీ. శ. ౧౪౧౯ సం॥ లో మృతి నొందె ననియు విజయ భూపతి వెంటనే విజయ నగర సింహాసన మధిష్టించె ననియు నభిప్రాయ పడెను. కాని సూర్య నారాయణ గారు దానిని శాసన సాక్ష్యముచే ఖండించిరి. ఎందులకన ౧౪౦౬ మొదలు ౧౪౧౯ పర్యంతము, దేవ రాయలను గూర్చి ప్రశంసగల శాసన ములు పెక్కులు లభించినవి. క్రీ. శ. ౧౪౧౯ తేదిగల నొక శాసనము వీర దేవరాయలు విజయ నగరమున రాజ్య పాలనము చేయు చుండి నటుల తెల్పు చున్నది. ౧౪౨౦ తేదిగల ఒక శాసనమందు దేవరాయలు రాజ్యము చేయు చుండగా కోశమును ధనాగార మునకు పంప వలసినది యని మల్లప్ప బడ యారుని యాజ్ఞాపించి నటుల గలదు. క్రీ. శ. ౧౪౨౦ తేదిగల మఱొక శాసన మందు వీర దేవరాయలు రాజ్య పాలన చేయు చుండగా పశువుల కాపరి వీర గౌడుడు చని పోవుటచే నతని భార్య సహగమనము చేసినటుల కలదు. అదియును గాక ౧౪౨౨ అగస్టు తేదిగల ఒక శాసన మందు దేవరా యలకు ముక్తి లభించుటకై నతని పుత్రుడు హరి హర రాయలు పదు హేను దినములు దానములిచ్చి బ్రాహ్మ ణులను సంతోష పెట్టినటుల గలదు. ౧౪౨౨ ఏప్రిలు మాసమునకు సంబంధించిన వేఱొక శాసనమందు దేవ రాయలు విజయ నగరమును పాలించు చుండి నటుల గలదు. అందుచే సూర్యనారాయణ రావు గారు శ్రీ బుక్క దేవరాయలు ౧౪౨౨ అగస్టు మాసములో చని పోయినటుల నిశ్చ యించిరి. ఇందుల కాక్షేపణలు గాన్పింపవు.

శ్రీ దేవ రాయలకు భాస్కరుడు, మల్లన, హరి హరుడు, విజయ భూపతి యను నలుగురు పుత్రు లుండిరి అందు భాస్కరుడు యేయుద్ధముననో చనిపోయి యుండును. మల్లన్న లేక మల్లప్ప ఒడయారు దక్షిణ భూమండలమునకు ప్రతి నిధిగా నుండెను. ఇతడు

చిత్తల దుర్గమందుండి రాచ కార్యములను చక్క బెట్టు చుండెను. విజయ నగరమున రాయలు చనిపోయి నపుడు యితర కుమారులు లేనందున కాబోలు హరిహర రాయలు అంత్య క్రియ లొనర్చెను.

ఈ బుక్క దేవరాయల కనేక నామములు గలవు: బుక్క రాయలు, దేవ రాయలు, బుక్క దేవ రాయలు, వీర బుక్క దేవ రాయలు, వీర దేవ రాయలు, వీర ప్రతాప దేవ రాయలు, ప్రతాప దేవ రాయలు మొదలగున వన్ని పేర్లును యీ చక్రవర్తికి సంబంధించినవే! ఈ నామముల వలనను, శాసనముల ప్రసక్తి చేతను ఇతడు బహు సాధు చక్ర వర్తియనియు, దేవబ్రాహ్మణ భక్తుడనియు, దానకర్ణుడనియు, సుగుణ మూర్తియనియు, పరమత సహన శక్తి మంతు డనియు తెలియు చున్నది. మఱియు రాయచూరు ముద్గలు మండలములను తిర్గి తన రాజ్యములో కలుపు కొనుటచే రాజనీతి విశారదుడనియే తెలుసుకొన గలుగుదుము. ఇతడు పరదేశస్థులను సత్కరించి విజయనగర సామ్రాజ్యమున కెట్టికళంకము గలుగకుండ కాపాడెను. సోదరులను, ప్రజలను కుమారుల[illegible] బాలించెను. పండితులను కళలను పోషించెను. ఫిరో[illegible] షా పరంగల్లుపై దండెత్తినపుడు, దేశాభిమానముగల [illegible] రాయలు గుల్బర్గా రాజ్యముపై తనసేనల బుత్తెంచి [illegible] లు. రాజ్యమున కెట్టి యుపద్రవము రానీక కాపాడె[illegible] శత్రువుల శిక్షించుట కెన్ని యుపాయములు గలవో [illegible] నన్నిటిని యుపయోగించుటకు దేవరాయలు వెనుదీయలే[illegible]

ఇతడు రాజ్యము చేయుచుండగా తనతండ్రి [illegible] మున విజయ నగర మెంత మనోహర ముగను గొప్ప[illegible] ఘనతయు గలిగియుండెనో, నంత వైభవములో [illegible] నలంకరింప జేసె ననుటకు సందేహములేదు. అంత[illegible] ములులేక సోదరులలోను పుత్రులలోను యిం[illegible] న్యము రాచ వంశములలో నెచ్చటను చూడము. [illegible] లు, ద్రవిడులు, రాష్ట్రకూటలు, రాయలతో స్నేహ[illegible] ము గలిగి యుండిరి. అట్టి శ్రీ దేవరాయలు క్రీ.[illegible] ౧౪౨౨ సం॥లో కాల ధర్మ మొందె ననెడి వార్త [illegible] కులను దుఃఖసాగరమున ముంచి యుండును.

# తురాయి సామరి*

ఆవంత్స వేంకట రంగా రావు, బి. ఏ.

శిర మందు నరుణంపు విరులు కై సేసి
తులలేని రంగు దుస్తులు ధరియించి
లలిత మా శాద్వల స్థలమందు నిలిచి
కర రాజితో నయః ఖడ్గముల్ పూని
జనుల చిత్తములు రంజన సేయ నెంచి
ఘల్లని ఖడ్గ కంకణములు మోగ్రియు
సాము చేయు తురాయి సామరిఁ గాంచి
రంజిల్లితిని యంత రంగమ్ము నందు.

(భావ కవితా తరంగిణి)

* తురాయిచెట్టు మీద చెప్పిన పద్యము.



# శీత తల్లి

గుడిపాటి వెంకటచలం బి. ఏ., ఎల్. టి.



"ఆ వీధినా! ఆవీధిని నేను రాను-" అని పట్టుపట్టి, పక్క తోవల తీసుకొని వెళ్లాడు వెంకటాద్రివు. కారణ మేమిటని ప్రాణం తియ్యగా తియ్యగా, సిగ్గు దిగమింగి, ఒకరోజు యిద్దరం పడుకున్న తరువాత, చీకట్లో చెప్పాడు.

"మేడమీద కిటికీలో ఆ అమ్మాయిని చూచిన నాటినుంచి సరదా కలిగి రోజూ ఐదారుసార్లు ఆదోవనే తిరుతో వుండే వాణ్ణి. రెండో రోజున కొంచెంగా నవ్వి, నా ఆశల్ని మొలక లెత్తించింది. కాని నాలుగో రోజు నించి కింద గుమ్మంలో వాళ్లతల్లిలాగు వుండే ఒక ఆమె నుంచుని, పైకి చూసే నావంక, కోపంతో చూస్తో వుండడం కనిపెట్టాను. కాని ఆడదానికి భయపడతానా నేను అనుకొని, మళ్లీ మళ్లీ వెడుతున్నాను. రోడ్డు మీద నడిచే నన్ను యెవరేమంటారు? కిటికీలో కూచున్న ఆ అమ్మాయి తల్లో గులాబి పువ్వులు చంపలకి అందమిచ్చాయి, ఒకసారి పైకిచూసి, తలొంచుకుని వెళ్లిపోతున్నాను.

"అబ్బాయీ! మాట, యిట్టారా." అంది తల్లి, గుమ్మం లోంచి.

దురి చేసుకుని పారిపోయి, యింక ఆ వీధిని రాకూడదని, అను కున్నాను. కాని ఆడదానికి భయపడతానా, అను కున్నాను. ఐనా యెందుకు పిలుస్తోందో! కంఠంలో కోపం వినపట్టంలేదు. పలక్క వెడితే తప్పు పని చేసినట్టుంటుంది. నే నేం చేశానని, తప్పు పట్టడానికి? గుమ్మం లోకి వెళ్లి,

"యెందుకు?" అన్నాను.

"యిట్లారా! చెపుతా."

కోపం లేదు. వెడితేనేం?

"యిదిగో చూడు! చిన్నవాడివి, వృద్ధి లోకి రావలిసిన వాడివి. యిట్లాంటి పనులు, నీకూ, నీకుటుంబం మర్యాదకీ తగినవి కావు."

"యేంచేశాను?" అనపోయినాను కాని, ఆమె తిడుతో వుంటె వినడం బావుంది. కోపం లేదు, ఆమె చక్కని కళ్లల్లో.

"నీకు పెళ్లయిందా?"

"లేదు"

నీకు చెల్లెల్లున్నారా?"

"ముగ్గురున్నారు."

"వాళ్ల కోసం యెవరన్న వీధి వెంబడి యిట్లా తిరుగుతూ వుంటె నీకెట్లా వుంటుంది?"

"చాలా తమాషాగా వుంటుంది."

"మంచి వాడివే. మా అమ్మాయి నీ చెల్లెలంటి పిల్ల కాదూ? అట్లా అల్లరి చేస్తావా దాన్ని!"

"నేనేం అల్లరి చెయ్యలేదు."

"వూరికే బూకరించకు. నేను చూస్తోనే వున్నాను. యిట్లాంటి పనులు మానెయ్యి. యిక్కడే కాదు, యెక్కడాను. నీ కోసం, నువ్వు బాగు పడాలనే చెపుతున్నాను. మా అమ్మాయి కేమీ నష్టం లేదు. యిట్లా చూడు, యిట్లాంటి చక్కని మొహాన్నీ, కళ్లనీ, నీ భార్య, కోసం దాచుకో. అందరికీ యిట్లా పంచేస్తే యాడవదూ!........సరే కాని యెక్కడ చదువు కుంటున్నావు?"

"హైస్కూలులో."

"యేక్లాసు?"

"స్కూలు ఫైనలు."

"యింకేం! వూరికే అల్లరి చెయ్యకపోతే, రోజూ వొచ్చి మా అమ్మాయికి యింగ్లీషు చెప్పరాదూ?"

నా వొళ్లు పరవశ మయింది.

౨

సీతకి యింగ్లీషు రాదు. చెప్పినా రాదు. వూరికే పిచ్చిగా మొహం వంక చూస్తో కూచుంటుంది. ఆ అమ్మాయికోసం నేను పడ్డ వుత్సాహం యింగ్లీషు చెప్పడంలో సగం పోయింది. కాని సీత అందమైన పిల్ల. చూపులతో చాలా అల్లరి చెయ్యగలదు. ఆ తల్లి మాత్రం రోజూ పాఠం చెప్పినంత సేపూ మాతో కూచుంటుంది. కనక పుస్తకం-మీదినించి శీత నాకేసి కింది చూపు లెన్ని చూసినా, నేను ఆ అమ్మాయి పాదాన్నెంత నొక్కినా యేంలాభం లేక పోయింది. యింగ్లీషులో తల్లికి తెలీకండా మాట్లాడదా మంటే సీత్కి అంతా కలిపి పదిహేను యింగ్లీషు మాటలొచ్చు! బల్లా, చాపా, పిల్లి మొదలైన వాటికి. యింక ఆ పైరివేటు మానెయ్యాలనుకుంటున్నాను. ఆలోచించి ఒక చీటీ రాశాను శీతకి, పుస్తకంలో పెట్టాను; ఆ రాత్రి అన్నం తొరగా తిని మేడ మెట్ల మీద నుంచోమని. చదువైన తరవాత బైటికివెళ్లి ఒక అర గంట తిరిగి వెనక్కి వొచ్చి సరాసరి మెట్లెక్కుతున్నా. వొంటింటోంచి మాటలు వినపడుతున్నాయి. మెట్లమధ్య సల్లచీర చెరుగు కనపడ్డది. గుండెలు కొట్టుకుంటో మెట్లెక్కే పోయినాను. దీపం బాగా కనపట్టంలేదు. దగ్గిరకెళ్లి బుజంమీద చెయ్యేశాను. సీతతల్లి! చప్పున నా చెయ్యి పట్టుకుని దగ్గిరికి లాగి,

"యేమిటిది బాబు! యేంపని! మంచివాడవే!"

యింకా యేమిటో చెప్ప పోతోంది, భయంతో నేను పరిగెత్తుకుని వొచ్చేశాను.

మర్నాడు వెళ్ల సాహసించ లేదు, కా కబురు వొచ్చింది. రాత్రి యేమీ జరగనట్టే ప్రవర్తించింది ఆమె. పదిరోజు లయిం తరవాత ఒకరోజు సాయంత్రం నేను వెళ్లేప్పటికి తల్లీ కూతురూ యెవరూ యింటో లేరు. ఒక గంట సేపు కూచున్నాను. యీ ట్యూషన్ నాకు విసుకు పుడుతోంది. ఆ పిడట్లా కా కూచుని వుంటే, యేంలాభం? అప్పుడే వుదయించే వెన్నెల తరిగిన నల్లని ఆకాశం వలె చిరునవ్వు కాంతితో నిండినపాలాలు చూసి, చూసి, సీతని వొంటిగా కలుసుకోవాలి!

చీకటి పడ్డది. దీపాలెవరూ వెలిగించలేదు. బండి వాకిట్లో ఆగింది. సీత పైకి వచ్చింది. గంధం వాసనా, దవనము వాసనా నన్ను కమ్మాయి. చీకట్లో వెనకే వెళ్లి నుంచున్నాను. బీరువా లోంచి తీసిన పట్టుచీర వాసన వేసింది. మెడమీద ముత్యాల హారం, దానిమీద వొదులుగా అల్లిన జడా కనపడ్డాయి.

"సీతా!"

"చప్పున తిరిగి చూసింది."

యింతలో కిందినించి,

"బాబు వొచ్చాడా?" అంది తల్లి.

నా ప్రయత్నమంతా విఫల మయింది

"లేదు." అంది సీత.

ఆశ్చర్యపడి పోయినాను. ఆ 'లేదు' అన్న వొక్క మాటకే దాస్యం చెయ్యొచ్చు! నెల రోజులు చెప్పినా యింగ్లీషులో వర్తమాన కాలానికీ, భూతకాలానికీ బేధం తెలీని సీత, యీ విషయములో యెంత విశే

చూపిందో! రెండు చేతులు జాచి సీతనిదగ్గిరికి తీసుకున్నాను. ఆ పల్చని పట్టుచీర లోంచి గట్టి చిన్న......... నన్నాను కున్నాయి. నావేళ్ల కింది ఆమె లేత దేహం ఝల్లుఝల్లుమని వొణికింది. చీకట్లో తిన్నేసుకునే ఆమె పెదిమల్ని వెతికాను. అట్లా నుంచున్నాము, యెంతోసే పు కదలడానికి భయపడుతో! మెల్లిగా సోఫామీద అట్లానే వొరిగాము. యెంతోసేపయింది. గట్టిగానన్ను ఆమె చేతులు వొత్తాయి. నావొళ్లు దేనికో, అర్థం కాని బాధతో లాక్కుపోయింది. యింతలో మెల్లిగా దీపంవెలుతురు పడ్డది. సీత తల్లి యెదురుగా నుంచుంది.

"యేమిటిది? ఆ!............"

మేం మాట్లాడక ఊడిగా నుంచున్నాము. సీత చాలా భయపడి వొణకడమో, లేక యేడవడమో, చేస్తుందను కున్నాను.

"నువ్వుపో!" అంది సీతని.

మామూలుగా పక్కకి తిరిగి వెళ్లి పోయింది.

"యేంచేస్తున్నావు? యిందుకా నిన్నిట్లా నమ్మిందీ? చిన్నదాన్ని చేసి..............................

"............................మంచివాడ వనుకుని

"..................................................

"....యిదానాకు చేసే వుపకారం? సిగ్గుగాలేదూ?"

యేంచేస్తుంది? కొడుతుందా? నేను మళ్లీ కొట్టలేనూ? ఆమె చేతులకేసి చూశాను. గుండ్రిగా పెద్దవిగా తెల్లగా,..................... .........యెంత బావున్నాయి. ఆ చేతులు నన్ను గట్టిగా ఆ పెద్దవక్షం మీదికి లాక్కుంటే!

"నాకోపం వచ్చింది నీమీద; యేం చెయ్యనూ?"

దగ్గిరికి వొచ్చి నా బుగ్గలు కఠినంగా నొక్కింది.

"యింకెప్పుడూ యిట్లా చెయ్య వను."

నిరాశ పొందిన నా నరాలు వూరికే తహతహ లాడుతున్నాయి. యింకా అనుభవానికై వెతుకు తున్నాయి.

"చెయ్య నన్నదాక నిన్ను వదలను."

నాచెయ్యి పట్టుకుంది, దగ్గిరిగా నుంచుని. ఆమె వూపిరి నా తలమీద తగుల్తోంది. గాఢంగా లాగే ఆమె నిశ్వాసంనాకు వినపడు తోంది.

"యేం, మాట్లాడ వేం?"

నామొహం దగ్గిరిగా ఆమె వెచ్చని మెత్తని ......కమ్మేస్తోంది.

"అయితే వెళ్లు నీను, యింతే."

ఆమె...... మీదని రాచిన అగరు వాసన నా తల తిప్పింది.

"యింతే నిన్ను."

గట్టిగా కావిలించు కుంది. నా చేతులతో ఆమె చేతుల్ని పైన పట్టుకున్నాను.

* * * *

× × × ×

సీత తల్లి, సీతకన్న బావుంది. కాని మళ్లీ వెళ్లడమంటే భయంగా వుంది. యెందు కంటే............

..............................యింక చెప్పను."



# గీత ప్రియ

సముద్రాల రాఘవాచార్యులు

నేఁ తలపోయలేదు, మరి నీవు తలంచియు నుండవేలనో
నా తొలి కూరుముల్ బొదివినావు మనోహర సాంద్ర చంద్రికా
స్ఫీతములైన నీ ప్రణయ శీతల దృక్కుల లో; నదృష్ట సాం
కేతిక మేదొ దాన వెలిగెన్ మన యిర్వురి పూర్వ కర్మలన్.

నీవనుకోవు; నామదిని నీహృదయమ్మె దలంతు నాదు ప్రే
మావసథం బటంచు నది యన్య దురాసద మంచుగాని యి
ట్లీవిధి నిన్ను నా కవుగిలిన్ వెలిజేసె నితఃపరమ్ము న
న్నీవు గ్రహింప జాలవద నీయ కఠోర భుజాంత రస్థనై
ఆ వెడ దైవ మా పగిది నంతగ నిన్బె వంత పెట్ట నెం
తో విలపించి యుందువని తోపగజేయు మదార్ద్రమూర్తి; త
న్వీ! వలపున్నటుల్ బయలు పెట్టును దూరము లయ్యు బ్రేమపుం
దీవులు త్వత్పదాంకములు ద్రెళ్లగ నాదు మనః ప్రదేశముల్
నామది శూన్య మంచు దెగ నాడకు; ప్రాక్తన ప్రేమ పీఠ మం
దే మొలకెత్తి తేజరిలెడిన్ భవదీయ మనోజ్ఞ మూర్తి; ని
న్నేమరనేర దీ హృదయ మెంతకు స్పందన ముండునో మదీ
యామల దేహమెంతవర కాహుతి కాదొ చితాగ్ని కంతకున్.

నీ లావణ్య శరీర మీ పృథివిలో నీ ప్రాణముల్ విశ్వ వా
తూలంబందు విలీన మౌనొ మరి గుర్తుల్ పట్టరానట్టి లే
కాలంబందపు డౌత నీదు పృథు వక్షస్సీమ మన్మూర్ధ మ
చ్ఛాలంకారము; నీదుతోటి వయమేయ స్వర్గ సౌఖ్యావళుల్.



# రష్యాలోని విద్య

బి. యన్. శర్మ, బి. ఏ.

రష్యాలో విద్యాస్థితి యెటులున్నది? ఇచ్చట విద్యావంతు లెందరు గలరు? అను ప్రశ్నల కొక విదేశీయు డుత్తర మొసగ దలచిన, అతడు కొంత కాల మచ్చట నివసించి అచ్చటి ప్రజలతో సంబంధ బాంధవ్యములైనను లేక వారితో దైనిక వ్యవహారములు సలిపియైనను లేక అచ్చటి అధునిక విశ్వ విద్యాల యములు, విద్యాలయముల పద్ధతుల స్వయముగా నభ్యసించిన వాడైనను నుండి యుండ వలయును. అచ్చటి ప్రాచీ నాధునిక విద్యా పద్ధతులు విమర్శన దృష్టితో నభ్యసించిన వారికి సోవియేటు ప్రభుత్వమువారు విద్యా ప్రచారమున కెటుల పాటు బడుచున్నది వివరముగా తెలియ గలదు.

## జారు ప్రభువుల కాలము

ఇరువద వశతాబ్దాది యందు రష్యా దేశము అంధకార బంధురమై యుండెను. ప్రజలలో కొన్ని తరగతుల వారికి ప్రాథమిక విద్య యైనను గరుప బడ కుండెడిది. ఉన్నత విద్య నభ్యసించు నభిరుచి [illegible] సంఖ్య దేశము నందు మిక్కుటముగా నున్నను, యభ్యసించుటకు వీలు లేకుండెడిది. దేశమునం దధికముగ పీడింపబడువారు యహూదీయులు. వీరు విద్యావంతు లైనను ఉన్నత విద్య నభ్యసించుటకు విశ్వ విద్యాలయము లందుగాని, ఉన్నత విద్యాలయము లందుగాని చేరుటకు ఏమాత్రము హక్కు లేకుండెను. అధమ తరగతుల వారనబడు కార్మికులు, రైతులు విద్య నాపాదించినచో హతాశు లగుటయే గాక అధికారుల వలన దండింప బడుచుండిరి. విద్యాంగ మంత్రి యైన శిష్కొవా అలగ్జాండర్, జారు ప్రభువు గారి యెదుట విద్య విషయమై యభిప్రాయ మిటుల వెలిబుచ్చెను:-

,, లవణము వలె విద్యగూడ ప్రజల స్థితి గతుల బట్టి కొద్దిగా ప్రచార మునకు దెచ్చిన గాని లాభము గలుగదు. ప్రజలందరిలో విద్యా భ్యాసము ప్రబలి వ్రాయ చదువ నేర్చిన వారి సంఖ్య దేశము నందు హెచ్చినచో మేలునకుమారు ముప్పు వాటిల్లును."

( "స్కాటు నియరింగ్ గారి సోవియేటులోని విద్య" పుట ౧౬)

క్రీ. శ. ౧౯౦౪ వ సంవత్సరమున రష్యాలో నూటికి ముగ్గురు మాత్రము పాఠశాలలో విద్య నభ్యసించు చుండి నటుల నొక రష్యా విద్యాధికుడు ప్రపంచమునకు దెలిపి యున్నాడు. ఆకాలము నందు విద్యా విధాన మంతయు విద్యాశాఖవారిచే నియమింప బడు చుండెను. పాఠశాలలందలి కార్య క్రమము సహితము వీరే నిర్ణయించు చుండిరి. పాఠశాలలు, బోధకులు అధికారుల చేతిలోని కీలు బొమ్మలుగా నుండిరి. ప్రాథమిక పాఠశాల పద్ధతియిటు లుండెను :-

౧. వారములో ౬ గంటలు మతవిద్య గరుప వలయును.
౨. ,, ౩ ,, దైవిక ప్రార్థన జరుప వలయును.
౩. ,, ౭ ,, రష్యా భాష నేర్ప వలయును.
౪. ,, ౨ ,, వ్రాత నేర్ప వలయును.
౫. ,, ౫ ,, గణితము బోధించ వలయును.
౬. ,, ౩ ,, దేవాలయ సంగీతము జరుగ వలయును.

( విద్యాసభ నివేదిక, ౧౮౯౯ సం॥ పుట ౨౪౦)

విద్యాలయములందలి బోధకులు, పండితులు యెల్లప్పుడు కావలాలో నుంచబడుచుండిరి. వీరికి బహు తచ్చు వేతనము లియ్యబడు చుండెను. రహస్య శాఖ వారు, అధికారులు వీరి నెల్లప్పుడు తనక్కీ చేయు చుండిరి. విద్యార్థులలో స్వాతంత్ర్యాపేక్ష కలిగింప కుండుటకు, వారిలో రాజ్యాంగ పరివర్తన భావము లుత్పన్నము కాకుండుటకై బోధకులను కావలాగాయు చుండిరి.

## విద్యార్థుల స్వాతంత్ర్యము

విద్యార్థులకు తమ కష్ట నిష్ఠురములు దెలుపుకొను స్వాతంత్రము లేకుండెను. సోదర విద్యార్థులను దెలియుటకై పాఠశాల ఇల్లలపై యతి కించబడు విద్యార్థి సంఘముల పరికటనలు గాని లేక సభలు సమావేశము జేయుటగాని పూర్తిగా నిషేధింపబడి యుండెను. సంస్థలకు, యుద్యమములకు విద్యార్థులు చందా లొసగుట లేక విరాళము లిచ్చుట నేరముగా పరిగణింప బడుచుండెను. ప్రభుత్వ నుజ్ఞ బడిసిన సంస్థలయందు రాజ్యాంగ పరివర్తన దర్పముతో నడుపబడు రహస్య యుద్యమములందు విద్యార్థులు పాల్గొన జాలకుండిరి. పాఠశాల లేక విద్యాల యాధికారుల ప్రత్యేక యనుమతిని బడి న్యాయ సంస్థల యందు విద్యార్థులు పాల్గొనుటకు వీలు డెడిది. ప్రతి విషయమందును ప్రభుత్వపు వారి ఆజ్ఞ బడయుట విద్యార్థుల కర్తవ్యమై యుండెను. మొత్తము మీద విద్యార్థుల స్థితి ఖైదీల వలె నుండె ననవచ్చును.

## విద్యా వ్యాపకము

జారు ప్రభువుల దుర్మార్గములు, నిరంకుశత్వపు చర్యలు నానాటికి వృద్ధిజెంది దేశీయులను స్వాతంత్ర్య సమరమునకై మేల్కొలిపినవి. దీనితో జనులయందు చి వేయబడిన యుత్సాహ ముప్పొంగి ప్రభుత్వమును తలక్రిందు జేసినది. క్రీ. శ. ౧౯౧౭ వ సంవత్సరమున రష్యా యందు జారు ప్రభుత్వము రక్త పాతముతో యంత మొంది సోవియేటు ప్రజా ప్రభుత్వము నెల కొల్ప బడినది, అప్పటి నుండి విద్యా విషయమై యింతవరకు లోనుండిన యాటంకములు పూర్తిగా నిర్మూలింపబడి విద్యాభ్యాసము ప్రజల జన్మ హక్కని ప్రకటింప బడినది. వెంటనే ప్రాథమిక విద్య నిర్బంధించ బడినది.

ప్రభుత్వము వారిచే దేశమునందు స్థల స్థలములలో పాఠశాలలు స్థాపింప బడినవి. వాని యందు వేల కొలది విద్యార్థులు జేరి విద్య నభ్యసింప మొదలిడిరి. ప్రతి పల్లెలలో విద్య నభ్యసించ వలె ననెడి యుత్సాహము ప్రభుత్వము వారి కృషివలన కార్యరూపము దాల్చ లిడినది.

సోవియేటు ప్రజా ప్రభుత్వమునందు విద్యా

...స్యాసము ప్రజల దాస్య విమోచనోపాయముగా
...ెంచ బడుటచే దీని విషయమై నెక్కువ ప్రయత్నములు
...జరుప బడు చున్నవి. ఎచ్. ఎన్. బ్రేల్స్ ఫోర్డు గారు
...సోవియేటు విద్యా పద్ధతి బాగుగా నభ్యసించి ౧౯౨౦
వ సంవత్సరమున తన యభిప్రాయ మిటుల వెలి
బుచ్చెను:—

"సోవియేటు ప్రభుత్వము నందు విద్యా
ప్రచారము విరివిగా జరుగు చున్నది. ప్రపం
చపు ప్రథమ సాంఘిక ప్రభుత్వపు నుత్కృష్ట
త శాలురపై నాధారపడి యున్నది. ఆ సంత
తికి నేటి స్త్రీ పురుషులలో మానసికము నందు
శారీరకము నందు ఆధిక్యత కలిగించుటయే
అచ్చటి విద్యాధికుల ముఖ్యోద్దేశము".

## విద్యాభివృద్ధి

సోవియేటు రష్యాకు యితర పాశ్చాత్య జాతుల
తో ప్రభుత్వ రీత్యా గాని, వ్యావహారిక రీత్యా గాని
నెట్టి సంబంధము లేక యేకాకిగా నున్నను "గృఢ
చిత్తము గల నొక జాతి యేకాకిగా నొనరింప బడినను,
అత్యద్భుత, చిత్రములు సలుప గలుగు" నని సోవియేటు
రష్యా, నాగరకులమని విఱ్ఱవీగు పాశ్చాత్య జాతులకు
ముఖ్యముగను, మానవులకు సామాన్యముగను, నొక
యమూల్య పాఠము గరప గలిగినది. క్రీ.శ. ౧౯౨౪-౨౫
వ సంవత్సరపు ఆధునిక సోవియేటు రష్యావిద్యా
స్థితి యిటు లుండెను:—

| | స్థాపనములు | విద్యార్థులు. |
|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | ౭౬౮౦౧ | ౮౦౮౮౪౧౦. |
| ౭ సంవత్సరముల విధానపు పాఠశాలలు | ౮౭౧ | ౪౫౦౫౪౧. |
| ౮ ,, ,, | ౩౭౨౧ | ౧౩౧౩౩౭౨. |
| మాధ్యమిక పాఠశాలలు | ౧౦౪౮ | ౨౮౬౮౨౦. |
| వస్తు బోధనా పాఠశాలలు | ౩౩౭౩ | ౨౫౮౮౧౫. |
| ,, *క్రిచస్ పాఠశాలలు (పసి బాలురు) | ౧౧౬౪ | ౬౧౪౫౦. |
| న్యూన బాలుర విద్యాలయములు | ౫౪౦ | ౩౭౭౨౬. |
| వృత్తి సంబంధ పాఠశాలలు | ౩౦౩౦ | ౨౭౩౫౦౬. |
| కార్మిక కళాశాలలు | ౧౧౪ | ౪౯౧౦౯. |
| సాంకేతిక విద్యాలయములు | ౯౦౩ | ౧౬౨౧౯౮. |
| ఉన్నత విద్య గరపు కళాశాలలు | ౧౮౦ | ౧౮౦౭౧౧. |

(సోవియేటు రష్యాలోని విద్య పుట ౨౧)

రష్యాలో విద్యయందు వస్తుసాధన మత్యల్పముగా
నున్నను అధికారవర్గము వారు తమ శక్తికొలది ఆధునిక
పద్ధతులపై విద్య గరపుటకు ప్రయత్నించు చున్నారు.
ప్రజా ప్రభుత్వము నందు ఎ. వి. లునాట్స్కీగారు
విద్యాంగ మంత్రి పదవిపై గలరు. వీరు గొప్ప వక్తలు.
పేరు వడసిన కవీశ్వరులు. ఉత్కృష్ట నాటక కర్తలు.
వీరి, వీరి సహోద్యోగీయుల నిరంతర కృషివలన
నేడు రష్యా కిట్టి ప్రాముఖ్యత కలుగు చున్నది.

## రష్యాలోని పాఠశాలలు

ప్రజల సౌకర్యార్థమై రష్యా యందు పాఠశాలలు
విద్యాలయములు, కర్మాగారములలో నెలకొల్ప బడినవి.
కార్మికులు తమ పసి పిల్లల నుపాధ్యాయుల యధీనము
నందు విడచి తమ పనులపై వెళ్లెదరు. ఈ ఉపాధ్యా
యులు బాలుర మనం శాకర్షించు నటుల ఆధునిక పద్ధతుల
పై వీరికి విద్య గరపుదురు. ఇచ్చటి విద్యాలయములు
చూచుట కింపుగా నుండును. పిల్ల లందరికి పాఠశాలల

* కర్మాగారములలో నియోజితు లగువారి పసి పిల్లల పోషణ గృహములు. వీని యందు ప్రత్యేక మైన సదు
పాయములు గలవు.

నుండి కొన్ని చేతి రుమాళ్లు, తువాళ్లు యివ్వబడును. వీనిపై వాని నామములుగాని లేక సాంకేతిక చిహ్నములు గాని యుండును. పిల్లల పక్కనే యీతువాళ్లు చీలల పై వేలాడబడి యుండును. ప్రతి పాఠశాల యందుపిల్లల సంఖ్య ౨౫ నుండి ౩౦ వర కుండును. పాఠశాల నుండి పిల్లలకు దినమునకు మూడు మారులుచితముగా మంచి భోజనము పెట్టబడుటయే గాక ప్రతి సాయంకాలము ౪గంటలకు పిల్లలకు తేనీరు, రొట్టె, వెన్న యివ్వబడును. పిల్లలకు పరిశుభ్రమైన పరుపులు, మంచములు ప్రత్యేకముగా గలవు. వారమున కారు రోజులు మాత్రి మీ పిల్లలకు విద్య గరప బడును.

తలి దండ్రుల పనులకు పిల్లల వలన ఆటంకములు సంభవించ కుండుటకై, పిల్లల యభి రుచిని బట్టి తగినపద్ధతులపై వారిని నుశిక్షితులుగా నొనర్చుటకు, ఆధునిక పద్ధతులపై వీరి పోషణ జరుగుటకు యిట్టి పాఠశాలలు సోవియేటు రష్యాలో ప్రభుత్వము వారిచే నడుపబడుచున్నవి. ఇచ్చట పిల్లలకు సాంఘిక విద్య నిర్బంధింప బడి యున్నది. ప్రపంచము నందు జరుగు విషయములన్నియు పిల్లల శక్తిసామర్థ్యముల బట్టి వారికి బోధింప బడు చుండును. దీని వలన ౧౪ లేక ౧౫వత్సరముల బాలుడు రాజకీయ విషయముల గురించి గాని లేక మరే సాంఘింక విషయముపై గాని ధారాళముగా నితర దేశ మందలి నుశిక్షిత వక్తవలె ప్రసంగించ గలడు.

## విద్యార్థి సంఘములు

పాఠశాల లన్నియు విద్యార్థిసంఘముల స్వాధీనములలో గలవు. విద్యార్థులకు సంబంధించిన విషయములన్నియు వీని వలననే పరిష్కరింప బడుచుండును. ఈ విషయములలో వీనికి సంపూర్ణాధికారము గలదు. విద్యార్థుల శిక్షణమునకు, ఖేలనా సంస్థలకు, మరితర యవసర విషయముల కంతటికి వీరి జవాబ్దారి గలదు. ఈ సంఘపు తీర్పుల యపీలు పాఠశాల లందలి పిత్రో పాధ్యాయుల విచారణ సంఘము నందుజరుప బడును. కళాశాలలందు విశ్వ విద్యాలయములం దిటులనే గలదు. విద్యార్థి సంఘపు శాల యధ్యక్షునికి విచారణ సంఘము నందు స్థానము గలదు. వీని యందు తన సంఘ సభ్యుల విషయముల ప్రవేశ పెట్టుటకు, వానిని గురించి తీవ్రముగా చర్చించుట కీయబడె స్వాతంత్ర్యము గలదు. పాఠశాలలందలి Culture and General Management సంఘపు యాధీనమునందు పాఠశాల ఖేలనములు, వాచనాలయములు, గ్రంథాలయములు నడుప బడు చుండును.

## సాంకేతిక విద్య

ఉన్నత విద్యాలయములందు వృత్తి విద్యలు గరప బడుచుండును. యివి సహజముగా నితర దేశములందలి వ్యవసాయ, వస్తు, సాంకేతిక విద్యా భ్యాస కళాశాలలవలె నున్నను, వీనియందు విద్యార్థులకు పెక్కు యవ కాశములు, నులువులు గలవు. పాఠశాలయభ్యాసము పూర్తిజేసిన విద్యార్థి తన యభిరుచి ప్రకార మేసాంకేతిక విద్య నైనను నభ్యసించుటకు వీలు కలదు. ౩లేక ౪ వత్సరములలో వ్యవహారావ్యవహార విద్యా విధాన మా విద్యయందు పూర్తియగును. ఇతర దేశములందు వలెగాక సోవియేటు రష్యాలో విద్యార్థి తన యభిమాన కళాయభ్యాస పద్ధతి యందు పూర్తిగా ప్రావీణ్యతను సంపాదించి తీర వలయును. మనభారతీయ విద్యార్థులు ఉత్తీర్ణులు, కళాశాల విద్య ముగించిన కొలది వత్సరములలో నే తా మభ్యసించిన విషయము లన్నియు మరచి పోవుట నా నాటికి సహజమై పరిణమించు చున్నది.

## ఉచిత విద్య

సోవియేటు రష్యాలో యున్నత విద్య గరపు సంస్థ లెన్నియో గలవు. సాంకేతిక విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట విద్యార్థి తన యిష్టాను సారము వివిధ విషయమును గురించిన విద్య నభ్యసించ దమ్మను.విద్యార్థుల కిట్టి సదవకాశము లొసగు ౯౧ విద్యాలయ

లలో ౧౫౫౧౦ విద్యార్థులు గలరు. వీనియందు విద్యా గ్రంథమగు శిక్షణయే గాక పరిశోధన కార్యములు చేయుటకు నవకాశములు గలవు. దేశ మందలి కార్మికులకు, వారి పిల్లలకు విద్య నుచితముగా గరుప బడుచున్నది. విద్యయే గాక, భోజనము, వస్త్రములు, మరి తో యవసర సహాయములు నుచితముగా నొసగ బడుచున్నవి. వ్యాపార విద్యార్థులు మాత్రము పాఠశాలలలో, కళా శాలలలో ఫీను చెల్లించెదరు. వీరి సంఖ్య బహు తక్కువగా గలదు. రష్యాలో మాత్రమే ప్రజ లందరికి విద్య యుచితముగా గరుప బడుచున్నది. ఇతర పాశ్చాత్య దేశములం దున్నత విద్య నభ్యసించుటకు ధనికులు మాత్రమే యర్హులు గాగలరు. విద్యార్థులకు విద్యయే గాక కాగిదములు కలములు, గ్రంథములు మరితర పరికరము లన్నియు ప్రభుత్వము వారిచే నుచితముగా నొసగబడు చున్నవి. వీని విషయమై విద్యార్థులు లేనిపోని చిక్కుల పాలు గాక విద్య నభ్యసించుటయే వారి పరమావధి యని నేడు విద్యార్థులు గమనించ గలిగిరి.

ఈవిద్యా సంస్థలు, ప్రభుత్వము, ప్రజా సంస్థల కర్మాగార సంఘములు, కార్మిక సమాజములు, రైతు నిలయములు మొదలగునవి ఆర్థిక సహాయములతో నడచు చున్నవి.

సోవియేటు రష్యాయందు దీనూతన పద్ధతులు కల్పించినందున ప్రపంచపు విద్యా చరిత్ర యందొక నూతన యుగము ప్రారంభ మైనది. పాశ్చాత్య ప్రపంచ మునందు ముఖ్యముగా అమెరికాలో విద్యా భ్యాస నావకాశములు ధనికులకు మాత్రము గలవు. కాని సోవియేటు రష్యా ప్రభుత్వము వారు, ప్రజ లందరికి సమానముగా నుచిత విద్య నిర్బంధించి స్వదేశ దారిద్ర్యము తొలగించు కొనుటయే గాక, ప్రపంచము నందు పీడింప బడుచున్న యమాయక రైతు సంఘము నుద్ధరించు ఉన్నత విద్యా సంస్కారము పొందిన సైన్య బృంద మొకటి సిద్ధపరచు చున్నందుల కెంతయో వందనీయులు.

# వినతి

## ఇంద్రగంటి నాగేశ్వర శర్మ

నిర్మలానంద స్వరూపా!
నిగమ వేద్యా! నిశ్చలాత్మా!
ప్రణతులను గైకొమ్ము రాధా
వల్లభా! దీనుఁడ.

నడచితిని దుర్మార్గ పథముల
గడపితిని వ్యర్థముఁగ కాలము
పాపినని చింతిలుదు రాధా
వల్లభా! నేను.

భావ గాన విలోల, నాథా!
పావనాత్మా! ధర్మ మూర్తీ!
భవ బంధములఁ బాపెదవు కృష్ణా!
ప్రణతులను గొమ్మా.

అంధకార సమాధి మునిగితి
అధముఁడను, తమసంబు వాయగ
నీ కృపా కిరణ ప్రసారము
నిలువ వాంఛింతుఁ.



* ఎచ్. ఏ. నాజిం గారి ఆంగ్ల వ్యాసమున కనువాదము.

# పాలకురికి సోమనాథ కవి

శ్రీ శేషాద్రి రమణ కవులు

ఆంధ్ర కవులలో పాలకురికి సోమనాథ మహాకవి సుప్రసిద్ధుఁడు. ఈతఁడు సంస్కృతము నందును, ఆంధ్రము నందును, కన్నడము నందును, ద్రావిడము నందును, మహారాష్ట్రము నందును, స్వతంత్రముగాఁ గవిత జెప్ప గలవాఁడు. కవి నివాస స్థలము ఒరంగల్లునకు మూఁడామడల దూరము నందున్న పాలకురికి. ఈ గ్రామము వేల్పు కొండ ( జఫర్ గడ్ ) కు సమీపముగా నున్నది. సోమనాథ కవి నివాసము పాలకురికి యని అన్య వాద కోలాహలము నందును, బసవ పురాణము నందును, పాలకురికి సోమనాథ పురాణము నందును, ఇంకఁ గొన్ని గ్రంథము లందును, స్పష్టముగాఁ జెప్పఁ బడి యున్నది. ఈ పాలకురికి నిజాము రాష్ట్రము లోనిది గావునను, ఈ కవిచే నభివర్ణితులగు బసవేశ్వరుఁడు, మల్లికార్జున పండితారాధ్యులు, నిజాము రాష్ట్రము నందలి ఆంధ్ర కర్ణాటక దేశములలో మత వ్యాప్తి నొనరించిన వారు గావునను, నీ కవి జీవితము నిజాము రాష్ట్రాంధ్ర వాఙ్మయ చరిత్రము నందు ప్రధాన స్థలము నాక్రమింపఁ గలదు; ముఖ్యముగాఁ బండ్రెండవ శతాబ్దము నాఁటి సాంఘిక చరిత్రమునకు సోమనాథుని జీవితమునకు నెంతేని సంబంధము గలదు. సూత్రప్రాయముగా నాయా విషయములు దెలుపుచుఁ బ్రధాన విషయ మగు కవి జీవితము విరచింతుము. సోమనాథుని నివాసము పాలకురికి యనుటకు ఆధారము,

సీ. భవదీయ సంబంధ బంధురం బయ్యె నే
　　భాగ్యంబు చేసెనో పాలకురికి!
భవ దంఘ్రి పూజనా పరుల కిమ్మయ్యె నే
　　భాగ్యంబు జేసెనో పాలకురికి!
యుష్మ ద్విహార సంయుక్తమై మించె నే
　　భాగ్యంబు జేసెనో పాలకురికి!
యుష్మదీ యాశ్రి మాభ్యున్నతి గాంచె నే
　　భాగ్యంబు జేసెనో పాలకురికి!

తే. గీ. పాలకురికి యేమి భాగ్యంబు జేసెనో!
　　నీ స్వనామ పూర్వ నిహిత యయ్యె
　　ఈహితాను షంగ యేకామ్ర గురుచిత్త
　　నలిన భృంగ సోమ నాథ లింగ.

(అన్య వాద కోలాహలము)

సోమనాథుని నివాస మనఁ బడు పాలకురికిలో నొక దేవాలయము గలదు. దానిని సోమ నాథాలయ మందురు. ఇది పాలకురికి సోమనాథ కవి కట్టించిన దనియు నిందె పూర్వము సోమనాథుని మఠ ముండె ననియు, నిందె, సోమనాథుఁడు చెన్నమల్లు సీసములు పఠించుచు సమాధి గతుఁ డయ్యె ననియుఁ దత్రత్యులు చెప్పుచున్నారు. ఈ యాలయమున కర్చకులు జంగము వారు. సోమ నాథుని గ్రంథములు కొన్ని యిట నిత్య విధిగాఁ బూజారులు పారాయణము చేయు చుండుట ముఖ్యమగు విశేషము.

బసవేశ్వరుని మహిమాదికములు వివరించి లోక మున వెలయించుటకు భృంగీశ్వరుఁడు, సోమనాథుఁడై యిల జనించెనని వీరశైవ గ్రంథములలోఁ జెప్పబడినది. ముఖ్యముగా వీరశైవ కవులలో సోమనాథుని ప్రశంసింపని వా

శెను. పిడుపర్తి బసవకవి సోమనాథుని మాటల మార్పక బసవ పురాణము పద్య కావ్యముగఁ జేసి యాతనికే యంకితముగ నొసంగెను. భీమ కవి, సోమనాథుని బసవ పురాణము కన్నడించెను. విరక్త తోంటద దార్యుఁడు ౧౫౬౦ లో కన్నడమున పాల్కురికి సోమనాథ పురాణమును వ్రాసెను. చక్రపాణి రంగనాథ కవి సోమనాథుని దేవునిగా భావించి నయన రగడలోఁ గొనియాడినాఁడు. కవులలో నింత గౌరవ ప్రపత్తుల నొంది నాఁటి నుండి నేఁటి వఱకు ఏక హేలగా స్తుతి పరంపరల నొందిన వాఁడింకొకఁడు లేఁడనుట యతిశయోక్తి గాదు. ఈ మహా కవి ప్రతిభా విశేషములను కర్ణాటక కవి చరిత్రములు విశేషించి కొనియాడి యున్నవి. ఆంధ్రుఁడును ఆంధ్ర గ్రంథ కర్తయు, ఆంధ్ర చరిత్ర కారుఁడు నగు నీ మహా కవి జీవిత విశేషములు మనము సమగ్రముగా నెఱుంగ వలయునన్న ఆంధ్ర కర్ణాటక భాషల లోని వీర శైవ వాఙ్మయము కొంత వఱకేని తఱచి చూడ కున్నచోఁ దత్త్వము బయలు పడ నేరదు. ఉపలభ్యములగు నాధారములను సమన్వయించి కవి జీవిత చరిత్రమును గొంత వఱకేని తెలిసి కొనఁ బ్రయత్నింతము.

సోమ నాథుఁడు వేమ నారాధ్యుని వంశములోని వాఁడని కన్నడ సోమనాథ పురాణము చెప్పు చున్నది. తండ్రి పేరు విష్ణు రామ దేవుఁడు. తల్లి శ్రియా దేవి యని బసవ పురాణము వలనఁ దెలియును. తరువాతి గ్రంథములలోఁ దాను తల్లి దండ్రులను బ్రశంసింపక "బసవ పురాణమున నెన్నఁ బడిన జనులకుఁ బెంపుడు కొడుక, బసవని పుత్త్రుండ బసవ గోత్రుండ" అనియు "ఉమా మాతా పితా రుద్రః ఈశ్వరః కుల మేవచ" అనియు గ్రంథాంతరములలో నుదాహరించి కుల గోత్రములను జెప్పుకొన మానెను. దీక్ష నొందిన వారు గురుని హస్తమునందు జనించితి మని చెప్పు కొనుట గలదు. అటులె సోమ నాథుఁడును "మద్దురు లింగ ఘన కరుణా హస్త గర్భ సంభవుఁడ" అని కుల గోత్రాదులు గ్రంథములందుఁ జెప్పుకొన మానెను. కొందఱీ కవిని జంగము కులమునకుఁ జెందిన వాడని వ్రాసిరి. అది ప్రమాదము. "నలి పాల్కురికి సోమ నాథుఁ డవంగ, వెలయు వాడను చతుర్వేద పారగుఁడ" నని సోమ నాథుఁడు తాను చతుర్వేద విదుఁడ నని చెప్పుకొన్నాఁడు. సోమనాథ భాష్యమునందు శ్రుత్యర్థములు చర్చించెను. రుద్ర భాష్యమున గాయత్రీ మంత్రము నీ కవి శైవ పరముగా నన్వయించెను. బసవ పురాణము నందును పండితారాధ్య చరిత్రము నందును సోమ నాథుఁడు వేదముల నుండి వేద భాష్యముల నుండియు నుదాహరణము లొసంగెను. శ్రుతి రహస్యములు బ్రాహ్మణేతరు లెఱుంగ రాదను ధర్మము సంపూర్ణముగా నాచరణము లోనున్న యా కాలమున సోమ నాథుఁడు బ్రాహ్మణేతరుఁడే యైన నెట్లు శ్రుత్యర్థముల నను వదింపఁ గల్గును? ఇంతియ గాక పండితా రాధ్య చరిత్రము పాల్కురికి సూరనామాత్యున కంకితము చేయఁ బడినది. తనకు సూరనామాత్యుఁడు ముద్దు మఱంది యని సోమ నాథుడు చెప్పి కొన్నాఁడు. ఇందుచే సోమనాథుడు నియోగి బ్రాహ్మణుఁడని స్పష్టముగా గ్రహింప వచ్చును. బసవేశ్వరుని బోధల ననుసరించి సోమనాథుఁడు వీర శైవ దీక్ష నొంది శైవేతరుల మొగము జూడ నని పట్టుదల గొని జీవితకాల మంతయు పాలకురికిలో గడపెను.

బసవేశ్వరుడు కల్యాణ పుర ప్రాంతములలో వీరశైవ వ్యాప్తి నొనరించుటలో నశేఁ డనన్య సామాన్య మహిమలు జూపుటయు విని మల్లికార్జున పండితారాధ్యుఁడు ఆతని దర్శింప బయలు దేరి పోవుచుండ మార్గ మధ్యమున బసవేశ్వరుని మరణ వార్త తెలియ వచ్చెను. అంత మల్లికార్జున పండితులు విచారపడి శ్రీ శైలమున కేగి యట మరణించిరి. పండితుని శిష్యుల వలన విన్న కథాంశములు జేర్చి సోమనాథుఁడు పండితా రాధ్య చరిత్రమును, బసవేశ్వరుని శిష్యుని వలన విన్న కథలతో బసవ పురాణమును, ద్విపద రూపముగ రచించెను. ఇంచు మించుగ కథాంశమునకు ముప్పది ముప్పది యైదు సంవత్సరములలో రచింపఁ బడిన వగుటచేఁ జారిత్రిక

దృష్టితో నారయు వారికి బసవ పురాణము పండితా రాధ్య చరిత్రము ఎంత యేని యుపకరింపఁ గలవు.

సోమనాథునకు కవితా గురువు, కరస్థలి విశ్వ నాథుఁడు. శివ దీక్ష గురువు, గురులింగారాధ్యుఁడు మఱియొక గురువు, కట్టకూరి పోతి దేవర. సోమనాథుని శిష్యుఁడు శివరాత్రి కొప్పయ్య. సోమ నాథునితో మత విషయమున వివదించి యోడి పోయిన వైష్ణవుఁడు చక్రిపాణి రంగ నాథుఁడు. శివ దూషణచే నితని కన్నులు బోఁగా, శివస్తుతి జేసి కనుల బడసి శైవదీక్ష నొందినాఁడు. ఈతని జీవితము ప్రత్యేకించి వ్రాయ దగియున్నది. ఈ రంగ నాథుఁడు వీరభద్ర విజయము శరభలీల, శ్రీగిరినాథ విక్రియము, నయన రగడ లోనగు గ్రంథములు రచించి నాఁడు. సోమనాథుని పుత్రుడగు చతుర్ముఖ బసవేశ్వరుడు రంగనాథునకు శైవ దీక్ష యిచ్చినాఁడు. సోమనాథునిచే దీక్ష నొందిన పిదపఁ జతుర్ముఖ బసవేశ్వరుఁడు సోమనాథునికుమా రుడనని చెప్పకొని యుండును. లేకున్న ఆజన్మబ్రహ్మ చారి యగు సోమనాథునకు సంతాన మెక్కడిది? రంగ నాథ కవి సోమనాథుల విషయము శివ యోగసారము లో నీ క్రింది విధముగాఁ జెప్పబడి యున్నది:

కం. అసమ శివ భక్తి రస మా
నసునిఁ బాల్కురికి సోమ నాథుని గవి రా
జ సమున్నత యశు, సద్యః
ప్రసాది యగు చక్రపాణి రంగనిఁ దలఁతున్.

కం. శ్రీ పార్వతీశు జూడక
పాపాత్ముఁడ నగుచు బోవఁ బథమునఁ
దీపించు దృష్టి తొలగిన [జక్షుల్
శ్రీపతి నమగంగఁ జెప్ప శివు గర్తనుగాన్.
(నయన రగడ)

చక్రపాణి రంగనాథుఁడు పాల్కురికి సోమ నాథుని యనుగ్రహమున శివ భక్తుఁడై, పోయిన కన్ను లు తిరుగఁ బడసె. గాన సోమనాథుని మహిమ బ హ్వ్యాప్తమై గ్రంథములలోనికిఁ గూడ నెక్కెను. శైవ కవులు సోమనాథుని యెడ భక్తి ప్రపత్తులు గలవారై యాతని నెలవగు పాలకురికిని ఆతడు నెలకొల్పిన సోమ నాథాలయమును దీర్ఘ రాజములుగా భావించి సోమనాథుని భగవదవతారముగా భావించి యెంతో స్తుతించి తన బసవపురాణ మంకితము గావించు పిడుపర్తి బసవన (బసవ పురాణములో) ఇట్లు వాకొని యున్నాడు.

సీ. లిపి లిఖింపక మున్న యపరిమితార్థోక్తి
శక్తి యాతని జిహ్వ జరుగు చుండు;
ఛందోధికరణాది సరణి జూడక మున్న
మది నుండుఁ గావ్య నిర్మాణ శక్తి;
భాష్య సంగతులు చెప్పక చూడకయ మున్న
రుద్ర భాష్య క్రియారూఢి వెలయు;
తర్క శాస్త్రాది విద్యలు పఠింపక మున్న
పర పక్ష నిగ్రహ ప్రౌఢి వెలయు;

గీ. అతని నుతియింప నాబోటి కలవి యగునె
జైన మస్తక విన్యస్త శాత శూల
కలిత బిజ్జల తల గుండు గండ బిరుద
శోభితుఁడు పాల్కురికి సోమ నాథుడుర్వి.

ఈ పద్యమువలన సోమనాథుఁడు శైవ ప్రసాద మున సమస్త విద్యలు తనంత నార్జించె ననియు, ప ప్రసాదుఁ డనియు దెలియును. బహుళః సీస గీతము లోని జైనమస్తక శాతశూలుఁడు బిజ్జల తల గుండు గండడు అనునవి యాకవికి బిరుదనామము లేమోయని తోఁచును. బిజ్జలుఁడు బసవేశ్వరుని కాలమునందున్న వాఁడు గాక వేఱొకడు సోమనాథుని కాలమునను గూడ నుండి యుండెను. కాకతీయుల యవరకాల

ము నూతగాఁ గాని సోమనాథుఁడు అద్వైతులను శైవవైష్ణవులను దన మతములో నిగ్రంధ రూపముగా జేర్చుకొనెను. అంతియగాక మత సంగరములలో జైను ల విశేషించి చంపించి నటులఁ గొన్ని ఐతిహ్యాఁ ములు గలవు. వీని నన్నిటిని సమన్వయించి నిజాము రాష్ట్ర ప్రశంసలో సోమనాథ కవిని గూర్చి యీమిటుల వ్రాసి యున్నాము:—

సీ. ఆంధ్ర గీర్వాణ కర్ణాట భాషల లోనఁ
    గల్పించి నాఁడు సత్కావ్య ములను;
మత సంగరముల సామ్రాజ్య రంగస్థలి
    నలరించి నాఁడు నిరంకుశముగ;
జైన సారస్వత సంప్రదాయంబులఁ
    జేయించినాఁడు నిర్జీవకముగ;
వీర శైవంబును విశ్వ వృత మొఁనర్ప
    విడచినాఁడు సమస్త విభవములను;
తే. గీ. పాలకురికి మహీధర ప్రాంత భూమి
    మరణ మొందిన శ్రీ పాలకుర్కి సోమ
    నాథ విద్వత్కవీంద్రు సమాధి గాంచ
    వత్తురే మీరు నైజాము వాసులార!"

సోమనాథుఁడు బసవేశ్వరుని మహిమ లభివర్ణిం చినప్పటనే ఆంధ్ర దేశమునందు వీరశైవ మతమభి వృద్ధిలోనికి వచ్చినది. బస వేశ్వరుఁడు కన్నడ భాషలో ప్రసిద్ధ కవి. మంచి గాయకుఁడు. ఈతఁడు వ్రాసిన గీత ములు నాలుగు లక్షల నాలుగువేల చరణములు గలవి. షట్ స్థల వచనము. కాలజ్ఞాన వచనము. మంత్రగో ప్యము. శిఖా రత్న వచనములోనగు కన్నడ గ్రంథము లితఁడు రచించినవి, ప్రాచ్య లిఖిత గ్రంథాలయములో గలవు. ఇవన్నియు సంగ మేశ్వ రాంకితములు. బసవేశ్వ రుఁడు సంగ మేశ్వని భక్తుఁడు, గావున నాతనిగేయము లన్నియు సంగ మేశ్వ రాంకితముగ నున్నవి. బసవేశ్వ రుని యాదేశములు, మత ధర్మములు, భావములు,జీవితము తొలుదొలుత గ్రంథస్థము గావించిన ప్రథమకవి పాల కురికి సోమ నాథుఁడే! అందుల కనియే శివ భక్తులు సోమ నాథుని భృంగిరిటి యవతార మనియు, బసవేశ్వ రలీలలు గ్రంథస్థము గావించుటకే జనించె ననియు జెప్పుట తటస్థించి యుండును.

సోమ నాథకవి వ్రాసిన గ్రంథములు ఇంకను ఎన్నియో లభింప వలసియున్నవి. ఇన్ని గ్రంథములు రచించిన కవు లాయుగము నందు లేరని స్పష్టముగాఁ జెప్ప వచ్చును. ఇతఁడు సంస్కృతము నందును దెనుఁగు నందును కన్నడమునందును ద్రవిడమునందును .మహారాష్ట్ర మునను గవితఁ జెప్పఁగల వాఁడు గావున నితని గ్రంథ ములకై యా భాషలలో నభి నివేశము గలవారు విశే షించి పరిశోధింప వలసి యున్నది. పాలకురికి లోని జంగ ముల వద్ద కొన్ని వందల తాళ పత్ర గ్రంథములు గలవని యు, నందు సోమనాథుని గ్రంథములు కొన్ని యుండ వచ్చు ననియుఁ పాల కురికిఁ బోయి కొన్ని దినములుండి ప్రయత్నించినను స్థానికులు తమ వద్దగల గ్రంథములను జూపక పోవుటచే విశేషాంశములు గ్రహింప వీలు పడక పోయెను. ఇంతవఱకు సోమనాథుని మహారాష్ట్ర గ్రంథములు లభింపలేదు. లభించిన గ్రంథములు ౧ బసవ పురాణము ౨ చతుర్వేద సారము ౩ అనుభవ సారము ౪. చెన్న మల్లుసీసములు ౫ వృషాధిపశతకము ౬ బసవోదాహరణము. ౭ సోమనాథ భాష్యము రుద్ర భాష్యము ౯ బసవో దాహరణము ( సంస్కృ తము ) ౧౦ నమస్కార గద్యము ౧౧ పంచ ప్రకార గద్యము ౧౨ అక్షరాంక గద్యము ౧౩ పండితా రాధ్య చరిత్రము ౧౪ అష్టాక్షర శతనామ గద్యము. ౧౫ వృష భాష్ట కము ౧౬ పంచ రత్నములు ౧౭ బస వాష్టకము మొదలగు నవి. అన్య వాద కోలా హలము ఈతఁడు రచించె నని [illegible] చెప్పిరి గాని యది ప్రమా దము. ఇతని కా గ్రంథ మంకితము గావింపఁ బడినది.

బసవ రగడ, గంగోత్పత్తి రగడ, శ్రీ బసవాఢ్య రగడ, సోమేశ్వర శతకము, సద్గురు రగడ, యను కన్నడ గ్రంథములు గూడ నీతఁడు రచించెను. ఇంక నెన్ని గ్రంథము లున్నవో తెలియదు. బసవేశ్వర శతకమున నీ కవి తన ప్రగల్భము నంతయుఁ జూపి బహు విధములగు చిత్ర రచనలు ఇతర భాషా పద్యములు కూర్చి యున్నాఁడు. ఈ కవికిఁ గల బహు భాషా పరిచయమునకుఁ బ్రతి భాతిశయములకుఁ గవితా నైపుణ్యములకు వృషాధిప శతకము తార్కాణము కాఁగలదు. ఇందుఁ జెర్కొనఁ బడిన వృషాధిపుఁడు వీర శైవ మత స్థాపకుఁడగు బస వేశ్వరుఁడే, గాన చారిత్రి కాంశములు గూడ నీ శతకమునఁ గొలఁదిగా లేక పోలేదు. సోమనాథుఁడు సంగీత శాస్త్ర విశారదుఁ డనియుఁ దన గ్రంథముల లోని ద్విపద కావ్యముల మనోహరముగా గానము జేసి సమ కాలికుల హృదయముల నాకర్షింపఁ గల వాఁ డనియుఁ దెలుపఁ గల యాధారములు గలవు. సోమనాథుని, యా కృతి విశేషమును, పిడుపర్తి బసవ కవి బసవ పురాణములో నీ విధముగ వర్ణించెను,

"ఉ. శ్రీ భసిత త్రిపుండ్ర కప
రీత విశంకట ఫాలు, జాట జూ
టీ భర దారు, నిర్మల ప
టీ పట లావృత దేహు, నక్ష మా
లాభరణా ఖిలాంగు, బస
వాక్షర పాద పవిత్ర వక్త్రుఁ, జి
చ్ఛోభిత చిత్తుఁ బాల్కురికి
సోమయ దేశికుఁ బ్రస్తుతించెదన్."

సోమనాథుని జీవిత కాలమును గూర్చి రెండు మతము లున్నవి. ఈతఁడు కాకతీయ రుద్ర దేవుని కాలము వాఁడనియుఁ బ్రతాప రుద్రుని కాలము వాఁడనియు రెండు తెఱంగులఁ జెప్పఁ దగిన గ్రంథాధారములు గలవు. చరిత్ర కారులందఱు రుద్ర దేవుని కాల వాఁడనియే నిరూపించిరి. క్రీ. శ. ౧౨౨౦ లో నున్న కన్నడ కవి సోమనాథుని బ్రశంసించుటయు, రాధారములచే బసవేశ్వరుని యొక్కయుఁ బండితా రాధ్యుల యొక్కయు శిష్యుల కాలమున సోమ నాథుఁడు న్నటులఁ దెలియ వచ్చుటయుఁ జూడ సోమనాథుఁడు కాక తీయ రుద్ర దేవుని కాలము నందు అనఁగా క్రీ. శ. ౧౧౪౦ మొదలు ౧౧౯౦ వఱకు నుండి యుండుట సత్యము.

సోమనాథుని మహిమలఁ దెలుపు చిత్ర కథలు కములు గ్రంథస్థములై యున్నవి. ఇంచు మించుగా రెండు మూడుఁ శతాబ్దముల క్రావలి వారు వ్రాసి గావున నందుఁ గొంచెమేని విశ్వాస పాత్రమగు ముండక పోదని తలంచెదము. అందుఁ జరిత్రమున కరించు కొన్ని కథల సారాంశము నుదాహరించెదము.

౧. పాలకురికి సోమనాథునితో మత వాదము సాగింప చక్రపాణి రంగ నాథుఁడను వైష్ణవ కవి వచ్చి తగవు నకుఁ బిలిచెను. సోమ నాథుఁడు వీర శైవేతరుల మొగము జూడనివాఁడు గాన చాటున నుండి వాదించి రంగనాథు నోడించెను. భవ దుఃఖముతో రంగనాథుఁ డెటకో పోవుచు మధ్యమున నున్న శ్రీశైల విశ్వేశ్వరుని జూడక పోవుట నాతని కన్నులు పోయెను. అహోబల నృసింహ నేవింప నాతఁడు కలలోఁ గనిపించి శివుని మహత్త్వ బోధించెను. అనంతరము శివుని బ్రార్థింప నొక కన్ను, సోమనాథుని యనుగ్రహమున నొక కన్ను, రంగ నాథుఁడు సోమ నాథుని యనుజ్ఞ గొని పుత్త్రుఁడగు చతుర్ముఖ బసవేశ్వరునిచే, శైవ తాను రచించిన గ్రంథములు సోమనాథున మొనర్చెను. ఈ కథకు సంబంధించిన పద్యము రించి యున్నాము.

౨. కొందఱు వీరశైవులు ఓరుగంటిలో

ధూ దేవాలయము నందు బసవ పురాణము గానము చేసి భక్తులకుఁ దెలుపుచుండఁ గొందఱు ధూర్త బ్రాహ్మణు లాగ్రంథమును గ్రంథస్థాంశమును ఆక్షేపించిరి. ఇది సోమనాథుఁడు విని లింగ ముద్రలు గల యెద్దులతో బండి కట్టుకొని ఓరుగంటికి వచ్చుచుండఁ దుంటరులగు కొందఱు బ్రాహ్మణులు పరిహాసమునకు శైవముద్రలు, రుద్రాక్షలు, విభూతి రేఖలు, దాల్చి సోమనాథున కెదురేఁగ నాచిహ్నము లన్నియు వారికి సహజము లయ్యెను. వారు వెఱచి సోమనాథుని శరణు గోరి శివ దీక్షనొంది వీరశైవులైరి. సోమనాథుఁడు ఓరుగంటి కోట ద్వారము పయినున్న గజలక్ష్మీ విగ్రహము క్రిందినుండి పోవ నియ్యకొనక, తేరి చూడఁగా నది విరిగి క్రిందఁ బడెను. సోమనాథుఁడోరుగంటికేఁగఁగాఁ బ్రతిపక్ష బ్రాహ్మణులు, రుద్ర దేవుఁడు శరణు గోరి బహు విధములఁ బ్రార్థించిరి.

సోమనాథుఁడు తన యంత్య కాలమున సమాధి కట్టించి యందుఁజేరి ప్రాణములు విడువఁగా శివుఁడు స్వయముగావచ్చి బొందితో గైలాసమునకు రమ్మని పిలిచెను. సోమనాథుఁ డప్పుడు శంకరుని గాంచి, దేవా! సమాధి తెఱచి నన్ను దీసికొని పోవుదువేని వంచకులగు బ్రాహ్మణులు సమాధి తెఱచికొని యెందేని పోయితినని గేలిచేయుదురు. ఇందే యున్న నిట గతించె నందురు. కాన నా సమాధిపై నీవు భక్తులముందుఁ గొంతసేపు నివసించి యనంతరము నీవాహన మగునందీశ్వరునిలోఁ గలుపు కొమ్మన నందులకు శంకరుఁ డానందించి భక్త సన్నిధానమునందు స్ఫటిక రూపముగఁ బ్రత్యక్షమై సోమనాథునిఁ దనలోఁ గలుపు కొని తన భక్తవాత్సల్యమును లోకమునకు వెల్లడించెను.

సోమనాథుఁడు పాలకురికి లోనే సమాధి గతుఁ డయ్యె నని మేము తలంచితిమి గాని గ్రంథాధారములు వ్యతిరేకముగా నున్నవి. పాలకురికి సోమనాథ పురాణ కారుఁడు, కర్ణాటక దేశమునందుఁగల శివగంగ చెంతనున్న కలికె మను గ్రామమున సోమనాథుఁడు సమాధి గతుఁ డయ్యెనని చెప్పెను. బసపురాణ పద్య కావ్యమునఁగూడ నిటులనే చెప్పఁబడెను; గాన నీయంశము విశ్వసనీయము గాక పోదు.

సోమనాథుని కవితను గూర్చి కొంత చెప్పవలసి యున్నది. ఇతఁ డసామాన్య పండితుఁడు. బహు భాషా విదుఁడు. అన్ని భాషల యందును నీతని కవిత సమముగా మృదుమధుర భూయిష్ఠముగా నుండును. శ్రుతులను బద్ధములలోఁ గూర్చుటలోను, మతవిషయ కాంశములు మనోహరముగఁ గవితలో నిముడ్చుట యందును, నీతఁ డద్వితీయుఁడు. ఈతని కవిత వీర రసోద్బోధకమై వినువారి యొడలు గరపొడుచునటులఁ జేయుననుట సత్యము. మత విషయకవివాదాంశములు బరిష్కరించివిషయ నిర్ణయము చేయుటలో నీతఁడసామాన్యుఁడు. వేదములందును వేదాంతమునందును బురాణేతిహాసతర్కాదికమునందును నీకవి చండ ప్రచండుఁడు. సమ కాలిక పండిత లోకముతో నొనరించిన మత విషయికసంగరములలో నీతఁడెన్నఁడును పరాజయ మన్నది యెఱుంగనే యెఱుంగఁడు. ఈయన గ్రంథములలో పండితారాధ్య చరిత్రమును శ్రీనాథమహాకవి పద్య కావ్యముగ వ్రాయుటయు, శంకర కవి బసవ పురాణమును సంస్కృతీకరించుటయు నతని ప్రాగల్భ్యమునకు దార్కాణములు. బాదరాయణప్రణీత మని యొక సంస్కృత బసపురాణము గలదు; గాని యదియు సోమనాథుని బసపురాణమునకు నిటీవలి వారిఁ సంస్కృతీ కరణమే! సోమనాథుఁడు బసవ పురాణమున బలువుర శైవ భక్తులను వర్ణించినాఁడు. ఆభక్తుల చరిత్రములలోఁ గొన్ని ద్రావిడగ్రంథములనుండియు మహారాష్ట్ర గ్రంథముల నుండియుఁ గర్ణాటక గ్రంథములనుండియు నుద్ధృతములు గాన నీతఁడు, బసవపురాణ రచనమున కనేక గ్రంథములు శోధించెనని తెలియుచున్నది. బసవ పురాణములో సోమనాథుని సమకాలిక భక్తుల చరిత్రములు, సాంఘిక చరిత్రములు జైన బౌద్ధ మతస్థుల విజృంభణము ఆకాలపుఁ బ్రజాప్రవర్తనము బోధచేయు ఘట్టములు పలుతావులఁగలవు. పండితారాధ్య చరిత్రమునందు మల్లికార్జున పండితుల ప్రతిభాతిశయము, ఆతఁడు జైనుల

శైవులురూపుమాపిన విధము, మతాంతరులగు రాజులచే నాతఁడొందిన కష్టములు, బసవేశ్వరుని సందర్శింప నెంచి కళ్యాణ నగరమునకు చందవోలునుండి బయలు దేరినవిధము, విపులముగావర్ణింపఁ బడినది. ఈతఁడేగిన మార్గము నిర్ణయించు పట్టునందు జెప్పఁబడిన "పానుగల్లు" శ్రీశైలము చెంతగల పానుగల్లని కొ. వే. లక్ష్మణరావుగారు నిరూపించిరి కాని మార్గ విధమును బట్టిచూచినను, ఆ కాలపు పానుగల్లురాజగు ఉదయ చోడునిశాసనములఁబట్టి చూచినను అందుఁబేర్కొనఁ బడిన పానుగల్లునల్లగొండ చెంతగల పానుగల్లనుట సత్యము. ఈయంశము దెలిసికొనుటకు మేము స్వయముగ నల్లగొండ చెంతగలపానుగల్లునకుఁ బలుమాఱేగినిర్ణయింపఁ గలిగితిమి. సోమనాథుని కవితా ప్రశంసను గూర్చి యెంతేని వ్రాయవలసియున్నదికాని విస్తరభీతిచే సంక్షేపింపక తప్పదు. మల్లికార్జునపండితారాధ్యుల శివతత్వసారములోని పదములు భావములు కొంచెమేని మార్పక పండితారాధ్య చరిత్రములో వాకొనినాఁడు. ఆరాధ్యుల గ్రంథ భావములనను వదించి తన గ్రంథమున వెలయించుట కతననే యాగ్రంథము లంతరించి యుండును. సోమనాథుని కవిత్వముభావములు విశేషించి శోధించిన కొలఁది బద్దెనీతులకు నన్నెచోడుని కుమార సంభవమునకుఁ జేరువలోనున్నవి. ఇతని కవితలో నింకనెన్నియో వాఙ్మయ విశేషములు గలవు. ఆవిశేషములనింకొక మాఱు ప్రత్యేకించి వివరింపఁదలఁచి యుంటచే నిటఁ బ్రశంసింపఁ మానితిమి.

సోమనాథుఁడు నిజాంరాష్ట్రమునందలి యాంధ్ర కవులలో మనమెఱింగి నంతలోఁ బ్రథముఁడు. వాఙ్మయ రహస్యము లీతనివలె నెఱింగిన కవి యింకొకఁడులేఁడు. సోమనాథుని జన్మస్థలము నివాసమునగు పాలకురికి గ్రామ పురము స్టేషనుకు ౧౬ మైళ్లదూరమునను, ఓరుగల్లునకు ౫౦ మైళ్ల దూరమందునను ఉన్నది. సోమనాథుని జీవితచరిత్రములు గ్రంథములు సమార్జించుటకు పాలకురికి పాంతములలో, యువకులెంతేని యత్నింప వలసియున్నది. వాఙ్మయోద్ధారకుఁడగు సోమనాథుని జన్మదినము మరణదినము నెఱింగి, వర్ధంతు లొనర్చుటగూడ, నిజాం రాష్ట్రాంధ్ర ప్రధాన ధర్మములలో నొకటి యని మా మనవి!



# మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

యడ్లపాటి వేంకట సుబ్బారావు, బి. ఏ.

బహుళ మాయా సమన్విత భ్రాంతి యుతము
ప్రకటితాజ్ఞాన తిమిర విభావ మైన
ఈ ప్రపంచంబునందు దుఃఖైక జన్మ
మెత్తితివి; సుఖ మావంత యేని నీకు
కలుగగా బోదు; ఇందాక కలుగ లేదు;
జన్మ జన్మంబులకు నెల్ల చపల జన్మ
మానవుని జన్మ యేయంచు మది దలంతు;
అట్టి జన్మను దాల్చి నీ వెట్టు లకట
సహజ సుఖమును ఆనంద సరణిగాంచ
కాంక్ష వహియించు చుంటివి! కలుగు నొక్కొ!
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

ఉదయ భానుని కిరణ సంపదలచేత
ప్రకటితోదయ నవ తుషారముల చేత

తెలివి నొందుచు మధుర పూ దేనె గ్రోలి
మేటి ఝుంకారముల్ సల్పు తుమ్మెదవు కావు.
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

మావి చిగురులు కుత్తుక బంటి మెసవి
మావి పూవుల మకరంద మహిమ గ్రోలి
మంద మలయానిల స్పర్శ మమతఁ దేలి
ప్రేయసీ కృత సంశ్లేష ప్రియము గాంచి
చిత్త మాహ్లాద పరమావధి జెలగు చుండ
ప్రకృతి సౌభాగ్య గరిమంబు ప్రస్తుతించి
సృష్టి నైచిత్ర్య భారంబు స్పష్ట పఱుప
పథిక జనములు మనములు పల్లవింప
మృదు మధుర స్వనంబు సంప్రీతి తోడ
పంచమ స్థాయి లయు గల్పి ప్రమద రీతి
కుహూ కుహూ యంచు గళ మెత్తి సహజ లీల
కిలికి పాడెడు గండు కోయిలవు కావు.
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

అల తటాకోపకంఠము లోన నుయ్యాల లూగు
చెలువు చిలికెడి శీతల శీకరముల
పిల్ల తెమ్మెరలు గ్రహించి పల్లవించి
హాయి నించుచు వేడ్క జోహారు సల్ప
అపరిమితముగ నానంద మతిశయిల్ల
మృదుతరం బౌచు రంగుల మేల్మి బొల్చు
పింఛ రాజంబు నొక వంక ప్రియము గూర్ప
ఘన శర ధ్ఘనా ఘన లస త్కాంతి మించి
తక్క బెక్కుల జూపఱ తల్లడిల్ల
జేయు సౌందర్య విభవ సుశ్రీ వహించి
రమ్య కేంకార నినద విరాజ మగుచు
నృత్యముల్ సల్పు గౌరవ నియతి గాంచ
నెమలిగా నైన నీవు జన్మింప లేదు.
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

పండు వెన్నెల నిండార ప్రకృతి కాంత
తనరు చిరు నవ్వు పెదవుల తాండ వింప
చందురిడను పళ్లెరంబున సమయ కలిమి
హారతిఁ బట్టి నూత్న విహారు లైన
ప్రేమ దంపతు లొండొరుల్ ప్రియము చెంద
భవ్య మంగళ హారతుల్ పాడు చుండ
ఘుమ ఘుమాయిత సౌరభ విమల మైన
పూవు గుత్తుల బెనగి పుష్పాసుల దాల్చి
పరమ సుఖమును గూర్చ దంపతుల జేర్చి
హాయి నింపెడు పూ బొద వైన గావు.
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!

తేటి బారుల హసియించి నీటు గొలుపు
ముద్దుగుమ్మల పెంజెడ మురువుహెచ్చ
శ్యామ లాకాశ పథమున నచల రీతి
తళుకు తళుకున ప్రభవించు తారలట్లు
ధవళ కాంతులు నలు దెస నవ ఘటింప
గుప్పు గుప్పున సౌరభ ముప్పతిల్ల
సహజ సుందరి కొక వింత సంఘటించి
కులుకు చుండెడు మల్లికా కుసుమ మీవు
కాదువే యెన్ని జన్మాల కైన నకట?
మనస! ఈ భ్రాంతి నీకేల మాను మింక!



# నేత్రపరీక్ష

## తెన్నేటి వేంకట రామమూర్తి, బి. ఏ., బి. ఇ. డి.

౧

ఆమె చూపిన చూపులు—మళ్లీ మళ్లీ తలుచుకొన్న కొద్దీ ఉద్రేకించే—ఆ భావ పూరితము లైన చూపులే నిద్దుర రాని మహావేళములో దొర్లే ఆనందుడికి కొంత శాంతి. యామిని తన అనంత జీమూతాల పావడ మరుగులో యీ లోకాలన్నీ దాచి వేసిన సమయంలో—ఆ చూపులు మాత్రమే యిన్తున్నాయి, కొంత శాంతి. మెరుస్తూ, పలకరిస్తూ, బాష్ప పూరితములై మళ్లీ వెంటనే తుడిచి వేసుకుంటూ—ఆహ్వానిస్తూన్న ఆ కళ్లనే చూస్తూ పడు కున్నాడు, ఆనందుడు, లోకం మరచి, సంఘం సంగతి విడచి. ప్రణయనీ వియోగ దుఃఖ శాంతి కోసరము నిరంతర ధ్యాన పారవశ్యములో పొద్దు కొల్పుకున్న యీ భ్రాంతి కన్న ఏంకావాలి? మరుగుతూన్న హృదయంలో, ప్రజ్వరిల్లి పోయే ప్రేమ కాంతుల బరపేకళ్లు, ఒళ్లు జల్లు మనేలాగు యీనిశి అగమ్యం లోంచి, అంధకార మహా వంతంలోంచి ఏకత్వము పూని అగు పడు తూంటే.

ఇన్ని దినాల అవస్థ, అనుభవించిన వేదన, యౌవనము పుష్పిస్తూ అర్చుకొన్న వలపు వాసనల మత్తుకు స్వేచ్ఛగా తిరిగిన ఊబులాటకు ఫలము, యిప్పుడు నిశ్చయము కుదిరింది—తన కర్తవ్యము నిర్ణయమైంది.

మొదట నుంచీ ఆడవాళ్ల మధ్య, సౌందర్య క్షేత్రాలలో, ప్రేమాన్వేషణలో, ప్రకృతి పెంపుడు బిడ్డగా పెరిగాడు. అనుభవాల కోసరము పడే వెర్రి ఆవేశంలో అన్వయించాడు. అర్థము చేసుకున్నాడు, కళ్లల్లో ప్రేమ, ఆకర్షణ, భావ ప్రకటన, అలజడి, ఆవేశం అన్నీ— అద్వితీయంగా గ్రహించ గల శక్తితో అవి గ్రహింప బడ్డాడు.

ఇప్పుడు ఎల్లా పొరపాటు పడ గలడు? నిశ్చయమన్న మాటే!

ఆమె ఎన్నాళ్లు యిల్లా చూపుల్తో ఆపు తుంది అన్న భయంలేదు; తొందర లేదు; అంతకు మించి ఆనందం కూడా లేదు; అయితే ఆ కళ్లతోటే, ఆచూపులతోటే, యింకొరిని ఆదరిస్తుందేమో అంటే, ఆభయంతోటే అదరి పోయేవాడు. అంతకన్నా ముఖ్యం—ఆమె యింకొరిది. ఆ తలంపామెను నిరంతరము కలత పెట్టు తూన్నట్లు భయపెట్టు తూన్నట్లు, నేను రక్షించే యిలా ఏడిపింప జేసేటట్లు ఆ కళ్లలో గ్రహిస్తున్నాడు.

ఇంక ఆలస్యము పనికి రాదు, ప్రేమ పోకోదు; ధైర్య మియ్యాలి, సాహసము నేర్పాలి; ఆమె చిగిరించాలి. అందు కోసమే యీ తెగింపు.

౨

ఆమె వీధి లోకి తొంగి చూస్తూంది. ఆ మహాత్మ్యం



ముచుకుందనది- నగరము

„పిక్టోరియల్" హైద్రాబాదు

నయనాల తోచ్చే, తలు పోరగా నించుని. ఆనందున కానాటి ఆకాంతుల లోని ఆకర్షణకి యింక తొలగి పోవాలని తోచలేదు. శక్తి కూడా లేదు. ఆయ స్కాంతము దగ్గిరకి లా నడచి వెళ్లి పొయ్యాడు. అప్పటి కే దిట్ట పడిన విశ్చయము పెట్టే తొందరలో - మెట మీదికి ఎక్కి పోయాడు.

మణిలోకి కొత్త చూపు, కలవరము, తొట్రు పాటు, వచ్చే సింది. భయముగా తలుపు వేసి పోయింది, మళ్లీ శక్తి చాలక ఆగి పోయింది.

పై మెట్టు మీద ఆనందం ఆగి నించున్నాడు.

"ఏం కావాలి? " అంది.

"ఆ కళ్లల్లోని చూపు"

భీతితో తలుపు వేసేసింది.

ఆనందుడు తిరిగి పోయి వచ్చి పోతూ ఉంటే తలుపు తెరువ బడిన ధ్వని. వెనుక తిరిగి చూడ బొయ్యే ప్పటికి గోపాలయ్య. ఒక ర్నొకరు ఎరుగుదురు, యింతకు పూర్వమే! అయితే యింతవరకు ఎప్పుడూ పలక రించు కొని ఎరుగరు.

"ఎవరు వారు?" గోపాలయ్య తీవ్రంగా ఏదో అప హరింప బడ్డ వానికి మల్లే ప్రశ్నించాడు.

'ఆ నందం'

'ఏం కావాలి?'

'ప్రస్తుత మలభ్యం!'

'ఏంటని సరీగ్గా మాటాడండి. ఎందుకు దొంగల్లా వెళ్లి పోతున్నారు?'

'అలభ్యం గనక!

'ఏంటిది?'

'ఆమె కళ్లల్లోని చూపు!'

'ఎవరి కళ్లల్లోని?' ఉగ్రుడై పొయ్యాడు.

వెనుక నుంచి బెదురు చూపులు ఆనందాన్ని ఆపాయి.

'సరే వెళ్లుతున్నా నండి.'

'మర్యాదస్థుడివే!'

'ఆ'

'మతి ఉందా?'

'ఆ'

'మరి యీ మాటలు?'

'వెళ్లు తున్నా' ముఖ్యంగా వెనుక ఉండి వణికి పోతున్న మణి కళ్లకు ఎదురు చెప్పాడు.

'వెళ్లు' అని గర్జించాడు గోపాలయ్య.

'ఆనందం సాగి పోయాడు. ఒకటే ఆలోచన. ఆమెలో ఏంటా మార్పు? ఎందు కంత భయం! అంత అభినయం, మొదట తలుపువేసి నప్పటిసిగ్గు, భయము' ఆవేదన, ఏదో వింత ఆనందం, ఎంతలో మారి పోయాయి. ఆకళ్లలా పెట్టిందని. లేక పోతేనా' ఆకాంతి కోసము, ఆ మహోజ్వల ప్రశాంతి కోసము, ఆమెకోసము, ఎంత ధైర్యమైనా సాహసమైనా చేసే వాడే కదా!

సాయంకాలము దాకా అల్లాగే, ఆవీధు లెంబడే ఆయింటి దృష్టి నే ఉండి పోయాడు, పోయిన దేదో వెతుక్కుంటూన్న భిక్షువులాగ. అప్పు డప్పుడు ఏవేవో కఠినోక్తులు, బెదరింపులు అదుపులు, వెక్కి వెక్కి ఏడ్పులు, గుండె వేయి వక్కలు చేసే లాగ, నీరుగా కరిగించేలాగ, వచ్చి హృదయాన్ని ఆదర గొట్టు తున్నాయి మరింత సాహస మభి వృద్ధి చేస్తూ.

ఆఖరికి ఆరు గంటల సమయాన పొన్నుకర్ర చేత్తో పట్టుకొని అనుమానముతో - అన్ని వైపులా కలయ చూస్తూ మెల్లిగా కదలి పోయాడు, గోపాలయ్య, యింటి నుండి షికారు యత్నాల మీద.

మణి అరుగు మీదకి వచ్చింది.

ఆనందం తొట్రుపడుతూ అనుమానిస్తూ మణి మోహాన్నవలోకిస్తూ పశ్చిమ మూర్తి లా నడిచి వస్తున్నాడు.

పూర్తిగా వర్షము కురిసేసి వెలిసి పోయిన ఆకాశంలా ఎదురుగా నిలిచింది, మణి. యింకా నిలబడే ఉంది.

తీవ్రంగా హృదయాలు చీల్చే నిష్ఠురంపు కఠిన మాపుతో పిలిచింది.

'నువ్వు చేసిన పనేంటి?'

'ధైర్యం!'

'ఎందుకు?'

'స్వార్థములో'

'మరి నాగతి!'

'ఏమిటి?'

'నా మర్యాద! నా కాపురం!'

'నిన్ను పేమిస్తున్నాను!' (గంభీరంగా అంటాడు ఆనందం)

'అయితే?'

'మణీ!

'ఆనందం!'

'మణీ!',

'ఆనందం!'

ఆ మునిమాపు మసక చీకటిలో ఆంనదం మణినీ అమాంతం కౌగలించు కున్నాడు. యిద్దరూ ఏకమై పోయారు. ఆ కళ్లనే మళ్లీ మళ్లీ అదేపనిగా ముద్దులతో నింపేసేడు. కళ్లు మూతలు పడిపోయేలా యిద్దరికీ.

'ఆమె ఆ గాఢ స్పర్శ, అద్భుతానందం ఒంటు పాటు, ఆంత పేమ వర్షము ఆపుకో లేకపోయింది భరించ లేని ఆకాశమో సుఖమో శోషిల్లి పోయింది, అప్పు ఆ విశాల వక్షాన..........................................
..........................................................

'మణీ! చూడు!'

మణి చూశింది.

ఎదురుగా భర్త, 'గోపాలయ్య,

'ఆనందం' అన్నాడు.

పెద్ద పిడుగు, మహా భయంకరమైన ప్రళయపు అంధకార మయము, అన్ని అవరించాయి, ఆ ప్రేయసుల లోకానికి. ఇద్దరూ ఏ అంతరిక్షాన్నించో ఆమాంతం, ఎన్నో ఆమడల దిగువలోకి కూల బడ్డట్టయారు.

అనందం ధైర్యం చేశాడు,

'గోపాలయ్య గారూ! యీమెను నేను పేమిస్తున్నాను!,

ఉగ్రుడై పోతూ, మహా నరకంలోకి తోస్తే యమ ధర్మ రాజులాగా! ఆ వహా అరుగు మీదనుంచి కింది వరకు పడేలాగు ఆనందాన్ని తోశాడు.

"సన్నూ" అంది మణి.

ఆగు' ఆన్న మాటలు విన పడ్డాయి. తలుపు వేయడ మైంది. అంతే! అక్కడేంత సేపాగినా ఏమీ తెలియలేదు. ఏం జరుగు తున్నదో జాడలే లేవు.

అక్కడే ఉన్నాడు ఆనందం.

రాత్రిచాలా జరిగి పోయింది.

తలుపు తెరవబడింది. పెద్దలైటు, గోపాలయ్య ఒక చేత్తో కర్రతో పరికించి చూస్తూ,

'అమ్మో దొంగ!' అని పెద్ద కేక వేశాడు. వాడ విడిగా ఎవరో చేరారు.

మణి కూడా వచ్చింది.

ఆనందం, యిందరి మధ్యనుంచి, చీకట్లోంచి మెరిసే కళ్లలోని సంజ్ఞ గ్రహించాడు. ధైర్య లక్ష్మి చేత ప్రుప్పక నడచి వచ్చేస్తున్నాడు.

'ఎవడు నువ్వు?' పెద్ద మనిషి రాఘవయ్య నాయుడు ఆపి ప్రశ్నించాడు.

'ఆనందం.'

'ఆనందం!'

'ఆనందం.'

'సరే వెళ్లు.'

3

ఊరంతా అల్లాను పోయింది. మణి ఆనందాల అమాయిక ప్రేమ గాథలతో, ఊరు మారుమ్రోగి పోతూంది. మణిని ఒంటరి దాన్ని చేసి బలాత్కారించాడనికొంత మంది, మణిని యిష్టపడ్డ దోయి అని కొంత మంది, మణి రాక కోసరమే రాత్రి ౧౦ దాకా అరుగు దగ్గిర నుంచున్నాడని, యిష్టము వచ్చినట్లు అనుకుంటున్నారు. ఆనందుని దుడుకు తనము బలత్కారము, పుకారుతో గగ్గోలు పెట్టేస్తూన్న ప్రణయ గాథ, యింట తలిదండ్రులకి కూడా వినికిడయింది. అదమాయించారు,వారు,

'ఏంటీ అపవాదు?'

'అవును నేను మణిని ప్రేమించేను'

'అయితే బలత్కారమా?'

'అబద్ధము!'

'ఆమెను ముట్టుకున్నావా?'

'ఆమె యిష్టము మీద!'

'ఛీ వెధవా!' అని తండ్రి ఒక చెంపకాయ వేశాడు. అర్థమవని యీవెర్రి అగడమునకు శిక్ష అంతే!

ఊళ్లో పెద్ద మనుష్యులందరూ వచ్చి అడిగారు. అవతల మణిని తీవ్రంగా ప్రశ్నించారు. 'కాపురం చెయ్యాలని లేదా?' అని.

నాయుడు ఆనందాన్ని గట్టిగా దబాయించాడు.

'ఆమె చెప్పింది, నువ్వు మధ్యాహ్నము బలాత్కారముగా యింట్లోకి వెళ్లేవుట'

'అబద్ధము!'

'మరి?'

'పిలిచేయి ఆమెకళ్లు!'

*  *  *

ఆనందానికి ఒకటే దారి, కొంత కాలము పరదేశాలు వదిలి పోవాలి. కోర్టు లెక్కడం,ఖైదు, మొదలయినవి,మొత్తంమీద లేదుగాని, యింత పని చేసే ఘాదుండ గీడుని ఊరునించి తరిమెయ్యడానికి సమకట్టేరు. ముఖ్యంగా అందరి కంటే హెచ్చుగా గోపాలయ్య, వారందరి దగ్గిర తీవ్రంగా అసలు చంపెద్దునుగానీ,అంటూ.

'మణిని కూడా పిలిపించేరు.

'ఏంటి సంగతి?'

'నాకేం తెలియదు!'

'మరి నువ్వు ఆనందుణ్ణి ప్రేమించావా?'

'నేను చెప్పలేను.'

'అతడు దగ్గిర రావడానికి ఒప్పుకున్నావా?'

'లేదు!' అని గట్టిగా చెప్పింది.

ఆనందుడు ఆ కళ్లల్లోనికి చూశాడు.

'నేను ఒప్పుకోలేదు కదూ?' అని ప్రశ్నించాయి అవి.

'ఏంటీ!' అన్నాడు మెల్లిగా, 'సరే! నేను వెళ్లిపోతానన్నాడు. పెద్దఆవేశంతో, ఒకవేడి నిట్టూర్పు విడి

చేేదు. ఆడవారి నైజము గర్తించి నట్లు, గ్రహించి నట్లు తల ఊపి, బయలు దేరి వెళ్లి పోయాడు. ఎవరూ అడ్డు పెట్ట లేదు.

ఇంటి దగ్గర చెప్పే వెళ్లి పోయాడు. చెన్న పట్నం చదువుల నిమిత్తం.

౪

నెలలూ, సంవత్సరాలూ గడచి పోయినాయి. ఆనందం చదువులో చాలా తెలివి తేటలు, పేరు ప్రతిష్టలు, సంపాయించాడు. మణిని ఏనాడో మరిచి పోయినాడు. మళ్లీ ఆడదాన్ని నమ్మకూడ దనుకున్నాడు. కళ్లపరీక్ష వదలు కున్నాడు. తలి దండ్రుల దగ్గరికి ఆ మొదటి ఏడు ఆఖరునే ఓమారు ఒచ్చేడు. అప్పుడు, కనుక్కుంటే మణి పుట్టింటికి వెళ్లిందన్నారు. సరే. అప్పటిలో తలిదండ్రులు కూడా చెన్నపట్నం వెళ్లిపొయ్యారు. అంతే! మళ్లి రాలేదు. పెళ్లి కూడా అయిపోయింది. చిన్న రాధ మీద తన ప్రేమను పూర్తిగా వర్షిస్తున్నాడు. ఆమే లోకం, ఆమే ప్రాణం. ఆమె కళ్లల్లోని అమాయకత్వమే గురి. వాటినే ఆరాధించే వాడు. వాటిలో ఏమారైనా అతి సులభంగా కనిపెట్టి కలత పడి నడవడి మార్చుకునేవాడు, అనుకూలంగా.

ప్లీడరీ కోసం, మళ్లీ తన ఊరు స్వంసారంతో కూడా వచ్చేశాడు. శుభ ప్రదంగా కుదురుకున్నాడు.

మణి ఎల్లా ఉందని ఎప్పుడో ఎవరినో కనుక్కున్నాడు. పెద్ద పిడుగు పడింది. గుండెలు చీల్చు కున్నాని పోని బాధ, ఏదో కొత్త వేదన, పెద్ద మంట ఎత్తింది.

మణి తన ఒకప్పటి ప్రియురాలు. అద్భుతమైన ప్రణయ చూపులు గలది. భర్తచే వదిల బడ్డ మణి, మరొక పదిమంది చేతా విడువ బడి, ఒంటరిగా, ఒక చిన్న పువ్వుల వనము మధ్య గుడిసెలో పాడు జీవనము బ్రతుకుతూంది. యింత నీచురాలవుతుందను కోలేదు. [illegible] యకే, యిష్టమంతగా లేకనే, ఆదారిని ఓమారు ఆనం[illegible] డు వెళ్లేడు.

ఎదురుగా, దూరాన, చెట్ల మధ్య, పువ్వుల [illegible] తులను తనకాంతులలోకి ఐక్యము చేసేసుకుంటు[illegible] చూపుల్తో, ఏం విచారము గాని, సిగ్గుగాని, భయము[illegible] తనజీవితము పై అసహ్యముగాని, తనపై అవమానము [illegible] లేక, వన వన లాడుతూ, యావ నోద్రేక[illegible] పొంగి పోతూ, ఏవన కన్యే, ప్రేమ దేవతో, [illegible] ఆతోటలలో, ఆ విలాసములలో, ఆనం పులతో కన[illegible] ఎన్ని పాపాలలోంచి అయినా, ఏ కలుషమూ అం[illegible] శుభ్రి పడి వచ్చేసే ఆమణి గూర్చిన యీ క్రొత్త[illegible] భయ పెట్టింది, ఆనందుణ్ణి.

ప్రణయము రుదరిత్వము పూని, అనుభవించ[illegible] వాళ్లని, అనుభ వింపాలని ఊరుక తహ తహ లాడి[illegible] ఉబలాటు పడే వాళ్లని, మల మల మాడ్చి చంపు[illegible] జీగలతో ప్రజ్వరిల్లి పోతున్న నయనాలతో, [illegible] న్నించే చూసింది. అట్లానే ఆగి పోయేడు. నాటి [illegible] నము అర్థమైంది. గ్రహించేడు. ఆ ఱతే మహా [illegible] కలవర పెట్టేసింది. తానువాటి జోరుకి ఆగరే [illegible] డు. అంత కాంతిలో మసుల లే నను కున్నాడు. [illegible] యార్పుల భరమ్మలో, ఊపిరి తిరుగ దను [illegible] గబ గబ యింటికి నడిచేసి చిన్నరాధ అమా[illegible] మలోని సిగ్గుచూపుల చల్లదనములో [illegible] పొయ్యాడు. అంతే కాని మళ్లీ మళ్లి, ఆ మణి [illegible] య జ్వాలల్తో నెంటాడి ముంచే స్తున్నాయి, [illegible] ఒకటే కలవ రింపులు. మళ్లి ఆ కళ్లు, వెన్నెల [illegible] ములో శాంతి పడిన లోకములో మెరిసి పోతూ [illegible] ముపూని ఆహ్వానిస్తున్నాయి. నువ్వే అర్హ్యాలి, ఆ [illegible] య జ్వాల లని, నువ్వే అనుభ వించాలి, ఆ ప్రణ[illegible] న్ని అని: మళ్లీ నిశ్చయ మేర్పడింది. పొద్దున్నే [illegible] వచ్చింది. సావిడిలో ప్రత్యక్ష మైంది.

'మణీ!'

'ఆనందం!'

ఊరుకున్నారు.

మణి అడిగింది,

'మరినిన్న వెళ్లి పోయేవేం! నన్ను చూడ్డానికి సిగ్గా?'

'భయం'

'ఎందుకు?'

'మరి ఆ కళ్లెందుకు కట్లా పెట్టేవు?'

'ఆనందం! అనివచ్చి ఆమాంతం కౌగలించుకుంది'

'నువ్వు యింకా నన్ను అర్థం చేసు కుంటావన్న నమ్మకం ఉంది' లోకములో నువ్వొక్కడివి మాత్రము. అందుకనే నీ కోసరమే యీ బతుకు!'

'సరేగాని మణీ ఇదేం పని?'

'ఏ పని?

'యీ జీవితము!'

ఒక్క నిమిషమూరుకుంది.

'చెప్ప మన్నానా?'

'మణీ!'

'అయితే నువ్వే దీనికి కారణం!

'అబద్ధః!'

'అవును. మరి యెల్లా బోధ పర్చగలను. నువ్వు అప్పుడు నన్ను అర్థము చేసుకునే కళ్లతో చూడకపోతే ధైర్యము చేయక పోతే ఏంచేసే దాన్నో? అనుభవాల కోసమావేశపడి, అందాన్ని వెతుకులాడే తృప్తిలేని యీకళ్లు పెట్టి బ్రతుకో డానికి నువ్వు ప్రేమకుండే ధైర్యం బోధ పర్చక పోతే ఏమో చెప్పలేను. కాని అంతసాహసము ఒక్క కళ్ల కోసము చేసిన నువ్వు, ఆ కళ్లు పడే ఆవేదన, బాధ అర్థం చేసుకో, మరి.

'మరి యిట్లాంటి వాళ్లతో జీవన మేంటి చెప్పు!'

'నువ్వు తప్పి పోయేవు, మరచి పోయేవు, కఠినుడవై పోయేవు. కరగి నీరై యీ హృదయము మాత్రము గట్టిపడ లేదు!'

'అప్పుడే, ఆ పెద్ద మనుష్యుల ముందరే అతుక్కు పోయిం దనుకున్నా కఠినమైందను కున్నా. లేకపోతే ఆ అబద్ధ మెందుకు చెప్పేవు!'

'నేనేం చెప్పేను?'

'నువ్వు నన్ను ముట్టుకోడానికి ఒప్పుకో లేదని!'

'అవును!'

'మళ్లీ అంటావు!'

'నేను ఒకప్పుకో లేదనేనా నీ నమ్మకం?'

అర్థ మైనట్లు తల ఊపేడు.

'మణీ! రా నాతో ఉండు!'

'ఎందుకు?'

'అబ్బా! మణీ ఆకళ్లు, ముఖ్యంగా ఆఎర్రజీరల్తోటి అవినాకు కావాలి! నావై పోవాలి! నాకోసమే ప్రకాశించాలి! నన్నే అనుభవించాలి! నన్నుతప్పయితర ములు చూడ కూడదు. మణీ ఆకళ్లు నావి కావాలి' గట్టిగా కౌగలించేడు, ఆకళ్లని ముద్దుల్తోటి ముంచేసేడు. నలిగి పోతూన్న మణి అంది.'

'ఆనందం! చూడు.'

ఆనందం చూశాడు. ఎదురుగా చిన్నిరాధ కళ్లు మూసు కుంటూండడము. వదిలినాడు మణిని. మణి పారి పోయింది.





# ప్రణయ పరివేదనము



బూరెల వేంకట రమణయ్య

ప్రాణువ వలెనన్న నది యేమొ మఱపురాదు.
కన్నులకుఁ గట్టినట్టుల కలికి! నీదు
దివ్య దుర్లభ రూపంబు తీరి యుండె;
ఎటుల సైతు వియోగము నెటుల మనుదు?
శీతకర సన్నిభాస్యరో! వీత దయను
బాసి పోవుట న్యాయమే గాసిఁ బెట్టి?

* * *

మంద మారుత వీచికల్ మసలు వేళ,
చంద్ర చంద్రిక లెల్లెడ జారువేళ,
శయ్యపై మేను వాల్చెడు సమయ మందు,
సహజ మాధుర్య స్వరమున సాగుచుండు
ప్రియము లానంద దాయక ప్రేమ గీతి
కలను విని విని మోహమ్ముఁ గట్టలేక,
వనిత! నీచెంతఁ జేరంగ వలపు గులుక
తేనె లొల్కంగఁ బల్కుచుఁ దెచ్చి విడెము
చేతి కందిచ్చి కౌఁగిటఁ జేరవచ్చి
యరుణ కాంతుల వెదజల్లు యధర పల్ల
వంబుఁ బైకెత్తి, 'తమ్మి' పై వాంఛ దెలుపు
సమయముల నెట్లు మఱువంగ సాధ్య మగును?
మాన సానంద దాయక మగుచు తనరు
మధుర మగు నీదు పల్కుల మఱల మఱల
నొంటి గూర్చుండి పాడుచు నుండు వేళ,
నల్ల నల్లన నా చెంత కరుగుఁ దెంచి
ముఖమునను హాస చంద్రికల్ మొలకలెత్త
వికటముగ నవ్వి నా పాట వెక్కిరించు
సమయముల నెట్లు మఱువంగ సాధ్య మగును?
పూవు పొదరిండ్ల కడఁ జేరి పుష్ప సౌర
భమును గ్రోలుచు నుండెడు పట్టు నందు
పొదలఁ మాటున దాఁగుచు కదలివచ్చి,
చల్లగా విని నామేను జలదరింప
గుబ్బ పాలిండ్ల వీపునఁ గ్రుచ్చి మెదపి
నాదు నయనంబులను మూసి నవ్వు చుండి
"ఎవ్వరో చెప్పు చూచెద? నేమి యందు"
వనుచు, ననుఁ గూర్చి మృదువుగా నలిన పల్కు
సమయముల నెట్లు మఱువంగ సాధ్య మగును?

* * *

కుసుమ కోమల చిత్తవే కువలయాక్షి!
కఠిన మానస వెప్పుడు గావు—నిజము;
అతుల గుణదీపుడా కృష్ణుఁ, డతని కృపను
కలియకుండగ బోదుమే కలికి! మనము




భాస్కర రామచంద్ర రావు, బి. ఏ., బి. టి., ఎఫ్. టి. ఎస్.

తృతీయాంకము

( దిగ్విజయ యాత్రికుం జను రావణునును, ప్రహస్త సుమంత్రులును ప్రవేశము )

రావ: ప్రహస్తా! సుమంత్రా! నిర్జరులు నిర్జితులైరి. ఆ జాతి యీ జాతి యనక సనామకుం డగు ప్రతి శూరుని సోలించితిని. చతుర్దశ భువనములుం గాలించితిని. రాక్షస రాజ్య మకంటకము గావించితిని. ఇంకను నా వింశతి భుజముల కండూతి మాన కుండెను.

ఆ. వె. ఎవరి యెవరి శక్తి కెయ్యది యోగ్యమో
యట్టి కార్య మొకంటి యమర దేని,
బ్రదికి యేమి, చర్మ భస్త్రిక చాప్పన,
నలసుం డగుట కంటె హైన్య మెద్ది?

పరమేష్ఠిని మెప్పించి వరముం బడసిన దాది, నాకు నొక నాండైన దృప్తికరముగ యుద్ధ భిక్షయే దొరకక యిరువది భుజములు తీంట లెత్తినవి. ఏమి చేయ వలెనో తెలియ కున్నది.

ప్రహస్త: రావణ ప్రభూ! నీవు పుట్టుక చేతను, వంశము చేతను, తపస్సు చేతను, వర బలము చేతను నసదృశ యశో బంధుండవు; సంకల్ప మాత్రమున మనోరథము లెదుర్కొను చుండ, వాని, సుఖముంగా గూర్చుండి యనుభవింపక, యారక తిమ్మర నేల ?

రావ: ప్రహస్తా! దేహ ధారులకు గోరిక లుదయించు చుండును, కోరిన కోరిక చేకూఱిన తత్క్షణమే దానికిం గారణ మగు రాగాంకురము నశించి మనస్సునకు గత్యంతరము కలుగు చుండును. మనోరథ ఫలసిద్ధి యందు

సుఖము లేదు. తత్సిద్ధి కొఱకై మనుష్యుఁ డొనర్చు కృషి యుండే సుఖము కలదు. కాయ కృషి మనఃకృషియును, గాయ మానసముల బలపఱచి, తన్మూలమున వానికి సుఖమును బొసగించును. కావున దర్పములఁ దేజరిల్లు సత్త్వ సంపన్నుఁ డూరక సోమరియై, యున్న దనుభవించుచు నూరకుండుట స్వభావ సిద్ధము కాదు.

(తెరలో వీణా గానము)

సుమంత్రి: అదిఁగో నారదుఁడు పోవుచున్నట్లున్నది.

రావ: సుమంత్రా! త్వరఁగ వెళ్ళి నేను రమ్మంటి నని చెప్పి పిలుచుకొని రమ్మ.

(సుమంత్రుఁడు వెళ్ళును. నారదుఁడు, సుమంత్రుఁడును ప్రవేశము.)

రావ: నారదా! త్రిలోక వార్తా విశారదా! రమ్ము. పెక్కండ్ర జడదారులం జూచితిని గాని, నా మదికి నచ్చిన వాఁడవు నీవొక్కఁడవే సుమా!

నార: రావణేశ్వరా! నీవంటి జగదేక వీరులకు నాయందింతటి నిర్హేతుక జాయమాన కటాక్షమునకు నాయందేమి యోగ్యత కలదో నాకే యూహింప శక్తి లేకున్న యది. అది నా యదృష్టముకాని మఱియొండు కాదు.

రావ: నీయందట్టి యోగ్యత కలదు. ఎక్కడెక్కడో దిక్కులేని పట్టుల నొక్కచోట ముక్కులు బిగఁబట్టుకొని కూర్చుండు లోకజ్ఞానములేని ఫక్కీరులలోని వాఁడవు గావు నీవు. నీ మెట్టని మట్టి లేదు. నీ చూడని వీడు లేదు. నీ యెఱుఁగని యర్థము లేదు. ఇందులకుఁ గారణము—

నార: ప్రత్యక్షము గా నగుపడు ప్రపంచ పరిజ్ఞాన శూన్యులు పరోక్ష మంత్రార్థ తత్త్వకోవిదు లగుట యెట్లు! ఇంటఁ గెలిచినఁ గదా రచ్చ గెలుచుట!

రావ: నీవు మాటలలో నద్వితీయుఁడవు.

నార: నీవు శౌర్యమున నెట్లో అట్లు.

రావ: సెబాసు! నారదా! అయిన నిన్నొకఁటి యడుగఁ దలంచితిని.

నార: నిరభ్యంతరముఁగ నడుగుము.

రావ: నిజము చెప్పుదువు గదా!

నార: పౌలస్త్యా! నీవు నా కన్యుఁడవా! మీ తాతయు నేనును బ్రహ్మ పుత్రులమే కదా! నీ కతఁ డెట్లో, నేను నట్లే యను కొనుము.

రావ: అయిన వినుము. స్వర్గ మర్త్య పాతాళముల గాలించి జల కడిగి విడిచితిని. సురలు నసురలు దక్కిన జాతులవారు నిట్టునుదులు విడుచుచుం బలువెత్తిరి. యక్షులు రక్షకులు లేక పక్షులై భిక్షుకుల నాశ్రయించిరి. నాగులు నిరుపయోగులై, యాభోగముల నేలవాల్చి యేబిలములలో దూరిరి. కిన్నరులు పన్నెవీడి కన్న బిల్లలవలె

పాలైరి. నీవు ముల్లోకములు సంచరించు చుందువు గదా, నాతో హోరాహోరి నిలిచి పోరాడఁగల శూరుఁ డీ శేడు లోకమ్ముల నెక్కడేని యొక్కఁడైన నీకన్నుల కగుపడిన వాడా చెప్పుము. దాక్షిణ్యము వలదు. భీతి వలదు. ముఖ ప్రీతి వలదు. జంకక కొంకక నిశ్శంకత వచింపు.

నార: రావణా! నీతో నిలచి పోరాడగల వీరుడు కలఁడా? దీనికి ప్రత్యుత్తరము కలదా? మఱల బ్రహ్మదేవుడు సృష్టించిన నేమో నేఁ జెప్పజాలను. ఉండు ముండుము. కార్తవీర్యార్జునుని నెప్పుడైన జూచి యుంటివా?

రావ: ఏమీ! కార్తవీర్యార్జునుఁడా! దేవగణముల లోని వాఁడేనా ?

నార: కాఁడు నరపతి. మాహిష్మతీ పట్టణ మేలు రాజు. దత్తాత్రేయ సేవా సమాసాదిత లబ్ధ విభవ సంపన్నుఁడు.

రావ: ఏమంటివేమంటివి! నారదా! నరపతియా? భళిభళీ! నరభక్షకులకు నరు లొక లక్ష్యము లోని వారలా? మూషిక మెంత పెద్ద దైన బిడాలము నాలమునకుం జీరునా?

నార: రావణా! నీతో నా కపహాస్యమా! కార్తవీర్యార్జునుఁడు శౌర్యోపార్జిత కీర్తిధనుఁడు. నాకుఁ దెలిసి నంత వఱకు నీకు సరిరాక పోయినను, నీవు చూఁడఁ దగిన వాఁడని నా యభిప్రాయము.

రావ: చూఁతును గాక!

చం. సురపతి గెల్చితిం, దహను జుట్టను బెట్టితిఁ, గాలు గెంటితిం,
నిరుర్రుతి నిగ్రహించితిని, నిల్వ హరించితి వారుణీపతిం,
గురువలి నొంచి, వైతెల బిలు గర్వ మడంచితి, నీశుఁ దోలితిం
నరపతు లొక్క లెక్కయొకొ నా కరచేతుల నల్చి పీల్చనే!

ప్రహస్తా! మాహిష్మతీ పురి చక్కటికి మన రక్కసమూకలను నడుపింపుము! శుకా!

(శుకుఁ డను రాక్షసుఁడు ప్రవేశము.)

శుకుఁడు: దేవా!

రావ: నీ విదే క్షణము వెడలి నా రాఁక నా కార్తవీర్యునకుం మునుముంద దెలుపుము! వెళ్ళుము!

శుకుఁడు: చిత్తము!

(నిష్క్రమించును)

రావ: నారదా! ఆ నిరీక్షణముఁగఁ దనపై దాడి వెడలితి నని యర్జునుఁ డనుకొననేల? సర్వ సన్నాహములో నుండుఁ గాక.

నార: నేను నదే మార్గమున తేపఁ బెల్లుండిలో రాఁ దలంచు కొన్నాఁడను.

రావ: రమ్ము తప్పక! తమాస చూతువుఁ గాని! మంత్రులారా! రండు.



(నిష్క్రమింతురు)

రంగము: మాహిష్మతి కోట. భటుఁడు కావలి

(శుకుఁడు ప్రవేశము)

ఇదియే మాహిష్మతీ నగరము. ఔరా! ఈపురి యపూర్వశోభ, స్వర్గమును జూచితిని, భోగవతిం గాంచితి అష్ట దిక్పాలుర పట్టణములం బొడఁ గాంచితిని కాని, ఇదియొక విలక్షణ మైన కోట. నల్లి చోఁగల సంధు లేక యీఁగవాలిన జారు మినమినమించు మోహమయప్రాకారము లీయేడును దుర్ని రీక్ష్యములు. దుర్భేద్యములు. ఆకసముతో నెకసక్కెములాడు మేడలకు గో. వాఁడు దక్షిణ ద్వార రక్షక భటులలో నొకఁడను కొందును. సమీపించి పలుకరింతును గాక.

భటుఁడు: ఎవడచ్చట? ఎక్కడకు? పలుకుము. లేక చత్తువు.

శుకుఁడు: నేను శుకుఁడను వార్తా హరుఁడను. మీ రేని కడకు!

భటుఁడు: ఏమి శుకుఁడవా! శుకములు, పావురములు వార్తా హరములుఁగ యేభామ నిన్ను మా సార్వభౌము కడకంపెను.

శుకుఁడు: భామకాదు. భీమసమరనిర్జితనిర్జర భామా మాన ధనుఁడు, దశవద నుఁడు నన్నంపినది.

భటుఁడు: ఎల్లెట్లా! రావణుఁడా నిన్నంపినది! ఏల?

శుకుఁడు: నీ కేల? మీరాజుతో చెప్పుము.

భట: ఏమని!

శుక: నేను వచ్చితినని.

భట: ఎందఱో వత్తురు. ఎందఱో పోదురు. నీమి నీవు వచ్చిన!

శుక: నేనందఱవంటివాఁడను గాను.

భట: అది నేనును నెఱుఁగుదును! నీముఖమును జూచిన ప్రతి మనుష్యు నెఱుఁగును.

శుక: మీ పనిముగింపక యూరక వెళ్ళువాఁడను గాను.

భట: మొదట నీపని యేమో అది ముగింపునకు రావలెఁగదా! అది యేమో చెప్పు.

శుక: నీ వధిక ప్రసంగివి.

భట: నీవలెఁ జెప్పిన పదములనే వల్లించుటకు నేను శుకము గాను. మీ స్వామి నేర్పిన యేరెండక్షరముల వల్లింప వచ్చితివి. వాని జెప్పుటకింత బిగువేల!

శుక: దీనిఫలము నీవింతలో ననుభవింపఁగలవు.

భట: శుకమా! అప్పటికి నీకుఁగల ఫలమేమి! నిష్ఫలమే. నీవు వచ్చిన పని ముఖ్యమైనది యా కాదా యే యారయక యూరక ... నన్ను ... సాహసము కాదా

శుక: సుప్రసిద్ధుఁడగు రావణ బ్రహ్మ దూత యప్రసిద్ధమగు రాయభారము నడుపువాఁడా! నీకెంత తెలివిచాలదు?

భట: అట్టి ప్రసిద్ధమగు రాయభారమే యగునేని దానికింత గోప్యమేల. ఉన్నది వెసఁ గ్రక్కరాదా.

శుక: మా దనుజభర్త మీమనుజభర్తతో యుద్ధము సేయ నేతెంచుచున్న వాఁడు.

భట: దనుజులకును మనుజులకును సహజవైర ముండనే యున్నది. సంబంధ బాంధ్యములు గలసెట్టువారు కారు గదా! దీనికి రాయభారమేల?

శుక: సమర సన్నాహముతో నుండుమని మీరాజును హెచ్చరించుటకు.

భట: యుద్ధము సేయవచ్చువాఁడు మున్ముందుగఁ దెలుపవలెనని యేధర్మ శాస్త్రములో నున్నది.

శుక: లేకున్న మా దానవభర్త దొంగతనముగాఁ గాని, హటాత్తుగాగాని శత్రులపై దాడివెడలు వాఁడుగాడు.

భట: అంతటి మహాశూరుఁడు మహారాజు గా రూరలేని తఱిఁ గనిపెట్టి యూరి వారికి సందేశ మంపునా!

శుక: ఏమి? మీరాజుగార లేఁడా!

భట: ఉండిన నీవింతసేపు నిర్భయముఁగ నిచ్చట నిలిచి మాటలాడి యుందువా?

(రావణుఁడు ప్రహస్తుఁడును ప్రవేశము. భటులును)

శుక: దేవా! నమస్కారములు.

రావ: శుకా! నీవు వచ్చినపని యేమైనది?

శుక: దేవా! వచ్చినపని వాకిటనే యయినది. రాజుగారలేఁడఁట.

రావ: భళిభళీ! కార్తవీర్యార్జునా! ‹‹శీఘ్రబుద్ధేః ఫలాయనమ్'' బాగుబాగు. నీ పేరువందలి పటుత్వము నీ బాహులందు లేదుగదా. ఇంత త్వరలో యూరువిడిచి పలువిడుదువా! వారదుఁడు మునుముందు నే నెతెంచు వార్తఁ జెప్పి యుండునేమొ. లేదా ప్రచ్ఛన్నుఁడై యెందో యుండవలె ఓరి! భటా!

శా. ఏఁడీ నీ ప్రభువేఁడి యర్జునుఁడు! ఓరి! వెళ్ళి నీతో రణ
క్రీడారంభ కుతూహలంబున దశగ్రీవుం డిదేవచ్చెఁ బో ।
రాడం రమ్మను పొమ్ము తాసటులు రాఁడా, రెండు (వేయి) హస్తంబులం
గూడ నోమ్మడ్చి పరాజితుండ నని మ్రొక్కంగాళ మాటాడకే.

భట: రాక్షసేంద్రా!

శా. మా రాజూరనులేఁడు నేఁడె సతులుం మాహిష్మతీనాథుఁ డే.
పారంబోయిరి ఘోషయాత్ర కెటకో పౌలస్త్య రానోపు మా.
పో రేపో మఱమాపొ చెప్పగలమే భూపాలుచిత్తంబు దే.
వారీ!పోర[illegible] పలుంతునేని నిలు మీవందాక యుండెందునేఁ.

వచ్చిన మనివి నేయఁగలను.

రావ: ఔరా! నారదా! ఎట్టిజగజెట్టిని జూపెట్టితివి?

మంత్రిల్లారా!

మ. తెలిసెన్నా నిపరాక్రమక్రమ మదింతేనా! భళీ! నేను రాఁ
గలనంచున్న సుముంపు తావిని భయోత్కంపంబుతో నాంద్రతో
గలఁ తన్నాబజేను పందవాని కొఱకై కన్నెట్ట నాముండునే
పెలుచంచీచమడంతుఁ బోవిమతునే వేఱొక్కమా తెప్పదేఁ.

భటులారా!

కం. కొట్టుఁడు భేరులుమ్రోగిం
బెట్టిదముఁగ నాదురాఁక విని నెలఁతలతో;
నొట్టుఁగ నర్జునుఁడెటకో,
పట్టణముం విడిచి తెఱచి పఱచె నటంచుఁ.

(జయధ్వనులతో నిష్క్రమింతురు)

రంగము: నర్మదతీరము

(కార్తవీర్యుఁడును భార్య ఇందుమతియు వెన్నెల విహారము. ప్రవేశము)

కార్త: ప్రియా! ఇందుమతీ! ఈ నర్మదాతీరస్థ తరుపుంజములు పండువెన్నెలబైట నెట్లు ప్రకాశించుచున్నవో కనుఁగొనుము,

ఇందు: నాథా! ఈ తియ్యమామిడి కొమ్మపై, ఆ చకోరయుగ్మ మెట్లానందించుచున్నదో చూఁడుము.

ఉ. తొల్లింట నేమినోఁచిరో తోరపువెన్నెల సోనతేనెలం
గొల్లఁగ నానియాని చిటికొమ్మలకెక్కి చకోరదంపతుల్
బల్లవిదాను రాగములఁ బతుచులల్లన విప్పికప్పుచు
న్నెల్లన [illegible] మెల్వలపుల్ప చరించెదారు చుమా.

కార్త: కాంతా! శరత్కాలచంద్రికలు కాముక కామునీజనమనోహరములగుంగావె. అల్లదె! ఆలమ్రాకులసందులం బ్రసరించు శీతకరకిరణములం గనిన,

ఉ. ధారుణిఁ గమ్మినట్టి హిమధాముని తీవ్ర కరప్రతాన మా
స్వారి యొనర్పమారుఁడు నిశాచరుఁడై వలల్గట్టి పాంథ హృ,
త్కీరములం గ్రహించుటకు దీర్చిన మ్రాకుల సందుగొందులం,
దీఱఁగు వెండినూలినులి తీఁగెలొ సందియ మందె డెందమున్.

ఇందు: నాథా! ఆ మ్రాకులక్రిందఁబడిన వెన్నెల లందందు విచ్ఛిన్నంబు లగుటచేఁదరుచ్ఛాయ తిలతండుల న్యాయ్యము ననుకరించుచుండె గదా.

ఉ. మ్రాకుల సల్లిబిల్లిఁ గనమాంతముఁగప్పుచుఁ జుట్టి కొమ్మలం
మ్రోఁకలుకట్టి చంద్రికలు పొట్టలు నిండఁ జకోరపక్షుల
స్తోకముదంబునన్మెసవి ధూయనివెన్నెల వెక్కసంబునై
యాకులసందులందు మిసెనొఁదిలతండుల న్యాయమేర్పడన్.

ప్రాణనాథా! వినోదముఁగ వెన్నెలలందు విహరించుచు నెంతలో మనశిబిరములను జేరవచ్చితిమి. అదిగో నర్మదాతీరము.

కార్త: ఎక్కడ మనగుడారములు! ఎక్కడ మనము! అవి నదీ పరిసరములందలి యిసుకదిబ్బలు. మన మందువేసి కొనిన పర్ణకుటీరములు కావు.

ఇందు: నిజమేనా! మనడేరాలు గావా! సైకతములా! అట్లైన నది నర్మదయుఁగాదు.

గీ. అమృతకరుఁడెల్ల కడలందు నమృతధార
గురియ నిటునటు బడిలోయ గుండఁబాఱు
వెల్లవెన్నెల వెల్లువ విందొనర్చె
కనుల కెంతయు, నర్మద కాదునిజము.

కార్త: పిచ్చిదానా! నిశ్శబ్దముఁగ నుండు రేయి ప్రవాహవేగసంజనితమర్మరధ్వని సుస్పష్టముఁగ నీ శ్రవణగోచర మగుటలేదా. అదిఁగో! ఎవఁడో ఆయిసుక కుప్పపైనుండిలేచెను.

ఇందు: మీ వినోదమిత్రుఁడు [illegible]

( సంజయుఁను ప్రవేశము. )

కార్త: సంజయా!

సంజ: అబ్బా! వచ్చితిరా!

కార్త: సంజయా! మా వెంట వచ్చుచుంటివి గదా! ఎటు మాయమై పోతివి?

సంజ: భార్యాభర్తలు వెన్నెలపచారసేయునపుడు నడుమ ఘోటక బ్రహ్మచారిని నేనేల పాసకములో బల్లవలె.

కార్త: అయిన నేకాకివయి యేమిసేయుచుంటివి?

సంజ: అన్నికాకులవలెఁ గన్నులు మూయుచుఁదెఱచుచు మీదారి నెదురుచూచు చుంటిని. ఏకాకినిగాక మహారాజుఁగ నుండుటకు నోఁచుకోనలెఁగదా!

కార్త: మనమిప్పు డెచ్చటనుంటిమి?

సంజ: ఉండిన చోటనే.

కార్త: మనశిబిరములకెంతదూరమున?

సంజ: మనకు శిబిరము లున్నంత దూరమున.

కార్త: ఔరా నీ పరిజ్ఞానము.

సంజ: మఱేమి! ఈ యడవిలో దారియా, డొంకయా, మైలురాయియా! పర్లాంగురాయియా! అనుపోసు జ్ఞానమున్న నెప్పుడో వెళ్ళి శిబిరములలో హాయిఁగ నొక్క నిద్రి తీసియుందును.

కార్త: సరిసరి! శిబిరములకు దారితెలియక నిలిచితి వనుము. మాకొఱకుఁ గాదు.

సంజ: మీకొఱకే నిలచినది, వచ్చిన కలసి పోవచ్చును గదా యని.

కార్త: ఇఁక భీతిలేదు గదా?

సంజ: ఇఁక, ఆ భీతి లేదుకాని శిబిరములకు సురక్షితముగఁ జేరఁగలమా యనుభీతిమాత్రము కలదు. అబ్బబ్బా! ఏదో సింహము గంతులువేయుచు మనదెసకు వచ్చుచున్నది.

ఇందు: ఔనౌను నాథా! ఇఁక నెట్లు?

కార్త: భయపడ వలదు. అది మనద్వారసింహము. మనలను బసిపట్టి వచ్చినది. మనశిబిరములకు సమీపమునకే యుంటిమి. రండు.

(నిష్క్రమించుచున్నారు)

రంగము: నర్మద తీరమున నిసుకదిన్నపై

(రావణ ప్రహస్త సుమంత శుక సారణులు ప్రవేశము)

రావ: ప్రహస్తా! సుమంతా! ఈ పశ్చిమవాహినియగు నర్మద నెంత వర్ణించినను దీఱదు. ఇందలి నిర్మల శీతల జలము మార్గాయాస పరిశ్రాంతుల కెంతయో ఆప్యాయమానములై ప్రబోధజనకము లగుచున్నవి. ఈ సైకతము లత్యంత మనోహరములై యుమాకాంతునియేకాంత సేవకంతరంగము నుద్బోధించుచున్నవి. నే నిందీ సైకతమునఁ బార్థివపూజ కుపక్రమించెద. భటులారా! మీరలు పంచబిల్వములనుగొని పూజాపరికరముల సిద్ధముంపుఁడు. మంత్రులారా! మీరీచుట్టుపట్టుల రక్షకభటుల నునిచి మన్నియమభంగమున కవకాశము లేనియట్లు కని పెట్టుఁడు. నేను స్నానమొనర్చి వత్తును.

మంత్రిలు: చిత్తము.

(రావణుఁడు నిష్క్రమించును)

(రాక్షసులు పూజకు సర్వమును సిద్ధముంచుచు ఆసనాదిక మమర్చుచుందురు. స్నానముచేసి మడితో రావణుఁడు పరిచరులును బునఃప్రవేశము)

(భటులు "భోంభోంభోమ్మహాదేవ" యనుచు ముందునడుతురు.)

భటుడు: రావణబ్రహ్మ! పరాకు. బహుపరాకు. అఖండవిక్రమోద్దండపిశద్ధతిభుజాదండ నిర్జితాఖండలా! పరివృత రాక్షసమండలా!

రక్షకులు: పరాకు. రావణ బ్రహ్మ. పరాకు.

భటుడు: అపారవిక్రమస్ఫారకుతిశకదోర జయలక్ష్మీవిహార ప్రశస్తనిస్తులవిస్తార నిజవక్షఃకవాటసముద్ఘాటన వక్రీకృతత్రుటిత శక్రమాతంగరదనా! పఙ్క్తివదనా!

రక్షకులు: పరాకు. రావణ బ్రహ్మ. పరాకు. బహుపరాకు.

(రావణుఁడు సుఖోపవిష్టుఁడగుచు గన్నులు మూసికొని పూజకుపక్రమించుచు.)

రావ: భోం. భోం, భోం, మహాదేవ! మహాదేవ! మహాదేవ! దేవాదిదేవా! ఆద్యంతరహితా! అండపిండ బ్రహ్మాండభాండోదరా! ఖండపరశూ! అఖండ సచ్చిదానంద విగ్రహా! వ్యోమకేశా! శరణు- శరణు.

సీ. అంభోజభవశిర స్సంభావిత పదాబ్జ! శంభో! స్వయంభో! నిశుంభశమన!
అంభోధిమథన సంరంభసంభవభీమ విషపాన! ఈశాన! వృషభయాన!

ఖండేందుశేఖర! రుండమాలాధర! దండితదక్ష! వేదండశిక్ష!
ప్రజ్వలజ్జ్వల నేత్రజ్వాలికాజ్వాల భస్మసాత్కృత భావభవ! త్రినేత్ర!

గీ. వ్యాఘ్రచర్మాంబరా! హరా! అఘవిదార
వ్యాళసూత్రప్రశస్త! త్రిశూలహస్త!
భస్మభూషితదేహా! విధ్వస్తమోహా!
భవ్య రుద్రాక్షమాలికా భరణ శరణు.

(తెరపడును)

(జలావతరణ మభినయించుచు శుకసారణులు ప్రవేశము.)

సారణ: శుకా! మనమీ నిర్మల నర్మదోదకముల ననుష్ఠానములం దీర్చికొంటిమి. ఇక మనరావణేశ్వరుని శివపూజాపసాన పర్యంతము యథావకాశ మీయొడ్డున గూర్చుండి మాట్లాడు కొందము రమ్ము.

శుకుడు: సారణా! రణశూరుడగు మన రావణేశ్వరున కిప్పటికి సమవీరుడు లేడని దృఢముగ విశ్వసించుచున్న మనకష్టము లింతటితో నంతరించెను. ఇంక లంకలో నాండ్రబిడ్డలతో నిశ్శంక హాయిగ గూడి సుఖింప వచ్చును. అబ్బా! ఈ దిగ్విజయయాత్రతోఁ బ్రాణములు విసిగిపోయినవి. ఇకనిర్భయము.

సారణ: శుకా! శూరులు సుఖనిద్రనోదురు. చారులగు మనకు సదాపర్యటనమే కాని యొకచో నిలుకడ యెక్కడిది?

శుకుడు: నిలుకడ లేకున్న మానెఁ గాని నిర్భయముగ నుండవచ్చునుగదా!

సారణ: అట్లని నిద్రించుట కవకాశముండునా! చారచక్షులగు ప్రభువులు సదా అప్రమత్తులై శుభములం బొందుదురు. చారులు ప్రమత్తులైయుందురేని దేశమునకుఁ బ్రభువునకు నెన్నియే యనర్థములు కలుగవచ్చును.

శుక: ఇదేమి నదియెక్కివచ్చుచున్నది! శరత్కాలమునం దిట్టివైపరీత్యమునకుం గారణము!

సార: ఆశ్చర్యమాశ్చర్యము! పశ్చిమవాహినియగు నది తూర్పునకుం మఱలుచున్నయది చూచితివే?

సార: అయ్యో! ఆ యిసుకతిన్నెపై గూఁడవేసిన నా మడిపంచెలు నెల్లువపాలాయెనే. ఇక నెట్లు?

శుకుడు: నీవస్త్రములమాట ట్లుండని. చూడు. చూడు. రావణబ్రహ్మ ధ్యాననిష్ఠుడై కూర్చుండిన దిబ్బపైన మనరాశివోసిన బిల్వము లేటిపాలై పూర్వాభిముఖములై పోవుచున్నవి. ప్రమాదము! ప్రమాదము! రమ్ము, రమ్ము.

(నిష్క్రమింతురు)

(ప్రహస్తసుమంతులు ప్రవేశము.)

ప్రహస్త: సుమంతా! ఇది కడుచోద్యము. సముద్రము పొంగి నదీజలముల వెనుదన్నుచుండెనో, ఇదియేమి ప్రమాదమో తెలియకున్నది.

(శుకుఁడు ప్రవేశించును.)

సుమం: శుకా! ఏమి సమాచారము

శుకుడు: ఇంక నేమి? గానణజ ప్రహ్మకుఁ దలనుసుకలుఁగ నీరువచ్చినది. శిఖమాత్ర మగుపడుచున్నది. పార్థివపూజానిమగ్నమానసుఁడై సుస్థిరుఁడై యట్లే కూర్చుండియుఁ జేతులతో బ్రమాదమునకుఁగారణ మరయుఁడని సంజ్ఞమాత్రము చేయుచున్నవాఁడు. ఇది వియద్గమనమున బశ్చిమదిశకుం జనుచుంటిని. సారణుఁడునాకంటె ముందుఁగ వెళ్లినాఁడు.

(నిష్క్రమించును.)

ప్రహస్త: నీబుద్ధి కేమని తోఁచుచున్నది?

సుమంత్ర: ఇదంతయు ననర్థావహమని తోఁచుఁచున్నది. పశ్చిమాభిముఖియగు నది పూర్వాభిముఖమై ప్రవహించుట కంటె వైపరీత్యముండునా? ఏదియెట్లున్నను మనకిది యశుభసూచకమని మాత్రము చెప్పఁగలను.

ప్రహ: మన కశుభసూచక మెట్లు?

సుమం: మనరావణేశ్వరుని పార్థివపూజ సాంతముఁగా నెఱవేఱునని యనుకొనను. దానికి విఘ్నముకలిగిన, ఆవాఁడు మనకపజయము సిద్ధము.

ప్రహ: ఇంతియేకదా: ఈయొక్కనాఁడు తెలిసి తెలిసి మన మట్టిపనిఁ బెట్టుకొననేల? మనపైకి వచ్చినవాఁడు శూరుఁడుండినఁగదా మన కా భయము. అదిగో! సారణుఁడు వచ్చుచున్నాఁడు చూడు.

( సారణుఁడవగరించుచుఁ బ్రవేశము )

సుమంత్ర: సారణా సారణా! ఏమి సమాచారము! ఏమి సమాచారము!

ప్రహ: ఎందుకా యాయాసము?

సారణ: వింతలలో వింత! ఎన్నడును గని విని యెఱుంగని వింత!

ప్రహ: ఎట్టిదావింత?

సారణ:

క. మాహిష్మతిపతి యర్జును,
బాహుసహస్రములకు జిక్కుఁ బడి యాలీలం
వాహిని మఱలెను సుడివడి
యూహింపుఁడు గార్యసరణి యోగ్యులు సచివుల్.

( తెలుగు "ఏమిటిరా అది- ఏమిటిరా" వరుసని )

ప్రహస్త॥ అదేమినుడు. అర్జునుఁ డనుశబ్దము కర్ణతాడనమయిన మాత్రమునఁ దోకద్రొక్కిన కాలసర్పమువలె బుసకొట్టుచు హరిణశబ్దమువిన్న కేసరివానిఁ దలలువిసరుచు శివపూజనంతటితో జాలించి రాక్షసేశ్వరుఁడు జలములనుండి లేచివచ్చుచుండెను.

( రావణుఁడుప్రవేశము )

రావ॥ సారణా! ఏమిసమాచారము?

సార॥ దేవా! దశకంధరా! కార్తవీర్యార్జునుఁడు—

రావ॥ మఱల. ఆ పందమాట యేల?

సార॥ దేవా! ఇంతయనర్థమునకు నతఁడే కారకుఁడు.

రావ॥ అదియెట్లు

సార॥ దేవా!

శా. నారికీడఁకుఁదొట్టి యర్జునుఁడు తాభార్యాన్వితుం డేటిలో
నీరుంజాలమి చూచి వేయికరముల్నిండార నడ్డంబుగా,
దారిం దా నరికట్టె యాహేఁనది ప్రోవంగాన కీర్తిచూ.డ,
బీరంబేదిపిఱుందకున్మఱలెఁ బృథ్విం వింతలొప్పెండెనే.

రావ॥ శుకుఁడేడీ?

సార॥ దేవా! శుకునింబట్టి కట్టివేసిరి.

రావ॥ వివరింపుమెట్లు.

సార॥ కార్తవీరార్జుని భటులు. ఏకాంతమున నిజకాంతలతో మాహిష్మతీకాంతుఁడు జలక్రీడలాడుకడకు సాహసించితి రని పట్టుకొనవచ్చిరి. నేనెట్లొ ట్లో తప్పి యీవలఁ బడితిని. శుకుఁడుచిక్కువడెను.

రావ॥ మంత్రులారా! దండనాథులారా! ఈ క్షణమే మనసేనల నచ్చటికి నడుపుఁడు. నడుండు (తెరపడును)

రంగము: నర్మదయొడ్డు, కార్తవీర్యునిశిబిరము

( కట్టువడినశుకుఁడును: భటులు: ప్రవేశము )

భటుఁడు॥ నీపేరేమంటివి? శుకుడఁవా? అయ్యోశుకమా! దిక్కులేనిపక్షివై తివే! నీకు రక్షకమగువృత్తి యేది?

శుకుఁడు॥ ఏలతొందర? దానిఫల మీరనుభవింపకపోదు!

భటుడు: ఆవృక్షఫలమును మేమనుభవించిన నీకు నద్దానియాశ వదలుకున్నట్లేకదా. ఇట్టి నీకుగట్టివేసిన యాకంటక వృక్షమేదిక్కు.

భటుడు: ఒక్కనినిందలు చిక్కించుకొనుట యక్కజమా?

భటుడు: ఒక్కడనియూరకుండక ఊరునివలె మహారాజ పరివారము నేమతింపనెట్లుసాహసించితి? ?

(తెరలో "పట్టుము, కొట్టుము" అనుధ్వని)

( రాక్షసులుప్రవేశము. భటులంగొట్టిశుకుని విడిపింతురు. దండనాథుడొక ప్రక్కనుండియు రావణుడుమఱొకప్రక్కనుండియు బ్రవేశము )

దండ: ఓరాక్షసులారా! మీరలెవరు? ఎందులకీదౌర్జన్యము?

రావ: ఓరీనీవెవరవు? ఈసైన్యమెవరిది! మొదటజెప్పుము.

దండ: ఓరిరాక్షసాధమా! మావర్తమానమును గోప్యముగనుంచుకొనవలసిన యావసరము మాకులేదు. జగద్విదిత ప్రతాపసహస్రికరుడగు కార్తవీర్యార్జునచక్రవర్తి దియాదండు. నేను దండనాయకుడను.

రావ: అయిన మీరాజేమి సేయుచున్నవాడు?

దండ: ఏమిసేయుచున్న నీకేల? నీవువచ్చిన పనియేమి?

రావ: యుద్ధమునకు.

ఉ. రమ్మనువెళ్ళి నీవిభువుని రాక్షసనాథుడు రావణుండునిన్
రమ్మనెనంచుదెల్పు సమరంబునకుం, దరికాదుతెల్పగా
నిమ్మెయిఁగోర్కెయున్నగల నే నరణమ్మును కోరి! నీతలల్
దిమ్ముపదల్తు ద్రుంతు నరుదెమ్మనెడేల యిదంతకే ఖలా.

దండ:

రావ: సుమంతా!. వానింబరామర్శింపుము.

సుమం: ఓరిదండనాథా! వేనుదీకనిలుము.

(తెరపడును.)

దండ: మాటలేలరమ్ము. ( ఒండొరులందాకుదురు )

ప్రహ: ఓరిదండనాథా! ఎందుబోయెదవు? సుమంతుడు సామ్మసిల్లిన మాత్రమున నీకార్యముతీరెనని తలంచితివా? ఇదెనేగలను.రమ్ము.

దండ: నీవునువానితో నుండవలసిన వాడవేరమ్ము. ( తారసిదురు )

( తెరపడును. తెరలో "దండనాథుడు సొమ్మసిల్లెను." హాహారవములు )

( తెరలోఁ గలకలము. మహారాజా! రక్షింపుము రక్షింపు మనుధ్వని. )

( కార్తవీర్యార్జునుఁడు ప్రవేశము. )

ఓహో! రాక్షసబిడాలములు మనబిడారములఁ జొరబడినట్లున్నవి. శుకవాణులారా! మీరు మీమీ యం శుకములను ధరింపుఁడు. పూఁచినిఁనకింశుకములవలె మనమొనలగుపడుచున్నవి ఎవడురానాడు.

భటుడు: ప్రవేశము. భటుడు దేవా! రక్షింపుఁడు. రక్షింపుడు.

కార్త: ఏమి ఆ కోలాహలము.

కం. రావణుఁడట దేవరతో
నావహమొనరింప వచ్చినాఁడఁట నుసనె
నావిభునిఁ గెడపిమూకలఁ
గావించిది 'యారునేను' గామనురాజేంద్రా.

కార్త: అట్లనా! నీవు సత్వరముఁగవెళ్ళి నాధనుర్బాణములం గొనిరమ్ము. పొమ్ము.

( నిష్క్రమింతురు )

( రావణుఁడును భటులును ప్రవేశము )

రావ: సుమంతా! ప్రహస్తా! ఇప్పటికివాని బలము సగముసమసెను. సగము చెల్లాచెదరై బెదరుగదుర సెం దందో పరుగెత్తిరి.

ప్రహ: ఇఁకనుగార్తవీర్యుఁ డెక్కడున్నవాఁడు. వాఁడునునింతవఱకు గనుపడమిఁజూడ నెందైన బారుబోక్కి యుండనోపు.

సుమ: వారిజాక్షులంగూడి నాకికేళిందవిలి వారిమధ్యమున నుండెనని మింటెవిగదా.

రావ: అట్లైన నంగనలతో గంగపాలయినట్లే. ఇంకెక్కడి యర్జునుఁడు?

(కార్తవీర్యుఁడు ప్రవేశము.)

కార్త: ఇఁకనెక్కడి రావణుఁడు?

రావ: ఔరా! వచ్చితివా! నీటుకత్తెలతో నాటలాడి యలసితివికాబోలు. రమ్ము. రమ్ము.

ఉ. చిక్కితి వెందుఁబోఁగలవు సిద్ధము నీకిఁక మృత్యువు వర్జునా!
యిక్కడనీకు బ్రహ్మవిధియించెను జావు లభించునెల్ల నీ
కక్కడ, నీరుసొచ్చినను, నంగసలుం బ్రతిమాలుకొన్న బల్
టక్కరలెన్నివన్నిన నడంతును నిన్నును నీదుసేనలన్.

నీకొఱకై తిరిగితిరిగి వచ్చితిని.

కార్త: పాపము పాపము! మిగుల నాయాసపడితివి. మృత్యుదేవత మీకే నదియొడ్డునఁ బీటలమర్చినది. పఙ్క్తికంధరా! నీపఙ్క్తి కందఱని బలిపించికొనుము. వధింతును.

గీ. బాపురే నీవు మాహిష్మతీపురమును, నుండియుండిన నీపాటి కొద్దైనంబు
మఱినీజీర్ణించి యెముకలు మొకలుగాఁగ జూర్ణమై యుండెడివి వేరుసుద్దులడఁగ.

సీ. మాటలతోనేమి మగఁటెనిజూఁపుమా మాటలు మానిమలసొగసు
నాఁగఁబోతుకుఁ బ్రియాభాగమేశౌర్యము వదరుడు మొందున్న మెదడునున్న
నాలుకయాలోచనా భాగమున కష్టు, నాల్కగెల్చిన భువనములఁ గెలుచు
ఒకనాల్కవశము నందునుచుకుకష్టము, పదినాల్కలను బిగఁపట్టుటెట్లు,

గీ. రమ్మ మాఱాడ కాహవరంగమునకు నొకటి నేఁబదిచేతుల నొడిసిపట్టి
విసరినైచెదఁ గాలుని వీటఁబడఁగ దూతలవసరమేలేని రీతిచెనఁటి.

(తెరపడును)

రావ: అయినఁ గాఁచికొమ్ము. ఇదెనాగదవేటు.

(తెఁయెత్తిగా మూర్ఛితుఁడగు దశగ్రీవుఁడు. కార్తవీర్యుఁడు.)

కార్త: దండనాయకా! పగ్గము లిటుతెమ్ము. పగ్గములతో రావణుని బంధించి ఈదశగ్రీవుని మనరాజధానిచెఱసాల యందునిచి భద్రముగఁ గనిపెట్టునది. నేను తేపఁ జెల్లుండిలో మాహిష్మతికి వచ్చువాఁడ.

దండ: చిత్తము

(నిష్క్రమించును)

[ నారదుడు ప్రవేశము. ]

కార్త: నమోనమః నారదమహర్షి!

నార: దిగ్విజయోస్తు! మాహిష్మతీపతీ! దశగ్రీవుఁడు నీపైదాడివెడలి నిర్జితుఁడగుట తెలియవచ్చెను. వానినే జూఁడవచ్చునా?

కార్త: లేమ కభ్యంతరమా! ఎవడురా, అచ్చట?

భటుడు: చిత్తము మహాప్రభూ!

కార్త: కట్టినకట్టులతో రావణునిఁదెమ్మని దండనాథునితోఁజెప్పు.

[ భటుడు వెళ్ళును, రావణుని తెత్తురు. ]



కార్త: రావణా! నిన్నుజూడ నారదమహర్షి వచ్చినాడు.

( రావణుఁడు మౌనముగనుండును )

నారదా: ఇతఁడు రావణేశ్వరుఁడేనా! నిజమా! అర్జునా! నా కన్నులను నేను నమ్మలేకున్నాను. నిజపరాక్రమవిజిత పురందరుఁడు, దశకంధరుఁడా యితఁడు? ఔరా! జయాపజయములు లోకసామాన్యము కాదుగద. అర్జునా! నీవు పౌరస్త్యుం జయించితివన్న నేనమ్మలేదు.

కార్త: ఇప్పటికైన నమ్మితిరే?

నార: ఇది పోరుఁబాటని నా యభిప్రాయము. భద్రగజము తృణసమూహబలమున గట్టువడుచుండలేదా? నరభక్షకులు నరమాత్రులచేఁ గట్టువడుటట్టిదె. ఇది ధర్మయుద్ధమగునా?

కార్త: అట్టియనుమానము మీకక్కఱలేదు. వలయునన్న దశాస్యుని కట్లువిడిపించెదను. ద్వంద్వయుద్ధమున మఱలనన్ను గెల్చినజాలును.

నార: దశాస్యా! నీకు సమ్మతమేనా?

రావ: ఒకమాఱు నిర్జితుఁడగువాఁడు నిర్జితుఁడే. యుద్ధమునందింతటి న్యాయబద్ధుఁడగు కార్తవీర్యార్జునితో సమయము దొరికినదని మఱల సమరము తలపెట్టుట న్యాయముకాదు.

నార: సెబాసు సెబాసు రావణా! పరాజితుఁడవయ్యును శూరధర్మమనుసరించి వచించితివి. అర్జునచక్రవర్తీ! జయాపజయములమాటయటుండుఁగాక. నీవిట్టి శూరుని నెందేని చూచియుంటివా! నేను సత్యలోకమునకు వెళ్ళుచున్నాను. అక్కడ మీయిరువురి పరాక్రమము నభివర్ణించి మా తండ్రి బ్రహ్మకు ముదమొసఁగూర్చువాఁడ. రాజేంద్రా! నాకీ రావణేశ్వరునితో నొకటి రెండు రహస్యవచనముల కవకాశముండునా?

కార్త: అది కభ్యంతరమా. ఇదె మేము వెళ్ళుచున్నాము.

( నిష్క్రమింతురు )

నార: రావణా! నేను సత్యలోకమునకు వెళ్ళుచున్నాను. మా తండ్రితో నీకుఁ గలిగిన దురవస్థ....

రావ: వలదు. వలదు. నా ప్రస్తావ మచ్చట యెత్తవలదు.

నార: నీకుఁ దెలియదు. ఇట్టి టక్కటొంకి వరము తానిచ్చి అమాయకుని నిన్ను గడగండ్లలో దింపనేల. పాపము! నిన్ను జూచిన నాకుఁ జాలివేయుచున్నది. నిన్ను విడిపించి తన తప్పు తానే దిద్దుకొనును గాక.

రావ: ఇది యతని తప్పుగాదు.

నార: తెలిసెను. తెలిసెను. నరులెంత మాత్రమును నలక్ష్యబుద్ధితో దజ్జయమునపేక్షింపవుగాబోలు. అపేక్షింపకున్నదప్పా! జేజేపెద్ద కింతమాత్రమింగితజ్ఞానము లేకపోవలెనా? చూతును గాక. కర్మగతి దప్పించ నెవరితరము? త్వరలో నే విముక్తుఁడగుదువుగాక. వెళ్ళెదఁ.

( తెరపడును )



సంపాదకులు, ప్రకాశకులు: కే. బాలకృష్ణారెడ్డి ముద్రాపకులు: చంద్రికాంత ప్రెస్ గాలీగూడ హైదరాబాదు.

# విషయ సూచిక

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు. డాక్టరు. కే. ఎన్. కేసరి.

పోస్టు బాక్సు 752, ఎగ్మూరు. మదరాసు.

"గృహలక్ష్మి" యను సచిత్ర మాసపత్రిక యీ సంవత్సరము మార్చి నెల నుండి వెలువడుచున్నది. ఇందు ముఖ్యముగా భారత నారీమ తల్లుల ఆయురారోగ్యముల పెంపొందించు విషయములు చర్చింపబడును. స్త్రీలు పురుషులతో సమానవ్యక్తులనియు శరీర మనోబలముల యందెందులను తక్కువవారు కారనియు నిరూపించుటయే మా యుద్దేశము. ఎల్లభంగుల స్త్రీయుద్యమమునకు తోడ్పడుటయే మా యభిప్రాయము. స్త్రీలు స్వీయ స్వాతంత్ర్యమునకై ప్రయత్నించుచుండు యిప్పటి పరిస్థితులందు మా గృహలక్ష్మి వంటి పత్రిక యత్యంతావశ్యకమని తెలియగలదు. ప్రతిమాస సంచికయందును, స్త్రీల కెంతయు హితమొసంగు వ్యాసములు, కథలు, నవలలు, పద్యములు, వివిధ విషయములు, మరియు నిత్యోపయోగకరములగు అంశములు గలవు. చిత్ర విచిత్ర పటములతో కూడి మేలుకాగితములపై ముద్దులొలుకుచక్కని కూర్పులతో ముద్రింపబడి ప్రచురింపబడును. ప్రతివనితారత్నమును తప్పక చదివియే తీరవలెను. ఈ పత్రికకు చందాదారులుగ చేరియు, వ్యాసముల వ్రాసిపంపియు, మా యుద్యమమునకు తోడ్పడవలెనని దేశాభిమానులగు సోదర సోదరీమణులను కోరుచున్నాము. స్త్రీల యశోవృద్ధికి స్త్రీలే కొంతవడి శ్రమబూని తోడ్పడిన, బంగారమునకు పరిమళ మబ్బినట్లు గృహలక్ష్మి ప్రతి గృహమునందును లక్ష్మియై విరాజిల్లగలదు.

సం॥ చందా రు. 4 విడిపత్రిక. అణాలు 6.

---

## త్రివర్ణ చిత్రములు

పలువురు కోరినందున మరల ముద్రింప బడినవి. కొలది ప్రతులు మాత్రమే

త్వర పడుడు! ఆలసించిన విచారపడవలసి వచ్చును!

శ్రీ మురళీ కృష్ణుడు (సుజాతలో వేయుటకు ప్రత్యేకముగా కలకత్తానుండి తెప్పించబడినది) ప్రతి 1కి వెల 0-2-0

మేనక (సుప్రసిద్ధ విదుషీమణియగు శ్రీమతి రత్నాల కృష్ణాబాయి, బి. ఎ. గారిచే చిత్రింపబడిన మనోహరమగు త్రివర్ణచిత్రము. ప్రతివారును చూడదగినది.) ప్రతి 1కి వెల—2—0

ప్రభావతీ ప్రద్యుమ్నులు (సుజాత కొరకు ప్రత్యేకముగ, బందరు జాతీయ కళాశాలయందు చిత్రలేఖన మభ్యసించిన, శ్రీమాన్ కె, రామాచారిగారిచే చిత్రింప బడినది.) ప్రతి 1 కి వెల 0-1-0

రత్నాల కృష్ణాబాయి, శివరాజబహద్దురు, భద్రాచల దేవాలయము, గోదావరీ దృశ్యములు, కాశ్మీర దృశ్యములు, రామప్ప దేవాలయములోని విగ్రహములు, ఓరుగల్లు లోని కృంగిపోయిన దేవాలయము, ఓరుగల్లు ప్రసిద్ధ సహస్రస్తంభ దేవాలయము—నాట్యమాడుచున్న వినాయకుడు, కాకతీయ రాజ మందిరము, మొదలగునవి. ప్రతి ఒక్కంటికి 0-0-6

సూచన:—అర్ధరూపాయకు మించని బొమ్మలు తెప్పించుకొనువారు ముందుగనే డబ్బు, పోస్టేజికి గాను అణా సహా టిక్కెట్లు రూపమున పంపిన సులభము. లేనియెడల చాల ఖర్చగును. ప్రకటన రేట్లు పలువురు కోరినందున తగ్గింపబడినవి. వివరములకు నేడే వ్రాయుడు. ఉత్తర ప్రత్యుత్తరములు మనియార్డర్లు మొదలగునవన్నియు, ఈక్రింది వారిపేర వ్రాయవలెను.

మేనేజరు, "సుజాత" గౌలీగూడ, హైదరాబాద్ (దక్కన్)



## హైదరాబాదు, జూలై ౧౯౨౮

సంపుటము ౨ — శా. శ. ౧౮౫౦ విభవ సంవత్సర ఆషాఢము — సంచిక ౭

# కవి: వేదుల సత్యనారాయణ శాస్త్రి

## 'సన్యాసి'



కవీ! మేమందరము ఏదో విధముగ జీవించుచున్నాము సౌఖ్యముగనున్నామనే మేము అనుకొనుచున్నాము. మా జీవితము కొండ వాగువలె ఒకతరి కఠిన భూతలమునుండియు, మరియొకతరి సైకత మృదుశయ్యపైనుండియు వేగముగ ప్రవహించుచున్నది. దీని ఉత్పత్తిస్థానమెద్దియో, గమ్యస్థానమెద్దియో మేమెఱుగము. తెలిసికొనవలయునని ఉత్కంఠయునూ లేదు. మాజీవితాకాశమున ఘోర జీమూత పటల ఫెళఫెళార్భటులు లేవు. ఒకే విధముగ జరిగి పోవుచున్నది. మా జీవితము ఒకప్పుడు విద్యుద్ద్యుతిచ్ఛటా విభవమై వెలుగొందదు. మరియొకప్పుడు భూరి తిమిరాంధకారమై వెఱపు గొల్పదు.

కవీ! నీ జీవిత మట్లు కాదు. ఆ జీవిత వాహిని ఎటనుండి ఎటకు ప్రవహించుచున్నదో, తెలిసికొనవలయునని గురూత్కంఠత నీకు కలదు. జీవిత పరివాహ గమ్యోత్పత్తులు కనుగొనుట రహస్యములు. అగోచరములు. జీవిత రహస్యము దుర్భేద్యము, దురూహ్యమని యొకరు చెప్పినను వినవు గదా!

కవీ! అందుచే ఏమైనది? నీవు ఒక దుస్సాధ్యమైన వస్తువు కొఱకు అన్వేషణ ప్రారంభించినావు. తృప్తి కలుగ లేదు. తృష్ణా పీడితుడవై, ఉత్కంఠోద్ధూత డోలాయమానసుడవై, జీవితస్రవంతి కెదురు తిరిగి జీవిత తత్త్వము నరయ బయలు వెడలినావు. మేమో, జీవిత ప్రవాహమున బడి వెను తిరిగి చూడక ఝరీ వేగమున అంచులమై కొట్టుకొని పోవుచున్నాము.

కవీ! నీకేమి కనుపించినది? కుసుమ రాజిత విభూషిత వనములా? దుడుకు కోయిల యెల పాటలా? ఫుల్ల సితాంభోజ కైరవోల్లసిత కాసారములా? కాదు—కాదు. నీవు కఠిన కాంతారములను, పర్వతోగ్ర గాటవులను విష వృక్షములను గంటివి. ఏమి వినుపించినవి? కోయిల పాటలు గాదు. దివాంధముల యొక్కయూ, వాయసముల యొక్కయు కఠిన కర్ణరావములు. కాని నీవు చూచినదే నిజము.

కవీ! నీవు అపుడేమి చేసినావు? ఈ ప్రపంచములో భౌతికముగ నీకున్న సంబంధ బాంధవ్యములను శల్య పరీక్ష చేసినావు. అన్నియు సడలినవే. ఆ సంఖ్యాకములగు జీవు లీ ప్రపంచమున [illegible] వారు స్వార్థపరులు. వారితోడి మైత్రి సామాన్యులకు కాని, ప్రేమైక జీవివైన నీకు సామాన్య మైత్రి ఎట్లు సుఖావహమగును? అందు కనే నీవు స్నేహము ప్రయోజననిమిత్తమాత్రమనిఅన్నావు.

ప్రేమైక నిదానులు లేనపుడు నీకు సుఖ మెక్కడిది? ప్రేమ శూన్యమై, జీవితము దుఃఖభాజన మని నీవు ప్రకటించినావు.

ఇంకేమున్నది, తండ్రీ! నీ జీవితాకాశమును, భీకర జీమూత పటలి ఆవరించినందున అంతయు అంధకార బంధురమై పోయినది. ఆవిష వృక్షముల దుఃఖంపుఛాయలు నీ జీవిత ప్రవాహముపై బడినవి. దివాంధములు భయంకరముగ రోదనము గావించినవి. ఇట్లయినది. ఇక నీకు తృప్తి యెట్లుండును?... ఆశ నశించు టెట్లు? పిపాస తీరు టెట్లు? మాయగా రాని జీవితాశా విపంచి నేమి చేయగలవు? అందుచే నిరాశా జనిత విషాద ఛాయా ముద్రిత వదనాంభోజముతో, కంపితాధరమునుండి వేడి నిట్టూర్పులు విడుచుచూ, శూన్యవీధులలో శుష్క హృదయముతో బయలు దేరినావు.

హృదయగతమైన దుఃఖమును ఎంత దిగమ్రింగినను పైకుబుకక మానునా? కొండవీటి జలాపాతమువలె ప్రవహించు భావోద్రేకమును ఆపుకొనుట ఎట్లుసాధ్యము? అందుచే నీ హృదయ వేదన కావ్యరూపమును ధరించినది. అపురూప విచిత్రానుభవముగల నీకు సామాన్య కవితా సామాగ్రి నిరుపయోగము. అందుచే నిరుపమానమైన కవితా సామగ్రిని చేకూర్చి విషాద గీతికల రచియించినావు.

ధన్యుడా! నిన్ను జూచి మేము నవ్వినాము. ఈ న్మా ను వన్నాము. పెదవిపై అచిరునవ్వేమి, విషాద గీతిక ‘లేమి’ అన్నాము, పొంగి పొరలు సంద్రము ననుభవించు చున్నదని తెలుసుకొని అట్టి గంభీర దృఢబాష్ప శిఖలు, ఎవరు దూరి చూడగలరు సఖుడా? అన్నావు.

కవీ! నీ హృదయాంతరంగిక జీవనము గుర్తించుట మానుషంబున దుస్సాధ్యమని ఎఱుగలేక పోయినాము. ఇంత పిన్న వయస్సున నీ పెనుదుఃఖమేల యుండునన్నాము కాని

“దిన ములు పరస్పర ప్రతిధ్వనులు గాగ
ఇరువదైదేండ్లు నా బ్రతుకిట్లు గడచె
ఈ రహోదుఃఖ వీధులం దే నెఱుంగ
సఖుల యుసుగుల జాడలీసరిని గూడ.”*

అని నీ వనిన పరిదేవనంబు మేము గమనింప మైతిమి.

కవీ! నీ లక్ష్యము ప్రేమ. సుఖానుభవము కొఱకై నీ వన్వేషించి నావు. భౌతికముగ చేరరాని ప్రేమకై చేతులుచాచిన నీకు దుఃఖము కాక మరేమి? కాని భీకర జీమూత ఘోర ఘోరార్భటులలో మెఱుపున్నట్లు, కారు మేఘావృతమై యున్న నీజీవితాకాశమున అపుడపుడు, లిప్తమాత్రమున ఒక్క మెఱుపు మెఱసి, పోవుచుండును. అప్పుడు,

“బ్రతికి నన్నాళ్ల కీ ముహూర్తమున విరిసి
తొలి వలపుమించు జీవమాధుర్య రుచులు”

అని నీవనుకొందువు.

“మిగుల కంపించు నీ వేన మేను నవుసు
సుషుమ్న పులహా స్తమేది మోనిమియుచుండ”

అని అచ్చెరువొంది,

“ఈ అమృత మూర్తియెటువచ్చెనిచటకనుచు
అడిగితివి మూగ ముగ్ధ తారాళినెల్ల”

* దీపావళి.

† తత్వమసి.

కాని సుఖపు నీడలు ప్రకృతి హృదయాన సుఖ వర్తన ము సలుపు ప్రేమమును జూపి అవి దాసనే మునిగెను. అపు డు నీవు చూచితివి, స్నేహపులకితజ్యోతి కడను విశ్వమొ క చిన్న మిణుగురయై వెదకి కొనుట. కాలు కదపితివి అట కేగ కాంక్ష. అపుడె యతి కఠినహస్త మేదియో నిన్నా పివైచె. సుఖపు కీనీడలు మాయమైనవి. నీ కాంక్ష తీరలే దు. నీవు అపుడు 'ఈ అల్పజీవికి ఆ ప్రశాంతి లభించు భాగ్యంబె లేదు.' అని విలపించినావు. కవీ! నీ దుఃఖము ను, నీ విషాద గీతికలను మా హృదయాంబుధిని కలచి వైచినవి.

నీ చిగురు కేల నా భుజంబు స్పృశించినావు.'

అనియూ,

* "ఆ మధుర కార్తిక చంద్రికా మనోజ్ఞ
శారద విభక్త యామినీ సమయమందు
ఇరువురము గూడ బహుకాల పరిచితులము
వోలె తొలిదృష్టి నేకమై పోయి నాము."

అనియూ, ప్రణయ విమానంబు నధివసించి వెడలినాము, అనియూ, అందువు! ఈ వాక్యము లెవరిని గురించి కవీ! ప్రణయ పురస్సరముగా నన్నవా! లేక నీకొక ప్రి యురాలున్నదని మేమూహింప వలయునా! అట్లనయి నో ఆమె పేరేమి? కాని నీ జీవితమునకు సుఖమొసగు ప్రియురాలి నెక్కడను వర్ణించి యుండలేదే! ప్రేయసీ యనియైన బిలువలేదే! నీ హృదయాంతరాళమున నెవ్వతె నైన గాఢముగ చిత్రించి కొనినచో ఆమెను వర్ణించక మానుదువా! లేదు నీకు ప్రియురాలు లేదు. మరి యెవరిని గూర్చి యీ మాటలు?

కవీ! ఈ శుష్క వాదము లేల? మందమతినై యడి గితిని. ఇపుడు తెలసినది. నీవు దేనికై అన్వేషించినావో, దేనికొఱకై పరితపించినావో, అట్టి ప్రేమ స్వరూపిణియగు సౌఖ్య దేవతనే హృదయ పీఠమున ప్రతిష్ఠించి ఆరాధన మొదలు పెట్టినావు. నిన్ను చిగురు కేల స్పృశించినది ఆదేవియె ఆ దేవినే నీవు,

× 'మరపు దట్టిన కాలంపు మడత లందు
పాడువడినట్టి బహుజన్మ పరిచయంబు
నామలిన బాష్పగుంఫిత ప్రేమసూత్ర
కలితమై నీదు పాదాల కౌగలించె'

అన్నావు. అనుభూత సుఖము అందరానిది కా బోలు: అయ్యో! కవీ! హృదయమును చీల్చుచున్నావే. ఆమె నూనిన్నెగదూ, పసనుడు మృగలవాసంత పరిమళోర్మి కలలోడబాధలేకుండ బంధించివైచినది? కాని ఆదేవిదర్శ నము క్షణికము. అంతలో క్రమ్ముకొనె మృత్యుకైశిక కాళిమంబు. వృద్ధ సంధ్యా తపస్విని పెదవి విరిచే జారి పోయెను ఆమె స్మిత చ్ఛాయలును, వదలితివి; నీ సు ఖాంత జాగ్రదవస్థ. కవీ! సౌఖ్యము క్షణభంగురమని, అతి చంచల మని, చెప్పినావు.

అట్లు చెప్పి ఏల నీవు ఉన్మాదునివలె † లలిత యౌవన హృదయ దళాల నెల్ల మిగిలి పోకుండ తునిమి ఆమె కఠిన పాదములు ధూళి సోకకుండ పరచితివి? ఏల పులకిత హృదాంతరమున సుప్పొంగిపోవు నిండుప్రా యంపు తలపు లన్నిటిని గోసి దండలుగ గుచ్చి ఆమె మెడ నిండ వైచినావు? అయ్యో! పిచ్చి కవీ! ఎంత యుప్పొంగి యెగిరి పోవుదో అంత కంతకు నధఃపతనమే నీ కయ్యెగదూ.

ఏల నీవా సౌఖ్యదేవతను ఆరాధించెదవు? ఆ ప్రేమ మూర్తి కొఱకు, ఆ సౌఖ్యదేవత కొఱకు నీవు దేహాత్మ దురభిమానములను నీమలిన గాఢ దుఃఖమును, అక్కరకురాని యౌవనంబును, జాలిని గూడ వదలివేసి

* నిష్కృతి.
× ఏదైనా ఒకటే.
† నిష్కృతి

నావు? ప్రేమ దేవతను, నిశ్చల భక్తితో ఆరాధించినావు. కాని మృగతృష్ణ వోలె నది కనుపించి సమీపించిన కొలదిని దూరస్థమగుచుండెను. పర్వత గుహాలలో బుట్టిన ప్రతి ధ్వనులవలె ఆ దేవి వాక్కు వినుపించినను, ఆ వ్యక్తి మాత్రము దర్శనమీయదు. అపుడపుడు ఆమెయే నిన్ను గని క్రీగంట నవ్వినది. ఆమెయే అమృతమూర్తి. ఆమె మృదుల హస్తమే నిమిరినట్లు నీవు భ్రమపడుదువు. కాని విధి తన కఠిన హస్తముచే నిన్నదిమి వైచినది.

ఇట్లు నీవు సౌఖ్య దేవతచే తిరస్కరింపబడినావు. నీ ప్రేమా పిపాసలకీ మృగ తృష్ణ ఏల నుపయోగించును? అంచుచే నీ తృష్ణ తీరక నిన్ను బాధించుచున్నది. తీరని కోరిక, తృప్తి పడని మదనాగ్నివలె హృదయమును దహించుచున్నది. నీ జీవిత మంతయు దుఃఖ మయమై పోయినది. ప్రపంచమంతయు ఆనందములో ఉయ్యాల లూగు సుదినము సయితము నీకు దుఃఖ సంజనకము. ఎందుచేతనన నీకు అనుభూత సుఖము లేదు. దుఃఖము హృదయములో వేళ్లు పాతికొని పోయినది. గడచిన జీవితములోను గడువనున్న జీవితములోను దుఃఖమే కాని సుఖము లేదు.

అందుకనియే కాబోలు దీపావళినాడు జగతియంతయు మహోత్సవమునందు మునిగి పొంగిపోవుచుండ

"కారుకొన్న యమావాస చీకటుల నడుమ
నేనొకండనే యీ శూన్య గృహమునందు
అదురు వడి పోయి మరణ వాద్యంబు లట్లు
గుండియలు కొట్టుకొన నేడ్చు కొనుచున్నాడ."

అన్నావు. అందుకనే కాబోలు,

+"తెగిపడిన పూల దండ లెత్తుగ సమర్చి
యంధకారంబు సందిట నదుము కొనుచు,
ఎవరి కొఱకొ పదే పదే యెదురు జూచు
నా యెద కొనర్తు కృత్రిమానంద భిక్ష"

అన్నావు, అందుకనే కాబోలు,

"విస్మృతో గంతములు శూన్య వీధులందు
నావలెనె మౌనముగ వెళ్లి పోవుచున్న
ఓ నిశీథినీ! నీగర్భ రోదరమునలే
దొరికె ఆ దురదృష్టవంతునకు చోటు"

అన్నావు.

కవీ! తీవలేలేని ఆశావిపంచిని శూన్య హృదయముతో ఎంత కాలము మోయగలవు? ఎంత కాలము నీవు * గౌతమీనదీ పవిత్ర గర్భంబులో మ్రోతపెట్టుచున్న యుగ యుగాంతర విశ్వమహోగ్ర దుఃఖ జీవాలకావృత్తి చెప్పుకొన గలవు?

+దీపావళి.

* ఆవృత్తి



# ఊహా ప్రపంచము

వఝ్ఝల కాళిదాస కవి

కవి

భావ పరిమళ కలిత కవితా
రస సముజ్జ్వల భంగ సంగత
సాంద్ర కంకణ మృదు రవం మమ
హృత్సరసి భవతి.

ఈ స్నిగ్ధార్ద్ర రస ప్రపూర్ణ తటినీ హేలా చరద్భంగ పా
ళీ స్నాత భ్రమర చ్ఛటా కలిత నాళీ కాస వాహోద వా
యు స్నేహంబు నొనర్చి; సాంద్ర మధుర జ్యోత్స్నాత్సా నదీ కాంచనాం
బు స్నానంబు నొనర్చి; పుల్కు మొలకల్ పుష్పింప నేఁ బాడెదన్.

ఆ కాంతారమునన్ సుధు వ్రతమునై యాకాంత పుష్పాసవా
నీకాంకంబుల యందు మై మఱచి, యా నీరంధ్ర గాఢాంధ కా
రా కారాంచిత దిగ్మలాంబర వినీలా నంత వీధిన్ లస
ద్రాకా చంద్రుఁడనై కళాయుతుఁడనై రమ్యంబుగాఁ బాడెదన్.

సెల యేటి మిల మిలలఁ దెలి వెన్నెలల కళలు
తళ తళల్ గురిపింప జల జలల్ సరి నింపఁ
బులకించు నామేను
చల మూను నా కేఁము
శ్రుతు లలరఁ జేయు నా హృదయ తంత్రుల తోడ
శ్రుతి నిలిపి గతి గలపి గమకించెదను పాడ.

నారికేళము

రస సంపూర్ణ మదంతరంగ కలిప ప్రాచుర్య మాధుర్య భా
వ సమూహాోజ్జ్వల కల్పితోన్నత సుధా పానీయ సంసేవనా
లసమా నాత్ములరై విమర్శకులు కాలం బెల్ల వ్యర్థం బొన
ర్చి సమర్థించి గ్రహింప లేరు సరసార్ద్రీభూత భావాంబువుల్.

## ద్రాక్ష

జిలిబిలి కమ్మ తేనియల జిల్లునఁ జెమ్మల దేరు మేను, కాం
తిలు నొక నూత్న భావమునఁ, దీపులు పైపయిఁ జూర గొల్పి యా
త్మల వశమందఁ జేయు; రస ధారల తుంపురులన్ బయిన్ బయిన్
జిలికెద, దానితో మనసు నిల్వక పర్వులు వెట్టునట్టులన్.

పైపయిఁ దోఁచు నా మధుర భావము గ్రోలుచు నుండ నందు జీ
ర్ణోపల పంక్తి నాగ నెదియో యొక వింత పదార్థ ముద్భవం
బై పలు బాధ వెట్టు, మధురామృత మందు హాలాహలం బనన్
దీపితమౌ గులాబి నలు దిక్కుల నుండెడి కంటకాళినాన్.

## కదళి

తీరిచి దిద్ది పంపిన గతిన్ గళలన్ గురిపించు మేల్మి బం
గారఁపుఁ దేట నిగ్గుల నిగారపుఁ వెన్నెల సొంపు నింపు నా
మై రమణీయ కాంతి గని మంజులమై యధికంబు నా సుధా
పూర ఝురీ తరంగ కణముల్ గ్రహియింపఁద రెల్లవారలున్.

అర మోడ్పు కనఁదోయి యనిమేష భావ
మంది రంభను చూచి నటు లొనరింతు;
ముట్టినచో రస ముట్టవడు మధు
రామృతంబులు పొంగు నలల సంగతిని.

సరసాళి కెల్ల నాస్వాదు సంపదఁ జూపి
మరపింతు నెమ్మనసు,
పరువెత్తి యలయు నీ మరుదంకురములలోఁ
గురిపింతుఁ గ్రొందావి,
చివురు జొంపములలో జిలుగు పుష్పములలో
కవులు నా సరి సారు
సరరింపఁగాఁ బోరు.







శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు, బి. ఏ. ఎల్. టీ.




సమీరుడు నాకు బావమరది వరుస. అతడు చామన చాయగల పొట్టి మనిషి. అయితే స్ఫురద్రూపి. మాకు చిర పరిచితుడు. అందుచే మా కాంతంతో చనువుగా మాట్లాడుతాడు. అతడు వచ్చి వీధి గదిలో కూర్చున్నాడని నాకు లోపలికి కబురు వచ్చింది.

నేను స్నానంచేసి ధౌత వస్త్రము ధరించి దేవ సంస్కారము చేసుకొని వచ్చినాను. ఇద్దరం చేరి యొక్క కుర్చీలలో కూర్చున్నాము. సమీరుడికి ఒక సిగరెట్టు ఇచ్చి నేను ఒకటి వెలిగించినాను. అతను అన్నాడు,

"అయితే, నామీద నీకు దయ తప్పినట్లుంది?"

"ఎందుకు అల్లా అంటున్నావు? అల్లా జరుగుతుందా! మన స్నేహం ఆచంద్ర తారార్కం అల్లా ఉండాలిసిందే!"

"ప్రతి సంవత్సరాదిని మనము అంతా కలిసి కొంత కాలము హాయిగా గడుపుదాము. అనుకొన్నాము. మొన్న మొన్నటి వరకు అల్లాగే జరిగింది. కాని మొన్న పోయిన సంవత్సరాదికి నీవు నన్ను ఆహ్వానించక పోవటం నాకు చాలా మనస్తాపం కలిగించినది. నన్నెందుకు పిలవలేదు?"

"కొంచెము నిదానించు. చెపుతాను. తెలుసుగా మీ చెల్లెలు కాంతం విషయమై?"

"మా చెల్లెలు కాంతం విషయమై పూర్తిగా తెలుసు. ఆమెను ఏ విషయంలోను ఏమి అంటానికీ ఆస్పదం లేదు. ఆమె దొడ్డ ఇల్లాలు. నాయందు ఆమెకు మిక్కిలి దయ. ఆమె నాకు ఆహ్వానం పంపవద్దు అని అన్నదని కాని ఆమెకు నాయందు దురభిప్రాయము ఉందని కాని అంటే నేనది విశ్వసించను."

"సమీర్! ఆమె విషయమై నీవు ఇట్టి అభిప్రాయాన్ని వెలిపుచ్చటం నాకు నిజంగా మనోరంజకంగా ఉంది. నీకు ఆమె యందుండే అభిమానం కూడా మహా గొప్పది, అయితే నిజం చెప్పక తప్పదు కదా? నిన్ను పిలుచుటకు ఆమెకి ఇష్టం లేక పోవుటం చేతనే యీ ఉగాదికి మిమ్ములను పిలువ లేను."

"నీ మాటలు చాలా విచిత్రంగా ఉన్నవి. ఆమె ఇదివరలో నాయందు చూపిన ఆదరము, ప్రేమ అద్వితీయము. ఇట్లు నన్ను పిలవవద్దు అంటానికి కారణం యేమి?

ఇట్టి భావ విప్లవానికి కారణ మేమో నాకు చెప్పాలి,"

"చెపుతాను, మన రాముడు మీకు తెలుసును కదూ?"

"రాముడూ—ఎవరువాడు?"

"మా రాముడిని ఎరుగవా? మానౌకరు రాముడు."

"వాడా—అవును. వాడిని ఎరుగకేమి? ఎరుగుదును. వాడు చాలా మంచివాడు సుమీ!"

"అల్లాగే వాడిని సేవా పరాయణత్వములో హనుమంతుడితో పోల్చవలె. ప్రతి పని కూడా బహు చక్కగా చేస్తాడు. నాబూడ్సు జోడుకు రంగు వేశాడా అంటే అవి నల్లగా జీడిగింజలవలె నిగ నిగ లాడుతూ ఉంటవి. వాడు బట్టలు ఉతికినాడా అంటే అవి మల్లె పువ్వులవలె తెల్లగా నుంటవి. నేను తాగేమందు ఎక్కడి నుంచి తేవలెనో, ఎంత మోతాదు ఇవ్వవలెనో మెలకు వలన్నీ తెలుసు."

"అల్లాగా? అయితే అది చాలా గొప్ప విషయం."

"అంతే కాదు, వాడు ఎటువంటివాడను కొన్నావు? బంగారం బజారులో కనుపించినా అసహ్య మైన వస్తువులాగ చూస్తాడు. పిల్లలను వాడి చేతికిచ్చి షికారు పంపితే జాగ్రత్తగా కాపాడుతాడు. పైకం ఇచ్చి సంతకు పంపినా, బజారుకు పంపినా బహు నేర్పుగా బేరం చేసి సరకులు తేవటమే కాక ఒక్క పైసా అయినా తన స్వంతానికి వాడు కోడు,"

"అల్లాగా! నౌకరులలో అంతమంచివాడు ఉండటం అరుదు సుమీ!"

"నీకూ అమాటే తోచిందీ? అయితే వాడికి ఒక దుర్గుణం ఉంది. అదేమిటో తెలుసునా సౌందర్య పిపాస. ఇదొక్కటే వాడికున్న కళంకం."

"దానికేమిలే! అదొక పెద్ద నీచగుణంగా ఎంచ వక్కరలేదు; ఎదుకు తనంలో అది క్షమార్హణీయము. వయసుకు, వలపు చింతకు పులుపు సహజము. సౌందర్య పిపాసా పీడితుడు ఎ డు, ప్రేమైక జీవి అదీ కాక నిష్కళంక మైన శీలముగల దేహి యెవరు? చంద్రుడికి కళంకం లేదా? భగవానుడు అనే అఖండ తేజోమూర్తి అయిన సూర్యునికి సిద్ధాంతం ఉంది, దాని విషయమై నీవు విచారించ వలసిన పనిలేదు. కాని నేను అడిగిన ప్రశ్నయ మేమిటి! నీవు చెప్పేసంగతి యేమిటి!"

"సమీరూ! నీవు నిజంగా సహృదయుడవు కాబట్టి వినతగిన మాట అన్నావు. ఆ ఒక్క కళంకం ఉందని అతనిని పనిలోనుంచి తీసివేయటం న్యాయమా?"

"ఛీ—ధర్మము కాదు."

'ఆట్టివాడు ఏదో తప్పుచేస్తే నాభార్య వాడిని పనిలోనుంచి తొలగించ మంటే, వాడి పక్షం వహించి ఏదోవిధంగా వాడినిరక్షించటం నాకు ధర్మము అంటావా, అనవా?"

"ధర్మాలలోకల్లా అదిఉత్తమ ధర్మము. అట్టి వాడికుఉంటే, నేను వాడి పక్షం వహించి [illegible] వాడిని కాపాడుతాను. కాని ఏమిటీ గొడవ! నాప్రశ్నకు జబాబు చెప్పకుండా ఏవో అల్లి బిల్లి కబుర్లు చెప్పి నన్ను మాయిపుచ్చాలని చూస్తూన్నావు!"

"కాదు, కాదు, విను. నిన్ను చూస్తేనాకు [illegible] గౌరవమూ, అభిమానమూ ఎక్కువ అవుతున్నది. నిజంగా నీహృదయము కరణార్ద్రము. వాడి సేవా ప్రియత్వమూ మొదలైన సుగుణాలు నీవు స్వయంగా చూశావు కాబట్టి నీకు వాడిమీద అంత అభిమానము కొంటూ."

"ఎప్పుడు చూశాను?"

"రాముడిని నీవు తిరునాలకు మంగళగిరి తీసుకొని పోయినావు."

"అవునవును. జ్ఞాపకం వచ్చింది. అప్పుడు నాకు వాడు చాలా సేవ చేసినాడు, వాడేదో పిచ్చిపని చేస్తే వాడిని నేను వెనుక వేసుకొని పోట్లాడినాను."

"పిచ్చిపని యేముంది? వడ్డించిన సోమయ్య భార్యను చూచి సౌందర్య పిపాసా బాధితుడై [illegible] అన్నాడట."

"అవును జ్ఞాపకమే. కాని ఏమిటీ గొడవ!"

"తరువాత మా కాంతంతో ఆ విషయము అంతా వారితో చెప్పి, వాడు చేసే ఎన్ని ఇట్టి పనులే, ఫలాని వారి వారు ఇటువంటి పనులు చెస్తున్నా డంటే మీకే అదృష్టం. వాడిని మీయింట్లో నుంచి వెళ్లగొట్టండి అన్నా రట. వాడిని తీసివేయమని కాంతం పట్టు బట్టి నన్ను తగ్గించటం మొదలు పెట్టింది. అప్పుడేమి చెయ్యాలె."

"మీరు ఇంట్లోనుంచివెళ్లగొట్టడం అవివేకం. అట్టి మంచి నౌకరు దొరకటం దుర్లభం, ఏదో ఒక దుర్గుణం ఉన్నా సహించి ఊరుకోవాలె.

"మనం మొగాళ్లం సహిస్తాము. ఆడవాళ్ళు ఇటువంటి విషయాలలో బొత్తిగా సహనం చూపరు?"

"అయితే ఒకటి చేయకపోయినావా? మా చెల్లెలు కాంతం చాలా మంచి మనిషి. ఏమి చెప్పినా నమ్ముతుంది. ఏదో మాట చెప్పి ఆ విషయం సద్దక పోయినావా!"

"అబద్ధం ఆడవచ్చు నంటావా?"

"సందేహం ఏమిటి. అటువంటి విషయాల్లో కాకపోతే ఇంకెప్పుడు అబద్ధం ఆడటం."

"శేష్, మంచిమాట అన్నావోయి. ఈ మాటే కలకాలం ఉండాలె. వెధవ నౌకరును రక్షించటానికి వాడిని వెనకవేసుకొని అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యతో అబద్ధాలు చెపుతారా? అంటూ వసకొన్నాను. అయితే అప్పుడేమి చేశానను కొన్నావు. అబద్ధం ఆడాను."

"మంచిపని చేశావు. కాని నన్ను పండుగకు పిలువవద్దని కాంతం అంటానికి ఆమెకు నాపై కోపం ఎందుకు వచ్చిందో ఇంత వరకూ చెప్పకుండా నన్ను మురపించాలని చూస్తున్నావు."

"లేదోయి, ఆ పాయింటికే వస్తున్నా. అప్పుడేమి అబద్ధం ఆడినానో విన్నావా. సోమయ్య భార్యను దుర్భాషలాడింది రాముడు కాదనిన్నీ, వాడితో వెళ్లిన నీవే ఆ పని చేశావని చెప్పి ఆమె నమ్మక పోతే ఎన్నో అబద్ధాలాడి మాయపుచ్చి నమ్మించాను....................

......అట్లా చూస్తా వెందుకు? ఇప్పుడే కదా అన్నావు, అట్టి నౌకరును అబద్ధం ఆడిఅయినా ఆదరించాలని. అసలు కధవిను. అపుడు కాంతానికి రాముడి పైనున్న కోపం అంతా గిరుక్కున వెనుక్కు తిరిగి నీమీద పడ్డది, అందుకని నిన్ను పండుగకు పిలువవద్దు అన్నది? తెల్లబారిన ముఖంతో "ఎంతపని చేశావోయి. కాంతంతో ఇప్పుడే నిజం అంతా చెపటానికి నే వెళ్లుతున్నా. కధ అడ్డంగా తిరుగుతుంది చూసుకో!" అని సమీరుడు లోపలికి పోయినాడు. నేను ఆరిపోయిన సిగరెట్టును పారవేసి క్రొత్త సిగరెట్టును వెలిగించుకొని కుర్చీలో పడుకొన్నాను.



# సురపున్నాగము

## శివప్రభాకరులు

గీ॥ ఆకులనుమించి పూవులై ఆశలలమి
తావి విరజిమ్మి యొక్కొక్క పూవురాల
పగటిమోమునఁ బచ్చిక బయలునడుమ
సొంపు నింపారు సురపొన్నఁ జూడవలయు॥

## —మంజరి—

నాఁడు పూర్ణమి, శశి నడిమింటనిలిచె,
పున్నాగ వృక్షంబు పొలుపారియుండె
నీలమై వినువీధి నెగడె చుక్కలతో,
పచ్చిక బయలు పుష్పములఁ జెన్నారె—
ఆకృతిఁ బసరప్రాంతంబునందుఁ
దనుబోల్చి, తావిచేఁ దన్నతిశయించి
సొంపు నింపారు నా సురపొన్న నట్టె
తిలకించి తిలకించి ధీరచంద్రుండు
భువిలోనఁ దనుమించు పూలచెట్టుంట
సిగ్గొంది కాబోలు శిరమటు ద్రిప్పె—
అంతలోఁ దూర్పున నరువాతదోచె
సూర్యుని రాకను చూచి కాఁబోలు
తనస్థితిని కని నవ్వుచుఁ గాఁబోలు
ముఖభాసమును గోలుపోయే చంద్రుండు
అటుచూచి యిటుచూచి నంతలో నటకు
శాంతాననంబున సద్ధర్మ తేజ
మచ్చనత్కులజాత యని తోపుచుండ
ముద్దుబాలిక మోర్తు పువులేరవచ్చె
అపుడె రాలిన యామలపుష్పంబులు
నొకదానిఁ దీసికొనాంగిమ ద్దొల్కి—

"ఈపూవులన్నియు నేరిదండల్లి
పార్వతీ దేవికి భక్తి నర్పింతుఁ
బ్రతిదినము పూలన్ని బాగుంచు"నంచు
పూలెత్తఁబోయె నా మురిపెంపుబాల
కర్ణభూషలగు జూకాల చందమున
లలి నింతదాఁక వ్రేలాడి వ్రేలాడి
మలయమారుతమట్టె మందమై వీవ
పట్టువీడినది పుష్పము రెంట నొకటి—
పూలెత్తెనో లేదొ ముద్దులబాల
పైనుండి పడుచున్న పండుపుష్పంబు
సూటిగా వచ్చి జడ చుట్టలోఁ బడియె
పడి యలంకారమై పాయక నిలచె
బాలిక కనలేను పడిన పుష్పంబు
కాని పున్నాగంబు గనులెల్లవిచ్చి
పరికించె ననియె విశ్వాసంబు నాకు
యోచింపవచ్చిన యుత్తరంబిదిగో—
బాలిక పుటుకకు భక్తి శ్రద్ధలకు
సౌశీల్యమునకు ప్రశాంత వర్తనకు
పరమేశ్వరుఁడు మెచ్చి వరమీయ నెంచి
పువుదావి ఘ్రాణింపఁ బోరియున్న దాశ
ము తైదువుగ నుండ" ముందె దీవించి
దనలోని భాగమై దనరెడు ప్రకృతి
చేతిమీదుగ పూవు చిట్టి కిప్పించె!
దేవుడిచ్చిన పూవు తిలకించినంత
పరమ సంతోషంబు పడియె నాబాల
పువు గదా పడతుల భూరి ధనంబు.



# వాణిజ్యము

'నరసింహం'

ప్రాచీన భారతభూమి యితరవిషయములం దెటుల సంపూర్ణత్వము గడించెనో వాణిజ్యమునందు కూడ నట్టిపూర్ణదశనే పొందియుండెను. నాలుగైదువేల సంవత్సరముల నుండి భారతీయులు వ్యాపార వ్యవహారములందు సమానమైన శ్రేయస్సును గడించుచు వచ్చిరి. ఆ కాలమున వారికి తెలిసిన పరదేశముల కెల్లను తాము సృష్టించిన వస్త్రములను, నగలను, సాహసించి భూగర్భములనుండి తీసిన మూల్యములను ఎగుమతి చేయుచుండిరి. ఈజిప్టు, రోము, కార్థేజి, ఫొనిషియా, చైనా మున్నగు దేశములతోడను, వివిధములగు ప్రాక్ద్వీపములతోడను, వారికి గాఢమైన వర్తకసంబంధము లుండెను.

ఆ కాలపు నాగరకరాజ్యములన్నియు భారతైశ్వర్యమును తిలకించి అచ్చెరువొందుచుండెడివి. మగధరాజ్య విచ్ఛిన్నము వరకును ఉత్తర హిందూస్థానము దక్షిణదేశముతో సమానముగ వాణిజ్య విషయములందు ప్రతీతి గాంచియుండెను.

ఆంధ్రులు మధ్యదేశమునంతను స్వాధీనపరచుకొనినప్పటినుండి వర్తక కేంద్రస్థానము వారి రాజ్యమునకు చేరెను. ఇటు ప్రాగ్దిశయందలి సముద్ర తీరమంతయు వారి వర్తకము యొక్క వైభవమును చాటుచుండెను. అటు పశ్చిమ సముద్ర మందలి ఆంధ్రవాణిజ్య విజయధ్వనులు గాఢ సముద్ర తరంగముల ద్వారా పరరాజ్య తీరములందు ప్రతిధ్వనించుచుండెను. జావా, బోర్నియో, మలాయా, ఆర్చిపెలగో, చైనా మొదలగు దేశముల కాంధ్రులు తమ నైపుణ్యమును తెలుపు వస్తువుల నెగుమతి చేయుచుండిరి. పశ్చిమచాళుక్యులగు ఆంధ్రులు వినిస్, రోమ్, అరేబియా మొదలగు దేశములలో తమ వాణిజ్య కీర్తిని నెలకొల్పిరి. కాకతీయ సామ్రాజ్యము కూడ పరదేశములతో వ్యాపార సంబంధములు కలిగినదై యుండెను. వానికి పలుస్థలములందు కానవచ్చు ప్రాక్సముద్రతీర శాసనములే సాక్ష్యములు.

మొగలు సామ్రాజ్య స్థాపనము వలన భారత వాణిజ్యరమ కట్టి అగౌరవము సంభవము కాలేదు. పరరాజ్యములలో భారత వర్తకము మిగుల సంభ్రమముతోడనే చూడబడుచుండెడిది.

పాశ్చాత్య దేశములందు పరదేశీయులతో వర్తకము ప్రప్రథమమున మొదలు పెట్టినవారు అరబ్బులు. ఫోనిషియా దేశీయులు నౌకాజీవనమునకు పునాది వేసినవారు. జెరుసలెం వినాశము పిదప యహూదీయులు కూడ వర్తకమునం దుత్సాహము జూపసాగిరి. వారిపిదప కార్థేజ్ Car-thaeg దేశీయులు తలయెత్తిరి. తదుపరి రోమనుల వైభవకాలము ప్రారంభమయ్యెను. వారితో బాటు వెనిస్ నగరము వాణిజ్యవిషయములందు ప్రతీతి గాంచెను. రియాల్లో ఆను మొదటి బ్యాంకు వెనిసీయు(Veneti)లచే స్థాపింపబడెను. ఈ రాజ్యము లన్నియు భారతభూమితో వాణిజ్యము జేయుచుండెడివి. హూన్స్, గాధ్స్, మరియు మహమ్మదీయుల దాడుల వలన అక్కడి వాణిజ్యమునకు భంగము కలిగెను. మధ్యకాలమునం దుద్భవించిన ఫ్యూడల్...

పద్ధతి కూడ వాణిజ్యమును అణగ ద్రొక్కెను. కాని వారి కఠినశిక్ష వలన పరిశ్రమలు కొన్ని వృద్ధిజెందెను. పదునా లుగవ శతాబ్దము తిరిగి యూరోపు ఖండవాసులలో నూతనోత్సాహము నింపెను. వివిధ రాజ్యములవారు నవీన దేశముల కనిపెట్టుటకై బయలు దేరిరి. కొలంబసు అమేరికాను కనుగొనెను. వాస్కోడి గామా భారత దేశమునకు సముద్ర మార్గము కనిపెట్టెను. స్పేను దేశీయులు దక్షిణ అమెరికా, మెక్సికో దేశముల కనుగొనిరి. ఆంగ్లేయులు న్యూఫౌండు ల్యాండుమరియు ఆస్ట్రేలియా తీరముల చేరిరి. మరియు అమేరికా సంయుక్త రాష్ట్రములను క్రమముగ స్వాధీన పరచుకొనిరి. క్రొత్తక్రొత్త రాజ్యముల కనిపెట్టిన కొలది ఆయా దేశముల ప్రకృతి సంపదలతో లాభము పొందవలెనని వారికి కోరిక జనించెను. తమ యుద్దేశముల నెరవేర్చుటకు నిగ్రోలవర్తకము మొదలు పెట్టిరి. ౧౫ వ శతాబ్దము వరకు రమారమి పృథ్వియంతయు తెలిసికొనబడెను. స్వలాభ సిద్ధికై ప్రతి దేశమును నూతన విషయముల కనిపెట్ట సాగెను. నవీనోత్పత్తి సాధకముల యోచించిరి. కృషి విభజన క్రొత్త క్రొత్త పద్ధతులపై చేసిరి. నవీన ప్రయాణ సాధకముల కనుగొనిరి. ఆవిరితో నడుపబడు యోడలు మొదలు ౧౮౧౮ లో న్యూయార్కునుండి లివర్ పూల్ నకు నడుపబడెను. భారతదేశము వానిని ౧౮౨౫ లో మొదటి సారి తిలకించెను. ఇటులనే యూరపు అమేరికా ఖండములందలి దేశములు ఒకదానికంటె నొకటి మించవలెనను ఆశతో ప్రస్తుతోన్నతస్థితికిని పొందినవి,

మొగలురాజ్యవినాశముతో కొంతవరకు నష్టము పొందినభారతదేశవాణిజ్య వైభవము యీస్టిండియాకంపని అంతరించు నప్పటివరకు సంపూర్ణముగ నశించి వ్యవసాయదేశమైపోయెను. ఇప్పుడు భారతము వ్యవసాయమునే చేయుచుండ వలెనా లేక పరిశ్రమల నెలకొల్పవలెనా యను చర్చల స్థితికివచ్చినది.

విజయము పొందిన పాశ్చాత్య రాజ్యము లన్నియు తమస్వాధీన మందు చేర్చబడిన రాజ్యములను తమ యైశ్వర్యాభివృద్ధికి సాధకములని తలంప సాగెను. ఈవిధముగ వాణిజ్యాభివృద్ధి పొందిన రాజ్యములందు వాని రక్షణార్థమై వివిధ సంస్థ లేర్పాటు చేయబడెను. వాణిజ్య విద్య ప్రత్యేకముగ బోధింప సాగిరి. వానివలన వారు విశేషలాభమును పొందు చున్నారు.

## వర్తక సంఘములు

పాశ్చాత్య దేశములు వర్తకము, పరిశ్రమల అభివృద్ధికొరకు అవలంబించిన స్రోవలు ద్వివిధములు:—

౧. బ్రిటిషు (British) విధానము ౨ ఫ్రెంచ్ (French) విధానము.

౧. బ్రిటిషు విధానము: దీని నవలంబించు యింగ్లాండు, ఐర్లండు, స్కాటులండు, అమేరికాసంయుక్త రాష్ట్రములు, బెల్జియం, బ్రిటిషు కాలనీలు స్వతంత్రముగ వృద్ధిపొందు వర్తక సంఘములను ప్రభుత్వ సంబంధము లేకుండ స్థాపించినవి. వీని యభిప్రాయములను ప్రభుత్వము అంగీకరింప వచ్చును. అంగీకరింపక పోవచ్చును.

౨. ఫ్రెంచ్ విధానము: దీని నవలంబించు యితర యూరపు రాష్ట్రములు ఫ్రాన్స్, జపాను దేశములలోని వర్తక సంఘములు ప్రభుత్వ నిర్మాణములే. దేశమందలి వర్తకమంతయు ప్రభుత్వము చేత నుండును. వర్తకమునందు హెచ్చుతగ్గులు చేయుటకు ప్రభుత్వమునకే యధికారము కలదు.

ఈరెండు విధముల సంఘములు వివిధ దేశములలో నెన్ని రూపములు దాల్చెనో తెలిసికొనుట చాల లాభదాయకము.

## గ్రేటుబ్రిటన్ మరియుకాలనీలు.

ఐచ్ఛిక వర్తక సంస్థలు:

(౧) చేంబర్సు ఆఫ్ కామర్స్: మొత్తము వాణిజ్య విషయములను రక్షించునవి.

(౨) ప్రత్యేక వాణిజ్య విషయముల రక్షించు సంఘములు.

(3) ట్రేడు ప్రొటెక్షన్ సొసైటీలు: వర్తకులకు ఋణములు మొదలగు సౌకర్యముల కలిగించునవి.

జూలై ౧౯౨౮]

(౪) ఇతర విధముల సహాయము చేయు సంఘములు.

ఆయాదేశముల ప్రభుత్వములచే స్థాపింపబడిన బోర్డ్సు ఆఫ్ ట్రేడు (Boards of Trade) కూడగలవు. అవి వాణిజ్యమునకు సంబంధించిన సంగతుల నన్నిటిని సేకరించును. ఆంగ్లేయ వాణిజ్యరక్షణ గావించును.

అమెరికా సంయుక్త రాష్ట్రములు

అప్రాభ్విక వర్తక సంఘములు:

(౧) చేంబర్సు అఫ్ కామర్సు: ఇవి దేశము నందలి (Inland) వర్తక రక్షణకై నెలకొల్పబడినవి.

(౨) ది బోర్డ్ ఆఫ్ ట్రేడ్. ఇది స్థానిక వర్తక రక్షణకును నెలకొల్పబడినది. అమలునందు వారి భేదమును దృష్టియందుంచుటలేదు.

ప్రాభ్విక సంఘములు:

(౧) ఇంటర్ స్టేటు కామర్సు కమిషన్: దేశమునందలి (Inland) వర్తకము రక్షణ చేయును.

(౨) ఇండస్ట్రియల్ కమిషన్: పరిశ్రమల కాపాడును.

(౩) మత్స్యవాణిజ్య రక్షక సంఘము.

(౪) విదేశ వాణిజ్య సంఘము.

(౫) వర్తక విషయములను తెల్పుసంఘము.

ఫ్రాంసు

మూడు విధముల సంఘములు కలవు:—

(౧) చేంబర్సు ఆఫ్ కామర్స్.

(౨) కళల గురించి, పరిశ్రమల గురించి సలహా నిచ్చు చేంబర్స్

(౩) వర్తకము, పరిశ్రమకు సంబంధించిన చేంబర్స్.

ప్రభుత్వము యొక్క యేర్పాటు:

వాణిజ్యమంత్రిస్వాధీనమున మూడుసంస్థలు కలవు.

(౧) స్వదేశమునందలి వర్తకము, పరిశ్రమను చూచుటకై నెలకొల్ప బడినది.

(౨) వలసరాజ్యముల యొక్కయు పరరాజ్యముల యొక్కయు సంబంధముల నిర్ణయించుట కొఱకు—

(౩) స్టాటిస్టిక్సు సిద్ధము చేయుటకు.

జర్మనీ

వర్తక సంఘములు మూడువిధములు:

౧. శాసనము ద్వారాస్థాపితమైన సంస్థ. [Handelskammern]

౨. అర్ధాధికార సంస్థలు.

౩. స్వతంత్ర వర్తక సంఘము.

వర్తకము కొఱకు ప్రత్యేకముగ నొకమంత్రి లేడు.

ఈ విధముగ పాశ్చాత్య రాజ్యములు అక్కడి ప్రజల ప్రోత్సాహము వలనను, ప్రభుత్వముయొక్క పక్షపాతము వలనను దినదినాభివృద్ధి జెందుచున్నవి.

భారత దేశము

పైన వివరించిన విషయము లన్నియు పరదేశములకు సంబంధించినవే ఆయా దేశములందు వాణిజ్యాభివృద్ధి యెటుల దినదినాభివృద్ధి గాంచుచున్నదో తెలుపనైనది. కాని మన దేశమునందు దాని స్థితి ఇప్పుడెట్టి దశ యందున్నదో తెలిసికొనుట మన ముఖ్యోద్దేశము. దానిని తిరిగి అత్యున్నతస్థితి కెటుల గొంపోవగలమో విచారించుట మన ప్రథమావధి! చచ్చిపోయిన బఱ్ఱె పగిలిపోయిన కుండెడు పాలనిచ్చు చుండెనని యనుకొని నంతన మనము సాధించిన విశేషత యేమియు యుండదు. తిరిగి అట్టి బఱ్ఱెనుసంపాదించ ప్రయత్నింపవలెను. తత్ప్రయత్నములు మన దేశీయులలో నేవైన జరుగుచున్నవా లేవా కొంత విచారించి చూచెదము.

ఒక వ్యక్తి ఆర్జించిన ధనము అతని కుటుంబమున కెటుల పేరుదెచ్చి పెట్టునో అట్టి పలువురు వ్యక్తుల ధనము యొక్క సమ్మేళనము దేశము యొక్క గొప్ప ధనమును చాటును. జాతీయ ధనమును బట్టి ఆదేశము పరదేశముల గౌరవాగౌరవములకు గురి యగుచుండును. దానినిబట్టియే

నమ్మకము అపనమ్మకము ఉద్భవ మొందుచుండును.

భారతదేశ వాణిజ్యస్థితి, దాని అభివృద్ధి తెలిసికొన దలచినచో ప్రజల యొక్క ధనమెటుల వృద్ధిగాంచు చున్నదో పరికించుట అవసరము. మొగలు సామ్రాజ్యము అంతరించినను, ఈస్టు యిండియా కంపెని దేశమంతట అల్లుకొనిపోయినను భారతైశ్వర్యము పరదేశీయుల బొక్కసము జొచ్చు సాహసింపలేను. ఆకాలమునందు పరదేశముతో సంబాధ బాంధవ్యము లున్నను మన దేశమునకు విశేషముగ ధనము వచ్చుచుండెనే కాని పరదేశములకు పోవుధనము చాల తక్కువగా నుండెను. అది గాక అనాది నుండియు మనదేశమునందలి మధ్య భాగము లందు జనించిన గ్రామములనుండి ధనము వెడలి పోవుట కవకాశము సహజముగా లేకుండ నుండెడిది. ప్రతిగ్రామము ఉత్పత్తి ఆగ్రామముననే వాడుకొన బడుచుండెడిది. అందువలన ఎక్కడి యైశ్వర్య మక్కడనే నిలిచి యుండెడిది.

క్రీ. శ. ౧౮౫౮ వ సంవత్సరమునందు భారత దేశ ప్రభుత్వము ఈస్టుయిండియా కంపెని స్వాధీనమునుండి ఆంగ్ల సామ్రాట్ స్వాధీనము చేయబడెను. అప్పటినుండి ఉభయ దేశముల సంబంధము మరింత దట్టమయ్యెను. ఈదేశమును వృద్ధి పొందించుట అప్పటినుండి సంపూర్ణముగ ఆంగ్ల ప్రభుత్వ కర్తవ్యమయ్యెను, వ్యాపార వ్యవహార సౌకర్యముల నిమిత్తము రేల్వే మరియు టెలిఫోను టెలిగ్రాఫ్ మొదలగుసాధకములు మొదటిసారి దేశమందల్లెడల నిర్మింపబడసాగెను. ఈసాధకములు ధనము లేనిది నెలకొల్ప వీలులేకుండెను. దేశీయులనుండి ధనసహాయము కించిత్తైనను చేకూరలేదు. దానికి తగినకారణములు లేకపోలేదు.

మొగలు సామ్రాజ్య మంతరించిన పిదప ప్రతిగ్రామమున కొక రాజు తలయెత్తెను. హాబ్సుపుట్టించిన ,,లెవియాథను''నున్నంత స్వాతంత్ర్య మాతని కలవడెను. క్షుద్రులచేత చిక్కుటచే ప్రజల కెన్ని అరిష్టములు ప్రాప్తించవలసి యుండునో అన్ని ఆ కాలమువారు అనుభవించిరి. ధనికులనుండి నయముననో భయముననో తమ స్వాభిలాషల నెరవేర్చుటకు లాగికొనిన ధనమును తిరిగి యిచ్చుట వారికి బాధ్యతయని తోచలేదు. వేలకు వేలు 'రాజు'లున్నను 'అరాజకము' ప్రాప్తైయున్న దేశముననప్పుడే దొంగలుకూడ విశేష మయిపోయిరి. ఈపీడల నన్నిటి వదిలించుకొనుటకు ధనికులు తమ ధనమును నగలరూపముననో, భూగర్భముననో దాచుకొన సాగిరి. దానివలన వారిలో కొందఱి సంతతికి తమ పితృధన విషయమే తెలియకుండెడిది తక్కిన కొందఱికి తెలిసినను దొంగలపాలో, దొరలపాలో, యగునని దానిని పైకిదీయ వెరచు చుండిరి. పైకి దీసినచో దొంగలు, దొరలు. లోననుంచినచో మన్నులో మన్నై అద్వైత సిద్ధిబొందుట తటస్థించు చుండెను. అందుచే ఐశ్వర్య ముత్పత్తి సాధకమని చాల వరకు వారు మరిచిపోయిరి. ఈ కారణముననే భారత దేశాభివృద్ధి కొరకు కావలసిన ధనము భారత దేశమున లభింప నందున ఆంగ్లేయ ధనాగారము లీ దేశమును నలు దిక్కులనుండి చుట్టివేసెను.

రేల్వే, టెలిగ్రామ్ టెలిఫోను మొదలగునవి వృద్ధి పొందిన కొలదివ్యాపారముకూడ వృద్ధియగుటకు మార్గము లేర్పడెను. అట్టిమార్గములు జనించుటచే వ్యాపారము కేంద్రీకరింప సాగెను. కేంద్రీకరించుటతో పరరాష్ట్రములకు విశేషముగ ఆయా వ్యాపారము ఎగుమతి చేయకపోవుట అసంభవ మయ్యెను. తద్ద్వారా నౌకా వ్యాపారమను క్రొత్త విషయము జన్మించెను. దానియందు కూడ భారతదేశీయులు తమ ధనమును వెచ్చింపరైరి అదియు ఆంగ్లేయ ధనికుల భాగ్యమయ్యెను. భారతీయుల యందలి యీ లోపమును గ్రహించి ఆంగ్లేయులు తమ స్వలాభముకై యీదేశమున నల్లెడల వివిధములగు కంపెనీలు, యంత్ర శాలలు, ఫ్యాక్టరీలు స్థాపింపసాగిరి. తమ యవసరములబట్టి యిబ్బందులసమయమున సహాయపడుటకు 'బ్యాంకుల' పునాదివేసిరి. దానివలన ప్రభుత్వము కొంత సాయము పొందినను స్వజాతీయులగు నీ ఆంగ్లేయ వణిక్సమూహమునకు ఆంగ్లేయ స్వాధీనమందున్న ప్రభుత్వము వివిధ సౌకర్యముల చూపసాగెను. ఇన్కమ్టాక్సు సూపర్ టాక్సు, మొదలగు పన్నులు తక్కువగా తీసుకొ

మా, పూర్తిగా వదలి పెట్టియో పక్షపాతము వ్యక్తబరచు చుండిరి. ఈ పరిస్థితులు ౧౯౧౪ వరకు కూడ జరుప బడెను.

పాశ్చాత్యసభ్యతనభ్యసించిన భారతీయులు కొందఱు తమ దేశముయొక్క వాణిజ్య పరిస్థితులుదినదినము క్షీణించు చున్నవనియు, దేశము యొక్క ముఖ్య వాణిజ్యమును, వాణిజ్య సంస్థలును, పరదేశీయులచేత నున్నవనియు, తెలి సిగొని ఆలాభమును తామే పొందవలెనను ఉత్సాహ ముతో వాణిజ్యమును నూతన విధముగ ప్రారంభించ సాగిరి. బ్యాంకుల స్థాపించిరి. జాతీయ సభలలో తమ యభిప్రాయమును వెలిబుచ్చిరి. శాసన సభలలో దేశీయులకు కూడ తగిన సౌకర్యములను, మరికొన్ని ప్రత్యేక సౌకర్యముల నేర్పరుప నిర్బంధ పరిచిరి. గోఖలే, దాదాభాయి నౌరోజి మొదలగు నాయకు లీ పనిని తమచేతి బూనిరి. క్రమ క్రమముగ భారతీయులుకూడ వాణిజ్యమునందు వృద్ధిపొంద మొదలిడిరి. ధనము ఉత్పత్తి సాధకమని గ్రహించి పెద్ద కంపెనీలలో, మఱియు బ్యాంకులలో యితర లాభదాయక ములగు వ్యాపారములలో, వెచ్చించసాగిరి. 'బ్యాంకు' లపై ప్రజలకు నమ్మకము పెరుగ మొదలయ్యెను. జానప దులలో నీవిషయము సర్వ సామాన్యము కాకపోయినను పురజనులలో నీక్రొత్త పద్ధతుల లాభా లాభములు స్పష్ట మయ్యెను. ఈ సమయమున జెమ్షెడ్జీ తాతా నామము స్మ రింపకుండుట అసంభవము. నూతనవిధానముల నన్నింటిని తాను స్వయముగ నమలునందు బెట్టి తానీయాలాభముల పొందుచుండెనని ప్రజలకు చాటి వారినట్టి విషయములలో ప్రోత్సహించుటకు అమితధనమును [సుమారు ౪ కోట్లు] వ్యయపరచెను. మొత్తము మీద క్రీ. శ. ౧౯౧౪ వరకు దేశముయొక్క పరిస్థితులు పై వివరించినటులుండెను. భారతీయుల నూతనోత్సాహముయొక్క ప్రకటన ప్రభు త్వము పెడచెవిన బెట్టెను, మౌనముద్ర వహించెను.

యూరప్ మహాసంగ్రామ ప్రారంభము వలన పాశ్చాత్య వర్తకుల దృష్టి చలించెను. సంగ్రామ కారణమున వారు తమ వ్యాపారములను స్థిర చిత్తతతో కొన సాగింప జాలక పోయిరి. అదిగాక యింగ్లాండు మొదలగు దేశములనుండి యేవస్తువును దిగుమతి కాకుండెను. దాని వలన యిక్కడి సరకులధరలు చాల పెరిగి పోయెను. ఇక్కడి వణిక్ప్రముఖులు భారత దేశముయొక్క నిరాధారత్వమునుచూచి అన్నివస్తువుల నిక్కడనే ఉత్పత్తి చేయుటకు మిల్లులను, ఫాక్టరీలను స్థాపింప సాగిరి. ఈసమయమునందే భారతవాణిజ్యమునకు యిండియా ప్రభుత్వము యిష్టము లేకున్నను సాయము చేయవలసి వచ్చి నది. సంగ్రామ నిమిత్తము వారికి ధనము అవసరమయ్యెను. ధనికులగు వర్తకులు తమ కవసరమగు మిషనరీ మొద లగు వస్తువులపై వేయబడు పన్నులను కొంత తగ్గించినచో మేము సాయపడెదమనిరి. అదికాక వారిపై విధించు చున్న యిన్కమ్‌టాక్స్ మొదలగు పన్నులలో కొంత తగ్గించవలెననియు, వారివ్యాపారమునకు భంగము కల గించుచున్న జపాను వస్తువులపై పన్నులను హెచ్చింప వలెననియు కోరిరి. తమ యవసరముల బట్టి ప్రభుత్వము వారి సౌకర్యముల కల్పింపకుండ నుండుటకు వీలులేక పోయెను.

పర్యవసానము దేశీయ వ్యాపారము చాల వృద్ధిపొంద సాగెను ఈ క్లిష్ట సమయమే భారత వాణిజ్యాభ్యుదయ మునకు ఆది.

సంగ్రామానంతరము భారత జీవితమందలి ప్రతి సంచలనమునకును నూతనకళ మెరుగిడ సాగెను. క్రీ. శ. ౧౯౧౭ వ సంవత్సరమందు భారత రాజ్యాంగ మంత్రి భారతదేశమును గుఱించి తాము చేయబోవు మార్పుల విశద పరచెను. బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్ప నున్నామని చాటిరి. తమ వాగ్దత్తత ఫలవంతము చేయు టకు ౧౯౧౯ చట్టము ప్రకారముయిండియా ప్రభుత్వములో చాల మార్పులు కలిగించిరి. ఆచట్టములను బట్టి సం పూర్ణ రాజకీయ స్వాతంత్ర్యము లభింపక పోయినను కొం

తవరకు వాణిజ్య స్వరాజ్యము లభించెనని నమ్మవచ్చును. ఇండియా శాసనసభయు, ప్రభుత్వమును ఇండియాఫిస్కల్ (రాజ్యములనుండి వచ్చువస్తువులపై విధింపబడు పన్ను క్రమము) పాలిసి గురించి ఏకాభిప్రాయమును వెలిబుచ్చినచో ఇండియా రాజ్యాంగ మంత్రియో, పార్లమెంటో జోక్యము కలిగించుకొనదని స్పష్టపఱుపబడినది.

(సశేషము)



# "స్మృతి"

నాదూరు బుచ్చిబంగారయ్య గారు

చిరినగవు దేనె నన్నభిషిక్తుఁ జేసి
నల్లగలువల దోరణాలెల్ల యెడల
నర్చనముఁ జేసి దేవి! నీ యాత్మ రాజ్య
పట్టభద్రునిగాఁ గను పరిగణించి
యెంటి నెందేగితివి పదచ్యుతుని జేసి?
మన వివాహపు సుముహూర్తమున నను దొల్లి
కొంగు కొంగున ముడివైచి కొంచు నెఱపు
నానిజంబైన సాప్తపదీన మైత్రి
మఱచి సంబంధ మెడలించి మగువ యెంటి
నెట్లు దివి కేగితంచు నే నెద దలంతు!
"ఐహికోన్మాద పంకిల తాత్ముఁ డితఁడు
మునుగునేఁ గూడ నున్న వ్యామోహ జలధిఁ
బ్రియతమును వాసి వగచి యా వేదనాగ్ని
కీలికా సంహతుల లోన గ్రీలు కొల్పి
యున్నయింధనమట్టు లాహుతిని బొంది
తేజ రూపమున్న చేతను దివిజభూమి
యందబల నిన్ను గలయుదు నంచు నెంచి
పోయితివ? యీ యభాగ్యుని చేయిదాటి!
నిత్యమెడ లేకఁ గారు కన్నీటిజాలు
లొంగ దీసిన నొక్కింత మ్రింగికొంటి
కాంత! నీమూర్తి యాచంద్ర కళవితాన
నహరహమ్మును వెన్నంటి యస్మదీయ
హృదయపీఠిని సాక్షాత్కరించు చుంట
నీకు మాఁగుఁగఁ జూచి చీకాకు వాయ
యాచికొంటిని నీ "జరీయంచు" చీర
పైదవీ! యట్టి జల్తారు పైటచెఱగు
తడసి మోపెడు బరువెక్కెఁ; దైన్యవృత్తి
నప్పటప్పట చిరవిరహార్తి కతన
పొంగి పొరలెడి దుఃఖాశ్రువులను దుడువ
లేమ! దుస్సహమై బహుళీభవించె
వంత;- నేటి యీ మధుమాస వాసరములు
కుమిలి నిగ్గురైన నిప్పులుఁ గొంతకొంత
ప్రజ్వరిల్లఁగఁ జేసెడి బహువిధాలఁ
"గునుకునక్క" పైదాళమ్ము కూలుమాడ్కి!
తొయ్యలీ! నీదు మూర్తికి దూరమాట
వేలు నాకుదుఁ జేతిలో వెన్న బోవ
వ్రతము చెడేఁగాని నుంత్రైన ఫలము గనను
దివ్యగ నైతిని యెంటి జందెమ్ము తోనె.

# చండభార్గవము

భాస్కర రామచంద్రరావు, బి. ఏ., బి. టి., ఎఫ్. టి. ఎస్.

## చతుర్థాంకము

రంగము: భార్గవాశ్రమోపాంతవిపినము.

(కుశికుడు, రుచికుడు ప్రవేశము)

కుశిక: మన మాశ్రమప్రాంతముల నిట్టి యనర్థము లెన్నడును గనివిననివి. ఆశ్రమమృగములను జంపిన వ్యాఘ్రములు మనలను మాత్ర ముజ్జగించునా? వన్యమృగములబాధ మిక్కుటమై యాశ్రమవాసుల కనుపలాంతి కెడములేక భీతినిగల్పించినవి. ఇట్టివేళ రాజులు వేటలు మాని తపోధనుల క్షేమములారయక స్వసుఖైకతత్పరులై ఆత్మధర్మములనే మఱచిరిల్లుచున్నారు. మనము కాయికకృషిని లక్ష్యబుద్ధిం ద్యాణీకరించుటచేతఁగదా యిట్టి దిక్కులేని బ్రతుకు బ్రతుకుచున్నాము. ఎప్పుడో యేవేళో యే పులినోటనో చెప్పలేము.

రుచిక: మనలను గాపాడు మహారాజు కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుని శిష్యుడు, నఖండ తేజోవంతుఁడు. తపస్వి. యోగి మనల నుపేక్ష సేయునా?

కుశిక: దూరఁపుకొండ నునుపన్న మాట వినలేదా. ఎన్ని యోగ్యతలున్ననేమి చిత్తపరిపక్వము లేనివానికి! దత్తాత్రేయుని వరములకుఁ దలతోఁకలు గలవా! శాస్త్రవివేచన జ్ఞానములేని యనుగ్రహమది. ధనము, రాజ్యము, బాహుబలము, దురభిమాన మన్నియు నొక్కచోట కేంద్రీకరించినప్పుడు నెట్టిజ్ఞానికైనను యుక్తాయుక్తవివేచన కవకాశముండునా? ఇంకఁ బుట్టిన మొదలు రజోగుణభూయిష్ఠుఁడై సుఖలోలతం దవిలి స్వార్థతత్పరశీలుఁడై పెరుఁగు క్షత్రియునివిషయమున దాని ననుకొననేల? ఆ కార్తవీర్యార్జున చక్రవర్తి తనకు జ్ఞానమునందేమి, తపస్సునందేమి, ప్రతాపమునందేమి సమానుఁడే లేడని విఱ్ఱవీఁగుచున్నాడు. బ్రాహ్మణులందఱును నేఁటి కుక్షింభరులనియు, మోసకాండ్రనియుఁ జెప్పుచుండును. ఎంతటి యోగ్యులనైనను పరిభవింపఁ దలంచును. ఇది యింతయుఁ గడు ననర్థహేతువని యనుకొనుచున్నారు.

రుచిక: ఆకృతవ్రణుఁడు మనపగయు డుపమాహిష్మతికిం జని కార్తవీర్యార్జునునితో మనవి సేయ వెళ్ళి నుమారుగ నారము దినములయినవి. మన పరశురాముఁడును తపంబొల్లుంచెనో మనకు చెప్ప తపస్య మొనర్చువాఁడఁట కదా. మన మునిపల్లెయంతయుఁ దదాగమనిరీక్షణతత్పరులై సమధికౌత్సుక్యమై గడియలే యుగములుగ లెక్కపెట్టుచున్నది.

కుశిక: వచ్చిన నతఁడిప్పుడుండు స్థితిలో మనలఁ బల్కరించునా!

రుచిక : ఏమి! కార్తవీర్యార్జునిగారి యతనిపైఁ బ్రీతియుండునని దలంచితివా? మన భార్గవరాముఁడు సుగుణముల కాటపట్టు, కావుననే హరిహరుల సమధికానుగ్రహపాత్రుఁడగుట, ఇంతయును

క॥ తనవారిని దన దేశముఁ
దన బాల్యస్నేహితులను దలఁచినఁగనిన్
మనసు ప్రసన్నతఁ గాంచని
మనుజుఁడు దనుజుండొ కాలమహిష తనుజుఁడో.

కుశిక: అదిగో, నిరంతరము శాంతినిర్భరమై, నిశ్శబ్దమై, అవ్యక్తమధురనైసర్గిక వైచిత్ర్యబంధురమై యొప్పు మునిపల్లియ ఈశాన్యమూలన నతిదూరమున ధూమపటల మొకటి యావరించి నల్లున్నది చూఁడు. పరశురామమూర్తి వచ్చుచున్నవాఁడా?

రుచిక: పరశురామమూర్తి యేమి? ఇంతయనిరీక్షణముగఁ రాకడయేమి? ఇంత యట్టహాసమేమి? చూఁడుమదే! విచ్చుకత్తుల ధాళధళ్యములు కనులమిఱుమిట్లు గొల్పుచున్నవి. మేఘములతో సెకసక్కెములాడు పతాకము లివిగో! అదే పెంధూళి మనకడకే వచ్చుచున్నది.

కుశిక: మనమించోటనే యడంగి కనుగొందము.

[నిష్క్రమింతురు]

(కార్తవీర్యార్జునుఁడు వేటకాండ్రును ప్రవేశము.)

కార్త: సైనికులారా! ఇక నిలుఁడు. ఇది ఋష్యాశ్రమ ప్రాంతభూమి. మనము వారలను దొందరకలుగనీక మెలఁగవలెను.

కుశిక రుచికులు: మహారాజా! జయము గాక. మీమాటలు మీ ప్రఖ్యాతిని సాటుచున్నవి.

కార్త: మునియువకులారా! ఇదియెవరి యాశ్రమభూమి?

కుశిక : మహారాజా! ఇది జమదగ్న్యుల యాశ్రమభూమి?

కార్త: అట్లనా! తప్పక వారిదర్శనమునకు వచ్చుచుంటినని మనవి సేయుఁడు. వెళ్లుఁడు. సేనాని! మీరిందే విడిసియుండుఁడు. మునిపుత్రులారా! దారి చూపుఁడు.

కుశిక: }
రుచిక: } మహారాజా! ఇటు ఇటు. (నిష్క్రమింతురు)

రంగము : ఆశ్రమము- (జమదగ్నియుఁ గార్తవీర్యుఁడును దర్భాసనోపవిష్టులై ప్రవేశము.)

జమ: వితన్మృగయావ్యాజముననైన నస్మదాదులకు మీసందర్శనలాభము సిద్ధించెను. అసహాస్ర కరుఁడు, వ్యాప్తులై ప్రపంచమును గనిపెట్టు చందమున గార్తవీర్యార్జున చక్రవర్తి మహీమండలమును బాలించుచున్నవాఁడని వినియుంటిమిగాని దర్శన భాగ్యము తటస్థించి యుండలేదు.

కార్త: మహర్షివర్యా! మీయాశీః ప్రభావమున జెనువొందుచున్న మేము ప్రత్యక్షముగాఁ గాకపోయినను బరోక్షముగనైన మీయోగక్షేమముల నరయుచుఁ గృతజ్ఞత నగుపఱచు చుందుము గదా. మీ యగ్నిహోత్రములు నిర్విఘ్నముగఁ బ్రజ్వలించుచున్నవియా?

ము: మీప్రతాపాగ్నితో పాటు.

కార్త: మహాత్మా! మీకును మీశిష్యబృందమునకును నేమమే కదా.

ము: ప్రత్యక్ష సహస్రకరుఁడగు నీవు వర్ణాశ్రమాచార ధర్మముల బరిపాలించుచుండ నన్యథా యెట్లగును!

గీ॥ లోకసామాన్య రాజువే మాకు, నీదు
ప్రకట బాహుసహస్రకల్పప్రశాఖ
శీతలచ్ఛాయ మెలఁగు నాశ్రితులకెందు
నేమమే యని వేఱుగఁ జెప్పవలెనె.

కార్త: పరమసంతోషము. వన్యమృగముల బాధవిం నేటాఁడ వచ్చితిని. తమ దర్శనముచేతఁ గృతకృత్యుఁడనైతిని. దివ్యసంభాషణములచే గడియలు నిమేషములై కడచిపోవుచున్నవి. మునిచంద్రమా! ఇఁక నాకనుజ్ఞయా? లౌకిక వ్యవహార భారవాహులు మానిజనశిత్యానుసంధానవిధాన ప్రవాహమున కవకట్టులనంజెల్లు కాలాతీతమగుచున్నది. ఇంక నన్ననుగ్రహింపుఁడు పోయివచ్చెద.

ము: రాజేంద్రా! ఏల యింత తొందఱ? ఆయాసపడి వచ్చితిరి. కాలాతీతమైనది

ఉ. ఎన్నఁడు రాఁక రాఁక వసుధేశ్వర వచ్చితి పిచ్చుకుంటులై
మిన్నులఁవాక ... రు ట్లుచితమే చనుటీ యొకపూఁట నిల్చి మా
మన్ననలం గ్రహించి చనమానగు వేకువలేచి వెళ్లినం
దిన్నఁగ నంత ప్రొద్దునకు నీపురిజేరెద వేల యోజనల్.

కావున, యీపూఁట మాయింట నాతిథ్యము స్వీకరించి చనుఁడు.

కార్త: మహర్షిసత్తమా! మీ యాశ్రమమున దీర్ఘప్రసాదములు లభించుట మావంటి వారికి జన్మపావన హేతువే కదా. అయిన, మీరు తపోధనులు. బీదలు. నేను వచ్చినది యొక్కఁడను గాను. నాతోఁ గూడ గొప్పదండు వచ్చి దాపుననే నారాకకై కనిపెట్టుకొనియున్నది. తమకు నృపశ్రమ కలిగించుట నా కిష్టము లేదు,

మ. ధనమా! లేదు, పదార్థ సంగ్రహమదేతన్మాత్రమా! వచ్చితిం
గనుఁగొంటి న్గనపం కువమ్యోను భవత్కారుణ్యమే కోటి మీ
కనువా యిందఱి నత్కరింపఁగ వృథాయాసంబు గాదా ... ను.
జ్ఞానోసం.సుఁడుముసీంద్రదపోఁ బుర కాజ్ఞాబద్ధుఁడం ప్రమొక్కితిన్.

ఆదిగాక యొకదిన మాసునంతటి ... తాళము లేగ ...

జమ: అంతటి కార్యముండిన మీరును మీ సైనికులును, ఇప్పుడే స్నానముచేసి భోజనము దీర్చుకొనిమే పొండు

కార్త: (స్వగతమున) ఇదియేమి చిత్రముగా నున్నది. ఈ మహర్షి యింత మందికి నండి వార్చి సిద్ధముగా నుంచి యున్నవాఁడా? చూతునుగాక! ఇతని తపోమహిమ యెట్టిదో (ప్రకాశమున) తథాస్తు. తామింత ప్రీతితో గౌరవించినపుడు తమ యిష్టమున కభ్యంతరము చెప్పఁగలనా,

జమ: పరమ సంతోషము. శుచికా! నీవు వెళ్ళి దొరవారి పరివారమును భోజనమునకు నాహ్వానించి రమ్ము. కుశికా! మహారాజుగారికి స్నానశాలకు మార్గముఁ జూపుము.

కుశిక: రాజేంద్రా! రండు [నిష్క్రమింతురు.]

(రేణుక, వసుమతియు ప్రవేశము)

వసు: జననీ! మన కామధేనువును బూజించితివ మతి. అర్జునచక్రవర్తియుఁ తత్పరిపాలనమును స్నానముచేసి సిద్ధముగ నున్నవారు.

రేణుక: నాయనా! పూజించితిని. తన్మహిమచే సకల భక్ష్యభోజ్యములును సర్వసిద్ధముగా నున్నవి. నీవును శిష్యబృందమును వడ్డన కారంభింపవచ్చును. మీ యాలస్యమే కాని నాదేమియు లేదు.

(తెరపడును.)

(జమదగ్ని ప్రవేశము)

కుశికా! భోజనము లగుచున్నవా?

కుశిక: (వచ్చి) గురువర్యా! ముగియవచ్చినవి.

జమ: అయిన నీవు వెళ్ళి మంత్రాక్షతలపళ్లెరముం గొనిరమ్ము.

[కుశికుడు నిష్క్రమించును జమదగ్ని కూర్చుండును]

కుశికుడు ప్రవేశము

కుశికుడు (పళ్లెరమునిచ్చి) మహారాజుగారు భోజనముచేసి తమ దర్శనము నపేక్షించుచున్నవారు.

జమ: పిలిచికొనిరమ్ము.

(కుశికుఁడు రాజును, సేనానిని ప్రవేశపెట్టును)

కార్త: (సవినయముగ కూర్చుండి), సేనానీ! నీవు వెళ్లి మన జనమును ప్రయాణోన్ముఖము గావింపుము.

(సేనాని, మునికిని రాజునకు మ్రొక్కి నిష్క్రమించును.)

జమ: రాజేంద్రా! సావకాశముగ భుజించితిరి గదా! ఇప్పటికి మా మనస్సునకు సంతోషమైనది ఈ మంత్రాక్షతలం గ్రహింపుఁడు.

కార్త: శిరసా గ్రహించితిని. (తీసికొనును) మహర్షివర్యా! నాది యొక ప్రార్థన.

జమ: రాజేంద్రా! అది యెట్టిది?

శాస్త్రి గా- శిర]

కార్త: మహాకిసత్తమా! మీరు నిస్పృహులు. తపోధనులు. కందమూలములతో గానలందుఁ గాలము గడుపు మహాత్ములు. ఇంతకును మీకును మీ శిష్యమండలికిని నుదరపోషణార్థ మేకొదవయుతేక మీ నియమనిష్ఠలకు భంగము కలుగని తెఱంగున గనిపెట్టు భారము భూవిభుని జెందినదిగదా. ఇట్టిమీకు కామధేనువుతో నంత యవసరము కన్పట్టదు.

కుశికుడు: (తనలో) ఓహో! ఏమో పుట్టెఁగదా వుండు! రాజులకన్నులు మంచివిగావని పెద్దలు సెప్పుదురు.

కార్త: కాని నాకొసంగుడని ప్రార్థన.

కుశికుడు: అనుకొన్నంత అయినది సరి.

జము: రాజేంద్రా! ఆదిమేము నిరంతరము పూజసేయు హోమధేనువు.

కార్త: అది నే నెరుగుదును. మేమును పూజ సేసికొనుచుందుము. వలయునన్న మీకు కొన్నియేని హోమధేనువుల నొసగువాఁడ.

కుశిక: [తనలో] కూర్చున్న యింటివాసాలు లెక్కపెట్టు పుణ్యాత్ము లిట్టివారేకదా! ఔరా భాగ్యము!

జము: ఇతరగోవు లెన్నియైన మాకేల?

గీ॥ తీర్థములుకోటి భాగీరథీ సమములె?
యజ్ఞములుకోటి సత్యవాక్యమున కెనయె?
మంత్రములు కోటి రామనామమున కుపమె?
భోగినులుకోటి కులకాంత బోలువారె.

కార్త. అట్లకాదు. మీకన్నోదకముల కేలోపములేకుండ నిత్యము నూరింటికి సర్వసామగ్రియు మీ యాశ్రమ ద్వారమునకు వచ్చుపడు భూవసతు లమరువాఁడ.

ఉ. ఊరక మాకొసంగుఁడను టొప్పదు విప్రుల విత్తమందు లో
కోరిన మంచిపాఁడిగల గోవులఁ గ్రేవులతోడ ప్రాయమిం
పారుచు హేమ శృంగముల భవ్యములై తనరారువాని మీ
కారయలక్షనిచ్చెద దయామతి నిద్ది యొసంగు డొక్కటే.

జము: రాజా! దీని మేము పూవులంబెట్టి పూజించు చుందుము.

కార్త: నేనును నాపట్టపు గోవుంజేసి యట్లే పూజించు చుందును.

కుశిక: (తనలో) ఈవ్యవహారము శ్రుతిమించి పోవుచున్నదే. ఎట్లు?

జము: రాజా! నీవఖండ సామ్రాజ్య దురంధరుఁడగుచు మావంటి తాపసుల హోమధేనువు నపేక్షించుట పాటికాదు.

కార్త: మీరు తాపసులనియే యిగతపఱకు మిమ్ము నభ్యర్థించుట.

జము: మాకు దీని నొసఁగ నిష్టములేదు.

కార్తః బాగుఁగ నాలోచించుకొనుఁడు. మీకు దీని నాకిచ్చుటలో నేమియుఁ దక్కువ కానేరదు. తక్కువ కానీఁను.

జమః అభ్యర్థింపఁ దగిన వస్తువును యాచించుట యద్యకార్యము కాదేని నాకు దీని నొసంగ మనసురాదు.

కార్తఃమునీంద్రా! ఎక్కడ నెట్టి యోగ్యవస్తువుండినను సర్వవిధముల నది సంగ్రహణీయ మనుట రాజనీతికాదా!

జమః సర్వవిధముల యోగ్యమగు మార్గమున నదిసాధింప వచ్చును. కానిఁ యుక్తాయుక్త పరిజ్ఞానము లేక తన వారనక పెఱవారనక, శిష్టులనక, దుష్టులనక, ధర్మమనక యధర్మమనక, కామలోభ మదావిష్టుడై, దౌర్జన్యముచే సాధించి పరమార్థమట్లుండఁగాఁ దనమిత్రులను గూడ శత్రువులను జేసికొని ధర్మభ్రష్టుఁడై పోవు మార్గము రాజనీతికివిరోధము. చాలకాలము గురుకులవాసము సేసిన నీకుఁ దగదు. నేనీఁయను.

కార్తః సామదానము లయినవి. ఇఁక నీయకున్నఁ బ్రభువు నాగ్రహమునకుం బాత్రుఁడ వగుదువు.

జమః గోఁచి పాఁతరా యని నీయాగ్రహ మేమి సేయఁగలదు? నాయంతఃకరణ పూర్వముగా నీకీయను. నీయధికారము, నీయాయుధములు, నీ దౌర్జన్యము నాయంతరాత్మను గట్టజాలవు. బాధింపఁజాలవు. భయపెట్టఁ జాలవు. నేను స్వతంత్రుఁడను. నీవు దురాశాబద్ధుఁడవు. మోహాంధుఁడవు. బానిసవు. నష్టచేతసుఁడవు. నాహృదయమును నీయధికార దర్పముచే నిర్బంధింపఁ జూచుట సముద్ర తరంగముల నరచేత నడంచుట వంటిది. నీపశుబలముచేత నాస్థూల దేహమును బంధింపఁగలవు, నలిపివేయగలవు గాని వ్యక్తిస్వాతంత్ర్యమును నిర్బంధింప జాలవు.

కుశికుః అక్కటా మామహర్షి యెంతటి యమాయకుఁడు. త్రోవవెంటఁ జనుచున్న మాయింటి వఱకు వచ్చి పామ్మని నట్లు వీని నభ్యర్థించి నిలిపి లేనియనర్థమును తెచ్చిపెట్టుకొన్నాఁడు.

సేనాని (ప్రవేశించి) దేవా! సర్వము సిద్ధము.

కార్తః అయిన నీవీయవు. ఈయవు, ఈయవుఁగా.

జమః ఈయను. పలుమాటలేల! త్రికరణశుద్ధిఁగ నీయను.

కార్తః ఋషీ! అయిన నీవు సామమునకుఁ జక్కఁబడకుంటివి. ఇఁక నాతప్పులేదు.

జమః మదాంధా! ఇది కృతఘ్నత యని నీమదికి దోఁపదా? సాధుల మనమున కాయాసముఁ గలిగించినవాని వంశక్షయమగునని యెఱుంగవా? మహాశాంత వ్రతముంబూని యున్నవాఁడను గాన బ్రతికి పోతివి.

కార్తః సేనానీ!

చం॰ ముదుకని నేమిచూచెదరు మూర్ఖుఁడువాని యటంచు నింత సే<br>పుదనుక నోర్పుగల్గి తనమ్రోలన మ్రొక్కులవేఁడి చూచి నం<br>గుదురఁడు సామమార్గమునకుం భటులీతని గట్టిపట్టుఁడ<br>మ్మొదవును గ్రేపుతోఁడఁ గొనిపొందు పురంబున కీరుసూఁటిఁగా.

(భటులు పఱతెంచుట, హాహారవములు, తెరపడును)

తెర యెత్తఁగా

(వసుమనుఁడు, కుశికుఁడు, రుచికుఁడు మున్నగు మునిపుత్రులును,

రేణుకయు, స్తంభమునకుఁ గట్టివేసిన జమదగ్నియు ప్రవేశము.)

రేణుక: కట్టా! వీనికెట్టి వినాశకాలము సంభవించెను? నాయిఘుం, నాజీవధనముకు గట్టివేసిక వీనిచేయిచేతులు వీని హోత్రుఁడు మొదటిపెరె వేరుమట్టదహింపఁడా!

(మునిపుత్రులు కట్టుల విడిపించుచు)

వసు: సాక్షాద్బ్రహ్మస్వరూపుఁడగు మానాయనగారినిట్లు పరిభవించిన దుర్మార్గుఁ డింకెంతమనుగంటనున్నె!

కుశిక: ఔరా! ఈ క్షత్రియుల కెంతటి వినాశకాలము సంభవించెను.

> ఆ. వె. అతలకుతలమయ్యె నవనీతలంబెల్ల
> ధరణిపతులు ధర్మబాహ్యులైరి
> కామలోభమోహ కలుషితచిత్తులై
> నీతిమాలి పాప నిరతులైరి.

రేణుక: అహా! ఎంతటి యక్రమము! ఎంతటి దౌర్జన్యము! ఎంతటి శాఠ్యము! ఇట్టి కట్టడి ప్రజలభక్తికి పాత్రుఁడగునా? సాధుజనసంతాపకారణములగు వీని బాహుసహస్రములు కాల్పనా? ఇదియేమి ధర్మము? ఇదెక్కడి నీతి? వీఁడెట్టి ఱేఁడు?

జమ: ప్రియా! నీకేల దుఃఖించుచుంటివి? మనధేనువుం దొంగలిన ముష్టుఁడు ముష్కృతీ దష్టుఁడకొమ్ము.

రేణుక: అయ్యో! కామధేనువే! నేఁబూజించిన సురభియే!

వసు: జనకా! ఇట్టి దుర్జనుఁడగు రేనియును ‹‹నావిష్ణుః పృథివీపతి›› అనువాక్య మెట్లన్వయించు చున్నది? రాజు దేవునితో సమానుఁడే యగునేని మాతాపితరులును, ఆచార్యాదులును దేవుని సమానులని బోధించినశ్రుతి రాజును నచ్చుట శ్రోతృఁనని కారణమేమి?

జమ: తనయా! పైఁ జెప్పఁబడినవారితోఁ జేర్చి రాజును జెప్పమియు, సృష్ట్యాదిని రాజులుఁగాని, రాజ్యములుఁగాని, రాజశాసనములుఁగాని లేవనియే గ్రహింపఁదగు.

రుచికుఁడు: అయినఁగతి?

జమ: మానవులు తమలోఁ దామసంఘములుఁగా నేర్పడి పరస్పరసుఖకంటకములగు జారత్వ, చోరత్వ, క్రూరత్వము లను ముఖ్యదోషములుఁగ బరిగణించి యట్టివాచరించు పాపిష్టులం దండించుటకుఁ బెద్దల నేర్పఱచుకొని తమ సంఘములను గాపాడుకొను చుండిరి. ఇట్లు కొంతకాలము గతించిన పిదప, జనులందుఁ గామక్రోధ లోభ మోహమదమాత్సర్యము లావిర్భవించి క్రమక్రమమున బెనువొంది స్వార్థపరాయణులై సంఘనియమ బద్ధులకాక స్వతంత్రించి వ్యవహరింపఁ దొడఁగిరి. సంఘమును విడిచియుండలేని ప్రతి మనుజుఁడును దన సమ్మతిచే

సాంఘిక ధర్మబద్ధుఁడై ప్రవర్తించు చుండెనే కాని వ్యక్తి స్వాతంత్ర్యమును గోల్పడి కాదు. వ్యక్తి స్వాతంత్ర్యము ప్రకృతిసిద్ధమైనది.

వసు: పిదప.

జమ: జనులసంఖ్య క్రమముఁగా మితిమీరి పెరుఁగఁగా సాధువు దుర్బలమై, వారిని హద్దు నాజ్ఞయందుంచి పాలింప జాలమి, ప్రజలు బ్రహ్మంగని మొఱపెట్టిరి. అప్పుడతఁడు దండనీతి ధర్మముల నేర్పఱచి తద్ధర్మ పరిపాలనకు మనువు ననుగ్రహించెను. లోకపాలాంశ సంభూతుఁడగు మనువు ప్రజలతో నొక నొడంబడిక చేసికొని వారి పరిపాలనకుఁ బూనెను. ప్రజలును మనువుతో గొన్ని యొడంబడికల జేసికొని తత్పరిపాలన కియ్యకొనిరి. ఇట్లు పరస్పరనియమబద్ధులై యది మొదలు ప్రజాపాలక ధర్మముల నెఱవేర్చు చున్నవారు.

వసుమ: అట్లనా! ఆ నియమ మెట్టిది?

గీ॥ ఖలుల శిక్షించి ధర్మ రక్షణమొనర్తు
ననుచు రాజును దమధాన్యమున దశాంశ
మేఁబదవయంశ మ పుల హేమమందు
బ్రజలు చెల్లింతు మనుచు నేర్పఱచికొనిరి.

వసు: దీనివలన వీరలిరువురును ధర్మబద్ధులే యనుట స్పష్టము.

జమ: ధర్మరక్షణము నుపేక్షించినను, నీయనశక్తుఁడైనను బ్రజ లట్టి నృపతికిఁ గరమర్పింపఁ దిరస్కరింప వచ్చును. ఇంతియేకాదు. ప్రకృతి సిద్ధమయిన వ్యక్తి స్వాతంత్ర్యమును బ్రవర్తింపఁజేసి వీలగునేని వానిం దొలఁగించి మఱొక్కని రక్షకునిఁగ జేసికొనవచ్చును.

వసు: ఔనౌను! ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. పూర్వ మొకప్పుడు వేనుని దొలఁగించి పృథువును సింహాసనము గూర్చుండఁ బెట్టిరి.

రేణుక: అక్కటా! ఇప్పుడు మాపరశురామమూర్తియే యుండిన మాకిట్టి యిక్కట్టు మెదవి యుండునా.

కుశి: తల్లీ! నేఁడేకదా మనమతనికై ప్రతీక్షించు చుంటిమి

రేణుక: ఏమో నాయనా! నాకేమి తెలియును. హా రామా!

(తెరపడును)



# స్వేచ్ఛ

బూరెల వేంకట రమణయ్య

చితికిపోయిన యీపాడు చీకటింటి
కడుపులోననె నాకు సుఖమ్ము గలదు

* * * * * * * *

ఆర్ద్రహృదయాల నుసిజేసి యగరువెట్టి,
నవ్వు వెన్నెలలో విషానలము దాచి,
వాలుచూపుల జీవముల్ వమ్ముజేయు,
కలుష చిత్తాల జనములు పిలుతురునను
రాజవీథుల దిరుగాడ రమ్మటంచు.

* * * * *

వారికృత్రిమ ప్రణయసంభాషణముల,
వలపు నటియింప నునుసిగ్గు [illegible]
చెంతc దలవెత్తి లేసును జిగురువెట్టు.
లలిత మసృణ జీవవల్లిరులc బట్టి
పెనచి పెకలించి చిదిమి చంపెదగువారు

* * * * * * * *

ఏనుమాత్రము వారిc గన్నెత్తి కనను;
వారి చిరునవ్వు తునుకల ప్రాపుగాని,
వారి కనుచూపు చిగురుల పలుకుc గాని
ప్రాణమున్నంతవఱకు సైపంగలేను

* * * * *

చితికిపోయిన యీపాడు చీకటింటి
కడుపులోనె నాకు సుఖమ్ముగలదు,





# ఆదిలక్ష్మి

ఆదిరాజు వీరభద్రరావు

౧.



"ఆదీ! ఓ ఆదీ!"

అని వయసు ముదిరిన యొక స్త్రీ పిలిచెను. ఈమె అప్పుడు పేడ పిసికి పిడకలు చేసి తన గుడిసె గోడకుఁ గొట్టుచుండెను.

ఈ గుడిసె, రయిలు మార్గమునకు మిగుల దూరములో నున్న యొక కుగ్రామము యొక్క మారు మూల యందుండెను. ఈ గ్రామములోని జనులు నవీన కాలపుఁ దళుకు బెళుకులు, ఆర్భాటములు ఏమియు నెఱుంగక నిరాడంబరమగు శాంత జీవనమును గలిగి యున్నారు.

ఈమె నివాసమున కిరవగు నీ గుడిసెయే గాక దాని ప్రక్కనే మరియొక గుడిసె కలదు. అందొక మూల తన రెండు ఆవులను గట్టివేయును; మఱియొక మూల నామె వంట చేసికొనును.

ఈమె గొల్లకులపు వితంతువు. బీదరాలు. తన ఆవులు రెండు నిచ్చెడి పాలు పెరుగుల నమ్ముకొని జీవించును. ఆ పశువులు ఎండిపోయి నప్పుడు ఊరివారికి వడ్లు దంచి కొంత కూలి సంపాదించుకొనును.

ఆది (ఆదెమ్మ) పన్నెండేండ్ల పడుచు. ఈ వితంతువున కేక పుత్రిక. ఆదెమ్మ ఏడేండ్ల వయస్సున నున్నప్పుడే ప్రక్క యూరిలోని యొక గొల్లపడుచు వానికిచ్చి, వివాహము చేయఁబడెను. వివాహానంతరము అత్తవారామెకు "లక్ష్మి" యని నామకరణము చేసిరి. అందుచే జనులందరామెను "ఆదిలక్ష్మి" యని పిలువసాగిరి. ఆదిలక్ష్మి ఎదిగి కాపురమునకు వచ్చువఱకు తల్లి యింటనే పెరిగెను. ఆమె కాపురము చేయ మొట్ట మొదలు అత్తవారింటికి రాఁగానే యచ్చట నామె యత్తగారి బానిస యైపోయెను.

కోడలినిఁ జూడఁగనే యత్తగారి కసూయ ప్రారంభమయ్యెను. తన కుమారుఁడు భార్యపై ప్రీతిచేఁ దనపై ప్రేమ నుంచడేమో యను భయమే యామె యసూయకుఁ గారణము. ఈ బాలికచే నింటి చాకిరి యంతయుఁ జేయించి, రాత్రింబవళ్లు కష్టపెట్ట సాఁగెను. భార్య పక్షమున నొక్క మాటయినను మాటాడుటకా పడుచు వానికి ధైర్యము లేకపోయెను. "చూశావా! వీడి ముగం మండ! వీడి కప్పుడే తల్లి దయ్యం అయింది; పెండ్లాం బెల్లం అయింది" అని యిరుగు పొరుగమ్మలు ఎచ్చట దూషింపోదురో యని పాపమా పడుచువాఁడు భయపడుచుండెను. ఒకనాడు నిష్కారణముగ అత్తగారు

గోడలిని వాని యెదుటనే చావమోదెను. వాఁడును రాగతముచు. వీడి భార్య రెండు చెంపలు వాయించి, ఆమెను ఆమె తల్లి యొద్దకు-పిడుకలు చేయుచు కథారం భమున మనకుఁ గనఁబడిన యా నిర్భాగ్యురాలగు విశం తువు నొద్దకు-పంపివేసెను.

„అది!" అది!! అని యా తల్లి బిగ్గరగాఁ బిలిచి, „ఏమే! పొద్దెక్కడం కనబడడం లేదే? తొందర పడ మ్మా, సంత వూరిక్కడికి రెండు మైళ్ల మీదుంది. ఆడికి పోవాలె పెరుగమ్మాలె. ఉప్పు మిరప కాయలు కొనాలె. కాబట్టి తొందరగా పో అమ్మా" అని యఱచెను.

ఆదిలక్ష్మి గుడిసెలో నుండెను. ఆమెనట్లు పుట్టిం టికిఁ బంపిన తరువాత ఆమె మగఁడు వారమున కొక సారి యామె వద్దకు దొంగతనముగా వచ్చుచుఁ బోవు చుండెను. అయినను గత రెండు వారములనుండి యాతఁడు వచ్చుట లేదు. అందుచే నాదిలక్ష్మి హృదయము చింతా క్రాంతమయ్యెను. తన మగఁడు ఆ యూరిలోని యొక మం గలి మందతో నవ్వుచు కేరుచున్నాఁడని యొక వార్త స్నేహితురాలిచే నామె చెవులంబడుటచే నామె దుఃఖము ద్విగుణ మయ్యెను. ఈ విషయములు జ్ఞాపకమునకు వచ్చి యాదిలక్ష్మి యేడ్చుచుండెను. అందుచేఁ దల్లి పిలుపులకు వెంటనే ప్రత్యుత్తరము నీయదయ్యె.

„అది! ఓసిపోరీ! ఏమే వినబడడం లేదే'! సూ ర్యుఁడు నెత్తి మీదికి వచ్చాడన్న సంగతి తెలియడం లేదే? సంత అప్పుడే మొదలయి యుంటుంది. ఆలస్యంగా పోయి, అది అయిపోయిన తర్వాత పెరుగెవరికి అమ్మదా మనుకున్నావు?"

ఆదిలక్ష్మి కంటి నీటినిఁ దుడుచుకొని, గద్గద స్వరముతో గుడిసెలోనుండియే „అమ్మా! వస్తున్నాను వస్తున్నాను" అని బదులు పలికెను.

తరువాత నామె సింగారించుకొనుటకుఁ బ్రారం భించెను. వారమున కొకసారి జరుగు నీ సంతకు తమ మగఁడు కూడ రానున్నాఁడగుటచే నీసారి సింగారించు కొనుటలో నేఁడామె మిక్కిలి శ్రమతీసు కొనెను. ఆమె నల్లంచు తెల్లని చీరను ధరించెను. కొంచెము కొబ్బరినూ నెను రాసి తన నిడుపాటి వెండ్రుకలను జక్కఁగ దువ్వి మెడమీద వ్రాలునట్లుగ సుద్దుగ ముడిసెను.

„ఓసీ! అదెమ్మా! ఓ నల్లమొగపు పోరీ! నువ్వు పొయ్యేవరకు జనులందరు వెళ్లి పోతుంటారు. మన పెరు గింకెవరికమ్మేది? వుప్పు మిరపకాయలు కొనడ మెట్లా?" అని తల్లియరచి, „హా! నాదెంత పాపిష్టి ఘటమై పోయెను. యీ ప్రపంచంలో నాకు పిడికెడు కూడు పెట్టే దిక్కు లేదుగదా! హా! నా ప్రారబ్ధమా! అయ్యో, నోటు అయ్యో నోటు!"

అని యావనిత పేడ తట్ట ప్రక్కన నేలపై చదికి లఁబడిఁ నోటుమాట జ్ఞాపకము రాఁగానె బిట్టు వగవ సాఁగెను.

౨

కొన్ని సంవత్సరముల క్రిందట ఈ నోటు విచిత్ర ముగా వచ్చి విచిత్రముగా మాయమై పోయినది. అప్పుడు ఆదిలక్ష్మి మూడేండ్లది. అప్పుడామె యమ్మమ్మ బ్రదికి యుండెను. అది యెండకాలము. చేల కోతలయి పోయి నవి. కోటుపోయిన చేలలో పశువులు పరిగ మేయుచుం డెను. ఒక 'పిచ్చి'నక్క పొలములలోఁ దిరుగుచుఁ గనఁ బడిన మనుష్యులను పశువులను గఱచు చున్నదని యొక నాఁడు తెలిసికొని యూరంతయు నట్టుడికినట్టుడుకుచుం డెను. ఆదిలక్ష్మి యమ్మమ్మ యొక వెదురు బడితెను చేతఁ గొని యావు లెచ్చట నున్నవో వెదకి వాటినింటికిఁ దోలు కొని వచ్చుటకు బయలు దేరెను. ఆమె యిటునటు కొం తసేపు తిరిగి యూరి వెలుపలి పొలములోనికి వచ్చెను. అచ్చట నొక తెల్లదొర, పిట్టల వేటాడుటకై వచ్చి, చేని గట్టుమీఁదఁ గూర్చుండి యుండెను. ఆతఁడలసి యున్నాఁడు గాఁబోలు తన ఱుపాకినిఁ గ్రిందఁబెట్టి జేబు లోనుండి [illegible] తినుచుండెను.

ఇంకేమున్నది! ఆ తెల్లదొర వెనుకనుండి యా పిచ్చినక్క మహావేగముతోఁ బరుగెత్తి వచ్చుచుంట ఆదిలక్ష్మి యమ్మమ్మ చూచెను. అంతలోనె యది వాని వీపుమీఁదికెక్కి పట్టి మెడను కొఱుకుటకుఁ బ్రయత్నించు చుండెను. „ఓ దొరగారూ! నక్క! నక్కండీ" యని యాముసలి దఱచుచు, చేతనైనంత వడిగా వాతనియొద్దకుఁ బరుగెత్తెను. భాగ్యవశమునఁ గొన్ని గజముల దూరములో నుంటచే, నామె సమయము మించకముందే యక్కడకుఁజేరి, తనవెదురు కఱ్ఱతో దానినిఁ గొట్టెను. ఆనక్క చావలేదు. కాని యది వానిని విడిచి యామెపైఁబడెను. అంతలో వాఁడాశ్చర్యము నుండి మేల్కొని దిగ్గున లేచి తన తుపాకి మొదలితో గొట్టి యా పిచ్చి నక్కను పరలోకమున కంపెను. కాని యంతకు మునుపే యది యామెను చెడబడ గఱచి యుండెను. ఆమె రొమ్ము మీఁది నుండియు, చేతుల నుండియు, ముఖము నుండియు నెత్తురు వరదలు కారుచుండెను. అతని కెంతో విచారము కలిగెను. „ఓయమ్మా! నా ప్రాణానికి నీ ప్రాణం అడ్డం పెట్టావు. నాతో పట్నానికిరా, నీకు మంచివైద్యం చిప్పించి బాగా నయం చేయిస్తాను" అని యాతడు కృతజ్ఞతా సూచకముగఁ బలికెను.

„అయ్యా! వద్దండి. మీతో నేనురాలేను. మీతో నేను వస్తే నాకులం పోతుంది" అని యామె జవాబు చెప్పెను.

„ఓ అవ్వా! పిచ్చిజంతువుకాటు చాల యపాయకరమైనదని నీకు తెలియనట్లున్నది, ప్రాణం పోతుంది సుమా. కావున నాతో రమ్ము. నిన్ను బాగు చేయడానికి యెంతడబ్బయినను కర్చుపెట్టడానికి వెనుదీయను. నాతో రా. నాతోరా. నాతోరమ్మని మిగుల కోరుతున్నాను. ప్రార్థిస్తున్నాను" అని యాయింగ్లీషు వాఁడు పలికెను.

ఆమె చిరునవ్వునవ్వుచు, „దొరగారూ! మాతాతల నెంద్రుకలన్ని తెల్లబడ్డవి. నేను ముసలిదాన్ని. పిచ్చినక్క కాటంటే యేమిటో నాకు బాగా తెలుసును. అట్టి కాటుచే నెలకో, మూడు నెలలకో, సంవత్సరంకో మనుష్యులు చచ్చిపోతూ వుండడం నేను చూచాను వాండ్లను మొట్టమొదలుఁ నీటిని చూస్తే భయం వేయడం మొదలవుతుంది. తరువాత చెప్పడానికి వీలులేని బాధలు పడిచచ్చిపోతారు. అదంతా నాకు తెలుసును కాని మామతం, మాకులం మాకెట్టిదో మీకేం తెలియును. మీరు ఆవుమాంసం తింటారు. మేము ఆవులను మాకు పాలిచ్చే తల్లులలె చూచి పూజిస్తాము. దేవుడు సృష్టించిన, ఎవరికేమీ హానిచెయ్యని పశువులను చంపడం మీకు చాలా సంతోషం; మేము ప్రాణాన్ని పవిత్రంగా చూచి, క్షమింప శక్యంలేని మానవుడు బుద్ధిపూర్వకంగా వాటిని చంపడం ఘోరంగా తలుస్తాము. ఓదొరగారూ! నేను ముసలిదానను; విధవను; బీదరాలను. ముసలిదై, చీకిపోయిన యీ శరీరాన్ని మార్చుకోడానికి నేను సిద్ధముగా వున్నాను. దేవుడు నాకు మంచి శరీరాన్నిచ్చి, వచ్చే జన్మలో గొప్పకులములో పుట్టింప నున్నాడేమో అంతేగాని, నేను తెలుగుదాన్ని. తెలుఁగు స్త్రీలు మరణానికెన్నడూ భయపడరు. మాతాతగారు చచ్చిపోయినప్పుడు మా అవ్వగారు చితిపైనెక్కి, మాతాతగారి తలను తొడపై పెట్టుకొని నవ్వుతూ మంటల్లో కూర్చుండి భస్మమై పోయింది. ఈలాగ ఎందరో తెలుఁగు స్త్రీలు ప్రతిసంవత్సరమూ చచ్చిపోయిన తమ భర్తలతో కాలిపోయారు. మాకు మరణమంటే భయంలేదు. వేయిప్రాణాలకైనా, ప్రపంచంలోని భాగ్యరాశికంటే మాకు మతమే గొప్పది." అని యుపన్యాసమిచ్చెను.

ప్రార్థనలన్నియు విఫలము కాఁగా ఆ యింగ్లీషు వాఁడు తన డబ్బుల సంచిని తీసి యామెకిచ్చెను.

„అమ్మా! నీవు నాకుచేసిన మేలుకు నేనేమి చేసిను నీఋణం తీర్చుకోజాలను, అయితే నిన్ను రక్షించే విషయంలో నాకెంతమాత్రం అవకాశం యివ్వడంలేదు. కాన యీసంచిలో నున్న ద్రవ్యంతో నీవల్లు బాగుచేయించుకో" అని పలికి మిగుల విచారముతో అతఁడు వెడలిపోయెను.

ఆ ముసలి దింటికివచ్చి జరగిన దంతయు, గూతురుకుఁ జెప్పెను. ఆసంచిని విప్పిచూడఁగా అందులో అయిదు రూపాయలు, కొన్ని డబ్బులుండెను. వారిసంతోషము

కనిపించకుండెను. వారికదియే గొప్ప మొత్తము. అంతియుగాక, అందొక తెల్లని గట్టి కాగితమునుండెను. దానిపైనేమో వ్రాయబడి యుండెను. వారదియెట్లు గ్రహింపగలరు? పురుషులు గాని, స్త్రీలు గాని చదువుకొను నాచారము ఆకులములో నసలే లేకుండెను. ఆముసలిది కాగితమును దీసి పారవైచెను. అది గాలికటు నిట్టు కొట్టుకొనిపోయి మూడేండ్ల వయస్సుగల 'అది' యాడుకొనుచున్న చోటికిఁ బోయెను. ఆబాలిక దానినిఁ బట్టుకొని, యాయూరిలోని కొందరి బాలుర చేతులలో పతంగులను జూచియున్నది కావున, అట్టి పతంగిని చేయఁ దలచెనో యేమో దానిని భూమిపై పరచెను. ఆకాగితమట్లు వెడల్పు చేయఁబడి నేలమీద నుండుట చూడఁగానె అది లక్ష్మి తల్లి గిటాలున నేదో యోచన పొడగట్టి, బాలిక చేతులలో నుండి దానిని లాగుకొని "అమ్మా! ఏదో కాగితానికి నోటు అంటారు. నీవు వినలేదా? దానికి రూపాయలిస్తారు. ఇది కూడ అదే మోస్తరు కాగితమేమో. నోట్లు చెసేవారుదొరలే." అని పలికెను.

తల్లి బిడ్డలిద్దరును ఆశ్చర్యముతో నిప్పుడు ముగ్ధులైపోయిరి. వారికంత యదృష్టము పట్టనున్నదా? అశక్యము! అట్టి దానికి నోచుకొనని నిర్భాగ్యులు గదా? అయినను, సంశయించిన సరకులమ్ము సర్వయ్యకు దానినిఁ జూపుటకు ముసలిది నిశ్చయించుకొనెను. సర్వయ్య ఆకాగితమును నిదానించి చూచి, వెలుతురుకుఁ బట్టియు, ఇటు వైపు, అటు వైపు త్రిప్పి త్రిప్పియుఁ బరీక్షించెను. వానికిని ఇంగ్లీషు రాదు కాని యది 'నోటు' అని యాతనికిఁ దెలియును. దానిమీఁద ఒక నిలువుగీత దాని తరువాత రెండు సున్నలుండుట చూచి ఆనోటు యొక్క వెలసరిగానే గ్రహించెను. తనడబ్బుల పెట్టెలో నుండి ఐదు రూపాయలు తీసి, ఆముసలి దానికిచ్చి, "పో" అని గద్దించి పలికెను.

అయితే ఆదిలక్ష్మి మంత్రువ ధైర్యశాలినియు, తెలివిగలదియు నైయుండెను. ఆమె వెంటనే యది "నోటు" అనియు, కోమటివాఁడు తనకిచ్చిన సొమ్ముకంటె మిగుల వెలగలదనియు గ్రహించెను. ఐదు రూపాయలు తీసికొనుటకు సమ్మతించక యామె తన నోటు వాపసు చేయుమనెను. వారిద్దరికిని కొంత వాదము జరిగెను. పోలీసు వారికిఁ దెలిపెదనని కోమటి భయపెట్టసాగెను. ఇంతలో జనులందరు రచ్చట గుమిగూడిరి. అదృష్టవశమున నాగుంపులో నొక బ్రాహ్మణ బాలుఁడుండెను. ఆబాలుఁడా సంగతి సందర్భములను దెలిసికొని, ఆనోటును ఆమెకు వాపసు చేయుమని వానిని నిర్బంధపరచెను. అతఁడా నోటు వెల నూరు రూపాయలనియు, అది చిన్న సంతగల యూరగుటచే ఒకటి రెండు రూపాయలిచ్చుటతో, ఆమె కిష్టమైన యెడల, మార్చి రూపాయలిప్పించెదననియుఁ జెప్పెను. ఆగని యుపకార బుద్ధికి చాల సంతోషించి, వందనము చేసి, కొంతసేపు ఆలోచించుకొని యప్పుడది మార్చుటకు ఇష్టపడలేదు. "మాచిన్న గుడిసెలలో నింతగొప్ప మొత్తము రొక్కమును దాచుట మంచిది కాదు. దొంగలీజాడ కనిపెట్టి మమ్ముల చంపివేస్తారు" అని నోటు మార్చకుండుటకుఁ గారణము చెప్పెను.

అత్యంత సంతోషముతో నామె యింటికి మరలి వచ్చెను. ఆనోటును గురించి ఏమిచేయవలెనో తల్లి బిడ్డలిద్దరును రాత్రంతయుఁ జర్చించిరి. తుదకు ఆవశ్యకము వచ్చుదనుక దానిని దాచిపెట్టుటకు నిశ్చయించుకొనిరి. ఎట్టి యవసరము రానట్టయితే, ఆద్రవ్యముతో పెండ్లి కాలమందు ఆదికి సొమ్ములు చేయించి పెట్టవలెననియు, ముఖ్యముగా వెండి కంటె చేయించి పెట్టవలయుననియుఁ దలంచిరి. ముసలామె దానిని ఎక్కడనో దాచిపెట్టెను. భద్రపరచిన చోటును గూర్చి యామె బిడ్డకుఁ గూడ తెలుపలేదు. ఇట్టి రహస్యమును అవసానకాలమందే తెలుపదగునని యామె తలంచెను.

ఈ గ్రామమునందును, ప్రక్క గ్రామములందును పిచ్చి నక్క కాటుచే పదునైదుగురు చచ్చిరి కాని యదేలాగో ఆదిలక్ష్మి మంత్రువతల్లియు, ఇంక నిద్దరు ముగ్గురును, పిచ్చి నక్క కాటు పడినవారలు అట్టి ఘోరమరణము నుండి తప్పించుకొనిరి. అయినను ఆమె యొంతో కాలము బ్రతుకలేదు. పైకథ జరిగిన రెండు సంవత్సర

ములకు ఆమెకు జ్వరము తగిలెను. జ్వరము తగిలిన నాటినుండియు నామెకు స్మృతి తప్పి, అలాగే వారము దినములుండి మరణించెను. ఆమె మరణానంతరము నోటు కొఱకు ఇల్లంతయు వెదకబడెను. మూల మూలలు చట్లుకుండలు బాగా వెదకిరి. ఇల్లంత త్రివ్వి కూడ చూచిరి. తుదకు ఇంటి కప్పునూడబెరికియు, బరీక్షించిరి. కాని శ్రమయంతయు వృధయయ్యెను. నోటు కనఁబడలేదు; మాయగాఁ బోయినది. ఆదిలక్ష్మితల్లిదుఃఖము నూహించవలసిందే గాని వర్ణించుటకు వీలులేదు.

## 3

కేడగంప ప్రక్కనఁ గూర్చుండి ఆదిలక్ష్మితల్లి కడుదుఃఖించెను. "అయ్యో! నోటు! హా! నోటు! ముంతెడు రూపాయలే" అని విలపించెను. కొంత సేపయిన తరువాత నామె మెల్లఁగాలేచి, తన చీర కొంగుతో కండ్లు తుడుచుకొనెను. పిమ్మట ఆమె తిరిగి ఆదిలక్ష్మిని పిలిచెను. కాని యీ సారి యామె కంఠధ్వని కొంత మృదువుగా నుండెను.

"అది! బిడ్డా! తొందరపడమ్మా. లేకపోతే నువ్వు పోకముందే సంత ముగిసిపోతుంది. నీ పెరుగు కొనడానికి యెవ్వరు కూడ వుండరు"

"వస్తూన్నాను, అమ్మా, వస్తున్నాను" అని ఆదిలక్ష్మి గుడిసెలో నుండియే కేక వేసెను. ఆమె అట్లు సింగారించుకొని, తాంబూలము వేసికొనెను. ఆ గుడిసె యొక్క మంటిగోడ మేకుకుఁ దగిలించియున్న చిన్న యద్దమును దీసి తన ముఖమును, ముఖ్యముగా తాంబూలమామె పెదవులను ఎఱ్ఱగఁ జేసినదో లేదో బాగుగఁజూచుకొనెను. అప్పుడామె వట్టిమెడ కనుపించి, ఆ నోటు అంత మాయగాఁ బోకయుండినయెడల వెండికంటెను చేయించుకొనియుండును గదా యని తలంచి నిట్టూర్పు విడచెను. తిరిగి యా చిన్నయద్దమును యథాస్థానమందుంచెను.

ఆ యద్దమునకు సమీపముననే, ఆ గోడయందు మరియొక మేకునకు ఒక పటము వ్రేలాడుచుండెను. అది మోటుగా వ్రాయఁబడిన యొక పటము. దానిపై మన్నుపడకుండ ముందువైపు అద్దముగలదు; వెనుక వైపు పలుచని చెక్క వేసి, చుట్టు చట్రము బిగింపఁబడెను. ఆ పటము సుమారు పదునెనిమిదంగుళముల పొడుగు, పన్నెండంగుళముల వెడల్పు గలది. దాని వెలయో, పటము, అద్దము, చట్రము అంతయుఁగలిసి నాలుగణాలకంటె నెక్కువ యుండదు. అది కాళికాదేవి పటము. మహాభక్తితో ఆదిలక్ష్మి యా పటమును దీసి నేలమీద గోడకు వంపుగా నానించి పెట్టెను. ఆమె మోకరించి, మూడు సార్లా పటమునకు తల నేలతగులునట్లుగా నమస్కరించి "తల్లీ! నామనస్సులోని చింతాభారమును దొలఁగించుమమ్మా!" అని ప్రార్థించెను.

తిరిగి దానిని యథాస్థానమందుంచుటకుఁ బ్రయత్నించెను. ఆమె కాని అయ్యో! ఆ పటమును మేకునఁ దగిలించఁ బోఁగా ఆమెచేతి నుండి జారి పట్లున భూమిపై బడెను. గాజు ముక్కలు చెల్లా చెదరయి పడెను. పాపమా బాలిక తాను చేసిన గొప్ప నేరమునకు నిర్ఘాంతపడి నిలిచెను. అది మహాపచారమే కాక, ఎంతో నష్టప్రదము కూడనయ్యెను. ఆమె తన తల్లి స్వభావమును బాగుగ గుర్తెరుగును. చెఱువునుండి యొకనాడు నీళ్లు దెచ్చుచు పగులఁగొట్టిన కుండను గూర్చి తనతల్లి ప్రతి దినము ఇద్దించిన బహుమానములు, పెట్టిన చీవాట్లు ఆమెకు జ్ఞాపకమునకు వచ్చెను. పటము గల కాగిదమును గాని, చట్రపుముక్కలను గాని గాజుతునకలను గాని యెరుటను ఆమె ప్రయత్నించలేదు. వాటి వైపు చూచుటకే యామెకు భయమయ్యెను. ఆమె తొందరగా పెరుగుకుండను దీసికొని, నెత్తిపైనఁ బెట్టుకొని గుడిసెలో నుండి వెలుపలికి వచ్చెను. వాకిటిలో నొక ప్రక్కన యిదివరలో వర్ణించిన విధముగాఁ బిడకలు చేయుచున్న యామె తల్లి "ఇంట్లో యేమి చేయుచున్నావే. నాకు వినబడ్డ చప్పుడేమిటి? ఏదయినా పగులగొట్టావేమిటి!" కూఁతును ప్రశ్నించెను. ఆదిలక్ష్మి మారుమాటాడక తన త్రోవను సంతకు వడివడిగా నడచెను.

భయము, నిరాశ, దుఃఖము తన్ను బాధించుచుండఁగా ఆమె యెట్లో నడచుచుండెను. దీని కంటెఁ గార

ము పగుల గొట్టిన పటమే కాదు; తన మగని ప్రవర్తనయు, మంగలి దానినిఁ గూర్చిన వదంతియు నామె మనస్సును ఖిన్నము చేయుచుండెను. అయ్యో! ఇనాటి యుదయము ఇంక నెంతో బాధకరముగా నున్నది!

సుమారు తొమ్మిది గంటలయినప్పుడు ఆమె సంతయూరు సమీపమునకు వచ్చెను. సంతకు వచ్చేవారి పోయేవారి, కొనేవారి అమ్మేవారి సందడి యామె గ్రహింపగలిగెను. అట్టే దగ్గర దగ్గరకు వచ్చుచుండెను. సంతపేట మార్గమున కెడముగా నున్న మామిడితోఁటలో నిలుచున్న యా యిద్దరెవరు? వారు తమ ముచ్చట్లలో మునిగి యున్నట్టున్నారే? తాము మాటాడుకొనుటకు వారేల యీ యేకాంత ప్రదేశమునకు వచ్చిరి? ఆదిలక్ష్మి దూరమునుండి వారినిఁ జూచి యట్లాశ్చర్య పడసాఁగెను. ఆ యిద్దరిలో ఒకమనిషి మగవాఁడు; రెండవమనిషి ఆడది యని యామె తెలిసికొనెను. మగవాని వీపు ఈమెవైపుండెను. వానికెదురుగా నా స్త్రీ యుండెను. ఆమె సుమారు రెండువందల గజముల దూరములో నున్నను ఆ మగవానిని సులభముగా గుర్తింపఁ గలిగెను. "హా! దైవమా! నామగడే!" అని యామె నిట్టూర్పుతో ననెను. తన మగని శరీరము అడ్డముండుటచే ఆ స్త్రీ యెవ్వరో తెలిసికొనఁ జాలక పోయెను. అయితే యూరివారందరు చెప్పుకొనుచున్న యా మంగలిముండ కాక మరెవ్వతె యగును! ఈ విధముగా నాదిలక్ష్మి భావించెను.

ఆమె చిత్తమిప్పుడు దుఃఖముచే వికావికలయ్యెను. దీని నామె భరింపఁజాలక పోయెను. ఇట్టి దుఃఖముతో నట్టి పిచ్చితో సంతకుఁ బోవుటకు నామె కాళ్లాడకుండెను. కొంచెము మెచ్చు తగ్గగా మతిచెడి యామె దారి తప్పి యెడమవైపుననున్న తుప్పల యడవిలోఁ బ్రవేశించెను. తన కడ్డముగవచ్చు పొదలను ద్రోసికొనుచు ఆమె డొంకలో నెంతసేపు పోయెను. ఆమెకున్న చీరలలో మేలైనదగు జానల్లంచు తెల్లచీర ముండ్ల కంపలచే చాలలయ్యెను. ఆమె కాళ్లలో ముండ్లు గ్రుచ్చుకొనెను. దేహమునిండ ముండ్లు గీచుకొని పోయెను. ఎంతో బాధ కలుగుచున్నను, గాయములచే నాడలనుండి నెత్తురు కారుచున్నను లక్ష్యము చేయక శక్తి యుడుగునంత వరకు [illegible] పోయెను. అలసట, దాహము, మూర్ఛ తన్నలమికొనఁగా నామె తన దధిభాండమును క్రిందఁబెట్టి, ఒకానొక మడుగు నొడ్డున చెట్టు నీడను విశ్రమించెను. రెండుచేతులతో మొగము గప్పికొని యామె యేడ్వ సాఁగెను. ఈ విధముగా కొంత కాలముండెను. అప్పుడా పొదలలో నేదియో తిరుగుచున్నట్లు ఏదో చప్పుడు ఆమె కర్ణతాడిత మయ్యెను. అయ్యో! దురదృష్టము! దురదృష్టము!! ఒక కుక్క తన తలను సన్నని మూతిగల యా పెరుగు కుండలో దూర్చుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆమె దిగ్గునలేచి కూర్చుండెను. ఆ చప్పుడున కా కుక్క భయపడి యా కుండను తెలియకుండనే నెట్టెను. అది క్రిందికి దొర్లుచు పోయిపోయి యా యగాధ జలములోఁ బడెను. ఆమె దుఃఖమిప్పుడు సంపూర్ణమయ్యెను. నోట మాటలేదు; కంట నీరులేదు. పెరుగు కుండ యదృశ్యమైన వైపే వెఱ్ఱిగా చూడసాగెను. "ఓ భగవంతుఁడా! నన్నింతే దుఃఖపెట్టుటకు నేనేమి యపచారమొనర్చితిని? నా జీవితములో బుద్ధిపూర్వకముగా నేనొనర్చిన తప్పొకటియు నాకు గనబడుటలేదు. ఇది నా పూర్వ జన్మఫలముగాబోలు. మంచిగాని చెడ్డగాని పూర్వజన్మములో చేసిన కర్మననుసరించి జరుగునని చెప్పెదరు. ఓ దుర్గా! ఓ కాళీ! ఓ జగన్మాతా! ఈ దీనరాలిని దయతో చూడుము" అని రెండు చేతులు జోడించి ప్రార్థించెను.

## ౪

ఇట్లు కొంతసేపు ప్రార్థించఁగా నామె చిత్తము శాంతసంభరిత మయ్యెను. ఆమె మరియొకసారి యాకాశమువైపు చూచి దీర్ఘప్రణామముచేసి, జగన్మాతనే స్మరించుచు, సంతలో నిక పనియేమియు లేనందున నింటివైపు మెల్లగ నడవసాగెను. ఆమె యింటికి వచ్చువఱకామెకు రెండు జాములు తిరిగిపోయెను. ఆమె మనస్సిప్పుడెంతో నెమ్మదిగా నుండినను, తల్లియెదుటఁ బడుటకామెకు ధైర్యము లేక వసారాలో కూర్చుండెను. ఆదిలక్ష్మి తల్లి కట్టమూరి [illegible] చే యుండెను. తన కూతు

రు మామూలుగా పిలిచి, సంతసమాచారము తెప్పుడు చెప్పినట్లుగా చెప్పకుండ కూర్చున్నందులకు ఆమెకొళ్చర్యము కలిగెను. రెండు చేతులలో మొగముం గప్పికొని కూర్చుండియున్న బిడ్డను జూచెను. ఆమె బిడ్డను సమీపించి, చేతులను బట్టుకొని, వాటిని మొగము నుండి త్రోసిపైచి, బిడ్డా! పటము కొఱకేమి విచారపడబోకు. ఆ శ్రీలక్ష్మీదేవికే మన మీద దయగలిగి నీ చేతిలో నుండి పటము జారునట్లు చేసినది. కండ్ల నీరుతుడుచుకో. ఇది ఏడ్వవలసిన దినంకాదు, సంతోషించవలసిన దినం. అది లక్ష్మి! మామయ్యా! చివరకు నీకు వెండి కంటె లభింపనున్నది!'' అని పలికెను.

అపారమైన ఆశ్చర్యములో ఆదిలక్ష్మి మునిఁగి పోయెను. కండ్ల వెంబడి నీళ్లు ఇంకను గిరగిర దిరుగుచుండగ, పిరికిగా „ఏమిటమ్మా?'' అని యడిగెను.

„ఓసి పిల్లా! నీవాపటపు అద్దమును పగులగొట్టుట ఎంతో మంచిదయింది. ఆ చప్పుడేమో నీవు చెప్పకుండ వెళ్లిపోయినప్పుడు, అదియేమో తెలుసుకోవాలని నేనింట్లోకి వెళ్లాను. నేనింట్లోకి పోయి పగిలిపోయిన గాజుముక్కలు, పటము చెక్కలు ఇంటినిండ పడియుండుట చూడగానే నాకు చాల కోపంవచ్చింది. భయముతో వణకుతూ పటమును బయటికి తీసేవఱకూ నీకేం చెప్పనూ దాని వెనుకనే మనము పోయిందనుకున్న నోటువుంది. మీ అమ్మమ్మ ఆ నోటును పటమునకున్న వెనుక నున్న చెక్కకున్ను మధ్యదాచిపెట్టినది!

„ఓ అది! భగవంతునికిన్ని, మహంకాళమ్మకున్ను మనమీద వుండే దయను మనమెన్న దండాలు పెట్టినను చాలవు. ఆ నోటుకొరకు ఎన్నో రాత్రిళ్లు విలపించినాను. ఎన్నో రాత్రిళ్లు ప్రార్థించాను. చివరకు దేముడు నా ప్రార్థన విన్నాడు. అమ్మా! నీకు వెండికంటె చేయించడానికి అభ్యంతరంయేమి?'' అని తల్లి పలుకరించెను.

ఆదిలక్ష్మి నవ్వుకోలు తెచ్చుకొనెను. కాని వెంటనే సంతవద్ద తోటలోని దృశ్యము జాపకమునకు రాగా

నామె మొగము వికాస హీనమయ్యెను. „అమ్మా!'' యని యనుచు బావురని యేడ్వసాగెను.

„బిడ్డా! ఇదేమిటే, పిచ్చిదానవా? ఇది యేడ్వవలసిన దినమా? స్నానంచేసు చెఱువుకు బోయిన నీ మొగుడు, నీ యీడు బిడ్డవస్తే ఏమంటారు.'' అని కోపముతో బలికెను.

„ఏమిటీ?'' అని యాదిలక్ష్మి ఆశ్చర్యముతో నడిగెను.

„ఏమిటేమిటి! నీ సెత్తి. నీ మొగుడు, నాయుల్లుడు వచ్చాడని నీకు తెలియదా? ఆయన అర గంటముందొచ్చినాడు. తనతో అక్క, చెల్లెలు గూడ తీసుకవచ్చాడు. ఆమె సంతజరిగే వూళ్లో నే వుంటుందికదూ? నీ మొగుడు నీకు పప్పు మిఠాయి తెచ్చాడు, నీ యాడు బిడ్డకు కలంకారి చీర, మల్లెపూల రవిక గుడ్డ తెచ్చింది. వారికోసం వంటగూడ తయారు చేస్తున్నాను. అల్లుడొచ్చినప్పుడు పట్టికూడు పెడితే యెంతోబాగుంటుంది. పప్పు పులుసు కాస్తున్నాను.''

„నిజంగానే—అమ్మా—నిజంగానే, మా ఆడబిడ్డ రావడంకూడ నిజమేనా?'' అని ఆదిలక్ష్మి ఆతురతతో నడిగెను.

„అంతా నిజమేనమ్మా. అక్కా, తమ్ముడూ ఇద్దరు వచ్చారు. వారు వచ్చి అర గంటయింది. ఇంటికి చమురు రాసికొని చెరువుకు స్నానానికి పోయ్యారు. వారింతలోనే వస్తారు''—అని తల్లి నవ్వుచు జవాబు చెప్పెను.

„అయితే మిఠాయి బట్టలు కూడా తెచ్చారా?'' అని ఆదిలక్ష్మి తిరిగియడిగెను. మగడు వచ్చినాడను సమాచారము, వినుట కింతవరకు నోచుకొనని యామెకు కర్ణపేయముగా నుండెను.

„అవునే—అమ్మా—అవును. విన్నావా! నీ వనుచు నీ వదినెతో తన యింటి విషయాలను గురించి చా

...చ్చి మాటాడినారట. వారు సంత వద్ది మామిడి తోట
...లో కూర్చొని విషయాలన్నీ చర్చించారఁట. నీ మగడు
...తల్లి నిన్ను బెట్టిన బాధలను గూర్చి అక్కతో జెప్పి
...నాఁట ఆమె నిన్ను గొట్టినదని విన్నప్పుడు నీ యాడు
...తల్లిమీద చాలా కోపమువచ్చింది, నిన్నో దాప్పుట
...కొడుకి వచ్చింది. తల్లికి బుద్ధి వచ్చేటట్లు చేస్తానట.
...మీదా నిన్నామె కఠినంగా చూడదని నొక్కి
చెప్పుతున్నది" అని తల్లిపలికెను!

మంగలి దానిని గూర్చి ఆదిలక్ష్మికిఁ గల యను
మానమిప్పుడు పటాపంచలమయ్యెను. ఆమె యత్యంత సం
తోష చిత్తయయ్యెను. ఇప్పుడామె బాలికవలె సంతోషా
వాహములు సలుపుచు, తేలిక మనస్సుతో చుట్టములను
...ను నవ్వుటలో మగ్నురాలయ్యెను.

తరువాత కొన్నాళ్లకు నోటు మార్చిరి. అట్లు వచ్చి
న రూపాయలలో నుండి యిరువదియైదు రూపాయలు
పెట్టి కంసాలిచేత ఆదిలక్ష్మికి కంటె చేయించిరి. చాం
దిని వెండితో జేయఁబడి తళతళ మెరయుచున్న యాకం
టె యామె కంఠమునలంకరించి నప్పుడు చామన చాయ
గల యా ముగుద కెంతో శుద్ధగా నుండెను. మిగత
ద్రవ్యము, అనగా, డెబ్బదియైదు రూపాయలు ఒక ముం
తలో పోసి దానిని వంటింటఁ బాతిపెట్టిరి. దానికింకను
భద్రము సమకూర్చుటకై ఆదిలక్ష్మి తల్లి తన మంచపు
కోటికి ఒక దానిని ఆ ప్రదేశముపై పెట్టెను.

కొన్ని నెలల తరువాత ఆదిలక్ష్మి మరల యత్త
వారి యింటికి బోయెను. ఈసారి యత్తగారామె
నేమియుఁ జేయజాలక పోయెను. ఆమె యాదిలక్ష్మిని
ఎంతో దయతోఁ జూచి, యామెకు గావలసిన
వన్నియు నిచ్చుచు మన్నించెను. కారణమేమి? ఆదిలక్ష్మి
తల్లి యిప్పుడు గొప్ప భాగ్యవంతురాలు! ఆదిలక్ష్మి
యిప్పుడు భాగ్యవంతుల యింటి యాడుపడుచు. వియ్యపు
రాలి భాగ్యమును గూర్చి యత్తగారు ఇరుగు పొరుగు
అమ్మలక్కలతో వ్రేళ్లు మడిచి లెక్కపెట్టును "ఒక
యిరవయి రెండు—యిరవయి మూడు—యిరవయి నాల్గు—
యిరవయి అయిదు—లెక్కవ"—అని చెప్పుచుండును.



# పరిణయ పాకము

## అనుముల విశ్వనాథ శాస్త్రి

శా॥ తృణపాశంబు కరీంద్రు గట్టెను విధిన్ దేవీలవాచారముల్
ప్రణయాకార కరజ్జుకల్పనముగాఁ బాదిల్లె నిర్ దొట్టి దు
ర్గుణు నిన్నన్ను భవత్సరాయితుని గాఁ గూర్పంగ దేయంగనా
మణి చేతో భవశంజినీ సహా గృతిర్ మమ్మొంటబంధించునో॥



# ప్రాచీన భారత పరిజ్ఞానము

శిరుగూరి హనుమంతరావు



ప్రాచీన హిందూదేశమును గురించి సామాన్య జనులకు జ్ఞానము బొత్తిగా లేదని చెప్పవచ్చును. ఇంగ్లీషు విద్య చదివిన వారికి గొంత విపరీత జ్ఞానము కలదు కాని ప్రాచీన హిందూదేశములో, తత్వ విషయములలో గాని, చరిత్రాంశములలోగాని, పరిపాలనా విషయములలో గాని, నాగరికత విషయములలో గాని మనకు సరియైన జ్ఞానము లేదు. మనదేశములో చాలా మందికి బహిరంగ ప్రజ్ఞాప్రదర్శనమందు అభిలాష తక్కువ. మనకు రెండుమూడు సంగతులు తప్పో, ఒప్పో, తెలిసినంతమాత్రమున మ్యాక్మిలెన్ కంపెనీలో నొక పెద్దపుస్తకము వ్రాసి, దానిని పత్రికలలో ప్రకటించి, ప్రపంచములోనందరికి దెలియజేయము. పాశ్చాత్యులో, కన్యాకుమార్యగ్రము వద్ద నోడనుండి దిగి రైలు మీద హిమాలయ పర్వతముల వరకు నెలగొజాలు ప్రయాణముచేసి రైలుదగ్గరనున్న యాత్రికుల ధర్మశాలలో దిగి, వారి సామాను మోయుట, భోజనముతయారుచేయుట, ఇటువంటి వృత్తులలో నుండు హిందువుల సంపర్కము కలిగినవారై వారియొక్క గుణములే సర్వహిందువుల గుణములు, వారి యాచార వ్యవహారములే సర్వ హిందువుల యాచారవ్యవహారములు, వారి దేవతలే హిందువుల దేవతలు, వారి బలులే హిందువుల యజ్ఞములు, వారి నీతిప్రవర్తనయే హిందువుల నీతిప్రవర్తన, (హిందువు లడవిమృగముల వంటి వారు, వారికి నాగరికతయే లేదు. వారు బహుదేవతారాధన చేయువారు, వారిని మన ప్లేటోతో గాని అరిస్టాటిల్‌తో గాని పోల్చుటకు దగినవారు కారు, అని ఈప్రకారముగా వారికి తోచిన మాటలు వ్రాయుచున్నారు. మనకో సంస్కృతజ్ఞానము బొత్తిగాలేదు. తాటాకు పుస్తకములన్నియు జగలు పట్టి పోయినవి. ఎవరైనా నొకటిరెంటి నచ్చు వేయ ప్రారంభించిరా, ఆ సంచికలు రాగానే చందాదారుల యుత్సాహము తగ్గిపోయి "బందు" అయి పోవును. సంస్కృత జ్ఞానము రావలెనని కొందరు తలిదండ్రులు బలవంతముగా సంస్కృతము చదివించెదరా బి. ఏ. సంస్కృతము "ప్యాసు" అయినను శ్లోకములకు నర్థము చెప్పలేము. నేను ఎమ్. ఏ. (హిస్టరీ) చరిత్రలో "ప్యాసు" అయినప్పుడు క్రీస్తునకు ముందు హిందూదేశములో జరిగిన సంగతులు కాలేజీలో చదువవలసిన యవసరమే లేకపోయెను. నేను ఎమ్. ఏ. "ప్యాసు" అయిన తరువాత, ఒక పెద్దమనిషి, ఏమోయి, హిస్టరీ ఎమ్. ఏ. ఋగ్వేదము వ్రాసిన కాలములో సింధునదీ యెక్కడ ప్రవహించెను? అప్పటి యార్యావర్తములో నుండిన నరుల గురించి యేమైన తెలియునా? అని యడిగితే, నాకు జవాబుచెప్పుటకు సిగ్గు వైచెను. మన ప్రాచీన చరిత్ర తెలియక, తెలిసికొనుటకు ప్రయత్నము చేయక, మనదేశమునకు నానంద వనవిహారమునకుంగా వచ్చిన వారి మాటలు నమ్మి, మన దేశమెంత యౌన్నత్యమును బొంది

యుండినో మరచి పోవుచున్నాము. ఒక వ్యాసమునందే ప్రాచీన హిందూ దేశమును గురించి పూర్తిగా తెల్పుటకు నెవరికిని వీలుకాదు. కావున యేశాస్త్రమందు హిందూదేశీయులు ప్రపంచ మంతటిలో ,,సర్వోత్తములు'' నని అభిప్రాయపడుచున్నారో, ప్రకృతి శాస్త్ర ప్రాబల్యము గలిగిన యీ యుద్ధ మింతఘోరముగా జరిగినందున తల్లిదండ్రులు పిల్లల కొరకు, భార్యలు భర్తల కొరకు, మిత్రులు మిత్రుల కొరకు, బంధువులు బంధువుల కొరకు, మిగుల దుఃఖించుచు నీదుఃఖము నివారితమగుటకు నేతత్వశాస్త్రము నాశ్రయించుచున్నారో, అటువంటి శాస్త్రమందు నెట్టి విషయములు మన ప్రాచీన పుస్తకములు తెలుపఁజేయు చున్నవో, ఏవిషయములు మనము బాగుగా నర్థము చేసికొని యాచరణకుఁ దెచ్చిన యెడల మనవైషమ్యములు లేకుండా బ్రాహ్మణునికి శూద్రునియందుఁ గాని, శూద్రునికి బ్రాహ్మణునియందుఁ గాని వైషమ్యము లేకుండ, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, అందరు నన్యోన్య ప్రేమతోఁ నుందురో, అట్టి విషయము గురించి కొంత దెలుప నుద్యమించితిని.

తత్వశాస్త్రమునుగురించి యెవరైనను వ్రాయబూనిన యెడల, మనదేశములో వలసినంత తత్త్వశాస్త్రమున్నది. మనకుఁ గావలసినవి స్థాపత్య విద్యలు. ,,ద్వైత తత్త్వ సిద్ధాంతములలో ఏమి ప్రయోజన మీతర్కములవల్ల' నని యందురు. ఆదిగాను, ౩౦౦౦ సంవత్సరముల క్రిందట హిందూదేశీయులు గణిత శాస్త్రములోను, జ్యోతిశ్శాస్త్రములోను, విపరీతమైన జ్ఞానము బొందిరి. అర్థశాస్త్రములో ను, పరిపాలనా శాస్త్రములోను సమాన నిపుణత్వము బొందిరి, శిల్పశాస్త్రములోను, అలంకార శాస్త్రములోను, ఆశ్చర్యకరమైన జ్ఞానమును బొందిరి. వాణిజ్యము లో నెంతో ఖ్యాతినిఁ బొందిరి. కాని, ఈకాలములో తత్త్వశాస్త్ర) విశేషాంశములందు నగాధప్రజ్ఞ అప్పుడు లేదు. అన్నిశాస్త్రముల సంబంధమును గనిపెట్టి, అన్నిశాస్త్రములను దత్త్వ దృష్టితోఁ జూచిరి. ఈకాలములో అతీంద్రియ విషయములు మీమాంస లంటే వానిముందు హేయతా దృష్టి నైటోనో, అన్ని మానుష తత్త్వశాస్త్రముల మీమాంసలయొక్క భాగములే. ఆదేవిధముగా హిందువుల

కుఁ బూర్వమందు నన్నిశాస్త్రములుఁ ద్వైత శాస్త్రమునకు భాగములే.

తత్త్వశాస్త్రమును మన ప్రవర్తనకు నానుగుణ్యముతో నుండునట్లు చేసిరి గాని, ప్రవర్తనకు సిద్ధాంత భాగమునకు సంబంధములేని శాస్త్రమును వ్రాయలేదు. ఈ ప్రపంచమందు ననేక దేశములు, ప్రాముఖ్యమును జెంది కొంత కాలమైన తరువాత నశించినవి. ఈజిప్టు దేశ మొకానొకప్పుడు మిక్కిలి యౌన్నత్యమును బొందియుండెను. ఇప్పుడు టుటుంకమాను గోరీలు చూచి వారి గొప్పను దెలిసికొనుచున్నాము. బాబిలోని యారాజ్యము గొప్ప కట్టడములు కట్టి, అత్యున్నత స్థితిలో నుండెనఁట. ఇప్పుడేమియుఁ గనఁబడదు. రోమకరాజ్య మొకవైపు గ్రేటుబ్రిటన్ మరియొకవైపు ఆఫ్రికా, మూఁడవవైపు ఆశియా ఈప్రకారము మూఁడు ఖండములు వ్యాపించియుండెను. ఇప్పుడు కొన్ని దేశములలో న్యాయపద్ధతులలో రోమక పద్ధతులున్నవని యనుకొనుట తప్ప మరేవియు రోమకుల యితర చిహ్నములు లేవు ఇటువంటిస్థితిలో ౪౦౦౦ సంవత్సరములనుండి హిందూదేశము యొక్క నాగరికత, హిందూదేశముయొక్క ధర్మములు, హిందూదేశము యొక్క తత్త్వశాస్త్రము, ప్రపంచములో నాశము లేకుండ నుండుట, ప్రపంచమునకు నాదర్శప్రాయముగా నుండుటకు నేమి కారణము! ఆంగ్ల రాజ్యాంగ చరిత్రలో ఆంగ్లేయులకును, ఇతరులగు యూరోపా దేశస్థులకును భేదము కనఁబడుచున్నది, ఆంగ్లేయులు వారి రాజ్యాంగ విషయములలో నెల్లప్పుడును బూర్వ పద్ధతులనే యవలంబించిరి. ఎప్పుడును హఠాత్పరివర్తనమునకుఁ బ్రియులు కారు. అందువలననె భ్యాంశములలో ఎడ్వర్డుకాలమునుండి ఇప్పటివరకు రాజు, మంత్రులు, జన ప్రతినిధిసభ, జనుల హక్కులు చెడక, వచ్చుచున్నవి. ఫ్రాన్సులో లాగుననే వోట నొక రాజ్య పద్ధతి కాదని చెప్పుచుండుదు. అలాగుననే హిందూదేశ చరిత్ర చూడను ౪౦౦౦ సంవత్సరములనుండి యైన నాశము లేకుండ ప్రపంచమునకు నాదర్శభూతముగా నుండుటకుఁ గారణము హిందుతత్త్వశాస్త్రము కేవలము గ్రాంధిక మీమాంస కాకుండ, నేకాలమునకుఁ గావలసిన మార్పులు, ఆకాలమునకుఁ జేయుచు

ఆచార్యులు శ్రోత్రమార్గులవలెఁ గన్పడకుండ, ఇదివరకు చెప్పినవే మరియొక విధముగాఁ జెప్పినట్లు చెప్పుచు, నెల్లప్పుడు చెప్పిన సంగతియు నొక్కటే యని— భారతీయ విజ్ఞానపు ముఖ్యలక్ష్యము—ప్రపంచమునకు చాటించుచున్నది. ఈమనవిజ్ఞానమహానది గొప్పనది. ఆదిహిమాలయ పర్వత ప్రాంతములయం దుద్భవించి, మెల్లమెల్లగా ననేక భూములయందుఁ బ్రవహించుచుఁ ద్రోవలో జిన్న చిన్న యుపనదులను సెలయేళ్లను గలిపికొనుచు, వేలకొలది యేండ్లలో బహుదేశములందుఁ బ్రవహించుచు ఆదేశములన్నింటిని భాగ్యవంతములుగఁ జేయుచు నిరంతరముఁ బ్రఖ్యాతిం గాంచినది.

ఇటువంటి నది యుద్భవించినది. ఋగ్వేదమునుండి ఆర్యులు మనదేశమునకు వచ్చి సింధూ హిమాలయ ప్రాంతములందు నివసించి, వైచిత్ర్యమైనటువంటి సృష్టినిచూచి వారి హృదయముకరిగి, సూర్యుని, చంద్రుని, నక్షత్రములను వర్ణించినటువంటి సూక్తములే వేదములు. మానవుడుచేయు కార్యములలో తన స్వాధీనములో నున్నవి కొన్ని తనస్వాధీనములో లేనివి అనేకములని ప్రతిదినము దృష్టాంతములు కనుపడుచున్నవి సూర్యుని యొక్క ప్రభావము మార్చుటకు మనకు శక్తిలేదు. వర్షము కురిపించుటకుగాని నిలుపుచేయుటకు గాని మనకు శక్తిలేదు. అగ్నియొక్క దహనశక్తిని మార్చుటకు మన స్వాధీనముకాదు. ఇటువంటి ప్రకృతిశక్తులచూచి అస్వతంత్రుడైనట్టి మనిషి, స్వతంత్రమైనటువంటి ఈశక్తులను జూచి వీటికి దేవతలని పేరుపెట్టిరి. 'దేవోదానాద్వా దీపనాద్వా ద్యోతనాద్వాద్యుస్థానో వాభవతి విద్వాంసో వాదేవః మాతృదేవోభవ, పితృదేవోభవఆచార్యదేవోభవ.'' భూమి మనకు కావలసిన వస్తువులను ఇచ్చుచున్నది గనుక భూదేవి అయినది. సూర్యుడు చంద్రుడు నక్షత్రములు వెలుతురు ఇచ్చునవి గనుక దీపనాద్వా దేవతలైనవి. ఈప్రకారముగా అనేక దేవతలను ఆరాధన చేసిరి అగ్ని, వరుణ, ఇంద్ర, సోమ, పర్జన్య మొదలగు అనేక దేవతలపేరులు చెప్పబడియున్నవి. కాని కొందరు పాశ్చాత్యులు వేదములమీద టీకలువ్రాసి ఆర్యులు బహుదేవతారాధకులనివాదించెదరు. ఒకచోట వరుణుడే ముఖ్యదేవతనియు, మరియొకచోట అగ్నియే ముఖ్యదేవతయనియు మరియొకచోట ఇంద్రుడే ముఖ్యదేవతయనియు జెప్పుచున్నారు. అనగా పరమాత్మ ఒక్కడే ఈదేవతలయందుండి వారి వారిచే, ప్రత్యేకప్రత్యేకముగా ఒక్కొక్క కార్యము చేయించువాడు. వీరంతా ప్రతినిధులు. రాజు ఒక్కడే అను అర్థమును తెలియ చేయుచున్నవి. "ఏకమ్ సద్ విప్రా బహుధా వదంతి— అగ్నిం యమమ్ మాతరిశ్వం ఆహుః''

ఈప్రకారముగా ఆర్యులు తమయొక్క తత్వజ్ఞానమును వెల్లడిచేయుచు హిందూదేశమునందు వ్యాపించుచున్నప్పుడు అనార్యులతో కలియుట సంభవించెను. ఈ అనార్యుల తత్వజ్ఞానము ఆర్యుల తత్వజ్ఞానమంత సూక్ష్మమైనది కాకుండెను. మంత్రములు, యంత్రములు, తంత్రములు ప్రబలమయి నిజమైన తత్వజ్ఞానము లేకుండెను. వారియొక్క సంపర్కము వలన అథర్వవేదములోను కొన్ని బ్రాహ్మణములలోను ఋగ్వేదములో బోధచేసిన నిజమైన తత్వజ్ఞానమును కొంచెము మరుపుకలిగి యజ్ఞములు, మంత్రములు, ప్రధానమయి నిజమైన పరమాత్మజ్ఞానము యెట్టిది అని కొంచెము సందేహము పుట్టుటకు కారణమయ్యెను. ఈసందేహము నివారణ చేయుటకు ఉపనిషత్తులు వ్రాయబడెను. ఈఉపనిషత్తులే వేదముల అంతములు. గనుక వీనికి వేదాంతమన్న పేరు వచ్చినది. గురువువద్ద శిష్యుడుకూర్చొని ఉపదేశమునుపొందిన రహస్యములు గనుక ఉపనిషత్తులు అని పేరు వచ్చినది. ఈఉపనిషత్తులను వ్రాసిన ఋషులు యెంత మహానుభావులు. వారియొక్క మహత్వమునకు సూచన 3 వేల సంవత్సరములయినను అవి నశింపకుండా అనేక జీవులకు జ్ఞానోత్పత్తిని కలిగించి దుఃఖనివారణము చేయుటయే వేదములయొక్క సారాంశమైనటువంటి సంగతి సర్వనియామకుడైనటువంటి పరమాత్మ ఒకడే అనునది. అవునా! కాదా అని సందేహము కలిగిన ఉపనిషత్తులలో ఆసందేహము పూర్తిగా నివారణ అగుచున్నది. ఉపనిషత్తులు బోధపరిచే ముఖ్యమైన సంగతి యేమనగా పరమాత్మ సర్వవ్యాపి. సర్వాంతర్యామి. అద్వితీయుడు. దేవుడెందరూ అని అడిగితే దేవుడు ఒక్కడే అని యాజ్ఞవల్క్యుడు బృహదారణ్యములో చెప్పుచున్నాడు. సర్వాంతర్యా

మైన అద్వితీయుడైన పరమాత్ముడు లేనియెడల గడ్డిపర
కు అగ్ని కాల్పలేదని చెప్పుచున్నది.

ఆయన భయమువల్లనే అగ్ని మండుచున్నది.

ఆయన భయమువల్లనే సూర్యుడు ప్రకాశించు
చున్నాడు.

ఆయన భయమువల్లనే గాలివీచను.

ఆయన భయమువల్లనే మేఘముగర్జించుఅని తైత్తి
రీయము చెప్పుచున్నది.

ఉద్దాలకుడును ౫ గురు గృహస్థులు అశ్వపతిరాజు
వద్దకు పోయినప్పుడు రాజు వారిని 'మీరు యే ప్రకార
ముగా ధ్యానము చేసెదరు' ని అడగగా ఒకడు 'ఆకాశ
మ' ని ఒకడు 'సూర్యుడ' ని ఒకడు 'వాయువ' ని ఒకడు
'జలము' ని చెప్పిరి. అప్పుడు రాజు పరమాత్మకు ఇవన్ని
అవయవములు, పరమాత్మ ఒక్కడే అని చెప్పెను.

ప్రకృతియందున్న ఆశ్చర్యకరమైన సృష్టినిచూచి
నను మన యొక్క అస్వతంత్రము, మన యొక్క అల్పశ
క్తి తెలియును. మనకంటె అధిక శక్తియున్న వస్తువు మరి
యొకటి వున్నట్టు తెలియును. లేదా మనము యేకాంత
ములో కూర్చొని మన కష్టసుఖములను ఆలోచించినను,
మన స్వతంత్రము కనపడదు. వేదములు ప్రకృతియందున్న
సృష్టిని చూచి మన అస్వతంత్రమును నిర్ధారణ చేయుచు
న్నవి. ఉపనిషత్తులు జీవుని యొక్క స్వభావమును చూచి
మన అస్వతంత్రము నిర్ధారణ చేయుచున్నది. పరమా
త్మను చూచుటకు ఆకాశమును జూడ నవసరము లేదు.
మన హృదయములోనే ఒక ఆకాశమున్నది. అక్కడనే పర
మాత్మ వున్నాడ' ని చెప్పుచున్నది. 'ఈ హృదయములో
నున్న పరమాత్మకు మనదేహము ఒక కోశము' అని చెప్పు
చున్నది. ఉపనిషత్తులలో చెప్పిన సంగతియే అగస్టైన్ కాన్ఫెషి
యన్‌లో చెప్పబడినది.

వేదములలో యజ్ఞములు మొదలైన కర్మలకు
ప్రాముఖ్యత ఇచ్చిరి. ఇటువంటి బహిరంగ ప్రదర్శము
నకు సాధ్యమైన వాడుకాదు పరమాత్మ. అంతశ్శుద్ధి
ముఖ్యము గాని బాహ్యశుద్ధిముఖ్యము కాదని ఉపనిషత్తులలో
చెప్పుచున్నది. వేదములలో చెప్పిన కర్మలన్నిటికి బాహ్యా
ర్థములు కాకుండా గూఢార్థములున్నవని, బాహ్యకర్మ
కంటె అంతరంగ కర్మ ముఖ్యమని చెప్పిరి వేదములలో
అశ్వమేధమే ముఖ్యయజ్ఞమని చెప్పబడినది. ఉపనిషత్తు
లలో అశ్వమనగా మన ఇంద్రియములు. అశ్వమేధమనగా
ఇంద్రియములను ఇతర పదార్థములయందు వెళ్లకుండా పర
మాత్మయందే వుండేటట్లుగ నిగ్రహించుట అని చెప్పబడి
నది. మన జీవిత కాలములో చేయు కర్మలన్నియు యజ్ఞ
మే అని మరియొకచోట చెప్పబడియున్నది. మనము చేసే
టటువంటి సమస్త కార్యములు భగవంతునికే సమర్పించిన
యెడల అదే యజ్ఞమనిపించుకొనును. వేరే యజ్ఞమే అవస
రము లేదు.

ఈ ఉపనిషత్తులలో చెప్పిన ముఖ్య అంశము పర
మాత్మ ఒక్కడే, సర్వవ్యాపి. సమస్త జీవజడ పదార్థము
లలో నున్నవాడు. 'ఈశావాస్యమిదం సర్వం' ఈ ప్రకృ
తిలో నున్న సమస్త పదార్థములు ఈశ్వరునిచే శాసింపబడి
యున్నవి. లేని యెడల ఈ ప్రకృతిలో యే పదార్థ చలిం
చలేదు. ఈ సమస్త పదార్థములలో నుండువాడు మరి
యొక పదార్థముతో సమమైనవాడు కాడు. అనేజద్
భయములేనివాడు యేకం అద్వితీయుడు మన సోజవీయో
మనస్సుకంటె వేగమైనవాడు. తదేజతి అతన్నిచూచి
అందరూ భయపడెదరు తన్నైజతి అతను యెవరిని చూచి
యు భయపడడు. కేనేషితం పతతి ప్రేషితం మనం కేన
ప్రాణః ప్రథమః ప్రైతియుక్తః కేనేషితాం వాచమిమాం
వదన్తిచక్షుః శ్రోత్రంక ఉదేవో యునక్తి యెవరి యిచ్ఛా
వుంటే మనస్సు పదార్థములయందు పరుగెత్తునో, ప్రాణ
ము యెవరి ప్రేరణవలన పనిచేయుచున్నదో వాక్కు, చక్షు
ను యెవరివల్ల పనిచేయుచున్నదో అతనే పరమాత్మ.
శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం స ఉ
ప్రాణస్య ప్రాణశ్చక్షుషశ్చక్షుః—వీడు పరమాత్మ—
కేనోపనిషత్తులో యెన్నోమంత్రములు ఈ విషయము
గురించి చెప్పుచున్నవి.

యద్వాచానభ్యుదితం యేనవాగభ్యుద్యతే

తదేవ బ్రహ్మత్వంవిద్ధి.

యన్మనసానమనుతే యేనాహుర్మనోమతం

యచ్చక్షుషాన పశ్యతియేన చక్షూంషి పశ్యతి.

యచ్ఛ్రోత్రేణనశృణోతియేన శ్రోత్రమిదం శ్రుతమ్
యత్ప్రాణేనన ప్రాణితియేన ప్రాణఃప్రణీయతే

దేవతలు దైత్యులను జయించిరట. తమతమ శక్తులవల్లనే జయించినారన్న గర్వం పరిహారం చేసేకొరకు వీరందరకు శక్తినిచ్చేవాడు ఒక్కడే అని నిశ్చయించే కొరకు బ్రహ్మ ఒక యక్షవేషము వేసికొని ఆదేవతలను వారి వారి చూపించమని అడిగెను. అగ్ని గడ్డిపరకను యొగరకొట్ట లేకపోయెను. ఇంద్రుడు వచ్చేసరికి ఆయక్షుడు పారిపోయెను. ఉమాదేవి కనపడి ఇతనే బ్రహ్మఅని చెప్పెను. అశబ్దమస్పర్శమ రూపమవ్యయం తథారసం నిత్యమగన్ధ వచ్చయత్ అనాద్యనన్తం మహతః పరంధ్రువం శబ్దస్పర్శ గంధరసాగ సములు లేనివాడు. యేకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధాయఃకరోతి, సర్వభూతాంతరాత్ముత్ముడైన ఒకడే అనేక రూపములగుచున్నాడు. నతత్రసూర్యోభాతిన చంద్రతారకం నేమావిద్యుతో భాంతికుతో యమగ్నిఃతే మేదభాన్తమను భాతి సర్వంతస్యభాసా సర్వమిదం విభాతి. సూర్యుడు చంద్రుడు నక్షత్రములు ఈ స్వరూపాద్యుత్ అగ్ని రూపమును చూపించలేవు. ఈస్వరూపము యొక్క తేజస్సు వలన దానికి తేజస్సు కలుగుతూ వున్నది. భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదిన్ద్రశ్చవాయుశ్చమృత్యుర్ధావతి పంచమః। ఈయన భయంవల్లనే ఈ దేవతలు వారివారి కార్యములు చేయుచున్నారు.

ఈ ప్రకారముగా పదే పదే పరమాత్మయొక్క గుణములు చెప్పినప్పుడు మనము మత వైషమ్యాలు పెట్టుకుని ఇతర దేశీయులచే మనలను వంచన చేయించుకుంటూ వున్నాము అయితే ఒక ప్రశ్న వేయవచ్చును. ఈ తత్వబోధవలన యేమి ప్రయోజనము. ఇది కేవలము పుస్తకజ్ఞానము. అనేక పుస్తకములు వ్రాయవచ్చును. మన ప్రవర్తనకు సహాయ భూతమైన మార్గము కేమైనను ఉపనిషత్తులలో చెప్పి యున్నదా అని అడుగవచ్చును. ఒక పాశ్చాత్యుడు ఉపనిషత్తులకు వ్యాఖ్యానము వ్రాయుచూ ఈ ఉపనిషత్తులు సాధారణముగా జనుల ప్రవర్తనకు సహాయ భూతములైనవి కావు, ఈ సంసారం వదలి అడివికి పారిపోయి తపస్సు చేసుకునే వారికి కాని మనకు ; పనికిరావని

జనము లేదని వ్రాసెను. ఉపనిషత్తులు బాగా చదివినవాడు ఈ అభిప్రాయమును సరియని చెప్పను. ఉపనిషత్తులలో సంసారం వదలి సన్యాసము తీసుకొంటేగాని దేవుడు లభ్యుడవడని లేదు. సంసారంలో వున్నప్పటి సంసారం యొక్క విషయ సుఖములందు సంపర్కము లేకుండా పరమాత్మ దృష్టితో సంసార యాత్ర చేయవలెనని చెప్పుచున్నది. జి జీవిషేత్ శతగ్ సమాః కుర్వన్నేవే హకర్మాణి కర్మలు చేస్తూ ౧౦౦ సంవత్సరములు జీవించమని చెప్పుచున్నది. అని ఒకరు వ్రాశినారు. అది అసిద్ధము. ప్రతి మనిషియందు మంచి గుణములు చెడ్డ గుణములు కలసి యున్నవి. కొందరికి మంచి గుణములు హెచ్చుగాను చెడ్డ గుణములు తక్కువగాను వుండును. దేవతలకు కూడా ఉంటూ వుంటుందని చెప్పుచున్నారు. మనకు హెచ్చు ఉపనిషత్తులలో చెప్పే నీతిబోధ యేమనగా యివితగ్గించుకొని సాత్వికబుద్ధి హెచ్చు వృద్ధిచేసిన యెడల బ్రహ్మజ్ఞానము త్వరితముగ కలుగును. ఈ జ్ఞానము పుస్తకములు చదువుట వలన రాదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. నాయమాత్మ ప్రవచనేనల బోధన మేధసాన బహునాశ్రతేన ఇంద్రియ నిగ్రహామే తపస్సు. యేమే సమయమున యేయే కష్టసుఖములు వచ్చినప్పటికి సమత్వమును పొందియుండుటయే జ్ఞానము ఇటువంటి ఇంద్రియ నిగ్రహము యే ప్రకారముగా సంపాదించవలెనో ఉపనిషత్తులలో పదేపదే చెప్పుచున్నది. ఇటువంటి జ్ఞానము సంపాదించిన యెడల దైవ ప్రాప్తిని పొందుదురు. దైవప్రాప్తి అగుటకు నేను నాదిఅను వస్తువులు లేకుండ నుండవలెను. తేనత్యక్తేన భుంజీథా ప్రపంచకములో నున్నప్పటి కీలేపనలే కూడా నుండవలెను.

ఎవరైతే, ఇటువంటి జ్ఞానము పొందవలెనని బోధ చేసెదరో, వారే గురువులు. వారే నిజమైన బ్రాహ్మణులు. ఇప్పటి బ్రాహ్మణులు, బ్రాహ్మణులు కారు. బ్రాహ్మణునికి నుండవలసిన గుణములలో నొకటైనను వారికి లేవు. ఒక గొప్ప బ్రాహ్మణుడు భాగవతమునకు "టీక" వ్రాయుచు, "ఇప్పుడు గడబిడచేసెడి బ్రాహ్మణులు బ్రాహ్మకారు, వారి పూజ దేవుడు స్వీకరింపడు"అని చెప్పియున్నాడు. గురువంటే, పైన చెప్పిన

గుణములన్ని యుతున్నవాఁడే. ఇప్పటి విద్యార్థులకు ఉపాధ్యాయులయందు గౌరవము లేదని చెప్పెదరు. ఉపాధ్యాయులకు నుండవలసిన గుణములలో నొక్కటైనను, ఇప్పటి బ్రాహ్మలకు లేవు. ఛాందోగ్యోపనిషత్తు „గురు ఋణము నెప్పటికిని తీర్పలేము; ఈ భూమిని సమస్త సముద్రములను నవరత్నములతో నింపి గురువునకు నిచ్చినప్పటికీ, గురుఋణము తీర్పలేము'' అని చెప్పుచున్నది. ఏమనలననఁగా. మన కోర్కెలెన్ని తీరినను, ఇంకను కోరికలు హెచ్చవుచునే యుండును. ధన మెంత యున్నను తృప్తియుండదు, బలమెంత యున్నను, తృప్తియుండదు విద్యయెంత యున్నను, తృప్తివుండదు మనము బాగుగా నాలోచించి చూడఁగా, తృప్తినిచ్చెడి వస్తువులే లేవు. ఈ యాశలున్న విషయములు విడిచి, అనంతమైన విషయము తెలిసికొనినఁగాని తృప్తియుండదని అందరికిని తోఁచును. ఇటువంటి యనంతరమైన పదార్థమును జెప్పెడి గురువు ముఖ్య గురువు. తండ్రులు పుత్రులకుఁ జెప్పవలసిన జ్ఞానము, ఇదే. ఈ కాలములో „తండ్రి'' యనేటి మనకు సాధారణముగా నిరాదరణ ఏమిటి! ఈ ముసలి వాడు „దూరికే సంధ్యవార్చు బొట్టుపెట్టుకో''అని కేకలు వేయును. ఈతని కేమి తెలియును. మేమందరము ప్రపంచము నుద్ధరించెడి వారమని, మన గొప్ప మనము చెప్పుకొనుచున్నాము. ఉపనిషత్తులు, మన ప్రాచీన గ్రంథములు, చదివిన యెడల మన తలితండ్రుల చే మనము పుత్రులనిపించుకొనుటకు సిగ్గువై యున్నది. తండ్రినిఁ బాపములనుండి విముక్తినిఁ జేసెడివాఁడు పుత్రుడట. జ్ఞానము సంపాదించి మంచి కార్యములు చెసి నన్ను మోక్షమునకు దీసికొని వెళ్లుమని తండ్రి యనును. అట్లాగే చేయుదునని కొడుకనును.

యదా ప్రైష్యన్మన్యతే అథపుత్రమాహ
త్వం బ్రహ్మత్వం యజ్ఞస్త్వం లోక ఇతి
స పుత్రః ప్రత్యాహ అహం బ్రహ్మ అహం యజ్ఞ అహం లోక ఇతి—

గ్రీసు దేశములో గొప్ప తత్వజ్ఞానియైన సాక్రటీసు ఇటులనే దెలిపెను.

ఈ ప్రకారముగా "పరమాత్మ స్వతంత్రుఁడు సర్వ వ్యాపకుఁడు, సమస్త దేవతలకు ముఖ్యదేవత మనకు స్వాతంత్ర్యము లేదు సమస్త పదార్థములకు బలమిచ్చెడి పదార్థము పరమాత్మ,'' అని, ఉపనిషత్తులలోఁ జెప్పఁబడి యున్నది కొంత కాలమైన తరువాత, ఇదే జ్ఞానము సమస్తమైన దేశములలో నందరు జనులకు బాగుగా బోధ చేయుటకు, అనేక పురాణములు బయలు దేరినవి. మన మేమతము నవలంభించినను, రామకృష్ణాద్యవతారములు పరమాత్మయొక్క యవతారములని నమ్మినను నమ్మక పోయినను, వీరు బోధచేసిన నీతులు సర్వసమ్మతములని చెప్పక విలులేదు, వేద సారము నుపనిషత్సారమును సామాన్య శైలితో నితిహాసాది రూపముగా సమస్త జనులకు బోధచేసి సత్ప్రవర్తనతో నడవవలయునని చేసిన యుపదేశములే పురాణములు.

ఈ పురాణములలో గొప్పది మహాభారతము. తత్వజ్ఞానము కోరువారికిఁ తత్వజ్ఞానము, చరిత్రాంశములు కోరువారికిఁ చరిత్రాంశములు, రాజతంత్రము కోరినవారికి రాజ్య తంత్ర విషయములు. అన్నియుం కలిగి యున్నది. ఈ పురాణము. „సత్ప్రవర్తనయే పరమ ధర్మము, జ్ఞానమే ముఖ్యధనము సంతుష్టియే సౌఖ్యమైనది సజ్జన సహవాసమే చేయవలెను. అహంకారము లేనివాఁడే. అందరికిని ప్రియుఁడు. ధనము దిధర్మము చేయనివాఁడు నరకము బొందును.'' ఇటువంటి యనేక శుభమైన నీతులు బోధచేయుచున్నది. మహాభారతము. ముఖ్యమైన నీతిసారము భగవద్గీతలు ఇవి కర్మ, జ్ఞానము, భక్తి అను మూఁడు మార్గముల భగవంతునిఁ బొందవచ్చునని బోధించుచున్నవి. కర్మ, అనఁగా ఇప్పటి బ్రాహ్మణులు చేసెడిది కాదు. ఎంటవాఁడు వడ్డించును భోజన పదార్థములు చూచుచు దృష్టి మనస్సు యున్న వాని మీద నుంచి నాలుగు మంత్రముల అర్థము తెలియకుండ నుచ్చరించుట కాదు. నాలుగు మాట్లు స్నానముచేసి శివహో అని, నలుగురు అనుకోవలెనని చేసెడి కర్మ కర్మకాదు. మనశ్శుద్ధి దేహశుద్ధి, అగుటకే కర్మ దివ్యజ్ఞాన సమాజము వారు „మనచుట్టు „ఆరా'' అను తేజస్సున్నది. ఆ తేజస్సు కొందరియందు హెచ్చుగాను కొందరియందు తక్కువగానుండును'' అని చెప్పెదరు.) అటువంటి



# పమ్మి శాసనము

## ఆంధ్ర పరిశోధక సంఘము—హైద్రాబాదు

శాసన సంఖ్య ౩౬. వరంగల్లు జిల్లాలోని నేలకొండ పల్లికి క్రోసెడు దూరమున నున్న పమ్మివిష్ణ్వాలయము లో నీశాసనశిల యొకగచ్చు దిమ్మెలో నిముడ్చఁబడి యున్నది. శాసనములోని యంశము కొంత ప్రతిదిక్కు నను నా దిష్టెంగో లోపించియున్నది.

### మొదటి వైపు

౧ స్వస్తి.శ్రీ శకవర్షములు ౧౧౫౬

౨ అంగు దుర్ముఖిసంవత్స

౩ ర వైశాఖశుద్ధ ౧౧ సు। స్వస్తి శ్రీ

౪ మన్మహామండలేశ్వర కాకతి

౫ యగణం రుద్ర (దే) వ మహారాజులు

౬ పృధ్వి రాజ్యం సేయుచుండంగాను

౭ స్వస్తిశ్రీమతు పమ్మి (పచ (స) న్న వల్ల

౮ భునితిరు ప్రతిష్ఠ దేవన ప్రగడ. పే

౯ యిఁచఁపంగాను స్వస్తిశ్రీమన్మహా సా

౧౦ మంత విర్యాల నాగసానమ్మం గా

౧౧ ర్ను అమ్మరాజున మమ్మడిరాజును

౧౨ రేంబర్తినుండి పమ్మికివచ్చి ఆదేవ

౧౩ రకు దండంపెట్టి ప్రగడమాప మహా

౧౪ సంతోషం సేస్తిరి. చేయుడు విచ్చేయు

౧౫ డి ఇ (ఈ) దేవర ప్రియం మాసగడన పండింపు

౧౬ మని పంపిన దేవరది మకరి? + సమస్త +

౧౭ నకు అంగరంగభోగానకుకాని వా

౧౮ రికి నిచ్చుగద్దిన పప్పింపి కొంచయితిరిమ?

౧౯ సేయింపంగా మండపంబు సేసి ప్రె

౨౦ గడ వేయింపంగాను ౨ స మండ సా

౨౧ నంగాను ఇటఖండ ఇంని వయా

౨౨ లు తిరువగాడు వల్లన పెట్టింప

౨౩ అదాఁలో రక్తాక్షి సంవత్సర మార్గ

౨౪ నిర శుద్ధ ౧౧ గు । పెట్టిన వ్రిత్తులకు
౨౫ స్వామ్న నా * * * చెఱువు
౨౬ పూర్లి చెఱువు సవారి కొడుకు పా
౨౭ పిరాజు పెట్టించిన వ్రిత్తి గంధసిరి
౨౮ ౧ ను వల్లభి ౧ పద్దెపాట ౧ ను కొండ
౨౯ పల్లి ౧ ను నాచే పల్లి ౧ ను పండేరం
౩౦ గుంబల్లి ౧ ను వెరసి వె ౨౦ । న్నూ దేవ
౩౧ ర సను స్తమైన వ్రయంలు నడపి కొం
౩౨ చ్నూ తిరుమాడులు తిరిగిరాను మో
౩౩ * * చే ఇంపంగా సలివేంద్ర సర్వ్వాం

రెండవ భాగము

౧ కొండపల్లి పొలం చిఱుమట్టి ప
౨ ౦డ ఈ గుంబిల్లి నడుమ ముప్పడి
౩ కుంటను ఆ లోపడి పాయాను
౪ మాధవకుంట అప్పమంచెల్లిచ్చిన
౫ * య్యం వారి పాలిమావిండు గో
౬ టాను అస్థలాక బీరంవారి కుం
౭ [౦] టను వారి వట్టం పొలంపాలు ౨ ।
౮ అడపనవాఱు పద్మటన ౪ ॥ ను
౯ పాదట గుబ్బలికడ కసిరాజన ౧
౧౦ పీండి మద్దెకుంట కడన ౧ గుం
౧౧ డేబోని వారి మావిండి తోంటను
౧౨ వ లేకనావె కుంట వెనక పుప్పతో
౧౩ ంట సనికె దేవయబగుతుండు
౧౪ నిత్య ౫౦ సేవంతిపువ్వులు పెట్టువా
౧౫ ంఞు రాజులు దీపకంబాల కిచ్చిన
౧౬ మోదాల కుర్మయసిచ్చిన కోటను *
౧౭ మలే బోయిని కుంటను రుకుర్న ప్ర
౧౮ గడ దీపకంబానకు తామర పెట్నిది *
౧౯ ఎట్టింబెఱ్ఱు బండతోంటకడన ౧౦
౨౦ రొడ్డికఱువన ౧ కట్టగూరి తెర్వన *
౨౧ పోచన ప్రెగడ కంబానకు గండ
౨౨ కి తెప్పవ రి మామిడి తోంటను
౨౩ గడ్డ మప్పయన ౧ ఇది రాజులు
౨౪ పంపిన క్రమము ఈ వ్రయం ఎవ
౨౫ రిపేర వ్రాసినది ఆడ్డునడపెసి వా
౨౬ నికి ఒక మేర వెలవేసి పరో విధము
౨౭ ౦ సేసినవారు అండే మేంగొన్నవా
౨౮ రు బ్రమ్మహత్యాది దోషాలంజను
౨౯ వారు పుటుబుంకుగో తగదు
౩౦ నంబుట్టు నారు కేశవాయునిములు
౩౧ కంబాలు పెట్టిన నాశంసేసిన త్రోచిన చే

౩౨ లు లబ్ధములపుట్టి మఱుతురాను
౩౩ గారలపాటి పుట్టిని పెదబీరవెల్లి పు
౩౪ ట్టి మఱుతురాను పమ్మితాంవరని

మూడువ వైపు

౧ దేవరకుడి పోకలు ని
౨ త్య ౨ లెక్కనేంటికి ౪౬౦.
౩ ఆకులు ౪౬౨౦ ఉపారం
౪ పప్పు పెసలు మడికి ఖన ౨॥
౫ చాతుర్మాస్య ఏకాదుసులున +
౬ జాగరంబియ్యంన ౧౧। పెస
౭ లూన ౧ = అగామరు? నర
౮ నూలు ప ౨౫ బ్రాహ్మణ దక్షి
౯ ణకు అటుపుట వార్ద బియ్యం
౧౦ న ౨॥ తిరుపణ్యాలకూ భోగ
౧౧ ౦ మలికి మేఱువద్లు వెట్టెడి
౧౨ శ్రీ జయంతికి ఇప్పపువ్వు
౧౩ న ౧౨ నువ్వులు వ ౪ తోంటి
౧౪ శేఱుకుడ్మ చింతపండ్మా
౧౫ నేయి + కి ఖ॥ * * * *
౧౬ పారంబియ్యం న ౨ మేలు
౧౭ తరిపెసలు బియ్యం న ౨॥
౧౮ బ్రాహ్మణ దక్షిణ పోంకలకు ౨॥
౧౯ వీరికి బియ్యాం న ౨ తిరుజ
౨౦ + లకు భోగంపాటికి +
౨౧ * కు పాపవిపల్లి భోగందేవ
౨౨ రకు బియ్యం న ౪॥ పెసలు
౨౩ న॥ నేయి ఖ ౧ పెదకొండ ప
౨౪ ల్లి భోగం * * బియ్యం న ౧।
౨౫ పెసలు నూనే యికొ ౧ కోప
౨౬ ల్లి దీపకంబాలకి నూనెయ్యి.
౨౭ న ౨ ఇంత పట్టున కూపి డి కొ
౨౮ మ్ములు చందనం మాధ్యాన్నాన *
౨౯ కు అభ్యంగనానకు పిండివంట
౩౦ కు నూనేయికి గాగ౧ బియ్యము
౩౧ పెసలు దేవర భోజనానకు
౩౨ పోంకలు నాకు లూ *
౩౩ * * * * మాసోత్సవ
౩౪ లు చేయింప — — —

నాల్గవ వైపు

౧ దేవర ఉపకరణాలు రెండు
౨ ను పిడిగంట ౧ చాపగలం
౩ ... లిచ్చిన కంచుగ

క్షేత్ర ౧౯-౨౦]

౪ టకులు ౨ జయగంట ౧ దేవ
౫ నప్పకినిచ్చిన గంట ౧ కంసాలి
౬ పోతు పెద్దశాలాలు ౨ పెకనా
౭ రకులు ౨ కింద్రి * *
౮ రు దుర్లప్రగడిచ్చిన పెద్ద ప
౯ ల్లెం ౧ పిన్నపి రెడ్డిచ్చిన పెగ
౧౦ పల్లెం ౧ వీరపిడిన పడులు ౨
౧౧ ప్రాంతంపల్లె=౧ * రలు ౭=
౧౨ ముడుంబ నరసింహా
౧౩ చార్లు
౧౪ ముడుంబ నరసింహా
౧౫ చార్లు శోభకృతు
౧౬ చై. శు ౧౪
౧౭ ౧౭౩౬

## సూచన

ఈ శాసనమునందు పేర్కొనబడిన కాకతీయ గణరుద్రదేవుఁడు గణపతిరుద్రదేవుఁడనుటకు కాలము సరిపడుచున్నది. శాసన చివర వ్రాయఁబడిన ముడుంబర నరసింహాచార్యులపేరు ఇటీవల [శా ౧౭౩౬] లో వ్రాయఁబడినది. ఈ శాసనమునందలి దేవప్రగడ, వియార్ల నాగసానమ్మ మల్రాజు ముమ్మడిరాజు గణపతిదేవుని సమకాలికులే గాని వీరి వృత్తాంతము లింతవఱకు దెలియవు. ఆకాలపు దేవాలయ పూజావిధానములు వృత్తి నిర్మాణము నెఱుంగుటకీశాసనము అనుకూలముగ నున్నది. ప్రెగడ పదమునకు ప్రాచీన రూపములు ప్రగడ, పగడ.



# యా మి ని

## నరసపూతుల వైద్యనాధకవి

అది అనంత
వర్ణసంయుత సంధ్యా ప్రభావ పటలీ
యంతరింపగ చీకటు లలము వేళ
గ్రక్కొనివచ్చు మేనిమైకమ్ము—
అరుణ సువర్ణవర్ణముల
సంతసముగాఁ గలియంగ నాదు హృత్
సరసిజమేటికో ముడువి
చారము చెందినయట్లు యామినీ
సురుచిరకామినీ మణి
విశుద్ధ తళత్తళదంతరంగ భా
సురయశమున్ నదించె

—కన్ను తెరచి
నంతనే చీకటులు క్రమ్మె నతనులందు
నేటికోగాని యపుడు నాహృదయతంత్రు
లెల్ల నిమిషంబులో చలియింపఁజేసి
త్రెంచివైచిన యట్లయ్యె—
తెలివిఁదప్పి
యామినీ కరద్వయమందు నవశమంది
నటుల కనులరమోడ్చితి—



# సీతారాముల వనవిహారము

చాట్రాతి లక్ష్మీనరసమాంబ

రాముడు సీతతో:

ఉ. కమ్మని తెమ్మతెమ్మరలు గ్రమ్మగదమ్మి వలంతి మేడకున్
ద్రిమ్మరివచ్చి తుమ్మెదలు దీటుచు నీటుగ బాటపాడగా
గొమ్మనిపూవుచేనియను గూరిమినామెత నిచ్చి తేటులన్
జుమ్మలువోవద్రావి యట సొక్కగజేసెను దమ్మిఁజూచితే.

అత్తరి,

చ. ప్రసవరజంబు గ్రాగిన్ బసవుపయ్యెదభంగిని భాసిలంగ ను
ల్లసదళిజాలముల్ కచకలాపముభాతి జనించుచుండ బ
క్షిసముదయంబు భూషణవిశేషము లన్నుమ్రోఁగ వాఁకిం
పొసఁగె వనేందిరా రమణి యొయ్యనవిందొనరింపవచ్చెగా.

సీత రామునితో,

క. చిగురుఁ బూవుల బూపల నగణితసుందరఫలముల నభిరామంబై
జగతీజము లలరెవనిన్ తొగసు మిసిమిగొల్పుచుండె తోరంపునసల్.

చ. లతలు విభూతినొందె వనలక్ష్మినిబొందెను విద్రుమంబులున్
జతనములాయె భృంగములు సారెకుగీతము లాస్యవిద్యలన్
సతతము కీరజాలమొగి శ్రావ్యపదంబుల బల్కుచుండెడున్
మతికిని మోదమయ్యె పికమంజులరావము శ్రోత్రపేయమై.

[illegible]]

అంత,

మ. పరమైభాసిలుదివ్యరత్నమయసోపానంబులన్ విస్ఫుర
ద్వరచంద్రోపల సైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాంచిత వారిజంబులతతిన్ హంసాదివాఃపక్షి వి
స్ఫురణన్ గల్గు సరోవరంబుగనియెన్ భూవల్లభుండింతితో.

మ. జలమైనట్టి హరాట్టహాసకమొ కాసారాకృతిన్ గన్న ని
ర్మలమానీశ్వర పుణ్యసంచయమొ యాత్రాపాచేతసాదర్శమో
సలిలాకారము నొందినట్టి సతియో చంద్రాతపస్యందమో
వలనొప్పన్ రజతాద్రియో మదికి నే వర్ణింపజాలన్ సఖీ.

చ. కనులకు విందుగొల్పఁగఁ దుఁగ్రాలుచు నిర్మలతన్ మనోజ్ఞమై
తనరఁగఁగూర్చు సౌఖ్యమును దాకినఁ జల్లఁదనాన మేనికిన్
దనుపును ఘ్రాణమున్ వికచ తామరసాంతర సౌరభంబునన్
బెనుచు మరాళశబ్దముల వీనులకున్ బ్రముదంబు పెల్లుగన్.

చ. ప్రసవరజఃకషాయమున బర్విజలంబుల శీతలంబునై
యొసగుచు శీకరంబులను నింపుగ మోయుచు నల్లనల్లనన్
మసలుచునచ్చుగంధయుత మార్దవతోయ తరంగమాలికా
శ్వసనము వీవసాగె నిటు జానకిచూచితె గంధవాహునిన్.

సరోవరంబుగని,

చ. సకియకలంకతోయకణ సంగతపద్మపలాశమధ్య హా
ల్లక రుచులొప్పెడిన్ సరసి లక్ష్మినిరున్ గని ప్రేమహెచ్చగా
మకరతిపాత్రలో విమలమౌక్తికముల్ రచియించు రత్నదీ
పికలను నిచ్చునారతుల వృత్తిఁ దోచెడి జూచితే యనన్.

అంత సీత రామునితో,

మ. అగణాబ్జచ్ఛవినీను నేత్రములచే నత్యుజ్జ్వలోర్మిచ్ఛటా
గరిమన్ నీ కరశాఖచే విహగరేఖల్ నీయశోకాంతిచే
హరియింపంబడెఁ జూడుమంచు బాగడెన్ హంసార్భటిన్ వార్ధిరా
ట్తిరుణీరత్నము వి[illegible]వేయు[illegible] సీతాదేవితో నవ్వుచున్.

తిలకించి రాఘవుండు,

చ. కరమున బుష్పమంజరిని గైకొని రాఘవుడందుకోనె సుం
దరి యని పాణిఁ జాపు వనితాసతి యందుకొనంగ హస్త సం
కరుహము సాచినన్ బొడవుగా నతియున్ గిరమెత్తు బాహు మూ
లరుచుల జారు పయ్యెద జెలంగ మనంబున జూచు వేడుకన్.

రాఘవుండు సీతను గని,

మ. కమలాప్తుండు మయూఖసంఘముల దిగ్భాగంబులం జిమ్మగన్
గుముదాంతస్థిత లక్ష్మి యాతపవుసోకున్ సైపగాలేక ప
త్రములన్ బటుగఁ జేసి కప్పుకొనియెన్ దత్కాలసంకోచన
క్రనకార్యంబుగ రాజవల్లభల సూర్యంపశ్యలే గాదకో.

చ. ఇను డెసగాంచి భీతి దల లెత్తగలేక త్వదీయ బింబమున్
గని వసిజక్కవల్ పెడమొగంబులఁ జూచుచు గుంది మూర్ఛనొం
దిన దెసగాంచలేక వనదేవత హాయని కన్ను వాల్చె నా
ననజము లెల్ల మోడ్చె సహవాసుల బాధల మిత్రులోర్తురే?

సూర్యుఁ డస్తాద్రి కేగె, జాబిల్లి యుదయించె జూడుము,

ఉ. వెన్నెలతీవెలందణగి వెల్వడి రాజిలు సూనరాజిలో
గ్రన్నన సౌరభంబు గొని గ్రాలెడి గంధ సమీరణంబు ల
త్యున్నత హర్మ్యడోలికల నూగుచు శీకర క్రీడిలాడ యం
దున్న సఖీశ్రమంబు తతులొప్పులు మీఱ హరించుచుండెనున్.

(కావున జానకీ మనమిక యభ్యంతరమున కేగుదము అని యిర్వురు వెళ్లిరి.)



Edited, Printed, & Published by K. Balakrishna Reddy,
at the Golakonda Press, Troop Bazar, Hyderabad (Dn.)

# విషయ సూచిక

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు. డాక్టరు. కే. ఎన్. కేసరి.

పోస్టు బాక్సు 752, ఎగ్మూరు. మదరాసు.

"గృహలక్ష్మి" యను సచిత్ర మాసపత్రిక యీ సంవత్సరము మార్చినెల నుండి వెలువడుచున్నది. ఇందు ముఖ్యముగా భారత నారీమ తల్లుల ఆయురారోగ్యముల పెంపొందించు విషయములు చర్చింపబడును. స్త్రీలు పురుషులతో సమానవ్యక్తులనియు శరీర మనోబలముల యందెంతయు తక్కువవారు కారనియు నిరూపించుటయే మా యుద్దేశము. ఎల్లభంగుల స్త్రీయుద్యమమునకు దోడ్పడుటయే మా యభిప్రాయము. స్త్రీలు స్వీయ స్వాతంత్ర్యమునకై ప్రయత్నించుచుండు యిప్పటి పరిస్థితులబట్టి మా గృహలక్ష్మి వంటి పత్రిక యత్యంతావశ్యక మనునది తెలియగలదు. ప్రతిమాస సంచికయందును, స్త్రీల కెంతయు హితమొసంగు వ్యాసములు, కథలు, నవలలు, పద్యములు, వివిధ విషయములు, మరియు నిట్టివియేయగు అంశములు గలవు. చిత్ర విచిత్ర పటములతో కూడి మేలుకాగితములపై ముద్దులొలుకుచక్కని కూర్పులతో ముద్రింపబడి ప్రచురింపబడును. ప్రతివనితారత్నమును తప్పక చదివియే తీరవలెను. ఈ పత్రికకు చందాదారులుగ జేరియు, వ్యాసముల వ్రాసిపంపియు, మా యుద్యమమునకు తోడ్పడునట్లు దేశాభిమానులగు సోదర సోదరీమణులను కోరుచున్నాము. స్త్రీల యశోవృద్ధికి స్త్రీలే కొంతవడి శ్రమబూని తోడ్పడిన, బంగారమునకు పరిమళ మబ్బినట్లు గృహలక్ష్మి ప్రతి గృహమునందును లక్ష్మియై విరాజిల్ల గలదు.

సం॥ చందా రు. 4 విడిప్రతిక. అణాలు 6.

## త్రివర్ణ చిత్రములు

పలువురు కోరినందున మరల ముద్రింపబడినవి. కొంది ప్రతులు మాత్రమే

త్వరపడుడు! ఆలసించి. విచారపడవలసి వచ్చును!

శ్రీ మురళీ కృష్ణుడు (సుజాతలో వేయుటకు ప్రత్యేకముగా కలకత్తానుండి తెప్పించబడినది) ప్రతి 1కి వెల 0-1-0

మేనక (సుప్రసిద్ధ విదుషీమణియగు శ్రీమతి రత్నాల కృష్ణాబాయి, బి. ఎ. గారిచే చిత్రింపబడిన మనోహరమగు త్రివర్ణచిత్రము. ప్రతివారును చూడదగినది.) ప్రతి 1కి వెల 0—2—0

ప్రభావతీ ప్రద్యుమ్నులు (సుజాత కొరకు ప్రత్యేకముగ, బందరు జాతీయ కళాశాలయందు చిత్రలేఖన మభ్యసించిన, శ్రీమాన్ కె, రామాచారిగారిచే చిత్రింపబడినది.) ప్రతి 1 కి వెల 0-1-0

రత్నాల కృష్ణాబాయి, శివరాజబహద్దురు, భద్రాచల దేవాలయము, గోదావరీ దృశ్యములు, కాశ్మీర దృశ్యములు, రామప్ప దేవాలయములోని విగ్రహములు, ఓరుగల్లు లోని కృంగిపోయిన దేవాలయము, ఓరుగల్లు ప్రహరిపై నాట్యమాడుచున్న వినాయకుడు, కాకతీయ రాజ మందిరము, సహస్రస్తంభ దేవాలయము—హనుమకొండ మొదలగునవి.

ప్రతి ఒక్కంటికి 0-0-6

సూచన:—అర్ధరూపాయకు మించని బొమ్మలు తెప్పించుకొనువారు ముందుగనే డబ్బు, పోస్టేజికి గాను అణా సహా టిక్కట్లు రూపమున పంపిన సులభము. లేనియెడల చాల ఖర్చగును. ప్రకటన రేట్లు పలువురు కోరినందున తగ్గింపబడినవి. వివరములకు నేడే వ్రాయుడు. ఉత్తర ప్రత్యుత్తరములు, మనియార్డర్లు మొదలగునవన్నియు, ఈక్రింది వారిపేర వ్రాయవలెను.

మేనేజరు, "సుజాత" గౌలీగూడ హైదరాబాద్ (దక్కన్)

హైద్రాబాద ప్రజాపశువిద్యా మహాసభ అధ్యక్షులు



శ్రీ పండిత హృదయనాథ్ కుంజురుగారు బి.ఎ.,బి.ఎస్.సి., (లండన్) ఎమ్.ఎల్.ఏ.



హైదరాబాదు, అక్టోబరు ౧౯౨౮

సంపుటము ౨ | విభవ సంవత్సర భాద్రపదము | సంఖ్య ౧౦

# తలఁపు

( 'టాగ్' కవిత్వానుసరణము * )

ఒ. రాఘవరంగరావు

ఉ. నేరిపితిట్లు పాఠమును ♦ నీవు మదీయ హృదంతరాళ సం
పూరిత పూర్వభావముల ♦ పూర్ణము విస్మృతి నందునట్లు నే
మారితి వ్యర్థజీవినయి ♦ మాయిక కాలహతుండనౌచు నీ
తీరున నాకుఁ జూపితివి ♦ తీరని నిష్ఫలకామ్య కర్మలన్.

చ. పరిపరివస్తుజాలముల ♦ భ్రాంతి దగుల్కొను నాకులక్షకో
ట్లరుచిరవస్తు వీవొసఁగి ♦ కామములేని మనంబుజేసితే
సరకులదీసి కొంటినని ♦ సాటుదు, నాకని పూర్ణకామ! యే
తెఱవున వస్తుసంచయము ♦ తెచ్చితివంచని జెప్పనేర్చెదన్.

ఉ. చిక్కనవేమొ చిక్కనవి ♦ చేతముకోఱక మున్నుమున్నె; నా
కక్కఱలేని వేవియొ య ♦ నంతము లిచ్చితివేమొ యిచ్చితే
చక్కనొ; * నమ్రుదగ్ని నిల ♦ సత్సుమ రాశిగజేసి మిత్రునిం
దిక్కయికాచినట్టి [illegible] ♦ [illegible]!

శా. ప్రాతర్వేళ మందమారుతములం ♦ బ్రాపింపఁగాఁజేసి త
ద్వాతాకంపన శోభ పుష్పవనికిం ♦ బ్రాపింపఁగాఁజేసి త
జ్జాతౌత్సుక్యము మూల ముట్టముగ నా ♦ స్వాదింపఁగా భోగ్యమా
చేతంబుల్ సృజియించి మించితివి నీ ♦ చిత్రంబనూహ్యంబగుల్.

మ. మధురానందరవంబు * బుల్బులికి; శుం ♦ భద్వర్ణ సౌరభ్యసం
పదపుష్పంబులకుం దదీయరుచినా ♦ స్వాదింపగా శక్తి జీ
వధికింజేసితి వస్మదీయ హృదయా ♦ వాంఛాతి దాతృత్వసే
వధిసంరక్షణ నీదెకా, విమలభా ♦ వామోద సంధాయకా!

చ. * ఖిజరును మార్గదర్శిగను ♦ గీడ్పడి మున్గినవారి లేవనె
త్త జలమునుండి * అల్యసును ♦ దారిచినట్టుల నాకు నొక్కనిన్
బుజుగుణు శ్రోవఁజూపుటకు ♦ నిచ్చితి; భూర్యను కంపతావక
ప్రజసయినిల్లు గల్గుటలు ♦ భాగ్యము మాయది, లోకరక్షకా!

మ. భవదీయంబగు చిత్రలేఖనముచే ♦ పాఱిచీన దుర్యృష్ణచి
త్రవితానంబది నామనః ఫలికపై ♦ తావేమియున్ లేక స
ర్వవిధాలం జెడి మాసిపోమె; నెటులీ ♦ ప్రావీణ్య శిల్పంబు నీ
భువనాగారమునుండి దెచ్చితివి? నా ♦ పుణ్యప్రభావంబునన్.

మ. తెలసెన్ నేనెటు లేగగావలయునో; ♦ తెన్నట్టు లే జూపి; తీ
బలితాఘుంబుల కుప్పనైన నను నై ♦ వల్యాగ్రి ప్రేమామృతం
బొలుకం జూచితి; నారకాగ్నికిని నీ వోయయ్య! యేమిత్తు? వీ
యిలలో నిచ్చిన నివ్వనున్న పిభు వీ ♦ వే యొక్కరుండౌ కదా!

---

* దాగ్ కవీశుని పేరు నవాబు మిర్జాఖాన్. దాగ్ అనునది ఆయవ సంకేతనామము. ఈయన ఢిల్లీనివాసుడు

* నమ్రూడ్ అనునాతఁడు రాజు. ఇబ్రాహీం అనునాతడు మహమ్మదీయ మతప్రవక్త. ఇబ్రాహీమును సహింపక పెద్ద అగ్నిగుండము చేయించి దానియందు పడవేయగా భగవంతుడాయగ్నిని పూలరాశిగా చేసి లేనమిత్రుడగు ఇబ్రాహీమును రక్షించినాడు.

* బుల్బుల్ అనునది ఒక పక్షి. ఇది పూతోటలో మంచి మంచి పాటల బాడును. మహమ్మదీయ కవులు తమకవిత్వములో దీని నెక్కువగా వాడెదరు.

* ఖిజర్, అల్యాస్ అనునుభయలు మూసాయను మహమ్మదీయ ప్రవక్త కాలమున నుండిరి. ఖిజర్ అను నాతఁడు అడవులలో బాటలు తప్పిన వారిని మంచిమార్గములలో చేర్చుచుండెను. అల్యాస్ అనునాతఁడు బావులలో, చెఱువులలో మునిగినవారిని లేవనెత్తి రక్షించుచుండెను. వీరుభయులు శాశ్వతనియామకులనియు చిరజీవులనియు మహమ్మదీయుల విశ్వాసము.

# ఛత్రపతి శివాజీ జీవితమందొక దృశ్యము

(రాజ్యాంగ ప్రవీణ)

వేంకటరామ నృసింహులు



మొగలు సైన్యమునకు పూనాపై విజయము ప్రాప్తించినది. రాచ సౌధములన్నియు షాయిస్తాఖానుని యాధీనములైనవి. పట్టణములో సేనాన్యాయము (Martial Law) ప్రయోగింపబడినది. ఛత్రపతి శివాజీ మహారాజునకు సింహగడదుర్గము మాత్రము మిగిలినది. ఛత్రపతి మహారాష్ట్ర నాయకుడొకని నూరేగింపుత్సవము జరుపుకొనుటకనుజ్ఞబడయుటకు మొగలు సేనాపతి కడకు బంపనియమించెను. పూనా పునర్విజయముకై పన్నిన యీ యుత్సవము జరుగుటకు పూర్వము ఛత్రపతి బ్రాహ్మణవేషమున శివాజీరాయబారిగా యశవంతసింహు కడకు వెళ్లెను. యశవంతసింహుడప్పుడు పూనాకు రెండు క్రోశముల దూరమున నివసించియుండును.

స్థలము: యశవంతసింహుని డేరా.

సమయము: రాత్రి రెండవ యామము.

(రాజా యశవంతసింహుడు తనయనుచరులతో మహారాష్ట్రుల పరాభవము, మొగలులదిగ్విజయముపై సంతసించుచుండును.)

ప్రవేశము: సేవకుడు

మహారాజునకు జయము ప్రాప్తించుగాత! ప్రభువులవారి దర్శనార్థము శివాజీరాయబారి ద్వారమువద్ద అనుజ్ఞకై వేచియున్నవాడు.

యశ: శివాజీ కిప్పుడు తెలివివచ్చినది కాబోలు రమ్మనుము.

సర్దారుడు: మహారాజా! గర్వమంతయు నణగినది. తెలివి ఇకనైన రాకయుండునా? ఒక దుర్గము మాత్రమే యాతని స్వాధీనములో గలదు. శేషదియు ప్రభువులవారి యాధీనములో చేరక తప్పదు. ఈ చిత్తులమారి మహారాష్ట్రుని బలమంత యుడిగినది. శక్తి నశించినది.

(ఛత్రపతి బ్రాహ్మణవేషమున చేతిలో కమండలము, నుదుటతిలకము, మెడలో రుద్రాక్షమాల ధరించి ప్రవేశించును.)

ఛత్ర: (రాయశారిగా) కల్యాణభవ! ఆయుష్మాన్ భవ!!

యశ: బ్రాహ్మణోత్తమా! మా శివాజిమహారాజు సంగతులేమి?

ఛత్ర: ప్రభువులవారి యశశ్చంద్రికలు నలుదిశల వ్యాపించినవి. మా మహారాజుగారి సంగతులు మీరే బాగుగా యాలోచించ సమర్థులు. అయినను కమలములన్నియు ముకుళించినను, కొద్దినీరుమాత్రము మిగిలినది. ప్రౌఢుకాలినను వడియుండుట సహజము.

యశ: రాజుగారు కుశలమా?

ఛత్ర: మహారాజా! భవానీదేవికృపవలన యితరవిషయములచింతే మాత్రము ఛత్రపతిని బాధించుటలేదు.

యశ: అయిన యేవిషమైన చింతగలదు?

ఛత్ర: ఆర్యకులరక్షకా! క్షత్రియకుల దీపకా! పవిత్ర రాజపుత్రస్థానమునందు జన్మించి.వీరకేసరీ రాణా ప్రతాపసింహుని వంశమునకు జెందిన యొక రాజపుత్రవీరుడు హిందూధర్మనాశనమునకై దీక్షాకంకణము బంధించుకొనిన మొగలుచక్రవర్తికి సాయపడుట జూచి, కాదు,కాదు, సంసిద్ధుడైయుండుట జూచి ఛత్రపతి శివాజీమహారాజు కత్యంతదుఃఖము కలుగుచున్నది.

యశ: భూసురోత్తమా! నాకేకాదు. ప్రతిభారతీయునికి ఆవీరకేసరిజీవితము ఆదర్శప్రాయము. ఆతని యుద్దేశములకు కార్యరూపము సంఘటయే భారతీయుల కర్తవ్యము. ప్రపంచమున శాశ్వతముండువరకాపవిత్రనామము సగర్వముగా జపింపబడును. ఆవీరకేసరి దివంగతుడైనంత మాత్రమున క్షత్రియుల వంశపరంపర వీరత్వము, ఉత్తమకుల గర్వము, బాహుబలపరాక్రమము నశింపజాలదు. నేటికిని ప్రతాపసింహుని సంతానమున అసంచలనము కలదు. భారతీయుల రక్తనాళములం దావేగముగలదు. రాజపుత్రస్థానమందలి ప్రతిబాలుడు యుద్ధవిద్యయందు ప్రవీణుడు.

ఛత్ర: రాజా! అన్యథా విచారింపకుడు. వీరప్రతాపసింహుడు తనవంశీయులిటుల ప్రవర్తించునని స్వప్నమందైనను తలచియుండునా?

యశ: మొగలు చక్రవర్తికి మేముతోడ్పడుట యన్యాయమనియా శివాజి యుద్దేశము?

ఛత్ర: కాదు. అటులకాదు తమ కార్యఫలితములవలన గో, బ్రాహ్మణ, దేవాలయములకు హానిసంభవింపకుండుటయే వారి అభిప్రాయము. లేక గో బ్రాహ్మణదేవాలయరక్షణార్థమై తనసర్వస్వమర్పించిన సేవకుని బలమణగింప కుండుటయు, రాబోవు సంతతివారు, ‹‹ మాపూర్వులయవివేకమువలన నే మాధర్మమునశించి జాతి క్షీణించిపోయినది.జాతి, ధర్మ రక్షణమునకు, శతృసంహారమునకు,దేశక్షేమమునకు ప్రయోగింపబడు ఖడ్గము స్వజాతిసోదరుల కంఠములు తెగనరకిన దేశద్రోహనేరము ప్రపంచమున్నంతకాలము పోజాలదను'' విషయముపై దుఃఖింపకుండ జేయుటయే శివాజీమహారాజు యొక్క ఆదర్శము.

యశ: ఏ రాజపుత్రుడు గోబ్రాహ్మణ దేవాలయ రక్షణమునందు తనవిద్యుక్త ధర్మము నెరవేర్చుటలేదు? రాజపుత్రుల మూలమునధర్మమునశించుచున్నదా?

ఛత్ర: ఏవ్యక్తి ధర్మరక్షణమునకై రేయింబవళ్లు పాటుబడుచున్నాడో అట్టివాని సంహారమునకై ప్రయత్నించుట హిందూధర్మము నశింపజేయుటకాదా? మహారాష్ట్ర వీరులను ప్రపంచరంగమునుండి నిష్క్రమింప జేసిన హిందూధర్మనాశనమునకై ప్రయత్నించు యీతుచ్ఛ మ్లేచ్ఛుల కడ్డునిలిచి ధర్మరక్షణమొనరించువారెవరు? హిందూధర్మపు మర్యాదను కాపాడుచున్న ఆజాతి సంహారదృశ్యములు కల్గించుట పరమద్రోహముకాదా? స్వజాతి స్వధర్మసంహారమునకీ రాజపుత్రుని హస్తము కరవాలముతో తహతహపడుచున్నదా?

యశ: ఏపరిచర్యా! కాని శివాజి చేయుచున్నవి దుష్కార్యములు గావా?

ఛత్రి: ప్రభువతంసా! శివాజియుద్యమ మెకింత న్యాయదృష్టితో విచారించుడు. స్వధర్మరక్షణము దుష్కార్యమా? గోబ్రాహ్మణ దేవాలయములు మ్లేచ్ఛుల దాడినుండి కాపాడుట పాపకార్యమా? మామహారాజుగారి యీచర్యలు ప్రభువులవారిదృష్టికి దుష్కార్యములుగా పరిణమించుట వింతగానున్నది.

యశ: శివాజికొక నియమములేదు. రీతిలేదు. సదుద్దేశమే యైయుండవచ్చును? కాని మాటలెంతమాత్రము నమ్మదగినవికావు. పలుకునదొకటి. సలుపునదుమరొకటి. నిద్రించుచున్న శత్రువులసంహరించుట యాతని కొకయాటయైపోయినది.

ఛత్రి: ప్రభువలవారు శలవిచ్చినవి నిజము. మాటలు నమ్మదగినటకానవిలో నెంతమాత్రము సందేహములేదు. రాజపుత్రులవలె వారివద్ద ఆస్తిగాని బలముగానియున్నమాటలకు కట్టుబడియే యుండెడివారు. వారివద్దసైన్యముగాని ధనముగానియుండిన రాత్రులందు శత్రుసంహరణమన్యాయమని భావించియుండెదరు. శివాజిమహారాజు మీదృష్టికి జిత్తులమారి కావచ్చును. అబద్ధికుడు కావచ్చును. చోరుడుకావచ్చును. కాని యేకారణముల వలన మహారాజుగారికీ దుర్నామములు కలిగినవో నే నిర్భయముగా దెలుపగలను. హిందూధర్మమును శత్రువులదుండగములనుండి కాపాడుటలో, మన దేవాలయములను భారత భూమినుండి నశింపకుండజేయుటలో, వేయేల జాతిరక్షణమునకై తనసర్వస్వమర్పించుట వలన యీగౌరవనామములు కలిగినవి. ఇంతేగాక హిందూధర్మరక్షణార్థమై తనప్రాణముల నర్పింపవలసివచ్చిన వెనుదీయక అట్లొసర్చి మిక్కిలిభాగ్యశాలియనిగర్వింపకమానడు. నేడుమీరే యీవిషయమై ప్రయత్నించెదమని వాగ్దానమొనరించినయెడల సర్వసంగపరిత్యాగియై తనజీవితము సఫలమయ్యెనని దలచకమానడు. గోబ్రాహ్మణ రక్షణయే యాతనిసందేశము. హిందుధర్మము కాపాడుటయే యాతని యుద్దేశము.

యశ: ఆతడు కేవలము హిందూధర్మ రక్షణమునకే ప్రయత్నించుటకలదా?

ఛత్రి: ఔను. హిందూధర్మము కాపాడుటకొరకే. ఆతడెన్నడును శరణాగతులను ధిక్కరించి నెరుగడు. స్త్రీ,భాల,వృద్ధులను తనకరవాలమున కాహుతినివ్వలేదు. సదా దాన ధర్మములు సలుపుచుండును. అనాధలకు, విధవలకు తోడునీడగా ప్రవర్తించుచుండును. ఇన్ని ధర్మముల నాచరించునాతడు నీతిబాహ్యుడా? చోరుడా? జాతిసౌభాగ్యమే యాతని యాదర్శము. ధర్మహీనమై జాతినాశనమొందకుండుటయే యాతనిముఖ్యోద్దేశము.

యశ: నిజముగా శివాజి ఆదర్శమూర్తియేయైన ఆతడు కేవలము మనుష్యమాత్రుడు కాజాలడు. మమ్మాటి కతడు ధర్మరక్షణార్థమై యవతరించిన సత్పురు

షుడు. అట్టిపరమపూజ్యుని దర్శనాభాగముకలిగిన నాజీవితము కృతార్థతజెందెడిది. అతనియాజ్ఞల ను శిరసావహించుటకు కుతూహలము జనించు చున్నది. ఇట్టిపూజ్యపురుషునికి నేనెటులదోడ్ప డగలనో మీరెఱింగింపుడు.

ఛత్రి: నిజముగా మీకిట్టికుతూహలముండినచో వాగ్దాన మొనరింపుడు. ఇదిగో సేవకుడిచటనేగలడు. (అని కపటవేషముతీసి నిజరూపముతో) ఆ హిందూ ధర్మసేవకుడు, మీదాసుడు, గోబ్రాహ్మణశిష్యుడ గు శివాజీతడే.

యశ: (కౌగలించుకొని) భవద్దర్శనమువలన పవిత్రుడ నైతిని. నేను మీకెటుల సహాయ పడగలనో తెలుపుడు.

ఛత్రి: మహారాజా! నేడుసూర్యోదయమునకుపూర్వమే పూనాపునర్గ్రహణమునకు కృతనిశ్చయుడనై యు న్నాడను. అవసరసమయమున మాత్రము మీరు షాయిస్తాఖానుని కట్టి సాయము చేయవలెను. ఇదియేనాకోరిక. స్వజాతి సంహారము ఘోర పాపము.

యశ: అటులనేజరుగును.

(ఆరాత్రియే శివాజిమహారాజు పూనాపట్టణ ములో ఊరేగింపుఉత్సవము జరుపును. మహారాష్ట్రసైనిక వీరులు పెండ్లివారివలె ఉత్స వములో పాల్గొనెదరు. వీరి సహాయమున ఛత్రపతి శివాజిమహారాజు పూనానుతిరి జయించును. షాయిస్తాఖానుడు రాచసౌధ మునుండి పారిపోవుచుండగా ఛత్రపతి అతని వ్రేలొకటి భవానికాహుతినొసగును.)

సంపూర్ణము





# కవితాలక్ష్మి

మామునూరు నాగభూషణరావు



లలిత మంజుల మోచాఫలంపు రక్తి

తేట కలకండలో జిగి తీపిబిగువు

తేరిపారింతు నీ నుడితేనె లోన

యేలుకొనుమయ్య యీప్రియురాలి సుకవి!

అతుల కవితామనోజ్ఞ సంగతులలోని

తేనెలూరెడి భావముల్ తేర్చికూర్చి

ఒలకబోసెద నీ మధురోక్తు లందు

యేలుకొనుమయ్య యీప్రియురాలి సుకవి!!

ప్రథిత సౌఖ్యపవార్ధి తరంగడోలి

కాగ్రములనిల్పి సర్వభోగైక నిపుణు

సలుపుదును నిన్ను లక్ష్మినై వలపులందు

యేలుకొనుమయ్య యీప్రియురాలి సుకవి!!!

తతన వరసైక సారస్వతప్రపంచ

ప్రభువుగ నొనర్చి, సర్వసామ్రాజ్యసార్వ

భౌమ నతమస్తకకిరీట పాదుజేతు

యేలుకొనుమయ్య యీప్రియురాలి సుకవి!!!!

(తోనిపూత, నుడి)



# నన్నయ్య భట్టారకుడు

సురవరము ప్రతాపరెడ్డి

మనకు లభించినగ్రంధములలో మొదటిదగు తెనుగు భారతగ్రంథమును నన్నయభట్టు రచించెను. ఈకవి విషయమును చర్చించుటకుపూర్వము భారతపురాణముల గుఱించి మనముందించుక విచారింతుము.

## భారతము రామాయణము

భారతమునకును రామాయణమునకు చాల భేదమున్నది. భారతములోనే రామాయణసారముండుటచే రామాయణము పూర్వగ్రంధమని తోచుచున్నది. కాని విషయములను బట్టిచూచిన భారతమునకన్న తర్వాత గ్రంధమయ్యే యుండియుండవలెను. వివాహపద్ధతి ప్రతి దేశము యొక్క సంఘస్థితిని నిరూపించునట్టిది. ప్రాచీనభారత దేశమున తర్వాత కాలమున శాసించినరీతిగా స్త్రీలకు పునర్వివాహము లేదని గాని, కుండగోళకులు పుత్రులు కాదనికాని శాసించి యుండలేదు. ఈనియమములతో మనము పరీక్షించిన భారతములో నియోగపద్ధతి, కానీన, కుండ గోళికపుత్రులను కనుట తప్పుకాకుండుటయు, సాధారణమై యుండెననియు రామాయణములో నిట్టవి సాధారణము కాకుండెననియు తెలియును. మఱియు భారతములో ఆర్యఅనార్యసమ్మేళనము తప్పుకాకుండెను. భీముడు హిడింబినివివాహమాడుట, అర్జునుండు అనార్య స్త్రీయైన నాగజాతి ఉలూచిని వివాహమాడుటయు నిదర్శనము. మఱియు బ్రాహ్మణస్త్రీయగు దేవయానిని క్షత్రియుడగు యయాతి వివాహమాడెను. ఇట్లు భారతములో ననేకాంశములు విమర్శకులకు గోచరించును.

## భారతరచన

నన్నయ్యకుపూర్వమాంధ్రులు తమభాషలో భారతము లేనందున.

"బహుభాషల బహువిధముల బహుజనముల
వలనవినుచు భారతబద్ధస్పృహులై"

యుండిరి. కావున శ్రీపురాణము చెప్పవారు సరిగా నన్వయము చెప్పకుండుటచే నాలోటును నన్నయ తిక్కనలు బాపినందులకు వారిని శంభుదాసు డిట్లు ప్రశంసించెను.

ఉ॥ భాసుర భారతార్థముల
భంగుల నిక్కమెఱుంగ నేరమిఁ
గాసట బీసటే చదివి
గాథల ద్రవ్వ తెలుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పర
మార్థము తెల్లగజేసి నట్టి య
జ్ఞాసన కల్పులందలతు-
నాద్యుల నన్నయ తిక్కనాదులన్.

ఈ విషయమునే మడికిసింగన యిట్లు [illegible] యున్నాడు.

ఉ॥ భారతవేదవాక్య రస
భావములజ్ఞు లెఱుంగలేక ని
స్సార మనస్కులై తిరుగు
చందముచూచి తెనుంగుబాస పెం
పార రచించియందఱ కృ
తార్థులజేసిన పుణ్యమూర్తులర్
సారమతింభజింతు నని
శంబును నన్నయ తిక్కనార్యులన్.

ఇట్టి యుపకారమొనర్చిన నన్నయను తర్వాత కవులనేకోధముల స్తుతించియున్నారు. తిక్కనసోమయాజియే యిట్లువర్ణించియున్నాడు.

ఉ. ఆదరణీయసార వి
విధార్థగతిస్ఫురణంబుగల్గి య
ష్టాదశపర్వనిర్వహణ
సంభృతిమై పెనుపొందియుండ సం
పాదిదొడంగిమున్ను కృతు
లాంధ్రకవిత్వ విశారదుండ వి
ద్యాదయితుండొనర్చె మహి
తాత్ముని నన్నయభట్టు దక్షతన్.

## నన్నయ శైలి

మహాకవులును 'విద్యాదయితులు'ను నగువారిశైలిని గురించి వేఱుగాజెప్పనవసరము లేదు. అప్రియత్నముగా యతిప్రాసలుకుదురుట భారతకవులలో నొకవిశేషమై యున్నది. నన్నయశైలి విశేషభాగము సంస్కృతమున్నను "దేశికవిత"కూడ నందువిశేషముగాఁ గానవచ్చుచున్నది.

క. తగునిది తగదని మెదలో
వగవగసాదులకుపేద వారలకెగుల్
మొగిజేయు దుర్వనీతుల
కగుననిమిత్తాగంబులైన ఫలంబుల్.

ఇట్టి వనేకములు. లఘువులను గూడ విశేషముగా ఒతకూర్చియు రమ్యతను జెడనీయకుండుట కీపద్యమే యుదాహరణము.

క. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావలులగలసి విపినంబులలో
గడుకొని మాయల్లిడుమల
బడినసరులుగలరె యొరులు పరమమునీంద్రా.

ఈ కడపటి రెండుపజ్తులను గమనింపవలసినది. నన్నయలో నింకొకవిశేషము కనంబడుచున్నది. రౌద్రము, భయానకము. భీభత్సము మున్నగు భావముల బ్రదర్శించునప్పు డతడెక్కువగా జటిలములగు సంస్కృత పదముల నుపయోగించును. దుర్యోధనుడు ద్రౌపతిని తనతొడపై కూర్చుండుటకు కనుసన్న చేసినప్పుడు భీమసేనుడు కోపోద్దీపితుడై యిట్లు పలికెను:—

ఉ. ధారుణిరాజ్యసంపద మ
దంబునఁ గోమలి కృష్ణజూచి రం
భోరునిజోరుదేశమున
నుండగబిల్చిన యిద్ధరాత్ము దు
ర్వారమదీయబాహు పరి
వర్తితచండగదాభిఘాత భ
గ్నోరుతరోరు జేయుదు సు
యోధను నుగ్రరణాంతరంబునన్.

ఈ "లయసమయదండ ధరనిర్దయుడై" న భీముఁడై దుశ్శాసనుగుఱించి యిట్లు శపదముపలికెను.

ఉ. ఈ రుసనృద్ధుల్ గురువృద్ధబాంధవులనే
కుల్ సూచుచుండగ మదో
ద్ధురుడై ద్రౌపతినిట్లుసేసిన ఖలుగ
దుశ్శాసనుగ లోకభీ
కరలీలగ వధియించి తద్విపులవ
క్షశ్శైలరక్తౌఘు ని
ర్ఘరమూర్వీపతి సూచుచుండ ననినా
స్వాదింతు నుగ్రాకృతిగ.

తిక్కనసహిత మదేపద్ధతి నవలంబించియు న్నాడు. భీముడు "నితాంతదంతాపీడనరట దాస్యరంగ వికటభృకుటీచటులపరివృత్తనర్త నఘట్టనాప్రకారభయద స్ఫురణి పరిణద్ధమూర్తియై "కోపము వెలిబుచ్చినప్పుడు "భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీలంబు...ఉదగ్రధ్వ జార్చిష్మత్త్వా కలితంబు సైన్యమిదియే దేరంగళత్తుండనే" యని యుత్తరుడు భీతినిప్రకటించినప్పుడు మున్నగు ననేక స్థలములందీపద్ధతియే కనంబడుచున్నది.

నన్నయ్య హాస్యరసమును నీక్రిందిపద్యములో నెట్లుచిత్రించియున్నాడో చూడనగను.

కం॥ వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె యిట్లుకృపణులయిపట్టుపడగ
వీరికివలసెనె యహహ మ
హారాజ్యమదాంధకార మదివాసెనకో.

గీ॥ ఇంకనైనను మమ్ము నెఱుగంగనగునొక్కొ
యనుచు నుల్లసంబులాడి ద్రుపదు
విడిచిపుచ్చెగురుడు; విప్రులయలుకయు
దృణహుతాశనంబు దీర్ఘమగునె.

పాత్రపోషణ

కొన్నిస్థలములందు పాత్రములగుణపోషణ సన్న జనముగా గానుపింపదు. శకుంతలదుష్యంతునితో తన జన్మకథనము చెప్పుచు తనతల్లియగు మేనకనిట్లువర్ణించెను.

చ॥ అలసతయొప్పనా తరుణి
యమ్మునిముందర నున్న నా
మిళితసుగంధబంధురస
మీరణశంబున దూలిబాలపై
వలువెడలగ బయల్పడియే
నద్దకుచంబులు కక్షయుగ్మముగ
లలితకృశోదరంబు దర
లీత్రివళీయుత రోమరాజియుగ

ఇటులే గంగాదేవి "ప్రతీప వసుధాధిపుకాల విశాలదక్షిణోత్సంగమునందు మన్మథ వశంబున నుండె గరంబులీలతో" అని వర్ణింపబడినది. కాళిదాసు శకుంతలములో నీభాగమునే యెట్టులరమ్యముగావర్ణించి పాత్రౌచితినిబోషించినాడో యానాటకమునుజూచినవారికే తెలియును. అయితే యిదిపురాణపద్ధతి తర్జుమా గ్రంథము. మనమెక్కువగా నీసూక్ష్మాంశములను లెక్కచేయట్టకూడదని సమాధానపడినను భారత భాషాంతరీకరణములో మూలములోని యనేకాంశములను విపులము చేసి యనేకములను త్రోచివైచి మార్పులుగావించిన మనకవిత్రయమాతృమస్వాతంత్ర్యము వహించిన బాగుండెడిదేమోయని యనిపించును.

అక్షరములు

భారతకాలమునాటి భాషకు నేటి మనభాషకు తత్కాలమునాటిభాషకు చాల యంతరాళ మున్నది. భాషయెన్నియో మార్పులు చెందినది. భారతములోని యనేకపదములను మధ్యకాలపుగవులు ప్రయోగించుట మానియుండిరి. ఇంక నేటివిషయము చెప్పనవసరమే లేదు

గదా! భారతకవులకే చెల్లినపదములు కొన్ని కలవు. "కఱకంఠా క్షమియింపుము నేటినెవ్వారికెఱుక నగునె నీచరితంబుల్" అనుచోట "కఱకంఠ" పద మార్షమైనది. మఱియు జీవగఱ్ఱయట్టిద. "ఉఱుట" యను ధాతువు విశేషముగా నన్నయతిక్కనలచే ప్రయోగింపబడినది. "నెఱపు"అనుపదము "విస్తరించుట" యనునర్థములో ప్రయోగింపబడినది. నేటికిని గ్రామ్యములో దీనిని "దాన్యము నేర్పు" అనుచు వాడుకొనబడుచున్నది. ఇదేరీతి "కిట్టి"అనుట "సమీపించి" అనునర్థమిచ్చును. భారతమందంతటను కిట్టుధాతువు క్రియాపదముగానే వాడబడినది. దీనికిసామ్యము అరవములోనే దొఱకుచున్నది. అందు "కిట్టే" సమీపము" అనునర్థములో వ్యవహరింపబడుచున్నది. వెతకువారికిట్టివి బహుళముగా గోచరించును. ఈ శబ్దతత్త్వమును ప్రత్యేకముగా పండితులు తెల్పిచూపుట లాభకారిగానుండును.

## భారతప్రశస్తి

భారత మగాధ సముద్రమువంటిది. మంచిచెడ్డ లన్నియు దొఱకును. గణకునినీతి "బేకన్" "మ్యాకియవెల్లి" అనుపాశ్చాత్యరాజనీతిజ్ఞుల బోధయున్నది. విదురనీతి సేవకనీతి (ధౌమ్యబోధితము) హింసాహింసవిచారము (ధర్మవ్యాధోపాఖ్యానము) స్త్రీధర్మములు (సత్యాద్రౌపదీసంవాదము) అనుశాసనిక శాంతిపర్వములలోని జంతుకథలు భగద్గీత శాంతిలోనిమోక్షధ్యాయములు మున్నగునవెన్నియేని యీభారతమందు దొఱకుచుండును. కావుననే యిది

కం॥ వేదములకు సఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనబోటులకు దా
మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్

అని తిక్కన నిర్వచించియున్నాడు. ఇట్టియుద్గ్రంథమును వ్రాసి "యాంధ్రావళి మోదముంబొరయ" జేసిన నన్నపార్యుడు సదాస్మరణీయుడు.






కె. అన్నమరాజశర్మ

మ. జననీ! స్వర్గముఁ జేరికొంటివె నిరుత్సాహంబుఁ గల్గించి, తీ
రని నైరాశ్యము జీవితాభ్రమున నీరంధ్రంబుగాఁ గ్రమ్మ, మో
హనమై మున్ను మనోహరద్యుతుల నేత్రానందముం గూర్చుచుం
డిన సృష్టిన్, బృహదంధకారతతి నిండెన్ జిత్తశల్యంబుగన్.

ఉ. భౌతికజీవితవ్యథల భారము దుర్భరమయ్యెనేమొ, చిం
తాతరళోర్మిడోలల సతంబురియాడఁగఁ జేసిపోతె, త
ల్లీ! తలపోయునంతనె మలీమసమైన కవోష్ణవాఃకణ
వ్రాతము కన్నులందొరలి పాఱుఁ గపోలములంటి గుప్పునన్.

చ. పలుకఁగరాని తీవరపు వంతలనెట్లు భరించువాఁడ? లో
పల నణఁగించుకొందమన భావము శాంతత నిల్వఁబోదు, ని
ష్కలుషపుఁ బ్రేవవస్తనల శాశ్వతసౌఖ్యముఁ బొంద స్వర్గపుం
బొలముల సంచరింపఁ గొనిపొమ్మిక నన్ను విలంబితంబుగన్.

మ. పరలోకస్థవియద్ధునీనికట కల్పక్ష్మాజశాఖాచయాం
తరితచ్ఛాయల స్వేచ్ఛమై తిరుగుచో తల్లీ! నితాంతవ్యథా

భరితాత్మన్ ననుఁగూర్చి యెన్నఁడయినన్ భావించెదే? యస్థిరం
జరమునంబోలెఁ గృశించియుంటి కనవా స్వప్నప్రపంచంబునన్.

మ. మమతంబోవిడి యేలపోయితివె యమ్మా! శూన్యమైతోఁచు లో
కమునందొక్క నిమేషమాత్రమయినన్ గాలూదఁగాఁజాల స్వ
ప్నము ప్రాపంచికజీవితంబనెడి తత్త్వంబాత్మవీణాని నా
దములన్ మ్రోగఁగ జ్ఞానభిక్షమిడు మా తాపంబు చల్లారగన్.

గీ. స్నేహయకరపాళి కాస్థానఁ జేర్చిచిచ్చు
గీలు కొల్పిన దారుణజ్వాలలేమొ
అనుఁగు తల్లీ! మనోవేదనార్పరాని
మంటలై సంతతంబును మండుచుండె!

గీ. కాలవాహినీ స్నిగ్ధసైకతములందు
స్మరణ చిహ్నంబు లెన్నేని మఱపురాక
కనులగట్టుచునుండు నా కనుదినంబు
తరళబాష్పాంజలిం దిలోదకములొసఁగ.

గీ. జీవలోకపు యాతనా శృంఖలములు
వదల సురలోకసుందర ద్వారమందు,
నిర్మలాధ్యాత్మికప్రేమ నిండికొనఁగ
నిలిచి గమ్మంచు జనయిత్రి! పిలిచెదేమొ!






# మహాకవి కాళిదాసు

అయ్యదేవర కృష్ణ సోమయాజులు

భారతీయ కవిశ్రేష్ఠులలో కాళిదాసమహాకవి యగ్రగణ్యుడు. ఈతనినిబడసి భారతమాత ధన్యతగాంచినది. పాశ్చాత్యచరిత్రకారుల యభిప్రాయానుసారము భారతమాత తన యనాగరకతస్థితియందిట్టిమహనీయుని బడసినందున భారతీయులేగాక ప్రపంచమంతయు గర్వపడవలసినవిషయము. చీనాదేశీయులీమహాకవిని స్వజాతీయుడని గౌరవించుచుండుట లోకవిదితము. గటే యటువంటిగొప్పవ్యక్తులే తని కవితామృతముగ్రోలి తన్మయత్వమునొందిరి. ప్రపంచమంతటికినీతడు కవిరత్నమనిన యతిశయోక్తి కాజాలదు.

ఈమహనీయుని జన్మస్థానముగూర్చి భారతీయులలో కొన్ని భేదాభిప్రాయములు గలవు. ఋతుసంహారమునందు కావ్యరచయిత గ్రీష్మఋతువు, సౌరమానమునుండి ఆరంభించినందున యితనిది వంగదేశములోని 'నదియా' ప్రాంతపుగ్రామమని వంగదేశీయులు నిర్ణయించిరి. పైరెండువిషయము లాప్రాంతములందనాడినుండి ప్రచురితములగుటంజేసి కవీశ్వరుడు తనప్రాంతమందలివాడుకను కావ్యమునందు రచించెననియు, యితర ప్రాంతములవారైన నచ్చటివిషయములనే లిఖించియుండునని సిద్ధాంతరీకరించిరి. కాబట్టి కవీశ్వరుని జన్మస్థానము వంగదేశముతప్ప మఱొకటి కాజాలదని నిర్ణయించిరి. ఇదేగాక వంగదేశమునకు పూర్వమునుండొక ప్రత్యేకత్వముగలదు. పూర్వమునుండి ప్రపంచమున గౌరవమునొందిన గొప్పగొప్పభారతీయవ్యక్తులలో పెక్కుమంది వంగదేశమునకు జెందినవారే. నేటికిని ఇట్టిదశయనుభవించుచున్నదనుటకు పెక్కునిదర్శనములుగలవు.

ఇదిటులుండ సుమారు నలుబదిసంవత్సరముల పూర్వము బొంబాయియందలి ప్రసిద్ధపండితులగు డాక్టరు భాఉదాజిగారు మాతృగుప్తుని నామాంతరమే కాళిదాసని ఋజువుపరచుటకు ప్రయత్నించిరి. ఇదికొంతవరకు సమంజసముగానున్నది. కాని కాళిదాసునది వంగదేశమని నిర్హేతుకముగా వాదించువాదము నిరాధారముగానున్నది. ఈమాతృగుప్తునివృత్తాంతము "రాజతరంగిణి" యందిటుల లిఖింపబడియున్నది:—

"మాతృగుప్తుడు సంస్కృతమహాకవి. రాజసన్మానముబడయుటకై పెక్కురాజుల నర్థించెను. కలిమిసమ్మానను గలుగలేదు. చివరకు ఉజ్జయనిరాజగు మహర్షదేవుని యాశ్రయమున కాలముగడుపుటకై నిశ్చయించినట్లైన ఈతనిదురదృష్టమోయన ప్రథమమున యితనకొనినంత సత్కారము మితనికి కలుగలేదు. ఈభూపాలుడితనిని మహాత్మునిగాదలచి పరీక్షించుటగాను తగినంతగౌరవము చేయనటుల నొకప్రతీతిగలదు. ఏమైననేమి మాతృగుప్తుడచటనుండుటకున్మాత్రము నిశ్చయించుకొనెను. కొంతకాలము రాజసభ యితనినితప్పక గౌరవించవలయునని నెడిగొరి రాజ

కలిగెను. కాని యెట్లుల సత్కరించవలయునో నిశ్చయింపలేదు. రాజుగారికిమాత్రము యిలనిశ్చయమై సద్బుద్ధికలిగినను యితనికి సుదివసములచిహ్నములు గోచరించనందున యెట్లో కాలముగడుపుచుండెను. ఒకానొక చలికాలపు రాత్రి, రెండు యామములు దాటినపిదప, రాజు హటాత్తుగా మేల్కాంచెను. తైలములేనందున దీపపుకాంతి క్రమముగా తగ్గుచుండెను. సేవకులందరు గాఢనిద్రాపరవశులై యుండిరి. రాజు సేవకులబిలిచినను మారుబలుకువారు లేకుండిరి. ఆసొంగమునందీ నిశ్శబ్దసమయమున మాతృగుప్తుడుమాత్రము తనదురదృష్టదశపై చింతించుచుండెను. రాజుగారియాజ్ఞానుసారము దీపములందు తైలముపోయ ప్రకాశవంతములై దీపములు వెలుగుచుండెను. సమయమెంతై యుండునని రాజువిచారించ 'ఉషఃకాలమున కొకఘడియకాలముమాత్రము గలద'ని మాతృగుప్తుడు బలికెను. 'నీమేల్కొను కారణమేమ'ని యడుగ 'దురదృష్టమే ముఖ్యకారణమ'ని ప్రత్యుత్తరమిచ్చెను. ఈసంభాషణము జరిగినరెండుగోజులకు పిదప రాజితనికి కాశ్మీరరాజ్యమిచ్చివేసెను. 'కష్టేఫలేః' యనునటుల చివరకితనికి సౌఖ్యమనుభవించు సుదివసములు కలిగెను. హర్షదేవునికి కాలగర్భమున లీనమైనాడిలో యాశ్రయమిచ్చినందున మాతృగుప్తుడు ౪ సంవత్సరములుమాత్రమే రాజ్యసుఖమనుభవించి మిగతకాలము సన్యాసాశ్రమమునందు వారణాసిపురములో వైరాగ్యచింతనమునందు గడిపెను''

డాక్టరు భాఊదాజిగారు

'లగ్నకుంకుమకేసరాన్' (రఘువంశము ౪ అ. ౬౭ శ్లో) యను శ్లోకపాదయాధారముపై కాళిదాసు స్వయముగా స్వనేత్రములతో కుంకుమ (కేసరి) పొదను చూచియుండవలెనని దెలిపియుండిరి. కాశ్మీరమునందిప్పటికీ యీపంటగలదు. కాబట్టీతడు కాశ్మీరప్రదేశమును చూచియుండవలెను. ఇదిగాక ఉజ్జయనితో మాతృగుప్తునికి యుండినసంబంధము మేఘసందేశమందలి పూర్వభాగపు శ్లోకములలో విదితమగుచున్నది.

నకళిః పన్థా యదపిభవతాః, ప్రస్థితస్యోత్తరాశం
సౌధాత్సంగప్రణయవిముఖోమాస్మభూర్ఉజ్జయిన్యా

—మేఘ. ౨౭

దీనినిబట్టిచూడ ఉజ్జయినితో కావ్యరచయిత కొక సంబంధమేగాక యాప్రదేశముపై కవీశ్వరునకు యభిమానమున్నటుల గోచరించుచున్నది. లేకున్న మేఘునితోవ తప్పించి ఉజ్జయినిప్రదేశములందు సంచరింపజేయుటకు ప్రబలమైన మరొకకారణము గన్పించుటలేదు. ఇంతేగాక ఇందుమతీస్వయంవరసర్గయందు అవంతీనాథుని మిగులప్రశంసించి దిగ్విజయములం దితడసమానుడని వర్ణించిన క్రిందిశ్లోకములుగలవు:—

''అవంతినాథోऽయముదగ్రబాహు
ద్విశాలవృక్షస్తనువృత్తమధ్యః
ఆరోప్యచక్రభ్రమముష్ణతేజా,
స్త్వష్ట్రేవ యత్నోల్లిఖితోవిభాతి

అస్యప్రయాణేషు సమగ్రశక్తే
రగ్రేసరైర్వాజిభి రుత్థితాని;
కుర్వంతిసామంతశిఖామణీనాం
ప్రభాప్రరోహాస్తమయంరజాంసి॥

—రఘువంశము,

పైశ్లోకములవలన నితడచ్చట నివసించినటుల దెలియుచున్నది. డాక్టర్ నోబుల్ (జర్మన్ పండితుడు) మహాశయుడు ''ఋతుసంహారము'' కాళిదాసునిచే గరచింపబడలేదని వింతవాదమొకటి ప్రకటించెను. వారికిలభించినయాధారములివి:—

౧. నేపాళదేశపుప్రతివలన కాళిదాసు మూడు కావ్యములు—రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము — మాత్రమే రచించినటుల ధృడపడుచున్నది.

౨. మల్లినాథుడు పై మూడు కావ్యములకు మాత్రము టీకావ్యాఖ్యాన మొనరించెను. ''శిశుపాలవధ''కు సటీకరణ మొనరించుచు 'కాళిదాసత్రయసంజీవియ' నిలిఖించియున్నాడు. ఋతుసంహారము రచించియుండిన, మూడుకావ్యములకు టీకవ్రాసినమహాశయుడు, దీనికిగూడా వ్రాసియుండును.

3. 'ఋతుసంహారము' నం దగ్గతరన్యాసములేదు. ఉన్నను 'మేఘసందేశము' మొదలగు కావ్యములతో పోల్చిచూచిన మిగులన్యత్యాసము గలదని దెలియగలదు. అనగా దీనియర్థతరన్యాసము నీచశ్రేణిలో చేర్చతగినదై యున్నది.

వీనికి తగినసమాధానములు బరెడెల్కీథ్ దెలిపినను పైవిషయ మిదమిద్ధమని నిరూపింపబడలేదు. కీథ్ సహితమిది కవియొక్క సర్వోత్కృష్ట కావ్యములలో చేర్చుటకు వీలులేదని నిర్ణయించెను.

పండిత అవధువాని సీతారామగారు కాళిదాసత్రయకావ్యములతోబాటు, సుమారు నలుబదిసంవత్సరములకుపూర్వము దీనికి భాషాచ్ఛందయనువాదము వ్రాసినను దీనిలో కొంతవిచిత్రము కనబడుచున్నది.

'' కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతర క్షతయే,
సద్యః పర నిర్వృతయే కాంతా
సమ్మిత తయోపదేశాయుజే.''

యని కావ్యరచనప్రయోజనముహూర్చి మమ్మటు బలికినటుల ''కాళిదాసాదినాంయశః'' యని కాళిదాసుని విషయమై వార్తికలో లిఖింపబడియున్నది. అనగా కాళిదాసుకవిత్వము యశముకొఱకై రచింపబడినందున పరమానందామృతము దానిలోలేదనుసారము దేలుచున్నది. ''ఋతుసంహారము'' నందు యీమహాకవి ఋతువుల 'ప్రియే' యని సంబోధనవాక్యములలో వర్ణింపబడినవి. దీనిప్రయోజనము కేవలము పరనివృత్తియని దేలుచున్నందున మమ్మటుగారి వాక్యములకు భంగమువాటిల్లుచున్నది. ఈకావ్యవిశేషములు వారికాసమయమందు స్ఫురింపకుండుట సంభవము.

ఈ మహాకవి యీకావ్యమునందు ఋతువుల నెటుల వర్ణించెనో పరిశీలింతము:—

గ్రీష్మఋతువు. ఈఋతువర్ణనగల మొదటిరెండు శ్లోకములందు 'ప్రియే' యనుసంబోధనపదములు వాడబడినవి. చివరశ్లోకమునందు '' వ్రజతుతవనిదాఘః కామినీభిః సమేతః'' యనిగలదు. దీనిలో దెలుపబడిన 'నిదాఘఃకామిని' యెవరైయుండును? కాళిదాసుని ప్రియ స్వయంకామినికదా. అట్టిస్థితిలో కామినియని కేపాటి సౌఖ్యము కలిగింపును?

వర్ష ఋతువు. వర్షవర్ణయందు 'ప్రియే' యనుసంబోధన పదముగలదు. ''జలదసమయఏషః... ప్రియే తవహితాని.'' యని చివరభాగమందుగలదు. ... శబ్దప్రయోగము వర్షములోనే యీభాగమురచించినటుల ధ్వనింపజేయుచున్నది. ఈవర్ణనయందు మఱొకవిశేషము కనబడుచున్నది. వింధ్యపర్వతముల నామములు రెండుసార్లు కావ్యమునందిటతప్ప మరేసర్గయందు ... వాడబడిన

హైద్రాబాద ప్రజాపక్ష విద్యామహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు



శ్రీ రాజా ధన్‌రాజ్‌గిర్జి గోస్వామి బహద్దుర్

గాని, అంతమునందు గాని, యితరపర్వతనామములు గాని, వింధ్యపర్వతనామము తప్ప మఱొకటి వాడబడనందున కాళిదాసునకు వింధ్యపర్వతము పరిచయస్థలమై యుండ వలయును.

"వనాని వైన్ధ్యాని హరంతిమానసమ్"

—ఋతు. ౮.

"సముపజనితతాపం హ్లాదయంతీవ విన్ధ్యమ్."

—ఋతు. ౨౭

శరదృతువు. 'ప్రియే' గాని మఱేసంబోధనావాక్యములు గాని యీఋతువర్ణనలో వాడబడలేదు. అంతమునందుమాత్ర మిటులగలదు:

"...........కామినీ వౌన్మదేయం
...ప్రతిదిశతు శరదిశ్చ్వతే సఃప్రీతిమగ్ర్యామ్"

దీనిలో ప్రయోగింపబడిన 'సః' శబ్దము దేనికై వాడబడినది? ప్రేయసినిసంబోధించి శరదృతువర్ణింపబడిన నొకప్రియ యనేకరూపముల ప్రేయసియగుట సంభవమా? ఇక ప్రియ తానుస్వయంకామినికదా? అట్టిచో లోకామినివంటిశరదృతు వెటులప్రసన్నత గాంచును? కావున నీవర్ణన పురుషునికైనను లేకసభాపతికైనను వర్ణింపబడియుండవలయును. 'ఇయం' శబ్దప్రయోగమువలన యీవర్ణన శరదృతువునందే రచించినటుల గృడపడుచున్నది.

హేమంత ఋతువు. ఈవర్ణనగలసర్గలో ౧, ౧౦ వ శ్లోకములందుమాత్రము 'ప్రియే' శబ్దములు ప్రయోగింపబడినవి. సర్గాంతమందు,

"ప్రదిశతుహిమయుక్తః కాలఏషఃస్సుఖంవః"

యనియుండుటచేసి 'వః' యను బహువచనముండుటయే గాక ఆఋతువునందీవర్ణన రచించినటుల తెలియుచున్నది.

శిశిరఋతువు. ఈఋతువర్ణనయందు 'ప్రియే' యనుశబ్దమునకుమారుగా "వరోరు" యనిగలదు. చివరకు మాత్రమిటులగలదు:

"శిశిరసమయఏషః శ్రేయసేవోస్తునిత్యమ్"

పూర్వపువర్ణనలమాదిరి దీనిలో 'వః' మఱియు 'ఏషః' ప్రయోగింపబడినవి.

వసంత ఋతువు. ఈఋతువర్ణనయందలి మొదటి, రెండవ, పదునెనిమిదవ శ్లోకములందు 'ప్రియే' యనుశబ్దము లుపయోగింపబడినవి.

"భవతు తమవసన్తః శ్రేష్ఠకాలఃసుఖాయ"

ఋతువులన్నిటిలో వసంతఋతువే శ్రేష్ఠమని పై శ్లోకమువలన దెలియుచున్నది. ఈసర్గయందలి ౨౮ వ శ్లోకమునం దాశీర్వచనపదములుకలవు.

"సోయంవో వితనోతుచైవవితనుః భద్రంవసన్తాన్వితః."

ఈచిన్నకావ్యమునం దనేకస్థలములందు 'కుంకుమ' 'శిలాజితము,' 'క్షితిభృత' ముల వర్ణనలుగలవు. దీనివలన కాళిదాసునకు పర్వతప్రదేశములు మైదానపుసౌందర్యములకన్న రమ్యప్రదములుగా నుండినటుల విశదపడుచున్నవి.

గ్రంథలక్షణవిమర్శనమునకు

"ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశోవాపితన్ముఖం"

యని గ్రంథమునందుండువిషయము సమంజసము.

"అంత్యేకావ్యస్య నిత్యత్వా
త్కుర్యాద శిషముత్తమమ్

"సర్వత్ర వ్యాప్తతేవిద్వాన్
నాయకోచ్ఛానురూపిణిమ్"

యని యుండుటజేసి కావ్యము నియమానుసారము రచింపబడుట నిశ్చయము.

విమర్శనదృష్టితో దిలకించునారలకీ 'ఋతుసంహార' మొకకావ్యము. కాని ప్రత్యేకసర్గాంతమందలి వసంత ఋతువర్ణనలో ఆశిషనియమ ప్రయోగముల కెట్టియావశ్య కతయుండెనో దెలియుటలేదు. దీనిప్రయోగమువలన యిదొకప్రత్యేకగ్రంథముకాదని మాత్రము చెప్పవీలగుచు న్నది. 'ఋతుసంహారము' భిన్నభిన్నసమయములలో ఆయా ఋతువులం దాయాఋతువర్ణనలు రచించినటుల దోచు చున్నది. 'ప్రియే' యనుసంబోధపదములు పలుసారులు ప్రయోగింపబడినందున యీవర్ణనలు సభయందలి సభి కులయానందమునకై చదువబడియుండును. వర్ణనయందలి శ్రీవృత్వమున కెట్టిసందేహములేదు. ఎవరో యొకమహాను భావుడీ ఋతువర్ణనలు పుస్తక రూపమున (ప్రత్యేకకావ్యముగ) బ్రకటించియుండవలయును. 'మేఘసందేశము' 'ఋతుసంహారము' రచించిన మహాను భావుడుమాత్రి మొకడైయుండి తీరవలయును. కావ్య నియమములను, యీవర్ణనలు గ్రంథరూపమున సమకూర్చినవ్య క్తి, దాటలేడనుటకు సాక్ష్యప్రదమైన వసంతఋతువర్ణన గ్రంథాంతమున నందేగలదు.

ఋతువులగణన సహజముగా సౌరమాసమునుండి లెక్కింపబడును గాని చాంద్రిమానమునుండికాదు. *

సౌరమాసప్రయోగమనివార్యవిషయమనుట తథ్యము. ఇక రెండవవిషయము 'గ్రీష్మఋతువు.' ఈఋతువునం దీ ప్రాంతమునందే వర్షారంభమగుననెడి తర్కచాతుర్యము లో విశేషమేమియు స్ఫురించుటలేదు. ఋతువులలో ప్రథమమున యీఋతువే గణింపబడుచున్నందున దీని వర్ణనతోనే గ్రంథారంభము చేయనైనది. కాని దీనిలో నెట్టి ప్రత్యేకత్వము వంగదేశమని ధ్వనింప జేయు చున్నదో పండితవర్యులకే దెలియును. ఒకింతవిమర్శన భావములో జదువు ప్రతిపాఠకునికి కావ్యరచయిత నివా సస్థలము పర్వతప్రాంత ప్రదేశమని, ముఖ్యముగా వింధ్యా చలపర్వతలోయలప్రదేశమని బహిర్గతమగును.

కావ్యకర్త తనకావ్యమునందు తనదేశమునుగాని తనవంశమునుగాని వర్ణించుచుండును. గోస్వామి తులసీ దాసుగారు తమరామాయణమందలి భూమికలో తననివాసస్థలమతిచిత్రిముగా వర్ణించియున్నాడు. కాళి దాసు వంగవాసీయుడేయైన తనయేకావ్యములోనైనను వంగదేశమును వర్ణించియుండును. "రఘువంశము" నందు మాత్రి మొక వంగదేశనామముచ్చరించి యున్నాడు.

"వంగానుత్ఖాయతరసా
నేతానౌసాధనో ద్యతాన్;
నచఖాన జయస్తంభాన్
గంగాస్రోతోన్తరేషునః."

—అ ౪ శ్లో ౩౬

*వంగదేశమునందు వాడబడుసంవత్సరము అక్బరు కాలమునుండి ఆచారములోనికివచ్చెను. క్రి.శ. ౧౫౫౬ సంవత్సరమున అక్బరుచక్రవర్తి పట్టాభిషిక్తుడయ్యెను. అప్పుడు విక్రిమార్కశకవత్సరము ౧౬౧౩. హిజరీసంవత్స రము చాంద్రిమానమునుండిగణింపబడుట లోకవిదితము అక్బరాజ్ఞానుసారమిది సౌరవర్షముగా — సంక్రాంతి నుండి సంక్రాంతివరకు—మార్చబడినది. విక్రమార్కశక వత్సరమునకు హిజరీసంవత్సరమునకు ౬౪౯ వర్షముల వ్య త్యాసముగలదు. వంగదేశమునందు సౌరమాసము వాడ బడుట కిదియేముఖ్యకారణము. అంతకుపూర్వము సౌర మాసము వాడుకలోనుండెననుట కెట్టినిదర్శనములు కన బడుటలేవు. ఇక కాళిదాసునికాలములో యేశకము, యే సంవత్సరము వంగదేశమునందు వాడబడుచుండెనో తెలియును. ఇట్టిస్థితిలో సౌరమాసమే వాడబడుచుండె నను వాదములోని చిత్రిము గోచరించుటలేదు.

ఇదొక గొప్పప్రశంస మాత్రముకాదు. ౬ వ సర్గ యందు వంగదేశపురాజునామమైనను వాడబడనందున ఆదేశము అంగదేశమున కంతర్గతమైయుండెనా?

కాశ్మీరమునుండి కన్యాకుమారివరకు, పెషావరునుండి [...]వరకునుండు ప్రతిభారతీయుడు శ్రీరామచంద్రుని యవతారపురుషునిగా పూజించుచుండుట సర్వసామాన్యము. కాని యీవిషయములోమాత్రము వంగదేశీయులొక్క ప్రత్యేకత్వము కల శ్రీరామ చంద్రుని యవతార పురుషునిగా భావించక వీరపురుషునిగా గౌరవించెదరు. ఒకవేళ శ్రీరాముని యవతారపురుషునిగాభావించిన తనగర్భశత్రువుడగు రావణునిజయించుటకు భవానీ దేవతను నారాధించుటెకెందుకు? ఆమెవరముబడయకున్న రావణునిజయించుటకీతనికి శక్యమగునా?" యనెడిభావములు వంగదేశీయులలో గలవు. ఇదిగాక వంగదేశమునందు రఘువీరుడనిగాని, రఘునాథుడనిగాని రాముని నామముగలవారుగాని లేకుండుటయేగాక శ్రీరామనామపురోద్భవములు వాడుకలో లేకుండుటయు లోకవిదితము. ఇట్టిస్థితిలో కాళిదాసువంగదేశీయుడైన శ్రీరామచంద్రుని యవతార పురుషునిగా దలంచి నిటులవర్ణించియుండడనుటతథ్యము. సురులకు శత్రువులగురాక్షసులలో ప్రహ్లాదుడు జననమొంది నారాయణునిగొలువలేదా యనుయాధారముపై వంగదేశీయులలో విపరీతభావములు కలిగియున్నను కాళిదాసు వంగదేశమునందే జననమొంది శ్రీరామచంద్రుని తనకావ్యమునకు నాయకునిగాజేసికొని కావ్యనియమములననుసరించి,నాయకునియిటులవర్ణించుట సంభవమా యనిశంక కలుగవచ్చును. కానియిదంత సమంజసముగా కనబడుటలేదు. కాళిదాసువంగదేశమునందేజనన మొందెనియనుకొందము. కానితానురచించినకావ్యములలో దేనియందైనను తనమాతృస్థానముగుఱించి ముచ్చటించుట కానికట్టియాటంకములుండెను? ఆతనికావ్యములందు ఉజ్జయినికిసంబంధించిన ప్రదేశములవర్ణనలుగలవు గాని వంగదేశముగాని లతావృంతములుగాని దర్శించినటులలేదు. ఇదిగాక దశమసర్గయందు దేవగణము విష్ణుగణమువద్దకు జేరి తమకష్టసుఖములు విశదపరచుటయుఅందుకుదేవగణము

"సోహం దాశరథిర్భూత్వా
రణభూమేర్బలిక్షమమ్,
కరిష్యామి శరైస్తీక్ష్ణై
స్తచ్ఛిదః కమలోచ్చయమ్.

బలుకుటగలదు.

౧౧ వ సర్గయందు పరశురాముడు

"నతత్వతత్స్వన్నవోర్మిపురుషం పురాతనమ్"

యనిపలుకుటయు, ౧౬వ సర్గయందు రాజు కుముదునితో

"విష్ణోః సుతాఖ్యామపరాన్తనుం త్వామ్"

యనుబలుకులు వంగవాసీయు దుచ్చరించుటకువీలు కలదా? "గోపవేష్యవిష్ణోః" యనుటంజేసి కాళిదాసుని సనాతనత్వము విశదమగుచున్నది.

కాళిదాసు వంగవాసీయుడేయైన మేఘునికి సుందరమగు వంగదేశపువనములనుండి యాత్రయారంభింపకజేసి 'జనకతనయాస్నానపుణ్యోదక'మగు రామగిరి నుండి ప్రారంభించుటకు యవకాశముకలుగజేయుటలో రహస్యమేమి?

ప్రస్తుతము అయోధ్యయనిపిలువబడు ప్రదేశము విక్రమాదిత్యునిచేనిర్మింపబడినటుల వాడుకగలదు. ఐతిహాసికులపరిశోధనలు గుప్తవంశపు ద్వితీయచంద్రగుప్తుడే విక్రమాదిత్యుడని నిశ్చయించినవి. విక్రమ, విక్రమాదిత్య

విక్రమాంక, అజితవిక్రమ, పరివీరవిక్రమ, విక్రమాజితు మొదలగువిక్రమనామములు యీతనిశిలాశాసనముల వలన దెలియుచున్నవి. గుప్తరాజులవంశానుక్రమ మిట్లున్నది.

శ్రీగుప్తుడు:
ఘటోత్కచుడు
చంద్రగుప్తుడు ( ప్రథమ )
సముద్రగుప్తుడు
చంద్రగుప్తుడు (ద్వితీయ)విక్రమాదిత్య నామములుగల) కుమారగుప్తుడు

చంద్రగుప్తవిక్రమాదిత్యుడు తనరాజధానిని అయోధ్యకుమార్చినటుల 'విన్సెంటుస్మిత్', తన 'హిందూదేశ ప్రాచీనచరిత్రయందు సూచించియున్నాడు. రఘువంశము ౧౬-వ సర్గయందు కుశుడు అయోధ్యానగరమును నిర్మించుట దీనిఛాయగా కనబడుచున్నది. ఈతని ఆశ్రయమునందే యీమహాకవి తనకావ్యములను రచించియుండవలయును. ప్రయాగయందు నేటికి కొన్ని కూపములు, శిలాహయము సముద్రగుప్తునినామమున వాడబడుచున్నవి. కోటలలో పెక్కుస్థలములందు, స్తంభములపై యీతని దిగ్విజయములవర్ణించుశాసనములుగలవు. రఘువంశమునందలి ౪వ సర్గలో దిగ్విజయములు వర్ణింపబడినవి. ఈతనిదిగ్విజయములప్రతిబింబముగా యున్నట్లు కనబడుచున్నది.

రఘువంశము యసంపూర్తిగానుండుటజేసి కావ్యముపూర్తియగుటకుపూర్వమే కాళిదాసునికి దేహాంతము కలిగియుండవచ్చును. ఈకావ్య మయోధ్యనగరమునందే రచింపబడినదనుట కెట్టిసందేహములేదు. కుమారసంభవ ముజ్జయినినగరమందు రచింపబడినది. కుమారగుప్తజనన జ్ఞాపకార్థ మీకావ్యము రచింపబడి యుండును. విక్రమోర్వశీయ' నాటకమందలి నాయకుడు పురూరవుగాని విక్రముడుగాడు. దీనిలో వీరరసమెంతమాత్రములేదు. ఆశ్రయదాతనామ మెల్లప్పుడు నిలిచియుండుట కీనాటక మానామముతో రచింపబడినటుల విశదమగుచున్నది. ఉజ్జయిని దేశీయులమతము శైవమతమే అనగా శైవమతమునే యీనాటకమునందు వర్ణింపబడినది. 'మేఘసందేశము', రచింపబడినపిదప రఘువంశము రచింపబడియుండవలయును. పైయంశములన్నియు కాళిదాసుని జన్మస్థానము ఉజ్జయినినగరమని దెల్పుచున్నవిగాని వంగదేశీయుడని నిశ్చయించుట కేవిధ. వంగదేశీయుడని విశదపరచు ప్రబలకారణములేమైనన్న పండితవర్యులు సారస్వతలోకమున ప్రకటింతురుగాక!

# గీతిప్రియ

## సముద్రాల రాఘవాచార్యులు

తరుణసుమనోవతంస సందర్శనాభి • లాష బహుతీవ్రమై యుబలాటమెట్లు
అది న్యనః మూర్తియైహృదయావకాశ • మావరించినలేదే మొజీవితాశ
కరుణిరూపమ్ము నాన్యతోదర్శనీయ • మధురిమంబనుకొంటి మున్మదిని నేను
త్రిజగతీస్పృహణీయ తద్దివ్యమూర్తి • చుంబనము ప్రతియణువుపు చూచినట్టు
ఆ మహావ్యక్తసౌందర్యమూ కృశింప • నామనసువిశ్వజగతి నెన్నాడి తిరుగు
అందు వ్యభిచారశంకనిత్యంబువొందు • జనుల కేది తదేక నైశ్చల్యబుద్ధి
నాగొడవనాది నేమదానందమూర్తి • వెంటబడకుండలేను నావెట్టికూతె
ప్రేమమో? కామమో? [illegible] • [illegible]; నాదె తద్భరణవృత్తి.



# అదృశ్యవ్యక్తి

ఒద్దిరాజు సీతారామచంద్రరావు

నళినీకాంతుఁడు కలకత్తావిశ్వవిద్యాలయమున నీ సంవత్సరము మిక్కిలి సన్మానపూర్వకముగ "సైన్సు యం' డీ" పరీక్షలోఁ గృతార్థుఁడయ్యెను. నిన్న నేఁడాతఁడా విశ్వవిద్యాలయమునుండి విద్యార్థివేతనమును గ్రహించుచునే ఆవిష్కారవిభాగమునఁ బనిచేయుచున్నాఁడు.

నళినీకాంతుఁడు బారిసాల్ నందు సుప్రసిద్ధుఁడగు నొకానొకజమీందారుని యేకపుత్రుఁడు; కావున నళినీకాంతునకు ధనమున కభావము లేదు. చిన్నతనమునుండియే యాతనిబుద్ధివైదగ్ధ్యము నిరంతముగనుండెను. నళినీకాంతుని చిన్నతనపుమాటలనే వినిన బారిసాలవాస్తవ్యులు విస్మయులగుచుండిరి. ఇఁక-గణితమందనినచో—ఆబాలుడు కలకత్తాపాఠశాలలో షష్ఠశ్రేణిలో ప్రవేశించినపుడు దశమశ్రేణికి దుర్గమమైన లెక్కలను సుగమముగా విడఁగొట్టువాఁడు. కష్టపడకయే కాలేజియందలి కక్షలలో ప్రథమగణ్యుఁడగుచుండెను. ఎం. ఏ పరీక్షలో నాతఁడు భౌతికజ్ఞానము నభ్యసించెను—కృతార్థుఁడయ్యెను. ఈతని తీవ్రబుద్ధినికని పెట్టి విద్యాలయాధ్యాపకు(ప్రొఫెసరు) లాశ్చర్యపడుచుండిరి; అయినను నళినీకాంతుఁడు నమ్రస్వభావముతో సదాచారియైయుండువాఁడు. అందుచే సర్వప్రియుఁడగుచు వచ్చెను.

ఒకనాడు నళినీకాంతుఁడు ప్రయోగశాలలో కూర్చుండి యొకజర్మన్ దేశీయుఁడగు తత్త్వవేత్త (ఫిలాసఫర్) చే వ్రాయఁబడిన గ్రంథమునందలి యొకపుటను చదువుచుండెను. చదువఁ జదువ నాతనిహృదయసముద్రమునందొక విచారతరంగము పుట్టెను.—"ఏమి! ప్రత్యేకపదార్థముయొక్క పరమాణువదృశ్యమా? మనుష్యునిపైఁ బ్రయోగించుటచే మనుష్యునదృశ్యునిగా నొనరించునది యేతరళము? ఏమి? పరమాణువులయందుపయుక్తతరళములయొక్క కలిమిలేములేనా పదార్థములయందలి దృశ్యాదృశ్యభేదము? ఇదిసత్యమైనచో మనుష్యుఁడదృశ్యుడు కాఁగలఁడా?"

నళినీకాంతునివిచారము నిస్సీమమైపోవుచున్నది. ఆతఁడా నిశ్శబ్దపు దేశమునఁగూర్చుండి తనవిచారము నింకనీ తీరున సాగింపఁజొచ్చెను,

"ఇది యిటుల సంభవమైనచో నెంత యానందమగును? తిరుగుట, తినుట యివిరెండవవానికి చూడజాలకుండను గదా. బండ్లలో, రైళ్లలో, పడవలలో నెవరికిఁ గాన్పింపకుండఁగూర్చుండి ప్రపంచయాత్ర జేయనచ్చునుగద! టికటుకొనవలసిన పనిలేదు! ఓ! అదృశ్యతమయ్యెను! కాని, ఆదియేతరళము—దానినేప్రకారము మనుష్యునిపై ప్రయోగింపవలయును"

నళినీకాంతునిబుద్ధి పచారుచేయుటకొక క్రొత్త

మైదానములభించినది. ఆమైదానమునందాతడు తిర్వన
దిరుగుచుండగా నాతనిచేతిపుస్తకము పట్టువదలి క్రింద
బడిన దాతఁడెరుఁగఁడు. ఆతనికి బాహ్యపదార్థముల
యందలిగాని తనశరీరమందలికాని సుధలేదు. ''టక్,
టక్'' అనిగంటపైగంట గడియారముప్రోగించుచునే
యున్నది. మెల్లమెల్లన చీకటులు వ్యాపించెను. కాని
నళినీకాంతుఁడు కుర్చీయందుకూర్చుండియే యుండెను;
అతని చూపెదుటిగోడపైననే యుండెను. పరిచార
కుఁడు గదిలోనకువచ్చెను. నళినీకాంతబాబు యేదియో
విచారించుచున్నటుల గ్రహించి విద్యుద్దీపమును వెలిగించి
మఱియేదేనిపనిపై వెడలిపోయెను. ఏమిజరిగినది. ఎంత
సమయమైనది నళినీకాంతున కెంతమాత్రము దెలియదు.
ఏల? ఆతడు దృశ్యాదృశ్యపదార్థప్రశ్నవిడదీయు
టలో మగ్నుడైయున్నాఁడు. ''టక్,టక్,, అని పది
రెండుగంటలు గొట్టెను. రాత్రిరెండుజాములయ్యెను.

నళినీకాంతుఁ డులికిపడెను. ఆతనినిబట్టి బలముగా
నెవరోయూపుచు ''స్నేహితుఁడా! ఏమిచేయుచుంటివి?
నేడింటికిరావా? చాలసేపువేచి,వేచి, వెతకుటకుఁ గడం
గితిని.'' అనిపలుకుచుండెను.

నళినీకాంతుఁడు విహ్వలుడై ''ఏమి? సతీశ! ఏమంత
యాలస్యమయ్యెను? ఇపుడెన్నగో......? అనుచుఁ'' డగ
నళినీకాంతునకు బాహ్యవస్తుజ్ఞానము మెల్లన గలుగజొచ్చె
ను. కావున సగమువాక్యముతో ప్రసంగమునాపి, కోటును
వెనుకకునెట్టి చేతికిధరించిన గడియారము చూచెను—
ఏమి? నళినీకాంతుఁడు ముగ్ధుడయ్యెను. ''ఉఫ్! పది
రెండుగంటలుకొట్టినవి! కాని, మిత్రమా! ఒకఅద్భుత
విషయముస్ఫురించినది.,,అనిబలికెను.

''ఏమది?''

''కాదునీవుతెలిసికొనజాలవు. మంచిది. న్యాయ
వాదులకు సైన్సుతోనేమిపని?

సతీశచంద్రుఁడు న్యాయవాదము నభ్యసించు
చుండెను. నళినీకాంతునకు పరమమిత్రుఁడు. ఇరు
వురును కలకత్తాలో నొకయింటనే యున్నారు. పర
స్పరమగాఢప్రేమగలవారు. ఒకరినివిడచి యొకరన్నము
ముట్టరు. తరచుగా ప్రతిదినము నళినీకాంతుఁడు రాత్రి
యేడుగంటలకిల్లుచేరును. సతీశచంద్రబాబు పాఠముల
చింతనచేసి ప్రతీక్షచేయుచుండును. ఇరువురుమిత్రులు
కలసిభుజింతురు. తదనంతరముద్యానము (పార్కు)నందు
విహరింప వెడలుదురు. గంట,రెండుగంట లచటనుండి
యిల్లుజేరుదురు. ఎపుడైన ''తాస్'' ఎపుడైన ''చతురంగము''
నాడఁదొడఁగుదురు. వీనియందరుచిగలిగిననాడు కేవల
సంభాషణమున కాలముగడుపెదరు. ఏ విధముననైననేమి
యొకటిరెండు గొట్టురాత్రికిపూర్వము శయనింప
కుందురు. ఎపుడైన నిద్దరుమిత్రులును బుద్ధిహీనులవలె
తెల్లవారుదాఁకఁగూడ నవ్వుచుగూర్చుందురు. ఇరు
వురిహాస్యము మిన్నుమోగించుచుండును,

నేడు—రాత్రి పదునొకండుగంటలైనను నళినీ
కాంతుఁడింటికిరాలేదు. సతీశునిమనస్సునందొక శంక
భయము సంభవించెను. బైసికల్ గైకొనివెంట నేయతఁ
డుద్యానమునకు పరువెత్తెను. అచట నళినీకాంతునిచిహ్న
మైనలేదు. భయ శంక లభివృద్ధికాఁగ నాతడువెంటనే
మజలనింటికివచ్చెను. ఎప్పటియటుల నిల్లునీరవముగానుం
డెను. క్షణకాలము విచారించి, చూతమని ప్రయోగశా
లకువచ్చెను. గవాక్షములద్వార లోనవెలుఁగున్నటుల
గ్రహించినపుడు సతీశునిమనస్సునకు కొంచముశాంతి
కలిగెను. ప్రయోగశాలాద్వారము తెరువబడియున్నది.
బైసికల్ను గోడవెంటనిలువబెట్టి లోన ప్రవేశించు
చున్నపుడు నళినీకాంతుఁడు కుర్చీలోఁగూర్చుండియుం
డుటగాంచెను. అతనిమనస్సు కుదుటబడియెను. ''నళినీ''
అని సతీశుడఱచెను. నళినీకాంతుడనినో తనవిచారము
నందుమగ్నుఁడైయుండెను...వినలేదు; సతీశుడుదాపుచేరి
ను [illegible] కేమిగలదు? నళినీకాంతు డెదుటిగోడపై
దృష్టినిబారవైచి చూచుచుఁ గూర్చుండి యున్నాడు.

మజిలనతీశుఁడు 'హలో' స్నేహితుడా! నేఁడన్నముఁ దినవా?" యనియెను. కాని అచటవినువారెవరు? అపుడు సతీశుఁడు నళినీకాంతునిబట్టి బలముగా నూపఁదొడగెను. అపుడునళినీకాంతు డులికిపడియెను.

౨

పది సంవత్సరములకాలము. గడచినది. కలకత్తాలో నీదినమున నొకభోజనాలయమున నొక యద్భుతఘటనము జరిగెను. రిప్పన్ కాలేజిలో జదువుచున్న కొందఱు విద్యార్థులు విందుజేసుకొనిరి. ఒకగుండ్రని మేజానకుచుట్టు పదికుర్చీపీటలు వేయఁబడియెను. కాని విద్యార్థులు తొమ్మండ్రుగురుమాత్రమే యుండుటచే వారందఱుపస్థితులుకాఁగ నొకకుర్చీమాత్రము ఖాళీయుండెను. మేజాబల్లపై భిన్నభిన్నప్రకారముల మధురపదార్థములుంపఁబడియున్నవి. ఒకవిద్యార్థి మెడలో పూలదండలువేయఁబడియున్నవి. బహుశః ఆతడు పెండ్లికొడుకుగాఁబోలు. ఒకవిద్యార్థినిలచి యేమోభాషించుచుండెను. అపుడాగదిద్వారము తటాలున తెఱచుకొని మఱలమూసికొనియెను. గదియందున్న విద్యార్థినవకము ద్వారమువైపుచూచిరి. కాని యెవరునులేరు. ఒకవిద్యార్థిలేచి ద్వారము తెఱచి వెలికిజూచెను. వెలుపల బల్లపై గూర్చుండినిద్రించుచున్న భోజనశాలాధికారిసేవకుఁడుదప్ప మఱియెవరునులేరు. "గాలివలన తలుపు తనంతతానే తెఱచుకొనియెఁగాబోలు" నని వారందఱుసమాధానము చేసికొనిరి. ప్రీతిభోజనమారంభమయ్యెను. పెండ్లికుమారుఁడు కత్తితో రొట్టె(కేక్) నుకోసి ముక్కలుచేసెను. ఒక్కొక్కరిముంగిట మేజాపైయుంపఁబడిన కాచపాత్రలో నెత్తియెత్తి యుంచఁజొచ్చెను. చాలు—ఇంకేమి? విద్యార్థులందఱు రాక్షసులవలె కేక్, పేస్ట్రీ, సందేష్, రసగుల్లా, సంతర, అనఁటి మున్నగుభక్ష్యములపై, ఫలములపై విరుచుకొనిపడిరి. ఎవరుగాని కూర్చుండకుండుటచే ఖాళీగనున్నకుర్చీకి ప్రక్కకుర్చీలోఁగూర్చుండినవిద్యార్థి తనముంగటనున్న పళ్లెరమునందలి పదార్థములు నిశ్శేషముగాఁగా తక్కినవారి కొఱకై యుంపఁబడిన పదార్థములనుండి తనకుఁగావలిసినవానినిగొని తినవలయునని తలంచెను. కాని "ఆశపాతకుఁడు, కుక్షింభరుఁ" డని తక్కినవారెగతాళిచేయుదురను భీతిచే మిన్నకుండెను. అయినను వారందఱు మాటలసందడిలో పరధ్యానముతో నుండి మేజావలక్ష్యమందుంచని సమయమున కావలసిన సామాగ్రినికొని తనముందుఁగలపళ్లెరమునం దుంచుకొనవలయునను నుద్దేశముతో విద్యార్థులమొగములనే చూచుచు వేచియుండెను. విద్యార్థులముంగట నుంపఁబడిన పళ్లెరములలోని పదార్థములు ఆహరింపఁబడుటచే తక్కువయ్యెను. అపుడువారందఱు మనోరంజనమునకుఁగడంగిరి. మొదట పెండ్లి కుమారునకభిముఖుఁడై యొకవిద్యార్థి యిట్లనెను:—

"అన్నా! ఈవిందునుగుఱించిన ధన్యవాదము మా వదినెగారి కందఁ జేయవలయును సుమా!"

"బాగుగ్గానున్నది! ఏమయ్యా! వదినెగారికి ధన్యవాదమేల ముట్టఁజేయవలయు?" నని రెండవ యాతఁడనియెను.

"ఏలకూడదు? ఆమెగారు అన్నగారియింటఁ బదార్పణము చేయకున్నచో ఈనాడు మీరీహోటల్ కిబిజ్ (పూటకూళ్లవంటయింటి) లోని భాండములనైన నాకుచుంటిరా?" అని మొదటివాఁడనియెను.

"నిశ్చయము, నిశ్చయ" మని అందఱునవ్వసాగిరి.

"మిత్రులారా! మనధన్యవాదము చక్కఁగ పాత్రవరకు చేరఁబోవునని మనయనుమానము" నని యొకఁడు బలికెను.

"అయితే—శ్రీమతిగారిసన్నిధికి చక్కఁగ నొకడిప్యుటేషన్ యేలబంపఁగూడదు?" అనిప్రథముఁడనియెను.

"అయినను డిప్యుటేషన్ బంపువారిలో ప్రథముఁడు శ్రీమతిగారి శ్రీమాన్ గారు కారా?" అని ఇంతవరకు మాటాడకుండనున్న యొకఁడుబలికెను.

"ఏలకాఁగూడదు?"

"అయ్యయో, శ్రీమాన్ గారు శ్రీమతిగారికి మరణపర్యంతము ధన్యవాదము లిచ్చుచుందురు—మనకనిన మఱియొక అవసరము ప్రాప్తముకాదుగాని."

"ఏమయ్యా! మనకుమాత్రిమేల మఱియొకయవసరము ప్రాప్తముకాదు? సంతానప్రాప్తి కాఁగనే చేయఁగల విందునకు మనమేకదా నిమంత్రింపఁబడి యెదము; అపుడు మనమేకదా ధన్యవాదములిచ్చువారము"

మాటలసందడిలో తక్కినవారందఱు పరధ్యానమునం దున్నపుడు కుక్షినించుకొనవలయునను సుద్దేశముతో విద్యార్థులవంక నేకాగ్రదృష్టితోఁజూచుచున్న విద్యార్థి కిపుడు మంచిసమయముచిక్కినది. ఆతఁడు వారినటులనే చూచుచు మెల్లనచేయిఁజాపి ఎవరుగాని కూర్చుండకుండుటచే మిగిలయున్న కుర్చీకిముందు ఫలములతో, భక్ష్యములతో నింపఁబడియుంపఁబడియున్న పాత్రను మెల్లగ తన ముందునకులాగికొనియెను. చూచునప్పటి కాతనిగుండెలో రాయిపడియెను. అంతకుపూర్వమా పాత్రి పదార్థపూర్ణమై యుండెను; ఇపుడు దాదాపు శూన్యతుల్యముగానున్నది. ఆతనికాశ్చర్యముగలిగెను. కేవలమొక "రసగుల్ల" యును భక్ష్యముమాత్రము మిగిలియుండెను. ఆఁ—ఆఁ—ఇదియేమి? ఆరసగుల్లయును పాత్రనుండిపైకిలేచి శూన్యపీఠమువైపు పోఁజొచ్చెను. ఆవిద్యార్థి తనకది స్వప్నసమయమని భావించెను. తోడనే కనులుమూతపడియెను. ఆపాదమస్తకము గగుర్పాటుజెంది కన్నులనుకప్పెను. చూచునప్పటి కారసగుల్ల శూన్యపీఠమునకు దాదాపురెండడుగుల యెత్తున గాలిలోనిలచియున్నది. ఆశ్చర్యము! ఆవిద్యార్థిచకితుఁడై కాతరస్వరముతో— "Friends, Look here a wonder" (మిత్రులారా! ఈయాశ్చర్యమునుజూడుఁడు) అనియెను. అందఱునిర్నిద్రముగా నావిద్యార్థి వ్రేలు బెట్టిచూపినదిక్కు జూడఁదొడఁగిరి. ఏమున్నది! రసగుల్ల నిశ్రేయముగా వాయువులోనిలిచియున్నది! పిమ్మట నొక నిముసమునకది కానిపింపలేదు. ఈదృశ్యమునుచూచి అందఱునులేచినిలిచిరి. ఇంతలో అనఁటిపండ్లనుండిమొక్కపండు పాత్రనుండి శూన్యపీఠముదిక్కు లేచిపోఁదొడఁగెను. కొంతదూరమేఁగినిలిచి, స్వయముగా పైపొట్టును విడుకొనఁజొచ్చెను. పూర్తిగపండుబహిర్గతముకాఁగ, కొన్ని తునగి మాయమగుచు వచ్చెను.

"భూతము" అనిఆకస్మికముగా అప్రియత్నముగా నొకనినోటవెడలెను. తక్కినవారందఱీయద్భుత ఘటనము చూచి యోష్టస్పందనమొనరింపఁజాలకుండిరి—ఒకరినొకరుచూచుచుండిరి. అంతకుపూర్వ మందఱిముఖములయందు ప్రస్ఫుటమగుచుండిన ప్రసన్నముద్రమారిపోయినది—భయప్రకటనమగుచున్నది. అపుడు ఆగదిద్వారముకడనుండియొకధ్వని—గంభీరమగుధ్వని—యిటులవినవచ్చెను:—

"Dear boys, do'nt be afraid. I join with you in thanking the host. I wish him, his wife and his children that are to come, a long and prosperous life." (ప్రియబాలులారా! భయమొందకుఁడు. నేను పెండ్లికుమారునకు ధన్యవాదమిచ్చుటకు మీతోసమ్మిళితుండనైతిని. మఱియు నేను ఆతనికొఱకు ఆతనిస్త్రీకొఱకు, కలుగనున్న ఆతనిసంతానముకొఱకు ప్రసన్నతాపూర్వకదీర్ఘాయువును వాంఛించుచున్నాను.

అందఱును కంపించిపోయిరి. కాని, ఒకవిద్యార్థి మాత్రిము వెడలిపోయిన ధైర్యమునందొకలవము జిక్కఁబట్టుకొని "But, who are you? (కాని, మీరెవరవు? అనియడిగెను. ఈమాటఁబలుకుచునే ఆతఁడు పేజూపైయున్నయొక గాజుపాత్రి నాధ్వనివిన వచ్చినదిక్కు బలముగా విసరెను. ఆగ్లాసు ద్వారమునకు దగిలి ముక్కలగునని యందఱునుతలంచుచుండిరి; కాని, అటులజరుగలేదు. ఆగ్లాసు ద్వారమునకు కొంతదూరముననే ఆగిపోయెను. భూమికి దాదాపు నాలుగడుగులయెత్తున గాలిలోనాడఁ దొడఁజొచ్చెను. వెంటనే యొకకఠోరహాస ధ్వనివినవచ్చెను. అందఱుడలిపోయిరి. పిమ్మట నాగ్లాసు మెల్లన గాలి

నవ్వుచు మేజాపైగూర్చుండెను. అందఱును మేజాబల్లచుట్టును జరగిపోయిరి. దూరముననిలిచి కనులనుమిమి, మహిమ యీయద్భుతమును చూడఁదొడగిరి. కొంచెము సేపు తరువాత ద్వారముకడనుండి "Goodbye friends" (మిత్రులారా! శాంతివందనము) అని వినవచ్చెను. తోడనే ద్వారము తెఱచుకొనియెను—మఱలమూసికొనియెను.

తలుపుమూసుకొనినపిమ్మట వైదుత్క్షణములదాఁక నెవ్వరికిని నోటనుమాట పెకలలేదు. గ్లాసునువిసరిన విద్యార్థియే యితరులనుజూచుచుబలికెను:— "మనమిత్రుని భాగ్యము ప్రబలమైనటుల ప్రతీతమగుచున్నది. ఇదిఅవశ్యమేదియో దేవతయే—ఈతని నాశీర్వదింప వచ్చిన దేవతయే."

అంత మఱియొక విద్యార్థియునుసాహసించి, పెదవులనుండి దొరలుచున్న మాటలతో నిట్లనియెను:— "సత్యము. అవశ్య మది దేవతయే. కాని, మిత్రులారా! కలియుగమహిమ అపారము. భారతవర్షావనతితోఁబాటు దేవలోకముగూడ మ్లేచ్ఛాంగ్లభాషావాదినుల రాజ్యమై పోయినటుల ప్రతీతమగుచున్నది" అని పెండ్లికొడుకువైపు జూచి, "కాని, మిత్రమా! నీవేల యింతవిలాసములోనుంటివి? దేవభాషయందు గాకపోయినమానెగాక, ఆంగ్ల భాషయందైనను—అథవా మ్లేచ్ఛభాషయందైనను అదికాదైతే ఆశీర్వాదమేకదా. ఆవ్యక్తియేదోకాని నీస్త్రీకిపూర్వపరిచితమైనదిగా ప్రతీతమగుచున్నది.

ఈవాక్యమువిని యుపస్థితగణమంతయు మఱల నవ్వసాగిరి. అయినను పదినిముసములక్రిందటినగవు ఇది కాదు; ఇది వడకుచున్న దంతముల గింజులాట. రెండవనాటి యుదయమువరకే బి. ఏ. విద్యార్థియగు శ్యామసుందర హైమువని వివాహసంబంధమగు విందులో దేవలోకము నుండి యొకవ్యక్తి వచ్చి ఆతనిని ఆతని స్త్రీని, కాబోవు ఆశీసంతానమును దీవించిపోయెననువార్త కలకత్తానగర మంతయువ్యాపించెను. సాయంకాలము శ్యామసుందరుడు పాఠశాలయందు పాఠముసమాప్తి చేసి బయటకువచ్చు నప్పటికి ద్వారముకడ నలుగురైదుగురు వార్తాపత్రికా విలేఖరులు వేచియుండి, శ్యామసుందరుఁడు కాన్పించి నంతనే చుట్టుకొనిరి. ఇచ్ఛలేకపోయినను, పాపము శ్యామసుందరునకు గతదివసమున జరిగినవిచిత్రచర్య వినుపింపక తప్పదయ్యెను. ఈమహోదయ వృత్తాంతమును విని విలేఖరులు శిరఃకంపనమునొనర్చుచు వెడలిపోయిరి. వారిశిరఃకంపనమునందలిభావము మఱునాటి "వసుమతీ పత్రిక" వలన స్పష్టమయ్యెను. "భంగుదాగినమత్తులో దేవతాదర్శనము" అనుశీర్షిక క్రింద నీవృత్తాంతమంతయు విమర్శింపబడియుండెను.

రెండవదినమే మరియొకఘటనముజరిగెనని పత్రికలలో ప్రకటింపఁబడియెను. కలకత్తాసమీపమునందుగల 'ధకూరియా' గ్రామమున నొకమిఠాయియంగడి దోచుకొనఁబడియెను. అంగడివాఁడంగడిలోఁగూర్చుండి కొనరాఁగలవారికై ప్రతీక్షణమొనరించుచుండెను. ఇంతలో "రసగుల్ల" భక్ష్యములుంపఁబడిన పళ్లెరమునందు కదలికగలిగెను. రసగుల్లలు స్వయముగా నెగిరిపోయి మాయమగుచుండెను. అంగడివానికి స్మృతిభ్రమణమయ్యెను. అతఁడొకకేకవైచి విస్మృతుఁడయ్యెను. స్మృతిగలిగినపిమ్మట చూచునప్పటికి సగపాలునకంటె మిక్కిలి రసగుల్లలు మాయమయ్యెను. ఆశ్చర్యమేమనఁగ—అప్రదేశమం దెవరును కాన్పింపరు. అంగడికికొంచెముదూరమున నొకపోలీసు సిపాయి నిలిచియుండెను. అంగడివాఁడాతనితో తనఅంగడియందలి మిఠాయిని దొంగలెత్తుకొనిపోయిరని తెలిపెను.

"ఇక్కడినుండి యెవరుగాని ఒకగంటకాలమునుండిపోలేదు. అయినను చెప్పుము—దొంగయెట్లుండెను?" అనిపోలీసు పలికెను.

అంగడివాని మొగము చిన్నబోయెను. తుదకుదొంగ యేతీరుబట్టలుధరించియుండెనో అతఁడెఱుఁగఁడు.

ఈసమాచారముకూడ "వసుమతీపత్రిక" యందు ప్రకటితమయ్యెను. దీనిశీర్షిక "ఆఁకలిఁగొనినదేవత" అని

రెండుదినములపిమ్మట “ భీవర్ అండుకంపెనీ ” మేనేజర్ రాత్రి పదిరెండుగంటలవేళ తనకంపనీలో “పియానో” వాయింపఁబడుచున్నటుల వినియెను. మేనేజర్ ఆయంగడికిపైయంతస్థుననే నివసించుచుండెను. పియానోశబ్దమునువిని యచ్చెరువందెను. ఇంతరాత్రివేళ ఎవరు వచ్చిరి వాద్యమును వాయించుచుండిరని యాతనియాశ్చర్యము. కంపనీకి వెలుపల తాళమువేయఁబడియుండెను. మేనేజరు తాళముదెఱచి లోనఁబ్రవేశించిచూచెను. ఒక పెద్ద “పియానో” పైన వెలుఁగుగానవచ్చుచున్నది. మధురస్వరమా‘పియానో’నుండిశ్రావ్యముగా వినవచ్చుచుండెను. మధుర ఝాంకారముమాత్రమే వినవచ్చుచుండెనుగాని వాదించువాఁడెవఁడో కానరాదు. కొన్నినిమిషములదాఁక మేనేజర్ నిర్విణ్ణుఁడైచూచుచుండెను.అపుడాతనివిచారణశక్తి మెల్లనపనిచేయఁజొచ్చెను.అపుడాతఁడది యొకజాలముగాఁదలఁచెను. జేబునందలిపిస్టల్ (చిన్నతుపాకి) దీసి చేతఁధరించి పియానోవైపు నడచెను. క్షణములో పియానోశబ్దము నిలిచిపోయెను—దీపముమఱిగిపోయెను. అపుడు మాత్రము మేనేజర్ చాలాభీతినందెను. ధైర్యము తెచ్చుకొనివేఱొకదిక్కు దీపమువెలిఁగించి యంగడిని పరిశీలింపఁదొడఁగెను. ఎవరిచిహ్నమైనను కానుపింపలేదు. పోలీసుస్టేషనుకు టెలిఫోను నూదెను. శీఘ్రకాలముననే యొక సార్జంట్, ఇరువురు భటులు అంగడిఁబ్రవేశించిరి. పోలీసులు తమయేర్పాటుకొలఁది అనుసంధాన మారంభించిరి. అంగడిలోచలువరాళ్లు పఱచియుండెను. చాలశ్రమనంది పరిశీలింపఁగా నారాళ్లపై ధూళిగలిగిన పాదముద్రచిహ్నములు కనిపెట్టఁబడియెను. ఆచిహ్నములొకగవాక్షము మొదలుకొని పియానోవరకును, పియానోకడనుండి యంగడిద్వారమువరకును కాన్పించెను. ఆచిహ్నముల ఛాయాపటము గైకొనఁబడియెను.అంతటితోటిఅనుసంధానముపూర్తియయ్యెను. ఉదయమా మేనేజర్ తనమిత్రులతో, గ్రాహకులతో రాత్రిజరిగినవిషయమును ప్రసంగించెను.వారిలోఁగొందఱిట్లనిరి:—

“Dear Manager, you must have drunk somewhat heavily last night” (స్నేహితుఁడా, మేనేజర్! రాత్రిమిరేదో కొంచెమధికముగాఁద్రావి యుందురు.)

కొన్నిదినములవఱకు వార్తాపత్త్రికలకు మంచివార్తములభించెను. ఈవార్త లనుదినమువినరాఁజొచ్చెను. వినినకొలఁది జనులమెదడుడికిపోఁదొడఁగెను. గూఢచారి (సి. ఐ. డి.)విభాగము ఈరహస్యమును వెలిబుచ్చుటకు విశేషప్రయత్నమొనరించుచున్నది. గార్నమెంటువారొక ప్రకటనముఁబ్రకటించిరి “ఎవరికిఁగాని,ఎపుడేగాని ఇట్టిఘటనజరిగినజాడదెలసినచో వెంటనే పోలీసువారికి తెలుపవలయును” అని ఆప్రకటనభావము.ఇట్టియుక్తులన్నియుజరుపఁబడినప్పటికిని జనులయందుభయము దినప్రతిదినము వృద్ధిగాఁజొచ్చెను. విచిత్రఘటనలును వృద్ధిగాఁజొచ్చెను.





# మనోనురాగము

వఝుల వేంకటేశ్వరకవి

అమృతకరుఁడబ్ధి గాంభీర్య మరయుభంగి
నస్మదీయాంతరంగ భావాతిశయము
నెఱుఁగఁ బరిశ్నించురీతిగా నెసఁగుచుండుఁ
దావక విషణ్ణలోల నేత్రద్వయంబు.

ఓ చెలీ,యించుకేనియు దాచకుండ
నీదు కనుఁదోయి ప్రేమాలనే నిలిపి బయలు
చేసితిని మామకాద్యంత జీవితంబు;
అందుచే నన్నెఱుఁగఁజాల వైతివేమొ!

అదియె రుచులీను మాణిక్య మయ్యెనేని
ఖండఖండంబు లొనరించి మండితమగు
కోవగా మున్నె సూత్రానఁ గుచ్చియుందు,
లలితమగు నీగళంబు నలంకరింప.

అదియె కోమలమై యందమై తనర్చు
నమలమధురపరిసవరాజ మయ్యెనేని
మృదులతికనుండి వేవేగఁ ద్రెంచియుందు
లలితమగు నీ[illegible] నలంకరింప.

కాని యది మానసము సుమ్మ; దానియడుగు
దానితీరంబు లెచ్చోట(గానుపించు?
రమణి! యారాజ్యమున కీవు రాజ్ఞివయ్యు
నెఱుగవు తదీయనై శాల్య మించుకేని.

అదియె క్షణమాత్రమగు సౌఖ్య మయ్యెనేని
విమలమందస్మితంబుగా విరిసిపోవు
దానివీక్షింపనేర్తువు; దాని(దెలియ
నేర్చెదవుసుమ్మ నీవొక్కనిముసమందె.

అదియె యొకవేదనామాత్రమయ్యెనేని(
దరళబాష్పకణాళిగా(గరగిమాట
లాడకయె యంతరంగరహస్యభావ
మెల్ల(బ్రతిబింబితమొనర్చి యెరుకపరచు.

కాని యదిప్రేమభావంబు; దానిమోద
ఖేదముల కంతమనునది లేదు; నీకు
జీవితము రీతి నదియు నీచెంతనుండు;
నెఱుగలేవు పూర్తిగ దాని నెన్నడేని.









ఈ నాణెములచరిత్ర ప్రథమమున (క్రీ. శ. ౧౭౯౪) ఎడ్వర్డ్ మూర్ అను చరిత్రకారుడు క్లుప్తముగా గ్రంథరూపమున రచించెను. దీనికి ౩౦సంవత్సరములపిదప మార్స్‌డన్ చే రచింపబడిన "ప్రాచ్యదేశ నాణెము"లను గ్రంథపు రెండవ భాగమున వీని విషయము గురించి విపులముగా చర్చింపబడినది. కాని యీ రెండు గ్రంథములందలి విషయములు నాణ్యపరిశోధకులకు ప్రాథమికములు. క్యాప్టెన్ టఫ్నల్, థర్‌స్టన్ కొంతవరకు యీ నాణెముల వివరములు, ఆనాటి టంకశాలల చరిత్రములు విశదీకరించగలిగిరి. వీనియాధారములపై బట్లర్ రచించిన 'టీపుసుల్తాను నాణెములచరిత్ర' యను గ్రంథమును నాణెసంఘమువారు క్రీ. శ. ౧౯౧౪ వ సం౹౹ న ప్రకటించిరి. దీనిలో విషయములంత విపులముగా చర్చింపబడకున్నను కొన్ని నూతన చరిత్రాంశములు మాత్రము బహిర్గతమైనవి. దీనికి తర్వాతనే డాక్టరు హెండర్సన్ 'హైదరలీ టీపుసుల్తాన్ నాణెములపట్టిక' నొకటి ప్రకటించెను. దీనియందలి యవతారిక ముఖ్యముగా పఠింపదగియున్నది. ఎన్నియో చరిత్రాంశములు సమకూర్చబడియున్నవి.

ఈ నాణెముల చరిత్రను నాలుగుభాగములుగా విభజింపవచ్చును.

౧. టంకశాలలచరిత్ర ౨. నాణెములు: సంవత్సరములు 3 వివిధనాణెముల వివరములు ౪ నాణెములముద్రణములు

౧ టంకశాలలచరిత్ర: ఈ సుల్తాన్ నాణెముల సిద్ధబరచుటకు టంకశాలలు క్రింది పట్టణములలో స్థాపించినటుల చరిత్ర దెలుపుచున్నది:—

౧ బెంగుళూరు. ఈపట్టణనిర్మాణ గౌరవము ద్వారసముద్రపురాజైన రాజావీరబలునికి గలదు. క్రీ. శ. ౧౭౬౦ సం౹౹న హైదరలీ దీనిని తనబాహాబలముచే జయించెను. టీపుసుల్తాను నాణెములసిద్ధబరచుట కొకటంకశాల ప్రథమమున యిచ్చట స్థాపించెను. నేటికి చిహ్నములుగలవు ఈతని మరణానంతర మీపట్టణము ఆంగ్లేయుల హస్తగతమైనది. క్రీ. శ. ౧౭౯౯ సం౹౹ న ఆంగ్లప్రభుత్వమువారు మైసూరు ప్రాచీనరాజవంశీయులగు 'ఒడయారుల'కిచ్చివేసిరి. వర్తమానకాలమునందిది మైసూరు రాజ్యమున ఆంగ్లసేనానగరముగాగలదు.

౨ పట్టణము: దీనిపూర్తినామము శ్రీరంగపట్టణము. ఆంగ్లమునందిది శ్రీరంగపటామనబడుచున్నది.

ఇదికావేరియొద్దనుపైగలదు. ఆంగ్లచరిత్రయందు దీనికి కొంతప్రాముఖ్యతగలదు క్రీ.శ. ౧౭౯౨ సం॥న లార్డ్ కార్న్‌వాలీస్ టీపుసుల్తానుతో యిచ్చటనే సంధిచేసుకొ నెను. ఆంగ్లులతోపోరాడుచు యిచ్చటనే టీపుసుల్తాను క్రీ.శ. ౧౭౯౯ సం॥ న మరణించెను!

౩ ఖాలిఖాభాద: ఇది శ్రీరంగపట్టణమునకు సమీపమునసుండును. ఆకాలమునందు 'చంద్రగుపవ' మునేయీపేరుతో వ్యవహరించుచుండిరి. కిర్మాని చరిత్రకారుడు డిండిగల్‌కీనామముండెననియు, చంద్రగుప నమునకు లేకుండెనని వ్రాసియున్నాడు. డాక్టర్‌హిం డర్సన్ తనపరిశోధనలవలన మధురజిల్లాలోని డిండిగల్‌కీ నామముండెనని నిశ్చయించెను.

౪ ఖుష్నద్నవాద్: ప్రస్తుతమీనగరము ధార్వాడ్‌యనుపేరుతో వ్యవహరింపబడుచున్నదనిమోర్ మార్సడన్ అభిప్రాయములుగలవు.

ధార్వాడ్: క్రీ.శ. ౧౪౦౩ సం॥న రాజాధార్ గారు యీనగరమును నిర్మించిరి. క్రీ.శ. ౧౭౭౮ న సం॥న మహారాష్ట్రులు హైదరలీనుండి జయించిరి. క్రీ.శ. ౧౭౯౧ సం॥న యిది ఆంగ్లేయులహస్తగతమైనది.

౬ సలామాబాద: ఇది సాత్యామంగళము నకు ప్రాచీననామము. ఇది కుంభాతూరుజిల్లాలో భారతీ నదియొద్దనుపైగలదు. క్రీ.శ. ౧౭౯౦ సం॥న ఆంగ్లేయు లకు, టీపుసుల్తానునకు యిచ్చట గొప్పయుద్ధముజరిగినది. క్యాప్టన్‌టఫనల్ తనగ్రంథమునందు దీనిని యిస్లామా బాదని వ్యవహరించియున్నాడు.

౭ జఫరాబాద: ఇది కడపజిల్లాలోని గుఱ్ఱపు కొండకు ప్రాచీననామము. హైదరలీ యీదుర్గమును క్రీ.శ. ౧౭౬౮ సం॥న జయించెను. టీపుసుల్తాను మర ణానంతర మీనగరము నైజాంపరిభుత్వమువారికా ధీనమైనది. కాని క్రీ.శ. ౧౮౦౦ సం॥నందు సూక్ష్మసంధి షరతులవలన కడపజిల్లా నైజాంప్రభుత్వమువారు ఆం గ్లులకప్పగించినందున ప్రస్తుతమీజిల్లాఆంగ్లప్రభుత్వము నందుగలదు. ఈనామ మీనగరమునకేగాక మర్కారా నగరమునకుగూడా వ్యవహరింపబడుచుండినట్లు తె యుచున్నది. ఈ మర్కారానగరము కూర్గరాజ్యము నందొక ముఖ్యపట్టణము. కిర్మానియభిప్రాయానుసార ము యీనగరము టీపుసుల్తాన్ క్రీ.శ. ౧౭౯౦ సం॥న కూర్గుపరిభుత్వమువారి కప్పగించివేసెను. క్రీ.శ. ౧౭౯౦ సం॥ నకు పూర్వము కాబడిననాణెములపైగల'జఫరాబా ద'నునామ మీనగరమునకు వర్తించుచున్నది. ఆపిదప యీపేరుతో గుఱ్ఱంకొండయందు నాణెములు లేదు రగుచుండెను. ఉచ్చారణభేదమువలన ఇంపీరియల్ గజెటి యర్ గ్రంథమున యిదిజాఫరాబాదని వ్యవహరింప బడియున్నది.

౮ ఫరఖ్ యాబుహిసార్: కిర్మాని పైపే నొకటంకశాల యుండెనని తెలుపుచున్నాడు. కాని నా ణెములవలన 'యాబు'కు 'బాబు' వాడబడినట్లు తె యుచున్నది. చీతలదుర్గమున కీనామముండియుండవచ్చు ను. ఆకాలమునందిది రాజధాని నగరమైయుండెను.

౯ పఖ్ఖి: బిపోరండికి దక్షిణ దిశయందు క్యాలికటునకు ౭ మైళ్లదూరమున యీనగరముగలదు క్రీ.శ. ౧౭౮౮సం॥ న టీపుసుల్తాను దీనిని నిర్మించెను. దీనికే'నూతనక్యాలికటు' యని మఱొకనామముగలదు.

౧౦ ఫైజుహిసార్: గుత్తీనగరమునకిది ప్రా ర్వనామము. ఇదిఅనంతపురపు జిల్లాలోగలదు. క్రీ.శ. ౧౭౭౫ సం॥న హైదరలీ దీనినిజయించెను.

౧౧ క్యాలికటు: ఇది మలబారునందు ప్రసి ద్ధి చెందిన పట్టణము. ప్రాచీనకాలమునందిది సా మరురాజవంశీయులకు రాజధానినగరము. క్రీ.

౧౭౬౩ సం॥ న హైదరలీదీనినిజయించెను. కిర్మానిదీనిని ఇస్లామాబాదని వ్యవహరించియున్నాడు.

౧౨ నజర్‌బాద: ఇది మైసూరుపట్టణమునకు ప్రాచీననామము.

౧౩ నగరము: షిమోగాకుపశ్చిమమున ౧౫ మైళ్లదూరమున యీనగరముగలదు- క్రీ. ౭వశతాబ్దమున కేళదిరాజులు దీనినిరాజధానిగా నేలియుండిరి. ఆకాలమునందిది బెదరూరు లేక బెదనూరని వ్యవహరింపబడుచుండెను. క్రీ.శ.౧౭౬౩సం॥ న హైదరలి దీనినిజయించి దీనికి హైదరనగరమని నామమిడెను

౧౪ బేనజీరు: దీనిః సయమై వివరముగాదెలియదు. ఇదిహొళిహొన్నూరుకు ప్రాచీననామమైయుండవచ్చును. ఇదితుంగ భద్ర నదుల సంగమస్థలమునందు, గలదు. ఇచ్చటినుండియే యిది తుంగభద్రి యనుపేరుతో ప్రవహించును.

బెంగుళూరు మదాసు వస్తుప్రదర్శనశాలయందు గల టీపుసుల్తాను నాణెముల వివరములు:—

| ప్రదర్శనశాల | బంగారము | వెండి | రాగి | మొత్తము |
|---|---|---|---|---|
| మదాసు | ౨౧ | ౧౩ | ౭౧ | ౧౦౫ |
| బెంగుళూరు | ౪౨ | ౨౫ | ౧౧౭ | ౧౮౪ |
| మొత్తము | ౬౩ | ౩౮ | ౧౮౮ | ౨౮౯ |

ప్రస్తుతములభించిన నాణెములను టంకశాలలప్రకారము విభజింపవచ్చును.

| టంకశాలలు | బంగారము | వెండి | రాగి | మొత్తము |
|---|---|---|---|---|
| పట్టణము: శ్రీరంగపట్టణము | ౨౬ | ౩౭ | ౯౧ | ౧౫౪ |
| నగరము: బెదనూరు | ౧౮ | ౦ | ౨౫ | ౪౩ |
| బెంగుళూరు | ౦ | ౦ | ౧౭ | ౧౭ |
| ఫర్ఖి | ౫ | ౦ | ౧౦ | ౧౫ |
| ఫైజ్ హిసార్ = గుత్తి | ౦ | ౦ | ౧౫ | ౧౫ |
| ఫర్ఖ్యాబ్ హిసాద్: చీతలదుర్గము | ౦ | ౦ | ౧౩ | ౧౩ |
| ఖుర్షీద్ సవాడ్: ధార్వాడ | ౩ | ౧ | ౮ | ౧౨ |
| ఖాలిఖాబాద = డిండిగల్ | ౧ | ౦ | ౨ | ౩ |
| నజర్ బాద్ = మైసూరు | ౬ | ౦ | ౩ | ౯ |
| సలామాబాద = సాత్యమంగళం | ౦ | ౦ | ౩ | ౩ |
| ధార్వాడ | ౨ | ౦ | ౦ | ౨ |
| జఫరాబాద = గుట్టుంకొండ | ౦ | ౦ | ౧ | ౧ |
| బేనజీరు = హొళీహొన్నూరు | ౧ | ౦ | ౦ | ౧ |
| బల్దనాం టంకశాల | ౧ | ౦ | ౦ | ౧ |
| మొత్తము | ౬౩ | ౩౮ | ౧౮౮ | ౨౮౯ |

# వర్షకాలము

ఆవంత్స వేంకట రంగారావు

జలద సార్థవాహము నభఃస్థలమునందు
సంచరించగ ఛాయలు సాగెభువిని
ధరణితోఁ జెపచ్చని సముద్రములతోడ
వర్షకాలమ్ము కన్నుల పండువయ్యె;

శ్రావణమాస దివ్యదివసమ్ముల కాంతలు పుష్పరాజితో
తావులుచిమ్ము వస్త్రములు దాల్చి పథమ్ముల గోచరించినన్
భావకవుల్ కవిత్వములు వ్రాయఁగ మెండుగ చిత్రకారులుఁ
టావులపైని చక్కని పటమ్ములువ్రాయ సుకాలమియ్యదే;

మేఘములు ఘోరమని యేడ్చె మిక్కటముగ
స్నానమాడి యశ్రుల వృక్షసంచయములు
దాతమై శ్యామలంబౌచు ప్రీతిఁగొల్పె,
గర్భవతులైరి నిమ్నగా కాంతలంత;

ప్రకృతి నూతన సౌందర్యపటిమఁగాంచె
జలములందెల్లవేళ సంజలు వెలింగె
కర్షకులు చేలబిడ్డల ఘనతతోడ
పెంచుకొనుచుండిరి నేరమ్ము పంచిపెట్టి;

మేచకవారివాహముల మీదను వంతెన కట్టినట్లుగాఁ
దోచెను చారువర్ణతతితోఁ డవిభాసిలి యింద్రచాపమా
ప్రాచిని; మేఘరాజి కుధరమ్ములకుందలపాగఁజుట్టె; వే
పూచెను నాగలింగ సుమపూరము చెట్లకు నాగరంబుగా.



హైదరాబాదాంధ్రస్వచ్ఛంద సేవాదళ నాయకులు



శ్రీ కె. కృష్ణస్వామి ముదిరాజ గారు

హైదరాబాద ప్రజాపక్ష విద్యామహాసభ
కార్యదర్శి



శ్రీ దేశభక్త వామన రామచంద్రనాయక్
జాగీర్దారుగారు

# హిందూమహమ్మదీయసమస్య



“ శ్రేయోఽభిలాషి ”

ఒక పాశ్చాత్య మనుష్యవర్ణన ప్రజ్ఞుడు ‘జాతుల యొక్క జాడ్యము’ అనే విషయానికి చాలాప్రాముఖ్యత ఇచ్చాడు. ‘జాతులయొక్క జాడ్యము’ అంటే ఒకానొక సమయంలో ఎంతటి శక్తివంతమైన, వీర్యవంతమైన జాతులైనను ‘జాడ్యము’నకు గురిఅగుతావి. అట్టితరి సక్రమమైన చికిత్సావిధానము అవలంబించకపోతే పునరారోగ్యప్రాప్తికి దూరమయి అంతమొందటం సంభవిస్తుంది. ఇందుకనే యూరపులో అనేకశతాబ్దములనుంచి టర్కీదేశానికి దీర్ఘవ్యాధి పీడితుడగు ‘అనారోగ్యపు మనుష్యుడు’ అనేబిరుదు, దానికి తగినగౌరవం దొరికింది.

అప్పుడు హిందువులుకూడా ఈ ‘జాడ్యానికి’ గురైనారు. అయితే కొంత చికిత్సవలన తెప్పరిల్లారు, అందుకనే పూర్తిగాకుంగిపోలేదు. మహమ్మదీయమతం పెనుగాలివలె ప్రాక్పశ్చిమదేశాలమీదుగా ప్రసరిస్తూ అనేకజాతులపైన పోకింది. అనేక శతాబ్దాలవరకు తనస్వాధీనమందుంచుకుంది. ఇతరజాతులతోపాటు ప్రాగ్దేశాన హిందువులను, పశ్చిమాన గ్రీసు, స్పేను, దేశాలక్రైస్తవులను లోబరుచుకుంది. కాని గ్రీసు, స్పేను దేశమందే, ఆరోగ్యాన్ని పొందగానే బానిసత్వాన్ని తొలగించుకోటమేకాదు; దానికి కారకులైన అర్ధసుధాకరానుచరులు (మహమ్మదీయులు) తమదేశంలో ఉండటానికి వీలులేకుండా తగిన చర్యలను అవలంభించినయి.

హిందూదేశంలోమాత్రం కొన్ని ప్రాంతాలు మహమ్మదీయుల ఏలుబడినుండి విముక్తినొందిగూడా గ్రీసు స్పేను దేశపుక్రైస్తవులు తమను బానిసత్వములో ఉంచిన మహమ్మదీయుల విషయంలో అనుసరించిన పద్ధతులను హిందువులు ఆచరించలేదు! హిందూదేశంలో మహమ్మదీయసామ్రాజ్య అధఃపతనానికి మహారాష్ట్రులు, సిక్కులు కారకులై పుణ్యంగట్టుకున్నారు. కాని గ్రీసు, స్పేను, దేశాలు సత్కరించిన మార్గాన సత్కరించలేదు, ఈమహమ్మదీయులను. హిందువులు ఒక్కమసీదునైన అపవిత్రపరచలేదు. అంతేకాదు. హిందూప్రభువులలో కొందరి పరమతసహనం ఎంతగొప్పదంటే, తమచేపాలింపబడే మహమ్మదీయప్రజలకోసం మసీదులు గట్టించారు. పంజాబ్ నోట్సుఅండ్ క్వైర్రీస్’ (Punjab notes and querries) అనే గ్రంథమండలి ౧ వ సంపుటం, ౬౧౫ పేజీలోఆర్.డబ్ల్యు. ట్రాఫర్డ్ (R. W. Trafford) గారిట్లావ్రాశారు: ‘మహారాజా రంజీత్ సింగుగారి పట్టపు

రాణి తననివాసస్థానమైన షేఖుపురం (గుజురన్ వాలా డిస్ట్రిక్ట్) లో ఒక మసీదు కట్టించింది. ఈలాంటి విశాల భావాలతోనే భోటాలా శివలాయందు ఒకసిక్కు సరదారు మసీదు కట్టించాడు"

హిందువులకు పరమతసహనమే కాదు, గొప్ప క్షమాశక్తికూడా ఉంది. నష్టాల్ని, అవమానాల్ని త్వరగా మర్చిపోతారు. వాటికి కారకులైనవారిని సులభంగామన్నిస్తారు. ఈవిద్య వారికి బాల్యంనుండే నేర్పబడుతుంది. ''హితోపదేశము'' అనేగ్రంథములో మిక్కిలి విలువగల నీతి వాక్యం ఉంది. ''మనఆదేశాన్ని అనుభవంలోకి తెచ్చుకునే ప్రయత్నానికి అడ్డంవచ్చేశత్రువును, క్షమించాలె, ఆదర్శం అనుభవంలోకిరాగానే.''

అహింసాసిద్ధాంతము హైందవ ఆధ్యాత్మికాదర్శం లో ఒకభాగం. అందుకనే, మహమ్మదీయులవిషయంలో గ్రీను, స్పేను దేశస్థులు అవలంబించినమార్గాన్ని అనుసరించలేకపోయినారు, సిక్కులు, మహారాష్ట్రులు.

ధన్యులగు, నానక్, కబీరు, చైతన్యాదిసంఘసంస్కర్తలు భారతదేశంలోని హిందూమహమ్మదీయులమధ్య స్నేహంతోగూడినసంబంధాన్ని స్థాపించటానికి ప్రయత్నించారు. కాని వారు తమప్రయత్నాలల్లో అపజయముపొందారని ఒప్పుకోకతప్పదు.

హిందూమతంలోఉన్న గొప్పలోపము సాంఘికము. అదేవర్ణభేదము. ఈవర్ణభేదాన్ని నశింపజేసేవరకు హిందూమహమ్మదీయులమధ్యగాని, హిందూమతములోని ఉచ్చనీచవర్ణాలల్లోగాని, ఏసంస్కర్తఅయినా అన్యోన్యసామరస్యభావాన్ని స్థాపిస్థాడనేది దూరం.

పరమతసహనంలోనూ, అన్యమతసిద్ధాంతాల్ని కూడాతనలో ఇముడ్చుకోటంలోనూ ఉంది, హిందూ మతానికి ఉండేబలం. ఈఇముడ్చుకోటమంటే ఏమిటో అనేకులకు సుగ్రాహ్యంకాదేమో? దాన్ని వ్యక్తీకరించటం ఆవశ్యకం. ''మతేము, నీతిశాస్త్రముయొక్క విజ్ఞానసర్వస్వం'' అనేగ్రంథము ౧-వ సంపుటం ౧౫౪-౧౫౫ పేజీల్లో ''అన్యమతసిద్ధాంతాల్ని తనలో ఇముడ్చుకోటం'' అనేన్యాసంలో ఇట్లావ్రాశారుజేమ్సు[illegible]గారు.

''భిన్నసంఘాల మతసంబంధమగు అభిప్రాయాలు, ఆచారాల కలయికవలన, ఒకసంఘము రెండవసంఘముయొక్క సిద్ధాంతాలను చాలావరకు అవలంబించుటగాని, లేక రెండుసంఘాలు స్వమతసమత్వానికి ప్రాముఖ్యతనిస్తూ బహుదేవతావిశ్వాసాన్ని తగ్గించి [illegible] మొందుటంగాని సంభవిస్తూఉంటుంది. మతప్రపంచంలో సాధారణంగా ఈలాంటిమార్పులు తత్వజ్ఞానసంబంధమైన నూతనసంయోగము చేతనూ, రాజకీయనూతనపరిస్థితులవల్లనూ, త్వరగావృద్ధిపొందింపబడి ఆచరణలోకివస్తూ ఉంటాయి. భిన్నదేవతలనిర్బంధఐక్యమే ఈమార్పులకు [illegible] ఈఐక్యం క్రిందివిధంగా వరించిన రెండుపద్ధతులలో ఏదో దానివనుసరించి జరుగుతూఉంటుంది. ఒకటి భిన్నమతాల రెండుదేవతలు సాదృశ్యముచేత ఏకరూపాన్ని పొందుట లేదా — రెండవది — అనేకదేవతలు నూతనసంయోగంలో సముదాయంగా ఏర్పడటం. ఏపక్షిత్వ[illegible] మతముకూడా ఒంటరిగా సంపూర్ణమైన యోగ్యతకలిగియుండదని, ఇతర మతాలల్లోనూ ఇవేలక్షణాలు లేక ఇంతకన్నమించిన ఆకర్షణ సార్థకత్వముగల లక్షణాలు ఉండటం సంభవమనీ ఇంకా ఇట్టినూతనలక్షణాలు ఏమతంలోనైనా మూలసూత్రాలకు నష్టంలేకుండా చేర్చవచ్చుననీ, మొదలైనముఖ్యవిషయాల్ని తెలుసుకోటమే ఈనూతనకథనానికి కారణాలు. స్థూలంగాచూస్తే ఈ నూతనకథనం, ఏకదైవత్వంకంటె భిన్నదైవత్వాన్నే అనగా దాదాపుఅద్వైతాన్నే ఎక్కువగాసూచిస్తున్నది. హిందువులు తమదేవతగణంలో గౌతమబుద్ధునకు స్థానంఇచ్చి, బౌద్ధమతాన్ని ఆక్రమించుకొన్నారు. ఇదేవిధంగా మహమ్మదీయమతాలవిషయంలోగూడా ఆక్రమించుకున్నారు. ఈబౌద్ధమతాన్ని ఆక్రమించుకున్న [illegible]ణంలో, పరమతసహనంలో ఉన్నశక్తి, అన్యమతసిద్ధాంతాల్ని తమలో ఇముడ్చుకోటంలో ఉన్నసామర్థ్యం వెల్లడిఅగుతూఉన్నది.''

సమానత్వం, మూఢాభిమానం, మతబహిష్కారం చేయకపోవటం విషయసుఖాల్ని తీవ్రంగానిరసించడం, మద్యపానని షేధం, మొదలైన సుగుణాలల్లోఇముడ్చుకుంది తురకబలం. అయితే విద్య, నాగరికత లేనిసమానత్వం, మూఢపరిపాలనఅవుతుంది. భారత దేశంలో ఉన్న తురకలస్థితి ఈరీతిఉండటం దురదృష్టమే. ఇతరసంఘాలల్లోకన్నా తురకల్లోఅల్లర్లూ, నేరాలు చేశేవారూ, పరిపాలనానికిలొంగనివారు విశేషంగాఉన్నారు. మహమ్మదీయమతంలో ఉన్నప్రభుత్వభావం, సమానత్వంచేత ఇలాంటి నేరస్థులకు అల్లరిమూకకు అమోఘమైనపలుకుబడి ఉంది. పాశ్చాత్య శాస్త్రప్రకారము గౌరవనీయుడుగా పరిగణింపబడువ్యక్తికిన్నీ, అల్లాకానివానికిన్నీ, మహమ్మదీయులయందు సాంఘికంగా ఒకేస్థానం నిర్దేశింపబడిఉండటంచేత, విద్యాగంధములేనిజనులకు, విద్య, నాగరికతవలన కలిగేవ్యక్తిత్వం, ప్రాముఖ్యత, ఘనత, పొందటానికి తగినప్రోత్సాహంలేదు.

మతసంబంధమైనమూర్ఖాభిమానంకూడా మహమ్మదీయమతానికి ప్రధానలక్షణమే. ప్రామాణికమైన మహమ్మదీయుడు కావలెనంటే మూర్ఖాభిమానం ఉండితీరవలె. లేకుంటే వాడునిజమైన మహమ్మదీయుడు కాజాలడు. వీరిలోసామాన్యజనులు, మనోవికారాలు, దురభిమానం మొదలైనభావాలచేత నడిపింపబడుతారుగాని నెమ్మదిలో కూడినవివేకం, దృఢమైన జ్ఞానంతో కాదు. మహమ్మదీయులలో బహుసంఖ్య ఇట్లాఉండటం వాండ్ల గ్రహచారమే.

మహమ్మదీయలోకంయొక్క బలం వాండ్లకున్న మూర్ఖాభిమానంలోఉన్న, తత్తుల్యమైన బలహీనతకూడా అందులోనేఇమిడిఉంది వాండ్లవిశ్వాసం మహమ్మదీయ ప్రాధాన్యత్వం వరకే. విశ్వమానవ సౌభ్రాతృత్వం వారికి అర్థంకాదు. దీనిఫలితంగానే వాండ్లల్లో రెండున్యాయ శాస్త్రాలున్నవి. ఒకటిమహమ్మదీయులకోసం రెండవదిమహమ్మదీయేతరులకోసం! సెమెటిక (Semetic) మతాల ల్లోఉన్నమూఢభిమానానికికారణం వాటిలో ఉన్నఏకదేవతారాధనమే అని జర్మనీదేశంలో గొప్పతత్త్వవేత్తఅయిన స్కోపెన్‌హ్యూర్ (Schopenheur) నిరూపిస్తూ ఇట్లావ్రాశాడు.

“నిజంవిచారిస్తే పరమతఅసహనం ఏకదేవతారాధనంలోనే కనపడుతుంది. ఏకఛత్రాధిపత్యంగా, తన మాటకుఅడ్డులేకుండా పరిపాలించటానికి అలవాటైన దేవుడు, స్వభావంగా అసూయాపరుడవుతాడు. కాబట్టే ఇతరదేవతలఅస్తిత్వాన్ని సహించలేడు. ఏకదేవతారాధనఉన్నమతాలే మతయుద్ధాలకూ, హింసలకూ తావాసగుతున్నవి. ఈమతాలే విగ్రహాలని పగులగొట్టేవి. దేవతాప్రతిమల్ని నాశనంచేసేవి. ఇవిఇందుకే ప్రసిద్ధాలు. ఈసర్వనాశనమంతా ఎందుకయ్యా అంటే ఓర్వలేక “నీవు విగ్రహాలని చెక్కవద్దు” అని అన్నాడుకనుక.

వీండ్లమతం బహుభార్యాత్వాన్ని అంగీకరించింది. వీడ్లసంఖ్యకూడా అందుకనే త్వరగా పెరుగుతుంది. “శాస్త్రానికిమతానికి. ఉన్నపోరాటం” అనే ప్రసిద్ధగ్రంథంలో డ్రేపరు (Draper) ఇస్లామువ్యాపకానికి ముఖ్యకారణం “స్త్రీలను చెరబట్టుటని” యే అనివ్రాశారు. (పేజీలు ౧౦౦-౧౦౧) “శత్రువులు తమదేశాల్ని ఆక్రమించినా, ధనసర్వస్వంకొల్లగొట్టినా, గొప్ప యుద్ధఅపరాధా లుసాధించినా, ఎప్పటికైనా జాతి కోలుకుంటుందిగాని, యుద్ధదౌర్జన్యాలలోకి మిక్కిలిభయంకరమైంది, అసహ్యమైంది స్త్రీలచెర. ఈకృత్యాన్నుంచి మాత్రం జాతిఎప్పటికీ కోలుకోలేదు. విజితదేశాలలో స్త్రీలనుచెరబట్టటం, బహుభార్యాత్వాన్ని అంగీకరించినసంస్థకావటంనుంచే మహమ్మదీయపరిపాలన శాశ్వతంగా స్థాపింపబడగలిగింది. ఇలాంటి సంయోగజనితసంతతి, తనఉత్పత్తిని తలుచుకోక, విజయులగు తమతండ్రులను తలుచుకొని, ఉబ్బితబ్బిబ్బవుతున్నారు. ఈతంత్రముయొక్క సార్థకత్వాన్నిగూర్చి, ఉత్తరఆఫ్రికా ఇచ్చే ప్రమాణాలకన్నా, శ్రేష్ఠమైనవి వేరే కు దొరకవు. ఈనూతనవిధానాన్ని ఘనీభూతపరచటంలో బహుభార్యాత్వంచూపించినశక్తి చాలాఆశ్చర్యంకలిగిస్తుం

ది. మహమ్మదీయులు జయించినతర్వాత ఆ ప్రాంతములోని జనులు ఒక్కతరంలోనే అరబ్బీని మాతృభాషగా చేసుకొని తురకలయినారు. అందువల్ల వాండ్లకు కప్పం కట్టటం తప్పిపోయింది.'' మహమ్మదీయుల్లో బహుభార్యాత్వము ఒక్క మంచిపనిమాత్రం చేసిందని టర్కీదేశానికివెళ్లినయాత్రికులు మెచ్చుకున్నారు. అదేదంటే లండను, ప్యారిసు మొదలైనపట్టణాలల్లోఉన్న వ్యభిచారపు బజారులు లేకపోవుటం! భారత దేశంలోని వ్యభిచారిణులు సాంఘికంగా ఉచ్చస్థానంపొందాలెనంటే మహమ్మదీయమతంలోఉన్న సౌకర్యం మరేమతంలోనూ లేదు. ఈ మతంలో వ్యభిచారిణులు చాలా గొప్పవాండ్లను వివాహమాడటానికి వీలుంటుంది. అందుకనే క్రమంగా గౌరవనీయులతరగతి ఎగబ్రాకటానికి అవకాశముంది.

మహమ్మదీయ ఉంపుడుకత్తెలనుఉంచే హిందువులుకూడా తమమతంలోస్థానంలేని తమసంతతి ద్వారా మహమ్మదీయులసంఖ్యనే వృద్ధిపరస్తున్నారు. మహమ్మదీయపరిపాలనరోజులలో ఇప్పటివలె మహమ్మదీయజనసంఖ్య హెచ్చలేదు. దీనికికారణం కొంతవరకుహిందువులలో ఉన్నక్రూరమైనవర్ణభేధమే. హిందువులు నిమ్నజాతులస్థితినిగూర్చిగాని, వితంతువులగూర్చిగాని ఏమీ ఆలోచించుటలేదు. హిందూసంఘములోని వితంతువులు ప్రకృతిసిద్ధమైన కోరికలను అదోమకోలేక, అవకాశాలులేనట్టి హిందూ మతాన్నివదిలి తప్పనిసరి తురకమతంలో చేరవలసివస్తున్నది.

మహమ్మదీయులు, మహమ్మదీయేతర్లను, అందులో ముఖ్యంగావిగ్రహారాధకులైన హిందువుల్ను హేయంగా చూస్తున్నారు. వీండ్లను కాఫరు (నాస్తికుడు) గా పరిగణిస్తారు. ఇట్లాంటికాఫర్లల్లో అధమం ఒకసంఖ్య అయినా తగ్గించే మహమ్మదీయునికి స్వర్గకవాటాలు బాహాటంగా తెరచిఉంటవని వాండ్లనమ్మకం. ఇలాంటి నమ్మకాలతోనే చాలామంది మహమ్మదీయసామ్రాట్టులు హిందువులుపైన జిజియా అనే పన్నును విధించట



మేగాకుండా వాండ్ల దేవాలయాల్ని అపవిత్రంచేశారు, నాశనంచేశారు.

గాన పైవిషయాలన్నీ స్థూలంగావిచారిస్తే హిందూ మహమ్మదీయ ఐక్యత అసంభవమనితోస్తుంది. అయినా ఇట్లాంటిఐక్యతకు ఒకటే మార్గముంది. అదేమన, భారత మహమ్మదీయులు, కమాలుపాషాను, స్నేహితునిగాను, మార్గదర్శకునిగానూ, తత్వవేత్తగాను అంగీకరించి అతనిమార్గాన్ని అనుసరించటం. ఈరోజు మహమ్మదీయ ప్రపంచస్థితి ఎలాఉందో గ్రహించాలె ఈతురకలు. క్రైస్తవులును వీండ్లు ఒకే గ్రంథమువారుఅని విశ్వసించినా తురక ప్రాపంచికవైభవసర్వస్వము ఎక్కడచూసినా క్రైస్తవులచే అనుభవింపబడుతూఉన్నది. అర్థశతాబ్దానికిపూర్వం టర్కీ ప్రపంచంలోని ఉన్నతసామ్రాజ్యాల్లో ఒకటిగాఉండేది. కాని దానిగతి ఈరోజుఎట్లా ఉంది? (ఇంగ్లండుకుమంత్రిఅయిన) గ్లాడుస్టోను టర్కీని యూరపుదేశమునుండికట్టుబట్టలతో వెడలింపగోరాడు ఇప్పుడాయనజీవించియుంటే, తనప్రియమైనకోరికలుదాపు ఫలించటంచూసి హృదయపూర్వకంగా సంతోషించేవాడు.

మూరుదేశస్తులు (మహమ్మదీయులు) క్రైస్తవస్పేనుదేశస్తుల గట్టిపిడికిల్లోఉన్నారు. మహమ్మదీయాధీనంనుండి తొలగింపబడటంనుంచి, క్రైస్తవదండయాత్రలఉద్దేశం నెరవేరింది. ఈరోజు స్వతంత్రస్థితిలో ఉన్నరాజ్యాలుకాని దేశాలుకాని చాలాతక్కువ. మిగిలినవాటిలో గొప్పభాగం క్రైస్తవులప్రభుత్వాల చేతుల్లోని సూత్రాలతో ఆడింపబడుతున్నవి.

ప్రపంచంలోని ప్రతిభాగంలోనూ, తమమతస్థులైన సోదరుల పతితస్థితినిగూర్చి బాగాఆలోచించవలసిన తరుణం భారతమహమ్మదీయులకుఇది. హిందువులకు భీతినికలిగించి వారినితమశత్రువులుగాచేసుకుంటే లాభంలేదు. భారత దేశాన్ని పూర్తిగామహమ్మదీయదేశం చెయ్యాలె అని ఇకముందు మహమ్మదీయులుకలలోనైనా అనుకోకూడదు.

హిందువులసంఖ్య తమకన్న చాలాగొప్పదనే ఐనప్పటికీ, హిందువులు ఆర్థికంగా, సాంఘికంగా తమరిని బహిష్కరిస్తే, తమగతి ఏమవుతుందో కాస్త విచారించాలె. అనేకవిషయాల్లో హిందువులు లేనిది వాండ్లపని ఏమాత్రం సాగదు. ఈసంగతులన్నీ బుద్ధితో విచారించి హిందువులతో శాంతంగానూ, విగ్రహరహితంగానూ జీవితాలు గడిపితే క్షేమం.

మహమ్మదీయప్రభుత్వం భారతదేశంలో అత్యున్నతస్థితిలో ఉన్నప్పుడుకూడా, మహమ్మదీయపరిపాలకులు హిందువుల సాహాయ్యంలేనిది ఏమీ చేయలేకపోయినారు. కాబట్టే కొలదిహిందువులకు బాధ్యతతోకూడిన ఉద్యోగాలిచ్చారు. అట్టివారిని మహమ్మదీయులుగా చేయుటకుమైనను వారికి అసలేకలుగలేదు.

హిందువులుకూడా తమప్రస్తుతపు అపాయస్థితిని గుర్తించాలె. వాండ్లు తమతమ తరగతులనుమూసివేసి నిరర్థకమైన వర్ణవిభేధాలకు కడసారినమస్కారంచెయ్యాలె. నిమ్నజాతులను ఉద్ధరించాలె. తమ పూర్వమతమైన హిందూమతానికి రాదలచుకొన్నమహమ్మదీయులనూ, క్రైస్తవులనూ స్వీకరించాలె. భారతదేశంలోని మహమ్మదీయుల్లో, క్రైస్తవులలో గొప్పసంఖ్య, మతాన్నిమార్చకముందు, హిందువులే అనేసంగతి మరువరాదు. ఇప్పటికీ, హిందూఆచారాలు, హిందూసాంప్రదాయాలనీ అనుసరిస్తూ హిందూధర్మశాస్త్రాలని ప్రమాణంగాపరిగణించే మహమ్మదీయకుటుంబాలు అనేకం ఉన్నవి. ఇట్టికుటుంబాలు తమలోకలిసినప్పుడు హిందువులు హృదయపూర్వకస్వాగతమిచ్చి వారిని సన్మార్గంలోకి త్రిప్పటం చిక్కుతోకూడిన పనికాదు.

హిందూవితంతువుల పునర్వివాహాలు ఆచరణలోకి తీసుకోవస్తేనేగాని వీండ్లను అన్యమతాలనుండి తప్పించవీలులేదు. శుద్ధిసంఘటనఉద్యమాలు ప్రతిహిందువుగమొక్కసానుభూతిని పొందాలసి ఉన్నది. హిందువులు తమ ధన,మాన, ప్రాణరక్షణకోసం ముఖ్యంగా తమస్త్రీలమానరక్షణకోసం శారీరకశక్తిని వ్యాయామశాలలస్థాపించి సంపాదించాలె.

ఈరెండు సంఘాలవారూ తాముహిందూదేశంలోనే జీవితాలుగడిపి ఇక్కడనే చావాలసి ఉన్నదనేసంగతి జ్ఞప్తియందుంచుకొని ఒకరికొకరు లోకరునమ్మకుటమానవలె.

పూర్వము ఈ రెండుసంఘాలకు పోట్లాట గోవధవిషయంలో జరుగుతుండేది. నిరపరాధియైన గోవును, కటికవాని కత్తినుండి తప్పించటానికి ప్రయత్నించటంచేత, ఇందుబహుశః, హిందువులే దోషులు! కాని ఈ మధ్యమహమ్మదీయులు, తాముప్రార్థనలు సలిపే మసీదుల ముందర సంగీతాన్ని నిషేధించటం మొదలుపెట్టారు! ఇంతగొప్పభావము వీండ్లబుర్రలోకి ఎట్లావచ్చిందో? వాండ్ల ప్రార్థనలకు సంగీతము వెగటుగాని, బజార్లలో విరివిగా బయలుదేరేఆ కర్ణకఠోరమైనఇతరధ్వనులు 'కావ్రకామాన్లు' ఖురీతికి మేళవింపబడిన శ్రావ్యమైన సంగీతము నిశ్చలత్వానికి భంగము- బజారులోని రొద అనుకూలము. ఇంత తల్లకిందుల వ్యాపారమేమిటి ?

నలభయిసంవత్సరాలనుంచి తీవ్రప్రయత్నాలుచేశారు హిందువులు తురకలు తమతో జగడములేకుండా ఉండాలెఅని. కాని లాలన,బుజ్జగింపు, చివరకు లంచము, ఇవిఏవీ ఉపయోగపడలేదు. ఆ అర్ధచంద్రానుచరులతో సంధిచేసుకోటానికి ఇవి ఏవీ ఫలించలేదు. మహమ్మదీయులలో దూరదృష్టిగల రాజనీతిపరుడెవడులేడు .దురదృష్టం! విద్య కలిగి,ప్రభుత్వమువారి కటాక్షమువల్ల గొప్పగొప్ప ఉన్నతోద్యోగాలుపొంది సత్కరించబడే మహమ్మదీయులు, విద్యావిహీనులకన్నా ఎక్కువగా, అసహనము, మూఢపట్టుదలకలిగి ఉన్నట్లు కనపడుతారు.

లాభంలేదు, పద్ధతులుమారాలె.

ఇకముందు మహమ్మదీయుల అహంకారాన్ని ఏమాత్రం పెరుగనివ్వకూడదు హిందువులు. మెత్తదనంచూపిస్తే లాభంలేదు. కొందరుతురకలు ఉద్యోగాలు దొరుకుతున్నవిగదా అని ఉద్యోగస్థుల అనుగ్రహం తమయందున్నదని కులుకుతున్నారు. వెన్నెలకొన్నాళ్లు. తరువాత చీకటే - ఈపరిస్థితులే శాశ్వతంకాదు.

"మహమ్మదీయమతాన్ని అణగతొక్కాలె" అని వ్రాశారు ౧౮౫౭ సం॥లో అనేకమంది బ్రిటిషుఉద్యోగస్థులు. ఇది మరిచిపోయేవాక్యం కాదు.

('మాడరన్ రివ్యూ'నుండి అనువాదము)

× ౨ × ×



# కొండిపర్తి శాసనము

ఆంధ్రపరిశోధక సంఘము, హైదరాబాదు



శాసన సంఖ్య ౩౨. ఈకొండిపర్తి, ఒరంగల్లునకు ఆఱుమైళ్ల దూరమునందున్నది. గ్రామమున కానుకొని పాడుబడిన కోట యొకటి గలదు. కోటమధ్యగల జీర్ణాలయమున కెదురుగా నీశాసనము పాతబడియున్నది. శాసనము అన్నివైపులం బగులంగొట్టంబడెను. అందుచే జక్కనివర్ణములతోనున్నను వర్ణనము దాయము తెలియుచున్న విషయము మాత్రము అసమగ్రముగానున్నది. నాలుగువైపుల చిన్న అక్షరములతో మనోహరముగా వ్రాయబడియున్నది.

## తూర్పువైపు

౧ శ్రీస్వస్త్యస్తు ఓంనమశ్శివాయ ॥ పాతుంస్త్వ(ం)

౨ భవాన్యస్త్ర శిరశిఖ్యత్యః [illegible]

౩ శ్రీమానానమద్భృన్మధుకర మధురక్వాణ(సం)

౪ దర్భగర్భః । గంగానైర్మల్యనాన్దోద్భాస్యస్య వి(శ)

౫ నైరుత్యము త్రైవృత్త్యమాణోపీనా దిశ్రీ +

౬ వః పరిణీహితమనసా మస్తు పేరంబవా +

౭ రోమస్తోమాగ్రిల గ్నానపుష్పి జలధయో (౯)

౮ స్వవక్షస్థ లక్ష్మీగ్రాగా- శ్లేషోపజాత్రవజ

౯ జాలకాంభజంతే । ఉన్మీలత్కేతగాన్ వ(న్)

౧౦ తేయస్యదంష్ట్రాంకురేభూః కస్తూరికాంక(సౌ)

౧౧ భాం వహతి హరిగసౌపాతునః పోత్రి(ణః)

౧౨ శశివకల్యాణం దిశతు శివమాశాసనం

౧౩ (వే) లక్కల్లోలోత్థి తప్తుపత వారాః వృతః । మన్ద్ర

౧౪ దూభషా భుజగఫణమాణిక్య నికరప్రభాభా

౧౫ సర్వంపరికటయతి సంధ్యాకలసితం (ప్రోద్యద్)

౧౬ భవ్యాశ్వరశ్మంభుః శ్రీమత్కాకటచ మాంకః

౧౭ త్రి-త్రిక కలహంసస్య జగత్ర్తీ-డా సరస్వతే॥ మల్యా?
౧౮ యాంపురివరి వృషోదుర్జయామ్నాయవల్లీ÷
౧౯ కుందద్యుతి నిభయశోదాత దిక్కుంభికుంభ ( ః )
౨౦ సిద్ధాసిక్రికరి పుమ్మృగీలోచనః ఖేచరేంద్రప్ర ÷
౨౧ ఖ్యాః ప్రధన ఃజయే సైన్యపోదన్నపాఖ్యః॥ దన్నపై
౨౨ న్యాధిప తేర్జి తాపాపరస్యగంతి ఘనకా లంకి +
౨౩ తే। త్రైల్యేనయుక్తాః గజేరిపూణాంసంతాప (మంభోథ)
౨౪ రవారిధారా॥ప్రిసారయా మాసగుణాన్వరి+
౨౫ వేప్యసా ఆకిప్తు దిత్సయామస్యే వదా స్యం + +
౨౬ రుపాణి ॥ తతోజని జగద్గీర కీర్తి రాతిః పాాస్న
౨౭ కిస్కన్నజ్జై ర్వైశి ఃక్షీరాధ్ధేరివకౌస్తుభః॥ +
౨౮ యశఃపూరపూరితే భువనత్రయేకాగ +
౨౯ చయమునాకః కర్పూరః కిమంజనం ॥ +
౩౦ నామతస్యాసీ త్ప్రియాకువలయేక్షణా। +
౩౧ లాసంపత్యేరుంభతీ తామరుంధతిం ॥ ×
౩౨ సావ్యాప్రతిపద్యమానాజన్నైనూ యంత
౩౩ భావః ఉమారమాచన్వట మాచమాచతి +
౩౪ సించరిత్తైరుదారైః॥శ్రీమాన్కాటచమూనా,,
౩౫ యోరాసీత్తనూభవః । ప్రితాపాకాంత దిక్చక్రో ×
౩౬ దేవ్యయివాపరః ॥ సకాట గిల్పాట ఇతిప్ర సిద్ధోనిధి +
౩౭ తిప్రమదాః భూపః । తమేవమాహుః రెద ముద్ద
౩౮ గండముద్దండయుద్ధాంగణ పండితీమ్మా ॥ +
౩౯ స్ఫురంతి సమరాంగణేశు తస్యాసిధారారిపుర (క్షతి)

౪౦ క్తా॥ వ్యలోకిలోకైరతిః స్మృతియేనతీవ్రిపతా పాగ్నిః (ఖివ)
౪౧ మూర్తిః ॥ తస్యారి వీరాన్సమరేషు కుంభి కుంభస్థ
౪౨ గాస్త్రితదిగ్వనిద్రాః। ఉజ్జృంభతేస్వర్గ శిలా సినామ్
౪౩ ÷ విబిద్ధాపచమండలేషు ॥ తస్యప్రితాప శిఖి
౪౪ ÷ ధిం ఃరోధినాం । తృణాన్యద్భాః తాసీతి నిత్యం
౪౫ ÷ ఃనస్మియే॥ శంకేత్థంసంకిసాకీశమర్థినా
౪౬ ÷ ÷ ÷
౪౭ ÷ ÷ ÷

ఉత్తరం

| | | | |
|---|---|---|---|
| ౧ | × | రివ | × |
| ౨ | ,, | తకి) | + |
| ౩ | ,, | ల్యాంబర | ,, |
| ౪ | ,, | యాంప్రా | ,, |
| ౫ | , | స్యానివర్ధంతే | ,, |
| ౬ | ,, | తనయాఃకాటనేనా | ,, |
| ౭ | ,, | త్కరణ ప్రిణితపాప్రిన | ,, |
| ౮ | ,, | ంద్రనిరంగ్రకీర్త్యాధస్య | ,, |
| ౯ | ,, | తేమోదమానంవా | ,, |
| ౧౦ | ,, | భీమానోగారీశవా | ,, |
| ౧౧ | ,, | తస్య । రుద్రద్వజస్యధి | ,, |
| ౧౨ | ,, | రేణుకల్యాభీష్టదబం | ,, |
| ౧౩ | ,, | నుజనిపుగగం | ,, |
| ౧౪ | ,, | కథవా ॥ అస్తా | ,, |
| ౧౫ | ,, | గ్గా × ల్యాంబికా | ,, |
| ౧౬ | ,, | దా ÷ ॥ కుద్ధ | ,, |
| ౧౭ | ,, | ఖ ÷ తమో | ,, |
| ౧౮ | ,, | బింబేవీక | ,, |
| ౧౯ | | వేవిలుహి | ,, |

౨౦ ,, విపున్నచే ,,
౨౧ ,, లం ॥ కీర్తి ,,
౨౨ ,, వలజ్జేవతి ÷
౨౩ ,, నక్వాపిన ,,
౨౩ ,, స్యతాతస్య ,,
౨౫ ,, తరతస్త్యాగ ,,
౨౬ ,, రుద్రవరూధినీశ ,,
౨౭ ,, మార్గణనిమార్గణాయ ,,
౨౮ ,, ప్రతిష్ఠాపయతిస్మ ,,
౨౯ ,, నాంవిధత్తేసోభివా ,,
౩౦ ,, సఃఫలస్యాభ్యధికం ఫలం ,,
౩౧ ,, తస్యపత్నీ గంగేవపావనీ ,,
౩౨ ,, మైకతరంగిణీ ॥ వచసి ,,
౩౩ ,, సోభూషణం దయా ॥ ,,
౩౪ ,, నంనిత్యంతిస్యాశ్చకాస ,,
౩౫ ,, శిక్షితాకమవేక్షణాః ,,
౩౬ ,, శచిముఖ్యాః పతివ్రతాః ,,
౩౭ ,, శేంద్రగవిం । ప్రిథమంయథా ,,
౩౮ ,, అథముక్తవే పథః కరకృతే ,,
౩౯ ,, హజనతామనుతే ॥ ప్రాతస్తదీయా ,,
౪౦ ,, శ్రియాంసిసర్వాణి సమాపతం ,,
౩౩ ,, ప్రణతివ్యఃధూనాం సౌభాగ్యభాగ్యే ,,
౪౨ ,, తి ॥ పల్యాద్యదిపంశ జలనిధిసం ,,
౪౭ ,, పూర్వ్వశశిరేఖా । నిమసర్గలచరిత ,,
౪౪ ,, లక్షణాభాసమానాంగీ ॥

పడమర

౧ ÷ తస్యచసుతః షెడముద్దుగండఃకా
౨ ,, న్యాధిపతిర్వ్విదధద్విభాతి । కీర్త్యా ప్రతాప
౩ ,, సాచదిగంగనానాం ముక్తాప్రవాలపు
౪ ,, వివహారశోభాం ॥ తస్యైవస్యకిమంగ
౫ (మం) గళనిగేమ్మల్యాల కాట్రప్రభో దొదాయ్యా

౬ (స్వవి) జృంభణాని జనతారాగేణ క్షే యకే
౭ ÷ రప్యవలంబ్య మంబరమిదంయేవా
౮ ,, కీర్తిర్గచ్ఛల । స్ఫారస్ఫాటికపేటికాంత సహి
౯ ,, గోపాయితం ॥ సర్వేషాముపకార
౧౦ ,, చరితం సర్వంతదీయంతథా। కింత్వేకం
౧౧ ,, దంతిదాంతమతియస్తత్కర్మధర్మ్య
౧౨ ,, ః। వాపీకూప మహత్తటాకఘటనైరాకక్ష్మి
౧౩ (మే)దినీప్రాసాదైరతి దంతురో దినపతే
౧౪ ÷ స్తదీయైఃకృతః ॥ సోయంమహీతల
౧౫ ,, ఘోరాజారాయగరుడఇత్యాఖ్యా
౧౬ ,, తనవహతశాక్తవరక్తాద్రిభూతశాల
౧౭ ,, ముఖః॥సంవాహఃక్రియతాంవ
౧౮ ,, తరవశ్యాఖ్యాకరైపాదయోర్యేమః
౧౯ ,, భృత్యైఃకురుష్వసురభిక్షీరైపరీక్షా
౨౦ ,, కీర్తిర్నస్త్యదిగంతఖేలనజుషఃక్రీడా
౨౧ ,, ప్రభోఃక్రాంతిస్నేహతినమన్యతాంవి
౨౨ ,, తేదానేష్వయంప్రక్రమః॥ తస్యాపి
౨౩ ,, ం సమరేఘరణీతల్పశాయినాం। జాయ
౨౪ ,, గతావాప్తిర్గ్నే నీతిఖలుకౌతుకం
౨౫ ,, భిదాపిప్రియసుతస్యసీతైయ్యగ్ లో
౨౬ ,, స్నిగ్ధచంగనరసైరివిప్యతేదాంతి
౨౭ ,, ద్రిపుపుర్గద్ధితధూమరేఖాకస్తూ
౨౮ ,, మకరికాకలనాంకరోతి॥ మఃపదన్న
౨౯ ,, ం గారోపస్యస్తస్యపురోధసః । వీరో
౩౦ ,, మంతశ్శాంతస్వాదితికౌతుకం॥
౩౧ ,, తేపరదోషంననిష్ఠురంవక్తినానృతం
౩౨ ,, నాక్షిపృతికమపిజనంసగుణపి
౩౩ ,, ర్వదానసర్వాన్ ॥ కిమహమహిమవ ర్వై
౩౪ దిగ్దయేణిసరస్వహరిచ్చం। సజ్జయ
౩౫ ,, దణిజ్జంతో హరేషుత్తాణకంచణం

౩౬ + ఇకాబాంబికారాజతితస్యప
౩౭ ,, (తిప్ర)తాశిలగుణాభిరామతత్పాదముద్రో
౩౮ ,, నాదివోర్వ్వీ జేతాస్వయంసంపరితిరత్న
౩౯ ,, అంగుష్ఠనిష్ఠ్యూతమరీచిజాలైర్మ్మేషా
౪౦ ,, పరితపరిత్తిభాజాం। సీమంతరేఖాసు
౪౧ ,, (వీలా)సినీనాం। సిందూరలీలారచనాంక
౪౨ ,, (రోతి) నిసర్గ్గనాదిరిర్ధ్వోయం భాతి
తస్యాఃప
౪౩ ,, యం। దుర్ధంస్వకాంతి చోరేభ్యః కమ
లేభ్యఇవ
౪౪ ,, ।।తదూరుభ్యాముపమితాకవీంద్రైరినియం
౪౫ ,, కంపతేకుల కాంతాబియేనపవనేలతా. ।।
ఉత్తు
౪౬ ,, గ్గస్తనకుంభయుగం సంత్తేశతేయగ్గమనే
కృతం
౪౭ ,, ఇతీవలిస్యాయు వతిర్వ్వలగ్నం భీత్యే
వనిత్యంపతి
౪౮ ,, పతితం।। కాంత్యాబాంత సుధామరీ
చిరుచిరచ్ఛా
౪౯ ,, పవేపంముఖం । దివ్యం నేత్రయుగంః ధూత
౫౦ ,, నీలోత్పలాలంకృతిః ।। ఆనీలంకబరీ
పసంప్రతి
౫౧ ,, పొరిత్ఫుల్లపల్లీ పరిభారిమ్యద్భృంగాకడం
బరోవి
౫౨ + + + ÷

దక్షిణము

౧ రుద్రేశ్వరాభిధానంసురధామపిధాపితం
౨ తపస్తేన। యస్యశివస్స్వేవోపతిలగతిశశిగ
౩ గనగంగాచ।। సమ్యక్ప్రిమ్మాపితస్తేనపారిసా
౪ దః కేశవస్యచ। యోమిచ్ఛతివరోదస్యేరం
౫ తరాశంసముచ్ఛరియాత్ ।।జాతేనేత్రరసేం
౬ దుఃభూపరిమితే ౧౧౬౨ శాకాబ్దకేశావ్వ
౭ రీవర్షే మాసిచఫాల్గునేశశిసుభృత్పక్షేహ
౮ రేర్వ్వాసరే । ఛాయాపుత్రదినేగ్రహేషుఘన
౯ వసువ్యక్తంశుభాలోకిపరిత్యషుస్థాప
౧౦ యదీశ్వరం హరిమపిశ్రీకాటపైన్యాధి
౧౧ పః ।। పోరివేశ్వరేణసహితంవిభాతిసురస
౧౨ ద్మనాంత్రికూటమిదం । కైలాసమేరుమం
౧౩ దరసమానశంకాంకరోతియత్పుంసాం।।
౧౪ యస్యశిఖరస్థితేఘుద్యోతితగగనేషు కన
౧౫ కకలశేషు । నీలచ్ఛాయేరవేర్బ్బింబంసంభా
౧౬ దితయైవనపరిభయా ।। ప్రాకారోజయ
౧౭ తితరికూటమభితస్థత్తేననిమ్మాపితఃసుశ్లిష్టైః
౧౮ క్రమశీర్షకైరుపచితోనీలోత్పలైః
కల్పితఃయ
౧౯ శ్చాలక్షితసంధిబంధకలనా ధీరాశిలాతత్కు
౨౦ క్షైః।సంతుత్ప్యైవమహీయసీమివశిలాం య
౨౧ త్నాత్సముత్తారితః।।రుద్రేశ్వరాయతిరియం
౨౨ చదత్తనివర్తనానాం ద్వయమచ్యుతాయ
౨౩ ప్రోవేశ్వరాయాదతద్వైవయుగ్మంశుభార్థి
౨౪ నాకాటచమూద్వహేన ।। క్లుప్తం క్షేత్రం బెల్ల
౨౫ మత్తటాక జలసేచనం త్రికూటస్య ।
వృష్యంబుజీర
౨౬ సస్యక్షేత్రంత్రిశన్నివర్తనాంచ
౨౭ మద్వంశజాఃపరమహీపతివంశజావాపాపాద
౨౮ పేతమనసో భువిభూమిపాలాః।। తేపాలయం
౨౯ తుమమధర్మ్మమిమంన మగరింతేషాం
మయా
౩౦ విరచితాంజలిదేవమూర్ధ్నిహేమిదానాత్ప
౩౧ రంనాస్తిసుఖంచాముష్మికంమహత్ । నచా
౩౨ పిభూమిహరణాత్పరం పాతకముచ్యతే।।బహు
౩౩ భిర్వ్వసుధాదత్తారాజభిస్సగరాదిభిః ।యస్య
౩౪ యస్యయదాభూమిస్తస్యస్యతదాఫలం
౩౫ స్వదత్తాంద్విగుణంపరదత్తానుపాల
౩౬ నం।పరదత్తాపహారేణస్వదత్తంనిఃఫలంభవేత్ ।।

౩౭ స్వదత్తాం పరదత్తాం వాయోహరేతవ
సుంధరాం
౩౮ షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయ
తేక్రిమిః॥
౩౯ అకరస్యకరాదానాద్గో సహస్రవధస్మృత
సకర
౪౦ రస్యకరత్యాగాద్వికోటి ఫలమశ్నుతే॥
తథానాగస
౪౧ హసేన్ని పృథ్వీమేథళ తేనచగవాంకోటి
ప్రదానేన
౪౨ భూమిహర్తా నశుద్ధ్యతి నీరౌ రారవాద్యాశ్చ
౪౩ కుంభీపాకస్సుదుస్సహః। తీవ్రాశ్చయాతనః
౪౪ కష్టానోపసర్పంతి భూమిదం॥ శివాయనమః॥
౪౫ స్సజయతిపృథ్వీ మహీహరహరణాద్దివిచూఱ
౪౬ కాఱుతి। కాటచమూపో గణపతినృపతి
శ్రీపాద
౪౭ పద్మషట్పణః ॥ ప్రోలేశ్వరరుద్రేశ్వరహర
యఃపీ్ర
౪౮ ణంతుకాటసైన్యపతిం గాంగభోగవిభవై
౪౯ ర్దత్తైః ప్రీణితాత్మనః॥

సూచన

ఈ ధర్మస్థాపకుఁడు కాటసేనానాయకుఁడు. ఇతఁడు దన్నసేనానాయకుని కుమారుఁడు అగు సజ్జసేనాపతి పుత్రుఁడు. కాటసేనాపతికి పెదముద్దగండఁడని బిరుదనామముగలదు. ౧౧౬౨ శాలివాహనశకమునందీతఁడు దేవాలయములను గట్టించి వానికొసంగినవృత్తుల నీశాసనమునందు సూచించెను. ఇతఁడు ప్రోలేశ్వరుఁడు, అచ్యుతేశ్వరుఁడు, రుద్రేశ్వరులను బ్రతిష్ఠించెను. ఆలయము పొక్కటి గడ్డలవలెఁ గట్టఁబడుటచే దానికిఁ ద్రికూటాలయమని పేరిడఁబడెను. సాధారణముగా నిట్టియాలయములను ద్రికూటాలయములనియే ఇతర శాసనములందు వ్యవహరించిరి. కాటచమూపతికిఁ బ్రత్యర్థిగ సంకిసాధీశ్వరుఁ డొకఁ డీశాసనమునందు గనుపించుచున్నాఁడు. ఇతని వివరములు తెలియవు. రుద్రధ్వజిన్యధిపతి పేరొండుగలదుగాని ఆభాగము పగిలిపోవుటచే సమన్వయింపవీలుగాకున్నది. ఇందుఁ జెప్పఁబడకపోయినను కాలమునుబట్టిచూడ కాటసేనాపతి గణపతిదేవుని కాలమున సైన్యాధిపతిగ నుండెనని కాలమునుబట్టి యెఱుంగవచ్చును. చౌండసేనాని శాసనము, ఈ శాసనము రమారమి ఒకకాలములోనివే.



## ఉన్మాదము

వి. కె. నంబూరి

దేవ! ఉన్మత్తతఘుటిల్లె నీ వినిర్మ
లోజ్వల జ్యోతియందలి దొక్క రేఖ
నాదు హృదయాంతరాళంబు నందుజొచ్చి
ప్రజ్వలింపంగ నీవియ సుప్రభలతోడ.

కామ మద లోభ మాత్సర్య కలితకఠిన
కనచమది భగ్నమాచును భువినిపడియె
రాగభోగంబులందు విరాగమొదవ
గలిగె నవజీవనోత్సాహ కలిమినాకు.

పలుకులకు నందగారాని ప్రభలు గదుర
విశ్వమోహన సౌందర్య వీధులందు
గాలిలు నీదివ్యమూర్తిని కౌగలింప
సగుగుడెం... నా ... దేవ!




దేవనాగరిలిపి.

భారతవర్షములో సికందర్ సమరములకు పూర్వ మే వ్రాతకళ ఆచారములోనుండెను. ప్రాచీనభారతీయులు పత్రికాగితములపై వ్రాయుచుండెడి వారనుటకు గ్రీస్ చరిత్రకారుని ఆధారముగలదు. 'లలితవిస్తారము'ను గ్రంథమున బుద్ధభగవానుడు స్వయముగా వ్రాయుచుండెనని తెలియుచున్నది. భారతీయులు యవనవర్ణమాల నుండి సంస్కృతవర్ణమాల నేర్చిరని కొందరి వితండవాదము గలదు. కాని భారతీయ లేకాలములో, యేవిధముగా యీవర్ణమాల నిర్ణయించుకొనిరో యింతవరకు సిద్ధమని తెలిపిన మహాశయు లెవరును లేరు.

'సంస్కృతవర్ణమాల భారతదేశమునందే కనుగొనబడినది. ఇతరవర్ణమాలలకు దీనితో నెట్టిసంబంధము లేదు. సంస్కృతసంధిసూత్రములకు వ్రాత అత్యవసరము. కాబట్టి సూత్రముల కాలముపరకే భారతీయులు వ్రాతకళలో ప్రావీణ్యత సంపాదింపగలిగిరని' అలగ్జాండర్ కన్నింగ్హామ్, ప్రొఫెసర్ డాసక మొదలగు చరిత్రకారులు యీవిషయమునుగురించి తెలిపిన అభిప్రాయములుగలవు.

"ఇదేగాక (౧) ఏవర్ణమాలనుండి యీ దేవనాగర వర్ణమాల నిర్ణయింపబడినదని వితండవాదమొకటి పుట్టింపబడినదో అదిపూర్తిగా నిరాధారము. యవనవర్ణమాల దీనికి విరుద్ధమార్గమునుండి వ్రాయబడుచున్నది. అనగా కుడినుండియెడమవైపునకు లిఖింపబడుచున్నది. (౨) ఈరెండువర్ణమాలాకారములలో నొంతమాత్రము పోలికలేదు. దీనికిమారుగా మిక్కిలివ్యత్యాసముగలద"ని పైరెండుకారణములవలన ఎడ్వర్డ్ టామస్ యీవర్ణమాల స్వయముగానిర్ణయింపబడినదని ఋజువుపరచెను. ఈ దేవనాగరవర్ణమాల దక్షిణదేశమందలిద్రావిడులచే నిర్మింపబడినటుల మరొక చరిత్రకారుని అభిప్రాయముగలదు. ప్రాచీన శిలా తామ్రశాసనములు యీలిపియందు లిఖింపబడినందున యీవిషయమునకు మరింత హేతువు కలుగుచున్నది. ఈసిద్ధాంతమే నిక్కమనిబలుకుటకు తగినంత చారిత్రకాధారములభించలేదు.

"అనాదినుండి భారతీయులకు చిత్రలేఖనమున పెట్టినది పేరు. ఈసహజగుణమే వీరిని యీలిపి నిర్మింపజేసినద"ని జనరల్ కన్నింగ్హామ్ "ఈ దేవనాగరలిపి యందన్నియో సుగుణములుగలవు. ఇన్నిసుగుణములు కలిగిన మరొకలిపి ప్రాచీనకాలముననేగాక భావికాలమునందు సహితము నిర్మింపబడు ననెడి సూచకములు కనుపించుటలేవు. ఈయసమానగౌరవము భారతీయులకే తగిన"దని ని

ఇదేవిధముగ ప్రస్తుతము విద్యాశాఖయందెన్నియో లోపములుగలవు. వీనిని కనుగొని నివారణోపాయములు సూచించుట యెంతయేని అవసరము.

ఇక రెండవ ముఖ్యమైనతీర్మానము నిర్బంధప్రాథమిక విద్యకుసంబంధించినది. ప్రస్తుతమది హైదారాబాదునగరమునందు ప్రవేశపెట్టబడును. విద్య మాతృభాషనందొసగ నిర్బంధముండవలయును. ఇంతియకాక, శ్రీనిజాంప్రభువుగారి ఫర్మాను సంపూర్ణముగ నాచరణయందుంచవలయునని కోరబడినది.

మూడవముఖ్యవిషయము విద్యావిషయకసభలు సమావేశపరచుటగూర్చినది. దురదృష్టవశమున జిల్లాలయందధికారులు గ్రంథాలయ వార్షికోత్సవములు, స్త్రీలసభలు, వర్తకుల సభలను, జరుపుటకై ప్రభుత్వసభయొక్క ఆజ్ఞ అవసరమని నిర్బంధించుచున్నారు. లోగ సూర్యాపేట సభలసందర్భమున నల్లగొండ జిల్లామెజిస్ట్రేటుగారు చూపిన నిరంకుశత్వమును హైకోర్టువారు గర్హించినను మరల స్వార్థపరులగు అధికారులు కుచేష్టలు మానకున్నారు. దీనిగూర్చి ప్రభుత్వమువారికి విన్నవించుటకై గతనెలయందు గొప్పసమావేశము జరిగినది. రాయబారవర్గ మేర్పడినది కాని ఫలితము తెలియదు. మరల నీ విషయమునునే తీర్మానింపబడినది. పూజ్యనీయులగు అధ్యక్షులు వాక్రుచ్చినట్లు యిట్టిఆజ్ఞ బ్రిటిష్ ఇండియాయందునగాంచిన యెట్టిఅల్లరికి కారణమగుచుండెడిదో తెలిసియుండెడిది.

ఈమహాసభయందు ఇట్టివెన్నియో ముఖ్యతీర్మానములు విద్యాభివృద్ధికై జేయబడినను, స్థానికఉర్దూదైనికపత్రికలగు "రహెబరె దక్కన్, సహీఫా" నిందావాక్యములు వ్రాయుట శోచనీయము. సహీఫాపత్రిక యిట్టిమహాసభను ప్రభుత్వమువారేల జేయనిచ్చినారని విలపించినది. కాని యీవిలాప మరణ్యరోదనమయ్యెను. రహెబరె దక్కన్ సమావేశము జరుగకమున్ను ఇదిప్రత్యేకముగ హిందువులసభయనియు, ప్రజలలో విభేదములు నాటుటకు ప్రయత్నింపబడుచున్నదనియు, అధికార అనధికారులలో మనస్పర్థలుకలుగునని యుసూచించినది. ఇపుడుతీర్మానములగూర్చి ఆకునకందని పోకకుపొందని సంపాదకీయములు వ్రాయుచున్నది. వీనిని బట్టచూడ యీపత్రికలు తాము విద్యాభివృద్ధికి నెట్టిసూచనలుగావించరనియు, ప్రబోధముగావించరనియు, ఇతరులు ప్రయత్నించినను వారుసమ్మతించరనియు, విశదమగుచున్నది. ఈపత్రికవ్రాతలు జదివినవారికి లేక మహాసభ విభేదములుకలగించుచున్నదో, వేరు యీపత్రికలు హిందూముసల్మానులను వేరుపరచుచున్నదో తెల్లమగును.

ఈమహాసభ ఆంధ్రుల ప్రోత్సాహములన సమావేశమైనదని చెప్పిన తప్పు కానేరదు. ఆంధ్రి జిల్లాలలో అధికారులు జూపిననిరంకుశత్వము వలన,విద్యామహాసభ వారు ప్రజలన్ని పములుత్రో సీకరించుటచేతను, ఈసమావేశము జరుగుటకు కారణమయ్యెనని చెప్పిన ప్రాజ్ఞులుమాతో నేకీభవింపకపోరు. ఈసమావేశమునందాంధ్రులు అధికసంఖ్యాకులుపాల్గొనిరి. ప్రతినిధులుగవచ్చుటచేతనేకాదు కార్యక్రమమునందు యువకులుపాల్గొని తమయుత్సాహమును, దేశసేవాసక్తియును,గనపరచిరి. ముఖ్యముగ నల్లగొండజిల్లానుండి హెచ్చుప్రతినిధులువచ్చిరి.

మహాసభ జయప్రదముగ జరిగినది.మిగిలినది కార్యాచరణమైయున్నది.ప్రభుత్వమువారీతీర్మానములను బుట్టదాఖలుచేయుదురో, లేక అంగీకరించెదరో కాలమే తేటపరచును.కాని స్థాయిసంఘమువారు నిరంతరము కృషిసలుపవలసియున్నది.వారు ఇటుప్రజాభిప్రాయమును తయారుచేయవలయును, అటుప్రభుత్వమువారికివిన్నవించవలయును. తీవ్రప్రయత్నము జరుగని దేవిషయము ఫలింపజాలదు.మహాసభజయప్రదముగ జరిగినంతనె లోపములుతొలగజాలవుగదా!

ఆదాయవ్యయపట్టక

ఆర్థికశాఖామంత్రిలగునవాబు సర్ హైదరు నవాజ్ జంగ్ బహద్దర్ ప్రతిసంవత్సరము నిలువగలఆదాయవ్యయపట్టక ప్రకటించుచున్నందులకెంతెయుప్రశంసనీయులు. ౧౩౩౮ ఫసిలిలో రు. ౭౯౦ లక్షలు ఆదాయము కలుగుననియు, రు. ౭౩౭ ౧/౪ లక్షలు ఖర్చగు ననియు, రు. ౫౨ ౩/౪ లక్షలు నిలువనుండు ననియు, అంచనా వేయబడినది.

ప్రభుత్వకోశమునందింతధనమున్నను ప్రజాహితకార్యములకై తగినమొత్తమేలవ్యయపరచుట లేదనునదియే ప్రశ్న. ధనము ధనాగారమునందు మూల్గుచుండిన లాభమేమి? హటాత్తుగ సంభవించునాపదులకై ప్రత్యేకనిధులుకలవు. రైల్వేకంపెనిస్వాధీనముజేసికొనుటకు వేరెనిధియున్నది. ఈనిధులకుతగుమొత్తములుప్రత్యేకించినపిదపయే పైమొత్తమునిలువయున్నది. అట్టియెడమాప్రభుత్వమువారు ప్రజాభివృద్ధికై వెచ్చించకూడదా? రోడ్లులేకయు, నీటివసతిలేకయు, ప్రాథమికపాఠశాలలులేకయు, దేశమధోగతిపాలగుచుండవలసినదేనా? భూమిపన్నుతగ్గించకూడదా? వ్యవసాయాభివృద్ధికై తగుప్రయత్నములు జేయరాదా! ఈవిషయములుప్రజలకు పరిపాలనమునందు పలు

కుబడికలుగువఱకు లభించజాలవు. ఇతరదేశముల పరిపాలనావిధానమును, ప్రస్తుతఅనుభవమును, మనకీవిషయమును దెలుపుటలేదా?

నాందేడుఅల్లరి

బ్రిటిషుఇండియానందలి సదుద్యమము లీరాష్ట్రమునందు వ్యాపించకున్నను, విషయవాయువులు మాత్ర మిచటవీచుచున్నవి. నాందేడులోను, నల్లగొండ జిల్లాలోను హిందూముసల్మానకలహములు జరుగుటచే శాంతికాముల కెంతయు విచారముకలుగుచున్నది. ఇంతవఱకు దెలిసినవార్తలవలన ముసల్మానులు దౌర్జన్యమునకుగడంగిరని వ్రాయనలసివచ్చినందులకు చింతిల్లుచున్నాము. ఇట్టికలహములవలన నెవరికిని లాభముకలుగజాలదు. పరస్పరమైత్రివలననే దేశాభివృద్ధికలుగునుగాని యిట్టి మతకలహములచే కాదు. మతముమనుజునికిశాంతి కలుగించునని పెద్దలువచించిరి. కాని భారతదేశమున మతముపేరిటనే ఒకరునొకరిపై దండెత్తి చేయరాని దుష్కృత్యములు జేయుచున్నారు. ఒక ప్రాజ్ఞుడు వచించినట్లు ‘‘మతమిట్టిదారిజూపుచున్న అట్టిమతమునుండి ముఖముద్రిప్పటమేలు.’

నాందేడుఅల్లరిగూర్చి ప్రత్యేకవిచారణ జరుగుచున్నది. పర్యవసానము త్వరలో ప్రకటింపబడుననిన మ్మెదము. ఇకముందిట్టి కలహములు జరుగకుండ కట్టుదిట్టములేర్పరుచుటయేగాక ప్రభుత్వమువారు దయాదాక్షిణ్యములుత్యజించి దుష్టులను తగురీతిగా శిక్షించుటయే శ్రేయస్కరమను విషయము గమనింతురుగాక!

## గమనిక

పాఠకవర్గమువారు కోరినందున నవంబరు సంచిక ‘దసరాసంచిక’ పేరుతో నవంబరు ౨౫ వ తేదినాటికి ప్రకటింపబడును. దీనియందెన్నియో ప్రత్యేకవ్యాసములు, ప్రత్యేకచిత్రములు శోభిల్లుచుండును. ఇతరులకు వెల ౦-౮-౦

వ్యవస్థాపకుడు



సంపాదకులు, ప్రకాశకులు: కే. బాలకృష్ణారెడ్డి. ముద్రాపకులు, చంద్రకాంత ప్రెస్ గౌలీగూడ హైద్రాబాదు.

Reg No M 2277

November-December 1928

# సుజాత

సంపుటము ౨

సచిత్ర మాస పత్రిక

సంచిక ౧౧-౧౨

నవంబరు డిసెంబరు ౧౯౨౮



వార్షిక మూల్యము రు. 3

దక్షిణ హైదరాబాదు

# విషయసూచిక

## నవంబరు



## డిసంబరు



# చిత్రపటముల వివరము



హైదరాబాదు, నవంబరు ౧౯౨౮

సంపుటము ౨ శా. శ. ౧౮౫౦ విభవ సంవత్సర కార్తీకము సంచిక ౧౧

# చార్ మినార్

సముద్రాల వేంకట రాఘవాచార్య

(సుజాతకు ప్రత్యేకము)

అంతిక పాదుషా కనకహర్మ్య శిఖా కలశాలి చెంత గి
ల్గింతలు సేయు సంజమలి రేకల గాంచి గృహప్రవేశ సం
జింత మరల్పు మందలకు జేరును [illegible] మగ్గ మింపుచుండె దై
నాంతిక గీతిగా నయ [illegible] లోకబోధ బాదుషా.

వాని మనమ్ము సంజమలి పాటున [illegible] తీమనక
గానననీమ గప్పికొను నాటపు చీకటులు [illegible] మందలే
మానా యటన్న భీతి నసియాడు [illegible]
ధ్యానము [illegible]



హైదరాబాదు, నవంబరు ౧౯౫౮

సంపుటము ౨ | శా. శ. ౧౮౮౦ విభవ సంవత్సర కార్తీకము | సంచిక ౧౧

# ఛార్ మీనార్

సముద్రాల వేంకట రాఘవాచార్య

(సుజాతకు ప్రత్యేకము)

అంతిక పాదుషా కనకహర్మ్య శిఖా కలశాలిచెంత గి
ల్గింతలు సేయు సంజమలి రేకల గాంచి గృహప్రవేశ సం
జింత మరల్చ మందలకు జేరుచు కొంచుగ మించుచుండె దై
నాంతిక గీతికాచయ మనంతముగా నొకబోయ బాడుచున్.

వాని మనమ్ము సంజమలిపాటున మృత్యుముఖమ్ము తీరునన్
గాననసీమ గప్పికొను గాటపు చీకటులందు మందలే
మానా యటన్న భీతి నసియాడుచునుంట తదేకదృష్టి న
ధ్యానము నట్టిపోవుచు గుభాలున వ్రాన్పడిపోయె నేలకున్.

తననై యెవ్వరో కోరిపిల్చినటు లాతండెంచెనే గాని తా
గనలేడయ్యె నినాదమూల మనిసర్గంబైన యా పిల్పదే
మని యాతండెద తర్కముం సలిపి యాశాంతాలకుం జూడ్కులం
బనిచెం సంశయవారణ ప్రవణముల్ ప్రత్యేకతో దీర్ఘముల్.

ఆగతిసంశయాకుల దృగంచలముల్ నిగుడించుచుం వనీ
భాగము నంతయుం వెదకు పల్లవమూర్తి కపూర్వ దివ్యశో
భాదరిమంపు రూపు గొనివచ్చిన యా వనరాజ్యలక్ష్మియో
నా గనుపించె నొక్క లలనామణి భవ్యశిలావితర్దికన్.

కడుం బ్రాచీనంబగు నా
యడవిని మున్నెన్నడతివ లడయాడుటెఱుం
గడు గొల్లబోయ; నేఁడిటు
పడుచుం గని యబ్బురంబు పడుట యనదౌకో.

ఆపుడా గొల్లడు లోపలం బొదలు మోదాశ్చర్య సందేహముం
విపరీతంబులుగా దదీయపదవీ వీథిం సమీపింపలే
క పటాక్షేపముతోడ త్రోవఁబడి సాగం లేక హస్తాంగుళీ
వ్యపదేశంబున జేరఁబిల్చు తరుణీ పాదప్రదేశానకుం.

వినియా వనతాంగుండయి
చని పల్లవు డాకుమారి చరణయుగళముం
గనుదమ్ముల బూజించెను
వనదేవతి నట్లుమనసు పరిపరి బొంగన్.

తనమాట యందుమీఱిన
వినయంబున గొల్లవచ్చి వినయితుడుగ 'రా'
యనిపిల్చి చేరువందగు
చనవున కూర్చుండబనిచి జవ్వనియంతన్.

'ఓ, నా కూరిమిబిడ్డడ!
యేనింతకు నిన్ను బిలిచియే యెఱుగని మా
టేనిజము; గోలుకొండపు
రానన్ గర్వమ్ము [illegible] గటియించెన్?

దానఁగల కార్యభారము
నూనంగా నీవు జంకునొందకు వేతే
పనిలేదు; పాదుపాహో
తో నాపని సెప్పి యతనిఁ దో తేరుటసూ.

అన నాతండొక యించు కేనియును నూహాతర్కముల్ సేయకో
జననీ నీవు మదీయ జీవన దనస్యత్తూమికా నన్నిటుల్
వనుపన్ భౌతిక పితృదేవు నిట కాహ్వానంబు గావింపగా
జనవేగాని భయమ్ము దేల వలతుర్ సందేశమంబాడినర్.

వెట్టిగొల్లడై కార్యవివేక మిటులు
తెలుగు నొడితటి తీపుల తేటపరుప
నామె పులకితయగుచు బోయనికి దెలుప
దొడగె సందేశమును సుధా తుందిలమును.

"లచ్చిమియంట మీగుణవిలాసములర్ ప్రభుతావిశేషముర్
మెచ్చినదంట మీమొడదమి న్మరలింపగలేక కానసుర్
వచ్చినదంట మీదరిసెనంబును గోరెదునంట కల్గినర్
హెచ్చుగ మిమ్ము దేల్చునట నిర్మలప్రేమ రసార్ణవంబునర్.

ఆశాకల్పిత నిర్మలప్రణయ సౌకాంత స్థితిర్ దీపికల్
గాశంపాలతలర్ ఘటించి సుమనః ప్రాచుర్యసంగీత వీ
చీశైత్యంబుల నామతింపుచు జయశ్రీకౌముదుల్ విశ్వధా
త్రీ సీమన్వెలిగింప ద్రిప్పునట తండ్రీ నిన్ను చేపట్టినర్.

ఆమె విశాలలోచన దృగంచల మొక్కటె సర్వరాజకో
టీముకుటాంతరస్థగిత దివ్యమణీ నిచయప్రభావళుల్
నీ మధురప్రసాదముల నిత్యము నారతి పట్టజేయగా
నోమునటంట విశ్వజగదున్నతి యామె దయంట దేవరా.

నీవీమాటలు త్రోసిపుచ్చిన మరెన్నే నాళ్లకుంగాని నీ
కా విశ్వాసము దుర్లభంబట మహీయప్రాజ్య సామ్రాజ్యల
క్ష్మీశ్రైరుధ్యము సంభవించునట యత్యుచితమాలోచనర్
భావంబందెడవించి సల్పుమనె తత్పాణీ ప్రరీ గాహముర్."

అని నా మాటలుగాఁగ పాదపవహ మేకాంతంబు నందుండఁగా
వినిపింపం దగు గోలుకొండ కిపుడే వేగమ్ముగాఁ బోయి యా
తని వెంటంగొని రమ్మటన్న విని యాతం డాదలన్వంచి బో
వన సంసిద్ధుఁడ యయ్యెఁ దొట్రిలు మనోభావంబు సూచించుచున్.

"ఇపుడే చని గోల్కొండకు
నృపశేఖరు దెమ్మటంటి విందుల కే నే
నెపమున్ జెప్పను జాగు దు
నెపుడే ప్రేమించుమంద నిటపడి చనఁగన్.

కన్నుల వత్తులు వైచుక
నెన్నంటి పరిభ్రమింప విపినమ్మున ధృతిన్
తిన్నని పచ్చిక దినిమను
నిన్నవలా గొఱియమంద లేననుగఁచున్."

అని కాతర్యము పిచ్చలింప వనిదిక్కైన్ మదలంగాంచు నా
తని నిర్మాయ కతంగసన్ మదిని వాత్సల్యంబు ప్రేకెత్త వా
నిని చేరంజని వీపుదట్టి జడుడా! నీకింత భీరుత్వ మెం
దునకోయీ చనిరమ్ము నే సలుపుచుందున్ జీవరక్షా క్రియల్.

నీవేగి వచ్చు వఱకే
జీవములను గాచుచుందు చెడకుండ యుండం
గా వినుమని యాతని జే
జే వైచుచు బాసజేయ స్థిరచిత్తుండై.

చనిరో యాదవుఁ డామె యాజ్ఞగొని వీక్షాపర్వ శంకారి శో
భన ప్రాసాద శిఖాసమర్పిత ధ్వజప్రాలేయ రుజ్మండలీ
కనదాకాశ హృదంతరంబటు రణత్కల్యాణ భేరీరవో
ల్బణమై యొప్పగు గోలుకొండ నగరీ భాగంబులన్ దాటుచున్.

అగణిత మాణిక్య ప్రభా
ధిగతము దేవేంద్రభోగ ధిక్కృత భాగ్య
శ్రీ గణనీయాంతఃపుర
భాగములం [illegible] కనుచు వడివడిఁ బోవన్.

ఆ కుతుబుషాహా విశ్రాంతినందు మంది
రమున్ నిర్భీకుండై ప్రవేశమ్మొనర్చె;
ద్వారపాలకులా పరువానిగనియు
రాజమందిరము కదిగి నిల్వబడుదనుక.

పారావారల కన్నుగప్పి యిటులన్ ప్రాసాద గర్భంబునన్
జేరంజాలిన గొల్లబోయని మనస్థైర్యంబు భాటించి దు
ర్వార క్రోధముచేత భూధవుడు విభ్రాంతాత్ముడై తత్సభా
గారంబెల్ల ప్రతిధ్వనింప నరవంగాసాగ పేరెల్గునన్.

పరువంబేచిన సింహగర్జనము రేవన్ యావనాధీశు దు
ర్భర రోషార్భటులాక్రమింప ధృతఖడ్గ వ్యగ్రులై సైనికుల్
వరుసల్ దీర్చి చుట్టుముట్టిన కుతుబ్షా పాద పద్మంబులన్
శిరముంజేర్చి యాదవుండిటుల విన్పించెన్ స్వవృత్తాంతమున్.

"నే చను దెంచినాడ నవనీధవ! తావక దర్శనోత్సవం
బేచిన యొక్క కాంత నను నిచ్చటికంపిన; యామె తోడ మీ
కా చెలిమల్ త్వదున్నతి కనంత సహాయములంట: కాంతలన్
నే చిన నాటినుండి గననేర్చితి నట్టిర చూడనో ప్రభూ.

ఆయమ గన్న పాదములయందు శిరంబిడ కోర్కె గల్గినన్
బోయడనైన నాకె కడు నోములునోచిన యామె తీరులన్
తీయము గన్న మీరెటుల నేర్తురొ పల్కగ రిత్తమాటలన్
వేయునికేల నీకయి దివిన్ డిగివచ్చిన దేవతేయగున్.

శాసననీను మీకొలకు గాచుక యుండిన యామె [illegible]ంద లే
మానో యటన్న భీతి దెసలారయుచుండిన నన్ను బిల్చి భూ
జానికి నాదు విన్నపము చక్కన దెల్పి యతండు నన్గనం
గానగు మాటనేయుమనె గావున మీరట కేగుడంచిటుల్".

ఆ సరసీరుహాక్షి తన కాడిన మాటల నెల్ల పాదుషా
హా సముఖమ్మునం దెలుప నాయవనేశుడు మోదవిస్మయా
వేశము చిప్పిలంగ నిటువీని నొడుల్ నిజమంచు నమ్మగా
దోసమటంచు [illegible] కండిరా.

వినయమును నమ్రతము రూపు గొనెడునట్లు
మాటిమాటికి నటు బ్రతిమాలుచుండు
బోయవాడాయమ తన జీవములను తాను
వచ్చుదనుక బ్రోచుచునుండు వరుస దెలిపె.

తెచ్చుపాటానొ విశ్వాస రేఖయానొ
ఆముఖమునందలిది; సభాసీమ విడచి
ప్రభువు లోనికిజనియె నపాంగవీచి
వీలిచెనాబోలు చనిరి మంత్రులునుగూడ.

..............................

..............................

ఆలో రాజును మంత్రులుఁగలిసి యేకాంతంబునన్ మంత్రమే
మాలోచించిరొ? చేరబిల్చి దరహాసాంకూరముల్ గండపా
లీలీలంబుల కింపనుం బలుకన్ రేకెత్తు క్రాం దేనియల్
జాలై కాల్వలుగట్ట సిట్టులనియెన్ క్ష్మానాధు డాభీరుతోన్.

'నా కతిమోదము న్గొలిపినావు సతీకథ దెల్పి మద్ధితా
నీకము లోన నింకపయి నీకు ప్రవేశముగల్గు కల్పకా
నోకహమట్లు మా ప్రభుత నూతనసంపద లుల్లసిల్లగా
నీకనుసన్నలంజనున నిందితవర్తన! వల్లవోత్తమా.

నానుది ఖేదమోదముల నల్గుచునుండిన వేళ చెప్పినా
వో మరియేమొ నాకెరుగబోలదుసూ మదధీనజీవయే
తామరసాక్షి మోహననిశుంబ విచుంబన ధన్యభావనీ
సీమను పేర్కొనన్ మురువుచెందవో నామది చెమ్మరింపగన్'.

అనుచు వేమారుతనయెడ నతిశయాను
భూతి దొల్కాడగానాడి నాతియందు
గలుగు కామాతిరేక మగ్గలముకాగ
పలవురాజున కెలమి బెంపెందలంచి

కలదు త్వత్పురాగ్నేయ భాగమున వనము
నందు దేవళమొకటి [illegible]

తల్లి సత్యమ్ముగలది నిత్యమ్ము దాన
వెలుగుచుండును దానినా వెలదియుండె.

అని వర్ణించిన సంతోష మావహించు
చూపు కడగంట నిగుడగా గోపకుమా!
సరస రాజాన్నములను భోజనముపెట్టి
పనిముగియుమీద రండని బనిచె హితుల.

ఎఱుగడు గొల్లబోయడు మహీధవ సంకథితార్థతత్త్వముల్
నరపతితోడి కూరుముఱు నా మృదుచిత్తముతోడ శైలకం
దరముల గొర్రెపిల్లలతొ త్రచ్చనలాడుటయుంచు నెంచెనో
అరిగెను వారివెంట సరసాన్న పిపాసమదిం గుబుల్కొనన్.

సైన్యము లుదయమ్మునను స
నన్య ప్రవణంబులగుచు నధునాతనశ్రీ
విన్యాస ధన్యమైన య
రణ్యానిం గనుడటంచు నరిగె నవాబున్.

అంత వారివారి త్రోవల నరిగిరెల్ల
సైనిక నికాయమును; కుతుబ్షా ప్రభుండు
నవ్యమదిరాప్రభావ సంకలితనిద్రు
డయ్యె; గోపాలు మాటెవ్వ రడుగువారు?

దుర్భర కార్యభారమున దూలిన లోకమగాధ యామినీ
గర్భమునన్నిరంబునిడి కన్నులుమూసెను లూకసంతతుల్
నిర్భయవృత్తితో దిరుగ నేర్చెను నిద్రిత రాజలోక శ్వా
సార్భటితో శ్రుతింబొరసి యాడుచు పాడెను గూఢ సత్తతుల్.

అంతట గాఢ తమోవితానములు పాయల్ పాయలై రేగి వి
శ్రాంతింజెందెను ఘోరపర్వతగుహాశాలల్; దినారంభ కా
ర్యాంతర్వృత్తులు మోసులెత్తునటు బోధారావముల్ కుక్కుటీ
సంతానంబులు చేయు మేల్కొలుపు నాశల్ వారగా లోకముల్.

ఎప్పుడేరీతి పరువెత్తి యేగినారొ
యవనసైనికు లుదయ శైలాగ్ర హైమ

వీరమిను డెక్కనంతకే పిక్కటిల్లి
రా మనోహర దేవాల యాంతికమ్మున.

ఎంత రయమ్ముతోడ యవనేశ్వరు డాయెడ జేరెనో వసు
త్రాంత హయమ్మలే తెలుపదగ్గవి. అంతటి చిత్రకౌతుకం
బెంతయు గిత్తవోయె దరిసింపగ శూన్య రమాలయం బుదు
గ్దాంతసుధాస్రవంతి నినదంబులు ధాగక గుబ్బటించెనుర్.

ఎంతటి బుద్ధిశాలి ధరణీశుడు గోపకు ద్రోసిపుచ్చగా
నంతయు నిచ్చగింపడు యశోమధురాకృతియైన యా రమా
కాంతను గాన నేరడు వికస్వరపుష్పనికుంజపుంజ సూ
నాంతరవాసినిన్ ప్రకృతి నంతగ ముద్దులు గొల్పుచుండినన్.

ఆపగరాని మేతాదృశావమాన
శోకగీతిక లోకాతిలోకభీక
రధ్వని మునుంగి రోదోంతరంబు నతని
హృదయమును జించుకొని బాహిర్గిల్లెనట్లు.

హిందూ దేవత మోసగించి చనె యామేలేని యీ దేవళం
బిందుండన్ ఫలమేమి దీని పడగొట్టింపుడు; ఈరాలచే
నిందే గోరియొకండు గట్టుడిచటన్ హిందూ మసల్మాను లిం
పొందన్ గ్రామముగట్టుకొండు భువనంబుల్ మమ్ము గుర్తింపగన్.

అది భాగానతి చిహ్నమై యలఘు భాగ్యంబుల్ పిసాళించుచున్
బాగంబుంగావుతమ్ముంచు నాజ్ఞయిడి తా బోయెన్ కుతుబ్షా కళా
విదుతా శిల్పుబు సౌధనిర్మితిని గావింపంగ వాసంత మొ
కట్టడు జేర్చెన్నె నేత్రము దివ్యశిఖరాగ్రజ్యోతితో సూర్యునిన్.

.....................................

.....................................

.....................................

టప్పని (మోగు పోగరు రౌద్ర వినిపింపదుగాని యట్టు లా
యప్పల పేరితో బనిచి యాగవునిం దెగటార్చె పాదుషా
యప్పటికిప్డు గొల్లసికి నై తెరవుల్గనుచుండు లచ్ఛియా
చిప్పుడుగూడ వృద్ధులు వచింతురు శిల్పుల పాట నమ్మికన్. *

*ఖుతుబ్షాహీ రాజవంశీయుల కాలములో గోల్కొండ రాజధానిగా నుండెను. వర్తమాన కాలపు హైద్రాబాదనగర భాగము యంతయు ఆకాలమునందడవిగా నుండెను. ప్రస్తుతము చార్ మినార్ కట్టబడిన స్థలమునందొక్క చిన్న దేవాలయ ముండె ననియు, గోలకొండ, పరిసర ప్రాంతములందలి గొల్లవారలు యీ యడవిలో పశువులను మేపుచుండిరనియు, ఒకానొక సమయమునందొక గొల్లవాని కిచ్చట లక్ష్మీదేవి కనబడి అతని ద్వారా తన సందేశము మహమ్మదు ఖులీ ఖుతుబ్షాహాకు తెలిపెననియు, లక్ష్మీదేవి తన రాజ్యమునందు స్థిరముగా నివసింపజేయుటకా సందేశ హారిని, అమాత్యుల సలహా ప్రకారము వధించిరనియు, ఆ ప్రత్యేక స్థలమునందు లక్ష్మీదేవి దర్శనార్థము నవాబు రాగ లక్ష్మీదేవి కనబడనందున తప్పక ఆ స్థలమునందే యుండి తీరవలయునని నిశ్చయించుకొని ఆ దేవాలయము కూలగొట్టించి అచ్చటనే యీ చార్ మినార్ సౌధము నిర్మింప జేసెననియు లోకులలో ప్రతీతి కలదు. నేటికిని యీ సౌధపు దక్షిణదిశయందొక పాతకి చుట్టుపట్టులందలి హిందువుల వలన పసుపు కుంకుమలతో పూజ జరుపబడుచున్నది.

ఈ చార్ మినార్ సౌధము హైద్రాబాద నగరమునందలి మధ్య భాగమునందు కలదు. ఇది ఒక సంవత్సర కాలములో (౯౯౯ హిజిరి నుండి ౧౦౦౦ హిజిరి) మహమ్మదు ఖులీ ఖుతుబ్షాహా కాలమున తయారు చేయబడినది. దీనిని రోజాగా (గోరి) కట్టించవలెనని యుద్దేశముతో ప్రారంభింప బడినది. కాని యుద్దేశము నెరవేరలేదు. దీని నిర్మాణమునందు ౨ లక్షల ౬౦ వేల రూప్యములు వ్యయమైనవి. ఇది చతుష్కోణములుగా గలదు. ప్రతి తట్టు ౧౦౦ అడుగుల నిడుపు గలిగి ౧౬౦ అడుగుల యెత్తు గలిగి యున్నది. దీనిపై నుండి నగరమంతయు రమ్యముగా గానుపించును. నవాబుల గృహములు సమీపములో నుండుట జేసి స్త్రీలు కనుబడెదరని దీని పైకి వెళ్లుటకు వీలులేదు. నవాబు సర్ సాలార్జంగు బహద్దరు (మొదటి) గారు లక్ష రూప్యములు వ్యయముచేసి దీనికి సన్న సున్నము చేయించిరి. ౧౩౦౨ హిజిరీలో అరబ్బులకు, పోలీసువారికి సంఘర్షణ జరిగినందున కొంతకాలమిచ్చట బాఖాయిదా ఫౌజు (రెగులర్ ఫోర్సు) యుంచబడెను. కాని ఆటు తర్వాత దీనియందు స్థిరముగా నగర రక్షక భటుల దళమొకటి నుంచబడినది.

౧౩౦౪ హిజిరీలో లార్డ్ డఫిరన్ ప్రభువు హైద్రాబాదకు వచ్చినపుడు దీని చుట్టు లోహ ప్రాకారమేర్పరచి దీనిపై నాలుగు వేపుల పెద్ద గడియారము లమర్చబడినవి. ఈ సౌధమునందు మహబూబు సుబహాని గోరి గలదు. అప్పుడప్పుడు జియారత్ (ఉరుసు)కు నిజాం ప్రభువుగారు వెళ్లుటగలదు.

(సు. సం)





# చేమకూర వేంకటపతి:
# సారంగధర చరిత్ర

సురవరము ప్రతాపరెడ్డి

చేమకూర వేంకటకవి కవితాప్రాశస్త్యమును గురించి మన యాధునిక పండితరాయలిచ్చిన యీ క్రింది యభిప్రాయము చాల సమంజసముగా నున్నది. ,,ఈ చేమకూర చక్కెర మడిలో అమృతము పాటించి పెంచినదిగాని మట్టిలో నీరు పాటించి పెంచినదికాదు. ఇందు పూమొగ్గలవోలె తామె విచ్చుకొను శ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రసములొల్కు రచనలును, సదాచారాభిమానము బుట్కొల్పు ధర్మ్యనిబంధన నైపుణియు, విసిగింపని వర్ణనలును, బరువులు నెరవులుంగాని కబ్బంపు దొడవులును, ఈ ప్రబంధమును భారతీ భాండాగారమందు కడు నుచ్చస్థానమందు నెలకొల్పుచున్నది,''

మొట్టమొదట శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్ర ప్రబంధములలోని తత్త్వములను విమర్శించిరి. ప్రతి ప్రబంధమందును నొకే విధమగు కథాపద్ధతి యుండునని చూపించిరి. మన చేమకూర కవి సారంగధరలో నట్టి పద్ధతి కానరాదు. ఇందలి కథయే వేరుగా నున్నది. కావున పద్ధతియు వేరు. ఇందలి కథానాయకుల పాత్రపోషణమును గురించి చర్చించుటకు బూర్వము యొక యంశమును విశదపఱుపవలెను. కీ.శే. ధర్మవరము కృష్ణమాచార్యులు సారంగధరనే యాధారము చేసికొని తమ నాటకమును రచించిరి. అందు చిత్రాంగి రాజరాజ నరేంద్రుని చిన్నభార్యగా నిరూపింపబడినది. కాని చేమకూర కవి యిట్లు చిత్రింపలేదు. చిత్రాంగి రాజనరేంద్రుని యుంపుడు కత్తియగానే యితడు వర్ణించి యున్నాడు. ప్రారంభముననే యిట్లు వర్ణించినాడు.

క॥ కలరా యిః రాయనికిం,  
కుల సతిరత్నాంగి; భోగకుటిల శిరోజా,  
తిలకము చిత్రాంగియు; నన  
నెల జవ్వనులిరువు రంబుజేందునిభాస్యల్.

ఈ ,,భోగకుటిల శిరోజాతిలక''మగు చిత్రాంగికిని ,,కులసతి''యగు రత్నాంగికిని చాల భేదమున్నది ,,అంబుజేందునిభాస్యల్'' అను పదముననే సూచించి యున్నాడు. అంబుజమునకును, చంద్రునికిని (ఇంత) సరిపడదని కవులెన్నడో నిర్ణయించి యుండిరి. సుబు... యను మంత్రి కుమారుడు సారంగధరునితో చిత్రాం... వలని భయము సూచించుచు ,,వారకాంతల కు... వావి కలదె?'' అని పలికెను. అంత యేల చిత్రాంగి సారంగధరుడు తనను ,,తల్లీ''యని మాటి మాటికి సంబోధించుట నోర్వక

శా. ఆ నీలాలక లేతనవ్వులయి నిర్ల...  
గ్రమ్మజాల నిర్వాజగం  
బౌనా మేలన నీవె తెల్పుకొన  
నేలా నీగుణంబుల్, నే...

సూను[గాఁ]గణించెవాఁడు, నీహృదయ
మిచ్చో[ఁ]గంటె, నేఁడేపత్రం
గానే నీపినతల్లి గాన,
విభు భోగస్త్రీని భావింపగన్.

అని తెలుపుకొనినది. అంతటితో పోలేదు వీరి వాదము.

సారం—"వంగడమున కెల్లసాడ్డు" అనిన

చిత్రాం—"కాదటు, నేఁ లచిన్నవాడ నేర్పడితి" అని పలికినది.

ఇక ప్రకృతమునకుఁ గడంగెదను. సారంగధరుఁడు [రత్నాం]గి కుమారుఁడు. ఇతఁడు బహుతపః ఫలితము [గా] రాజనరేంద్రునికిఁ గలిగెను. బాల్యముననే శాస్త్రము[లు], శస్త్రములందును మంచి పాండిత్యము గడించెను. [సౌందర్యమున] [మన్మథుని]యకాదు. గుణములందు ప్రహ్లాదుని వంటివాఁడే!

క. మాడెత్తుమాట యెవ్వరి
నాడఁడు, సత్యంబు వీడనాడఁడు, ఖలులం
గూడఁడు, పరకామినులం
జూడఁడు, సారంగధరుఁడు సుతమాత్రుండే?

ఈ సారంగధరుఁడు తిన్నగా యవ్వను డయ్యెను. [తం]డ్రి యాతనికి "మంజువాణి" యను ఘూర్జరదేశపుఁ [కన్య]ను దెచ్చి పెండ్లిచేసెను! ఈ వివాహమును గూర్చి, [మంజు]వాణిం గూర్చి మూడే పద్యములున్నవి. ఈ పద్య[ము]లీ గ్రంథమందు లేకుండిన మేలుగా నుండెడిది. ఏలన [యీ] మంజువాణి మరల గ్రంథమందెచ్చటను గానుపింపదు. సారంగధరుఁడు కాళ్లు చేతుల కోతచే గాయపడినప్పుడు [గా]ని తదనంతరము గాని యీమె జాడయే లేదు. కవి పూ[ర్తి]గా నీమెను మఱచియేపోయెనో లేక చిత్రాంగిని కథా[నాయి]కనుగా జేయఁదలంచి నందున నీమెను మూలకుఁ ద్రో[చి]వేసెనో! ఎట్లైనను నిమె కథ నింతటితో వదలుదము.

రాజరాజు వేటకై దండకారణ్యమునకుఁ బోవుట [చె]ప్పెను కాని, సారంగధరుని బాల్యమందు గాని యెచ్చటను [యౌవ]నము చిత్రాంగి ప్రస్తావనయే లేదు. సారంగధ[రుఁడు] [రా]జు వేట కరిగిన యనంతరము ఱెక్కలు [కలిగిన] పావురాల పందెమునకై నగరుబయట కేతెంచి వినోదంబులందుండగా నతని పావురము చిత్రాంగి మేడపై వ్రాలెను. ఆ సందర్భముననే చిత్రాంగి యొక్క ప్రథమ దర్శనము పాఠకులకు గలుగుచున్నది. వ్రాలిన పిట్టను జేత బట్టి చిత్రాంగి, "...శంకదీని చేఁగలుగు నిజంబుగాఁ దనకు గాంక్షలు దీఱ సుఖంబు చెందఁగన్" అని చింతింపఁ దొడఁగె.

చిత్రాంగి రాజుచే నెప్పుడు పరిగ్రహింపఁ బడెనో, యామె యెప్పటినుండి సారంగధరునిపై మనసు గలిగి యుండెనో యింతవరకు కవి తెలుపలేదు. కాని సారంగధరుడు పావురమునకై వచ్చినప్పు డతనితో చిత్రాంగి తన మనసులో రగులుచుండినట్టి ప్రేమను యిట్లు వెల్లడించెను.

ఉ॥ నీ సుగుణత్వముల్, చెలువు, నేర్పును,
నెచ్చెలులెల్లఁ జెప్పగా!
వీనఁగవోని మోహమున వీ
నులవిందుగ విందు నవ్వికే,
ఖానుడు కాండ! నేఁడు పొడగంటిని;
గన్నులపండువయ్యె; నేఁ
జేసిన భాగ్యమెవ్వరును జేయర
యాకట! ఫలించెఁ గోరికల్.

అంతియకాదు! ఆమె కా "గామినీ హల్లక బాణు ని" దర్శన మాత్రచేతనే "కొల్లిమవంబులోఁ గలుగుతుండుడు కెల్లనుబాసె. ..."

క. "నను జూడరాడదేమో
యని నిను దూరుకొనుచుందు ననయము; నాపై,
నెనరు గలందుకు నేఁటికిదె
కనిపించెను; మనము వేడుకలు కనఁగల్గెన్."

అనియు సారంగధరునితోఁ జెప్పినది.

ఆంధ్ర ప్రబంధములం దొకటి రెండు చోటులనే యిట్టి కథా సందర్భములు చిత్రింపఁ బడినవి. మనుచరిత్ర మందు ప్రవరుని వరూధిని ప్రేమించి, ప్రార్థించినను ఫలము గానక పోవుటయు, సారంగధరలో చిత్రాంగి సారంగధరుని ప్రేమించి విఫల మనోరథ యగుటయు, నీరెండు స్థలములందే యిట్టి ఘట్టము లుండినట్లు తోచుచున్నది. ఆచ్చటికన్న నిచ్చట విశేషము. అచ్చట వరూధిని నిరాశా పరవశురాలై కృశించెను. ఇచ్చట చిత్రాంగి పగచాటెను. ఈయమ చమత్కారముగా తన మనస్సును సారంగధరునికి ప్రకటింప జూచెను. కావుననే „రవి శశి రశ్మికిఁ బొరగరాని భయానకమైన" తనమేడలో.

ఉ॥ ఏఁకడఁ జూచినన్ రతులకేఁ
కటిదీరఁగ వ్రాసినట్టి కో
క్కోక కళా రహస్యములు
గోప్యములౌ చవుసీతి బంధముల్
నాకపురీ విలాస కలనా
గణికామణి కాముకాది నా
నాకృతులున్ విచిత్రగతు
లచ్చట నచ్చపలాక్షి చూపుచున్.

సారంగధరునికి శనమనంబు వెలిబుచ్చ సెంచెను. కాని సారంగధరుని మనసు విఱుగక పోయెను. చిత్రాంగి మఱొక విధ మాచరింప దొడఁగెను.

"ఓము నెఱజాణ, తలకోన,
జేయుము. శిరులి వెజవాది చెయిబట్టుము, వా
లాయ మెద జేర్ప కలపము
కో.............." యని పలికెను.

ఇాము సర్మోక్తిగా తనను „తలకోన జేయుము, చెయిబట్టుము, యెదజేర్పుము" అనియు పలికెను. కాని సారంగధరుడు గ్రహించక పోయెను. చిత్రాంగి యింకతాళలేదు. „సముఖంబున నేటికి ర యాచారముల్",

మ. అని యూహించుచు లజ్జ బో
విడచి యేకాంతంబుగానద్దైన
ల్గనుచున్ బైటతొలంగ, నీ
వివదలన్, గామాంధకారంబు నె
మ్మనమున్ గప్పిన, గన్నుగా
నకపుడా మత్తేభ గంభీర గా
మిని యత్యంత నిరంకుశో
ద్ధతిని బల్మిన్ బట్టగా జూచినన్.

ఇంతవఱకు వచ్చినప్పుడు సారంగధరుడు గడగడ వడకుచు "తల్లీ తడవాయెను వచ్చి; పోయెదను నేను" అనెను.

ఇప్పుడు చిత్రాంగి బలవంతమునకు తొడుగా జేమాఱుకొన జొచ్చెను. కాని సారంగధరుడు తనకుఁ జెలిసిన నీతులన్నియు బోధింపఁ దొడఁగెను. ఎవరిపాట వారికే! చిత్రాంగి కివన్నియు బోధపడవు.

ఉ. ఎన్నడు నేర్చినాడవుర !
యూ మటుమాయపుమాటలీవు; నా
కిన్ని దలంప నేమిటికి?
నిప్పుడు దోసము పెద్దచేసి యా
దున్నవయాళి కాని గడు
దొడ్డగఁ జెప్పి భయంబు సూపి చ
క్కన్నను దుద్దువెట్టి, యలు
కంగఁ దలంచెదు; మాను మిమ్మగిలి.
„మొనసి యూరకె గతిరంగమునకు రాని
సుద్దు లివియేల? చాలింపు! సుగుణివాడ!"

అని యనినది. అయితే సారంగధరునికి నీతుల నిచ్చిన నీమెయు దనకు దగిన నీతులు నేర్పినట్టిది. శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, చంద్రుడు వీరందరు స్త్రీలోలురు కారా? యని ప్రశ్నించి

"వారికంతు హెచ్చైన నాడవారు!
నీకు గల బుద్ధి వారికి లేకపోయె,
నీవు నాటికి లేకపోయితివి గాక;
చేరి వారల మోజులు చెలుప లేవె!"

అక్కడికిని సారంగధరుఁడు జాయించె కరగక పోయెను. "అనుప యుసురుమన్న కొఱగాను సుమీ" అని బెదరింప మొదలిడెను. బుజ్జగింపులకు, ప్రార్థనలకు, బలవంతమునకు లొంగనివాఁ డిప్పుడీ బెదరింపులకు వెఱచునా! సారంగధరుని వస్త్రము చేపట్టికొని పెనుగులాడ, వాఁడు వస్త్రము నామె చేతనే వదలి వెడలిపోయెను.

"అంత చిత్రాంగి మదన బాణాగ్ని వేగి
హస్తగతమైన సొమ్ము పోనాడుకొన్న
కరణి బరితాప మొందెఁ దా సరణి నైనఁ
దెలుతు సారంగధరు నింక సిద్ధ మనుచు"
రాజరాకకై వేచియుండెను.

రాజు అరణ్యములో చిత్రాంగిని తలచికొని "అక్కట యేమి సేయుదు... చక్కని ముద్దుగుమ్మ! నా చక్కెర బొమ్మ! జాడ కిటు సైపఁజాల వియోగ వేదన" అని విరహతాప మొందుచున్నాఁడు. "చక్కెరబొమ్మ!" ఇట్టి తియ్యనిమాటను ఆంధ్రవాఙ్మయమం దెవ్వరును ప్రయోగింపలేరు! ఇట్లు "చిత్రాంగీ లతాంగీ దిదృక్షా సదృక్షాతి జాగరూకరూక్షాత్ముండై" విరహవ్యథ నోర్వక వెంటనే యింటికి తెంచి యామెను దుఃఖితగా నెఱిఁగి పరిపరివిధములఁ బ్రార్థించియుఁ బ్రత్యుత్తరము గానక యిట్లు వెఱ్ఱియై ప్రలాపించెను.

శా. ఏమే! పల్కవు మోహనాంగి,
యిటు లేలేయల్క చిత్రాంగి ని
న్నేమంటిం గలకంఠి, నావలన
దప్పేమే యొయారీ మనో
నామీఁద దయ లేదటే చెలి,
నను న్మన్నింపవే కోమలీ
నీమాటల్ జవదాటు వాఁడనె
గదనే నీరేజపత్రేక్షణా.

ఇట్లు నమ్రుడైన పతిని మతిమంతఁ బ్రేరేపించుచున్నగా సారంగధరుఁడు తనను బలిమిపై గవిసెనని చిత్రాంగి వర్ణించి వర్ణించి రాజు తలకెక్కునట్లుగా నిక్కమగా నగపడునట్లుగా నిరూపించెను. అంతియగాను తటాలున రాజు చేతి ఖడ్గము నొఱనుండి లాగి తన గొంతుకపైన బెట్టి యాత్మహత్య చేసుకొనఁ బోవునట్లు నటించెను. రాజు మాటలు విని, సారంగధరుని పట్టుపుట్టము చూచి, చిత్రాంగి యొక్క పరితాపమును జూచి భరింపలేక పోయెను. కొడుకు మీది ప్రేమ యంతయు మఱచెను. నేరము విచారించుటకు సభను బిలిపించెను. [సిరంపశాధి కాముల వలె కాక యీ కామాంధుఁడు యింతయైన చేయుట విశేషమే]

అంత సభ్యులును ఉభయ పక్షముల విచారించి, సారంగధరుని నేరస్థునిగా నెంచి, విజ్ఞానేశ్వరమును జూచి కాళ్లు సేతులు గోయుటయే దీనికిఁ దగిన శిక్షయని విధించిరి. [రాజనరేంద్రుని కాలములో విజ్ఞానేశ్వరమే ముఖ్యమగు న్యాయగ్రంథముగా నుండెనేమో!] రత్నాంగి యీ సంగతి విని చాల శోకించెను. చిత్రాంగితోఁ గొంత వాదులాడెను. రాజు కఠినుడై యేమాత్రము క్షమింపఁడు. రత్నాంగి తనకొడుకు వలన యదార్థము తెలిసికొని కుమారుఁడు నిర్దోషుఁడైనను నిట్టి యాపదకు లోనయ్యెనని పరితాపము పొందెను. సారంగధరుఁ డన్యాయముగా శిక్షితుఁడైనను కించిత్తుకూడ రాజును గాని, చిత్రాంగిని గాని దూరఁడు. మిక్కిలి తల్లితో నిట్లు విన్నవించుకొనెను.

చ. అడలకుమమ్మ నీవు, కలనైనను
రాజును దూఱకుమ్మ యే

యెడల సపత్నితో జెలిమి
యించుక తప్పకు వమ్మ నాదు సం
గడిఁ జరియించు నాదు చెలి
కాండ్రను నానలె జూడవమ్మ యిం
పడసగ నన్నిక న్మఱనవమ్మ
విచారము మాని మానినీ.

సారంగధరుడు తాను కాళ్లు నేతులు గోలుపోయి యత్యంతము బాధపడి విలపించు నపుడైనను చిత్రాంగిని గాని, తండ్రిని గాని యొకతూరి యైనను దూరడు.

చిత్రాంగి యిట్లు కాదు. అయమ్మ శీలమును సచివులు సంశయించి యదార్థము దెలుపుమని యడుగ

"తొయ్యలి యాంచక యాంచక
పయ్యెదగొంగును బటానబయలుగఁ జేసె"

తుద కాకాశవాణి యడవిలో బల్కినపల్కులను తలారులు రాజుతో విన్నవింప, రాజామెను నిజము చెప్పుమని బెదరించి యడుగ, నించుక యైనఁ జలియించక యా గట్టువాయి యిట్లనిపలికె"

చ॥ తెలిసితి హా! యిదంతయును
దేవర పట్టపు దేవికై తవం
బలసుతు పాడిఁ దప్పినను
నాజ్ఞ యొనర్పఁగ లంచమిచ్చి వే
పిలిచి తలార్ల చేత నని
పించిన దిట్టుల నీ కువాళు:
డెలియక వెఱ్ఱి రాజ! యిది
లెస్స నిజంబని నమ్మినాడవే!

చిత్రాంగి తుదకు నిందితయై గోతిలో త్రోయబడియె. సారంగధరు డొక సిద్ధుని యౌషధ క్రియచే "గుణము" పొంది సర్వసంగ పరిత్యాగియైన సన్యాసి యయ్యెను.

ఇది చిత్రాంగీ సారంగధరుల మానసిక తత్త్వభేదము. మొదటి నుండియు నొకరిది కేవల యాధిభౌతిక బుద్ధిగను మఱియొకరిది యాధ్యాత్మికముగను నిరూపింపబడినది. వీరి కథ చరిత్రయందెచ్చటను లేదని స్పష్టముగా జెప్పవచ్చును. అట్టితఱి యిది కేవలము చేమకూరవాని కల్పన తప్ప యింకొకరిది కాదు. ఇతఁడే యీ కథను మొదట వ్రాసినవాడు. ఎలకూచి బాలసరస్వతియు, అప్పకవియు తర్వాతవిన్నారు. మఱియు కూచిమంచి తిమ్మకవి పూర్తిగా మన చేమకూర వేంకటకవిని దన ద్విపద కావ్యములో ననుకరించి యున్నాడు. బాణాల శంభుదాసు కూడ తర్వాతివాడు. తన ద్విపద సారంగధరలో.

"భువిలోన సారంగ భూవరు చరిత
కవితా మహత్త్వంబుగల చేమకూర
అప్పన్న చెప్పిన యాప్రకారమున
జెప్పితి బాణాల శంభుదాసుడను"

అని వ్రాసెచ్చినాడు. చేమకూర వెంకటపతిని చేమకూర వేంకటప్పయని కూడ పిలుచుచుండినట్లే చేమకూర అప్పన్న అను పదము నుండి వెల్లడి యగును. అధునిక కాలములో కీ. శే. ధర్మవరము కృష్ణమాచార్యులీ కథను విషాదాంతముతో ముగించుట తప్ప తక్కిన యాంశము లలో—శైలిలో గూడ—నీ చేమకూర కవినే యనుకరించెను.

"ఈ వేంకటకవి శూద్రుఁడనియు తంజావూరి రఘునాథ నృపుని సభలో క్రీ. శ. ౧౬౩౦ సం. ప్రాంతమందిప్పుడు విలసిల్లుచుండెననియు చరిత్ర శోధనల వలన నెఱుకపడుచున్నది" అని వేంకటరాయ శాస్త్రిగారు వ్రాసిరి. ఏ చరిత్ర శోధనవలన నితడు శూద్రుఁడని వెల్లడియయ్యెనో తెలుపలేము. వేంకటకవి యాశ్వాసాంతమందు తనను "లక్ష్మణామాత్య తనూభవ" యని సంబోధించు

గొనినాడు. అమాత్య శబ్దముచే నితడు నియోగిగా నుండ నొప్పు అని యనుమానము.

ఈ కవి యాంధ్రవాఙ్మయ క్షీణకాలములో నుండినవాఁడు. పౌరాణికుల కాలము దాటియుండెను. తర్జుమాలు తక్కువయ్యెను. మహాసామ్రాజ్యము లంతరించియుండెను. మహమ్మదీయ పరిపాలనము సంపూర్ణవికాసమునుండెను. చిన్న చిన్న రాజులు విశేషముగా భోగైకలాలసులై యుండిరి. ప్రబంధములే విశేషముగా రచింపబడుచుండెను. అవియు శృంగార ప్రధానములుగా నుండెను. వాని శైలి విశేషముగా శబ్దాలంకారములతో నుండెను. భావవిలసనము తక్కువ. శబ్దాడంబర మెక్కువ. అట్టి కాలమందు జీవించిన మన కవియు నా కాలపు సాంప్రదాయము వలలలోఁ గొంతవఱకు జిక్కియుండెను. శృంగారమును నితరులతోఁ బాటిగ నింతు ప్రధానముగా నుంచికొని వ్రాసెను. కాని వారి వలె పిచ్చిగా వ్రాయలేదు. "విజయవిలాస"మందు కొంచెము కల్లియున్న జాలి విడిచెను గాని "సారంగధర"లో మాత్రము నిగ్రహించియుండెను. ఇందు పురవర్ణనమే లేదు. రాజనరేంద్రుని డాంధ్రుడేనో కాదో? ఇతడు "మాళవపతి" అడవిలో చిత్రాంగిని దలఁచుకొని

"అక్కట నేమి సేయుదు, ర
యంబున నిప్పుడె బోదు నంటివా
మిక్కిలి దూర దేశము, స
మీపమె? మాళవభూమి యుండలం
బెక్కడ? దండకావనమి
దెక్కడ? "

అని విలపించినాఁడు.

కావున నితని ముఖ్య పట్టణము రాజమహేంద్రవరము అని నిశ్చయింపలేము. కావున నీ కథ కేవల కల్పితముగనే మా. సారంగధరలో నితర కవులరీతి సంభోగవర్ణన శ్రవణము నుండి పాఠకులను రక్షించినాఁడు. ఇందు నాయికావర్ణన మితరకవులు చేసినట్లు

పదనఖపర్యంతముగా వర్ణింప బడలేదు. చిత్రాంగియొక్క వర్ణన రాజరాజు ప్రార్థించినప్పుడు, చిత్రాంగి సారంగధరునకు దన నిట్లు వర్ణించి గవిసెనని చెప్పునప్పుడును సందర్భానుసారముగ గనుపించును. గాని నా వర్ణనను బట్టి యామె యుట్టిదై యుండి యుండునని భావింప శక్యము కాదు. అటుగాక సారంగధరుడు చక్కగా జిత్రింపబడియున్నాడు. ఇతడు మోహనాకారుడు, చక్కని ముక్కు గలవాడు, నగు మోము కలవాడు ఎగు బుజాల వాడు ఇంతియేగాదు

ఉ. తీరుగ మల్చివేసిన గతిన్ దొడ
లున్నవి; ఱొమ్ములోని వి
స్తారము చెప్పరాదు బలుద
ల్పు, నపల్పుచు, బాలుగా ఉనా
రా?, మొగమ్ము చక్కదన మ
న్ని యటుండనిమ్ము వీని చె
య్యాగమె లక్షసేయు నహహా
యనుచున్ దలయూచు సారెకున్.

ఇది చిత్రాంగి దోచిన రూపము.

ఇఁక రత్నాంగికి వర్ణన బొత్తిగా లేనేలేదు. సారంగధరుని భార్య నొకే పద్యమున వర్ణించి కవి యామెను ప్రక్కకుఁ ద్రోసిపుచ్చెను. ఇక రాజనరేంద్రుఁ డెట్టివాఁడో, వృద్ధుఁడో, కాఁడో యేమాత్రముఁ దెలియదు.

ఇక మన కవిశైలి యెట్టిదో కనుగొందము. ఇతని శైలి మృదు మధురమై పటుత్వముతోఁ గూడినట్టిది. పద్యముల నడక ధారాళముగా జదువుట కింపుగా నున్నది. కవి యేదేశము వాఁడో మనకుఁ దెలియదు. తెంజావూరులోని రాజు నాశ్రయించినంత మాత్రాన తెంజావూరి వాఁడనుటకు వీలులేదు. ఒక్కొక్క మండలమున నొక విధమగు భాష యుండును. కవి యెట్టివాఁడైనను దన మండలములోని పదములఁ దప్పక ప్రయోగించుట ప్రతి వానికిని సహజము. ఈ కవి వాడిన కొన్ని పదము లనుమానింపఁదగినవి. "తటకాపడి (తట్టుకపడి–గ్రామ్య

ము; కస్తి [ వ్రతము], యెదపము [భయపడు]; జాణుగు [నుసులు]; కమలీలు [కమతగాండ్రు; జీతగాండ్రు]; కువాళము [పవ్వాడము [గామ్యము]; బెదరించు [భయ పెట్టు]; ఎలుగు గొడ్డు [ఎలుగు బంట్లు]; మున్నగు నీ పద ములు విశేషముగా కర్నూలు కడప మండలములలో నేటికిని సామాన్యముగా వాడుకలో నున్నవి గావున నీక వియు నీ మండలముల వాఁడై జీవనార్థము తంజాపూరు రాజు నాశ్రయించి యుండి యుండునని యూహించు చున్నాము.

ఇక్కడి భావములు చాల సుందరమైనవి. సారం గధరలోఁ గొన్ని యుపమానము లెవ్వరును బ్రయోగింప నట్టివై యున్నవి. రెండుదహరించెద.

"ఉమ్మెత్తపూవంటి యొఱపైన కుచ్చెళ్ల
చెఱఁగు మట్టెలమీఁద చిందుద్రొక్క"
"మంగలంబునం బెటిలిన పేలగింజవలె మిక్కిలిపుత్ర
వియోగ బాధ నట్టిటుపడి"

పావురము నాకసమున నెగురవైచి యది వియత్తల మందు విహరించుట నిట్లు వర్ణించి యున్నాడు.

"సౌధ కేతన పటాంచల వాత ధూత ని
ర్గతగాంగ డిండీర ఖండ మనగ
సితమాని పూర్వానసిత ఘాపున ద్విద్వ
ఘగ తేంద్ర గ ఱత్యాంత మనఁగ
నవహార సంఘట్ట నగ్రస్త పతమాళు
గగనలక్ష్మీమా క్తికంబనంగ
మధ్యందినానంత మణిలూనమం దేహ
సంత్యక్త బిరుద శంఖమనఁగ

గీ. పంకరుహ సంభవ కళత్ర పత్త్రపుత్త్ర
సుకకుల ధురీణ కంఖాణ కరికృపాణ
రమ్య ధావళ్యజైత్ర పారావతంబు
రాఁదొడఁగెఁ జుక్క దెగిపడ్డ క్రమమదోప"

ఇది యీకవి వతంసుని సంస్కృత భాషా ప్రౌ తయుఁ జాటుచున్నది.

ఇక్కడి కి శ్లేషలు యమకాలంకారములు, అను ప్రాసలు చాల యిష్టమైనట్లు తోచుచున్నది. రమ్య ముగా వర్ణించుచు వర్ణించుచు నేదైన నొకపదము వాద రము చేసికొని దాని ధ్వనియందే మగ్నుఁడై తప్పటుగా రిని బోఁదొడఁగును. శబ్దాలంకారము లీతని కిష్టమని చూ పుట కొక్క యుదాహరణ మిచ్చెదను.

అ. ఔర! వీని మోహనాకార రేఖ వే
మాఱుమూఱు హరిసుమారమారు
వెలిదమ్మితొగల వీనికంనోయి తీసు
రేపుమాపు బావు! రేపుమాపు.

ఈ గ్రంథమందు ముఖ్యముగా జూడఁదగిన వ ర్ణనలివి. రాజనరేంద్రుని సంతానచింత, సారంగధరుని బాల్యము, పావురములాట, చిత్రాంగీ రత్నాంగీ సంవా దము మున్నగునవి.

ఈ చరిత్రమునకు నాయికానాయకులగు చిత్రాంగీ సారంగధరుల గుణశీలముల పోషణౌచిత్యము గూ ర్పదగినట్టిది. ముఖ్యముగా సాత్త్విక శక్తిచే, పవిత్ర జీవితముచే, సత్యనిష్ఠచే, నెల్లమనంబులు రంజిల్లునట్లుగా సారంగధర పాత్రము సృష్టించిన చేమకూర వేం కటకవి యొక్క కవిత్వమహత్త్వము వేవిధముల శ్లాఘ్య మైనది



# ఆంధ్ర ప్రబోధము

వి. కె. నందూరి

సర్వ సర్వంసహా చక్రంబు పాలించి
చనినట్టి రాజుల జన్మభూమి
మందుకైనను స్వార్థమను మాటెఱుంగని
ధరణీసురులకన్న ధన్యచరిత
జాతీయ విభవ కోశాధ్యక్షులౌ ధర్మ
రతుల వైశ్యులకన్న రత్నగర్భ
స్వీయ రక్తమున తల్లి యశంబు నిల్పగ
మడసిన వీరుల మాతృభూమి

దారుణ పరాభవాగ్ని దందహ్యమాన
శిథిల దుఃఖిత హృదయమై ఓవుకుచుంట
తలపునకు తెండు ఆంధ్రులు వెలికిరండు
రండు ధర్మార్ధ రక్షణార్థంబులెండు.

మన జన్మభూమిలో మనకే స్వతంత్రంబు
సున్న యింకేల నీ క్షుద్ర బ్రతుకు
మన మాతృభూమిలో మన సౌఖ్యమను మాట
వినరాదు కనరాదు వెదకరాదు,
మన దేశమందున మనమె పశులభంగి
పడియుంటు దుర్భర పాటుగలిగె
మన తల్లి సంపద ల్మనమె యన్యులకిచ్చి
క్షుద్బాధ చేచిక్కి గ్రుక్కనేల?

మనదు దౌర్భాగ్య దశకును మనమె కాని
కారణము పరుల బలంబు కాదటంచు

తలపునకు తెండు ఆంధ్రులు వెలికిరండు
రండు ధర్మార్థ రక్షణార్థంబు లెండు.

స్వర్లోక నాథునే నిర్లక్ష్య మొనరించి
వెలసిన కృష్ణరాయల సుకీర్తి
పసిపాపలును కూడ నసిదాల్చు బొబ్బిలి
వీరబెబ్బులులదౌ పౌరుషంబు
స్వారాష్ట్ర జయకాంక్షతో రణనిహతుడౌ
ఖడ్గతిక్కనసి కార్యదీక్ష
బందిగా ఢిల్లీశు పట్టితెచ్చిన మహా
మంత్రి యుగంధరు తంత్రప్రతిభ

రణమునకు చొచ్చి యుసురుల సరణమిచ్చి
చన్నబాలనాయనుని యుత్సాహశక్తి
తలపునకు తెండు ఆంధ్రులు వెలికిరండు
రండు ధర్మార్థ రక్షణార్థంబు లెండు.

పరప్రభుత్వము క్రింద భ్రష్టమై ధ్వంసమై
దేశంబు. దాస్యంపు సితిని లేదె?
ఆత్మరక్షణకైన ఆయుధంబులు లేక
పడియుండగా నేల బ్రతుకనేల?
స్వాతంత్ర్య నిజమతాచార విద్రోహమా
చదువేమి మనకేమి స్వర్గమిచ్చు?
పరభూములందు దుర్భర పరాభవముల
భ్రాతృజనులు వ్యధబడుట లేదె;

తొలి మహోన్నతదశ నేటి తుచ్ఛదశ ని
కృష్టదశ మహా నిర్భాగ్య నిష్ఠురదశ,
తలపునకు తెండు ఆంధ్రులు వెలికిరండు
రండు ధర్మార్థ రక్షణార్థంబు లెండు.

రాఘవేంద్రుని నాటి రాక్షసరాజ్య ని
ర్మూల నాగ్రహశిఖ లో గలుగునేని
భారత కథనాటి భారతీయులరక్త
మింక మీలో ప్రవహించునేని
పరశురామునివోలె పగతుఁ గుండెల
నిద్రింప ధైర్యంబు నెగడునేని
ప్రహ్లాదు నాటి ధర్మాను రక్తత జీవ
ములకు క్రమ్మర నియ్యఁ జాలునేని

ఆత్మరాజ్యంబు పడయంగ ఆత్మజనని
తల్లడము మాన్ప మీదు కర్తవ్యమేమొ
తలపునకు తెండు ఆంధ్రులు వెలికిరండు
రండు ధర్మార్థరక్షణార్థంబులెండు.






## ఒకదృశ్యము

'ఆత్రేయ'

(సికందర్ లోడీ దర్బారు. రాజా తన రత్నఖచిత సింహాసనంపై కూర్చున్నాడు. చుట్టూ మంత్రులూ, సామంత రాజులూ కూర్చున్నారు)

సికందరు: ఖాజీగారూ, మా యభిప్రాయంలో దేశం బాగుపడాలంటే, దానికి స్థాయి కలగాలంటే ప్రజలకు మత స్వాతంత్ర్యం యిచ్చి తీరాలిసిందే. ఏమంటారు? మీ వాదమేమి?

ఖాజీ: నావాదం ప్రభువుగారి అభిప్రాయానికి వ్యతిరేకంగా ఉన్నందుకు క్షమించాలి. ఏ స్వాతంత్ర్యం దేవరవారి మతాన్నే మంటగలుప సిద్ధంగా నున్నదో అట్టి స్వాతంత్ర్యాన్ని నీళ్లుపోసి పెంచుట అనుచితం. మన గొడ్డలితో మన కాళ్లు నరికివేసికొనడమే. తురకలందరూ ఆ కాఫర్ చేష్టలను నిరసిస్తున్నారు. తురక రూపంలో నున్న ఆ హిందూ గొప్పద్రోహి. మనమతాన్నరిష్టాల పాలు చేయ నుద్యుక్తుడైన కలుషాత్ముడు.

సికం: ఏమీ? అట్టివాడా? ఐతే ద్రోహికి తగినశిక్ష విధించాలిసిందే. వాని మదాన్నణచాలిసిందే.

ఖాజీ: మహాప్రభో! అట్లు జరుగాలిసిందే. ఖుదా భక్తు లందరినీ రక్షించినట్లౌతుంది. అంధకారంలో పడి పోతున్న వారికి కాంతి ప్రసాదించినట్లౌతుంది.

(పోలీసు అధికారొకడు ప్రవేశిస్తాడు)

పోలీ: దేవరవారి యాజ్ఞా ప్రకారం మతద్రోహి తేబడినాడు.

సికం: ఇటుతీసుకొనిరా. (అధికారి వెళ్లును. సంకెలలో బంధింపబడిన కబీరును తీసుకొని వచ్చును)

ఖాజీ: ప్రభో! చూస్తున్నారా, ఈ ద్రోహి ప్రవర్తన? అమిత గర్వంలో యెట్లు మునిగి తేలుతున్నాడో. దేవరవారికి జోహారు లేదు. గౌరవించుట లేదు. ఇట్టివానినుండనిచ్చుట పామును పెంచినట్లే.

సికం: కబీరు, నీవు తురకవై హిందువుల రాముణ్ణి జపిస్తున్నావని వదంతి పుట్టింది. అది నిజమేనా?

కబీ: ఐతే, తాము రాముడు తురకల శత్రువని తలస్తున్నారా?

సికం: ఖాజీగారూ, ఖురాన్ షరీఫీ సంశయానికట్టి జవాబు నిచ్చును?

ఖాజీ: మతద్రోహము. మరేమి కాదు. ముసల్మానుల ఖుదా రహీమ్ కాని రాముడు కాడు. ఎక్కడీ కుర్రతని ప్రలాపము, ఎక్కడ ఖుదాజనిత గ్రంథము!

కబీ: అహహహ! ఎక్కడి సంకుచిత వితర్కము! రహీము రాముల విభేదమేమి? ప్రపంచ మతాల కన్నిటికీ పునాదియైనవాడొకడే. అతడు తప్ప యితర దైవము మరొకటిలేదు. అతన్ని రాముడన్న నేమి, రహీమన్న నేమి. నా రాముడు హిందువు కాడు, మా రహీం తురక కాడు. మన సంకుచిత మతసృష్టి కాతడతీతుడు. అతనికి మూర్తిపూజా నిర్బంధములు లేవు. నమాజు పఠించే ప్రతిబంధాలూ లేవు. ఈ భేదాలన్నీ మన పిచ్చివలన పుట్టినట్టివే.

రాకుం: హుజూర్, వింటున్నారా, ఈ నోమువుబోతు ప్రసంగాలు? చాందసిద్ధమైన ముసలి(మ)చ్చు నోట పెట్టి అపచారం జరుగుతున్నది! సాదుదిబ్బల్లో పార్లే పాషండమెక్కడ, ప్రభావయుక్తుడు పరుసవేది ఎక్కడ? మినుకు మినుకుమనుమిణుగురుపురుగెక్కడ, తళతళలాడే తారకాగణమెక్కడ? ఎంత భేదము? ఎంత తారతమ్యము?

సికం: ఒరే, కబీర్, ఏమిటా గర్వపు ప్రేలాపాలు? ఎందుకు మృత్యువు నాహ్వానిస్తున్నావు. రామ రహీముల నొక తక్కెట్లో జోకుతున్నావు.

ఖాజీ: పవిత్రమైన ఖుదానుద్దేశించి ఇట్టి ప్రసంగాలు చేస్తున్నాడు.

కబీ: నేనేం తప్పంటున్నానో తెలియుటలేదు. హిందూ మహమ్మదీయు లొకడే శిల్పియొక్క రెండు నిర్మాణాలు. ఒకడే చిత్రకారుని రెండు చిత్రాలు.

సికం: ఇద్దరొకటే అయితే నీవు రహీము నేయెందుకు భజింపకున్నావు? ముసల్మానుని గనే ముక్తి పొందరాదా?

కబీ: మళ్లీ తామ భేదభావాన్నే తలస్తున్నారు. ఈ భిన్న మార్గాలను చూపించింది అజ్ఞానం తప్ప మరొకటికాదు. మనమందరం ఒకే స్థలంనుండొచ్చినాం. తిరిగ దేస్థలానికి వెళ్లిపోతాం. అన్ని జీవాల్లో ఉన్నట్టి దివ్యకళ ఒకటే. రాముడు, రహీము ఒకడే. కృష్ణుడు కరీమ్ ఒకడే.

ఖాజీ: ద్రోహం, ద్రోహం. ఈ వితండ వాదం విన్నవాండ్లు కాఫర్లై పోతారు. పాపాల పాలౌతారు.

కబీ: ఖాజీగారూ, మీలో ఉప్పొంగుతున్న పక్షపాత విషాన్ని కొంత అదిమి పట్టి చూస్తే యీ ద్వైత భావం అదృశ్యమై పోతుంది. సముద్రంలోని జలబిందువును, దానిపక్కన ప్రవహించే నదికి కాలువ యందలి నీటిచుక్కను చూస్తే మీతో పుట్టిన భేదభావం అంతర్ధానమౌతుంది.

ఖాజీ: హుజూర్, వింటుబోతున్న కొద్దీ, యీ కాఫర్ ప్రవర్తన పెరిగిపోతున్నది. ఈతడు కాకిని హంసను ఏకం చేయ ప్రయత్నిస్తున్నాడు. వంగచెక్కను శ్రీచందనముని మాయలు కల్పిస్తున్నాడు.

కబీ: అది మాయయే ఔగాక! మీ శాసనాల ప్రకారం ద్రోహమే ఔగాక! నేను భేదాన్ని పాటించే వాణ్ణి కాలేను. మహాత్ముకి నమ్మినవాడను కాజాలను. మీరు రాముడనుడు, రహీమనుడు, విష్ణువనుడు, రసూలనుడు, వేదము పఠించుడు, ఖురానును జపించుడు, అంతా ఒకటే! సర్వం ఏక బ్రహ్మమయమే. ఒకని ముఖాన నుండి వెళ్లిన వివిధ స్వరాలే.

సికం: రాముని గీతాలాలాపించితే నీకు ముక్తి దొరుకునను నమ్మకం ఉన్నదా?

కబీ: నోటినుండన్నంత మాత్రాన ముక్తెక్కడినుండొచ్చి పడుతుంది? 'అన్నం' అన్నంతలో ఆకలి తీరితే యేముండె! గంగాస్నానం చేసినంతన పాపాలన్నీ నశించిపోతే ఇంకేముండె!

"తెలియసాధ్యమా నెంతవారలకు
ఈషణాత్రయ దోషాతీతుని
సృష్టి స్థితి లయకారణభూతుని తెలియ
ఆది మధ్యాంతర రహితుని అనంతుని
నేన వేదాంతర వేద్యుని దేవుని తెలియ"

సికం: నీ రాముని గురించి యింత స్తోత్రం చేస్తున్నావు, ఆత న్నిప్పుడు చూపించ గలవా?

ఖాజీ: రహీమ్‌పై కక్ష కట్టినవాడు, రాముణ్ణి తప్పక చూపించవచ్చు.

కబీ: రాముని చూచినాను కానిప్పు డాదళ అంతరించింది. పంచదార నీటిలో కలిసి నీరైపోయింది. కీటకం భ్రమర నాదంలో లీనమై భ్రమరమై పరిణమించింది. కబీరు, రాముడు ఒకడే ఐనారు, ఇక రాముణ్ణి చూపేదెట్లు?

ఖాజీ: చూచినట్లాతే యిప్పుడు చూపించ వెందుకు?

కబీ: తమ్ముడూ, దెబ్బతగిలిన వానికే నొప్పిసంగతి తెలుసు. దెబ్బతినని వానికి నొప్పిసంగతి చెప్పమంటే ఏంచెప్ప కలుగుతాం? రాముని నామం ఉచ్చారము చేయటం కూడా పాపమను కొనే నీకు నేను రాము నెటుల చూపగలను? ఐనా నాప్రయత్నానికి లోపముండ కూడదు. అదుగో ఆమేఘాలలో జలరూపంగా మనను చూస్తున్నాడు, చూడు, రాముడు? ఆ ఉరుములలో మెరిసి పోతున్నాడు, చూడు, రాముడు? అహాహ, మన మాఘ్రాణించాలని వాసన రూపంగా ఆ సుకుమార కుసుమాలలో దాగున్నాడు చూడు రాముడు? మన మానందించాలని తుషార రూపంగా తాండవ మాడుతున్నాడు చూడు రాముడు? వీణాంతేత్రుల నుండి స్వరరూపంగా వెల్లి మన శ్రవణ పుటల ప్రతిధ్వనింప జేయుచున్నాడు చూడు రాముడు? చూస్తున్నావా?

ఖాజీ: ప్రభో, ద్రోహం మితిమీరి పోతున్నది. ఈ ద్రోహం సామాన్యమైనది కాదు. అల్లానుండి విముఖుడై పోవుటయే అతడు బోధచేయుట లేదు. అద్రోహాన్ని దేవరవారు క్షమించినా క్షమించవచ్చు. స్వామిద్రోహం చేసేవాడు రాజనీతి ప్రకారంగా దేశంలో ఉంచదగినవాడు కాడు. మీ మాటలకు తలవంచని వానిపై యింకా కనికరం చూపాలిసిందేనా?

మంత్రి: ఎందుకు, కబీర్. నీవు రాజును గౌరవింప వెందుకు?

కబీ: నే పలువురి సేవ యెట్లు చేయగలను? రాముని దాసుణ్ణై పోయినాను. అల్లా యొక్క గానంచేయాలా? రాజాయొక్క స్తుతి చేయవలయునా? అఖండంగా ప్రవహించే ధారను అవకట్టెట్లు కట్టాలె? రాముని లో అగ్నమైన మనస్సును రాజుకై యెట్లు పంచి పెట్టాలె?

ఖాజీ: చూడబోతే నీ ప్రతిరోమంలో ద్రోహం పొంగి పొర్లు తున్నట్లున్నది.

కబీ: దైవ భక్తునికి ద్రోహంతో నేమి సంబంధం!

ఖాజీ: ఏమీ, నీవు కాఫరువు కావూ?

కబీ: ఎవని హృదయములో దయాదాక్షిణ్యములు శూన్యములో ఆతడు కాఫరు. ఎవ డితరులను చూచి సహింపలేడో వాడు కాఫరు. అబలల బాధించు వాడు కాఫరు. శిష్టుల పీడించువాడు కాఫరు. దుష్టుల కప్పిపెట్టువాడు కాఫరు. దీనుల రక్తము ను నీటివలె పీల్చువాడు ఆతడు దుర్మార్గుడు!

సికం: కబీర్, నీకిష్టమున్న నీవు చేయవచ్చు, కాని నిలకడ మనస్సుల నెందుకు చెడకొట్టుతున్నావు? నీవు రహీము రాము డనడమే కాక తురకవాండ్లకు హిందూమత బోధ చేస్తు వున్నావని కూడా వింటున్నాం.

కబీ: నేనెవరితో నేమీ అనను. ముక్తి మార్గ కమలము వెదజల్లుటమే నాపని. హంసలైనా చూస్తే ఏరుకొని తింటావి. కాకులు వానిని రాళ్లని యెంచుకొని యెరిగి పోతాయి. హంసలు యేరుకొంటున్నావని నాకు సంతోషం కలుగదు. కాకులు లేచిపోయెనని చింతయుండదు. వాని చర్యలలో నాకెట్టి సంబంధమూ లేదు.

సికం: నీ నోటి నుండి వెళ్ళే మాటలన్నీ తప్పులోనే మాపించేవే కనబడుతున్నాయి.

కబీ: నేనెంత, నా మాటలెంత? నా పుట్టుకతో ఆల పించుచున్న గీతాలను నేనిప్పుడూ ఆలపించుచున్నాను. నా తుతికలో ప్రాణముండువరకూ ఆలపించుచుండెదను. ప్రతి ఆత్మయు ఆ పరమాత్మ సంజనితములే యని పాడుదును, నేనందులకే జన్మిస్తిని. అది నెరవేర్చి వెళ్ళెదను.

సికం: ఐతే నీ ఉద్దేశ్యాన్ని నీవు నెరవేర్చుకో గలవా?

కబీ: రాముని కిష్టముంటే అదెంతటి కార్యం?

ఖాజీ: అరే పోకిరి సాలెవాడా, ప్రభువుగారి అనుగ్రహం అవసరముంటే యీ కూతలను మానివేయి. లేకపోతే...

కబీ: బంగారు, బంగారునగను, ఒకటే అని అనుట నేరమా? ఇదే నా ద్రోహం? ఇదేనా మీ న్యాయం?

ఖాజీ: నీ మతం రాజుగారి నమ్మకానికి వ్యతిరేకమైనది.

కబీ: ఐతే రాజుయొక్క నమ్మకం బుద్బుద ప్రాయమైనది. సన్నని గాలి వీచినా పగిలిపోతుంది.

ఖాజీ: ప్రభో వింటున్నారా, ఎంతకైనను సాహసించుచున్నాడు.

సికం: శిక్షార్హుడు.

ఖాజీ: వేర్లతో నరికి వేయాలె, అతడూ అతని ద్రోహ ప్రలాపాలూ ఒకటేసారి అదృశ్యమై పోతాయి.

మంత్రి: ఈతని కంఠచ్ఛేదనకై ఫర్మాన్ కావలెను.

సికం: ఈతన్ని ప్రవాహంలో ముంచండని మాయాజ్ఞ.

కబీ: నన్ను ముంచి మీరు కబీరును చంపగలరా? ఆతనిని చంపి అల్లాను పొందగలరా?

"తానఖిల సూత్రధారుడిల, నజ్ఞానంబను
మాయను కల్పించుట,
దానన జనన మరణ భేదంబులు,
దానన ప్రళయ కల్లోలంబులు
దానన సుష్ఠ్రదవతార ధారణము
గాన చైతన్య లీలా ప్రకల్పితానుశోధ
సృష్టి సంతానమునం,
పిపీలికాది బ్రహ్మను పర్యంతము
నీ నిరుపమాన నిరంజన నిర్వికార
నిజదవతార సందర్శనమున
గనతమంబునై, విన నమోఘమై. కన
నపారమై, చన నతీతమై
మాని జనులకు, దేవ ఎరులకు,
ననిశము చింతననర్చన పదసేవ
చేసియు, ...... తెలియ.



# అధఃపతనము

పెనుమర్తి వేంకటరత్నము

వా దేలోకము నేలవచ్చితి, మహామాయా చమత్కార వి
ద్యాదాక్షమ్ముగలట్టి వీరియెడ కాశ్మజ్ఞాని నానందమూ
పాదిత్యాంశు నిరస్తకల్మషు నిరీహామూర్తి నీలీల మా
యాదార్భాగ్యవు వాగుగంబాదవి రాహా! వీరి సామర్థ్యముల్.

ఏ వనవాటిలోననో, మహీరుడనంతర సాంధ్యర మా
శావధిలోననో, మలకలై దిగువాగుల వారుణీకుసుం
భా విలసజ్జపాగుణిమఁ బాటలితంబగు సృష్టిజీవికా
భావనఁ బొద్దుపుచ్చునను పంటిని త్రాళ్ల బిగించు టేలనో?

ఆలోకమ్మదిమాడి, మాధురశయ్యల్, దివ్యశైవాలినీ
వేలా సైకతవేదులచ్చటనె దైవీవాగ్విశంభూత ర
మ్యాలాపమ్ములఁ గిన్నరీతతి రసోద్యన్నవ్య గాంధార గీ
తాళుల్ మాకడ నభ్యసింతురు! దవీయంబయ్యె నీనాటికిన్.

ప్రాము హరదృష్టకర్మ నాదాము హవ్వ
బుంగఁ ద్రోసిన యా మహా భూతరాజు
ఆగమురచిన నన్నిపు డీ దురంత
దుఃఖపరీత భూమికిఁ ద్రోసినాడొ?

నాయవస్థ స్వర్గాద్భ్రష్టుఁడగు యయాతి
పోలె నున్నదీ శూన్య వనాలిలోన.



ఆంధ్రమహాసభవారు "నాట్యకళాప్రపూర్ణ" యని బిరుదొసంగి సన్మానించిన



శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారు, బి.ఎ., బి.ఎల్. బళ్లారి.



చంద్రికాంత ప్రెస్ గోలీగుడ, హైదాబాదు దక్కన్.



# మహమ్మదీయశిల్పము

"ఆత్రేయ"

శిల్పనిర్మాణము వివిధ కారణములబట్టి వివిధ మార్గముల నవలంబించు చుండును. సాధకములు, వాతావరణము, ఆచారములు, మతము, ప్రకృతి మొదలగు నన్నియు శిల్పమునందు ప్రతిబింబించు చుండును.

మహమ్మదీయులు హిందూస్థానమునందు ప్రవేశించినప్పుడు వారు శిల్పులను వెంట బెట్టుకొని రాలేదు. మహమ్మదీయ శిల్పమని తదుపరి పేరుపొందిన కొన్ని భావములనుమాత్రము తీసుకొని వచ్చిరి. ఈదేశమున వారు తమ నివాసముల నేర్పరుచుకొనిన పిదప తమ మసీదులను భవనములను నిర్మించుటకు హిందూ శిల్పుల నియమించిరి. వారా విధముగ కట్టింప సాగిన నిర్మాణములందు మహమ్మదీయ శిల్పకళ ప్రధానముగనే దృశ్యమగు చుండెను. పదునారవ శతాబ్దపు నిర్మాణములలో పారశీక శిల్పము స్పష్టపడు చున్నది. స్పష్టముగా గనుపడునట్టి గుంబదములును (Domes). నాజూకుగా నుండు నిర్మాణముల నిదర్శనములు. ఇస్లాము మతము యొక్క యేకేశ్వరోపదేశము, ఆశియా మధ్యభాగము, మరియు ఆగబస్థానము నందలి పాడు దిబ్బలును, యెడారులును, నిర్మాణ సాధకములు లేమియు, మహమ్మదీయులను నిరాడంబర శిల్పమును, విరుపులులేని గుంబదములను, ఉన్నతములగు స్తంభములను (మినారులను) ప్రేమించు నటుల నొనరించినవి. కాని అనేక దేవతల నారాధించు హిందువుల శిల్పము మహమ్మదీయుల శిల్పమునకు భిన్నముగా నుండెను. హిందూ శిల్పమునందు విశేషముగ నలంకారములును, చిక్కులును కానవచ్చును. వారి కోరికలకు తగిన సామగ్రి లభించు చుండెను. ఆ కారణముననే వారి శిల్పము అలంకార పూరితమై యుండును.

హిందూదేశము నాక్రమించుకొనిన మహమ్మదీయులు హిందూ శిల్ప నైపుణ్యమునకు వశులు కాకుండ నుండలేక పోయిరి. హిందూ శిల్పమునందలి అలంకారములు మహమ్మదీయ నిరాడంబర శిల్పమునందు చొరబడ జొచ్చెను. భవన నిర్మాణమును పరిసమానముగ నగుపడునట్లు చేయుట హిందువులు మహమ్మదీయులకు నేర్పిరి. భవనమునందలి వివిధ స్థలముల నెటుల విభజింప వలెనో చూపిరి. ఢిల్లీయందు ప్రతి మహమ్మదీయ రాజు యొక్క నిర్మాణములను. అక్కడి నిర్మాణముల శిల్పమును విమర్శనాదృష్టితో పరికించినచో మహమ్మదీయ శిల్పము యొక్క నైజము పూర్తిగ విశదమగును. ఢిల్లీ యందలి నిర్మాణములను నాలుగు భాగములలో విభజింప వచ్చును. మొదటి మూడు పతాన్ కళలని యనిపించుకొనును. నాల్గవది మొగలు కళ.

## మొదటి పఠాన్ శిల్ప విధానము:—

తురుష్కులు ప్రథమమున హిందూ దేశము ప్రవేశించినప్పుడు ఉన్నత భావసహితులై వచ్చిరి. కాని వానిని కార్యరూపము నొసంగు విధములు (models) వారికి తోచలేదు. వానిని దృశ్యములుగ చేయు ప్రతిభాశాలు లగు శిల్పులుకూడ వారివెంట లేకుండిరి. వారు తమ శిల్ప స్వప్నములకు నిజరూపము ప్రసాదించుటకై తమ యిచ్చ వచ్చినటుల యాలోచించుచు హిందూ శిల్పుల నియమించిరి. హిందూ దేవాలయ సామగ్రిని వారు తమ భవన నిర్మాణమున కుపయోగింప సాగిరి. హిందువులగు ఉప్పర వారిని (masons) తమ కమానుల (Arches) నిర్మించుటకై నిర్బంధపఱచి వారి నిర్మాణ విధానము ననుసరించుటకై స్వాతంత్ర్య మొసంగిరి.

సరిసమానముగ నున్న స్థలములం దలంకరించుటకై తమ ఉత్కృష్ట భావముల నుపయోగించి తుగ్గాలిపిని, జాలీపనిని (scroll work) సృష్టించిరి. ఈ విధముగ ప్రాత డిల్లీ నిర్మింప బడెను, దాని యందలి ఉన్నతములగు ముస్లిమ్ కమానులు, శిల్పమయములగు స్తంభములు (Cotonnades) స్పష్టముగ పరస్పర భేదమును వ్యక్తపరచును. కమానులకును, మినారులకు హిందూ శిల్ప సంస్కారము జరిగినదని ఒప్పుకొనక తప్పదు.

## రెండవ శిల్ప విధానము:—

డిల్లీ నిర్మాతలలో తుగ్లఖు రాజులు చాల శ్రోత్రియులు. (Puritans) నిజమగు ముస్లిమ్ కమానుల (arches) ను కోరుచుండెడివారు. కఠిన తరగతుల నిరాడంబరత్వమును వారి శిల్పములందు వెలిబుచ్చిరి. వారి శిల్ప విధానము రెండు విధములుగ కనబడును. మొదటి తొగ్లఖులు సాధారణముగ తమ శిల్పముల బహిర్భాగముల నిరాడంబరముగ నగుపరిచినను, వర్ణాలంకారమును, చలువ (మర్ మర్) రాతి యలంకారమును వదలలేదు. ఈ విధము యొక్క విశేషత్వమును వెల్లడి పఱచు నిరాలంకారములు గను, ఉన్నతము లును [illegible] గోడలు దృష్టాంతరములు. కాని తొగ్లఖురాజులలో ప్రసిద్ధి కెందిన ఫెరోజు షావా కాలమున వారి శిల్పవిధానము యిచ్చితముగ ననుభవమయమగు. అలంకార స్పర్శలేని గోడలును, జారుచున్నట్లగు పడుచున్న భవనములును, మోటుగా కట్టబడిన నిర్మాణములును, కృత్రిమపు రంగును మిశ్రమము చేసిన సున్నముతో కట్టబడిన రూపహీనములగు గుంబదములతోడను శిల్పములు బయలుదేర సాగెను. లోపలి భాగమున మాత్రము చెక్కబడిన రాళ్లు (Drip stone) కనబడుచుండెను. ఇతరాలంకారములను వారు సంపూర్ణముగ విసర్జించిరి. కొన్ని స్థలములందు నటుల చేయక పోయినను నామమాత్రమున ఉంచిరి.

## మూడవ పఠాన్ శిల్పవిధానము:

సయ్యదు రాజుల యొక్కయు, లోధీరాజుల, యొక్కయు శిల్పముల చూచినచో, హిందూ మహమ్మదీయ శిల్పములకు పునస్సంధి కలిగినదని స్పష్టమగును. విజయ గర్వమును, ఉత్తమములగు దుర్భావములును, కాలచక్రము తిరిగిన కొలది నశించుచుండెను. హిందూ విధానములోని అలంకారములను తిరిగి స్వీకరింప మొదలిడిరి. కమానులు మొదలైనవి నూతన స్వరూపముల దాల్చసాగెను. స్తంభములు బహిర్భాగములందలి సున్నితపు రాతి చెక్కడములు, పనితనము, బ్రాకెట్లు మరియు Ksioh లును ప్రతిష్ఠితము లయ్యెను. కప్పులకును, సామాన్యపు రాళ్లకును, మర్ మర్ బాళ్లకును రంగులు పెట్టుట మొదలయ్యెను. గుంబదములకు, వానిపైన ప్రత్యేకముగ శిఖరములను బెట్టి, మార్చిరి. బహిరంగ నిరాడంబరత్వమును మాత్రము కొంతవరకు వారు మిగిలించిరి. మొత్తముమీద నీ విధానము మొగలు రాజుల మొదటి దినముల వరకును ప్రచారమునం దుండెను షేర్ షావా కాలమున దీనికి ఉచ్ఛస్థితి ప్రాప్తమయ్యెను.

## మొగలు శిల్ప విధానము:

బేబరు మొదలుకొని రెండవ పానిపట్ యుద్ధము వరకు అనగా ౩౦ సంవత్సరములు పఠాన్ శిల్పవిధానములో చేరిపోవును నూతన శిల్ప చక్రము అక్బరు విజయోత్సవములతో తిరుగ సాగెను.

మొగలు శిల్పవిధానము రెండు త్రోవలు త్రొక్కినది. మొదటి విధానము హుమాయూన్ గోరీ, మరియు చుట్టుముట్టు కట్టబడిన భవనములందు కానవచ్చును. ఆకారమునందును, అలంకారమునందును హుమాయూన్ గోరీతో తులతూగు గోరీ మరొకటి డిల్లీయందేమి, భరతఖండమునందితర భాగములందేమి నిర్మింపబడలేదని గట్టిగ చెప్పవచ్చును. గోరీపైన యున్న గుంబదముసాటి సుందరమగు గుంబద మొక్కటి భూతలము పైననే అరుదని సుప్రసిద్ధ శిల్పులవాక్కు. ఈ గుంబదము మహమ్మదీయ శిల్పము సంపూర్ణముగ ననుసరించి యున్నది. చుట్టుముట్టు కట్టబడిన భవనము కూడ ఇస్లాం నిరాడంబరత్వమును వ్యక్తపరచును. చరిత్ర ప్రియులకీ గోరీదృశ్యము విషాదకారకమగును.

ఈ గోరీని తిలకించినచో, పూర్వపు తుర్కీరాజుల గంభీర భావజనకమగు శిల్పము యొక్క అభిరుచి వ్యక్తమగును.

అక్బరు కట్టించిన మొదటి శిల్పములందు సాధారణమగు యిస్లామ్ విధానమే అవలంబింప బడినది. విచ్చలవిడిగా రంగు లుపయోగింపనైనవి. ఫతేపూర్ సిక్రి యందును సికింద్రాయందు నిర్మించిన సౌధములందు అక్బరునకు సర్వవిధ శిల్పములపై సమానదృష్టి యుండెనని స్పష్టమగుచున్నది. డిల్లీయందలి భవనములు మాత్రము పూర్వాచారమునే యనుసరించెను— వెడల్పు వెడల్పు గోడలు, [illegible] సరిగానున్న భవనములు, పైభాగమందు శిఖరములు (pol[illegible]) మధ్యన గుంబదములు, మొత్తముమీద నట్టి నిర్మాణము [illegible] మెచ్చుకొనబడుట లేదు.

ఎనుబది సంవత్సరముల అనంతరము షాహజహాన్ కట్టించిన క్రొత్త డిల్లీయందు క్రొత్తకళ, క్రొత్తమెరుగు కనబడెను. సహజముగ ఉత్తమ శిల్పమునకు చెందిన అవయవము లన్నియు అనూతన యుగపు నిర్మాణములందు వ్యక్తము గాజొచ్చెను. ఈ నవీన యుగము చిన్నదైనను చిత్రవిచిత్ర నిర్మాణము లన్నియు నీ యుగమునందే కట్టబడినవి.

క్రీ. శ. ౧౬౩౮ వ సంవత్సరమునందు, షాహజహాన్ సార్వభౌముడు, ఆగ్రా పట్టణ పరిస్థితులచే విసుగుజెంది తన నగరము డిల్లీయందే కట్ట సంసిద్ధుడయ్యెను.

అరుణ సౌధమును, జామామసీదును అతడక్కడ నిర్మించెను. ఈ రెండు నిర్మాణములందును మొగలు శిల్ప పరిపూర్ణ పరిణామదశ దిలకింప నగును. హుమాయూన్ గోరీ నిర్మాణమునందు పాటింపబడిన కాఠిన్య మీమందిరములందు కనబడదు. హిందూశిల్పుల అలంకార పటిమ తిరిగి మహమ్మదీయ శిల్పమునందు జీవనము నింపెను. నూతనవిధ మెళ్లస్థలములందు సువ్యక్తమగును. డిల్లీయందలి షాహజహాన్ రాచనగరు నవలోకించి పులకాంకితుడై ఫర్గ్యుసన్ అనెడి పాశ్చాత్య పండితుడొకడు అట్టి రాజమందిర మదివరకు ప్రాక్దేశములం దెచ్చటను లేకుండెననియు, ఇప్పుడు కూడ నట్టి మనోహరమగు మందిరము ప్రాక్దేశములందు బహుశః ప్రపంచమునం దెక్కడను లేదనియు,—అభిప్రాయ పడెను.

దివాన్ఖాస్ మొగలు శిల్పముయొక్క అత్యుత్తమ నిదర్శనము. ఈ మందిరము హిందూశిల్పము యొక్కయు, మహమ్మదీయ శిల్పము ఉత్కృష్ట విశేషములతో నందగింపనైనది.

,దివాన్ ఆమ్' విశాలముగను, పెద్ద పెద్ద స్తంభములతోడను కట్టబడినది. ప్రాక్భాగమున నెత్తుగా కట్టబడిన సింహాసనము కలదు. దానిపై మర్మరశిలతో చేయబడిన ఛత్రము లదు. దానిపై ,,ఈశ్వర చ్ఛాయా స్థానము" ని వ్రాయబడి యున్నది. షాహజహాన్ తన దర్బారు యుక్తముగ కూర్చుండిన స్థానమిదే. సుప్రసిద్ధమగు పీకాక్ (నెమిలి) సింహాసనమీ మందిరమునందే యుండెను. దాని వెల టావర్నేరు చరిత్రకారుని అభిప్రాయాను సారము సుమారు ౬॥ మిలియనుల పౌండ్లు అనగా ౯ కోట్ల ౭౫ లక్షల రూపాయలై యుండెను.

జామామసీద్ కూడ హిందూమహమ్మదీయ శిల్ప నైపుణ్యమును, [illegible] తెల్పునట్టిభవనము.

మొగలు రాజ్య విచ్ఛిన్నముతోబాటు మొగలు శిల్పమునకు చెడ్డరోజులు ప్రాప్తించెను.

షాహ ఆలమ్ నామకార్థమైన రాజుగా నుండెను. మొగలు రాజ్యవైభవము, వైశాల్యము, అంతయు చెల్లాచెదరైపోయి షాహ ఆలమ్‌నకు డిల్లీ నగరము దాని సమీపమున నున్న పాలెం అను గ్రామము మధ్యమున్న భూభాగము మిగిలి పోయెను. హాస్య ప్రదమగు నొక ఉర్దూ లోకోక్తికూడ నిదివరకు ఆలమ్ రాజ్యమును గురించి ప్రచారమునందున్నది.

بادشاہی شاہ عالم از دہلی تا پالم

మొగలురాజ్య వినాశానంతరము కట్టబడిన నిర్మాణము లన్నియు.గోరీలు మాత్రమే. అవియు వారి రాజ్య క్షీణత ననుసరించుచు క్షీణదశ బొందినవే. అలంకార హీనములుగను, శిల్ప కళా నియమములకు వ్యతిరేకములుగను అవి కట్టబడినవి.

జైపూరు రాజగు జైసింగుచే ౧౭౨౪ లో నిర్మింపబడిన నక్షత్ర విలోకన యంత్రము (observatory) జంతర్ మంతర్ అనునది మిగిలియున్నది, ఇది నిజముగ శిల్ప చాతుర్యమును వెల్లడి చేయునట్టి నిర్మాణము. అతడు జైపూరు, ఉజ్జయిని, వారణాసి యందు కూడ నిట్టియంత్రముల నిర్మించెను.

మన రాష్ట్రము నేర్పరిచిన ఆసఫ్ జాహ నిజాముల్ ముల్కు తండ్రియగు గాజియుద్దీన్ గోరీ ౧౭౧౦ లో నిర్మింపబడెను. అదియు కొంతవరకు పేర్కొనదగినదే.

అవుధు (Oudh) యొక్క మొదటిరాజునకు బంధువగు సఫ్దర్ జంగుయొక్క గోరీ మొగలు శిల్పము యొక్క ఆఖరు నిర్మాణము. అపరిమితాలంకారముల వలనను, నీరసత్వమును వెల్లడిచేయు రంగుల వలనను ఈ నిర్మాణము మిగుల నిరసింపబడినది. ఐనను దానితో సమానమైన నిర్మాణము దాని నిర్మాణముకంటె నేబది వత్సరములలో కట్టబడలేదని దాని శిల్పకళావిశారదులు జాలితో మెచ్చుకొందురు.



# తపోవనము

వఝ్ఝల వేంకటేశ్వరకవి

౧

ఏ యమునాస్రవంతి నుదయించిన ఘోషములోన లీనమై
పోయినవో సుధారుచిరముల్ సుభగమ్ములు పావనమ్ములై
యే యతిబాలుఁడో హృదయమే పులకింపఁగఁ బాడిపెట్టి మేల్
తీయని వేదగానములఁ దేటలు దేలిన దివ్యమాధురుల్.

౨

ఏ యతిలోకచంద్రముఁడో యే చిరకాల తపఃప్రభావుఁడో
యీ యమునాతటాంచల మహీరుహశాఖలయందు నైజకా
షాయవిశుద్ధవస్త్రములఁ జల్లనిగాలికి నారఁగట్టినాఁ
డో యుదయాస్తభానుకిరణోదిత రాగగతిన్ వెలుంగఁగన్.

౩

భావహరమ్ములౌ కలల భంగముఁ గాంచిన నిద్రయౌ ప్రభా
తావసరమ్మునన్ జలకమాడి పరిస్ఫుటపూతమూర్తియై
యీ వనమందుఁ బూర్వమున నే మునికన్యక దివ్యభక్తిలీ
లావివశాంగియై ప్రవివలమ్మగు గీతము నాలపించెనో.

౪

నాఁటి మునీంద్రబాలిక లొనర్చిన గానసుధారసమ్ము లీ
యాటవికస్రవంతిక యొయారపు వీచుల గానమ్ములన్
నేఁటికి నే త్రిలోకజనసంస్మరణాకృతి సంగ్రహించియో
తేటగ హాయిగాఁ దనివితీరఁగఁ గర్ణములన్ వినఁబడున్.

౨

భాసనసేయరాని వసివాడిన నాఁడు ప్రభాత సుందరీ
దేవికిఁ గాన్కవెట్టు నియతిన్ నను వేకువలందుఁ జొక్కపున్
బూవులఁ గోసియుండిరో విశుద్ధమనస్వినులై శుభాకృతిన్
భావనముల్ గదా ఋషులబాలలు మెట్టిన యీప్రదేశముల్.

౩

పూఁత యొకింతలేని మునిపుత్త్రిక మోవి నలంకరించు నున్
లేఁత గులాబిరంగుల విభ్రమ్ముల సంపదల్ మనమ్ములన్
ద్యోతమొనర్చు, నిచ్చటవినూతనవలల నుప్పతిల్లి శో
భాతిరళమ్ములై మెరుపువారిన వేఁజివురాకు జొంపముల్.

౪

ఈ భువనైకసేవ్యపని నెట్టితపమ్ము నొనర్చినారొ, క
ర్ణాభరణ ప్రసక్తి యనునట్టి దెఱుంగని చెక్కులందు వే
ణీభరమెల్ల వృద్ధసరణిన్ జడలై వరివెన్నుబంగరున్
శోభల వ్రేలఁగా, నగము స్రుక్కిన యట్టి మునీంద్రకన్యకల్.

౫

బెదరిన చూపులన్ ఋషులపిల్లల కన్నులసాటిఁ బూను చ
క్కఁదనపు లేడిపిల్ల లధికప్రణయమ్మునఁ దత్కరంబులం
బొదవిన దర్భలం గొఱుకఁబోయినచో భయసంభ్రమమ్ములన్.
హృదయమునందు క్షోభము వహించిరె యా నవముగ్ధబాలికల్?

౬

ఎంత తపోధనమ్ము గడియించినదో మునివ్యమానమై
యెంత పవిత్రకాంతి భరియించినదో భువనాభిరామమై
యెంత మహత్త్వసంపద వహించినదో చిరభాగ్యవంతమై
యెంత మనోహరమ్మొకద యావనవాటి శుభాకరమ్ముగన్.





# మైసూరు నందలి దసరా ఉత్సవములు

ఎస్. వి. ఆచార్య

దసరా పండుగలు హిందూ జాతీయోత్సవములలో అతి ప్రధాన మైనవి. చాల ప్రాచీన కాలమునుండి హిందువులు వీని నాచరించుచున్నట్లు తెలియుచున్నది. హిందువులలో నేజాతివారు గాని, యేశాఖవారు గాని దీని [illegible]యము తెలియనివారు లేరు. శాస్త్రముల ననుసరించి యీ యుత్సవము నవరాత్రియే యైనను సమాప్తి దినముతో గలసి దసరా యని పిలువబడుచున్నది. జనసామాన్యము దీనిని దసరా యని పిలుచుచున్నను ఉపాసకులును, పండితులు దీని నవరాత్రి యనియే పిలుచుచున్నారు. ఇట్టి నవరాత్రములు హిందూ సంవత్సరమున రెండుమారులు వచ్చుచున్నవి. వానికి వసంతనవరాత్రములు, శరన్నవరాత్రులనియు పేరు. అందు మొదటివి చైత్రమాసారంభమునను, రెండవది ఆశ్వయుజ ప్రారంభమునను వచ్చుచుండును. మొదటి దానికి శ్రీరామ నవరాత్రియనియు రెండవదానికి 'దేవీనవరాత్రి'యనియుగూడ వ్యవహారము గలదు. చైత్రశుద్ధ నవమి తిథి శ్రీరాముని జన్మదినమగుటచేత మాసారంభమునుండి శ్రీరామ పూజ చేయబడి దాని కాపేరీయబడినట్లు తోచుచున్నది. శరన్నవరాత్రములలో శక్తిస్వరూపిణియగు దేవీ పూజనము జరుగుచుండుటచేత దీనికి దేవీ నవరాత్రియని రూఢమగుచున్నది. వసంత శరదారంభ దినములకు శాస్త్రమునందు యమదంష్ట్రా కాలమని పేరు గలదు. ఈ యమదంష్ట్రా కాలమున గలుగు రోగబాధలనుండి జనుల తొలగించుటకై యెన్ని శాంతికార్యములు శాస్త్రములందు చెప్పబడియున్నవి. వాని నుచిత రీతిగా నాచరించిన యెడల జనులు రోగబాధా విముక్తులయి వాంఛితలాభములను పొందుదురని హిందువుల విశ్వాసము. కాలక్రమమున వసంత నవరాత్రపూజనము దేశమునందంతట జరుగుట తగ్గుచున్నను, దేవీ నవరాత్రపూజనము మాత్రము హిందూ దేశమునందు పల్లె పట్టణ భేదము లేకుండ నన్నిచోటుల నిప్పటికి జరుపబడుచున్నది. అందువలన దసరా శబ్దము దేవీ నవరాత్రములయందే రూఢమైయుండుట వలన దానిని గురించి యిపుడు వ్రాయుచున్నాను.

హిందూ జ్యోతిస్సిద్ధాంత పంచాంగము ననుసరించి యీ నవరాత్రి పూజనము ఒకప్పుడు ఎనిమిది రాత్రులకే యిముడి పోవుటయు, నొకప్పుడు పదిరాత్రుల వరకు పెరిగిపోవుటయు గలదు. ఇందులోని తప్పుహెచ్చు లెట్లున్నను మొత్తముమీద నవరాత్రియనియే వ్యవహరింపబడుచున్నది. కల్పము ననుసరించి యిరువదినాలుగడుగుల సమచతురముగల సర్వాలంకారశోభితము, పతాకోజ్జ్వలము నగు మండపము నమర్పవలెను, దాని మధ్యభాగమున నారడుగుల సమచతురమగు పీఠము నుంచవలెను. ఆ పీఠమున నాగ్నేయభాగమున హోమకుండము త్రికోణాకారమున నేర్పరుపవలెను. వేద వేదాంగ విదులును, దేవీ తత్త్వకోవిదులు నగు బ్రాహ్మణులు తత్తత్కాలోచితములగు మంత్రములను కల్పవచనములను పఠించుచు పూజింపవలెను. పూజారంభమునందు విఘ్నేశ్వరుని పూజించి, పిదప సింహవాహనము, చతుర్భుజాత్త గదా శంఖచక్ర పద్మములునగు దేవీ మూర్తిని పీఠమునందు ప్రతిష్ఠాపిం

చవలెను. ఇట్టివి లక్షణముగు దేవీ ప్రతిమ లభింపనిచో దాని ప్రత్యామ్నాయముగా శ్రీచక్రము నుపయోగించు టాచారమై యున్నది. దానికి తొమ్మిదావరణము లుండును. అందు మొదటి నాలుగు పురుషుని, మిగిలిన అయిదును ప్రకృతిని సూచించును. విశ్వశక్తి స్వరూపిణియగు ప్రకృతియే యిచట దేవీ రూపమున పూజింపబడుచున్నట్లు తలంపబడుచున్నది. ఆమూర్తి నుద్దేశించి పూజా హోమములు కల్పోక్తప్రకారము చేయుదురు. శాంతికొరకీ కార్యమునందు బ్రాహ్మణ భోజనము విరివిగా జరుపుటాచారమై యున్నది. అందు కన్యలెంతమంది ప్రత్యేకముగా భుజించిన నంతమంచిది. వారు మంచి దేహారోగ్యము కలవారు మాత్రమే గాక బధిర పంగ్వాంధులు గాకుండుట త్యావసరము. ఇట్టి కన్యలు దినమున కొక్కరు చొప్పున యీ తొమ్మిది రోజులును పెరుగుచుండవలెను. అనగా తొలిరోజున నిద్దరు భుజించిన రెండవ రోజున ముగ్గురును ఇట్లే క్రమానుగుణముగాను భుజింపవలయునని వారి యూహ. నిర్ణీయమానులగు నీకన్యలకు వయోమానము నిర్ణయముకూడ శాస్త్రములందు చేయబడియున్నది. వారు రెండేండ్లు మొదలు తొమ్మిదేండ్ల వయసునకు లోబడి యుండవలెను. అందు రెండేండ్ల బాలికలు ప్రథమ దినమున భోజనము పెట్టబడవలెను. సర్వరోగ నివారకమగు కుమారికా నామముచే వారు గుర్తింపబడుచున్నారు. శత్రు వినాశకమగు త్రిమూర్తి సంజ్ఞచేత వర్షతిద్దయు నాలుగేండ్లది కల్యాణియు అయిదేండ్లది రోహిణియు, నారేండ్లది కాళికయు. నేడేండ్లది చండియు, ఎనిమిదేండ్లది శాంభవియు, తొమ్మిదేండ్లది దుర్గయు నని పిలువబడుచున్నారు. అట్టిబాలికల యందే అవ్యక్తానందమయమగు నారూప వయస్సునందే మాతృదేవి యొక్క ఆత్మస్వరూపము నిబిడీకృతమై యుండుననియు దానివల్ల నుపాసకుల కారోగ్యము, నైశ్వర్యము లభించుననియు తలంచుట సాంప్రదాయము. ఈ సందర్భమున మరొక విశేషము కూడ కలదు. ఆబాలికలు తన జాతికి గాని, తనకంటె నుచ్చమైన జాతికిగాని చెందిన వారుగా నుండవలె గాని నీచజాతివారు మాత్రము పనికిరారు. ఈ నవరాత్రములు దినత్రయ సంకర్షణముచేత మూడు భాగములు చేయబడి వేరు వేరు పేర్ల పిలువబడుచున్నవి. దానికి కారణ మాదినములలో పూజింపబడుచున్న విధియొక్క తత్వభేదమేనని క్రిందివాక్యములు ధృవపరుచు.

మొదటి దినత్రయమున సర్వరోగములును, దారిద్ర్యమును దుఃఖమును నశింపజేయు మహాకాళి పూజింపుటచేత దానికి మహాకాళి ఖండమని పేరు. ద్వితీయభాగమున సర్వైశ్వర్య ప్రదాయిని యగు మహాలక్ష్మి పూజింపబడుచుండుటచేత దానికి మహాలక్ష్మి ఖండమనియు, తృతీయ భాగమున, చిత్తనైర్మల్యము, మేధోవికాసము, బ్రహ్మానంద వివేచనమును ప్రసాదించు మహాసరస్వతీ [illegible]ము పూజింపబడుచుండుట చేత సరస్వతీ ఖండమనియు వ్యవహారము. నవరాత్రులు పూజా హోమములు జరుపబడి కడపటి దినమున పూర్ణాహుతి చేయబడును. సాధారణముగా పదియవనాడు జరుగు విజయోత్సవముతో నవరాత్రి ఉత్సవములు ముగిసినట్లు ఎంచబడును. పదియవనాడు ఈ దేవీ మూర్తియు, తదితర దేవతా మూర్తులు, మండపమునందే గాక యితర దేవాలయములలో పూజింపబడువికూడ తత్ప్రదేశ సమీపమునందలి శమీ (జమ్మి) వృక్షమునకు గొంపోబడి, అచట నైవేద్య నీరాజనములు జరుపబడి, తిరిగి పూర్వప్రదేశమునకు తీసికొని రాబడును. ఇది నవరాత్రములందు జరుగు పూజాతంత్రము యొక్క సంగ్రహ స్వరూపము.

అపారమైన కాలప్రవాహమున నెన్నియో ఆచా[illegible]ములు, గౌరవములు, కొట్టుకొనిపోవుచుండగా, నీదేవీపూ[illegible]నము నిరాటంకముగా నీరోజువరకు నన్ని జాతులవా[illegible] చేయుచున్నవారో యీ క్రింది వాక్యములు తెలియజేయుచున్నవి, అనారోగ్యమునుండి విముక్తులగుటయందును, జయ[illegible] సుఖైశ్వర్యములను పెంపొందించుకొనుటయందును, జనులకు గల వాంఛయే దీని నిరంతర వ్యాపనమునకు మూ[illegible] కారణము. తమను నివసించు దేశమునందలి ప్రజా సౌ[illegible]ఖ్యమును, పరిపాలకుల సర్వోన్నత్యమును, ఆత్మ వికా[illegible] దుర్బాధా నిరాసములు కారణములుగా బ్రాహ్మణులు దీని నాచరింతురు. క్షత్రియులు తమ రాజ్యము యొక్క[illegible]యు, ప్రజల యొక్కయు క్షేమము మాత్రమే గాక తమ జయమును కూడ బురస్కరించుకొని, యీ పూజనము[illegible] యుసాధ[illegible] చేయుదురు. విశ్వమాతయగు నీదేవి యొక్క

మునందు జాతి మత భేదము లడ్డు తగులవు. ఇప్పటికి దేవీ పూజనము యొక్క స్వరూప మభివర్ణితమై యున్నది. నృప రాజకుటుంబ సాంప్రదాయానుసారము మైసూరు సంస్థానమునం దెట్లది జరుపబడు చున్నదో వర్ణించి చూపు చున్నాను.

శరదారంభమునందు అనగా ఆశ్వీయుజ శు॥ ౧ మొదలు నవమి వరకు గల తొమ్మిది దినములు దేవీ నవరాత్రములని తలంపబడు చున్నట్లు ఇదివరకే వ్రాసియుంటిని. కను ఆ తొమ్మిది దినముల చర్యయు నికముందు వివరింపబడగలదు.

ఆశ్వీయుజ శుద్ధ ప్రతిపద ఉదయమున మైసూరు సంస్థానపు ఇలవేల్పగు శ్రీ చాముండేశ్వరీ ప్రార్థనము జరిగిన పిదప, మంగళ స్నానమును. దాని వెను వెంట గణపతి పూజనము జరుగును. దాని పిదప కంకణ ధారణము అనగా నవరాత్రులయందు జరుపబడనున్న కల్పోక్త పూజా హోమ విధానమును సక్రమముగా నెరవేర్తునని దీక్షవహించుట. దీనికి గురుతుగా నొక పట్టుతోరము దక్షిణ మణిబంధమునకు గట్టుకొందురు. తరువాత దర్బారు మంటపమునందు సెజ్జపూజ జరుగును. అందే నవగ్రహారాధనముకూడ చేయుదురు. పిమ్మట సింహాసనపూజ జరిగిన వెంటనే దానికి మహారాజు ముమ్మారు వలగొని సింహాసనారోహణము సేయును. రాజగృహాంతర్దేవాలయములలో నవరాత్రములందు నిత్యమును పూజింపబడుచున్న సంస్థాన ఖడ్గము, సింహాసనాసీనుడగు మహారాజునకు సమీపమునం దుంచబడును. ప్రధాన మఠములును, గురుపీఠములును, పంపించిన కానుకలు మహారాజున కొసంగబడును. దేవాలయములనుండియు, శిష్టాచార సంపన్నులగు వైదికాగ్రేసరులనుండియు, మహారాజునకు చిరాయురారోగ్యైశ్వర్యములు కల్గునట్లు దీవించుచు పంపబడిన ఫలమంత్రాక్షతలు గూడ అప్పుడే మహారాజునకు చేర్పబడును. ఆ సమయమందె సివిలు, మిలిటరీ సంబంధులగు ఉద్యోగులేగాక యితర ప్రధానోద్యోగులును, సాంస్థానిక ప్రధాన వర్తకులును, తదితరులును దివాను మూలమున రాజ సన్నిధిని యెరుక చేయబడుదురు. అంతఃపుర రక్షక భటులవల్లను, ఇతర సంస్థాన సైనికుల చేతను మహారాజునకు విజయ సూచకముగా ముమ్మారు విజయధ్వానములు గావింపబడును. (తుపాకులు వగైరా ప్రేల్చబడు) పిదప పట్టపు టేనుగును, రాజాశ్వమును పవిత్రమగు దొడకెరె (పెద్ద చెరువు) యందు స్నానము చేయింపబడి, మనోహరముగా నలంకృతములై రాజ సన్నిధానమున గౌరవ పూర్వక విధేయతను ప్రదర్శించి వెడలి పోవును. ఈ సమయమునందెల్ల మనోహర మధుర సంగీతము సౌధాధోభాగము నుండి ప్రతి ధ్వనించుచుండును. దర్బారుగన కరుదెంచిన సభ్యులందరు నుచితరీతిని ప్రశ్నందనాదులతో గౌరవింపబడిన పిదప, భాగ భాగములుగా రాజాజ్ఞ గైకొనుచు వెడలి పోవుదురు. అనంతరము అంతఃపుర [illegible] దర్శనసంభాషణావకాశ మొసంగబడి, వారు తరలి పోయిన పిదప మంత్రి పురోగములై, ప్రధాన సదస్యులు మహారాజ సింహాసనమును సమీపించి, మహారాజువద్దనుండి కుసుమ ప్రసాదమును గైకొందురు. ఈ కార్యము ముగియుటతోడనే మహారాజు సింహాసనావరోహణ మొనరించి నీరాజనానంతరము అంతఃపురమున విశ్రమించును. తరువాత సౌధాంతర్భాగమున ప్రత్యేక పూజా మంత్రవిధానములచేత నవరాత్రములలో పూజింపబడుచున్న కులదైవతమగు శ్రీచాముండేశ్వరీ దేవి నెలకొన్న చోటునకు బోవును. ఈ ప్రదేశమునకు నవరాత్రములలో బోయి విరామముగా నున్న సర్వకాలమును దేవీపూజనమును సుచిత శ్రద్ధాభక్తులతో మహారాజు స్వయముగా గావించుచుండును.

ప్రథమ దినము రాత్రి 8 గంటలకు మరల దర్బారు సమావేశమైనపుడు, మహారాజు స్వయముగా సింహాసనమును పూజించి, దాని నధిరోహించును. తరువాత సదస్యులు సింహాసనోభయ పార్శ్వములనుండి సందర్శనాభివాదనములు క్రమానుసారము గావించిన పిదప సుపవిష్ఠులయ్యెదరు. సౌధోపరితలము నుండి (సభాభవనమునుండి) యుపలక్ష్యమాణ మగుచున్న రంగస్థలమునందు సంస్థాన మాతంగగజాశ్వ గౌరవములును అందెకొండొకచో మల్ల యుద్ధములును, నానావిధాయుధ ఖేలనములును ప్రదర్శింపబడుచుండును. ఇట్లే ద్వితీయ దినము మొదలు అష్టమదినముదనుక సాయంసమయములందు మాత్రమే సౌధా

ధోగ్గృహమున పవిత్రదేవీపూజనము విశేష విధిగా జరుగుచుండు వేళల దర్బారు సమావేశ మగుచుండును.

నవరాత్రములలో సాధారణముగా సప్తమ దినమున వచ్చెడు మూలానక్షత్రమునందు శ్రీ సరస్వతీదేవిని ఆమెకై ప్రత్యేకముగా సమర్పపడియున్న మందిరమునందు మహారాజా స్వయముగా పూజించును. ఇది యుదయ కాలమున జరుపబడును.

కాళీ రాత్రియని పిలువబడు ఎనిమిదవరోజు రాత్రి శాస్త్రానుగుణముగా మహిషాసుర మర్దనోత్సవము తగిన గౌరవ శ్రద్ధలతో గావింపబడును.

తొమ్మిదవ రోజు ముఖ్య సంస్థానాయుధములకును, పట్టపు ఏనుగును, పట్టపు గుఱ్ఱమును, సర్వైశ్వర్య ప్రదాయిని యగు మహాలక్ష్మియును పూజింపబడును.

ఈ కార్యములన్నియు మహారాజే స్వయముగా చేయును. ఆ దినమునందే ఉత్తమమగు చండీ హోమము చండీ రూపధారిణియగు దేవీ ప్రీతి కొఱకై చేయబడును, దానిని చేసిన తరువాత మహారాజా పూజా, దీక్షాకంకణమును విసర్జించును. నాటి సాయంకాలము గౌరవనీయ. బ్రిటిషు రెసిడెంటును, ఇతర ఇంగ్లీషు ఉద్యోగులును మహారాజాను సందర్శించుకొని, దర్బారునకు హాజరై, అపుడు జరుగుచున్న వినోదములను పరికించెదరు. పదియవ దిన ముదయమున సంస్థానాయుధములు మరల పూజింపబడి, సంస్థాన ల్యాంకిక వాంచుంపబడి మహోత్సవములతో శమీమండపమునకు కొంపోబడును. ఈ సందర్భమున మహారాజా పట్టపు గుఱ్ఱముపై నెక్కి కొంతవరకా యుత్సవమును నడిపించి, వెంటనే పల్లకీలో నెక్కి, మరలి వచ్చును. అపుడు రాజానకు కుస్తీప్రదర్శనము చూపబడును.

సాయంకాలము ౪ గంటలకు అంతఃపురము నుండి రాజోత్సవముత్సవమాతంగముపై నంబారిలో మహారాజా విష్టుడై యుండగా నుత్తరాభిముఖముగా బయలుదేరి, బెంగుళూరు రస్తాన వనమునందలి శమీమంటపమును చేరును. అచట మహారాజా సంస్థాన సైన్యముల నుపలక్షించి; మండపాంతర్భాగమున పూజానంతరము, శమీదేవతానుగ్రహ మభిలషించును. శిరస్తాదారు సంస్కృత భాషలో చదువుచున్న మైసూరు సంస్థాన వంశావళి గ్రంథములను శ్రద్ధతో వినుచుండును. తరువాత శమీపత్రములను ప్రసాదముగా దివాను, ప్రధానోద్యోగులు, అనేక రోద్యోగి వర్గమునకు పంచిపెట్టి, ఆయుధములను పల్లకిలో నుంపించి, మహారాజా గజారూఢుడై అంతఃపురము ప్రవేశించును. వెంటనే జరుపబడు దర్బారుతో నాటి దినచర్య ముగియును.

విజయదశమి యని పిలువబడు పదవనాటి సాయంకాలమున శమీమండపమునకు తీసికొని పోబడు సకల దేవతలకును, నవరాత్రములలో ప్రత్యేక పూజ జరుగుచుండుటచేత శాంతికొఱకు మహారాజావారి భోజన సత్రమున దసరా ౧౦ రోజులును నవ్యారిగా బ్రాహ్మణ సంతర్పణము జరుగును. దసరా వెళ్లిన మరుసటిదినము మరునాడును -రెండు దర్బారులు సాయంకాలమందు జరుగును. ప్రాచీనాంతఃపురమునందలి మెట్ల అంతస్థులోని అంబా విలాసమున నిదివరకు జరుగుచుండెను. కాని ఈ మధ్య నివి నూతన ప్రాసాదములోని వివాహమండపమున జరుగుచున్నవి. ఈ సమయమున సెజ్జె దర్బారునకు ప్రవేశింపరాని ఆహ్వానితులను సభ్యులును ద్యోగులును సమర్పించుకొను కానుకలు మహారాజు పరిగ్రహించును. తనదృష్టి నాకర్షింపగలిగిన గుణసంపద గల ఉద్యోగులకీ సందర్భముననే తగిన బిరుదము లీయబడును. ఇప్పుడే సంస్కృత కళాశాలలో భాద్రపదమున జరిగిన పరీక్షలలో కృతార్థులైన విద్యార్థులకు బహుమతు లొసంగబడును.

వారి సాంప్రదాయముల ననుసరించి సానికొలువు ములు మాత్రము వేరుగా నున్నవి. మహారాజా మొదలు కూలివానివరకు, హిందూ దేశమునందలి జనులందరు దసరా పండుగను జరుపుచున్నారు. మధ్యహిందూస్థానము నందలి ఇందూరు సంస్థానాధీశులగు హోల్కార్లు నైతము పూజనములలో కంకణధారణము చేయుదురని తెలియుచున్నది. మైసూరునందువలెనే పూజాపద్ధతులలో వారి స్వరూపము ప్రదర్శితమగుచుండును. కాని నగరమునందలి ఆయుధోత్సవ మేలాలో యుత్తరాభిముఖముగా పోవుటకు బదులు దక్షిణాభిముఖముగా నడలుచున్నది.

గాలు దేశమునందు దుర్గాపూజన మెంతయుత్సాహముతో నవరాత్రముల నెంత పవిత్ర దినములుగా భావించి చేయుచుండిరో అది బహిరంగ రహస్యమగుటచేత వ్రాయ లేదు.

నవీన కాలమున జనుల కలవడుచున్న నాగరికతా ఫలముగా జీవహింస వంటి దురాచారములు, ఈ కార్యములలో పూర్ణముగా నడుగంటిపోయి, ప్రాచీన వేదశాస్త్రముల యందలి అంతర తత్వము సుప్రకాశితమై, జనుల భావాభివృద్ధిని పెంపొందించుట మనము ఇచట గమనింపదగిన అంశములలో నొకటి.

మైసూరునందు ఇతర దేశము లందువలెనే హిందూగృహము-దసరా దినములలో మిక్కిలి మనోహరముగా నుండును. అప్పుడు సంతోష మాగృహముల నావేశించి యున్నట్లుండును. ఇండ్లు పరిశుభ్రము చేయబడి గోడలు సున్న పుపూత వేయబడి, నేల గోమయముతో నలికి, నానారంగుల ముగ్గులతో వివిధములైన ముగ్గులు పెట్టి చూపరుల కానందము పంచిపెట్టు చుండును. సంతోషపరవశులగు గృహస్థులు, అతిథులకే గాక మార్గస్థులగు బాటసారులకు గూడ చక్కని సౌకర్యములు కలిగించెదరు. మధుర సంగీతారావముల తోడను, పవిత్ర దేవతా మంత్రములతోను, రాజవిశ్వాస పూరితోపన్యాసముల చేతను, భూరి సంతర్పణములతోను, ఇంక నెట్టివగు వినోదములతో మహీశూర నగరము దసరా దినములలో భూతల స్వర్గమువలె నుండును.

ఈ చరిత్రమును వర్ణించుటతోనే వ్యాసము ముగించిన యెడల బహుమిరసముగా నుండును. వర్ణ్యవస్తువు నందలి తాత్త్వికతత్వము బహిర్గతమైనట్లు తెలంపుటకు వీలుండదు. అందువలన దసరా పండుగలలో పై కార్యములేల చేయబడుచున్నవో సంగ్రహముగా తెలుపుటకు ప్రయత్నించెదను.

మానవ జీవితమున కానందమే పరమలక్ష్యము. దానికి శక్తి సహకారి. సత్వరజస్తమో వికారమగు నీ ప్రపంచ మంతయు మూల ప్రకృతినుండి కలుగుచున్నది. సర్వేశ్వరుడగు పరమాత్మ యొక్క జీవశక్తినే మూల ప్రకృతి యందురు. దానినే శక్తి యనుట కూడ కలదు. ధర్మకాల భిన్నత్వముచేత నామభేదము కలుగుచున్నను మొత్తము శక్తి యొక్కటి. తత్పూజనమునకు జ్ఞానము ప్రధానము, వివేచనాయుక్తమైన ఆ జ్ఞానమే ఆనందము. జ్ఞానమూలకమైన యాశక్తి తత్వము ప్రదర్శించు శాస్త్రమునకు మంత్రమని పేరు. దృశ్యప్రపంచమున కంటె అదృశ్య ప్రపంచము మిక్కిలి విశాలమైనది. మానవదృష్టి పరిమితమగుట చేత అదృష్టమగు విశాల ప్రపంచమును దర్శించుటకు బలవత్తరమగు దృష్టి యవసరమగుచున్నది. అదృష్ట మంత్రశాస్త్రజ్ఞానము. దానిని గురించి యిటుల వ్రాయబడి యున్నది.

What Geology is to the secretes of the globe. What astronomy is to the stellar world, what phisics is to the world of visible phenomena objects in nature, matter and force and what chemistry is to the substence this composition and changes; that is Manthra sastra to the conditions of the unseen world.

ఇట్టి మంత్రశాస్త్రము ననుసరించి దేవీపూజనము జరుగుచున్నది. సరియేకాని విశ్వస్వరూపిణియు, శక్తిమూలకమునకు దేవీపూజనమునందు విగ్రహారాధన మెందులకని కొందరి యాక్షేపణ. జ్ఞానమూలకమైన శక్త్యుపాసనమునకు విగ్రహము సాధనమాత్రమే యగియు, ఉపాసకునకు జ్ఞానావబోధము కలిగిన వెంటనే యామూర్తి నశించిపోవునని యు సమాధానము సమాధి నిష్ఠుడైన ఉపాసకుడు గురూపదిష్టములైన మంత్రాక్షరములను జపించుట చేత తన ఆత్మశక్తిని, అవరణశక్తిని పెంపొందించుకొనునని చెప్పబడు చున్నది. ఉపాసనా మూలకమైన యాశక్తి వికాసములను నవీన శాస్త్రవేత్తలు కూడ గమనించుచున్నారు. జ్ఞానమూర్తియైన శక్త్యుపాసనము చేయుచున్న ఉపాసకుని క్రమ్మియున్న తేజోమయూఖములు యొక్క త్రిమ శక్తులచేతను భగ్నముగాని మహత్తర ప్రాకా

రిమును నిర్మింప గలవని తెలిసికొన బడుచున్నది. అట్టి ప్రధాన యోగసూత్రమే దసరాయందలి దేవీపూజనమున గూడను అంకితమగుచున్నట్లెంచ వలెను.

గణపతి పూజ ఆటంకముల నవలద్రోసి, విజయమును కలిగించుటకొరకు కొనర్పబడుచున్నది. ఇది తాత్కాలిక బ్రహ్మచర్యమును, తన్మూలక మనోనైశ్చల్యమును, తత్పరిణామ కార్యసిద్ధియు గలదిగా నున్నది. కంకణ ధారణము దీనికి సంబంధించినదేనని యిదివరకే వ్రాయజడినది, తక్కినవానిలో పట్టపు గుఱ్ఱము, పట్టపు టేనుగను, సంస్థాన శకటమును పూజించుట ముఖ్యములైన వానిలోనివి. ఈ మూడును దేవతల నాధుడగు నింద్రుని ఉచ్చైశ్రవ, ఐరావత, దేవరథముల వంటివని తలంచుట చేత పూజింపబడుచున్నవి. అందు మొదటి శ్వేతాశ్వము, ఐశ్వర్యమును, అధికారమును, రెండవది ఘనతను, హోదాను, మూడవది పవిత్ర ధర్మమార్గము నందలి గమనశక్తిని సూచించుచున్నవి. సింహాసనాయుధములను పూజించుట ఉపాసకుని లాభము కొఱకు వానియందొక మహత్తర తేజము (ఆకర్షణ శక్తిని) ప్రవేశపెట్టుచున్నట్లెంచుచున్నారు. మహిషాసురమర్దనోత్సవము గర్వ మద మాత్సర్య హింసనమును తెలియజేయుచున్నది. నవరాత్రముల యందు కంకణ ధారియై శక్త్యుపాసనము చేయుచున్న మైసూరు మహారాజును ఏదోయొక మహత్తర పవిత్ర తేజము సామాన్యదృష్టికగోచరమై యావేశించి యున్నటు తోచుచుండును. తపస్సంపన్నుడగు మహాయోగి యొకడు మాత్రమే దానిని గ్రహింపదగి యుండును. లేక రసవాద శాస్త్రమునకు సంబంధించిన తెరలు (Chemical Screens) దొరక గలిగినపుడదియు ఫలక్షితము కావచ్చును.

పూజాంతమున గావింపబడు చండీ హోమము మిక్కిలి ఫలకారియని శాస్త్రము. దానియందలి తత్త్వము అరిషడ్వర్గనిగ్రహమును త్యాగము నని తోచును. అనగా కామక్రోధ మాత్సర్య మోహములను పవిత్రాగ్నిలో దగ్ధముచేసి శుద్ధ సత్త్వమూర్తియై భావించుటయని తోచుచున్నది.

కడపటిదగు శమీ పూజనము మిక్కిలి ప్రశంసా పాత్రమైనది, శమీవృక్షము శక్తి మూలకము. అందువలననే శమీ కాష్ఠ సంఘట్టనమువలన శక్తిరూపమగు నగ్నినుత్పాదించి తన్మూలమున మహర్షులు యజ్ఞకర్తలైరి. ఈ భావమును మహాకవి కాళిదాసు శమీ మధ్యాంతర లీన పావకమ్మని సూచించి యున్నాడు. శాంత్యర్థక సూచకమగు శమ శబ్దమునుండియే శమీశబ్దముత్పన్నమైనది. అందువలనసమత్వమును, మనశ్శాంతియును ప్రవృత్తి యొక్క యుత్తమ పదవియు గ్రహింపబడుచు అభివృద్ధ మూలకత్వము సుజ్ఞాత మగుచున్నది. మహాభారత వీరుడు అర్జునుడు అజ్ఞాత వాసకాలమున శక్తిస్వరూపమగు నీ శమీవృక్షమునందే తన యాత్మ బలమును, అస్త్ర బలమును గుప్తి చేసికొనియెను. ఒకనాడు రామాయణ వీరుడగు శ్రీరఘురాముడు కూడ నిట్లే చేసియుండెనని యు, అతనికి శమీ దర్శనము సుప్రియ మయ్యెనని ను శాస్త్రములు తెల్పుచున్నవి. విజయ దశమినాడు యాత్రాది విజయాద్యాకాంక్ష చేతన పరాజితా పూజనమును విజయ ముహూర్తమందు ప్రయాణమును శ్రేయస్కరములని జ్యోతిష్కులు.

,,హారేతువిచిత్రేణ భాస్వత్కనక మేఖలా। అపరాజితా భద్రకరా కరోతువిజయం మమ.'' అని అపరాజితా ప్రార్థనము. ,,అశ్మంతక మహావృక్ష మహాదోష నివారణం। ఇష్టానాం దర్శనం దేహి శత్రూణాంచ వినాశనమ్'' అని శమీప్రార్థనము మరియు హేమాద్రిలోనుపధ బ్రాహ్మణమున, ఆమంగళానాం శమనీం శమనీందుష్కృతస్య చ। దుస్వప్ననాశనీం ధన్యాం। ప్రపద్యేహం శమీంశుభాం.'' అని యును భవిష్యమున ,,శమీ శమయతే పాపం శమీలోహితకంటకా, ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ। కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖంచయా. తత్ర నిర్విఘ్న కర్త్రీత్వం భవ శ్రీరామ పూజితే'' అని శమీ ప్రార్థనములు కన్పించుచున్నవి:

దీనివలన శమీపూజన మెంత శక్తివంతమని ప్రాచీను లంగీకరించి యున్నారో విశదము కాగలదు. ఇట్టి శాస్త్రీయ విశ్వాసములను భావములందుంచుకొని మైసూరు ప్రభువులు దసరా మహోత్సవములలో నీ పూజనము చేయుచున్నారని తెలియజేయుటకే యీ వ్యాసము వ్రాయబడినది

భారత జాతీయ వికాసమునకును, ప్రాచీన సంస్కృతి వివేకమునకు సర్వతః ప్రాముఖ్యము, వికాసము నొసగుచున్న శ్రీవారికి భగవానుడు చిరాయురారోగ్య ఐశ్వర్యములొసంగు గాక!




# సురుచి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఆడుపిల్లలలోపల నందకత్తె
మిన్న మాయింటి పొరుగున నున్న సురుచి
ఆమె ముఖకాంతియందు శతాంశమైనఁ
గలిగినట్టి దొకర్తయుఁ గానఁబడదు.

బాల చిర్నవ్వు లక్షవరాలు సేయుఁ
గొమ్మ మధురంపుఁబలుకులు కోట్లు సేయు
సుదతి కందోయిసొమ్ముల్మ లర్బుదము సేయుఁ
జెలియ నెమ్మేనికాంతికి వెలయు లేదు.

తండ్రి గతియించె; నిఱుపేద తల్లియగుట
నాయవారంబు సేయుచు నాపె గడపు
అట్టివారింట నాపిల్ల పుట్టఁగూడ
దొక మహారాజునకుఁ బుట్టియుంట తగును

ఆమె నామానసమునకు దీపకళిక
ఆమె నాకన్నుదోయికి నమృతవల్లి
ఆమె నామనోవ్యాధికి నౌషధంబు
బాల యొకటేమి? నాకు సర్వస్వమగును.

తల్లి గృహమందు లేకున్న తరుణమందు
వారి యింటికిఁ నేఁబోయి పలుకరింపఁ
జేతిలోనున్న పనివిసర్జించి యంద
హాసమున వచ్చి నా చేతులందువ్రాలు.

పసుల సమ్ముఖమందాపె వచ్చునన్నుఁ
గనుచుఁ గ్రేఁగంటఁబలుకరించు; సతంబు
బడికిఁబోవుచు వచ్చుచు వారియింట
గడియకాలంబు కొమ్మతోఁ గడపుచుందు.

అనుదినముఁ గళాశాలకు నాలసించి
చనుట; నిచ్చలుఁ బాఠముల్ చదువకుంట
తప్పుచుంటఁ బరీక్ష; నా తండ్రి నన్నుఁ
దిట్టిపోయుచుఁ జీవాట్లు పెట్టువాఁడు.

వాని నన్నింటి నోపికపట్టి సైతు
నాడు ముద్దులమూటకై యాదరమున
నా చెలువఁ గాంచఁ బ్రాణంబు లేచునాకు
నన్నుఁ గాంచినఁ బొంగునా చిన్నదియును.

బడికి విశ్రాంతి దినమెల్లఁ బర్వదినము
నాకు; నానాఁడు సురుచితో నాటకంబుఁ
జూడఁబోదును; మంచి దుస్తులను దొడిగి
పూలతోఁటకుఁ జనుదుము రేలయందు.

మరియు నా దినమామెకు మంచి మంచి
వాసనా తైలములుఁ బూలుఁ బండ్లుఁ దెత్తు;
తైలములు రాచి తలదువ్వి పూలు ముడుచు
కొనును; గవగూడి యా పండ్లఁదినుదు మేము

ఊరి దేవుని తిరునాళ్ల యుత్సవము
రాఁగ నాముద్దుగుమ్మతో రమ్యముగను
నంగడులకేఁగి వలసిన యన్నివస్తు
వులను గొనియిచ్చుచుందు సొంపులు దలిర్ప.

మాదు శృంగార నాటకమధ్యమందుఁ
బరిహసించుచుఁ జప్పట్లు చఱచుచుండ్రు
ప్రేక్షకులు; తత్పరిహాస విషము గాని
స్వ[illegible] మాకథఁ ద్రిప్పలేదు.



# సహకారోద్యమము

గంగరాజు రఘునాథరావు

దేశము నందలి ఆర్థిక దుస్థితి బాపి ప్రజలలో సుఖ జీవనము కలిగించుటకు సహకారోద్యమము కన్న మేలైన యుద్యమ మింకొకటి గానరాదు. దీనిని మనుష్యుని జీవితము యొక్క ప్రతి శాఖ యందును ఆచరణ యందుంచవచ్చును. సంసార చక్రము సహకారము లేనిది నడువజాలదు. ఈ యుద్యమము లేనిది యే రాష్ట్రమయినను అభివృద్ధి నొందజాలదు. కనుక ప్రాజ్ఞులు మనుజుడు "సహకార జీవి" యని నుడివి యున్నారు.

## సహకారమన నేమి?

సహకార మను పదమునకు శాస్త్రజ్ఞులు పెక్కు నిర్వచనములు జేసి యున్నారు. వాని సారాంశమంతయు నొక్కటియే. కొందఱు వ్యక్తులు సరిసమానమగు హక్కులతో, తమ ఆర్థిక స్థితి అభివృద్ధి పరచుకొనుటకై నొక సంఘముగ నేర్పడుటయే సహకార మనబడును. కొందఱు వ్యక్తులనగ ఒకజాతి వారైనను, ఒక సంఘము వారైనను, ఒక వృత్తి వారైనను, ఒక గ్రామము వారైనను, నుండవచ్చును. సరి సమానమగు హక్కులనగ దీనిలో సభ్యులుగ నుండువారిలో హెచ్చు తగ్గులు లేవు. అందఱికిని సమానమగు నధికారముగలదు. ధనికుడు, బీద అను వ్యత్యాసము లేదు. ఆర్థిక దుస్థితి మున సంఘముగ జేరు వారు మూలధనము లేనిచే ధన సంపాదనము చేయజాలకున్నారు. ఎన్నియో కష్టములు అనుభవించు చున్నారు. ఇట్టివారు సంఘముగజేరి తమ పరిస్థితులు బాగుపరచుకొనవచ్చును. సహకారము యొక్క ముఖ్య సూత్రము ప్రేమయు, త్యాగమును నైయున్నవి. ప్రేమ లేనిది పరస్పరమైత్రి కలుగ జాలదు. త్యాగము చాల ముఖ్యమయినది. సహకారము వలన ప్రతివ్యక్తి సంఘముకొఱకును, సంఘము ప్రతివ్యక్తి కొఱకును, పాటుపడును.

సహకారోద్యమము యొక్క చరిత్ర తిలకించినచో వివిధ దేశములందీ యుద్యమము యెట్లు బయలు దేరెనో, దానివలన నెట్టి లాభములు కలిగినవో, విదిత మగును. ప్రతి దేశమునందు ప్రత్యేక పరిస్థితులననుసరించి యుద్భవించినది. ఇంగ్లండు నందు ఓవెన్ (Owen) అను నతడు పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున కార్మికులకు చౌక ధరలకు వారి కవసరములగు వస్తువులు విక్రయించుటకై సంఘముల నేర్పాటు చేసెను. ఈ విక్రయము వలన వచ్చు లాభమును సభ్యులు పంచుకొను చుండిరి. అనంతరము యితర విషయముల గూర్చి ఆచరణ యందుంచబడెను. దేశము ఐర్లండు, డెన్మార్కు, హాలెండు, స్విట్జర్లాండు, దేశములలో వ్యవసాయ పరిస్థితులు బాగు పరచుటకై స్థాపింపబడెను. జర్మని దేశమున వ్యవసాయకుల ఆర్థిక స్థితి బాగు అభివృద్ధి పరచుటకై బయలుదేరెను. ఇటలీ దేశమున మార్గములనుచరించి పనిచేయుటకు నుద్భవిల్లెను.

దీని వలన సహకారోద్యమము వివిధ విషయము లందాచరణ యందుంచుట కవకాశము కల్గదని విదిత

మగుచున్నది. పరపతి సంఘముల వలన ప్రజలు చౌక వడ్డీలపై ఋణములు బడయ వచ్చును. సహకార విక్రయ సంఘముల వలన ప్రజలు చౌకదరలకు తమ జీవితావసరములు కొనవచ్చును. తమవద్దనున్న ధాన్యము, ముడి పదార్థములు మున్నగునవి హెచ్చు ధరలకు విక్రయించ వచ్చును. హిందూస్థానమునందీ యుద్యమము రైతుల దుర్భర స్థితి బాగుపరచుటకై స్థాపింపబడినది. నిజాం రాష్ట్రమునందు కూడ నిదియే యుద్దేశముతో ప్రభుత్వమువారు ఆచరణకు దెచ్చిరి.

## మితవ్యయము

సహకార సంఘముల వలన మితవ్యయ యుద్దేశమెట్లు కలుగును? సంఘముయొక్క సభ్యుడగుటకు కనీస మొక భాగమైనను కొనవలయును. సభ్యునికి ఈ మొత్తము సమకూర్చుటకై చింత కలుగును. అతడు తన ఆదాయము నుండి కొంత మిగిలించుటకై ప్రయత్నించును. ఇంతియకాక సభ్యులు సంఘమునందు కొంత ధనము నిలువ చేయుటకై ప్రోత్సహింపబడుచుందురు. చౌక వడ్డీపై అప్పు యివ్వబడును. నిర్ణీత కాలమున అప్పు రాబట్టుకొనబడును. సభ్యుడు అప్పు ఏ యుద్దేశముకై గైకొనునో దానికే వెచ్చించినాడా లేదాయని దృష్టి యుంచబడును. ఋణము అవసర కార్యములకే నొసంగబడును. ఇందువలన సభ్యులకు మితవ్యయ మలవడుచున్నది.

## ఐకమత్యము

సంఘము సభ్యుల కవసరమగు మూల ధనము చేకూర్చును. ఈ విధముగనే చెల్లించబడును. సంఘముయొక్క సర్వ కార్యములు సభ్యులే నెరవేర్చెదరు. నిత్య కృత్యములు కార్య నిర్వాహక సభా సభ్యులు చేయుదురు. ఇందువలన సంఘ సభ్యులలో ఐకమత్యము కలుగుచున్నది.

## వాటాలు

సంఘమునందు వాటాలుండుట శ్రేయమా? దీని గూర్చి విచారించెదము. వాటాలుండుటచే మితవ్యయ మలవడును, పరస్పర సహకా... కలుగును. వాటాల మూలమున సంఘమునకు మూలధనము చేకూరును. కాని దీనివలన కొన్ని చెడుగులు కూడగలవు. ధనమున్నవారే సభ్యులగుట కవకాశము కలదు. ఎలన లేనివారు వాటాలు కొనజాలరు. అందుచే సభ్యులు కాజాలరు. సర్వ సమానత్వ సిద్ధాంతము పోవుచున్నది. వాటాలు హెచ్చు కొనిన వారి ప్రాబల్యము సంఘమునందు కలుగుచున్నది. వారి అభిప్రాయానుసారమే పనులు జరుగును. అందువలన జాయింట్ స్టాక్ కంపెనీగ మారును.

## బాధ్యత

సంఘ సభ్యుల బాధ్యత రెండు విధములది

(౧) పరిమిత బాధ్యత (Limited liability)

(౨) అపరిమిత బాధ్యత (Unlimited liability)

బాధ్యత యన సంఘము యొక్క నిలువయు, ఋణములు ఇతరులనుండి పొందినవి వారికి సకాలమునకు చెల్లించుటకు ప్రతి సభ్యుని పైగల భారము. ఇట్టిది ప్రతిసభ్యుడు తన అప్పు చెల్లించుట గూర్చి గల బాధ్యత కాదు. పరిమిత బాధ్యత సభ్యునియొక్క వాటా వరకే యుండును. ఇది వాటా విలువ యొక్క రెండింతలు, మూడింతలు వరకు కూడ నుండును. ఈ విషయము నిబంధనలలో వివరింపబడును. లేక ప్రత్యేక మొత్తము వరకు కూడ నిర్ణయింపబడును. అపరిమిత బాధ్యత గలసంఘములలో ప్రతి సభ్యుడు సంఘముయొక్క ఋణములు స్వయముగ చెల్లించి తీరవలయును. సంఘము విచ్ఛిన్నమైనను సంఘముయొక్క అప్పులన్నియు చెల్లింపబడువరకు ప్రతి సభ్యునిపై యీ బాధ్యత నిలచియుండును. ప్రథమమున అపరిమిత బాధ్యతపైననే సంఘములు స్థాపింపబడెను. కాలము గడచిన కొలది, వాణిజ్యము వృద్ధికాగ అపరిమిత బాధ్యత తొలగింపబడెను. సంఘమునుండి సభ్యులు తొలగుచుండుటచే పరిమిత బాధ్యత ప్రవేశ పెట్టబడెను. సంఘము నిలిచి యున్నంత వరకు సభ్యులపై యట్టిచర్య తీసికొనబడదు.

అపరిమిత బాధ్యత వలన లాభములు:—బీదలగునట్టియు, అనుభవము లేనట్టియు, సభ్యులకిది లాభకారి. ... ప్రకారము అప్పు చెల్లించు వానికే అప్పునొర

కును. చౌక వడ్డీపై అప్పు గైకొనబడును. వ్యవసాయకులకు అపరిమిత బాధ్యతవలననే అప్పు దొరకుచున్నది. కాని బహు జాగ్రత్తగా పనిచేయవలయును. లేనిచో సంఘము ఋణగ్రస్తమగును.

సంఘమును అపరిమిత బాధ్యతయొక్క ఆపదనుండి తొలగించుటకీవిధముగ పనిచేయవలయును. సంఘముయొక్క కార్యపరిమితి నిర్ణయించవలయును. సభ్యులను యెన్నుకొని చేర్చుకొనవలయును. అప్పు లాభకారియగు పనులకును, అభివృద్ధికరములగు పనులకును, మాత్రమే నొసంగవలయును. ప్రతి సభ్యుని అప్పు మొత్తము నిర్ణయించ వలయును. వాని శక్తి ననుసరించి అప్పు నివ్వవలయును. అప్పు గైగొను వానినుండి జామీను గైకొనబడును. జామీను సంఘ సభ్యుడై యుండవలయును క్షేమనిధి నుండవలయును.

## లాభము

సంఘమునకు వ్యవహారము వలన వచ్చు లాభము విభజింపవలయునా లేనా? లాభము సభ్యులకు పంచిపెట్టనిచో క్రమేణ వడ్డీరేటు తగ్గును. కొంత కాలమునకు వడ్డీ లేకుండనే అప్పు నివ్వవచ్చును. కాని లాభము విభజింపనిచో సభ్యులకు సంఘముయెడ అభిరుచి నుండదనియు, వాటాలు కొనరనియు, చెప్పుదురు. లాభము విభజింప కూడదు కాని విభజించినను నష్టము లేదు. పది సంవత్సరముల వఱకు లాభము విభజింప బడదు. సంవత్సరమునకు వచ్చు లాభమునుండి ఒక పాలు క్షేమ నిధిలో చేర్చబడును. మూడు పాళ్లు భాగింపబడును.

## జామీను

సహకార సంఘములు వ్యక్తి జామీను గైకొనును. ఇట్టి జామీను సంఘ సభ్యుడే అయి యుండవలయునా లేక వేరొకడుండ వచ్చునా? జామీను సభ్యుడైనచో తన బాధ్యత గుర్తెరింగి అప్పుగైకొనినవాని యందు దృష్టియుంచును. వాడు సకాలమునకు అప్పు చెల్లించుటకై ప్రోద్బలము చేయు చుండును. అప్పుగైకొనినవాడు రూపాయిలు చెల్లించనిచో తనపై ఆభారము పడునని జామీనుకు భయముండును. తప్పులుండజాలవు. అప్పు చెల్లించనిచో పంచాయితి ద్వారా పరిష్కారమగును. కాని సభ్యేతరుడు జామీను యగుచో పైన వ్రాసిన దానికి విరుద్ధముగ జరుగును. అయినను సంఘముయొక్క వ్యవహారము హెచ్చును.

## ఋణము

సహకార సంఘములు వ్యక్తి జామీను పైననే అప్పులిచ్చును భూములు, యిండ్లు, ఆభరణములు కుదువ బెట్టుకొని యేల యివ్వరాదు? ఇదియే కొందఱు ప్రశ్నించెదరు ఆభరణములు గైకొని అప్పునిచ్చినచో అప్పుదారుడు అప్పు చెల్లించనిచో ఆ ఆభరణము అమ్మవలయును. బంగారము, వెండిధర స్థిరముగ నుండదు కాన ధర హెచ్చు తగ్గులవలన సంఘమునకు నష్టము సంభవించును. భూమి, యిండ్లు కుదువ బెట్టుకొనినచో సంఘము వానిని చూడజాలదు, కాపాడ జాలదు. ఇంతియకాక భూములను పెట్టి సభ్యులు హెచ్చు మొత్తములు అప్పు గా లయునందురు. వీరికిచ్చినచో ఇతర సభ్యులకు నిచ్చుటకు ధనముండదు. సంఘము భూమిని సేద్యము చేయజాలదు.

## వివిధ పద్ధతులు

### రాష్డేల్ విధానము

ఇంగ్లండు దేశమున రాబర్టు ఓవెన్ (Robert Owen) అను నతడీ యుద్యమమును ౧౯ వ శతాబ్ది ప్రారంభమున నెలకొల్పెను. ఈ విధానము జనసామాన్యమును ఆకర్షించెను. త్వరలోనె పెక్కు సంఘములు స్థాపింపబడెను. ఈ విధానము యొక్క సూత్రములివి:-

౧. సంఘములను రిజీస్ట్రీ చేయించవలయును. ౨. సమర్థులగు వారిని కార్య నిర్వాహకులుగ నెన్నుకొన వలయును. ౩. ప్రతి సభ్యునికి ఒక సమ్మతి నొసగు హక్కు నుండును. ౪. వాటా విలువ స్వల్పముగ నుండవలయును. వ్యవహారమువలన ప్రతి సభ్యునికి సంఘమువలన వచ్చు లాభము అతని భాగము క్రింద జమ చేయవలయును. ౫. సభ్యుని బాధ్యత భాగములవరకే నుండవలయును.

ఓవెన్ ప్రథమమున క్రయ విక్రయ సంఘములను స్థాపించెను. ఈ సంఘములు చౌక వెలలకు ధాన్యము ఇతర వస్తువులు కొని, హెచ్చువెలకు విక్రయించు చు

పాంచాలకేసరి



శ్రీ. శే. లాలా లజపతిరాయు గారు

౧౯. క్రమేణ యీ సంఘముల సంఖ్య హెచ్చెను. కృషిదారుల సంఘములు మున్నగునవి స్థాపింప బడెను.

## రైఫైసర్ పద్ధతి

౧౮౪౯ సం॥మున రైఫైసర్ (Raiffeisen) అనువాడు బీదలకు చాకదరలకు భోజన పదార్థములు విక్రయించుటకై నొక చిన్న గ్రామమున సంఘము స్థాపించెను. రెండు సంవత్సరముల పిదప మఱియొక గ్రామమున బీద రైతులకు పశువులు విక్రయించుటకై వేరొక సంఘము స్థాపింపబడెను. ఈ సంఘములో చేరువారికి అప్పులుకూడ నొసంగబడెను. అనంతరము రైను నదీతీరమున హెడ్డుడార్ఫు (Heddes darf) అనునతడు పై యుద్దేశములు గల సంఘమునే నెలకొల్పెను. ఇందు ఆర్థిక స్థితి బాగుగ నున్న వారు చేరసాగిరి. ౧౮౬౨ సం॥మున సహకారోద్దేశము గల ప్రథమ సంఘము రైఫైసర్ చే అన్‌హౌసన్ (Aahauscn) పురమున స్థాపింప బడినది. దీని సిద్ధాంతము లివియై యుండెను:—

౧. సంఘము సహకార పద్ధతులపై నుండవలయును. ౨. సంఘముయొక్క వ్యవహారము చిన్న భాగమునకే నుండవలయును. ౩. సభ్యుల బాధ్యత అపరిమితముగ నుండవలయును. అనగ సంఘముయొక్క ఋణములు మున్నగువాని కంతయు సభ్యులందఱును బాధ్యులే. ౪. సంఘముయొక్క మూలధనము సభ్యులయొక్కయు, సభ్యేతరులయొక్కయు, నిలువ చేతను, కేంద్ర బ్యాంకుల ఋణముల వలనను, స్వల్ప మొత్తము గల భాగముల చేతను, క్షేమ నిధి చేతను, నుండవలయును. ౫. సంఘముయొక్క సర్వాధికారము మహాజన సభ కుండవలయును. నిత్య వ్యవహారము నడుపుటకు కార్య నిర్వాహక వర్గ ముండవలయును. ౬. ప్రతిసభ్యునికి ఒక సమ్మతి నొసగు హక్కుండును.

ఈ సిద్ధాంతము ననుసరించి పెక్కు సంఘములు స్థాపింప బడెను. గ్రామ సంఘములపై జిల్లా సంఘములును, జిల్లాల సంఘములపై రాష్ట్రీయ సంఘములు యాజమాన్యము వహించును. ఈ సిద్ధాంతము వ్యవసాయకుల కనుకరించును. దీనిని రైఫైసర్ పద్ధతియని యందురు.

ప్రస్తుతము జర్మని దేశములో రైఫైసర్ సంఘములు దిగువ సూత్రము లనుసరించు చున్నవి:—

౧. అపరిమిత బాధ్యత. ౨. స్థలనిర్దేశము. ౩. ఉత్పత్తికి సంబంధించిన పనులకే ఋణము లొసంగుట. ౪. ఋణములు సభ్యులకే నిచ్చుట. ౫. తక్కువ వడ్డీవాటాలు. ౬. దీర్ఘకాలములకై ఋణమిచ్చుట కిస్తీల ప్రకారము గైకొనుట. ౭. ప్రతి సభ్యునికిచ్చు ఋణమును, సంఘము సభ్యులనుండి గైకొను నిలువలను, నిర్ణయించుట. ౮. లాభము పంచకుండుట. ౯. లాభము వలన క్షేమనిధి యేర్పరచుట. సంఘము విచ్ఛిన్నమైనను యీనిధి సభ్యులలో విభజింప బడదు. ఇట్లున్నచో ఈనిధి ప్రజాహిత కార్యములకు వెచ్చింపబడును. ౧౦. కార్యదర్శి తప్ప ఇతర కార్యనిర్వాహకులకు వేతనము లొసంగకుండుట ౧౧. సభ్యుల నీతియు, ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి పరచుటకై ప్రయత్నించుట.

ఈ సంఘముల స్థాపనము వలన జర్మని దేశము చాల అభివృద్ధి నొందినది. తత్ఫలితముగ నెన్నియో గ్రంథాలయములు, రాత్రి పాఠశాలలు, ఆసుపత్రులు, సేవింగ్ బ్యాంకులు, పశువుల బీమా చేయు సంఘములు, మున్నగు ప్రజాహిత సంస్థలు స్థాపింప బడినవి.

## షూలిజ్ పద్ధతి

రైఫైసర్ వ్యవసాయకుల కనుకూలించునట్లు సంఘములు స్థాపించ షూలిజ్ (Schulze) అను నతడు జర్మని దేశమున ౧౮౪౯ సం॥మున పరిశ్రామికుల స్థితి బాగుపడుటకై పట్టణములలో సంఘములు స్థాపించి వారి అభివృద్ధికై ప్రయత్నించెను. అందువలన నీ సంఘములయొక్క వైశాల్యము, వ్యవహారము రైఫైసర్ సంఘముల కన్న హెచ్చుగ నుండెను. ఈ సంఘములయొక్క బాధ్యత పరిమితిగ నుండును.

ఈ రెండు పద్ధతులలో భేదమేమి కలదో ... షూలిజ్ సంఘముల వైశాల్యము హెచ్చు కనుగొందము.

౧౦. రిజిస్ట్రారు లెక్కలు పరిశీలించి తగు హితవు చేయుచుండును. కాని సంఘము యొక్క అభివృద్ధికి, మంచిచెడ్డలకు సభ్యులే బాధ్యులై యున్నారు. వారు సంఘము అభివృద్ధి చెందవలయునని తలంచిరేని తగు విధమున పాటుపడవలయును.

ఇవియే ముఖ్య సూత్రములు. వీనిని ప్రతి సభ్యుడును, ప్రతిసంఘమును బాగుగ నెఱుంగవలయును.

భారత దేశమునందలి గ్రామ సహకార సంఘములు రఫైసన్ విధానముపై నున్నవి. కాని కొన్ని మార్పులు చేయబడినవి. రఫైసన్ సంఘములు ఉత్పత్తి కార్యములకే అప్పునిచ్చును. కాని ఇచట బీదలగు వ్యవసాయకులు మఱల సాహుకారుల వలలో బడకుండ ఇతర అవసరములకు కూడ అప్పు నివ్వబడుచున్నది.

రఫైసన్ పద్ధతియందు మార్పులు గావించి భారత దేశమున ప్రవేశ పెట్టిన విధానము:—

౧. హద్దు వైశాల్యము.
౨. సభ్యులను ఎన్నుకొని చేర్చుకొనుట.
౩. అపరిమిత బాధ్యత
౪. స్వల్ప ప్రవేశ రుసుము
౫. స్వల్ప విలువగల భాగములు
౬. లాభము పంచబడదు
౭. క్షేమనిధి యేర్పాటు
౮. కార్య నిర్వాహకులు వేతనము లేకుండ సంఘకార్యములు నెరవేర్చుట.

## గ్రామసంఘములు గమనించదగిన విషయములు

సంఘము యొక్క అభివృద్ధి స్థాపనోద్దేశముపై నాధారపడియున్నది. సంఘ వ్యవహారము గౌరవార్థము పనిచేయువారిపై విడువవలయును. ఇతడు వ్యవహారదక్షుడై యుండవలయును. ఇతనికి సాహుకారుల వలనను, ఇతరుల వలనను కొన్ని యిబ్బందులు కలుగుచుండును. కాని ఓరిమిచే నవి యన్నియు క్రమేణ తొలగిపోవును. సంఘముయొక్క వైశాల్యము ఒక గ్రామము కన్న హెచ్చు నుండరాదు. ఒక గ్రామము నందలి ఒక సంఘము వారి ఐక్యతకే యుండవచ్చును, కాని ప్రత్యేక జాతుల యొక్కయు, మతముల యొక్కయు, సంఘముల వలన దేశమునందైకమత్యము కలుగజాలదని కొందరి యభిప్రాయమై యున్నది. సభ్యుల సంఖ్య ౫౦ కన్న హెచ్చు నుండిన కార్య భారము హెచ్చును. సక్రమ పరిపాలన జరుగజాలదు. సభ్యులను యెన్నుకొనునప్పుడు వారి ప్రవర్తనము బాగుగ గమనించవలయును. సభ్యులందఱును సంఘ వ్యవహారములలో శ్రద్ధవహించవలయును. కార్య నిర్వాహక సభ అంతయు చేయును; కాని మహాజన సభవారు జోక్యము కలిగించుకొనుచుండవలయును. ప్రతి సభ్యుడును పైన వివరించిన పదిసూత్రములను బాగుగ నెఱింగి యుండవలయును. మహాజన సభకుండు అధికారములు:—

౧. కార్య నిర్వాహక సభికుల నెన్నుకొనుట, తొలగించుట
౨. వార్షిక నివేదిక పరిశీలించుట
౩. వార్షిక లెక్కలు తనిఖీ చేయుట
౪. క్రొత్త నిబంధనలు గావించుట, ఏదేని నిబంధన రద్దు చేయుట.
౫. సభ్యుని తొలగించుట
౬. సభ్యులు కార్య నిర్వాహక సభపై చేయు అభియోగము విచారించుట.
౭. కార్యనిర్వాహకులకు అప్పు అంగీకరించుట
౮. సంవత్సర బాధ్యత నిర్వహించుట
౯. కేంద్ర బ్యాంకుకు ప్రతినిధుల నెన్నుకొనుట
౧౦. కేంద్ర బ్యాంకుతో సంబంధము నిర్ణయించుట

కార్య నిర్వాహకుల యెన్నిక చాల ముఖ్యమైనది, ఏలయన సంఘము యొక్క వ్యవహార మంతయు వారిపై నాధారపడియున్నది. వారు కష్టించి పనిచేయువారును, సత్ప్రవర్తనము కలవారును నై యుండవలయును. కార్య నిర్వాహకులు తప్పుచేసిన సంఘమునకు నష్టము సంభవించును.

గ్రామ సంఘములు అవసరమగు మూలధనము సభ్యుల [illegible] యొక్క నిలువచే సమకూర్చజాలవు.

బ్యాంకునుండి ఋణము గైకొనవలసి యుండును. ఈ నిధి ఇతరావసరములకు వెచ్చించ రాదని మాక్లాగన్ (Maclagon) కమిటివారు సూచించి యున్నారు. సంఘము రెండు విధము లుండును, స్వల్పకాలము, దీర్ఘకాలము. స్వల్పకాలపు ఋణములు వ్యక్తి జామీనుపై ఈ క్రింది అవసరములకు మాత్రమే నొసగబడును.

౧. విత్తనములు. సేద్యపు పనిముట్లు కొనుట

౨. పశువులకు మేత, ఎరువులు కొనుట

౩. పశువులను అద్దెపై తీసికొనుట

౪. సేద్యపు పనిముట్లు అద్దెపై తీసికొనుట

౫. ధాన్యము బజారుకు తీసికొని పోవుటకు

౬. సర్కారిపన్ను చెల్లించుటకు

౭. పైరులకు నీరుకట్టుటకై అగుఖర్చు

దీర్ఘకాలపు ఋణములు, దిగువ అవసరములకు ఇవ్వబడును:—

౧. పశువులు, సేద్యపు పనిముట్లు కొనుటకు

౨. భూమికొనుటకును, అభివృద్ధి పరచుటకును

౩. ప్రాత అప్పులు చెల్లించుటకును

౪. వివాహము మున్నగు పనులకును

కాని యిపుడు పైరెండు విధముల ఋణములలో భేదము చూపబడుటలేదు ఋణమే అవసరములకై గైకొనబడునో ఆదేపనికై వెచ్చించి దానినుండియే తీర్చవలయును. గాని ఋణము గైకొను నపుడు యేయే అవసరములకు తీసికొన బడుచున్నదో ప్రత్యేకించక, పెద్ద మొత్తము గైకొని ఆలస్యముగ చెల్లించుటకవకాశము కలిగించుకొనుటకు దీర్ఘకాలపు ఋణముల క్రింద వ్రాయించబడును. ఇందువలన స్వల్ప విషయములకై రైతులు మరల అప్పుగైకొనుచుందురు. కనుక స్వల్పకాలము ఋణములను దీర్ఘకాలపు ఋణములను వేరువేరుగ నుంచవలయును. గ్రామ సంఘములు మొదట స్వల్పకాలపు ఋణములనే నొసగవలయును. ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి చెందినకొలది దీర్ఘకాలపు ఋణములు నివ్వవచ్చును.

హిందూస్థానమునందు క్షేమనిధి యందు సంవత్సరాంతమున సంఘము యొక్క ఖర్చులుపోగ మిగిలిన ధనము చేర్చబడుచున్నది. సభ్యేతరుల నిలువ సకాలమున నిచ్చుటకు తగు యేర్పాటు జరుగ నంతవరకు క్షేమ నిధి ఇతరావసరములకు వెచ్చించ రాదని మాక్లాగన్ (Maclagon) కమిటివారు సూచించి యున్నారు. సంఘము యొక్క అవసరములు పూర్తియగుటకు క్షేమనిధిని వాటాలరూపమున కేంద్రబ్యాంకునందుంచ వలయును. ఈ అవసరము తీరిన పిదప ఇతర వ్యవహారములకై వెచ్చించవచ్చును. సంఘము యొక్క మూలధనముగ నుపయోగించినచో సకాలమునకు రాజాలదు.

గ్రామ సంఘములన్నిటిలోను అపరిమితి బాధ్యయే కలదు. దీనివలన సంఘములకు పెక్కులాభములు కలుగుచున్నవి

గ్రామసంఘములు రిజిస్టరీ చేయబడవలయును. అందుకుగాను దరఖాస్తు రిజిస్ట్రారుకు పంపవలయును. దీనిపై కనీసము పదిమంది ౧౮ సంవత్సరముల కన్న హెచ్చు వయస్సుగలవారు, ఒకే గ్రామము లేక ఒకే జాతివారు సంతకములు జేసి పంపవలయును. దీనివెంట నిబంధనలు తయారుచేసి పంపవలయును. రిజిస్ట్రారు న విశ్వాసన బద్ధము నున్నట్లు చూచి నొక సర్టిఫికేటు నొసంగును.

గ్రామ సంఘములు స్థాపింప బడుటలోను, అవి అభివృద్ధి జెందుటలోను కొన్ని అటంకములు గలవు. మొదటిది ప్రజలు విద్యా శూన్యులై యుండుట ఎన్నియో గ్రామములందు సంఘములు స్థాపించవలయునని ప్రజలు కోరుదురు. కాని సమర్థుడగు కార్యదర్శి దొరకుట దుర్లభముగ నున్నది. గ్రామోద్యోగుల నిరుద్యోగుల ... మించినచో ప్రజలు వీనిని ప్రభుత్వ సంఘములుగ భావించెదరు. రెండవది కార్య నిర్వాహక సభ పక్షపాతమై యున్నది. ఇది సహకార వాంఛ ప్రబలినచో తొలగి పోగలదు. వీనిని తొలగించుటకు దిగువ విధముగ ఆచరించ వలయును:—

౧. జాగ్రత్తగ పనిచేయుట. ప్రస్తుతము గ్రామస్థితి బాగుగ నెరుగనిది సంఘము రిజస్ట్రీ చేయబడుట లేదు.

౨. తనిఖీ: పరిశీలనము

౩. మహాజన సభలు,

౪. వ్యవహార నిపుణత

వివరింప బడినది. రెండవ ప్రకరణమునందు జన్మసంబంధ మయిన శారీర శాస్త్ర విషయములు వర్ణితము లయినవి. ౩,౪,౫,౬,౭ ప్రకరణములందుసంతాన నిరోధప్రక్రియలు వివిధములు చర్చించబడినవి. ఎనిమిదవ ప్రకరణమునందు సంతాననిరోధమువిషయమునచేయు ఆక్షేపణములనుసమాధానము లియ్యబడినవి. తొమ్మిదవ ప్రకరణమునందు సంతాన నిరోధోద్యమ చరిత్ర వర్ణిత మైనది.

మూలగ్రంథము మిగుల శ్రద్ధా పూర్వకముగను, శాస్త్రజ్ఞుల సిద్ధాంత సమన్వితముగను, సప్రమాణముగను రచింపబడినది. దానిని శ్రీరాములుగారు దీక్షతో, దక్షతతో, సుగమముగ ఆంధ్రీకరించి యున్నారు. ఈగ్రంథమునందలి బోధనాంశము క్రొత్తదగుటచే మనవారికి కొంత రుచించక పోవచ్చును. కాని గ్రంధకర్త యుద్దేశములలో కొంత నిజముగలదు. ఆంధ్రులందరు, ముఖ్యముగా మధ్యతరగతివారు, ఈ విషయమును గమనించవలసిన సమయమాసన్న మైనదని మాయభిప్రాయము.

## ప్రేమప్రవాహము

తెనుగు పత్రికా సంపాదకులుగా నుండిన ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారిచే వ్రాయబడినది. ఇది యొక విడంకముల నాటకము. భాష గ్రాంధికము శైలి సులభము. కథ సాంఘికము.

భార్యకు భర్తయెడ నుండదగిన భక్త్యనురాగములు, సంఘమునందు గల వివాహ శాంధవ్య చిక్కులు, వివాహ సంబంధములందు జననీ జనకులు తమ సంతానమున కొసగ వలసిన వరించు స్వాతంత్ర్యము, బ్రాహ్మణుల డంభాచార దోంగవేషములు, ధనాశచే బ్రాహ్మణుల వలలో వేసికొని బలవంత వివాహములు జేసికొను సకులస్థితి, తమంతట తామొండొరుల వరించుటలో గలుగు పతీయువకుల మహోత్తరప్రేమ, సంతాన ఎడబాటుచే జననీ జనకులకు గలుగు సంతాపము, అపత్యాలయందు హృదయ పూర్వకముగ నొనర్పదగిన మిత్రుని విధులు మొదలగు విషయములీ చిన్న నాటకమున చర్చగా చూపబడినవి. ఇటువంటి నీతియుక్తమగు ఉత్కృష్ట వాఙ్మయాభి వృద్ధిచేతనే కాని సంఘదురాచారములు వదలవు.

ఇది రాయల్ సైజులో ౭౦ పుటలుగల అచ్చైనపుస్తకము.

వెల ౧౦ అణాలు. దొరకుస్థలము ఇనుగుర్తి [నైజాం]

## పుష్పాంజలి [ మొదటిభాగము ]

గ్రంధకర్త విలగపూడిదాసస్యాచాదరిగారు వెల ౦-౧౦-౦

కృష్ణాజిల్లా, బెజవాడపోస్టు, ఎనమలకుదురు గ్రామములో గ్రంధకర్తవద్ద దొరకును. పుటలు. ౮౫

గ్రంధకర్త ఈబుసు పోకకై యపుడపుడు భారతి సమదర్శిని మున్నగు పత్రికలందు ప్రకటింపజేయుచు వచ్చిన పద్యవ్యాసముల సాపుటీకరణమే యీపుష్పాంజలి. ఇందు ౩౦ విషయములను గూర్చిన పద్యములు గలవు, పురాణ గాథలలోని యంశములు, దానవీరపత్రువంస, రైతులస్థితి, అహింస మున్నగు విషయములు వర్ణితము లయినవి. ఈకావ్యము కవియొక్క దేశభక్తి నిరతిశయమగు జిజ్ఞాస, నిర్భయమగు స్వసంఘ ప్రబోధనా ద్యోతక మగుచుండును. శైలి సరళముగా గలదు.





# బూదపూరు శాసనము

### ఆంధ్రపరిశోధకసంఘము హైద్రాబాదు.

శాసనసంఖ్య ౮౦. ఈగ్రామము మహబూబునగరమునకు మూడుకోసుల దూరములో రోడ్డుప్రక్క నున్నది. ప్రకృతశాసనము బూదపూరు గ్రామమధ్యమున నున్న అంజనేయాలయమునకు ఎదురుగాఁ బాతబడియున్నది. మధ్యకాలములో ఈ శాసనము ఇటకుఁ జేర్పఁబడెనని గ్రామవాసులు చెప్పుచున్నారు. గగ్గులజాతిమీఁద వ్రాయఁబడియున్నను వర్ణములు స్పష్టముగాఁ దెలియుచున్నవి. మూడువైపుల మాత్రము వ్రాయఁబడియున్నది. గాని మూడవవైపు కేవల ఫలశ్రుతిగాన ప్రత్యంతరము వ్రాయలేదు.

### దక్షిణము వైపు

౧. ఓం. స్వస్తిసమస్త భువనాశ్రయ శ్రీప్రి
౨. థివి వల్లభ మహారాజాధి రాజ పరమే
౩. శ్వర పరమభట్టారకం సత్యాశ్రయకుల
౪. తిలకం చాళుక్యాభరణం శ్రీమత్రిభువ
౫. న మల్లదేవర విజయరాజ్యము త్తరో త్తరాభి
౬. వృద్ధిప్రవర్ద్ధమాన మాచంద్రార్క్కతారంబరం
౭. సలు త్తమిరె శ్రీజయంతి పురదనెలెది
౮. దినోప సుఖసంకథా వినోదదిం రాజ్యంగెయు
౯. తిరె సమధిగత పంచమహాశబ్ద మహా
౧౦. మండలేశ్వరం జయాంగనాధీస్వరను
౧౧. పహసిత మనసిజ విజమూర్తి త్రిలోకి అలి
౧౨. తకీర్తి వేంగీశ ఏళవన దవదహన నంత్త
౧౩. ప్రారమ శేయ సవనచోళ కులకుము
౧౪. దినిమార్త్తాణ్డ మదవేత్తిన దరిపురా
౧౫. యమవపణ్డ తిగన్ధ బాహుబల దళితబంగా
౧౬. లికాయ్యేక కీర్తిన నర్తనా చాయ్య్యప్రాస
౧౭. న : త్రితమాళవ కామిని కర్ణాజాపాని
౧౮. జాస్వవ్యసన్నా హతించిత్తమ్మదన్నా తిమహా
౧౯. దేవహా శాత్ర విళశితశబ్ద ప్రరపతిప్ర
౨౦. వరబిరుద విరాజిత మగత్యాగుణ కుప
౨౧. ణ్యముద్రాపణరాయ రాయణ ప్రీడర

### ఉత్తరము

౧. + + + యణప్రీదయకుముద సు
౨. ధాకర పరిజన సంపత్కర శ్రీమచ్చవల
౩. దేవీనయన సరసిజ సూర్య్యన ప్ర
౪. తి హరనాయ్యం గురు జనపద పరాగ
౫. రాజిత చాళుక్య కటక రక్షపాలనామా
౬. దిసమస్త ప్రశస్తి సహితం శ్రీమ
౭. న్మహామండలేశ్వరం కుమారం తైలప
౮. దేవరపట్ట మహాదేవి లక్ష్మాదేవియ
౯. రుం కుమారం పెమ్మార్డి దేవనుంబాఈ
౧౦. వనుంత్రి కోడూరు పురద నెలెవి
౧౧. విషనోళసుఖ సంకథా వినోదాదిం రాజ్య
౧౨. గెయ్యుత్తమిరె శ్రీ మచ్చాళుక్యవిక్ర
౧౩. మవర్షద ౪౬ నెయ ప్లవ సంవత్స
౧౪. రద శ్రావణ దమావాస్య అదివార
౧౫. దంపునె కొంటము శ్రీరామేశ్వర దేవ
౧౬. గ్గ అంగభోగ ఈరంగభోగ ఈగన్ధ ధూ
౧౭. పదీప నివేద్య కేదగులద ఖండస్ఫు
౧౮. టితక ల్లినాతపోధనేర గ్రాసక
౧౯. పాదమూళ పరిగ్రహ ఈత్రిభోగా
౨౦. భ్యేతరసిద్ధియం మాచంద్రార్కకాల
౨౧. యయాగి సర్వ్వనమశ్యవాగి కందూ
౨౨. రసాసిరద మూఱుంబాడద సమక
౨౩. ట్టిన కందూర ౧౧ బడియ బాడంబూను
౨౪. పూరం కొట్టరు దేవర బ్రమ్మ
౨౫. పురినారదేవ బొప్పారు.




### యువకులు : రాజకీయములు

దక్షిణ కన్నడ యువజన మహాసభకు నారిమెన్ గారధ్యక్షత వహించిరి. ఆ సందర్భమున వారు నిట్లు పన్యసించిరి:—

కొందఱు యువకోద్యమమును అన్యథా తలంచుటచే నేను చింతిల్లుచున్నాను. యువకోద్యమము రాజకీయమైనది. వృద్ధులిది విప్లవోద్యమమని నిరసించవచ్చును. కాని ప్రపంచములో నేదేశమైనను యువకులును, వృద్ధులును. ఏకముగానిది అభివృద్ధి జెందజాలదు. ఇంతవఱకు వృద్ధులు యువకులను రాజకీయములందు ప్రవేశపెట్టి యుండిన మన మనోరథము నెఱవేరి యుండెడిది. వృద్ధులు యువకులను ప్రాకులాడుమని చెప్పెదరు. తిన్నగ పోవలయునని హితవొసంగరు. కాని మనము ౧౫౦ సంవత్సరములనుండి ప్రాకులాడుచునే యున్నాము. ఇంకను వృద్ధుల హితువాలకించిన ప్రాకులాడవలసి యుండును కాని నడువజాలము. కాన మనమిపుడు నడువవలయును. నడచుటయే కాదు పరుగెత్త వలయును.

ఐర్లండు, జర్మనీ, జపాను, దేశములు యువకోద్యమము వలననే అభివృద్ధి జెందినవి. విద్యయొక్క యుద్దేశములు రెండు గలవు. ఒకటి విద్యార్థులను జీవితము గడుపుటకు తయారు జేయుట; రెండవది దేశ స్వాతంత్ర్యమునకు తగిన వారినిగ జేయుట; కాని ప్రస్తుత విద్యా విధానము విద్యార్థులను ఉద్యోగులుగ తయారు జేయుచున్నది. వారిలోగల స్వాతంత్రేచ్ఛను చెరుపుచున్నది. జాతీయాభిమానము, దేశాభిమానము తొ[illegible]చున్నది. ఇంతియ కాక వారు శారీరక మానసిక శక్తి పోగొట్టుకొనుచున్నారు. ఇది ప్రస్తుత విదేశ ప్రభుత్వ ఫలితమని చెప్పదగును. భారతీయ మంత్రులు జాతీయ నాయకుల జీవితములను గఱపనిచ్చుట లేదు. వారి పటముల పాఠశాలలో నుంచుట కంగీకరించుట లేదు. గాంధీ, తిలకు గారి పటముల పాఠశాలలో నుంచుటకు విద్యాశాఖవారనుజ్ఞ నీయలేదు. కనుక నీ లోపము లన్నియు తొలగించుటకు గాను యువకోద్యమము రాజకీయముగ నుండవలయును. యువకులు ప్రాచీన విషయములను ఆదర్శముగ నుంచుకొన వలయును. భారత దేశమే పాశ్చాత్యులకు జీవితమెట్లు గడుపవలయునో బోధించినది.

యువకులు శారీరక బలము వృద్ధిచేసికొన వలయును. దేశముక్తికై పాటుబడ వలయును. తమ ఆత్మగౌరవము కాపాడుకొన వలయును. విదేశీయులచే చీవాట్లు పడరాదు. యువకులు భారత దేశము యొక్క భావి యజమానులు.

భారత దేశపు యువకులు ఇతర యేదేశపు యువకుల కన్న తచ్చువారు కారు. వారిలో దేశభక్తియు, మాతృదేశ సేవాసక్తియు, స్వాతంత్ర్య వాంఛయుగలవు. వారికి క్రమ శిక్షణయును, నాయకుడును మాత్రమే కావలయును. పరమేశ్వరుడు నీ రెంటిని ప్రసాదించు గాక!

యువకులు యితరులు జెప్పు నిరుత్సాహ వాక్యములను నాలకించ[illegible]. కొలది రోజులలోనే భారతదేశము

యొక్క వాంఛ ఫలించును. కనుక యువకులు రాజకీయ ములందు పాల్గొన వలయును. వారి మనోరథము నీడేగ నకు కృషి సలుపుచునే యుండవలయును.

యువకులు కద్దరు ధరించవలయును. ఏలయన కద్ద రే దేశ విముక్తి సాధనము.

---

## షౌకతలీగారి ఆవేశము

మౌలానా షౌకతలీగారు సంయుక్త పరగణాల మహమ్మదీయుల యొక్క అఖిలపక్ష మహాసభయందు మహోగ్ర వాక్యములను పలికిరి. అందులోని ముఖ్యాం శములివి:—

నా జన్మభూమికిని నా మతమగు ఇస్లామునకును నేను దాసుడను. హిందువులకును మహమ్మదీయులకును హృదయ పూర్వకమగు అన్యోన్య భావము లేర్పడవలె ననియే నా సంకల్పము. నాయుద్దేశ సంకల్పమును మా ర్చుకొనలేను. కాని, కాలవైపరీత్యము వలన నేడు చెప్ప బోవు విషయములను చెప్పవలసినవాడ నైతిని. సహాయ నిరాకరణ దినములలో మహమ్మదీయులు దేశము కొఱ కై త్యాగము చేసిరి. హిందువుల కప్పుడు మహమ్మ దీయులు తోడ్పడి దేశమును దైన్యావస్థనుండి మేల్కొ ల్పి విజయప్రదమగు మార్గమున కెక్కించిరి. నేడు పరి స్థితులు మారినవి. సాంఘిక మత వైషమ్యములు ప్రబలిన వి. మహమ్మదీయులపై కత్తిగట్టి హిందువులు పన్నాగ ములను పన్ని మహమ్మదీయులను సంహారించిరి. ఈ దౌ ర్జన్యముల నన్నింటిని మహమ్మదీయులు సహించి ఓపిక పట్టిరి. మహమ్మదీయులమగు మేము డిల్లీ పాదుషాలమై యుండిన దినములలో గూడ హిందూ సంఘమును రూపు మాపించ వలయునని మే మెప్పుడును పూనుకొనలేదు. బలహీనులను అణగద్రొక్క వలసినదిగా మా ఇస్లాము మత మెన్నడును బోధించలేదు. హిందూ మహాసభ యను పేరిట హిందువులు ఏకముగా తమ సంఘమునకు ప్రాబల్యము కలుగజేసి కొనిరి. ఈ మహాసభ పరిపాటియ గు ప్రాబల్య మేర్పడిన మహమ్మదీయసంఘ మేదియును ఏర్పడి యుండలేదు.

మోతీలాలు నెహ్రూగారు వారి స్వరాజ్య పార్టీ వారు నిష్కల్మష మనస్కులు గారనుటకు, పశ్చిమోత్తర పరగణాలకు గూడ రాజ్యాంగ సంస్కరణములను ప్రసా దించ వలయునని అసెంబ్లీ సభలో ఉపపాదింప బడిన తీర్మానమే తార్కాణము. హిందూ మహమ్మదీ యైక్య ము చేకూర్చుటకై సిమ్లాలో జరిగిన సభ వ్యర్థమగుటకు కారణము హిందువుల మూర్ఖ పట్టుదలయే

మద్రాసు కాంగ్రెస్ తీర్మానములే సమంజసము లనియు నెహ్రూ నివేదిక అన్యాయమైన దనియు, ధైర్య మున చెప్పగల హిందువు కన్పించుటలేదు. కారణ మేమ నగా హిందువులు సహజ సిద్ధముగ బానిసలు. వారింకను చాలకాలము బానిసలుగానే యుండగలరు. కాని మహ మ్మదీయులు స్వాతంత్ర్యాభిలాషులు. కాబట్టి హిందువు లయధికారమునకు గాని బ్రిటిష్ అధికారమునకు గాని లొంగి యుండజాలరు. దేశ శాంతి కోరుచున్నారా? లేక జాతీయాంతః కలహమును సమరమును చేయవలయునని కోరుచున్నారా? అని హిందువుల నడుగు చున్నాను. యుద్ధము చేయవలయునని హిందువులు కోరుచున్న యెడల మహమ్మదీయు లందుకు సిద్ధముగా నున్నారు. మహమ్మ దీయులు పుట్టుకతోనే యోధులు. వారు పూర్వకాల ములో వలనే యిప్పుడు గూడ జయభేరీ మ్రోగించగలరు. హిందూ మహాసభ యొక్క అభీష్టములను నెరవేర్చుటకే నెహ్రూ నివేదిక తయారు చేయబడినందువల్ల ఆ నివేదిక ను నేను నిరాకరించు చున్నాను. మితవాదుల నేరీతిగానైన జాతీయోద్యమమున జేర్చుటకే నెహ్రూ నివేదికపై సనత కము చేయునట్లుగా సాహెబు ఖురేషి గారిని మోస ము చేసి వశపరచు కొనిరి. ఈ నివేదిక మహమ్మదీయులు సమ్మతించిరి.

మహమ్మదీయు లందరును తమ స్వసంఘ బలము ను గట్టిపరచుటకు ౧౦ సంవత్సరములు నిరంతర కృషి సలుప వలయునని నేను హెచ్చరించు చున్నాను.

## రహబరెదకన్ పిచ్చి

ప్రజాపక్ష విద్యామహాసభ సమావేశమగు ననువా ర్త వెలువడిన నాటనుండి అనగా సుమారు ౨ మాస ములనుండి "రహబరెదకన్" పత్రిక ఎన్నియో చిత్ర

విచిత్రములగు వ్రాతలను వ్రాయుచుండుట గోచరమగు చున్నది. ఈ రాజ్యమునందరును ఉర్దూ భాషను మాతృభాషగా జేసికొనవలయునని కొన్ని దినముల క్రింద వ్రాసియుండెను. అన్నిటికంటె మించిన వాక్యరత్నము ౩ డై ౧౩౩౭ ఫసలినాటి ప్రధాన వ్యాసము యొక్క చివర నున్నది. ఈ వ్యాసమునందు, ప్రజాపక్ష విద్యామహాసభ యొక్క నవ తీర్మానమును తీవ్రముగ విమర్శించుచు పట్టరాని కోపముతో కాబోలు ఈ పత్రిక ఇట్లు వ్రాసినది. ,,మాస్వంత అభిప్రాయ మేమనగా:—హైదరాబాదీయైక్యత కొఱకు ఈ దేశభాష లన్నిటిని (మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్ర భాషలను) పాతాళ లోకమున పారదోలుటయే మంచిది' అను నదియే. ఈ సాహస వాక్యమును, దీనియడుగున నున్న రహబరెదక్కన్ పత్రికాధిపతి యొక్క భావమునందలి తీవ్రతయు ప్రతి ఆంధ్రుడును, ప్రతి మహారాష్ట్రుడును, ప్రతికర్ణాటకుడును తన హృదయాంతరాళమున ఆందోళనా పూర్వకముగా ఆలోచించవలసి యున్నది.

,,రహబరదక్కను'' నకు ఉర్దూభాషయం దభిమాన ముండిన నుండుగాక. ఇతర దేశభాషల నిట్లు తూలనాడుట గర్హ్యము. ఉర్దూభాషను హిందూ దేశభాషగా మేము మర్యాద చేయగలము. కాని నిజాం రాష్ట్రములోని ౧౬ జిల్లాలందు దీని కట్టిస్థానమును లేదని మాయభిప్రాయము. ఇచ్చటి దేశభాషలు మూడు. మహారాష్ట్రము; ఆంధ్రము, కర్నాటకము. ఉర్దూ ఇచ్చట ఇటీవల ప్రభుత్వము వారివలన ప్రవేశ పెట్టబడినది. ఇచ్చటికి వచ్చి ౪౦ సంవత్సరములు అయియుండును. ఈ భాష పుట్టియే ౨౫౦ వత్సరములైనది. ఇట్టి భాష యొక్క మన దేశభాషలగు హైమూడు భాషలు ఎంతో యెక్కువ గౌరవము కలిగియున్నవి. ఉర్దూభాష దక్షిణ హిందూస్థానములో దేశభాషయే కాదు. మనకిది నిజముగా పరభాష. పాతాళమునకు పడద్రోయవలసిన గ్రహచారము దక్షిణ హిందూస్థానములో ఏభాషకైన పట్టవలసి యున్నచో ఉర్దూభాషకు పట్టవచ్చును. కాని వేలశతాబ్దముల నుండి ఈప్రాంతములందు నిలిచియున్న—గౌరవప్రదముగ నిలిచియున్న—ఈ దేశభాషను పాతాళ లోకమునకు పడద్రోయు సామర్థ్యము రహబరె దక్కన్ పత్రికాధిపతిగారి వారికి లేదు సరికదా. ప్రభుత్వము వారికిని లేదు. కనుక నేవారు దేశభాషలను గౌరవముగ కాపాడు చున్నారో కాపాడవలయును. ఈ దేశభాషలు రహబరెదక్కన్ పాతాళమున పడిపోయినను—దాని అభిమాన భాషయగు ఉర్దూ పడిపోయినను—సజీవముగ నుండగలవు. దేశీయులీ విషయమున తమ యాగ్రహమును ప్రకటింపక యూరకుండ గూడదు. ,,రహబరెదక్కను''కు దేశీయులు కొంత విజ్ఞానము కలిగించుట ఉత్తమము.



## ఒక మాట

నవంబరు సంచిక కొన్ని అనివార్య కారణముల వలన సకాలమునకు ప్రకటింపలేకున్నందులకు పాఠకులు క్షమింప ప్రార్థన. చందా ధనము పూర్తియైన వారికి తిరిగి వి.పి. లు బంపుచున్నాము. స్వీకరించి యుద్యమమును ప్రోత్సహింప గోరుచున్నాము.

వ్యవస్థాపకుడు

Edited, & Published by K. Balakrishna Reddy, Printed, by G. Ramakrishna Reddy, Golakonda Press, Troop Bazar Hyderabad, (Dn).



హైదరాబాదు, డిసెంబరు ౧౯౮౮

సంపుటము ౨ | శా. శ. ౧౯౧౦ విభవ సంవత్సర మార్గశీర్షము | సంచిక ౧౨

# అజవిలాపము

డాక్టర్ ఒ. రాఘవరంగరావు

( అజుడు దశరథుని తండ్రి. ఇందుమతీ దేవి ఈయన భార్య. నారదుఁ డొకనాఁడు స్వర్గమునుండి మందార పుష్పమాలఁ దెచ్చి అజున కీయగా ఆయన నామె నలంకరించెను. ఆ దేహకంఠమునందు మాలవైచుట తోడనే మరణించెను.)

పూవులు వక్షభాగమున ♦ ముగ్దులు గుల్కుచు నుండి దిక్కులం
దావులు జిల్కుగాని, మది ♦ తా! మును వింటిమె ఘోరసర్పమై
జీవములన్ హరించునని ♦ చెప్పెడి దేమిక మృత్యురూపమై
యీ వసుధాతలం బమర ♦ నిచ్చటి జీవికి సౌఖ్య మున్నదే?

మ. వనితా! నందనవాటినుండి సురసే ♦ వ్యంబైన యీదండ గై
కొని యేతెంచెను నారదుండు తవ వ ♦ క్షోభాగ సంశోభియై

నను నానందము నందు దేల్చునని య ◆ న్యాయంబుగా నీట్లు నీ
తనువుం జల్లఁగ జేయువంచు దెలియం ◆ దానిట్టులం దెచ్చునే?

చ. చెడ దెపుడైన సౌరభము, ◆ చెన్ను దొరంగదు, వాడిపోన దే
వనుపున నెట్లువాడినను, భామరో! నీదగు జీవముం గొనం
బిసుగయి వచ్చె యీ సరిజము ◆ మృత్యువు మార్గన వస్తునైన ని
వ్వడమిని ఖేదవహ్ని విష ◆ పుంజము లేలకొ చంపినై వగర్?

క. నీ యసువుల గొనె నిదియని
నాయెదనై దీనిఁ దాల్ప ◆ నను జంపదు నో
తోయజముఖి! విష ముమృతం
బాయెను నాపట్ల దుఃఖి ◆ తాత్మత గనుటన్.

శా. ఈ కాసారను తమ్మికన్నులను నిం ◆ తీ! కమ్మపూదేనె బా
ష్పాకారింతంబయి యుండ అంచసడి దుః ◆ ఖారావమై యొప్పగా
నీకై యేడ్చెడి మమ్ముఁ గాంచియును దా ◆ నీరాచు పెల్లేడ్చెదీ
రాకాబ్జానన! నీవియోగము వృథా ◆ గ్రీష్మంబునై గాలెనే!

ఉ. ,,అమ్మ బరుండియుంవ యిటులారడి జేసదవేల?" యంచు నో
కొమ్మరో! దెల్యజాలమిని ◆ కుట్టిఁను బల్కును వానినెట్లు నె
సమ్మతిజేతు; యేదెసకు ◆ సాగుదు యీన్యథబాయ; నాదు జీ
వమ్ములు బాయవెందులకు ◆ తావక దుర్దశ గాంచుచుండియున్.

మ. ఒకటన్ తావక దుర్వియోగము విషా ◆ త్యుగ్రింబునై జీవముం
బెకలించన్ నవచంద్రరేఖ కెనయా ◆ ప్రేమార్ద్రి యీపుత్రకుం
డొకటన్ ప్రాణము వీడనీయఁడు, కటా! ◆ యొండొంటితో జేరక
వికటంబయ్యె పరిస్థితుల్, మనెదనా? ◆ పృథ్విన్ విసర్జింతునా?





# దక్షిణ హిందూ దేశ మహాచక్రవర్తి

శిరుగూరి హనుమంతరావు



మనదేశములో పురాణపురుషులగు రామ కృష్ణుల యొక్కయు, మతోద్ధారకులగు శంకర రామానుజ మధ్వ మొదలగు గురువులయొక్కయు పుణ్యదినోత్సవములు చిరకాలమునుండి ప్రతిగృహములో జరుపబడుచున్నవి. కాని ఈ జ్యాంత్రములో ప్రఖ్యాతిపొందిన. రాజుల వర్ధంతులుగాని, వాఙ్మయములో ప్రఖ్యాతిజెందిన కవులవర్ధంతులుగాని జరుపుటవాడుకలో లేకయుండెను. తిక్కన, నన్నయ మొదలగు కవీశ్వరుల వర్ధంతులు జరుపుట, కృష్ణదేవరాయలు, రాజరాజ నరేంద్రుడు మొదలగు మహారాజుల పుణ్యదినములు జరుపుట, వారిగుణములు, చరిత్రములు స్మరించుకొనియు, ప్రాచీన ఆంధ్రదేశ ఔన్నత్యమును జ్ఞాపకము తెచ్చుకొని మన ఉత్సాహము నభివృద్ధి చేసుకొని దేశసేవ, భాషసేవ చేయుటకొఱకే.

ప్రతిదేశములో నొకానొకసమయమందు ఆదేశ చరిత్రను మార్పుచేయుటకు సామర్థ్యముకలిగిన మహాపురుషు లవతరించుచుందురు. మఱియు శక్తి తగ్గిపోవుటచే తేజస్సు, బలము, జ్ఞానము జనులయందు లోపించును. అటువంటి సమయమందు, దారితప్పినటువంటి జనులకు సరియైన మార్గముచూపించి, రక్షించుటకీయవతారపురుషులు పుట్టుచుందురు. దైవభక్తితగ్గి, దురాచారములు వృద్ధిపొందినపుడు, వీనిని తలయెత్తకుండజేసి, జనుల దైవమందు భక్తికుదుర్చుటకు పాటుపడువారు మతోద్ధారకులు. సంఘమందు ఐకమత్యముతగ్గి, విపరీతమైన భేదములుద్భవించి, దేశమునకు నష్టముకలుగునపుడు సంఘసంస్కరణము జరిపి దేశసేవచేయువారే సంఘసంస్కర్తలు. దేశము పరాధీనమై, రాజ్యబలము క్షీణించి నప్పుడు, ఏరాజులు వారి సౌఖ్యమునువదలి, వీరులై, దేశమును స్వాధీనముచేసికొని, స్వదేశము నున్నతస్థితికి తెచ్చిరో ఆరాజులే రాజులు. ఇటువంటిరాజుల పుణ్యదినములను స్మరించి మనము పునీతుల మగుదుము.

విజయనగర సామ్రాజ్యమునకు చరిత్రయందు గలప్రాముఖ్యత తెలిసికొనుటకు పూర్వపుచరిత్ర తెలిసికొన వలసియున్నది. క్రీస్తుశకము 3 వ శతాబ్దమువరకు ఆంధ్రరాజులు గోదావరి, కృష్ణా, మధ్యదేశమును పాలించుచుండిరి. ఆరవ శతాబ్దము మొదలు చాళుక్యులు ఈరాజ్యమునుపాలించుచుండిరి. తొమ్మిదవశతాబ్దమందు రాష్ట్రకూటులు వీరిని జయించి రాజ్యము చేసినను

౧౦వ శతాబ్దమందు తిరిగి చాళుక్యులు రాజ్యమునకువచ్చిరి. ౧౨ వ శతాబ్దమందు చాళుక్యులు క్షీణదశకు వచ్చిరి. వారిరాజ్యములోనికొంతభాగము హొయసలరాజులక్రింద, కొంత యాదవులక్రింద,కొంత కాకతీయులక్రిందనుండెను. ౧౪వ శతాబ్దమందు మహమ్మదీయ దండయాత్రలు ప్రారంభమయ్యెను. ఈ మూడురాజ్యములు వారిచే నోడింపబడెను. అటుతరువాత ఈ దేశమంతయు బహమనీ రాజులు రాజ్యముచేసిరి. ఈప్రకారముగా మహమ్మదీయ దండయాత్రలవలన ఈ దేశము ముట్టడింపబడినప్పుడు, హిందూ రాజ్యమును నిలువబెట్టుటకై ౧౩౩౬వ సంవత్సరమునందు ఆనెగొందికోటను బలపరచి, విజయనగరరాజ్యము స్థాపింపబడెను. ౧౩౩౬ మొదలు ౧౫౬౫వరకు సుమారు ౨౩౦ సం॥ దక్షిణదేశము ఇతరులకు స్వాధీనముకాకుండ రక్షించుటచే విజయనగరరాజ్యము ప్రఖ్యాతినొందెను. ఈ రాజుల శాసనములు పండలకొలది దొరకినవి. పశ్చిమదేశము నుండి వచ్చినబాటసారులు, మహమ్మదీయులు, ఈరాజ్యమును చూచి, విచిత్రమైన విషయములను తెలియచేసిరి. ఈరాజ్యమందు అనేకులు విద్యాభూషణు లుండిరి. వారి కావ్యములుకూడా చరిత్రాంశములను తెలియచేయుచున్నవి. వారినాణెములు, వారుకట్టించిన దేవాలయములు ఆనాటి నాగరికతను తెలియచేయుచున్నవి. ౧౩౩౬ మొదలు ౧౪౪౭ వరకు బహమినీరాజులతో పోరాటమే ముఖ్యాంశము. ౧౪౪౭ మొదలు ౧౫౦౯ వరకు రాజులు నీరసస్థితిలో నుండిరి. ౧౫౦౯ వ సంవత్సరమందు కృష్ణదేవరాయలు పట్టాభిషిక్తుడయ్యెను.

ప్రస్తుతము మదరాసురాజధానిలోని అన్నిజిల్లాలలో కృష్ణదేవరాయుని శాసనములు లభించినవి. ఈ శాసనములు మన కృష్ణదేవరాయని రాజ్యవిస్తీర్ణము గురించిన నిదర్శనములు. తూర్పునసింహాచలమువరకు విస్తరించెను. ఓఢ్రదేశపురాజైన రుద్రగజపతిని కృష్ణదేవరాయలు జయించినట్లు సింహాచలములో నొకశాసనముకలదు. విజయనగరమువద్ద భోగాపురము గ్రామములో ఒకరాచబండ జయస్తంభముగా నిలిపినట్లు తెలియుచున్నది. మఱియొక సింహాచలశాసనములో కృష్ణదేవరాయలు తనరాణులు చిన్నదేవమ్మ, తిరుమలదేవమ్మయు సింహాచలదేవునికి గ్రామములు, ఆభరణములు ఇచ్చినట్లు తెలియుచున్నది.

నెల్లూరు జిల్లాలోని కొండవీడు, ఉదయగిరిదుర్గములు కూడా ఓఢ్రరాజు స్వాధీనములో నుండెను. ౧౫౧౩, ౧౪, ౧౫, సం. లో ఈరెండుదుర్గములను ముట్టడించినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఉదయగిరిదుర్గమును స్వాధీనముచేసికొని, ఆసమీపములో నుండిన కొండపల్లి బెల్లంకొండ, వినుకొండ నాగార్జునకొండ వశపఱచుకొని తనసేనాధిపతులైన కొండయ్యను కొండవీడులోను, భాస్కరయ్యను వినుకొండలోను వీరభద్రుని బెల్లంకొండలోను, అయ్యలయ్యను నాగార్జునికొండలో నుంచెను. ఈ ఉదయగిరి దుర్గము ముట్టడించినప్పుడే కృష్ణుని సుందరవిగ్రహము విజయనగరము తీసికొనివచ్చి గొప్పదేవాలయము కట్టినట్లు తెలియుచున్నది. ఈ ఉదయగిరిని ఒకతాలూకాచేసి ఒకతాలూక్ దార్ (కార్యకర్తను) ఏర్పాటు చేసినట్లు నెల్లూరుశాసనమువలన తెలియుచున్నది. ౧౫౧౫ వ సంవత్సరమునందు కొండవీడు స్వాధీనముచేసికొనెను. ఈ కొండవీడు ముట్టడిలో కృష్ణరాయలు, వీరభద్రరాయుని, నరహరిపాత్రుని, మల్లుఖానును, ఉద్దండఖానును, రాచిరాజును, శ్రీనాధరాజును ఇంకా అనేకమందిని పట్టుకొనెనని తెలియవచ్చుచున్నది. ఉదయగిరి కొండవీడు దుర్గముల ప్రాముఖ్యతయే వీనిని స్వాధీనము చేసికొనుటకు అవసరముకలిగించినట్లు తెలియుచున్నది. కొండవీడుకూడ ఒకతాలూకాచేసి నాదెండ్లగోపమంత్రిని కార్యకర్తగా నేర్పాటుచేసెను. ఈ గోపమంత్రియే 'ప్రబోధచంద్రోదయము'నకు చంద్రిక వ్రాసిన అప్పయ్యా[illegible]రుడు. ఈ శాసనము ఆకాలపు పన్నులనుగురించి కొన్ని సంగతులను విశదపరచుచున్నది.

రెండెడ్ల బండెడు చీరల బస్తాలకు ఒక చా[illegible] ఇంక ననేక పదార్థములకు ౧/౨ పదికము ౧ పదికము ౨, ౩, ౪, ౬, పదికములు, ౧ దమ్మ ఉప్పుకో[illegible]

నిర్మకుట భారతచక్రవర్తి



౪౩ వ జాతీయ మహాధ్యక్షులు శ్రీయుత పండిత మోతీలాల్ నెహరుగారు

గ్రహారాలు, బజారులు, వసంతగరుసలు, దేవాలయములకు గోపురగ్గములో-ఈపన్నులన్ని కొండవీడు రాములవారి దేవాలయమునకు ఇచ్చినట్లు కొండవీడు శాసనము వలన తెలియుచున్నది. ఈప్రకారముగా నెల్లూరు కృష్ణామండల ములోనున్న అనంతగిరి, ఉండ్రికొండ, అరుచపల్లి, జల్లె పల్లి, కందికొండ, కప్పులవాయి, నెలకొండ, కంబమెట్టు, కనకగిరి, శంకరగిరి, మొదలైన దుర్గములను స్వాధీనము చేసుకొనెను. ౧౫౧౫వ సంవత్సరములో తిరుమలదేవి చిన్నదేవితోగూడి, ధరణికోటలోనున్న అమరేశ్వరాల యమును దర్శించి, తులాపురుష, రత్నధేను, సప్తసాగ రములను మరికొన్ని గ్రామములు దానము చేసినట్లు శాస నములవలన తెలియుచున్నది. ఉదయగిరిదిగ్విజయమైనపిమ్మ ట తిరుపతి యాత్రచేసి ౩౦,౦౦౦వరహాలతో కనకాభిషేక ము చేసి, ౩ వరుసలు కలిగిన బంగారుహారమును, మాణిక్య ములతో చెక్కిన మురుగలజోడు నిచ్చినట్లు శాసనము తెలుపుచున్నది.

౧౫౧౬ మొదలు ౧౫౨౮ వరకు యుద్ధములేవు. తూర్పున శ్రీకూర్మం మొదలు దక్షిణమున మధురవరకు నిరంకుశము గా రాజ్యభారము చేయుచు, అనేక బిరుదులతో కళంక మైనటువంటి ధర్మరాజ్యమును పాలించుచుండెను. గుంటూరు శాసనములో,, శ్రీమాన్ మహామండలేశ్వర రాజాధిరాజ, రాజపరమేశ్వర రాజతేజోనిధి శ్రీకృష్ణ దేవమహారాయ''లని వ్రాసియున్నది. మహారాయులవారి సేనాధిపతులలో నొకరు రాయసంకొండమారసయ్య (న్యాయిశీ కొండమారా అనెను) విజయనగర ధ్వజమును సింహాద్రిలోను, శ్రీకూర్మములోను, నిలిపినట్లు తెలియు చున్నది. దక్షిణదేశమందు అనేక దేవాలయములు బాగు చేయించి, మంటపములు కట్టించి, బ్రాహ్మణులకు గ్రామము లిచ్చి, యెంతో ధనము దేవాలయముల నిమిత్తము ఖర్చు పెట్టెనని శాసనము వలన తెలియుచున్నది. మధుర, రామ నాడ్, దక్షిణకన్నడ జల్లాలో కూడ రాయలవారి శాసన ములుండుట, వారిరాజ్యము అంతవరకు విస్తీర్ణమైనట్లు సూచించుచున్నది. రామనాధు జిల్లాలో దొరికిన శాసన ములో ఈళీం మొదలైన అన్ని దేశములు జయించి, ఏనుగు లవేటను జూచెనని యున్నది. కీర్తిశేషులైన వేంకయ్యా గారు యీశాసనము చాల అపూర్వమైనదనియు, ద్రవిడ దేశములో శ్రీకృష్ణదేవరాయులు ఈళీమును జయించె నని చెప్పుట ముఖ్యాంశమనియు నుడివిరి.

శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవమతాభిలాషియయ్యు శైవ వైష్ణవాలయములు రెండింటని వృద్ధిపఱచి అనేక దాన ములు చేసినట్లు తెలియుచున్నది. వారి కులదేవత తిరుమల వేంకటాచలపతి. మనకందఱికి ఈ దేశమందున్న పుణ్య స్థలములలో గొప్పది తిరుపతి. ఎంతవరకు మనకులదేవతల యందు మనకు ఆదరభావ ముండునో, యెంతవరకు మన పూర్వీకులైనటువంటి ఋషులు, మునులు, సామాన్యజను లకుగోచరులై నివసించిన యేకాంత స్థలములైనటువంటి కొండలు, అరణ్యములు, మనకు యాత్రాస్థలములుగానుం డునో, అంతవరకు ఈకృష్ణదేవరాయలు యొక్క కీర్తి నాశ ముకాకుండా వారి రాగివిగ్రహమును అక్కడ కట్టించిరి. అక్కడ అపటములో దర్శనపఱడిన రాజకళ, వజ్రవై డూర్యములతోగూడిన తురాయి, పతకములు, పట్టుశా లువ, ఆ మీసముల సొగసు చూచి, అతిరుపతి దేవాలయ ములో ఒక అంగవస్త్రమును ధరించి మరియొక వస్త్ర మును నడుమునకుబిగించి, రెండు హస్తములను జోడించి, ఇరుప్రక్కభార్యలతో, భక్తివినయములతో నమస్కారము చేయు విగ్రహములను జూచి నప్పుడు, కృష్ణదేవరాయలు బలపరాక్రమములలో నందరిని మీరి, కర్ణాట ఆంధ్ర ద్రవిడ దేశములను నిరంకుశముగా పాలించిన వాడే కాకుండా తన ఇంద్రియములన్నిటిని జయించి, శాశ్వతమైన సుఖ మిచ్చునది, పరమాత్మునియందు భక్తిగాని, రాజ్యముకాని, ఈ ఐశ్వర్యముకాని, కాదని యెల్లకాలమునకు సాటించిన వాడనికూడ మనకు స్ఫురించగలదు. ఆర్కాటు జిల్లాలో తిరువణ్ణామలై శివాలయమందు వేయిస్తంభముల మంట పము, ఒకసరోవరము, ౧౧ అంతస్థుల గోపురము కట్టిం చెను. చిదంబరములో నొకజయస్తంభమును కట్టించి, తూర్పున ఒకగోపురము కట్టించెను. తంజావూరు, తిరుచ

నాపల్లి, సేలము, పుదుక్కోట మధుర, కడప, బెల్లారి, అనంతపురము జిల్లాలలోగల దేవాలయముకొరకు ఇచ్చిన దానశాసనము లనేకములు కలవు.

ఈ దేశములనుండి రాయల వారికి పంపవలసిన పన్నులు దేవాలయముల నిమిత్తము వ్యయపరచుటకు ఈ శాసనములు అధికారము నిచ్చుచున్నవి. ఈ శాసనముల వలన ద్రవిడదేశమునందు వాడుకలోనున్న పన్నులు తెలియుచున్నవి. సాలెవాడు ఒక మగ్గమునకు ౩ పణములు, ఒక నాగలికి 3 పణములు, యేకచోరు, వరిసోరు, అలసు రిగే, గోది, అరను పేరు—ఈ ప్రకారముగా ౧౧,౧౨వ శతాబ్దములందు పశ్చిమదేశములో సామంతరాజులు అనేక విధములైన పన్నులు వసూలు చేసినట్లు, వీరుకూడ చేయుచుండిరి. తుంగభద్రానదీ దాటించు పడవలు కూడ పన్ను ఇచ్చినట్లు ఒక శాసనము వలన తెలియుచున్నది. వివాహసమయమందు కూడా ఒక పన్ను ఇచ్చినట్లు కడప శాసనములో చెప్పబడియున్నది.

ఈ పన్నుల గురించి చదివినప్పుడు మనదేశీయ రాజులు ప్రజల ధనము పన్నుల నిమిత్తమై విస్తారముగా గ్రహించుచుండిరని తెలియవచ్చును. కాని ఈ ధనము తిరిగి జనులకు ఇచ్చివేయుట గాని, కొన్నికొన్ని క్షామము మొదలగు విపరీతకాలములలో వసూలుచేయకుండ నుండుట గాని ఆచారముగానుండెనని శాసనముల వలన తెలియుచున్నది. తంజావూరులో ౧౦౦౦౦ వరహాలు, ఆర్కాటులో ౧౦౦౦౦ వరహాలు, సేలములో వసూలైన పన్నులు, కడపలో వసూలైన పన్నులు, కొండవీడులో వసూలైన పన్నులు ఆ ప్రాంతములలో దేవాలయములకు ఇచ్చినట్లు తెలియుచున్నది. ఈ కాలములో విద్యాశాఖ, పరిశోధనశాఖ, కొంతమట్టుకు కట్టడములశాఖ యేయేకార్యములు చేయుచున్నవో ఆ కాలమందు దేవాలయములు చేయుచుండెను. దేవాలయములే ఆ కాలపు శిల్పవిద్యాలయములు, ఆ కాలపు శిల్పసైపుణ్యమును ఈ దేవాలయములే కనుపరుచుచున్నవి.

ఈ ప్రకారముగా రాజ్యమందంతటను ధర్మములుచేసి కట్టడములు కట్టించి, హిందూసామ్రాజ్యమును వృద్ధిచేయుటయే గాక, తన ప్రధానపట్టణమైన విజయనగరమును ఇంద్రనగరమువలె జేసెను. కోటలో హజార రామస్వామి దేవాలయము కట్టించెను. దేవాలయప్రాకారమంతటను రామాయణ కథలు చెక్కించెను. కృష్ణస్వామి దేవాలయమును ప్రారంభించి ఒకగోపురమును పూర్తి చేసెను. ఈ విఠ్ఠలమూర్తికి ౯౬౧ బంగారు నెమళ్లు, ౨౫, వెండి శెమ్మెలు, ౨౦౦ ఆవులు, ౪ గ్రామములు ఇచ్చినట్లు శాసనము వలన తెలియుచున్నది. మద్రాసు గౌవర్నమెంటు వారికి కొంతకాలము పరిశోధకాధిపతి అయిన రేద్రోగగారు "ఈ ఆలయము అతిసుందరమైన చిత్తరువులతో నిండియుండెన"ని వ్రాసియున్నారు. కృష్ణదేవరాయల యొక్క విష్ణుభక్తికి ఈ దేవాలయములే నిదర్శనములు. కృష్ణస్వామి ఆలయము వద్ద పెద్ద రాతిమీద చెక్కిన ఉగ్రనరసింహ విగ్రహమున్నది. కొందరు పాశ్చాత్యులు ఈ విగ్రహమునుజూచి అది వికారముగానున్నదని వ్రాసియున్నారు. నరసింహమూర్తి యొక్క చరిత్ర, హిందూమతంలో నరసింహుని ప్రాముఖ్యత ఆ సంబంధమైన పురాణములన్నియు తెలియనంతవరకు ఆ శిల్పకారు యొక్క ఉద్దేశము, పాశ్చాత్యులకు తెలియదు. పూర్వము, పాశ్చాత్య శిల్పశాస్త్రమే గొప్పదనియు ఉన్నది ఉన్నట్టు తెలియజేయుననియు వాడబడుచుండెను. హిందూ శిల్పశాస్త్రము పురుషలక్షణములు ఉన్నవి ఉన్నట్టువర్ణించకుండ, దృష్టికి అగోచరమైనటువంటి పదార్థమును ఒక దేవతనో రాక్షసునినో సృష్టి చేయుచున్నది. ఇదేమి అది అంతశ్రేష్టమైనది కాదని చెప్పుచుండెడివారు. ఇప్పుడు పాశ్చాత్యులుకూడ వారి ఉద్దేశములను మార్చుకొనుచున్నారు. హిందూశిల్పకారులు దోషబుద్ధుడైనటువంటి జీవుని అంగములు వర్ణనచేయుటకంటె దోషరహితుడు, పరిపూర్ణుడైనటువంటి పరమాత్మయొక్క విశదమైన రూపములు వర్ణించుటయందు ప్రతిమారూపముగానైన విగ్రహరూపముగాను నిర్మాణము చేయుటయందు నైపు

ర్యాతిపొందిరి. సకలజనులకు సంతోషముకలిగించు ముద్దు కృష్ణుని ప్రతిమచేసిన శిల్పకారులు, ఉగ్రనరసింహ ప్రతిమ చేసినప్పుడు, వారికి శిల్పశాస్త్రము స్వల్పకాల ము నిరోధించలేదు. కృష్ణప్రతిమలో సంతోషకరమై న గుణములు కలుగునటుల నరసింహప్రతిమలో భయం కరమైన గుణములు కలుగునటుల శాస్త్రోక్తముగా వారు ప్రతిమలను తయారుచేసిరి. కృష్ణదేవరాయని కాల మందు హిందూశిల్పములు చాలవృద్ధిపొందినవని అనుటకు సందేహము లేదు.

కృష్ణదేవరాయలు కేవలము దేవాలయముల కట్టిం చుటయందేగాక ఇతర కట్టడములయందు కూడ చాల అభిలాష తీసికొనెను. తనపట్టణమందు గొప్పతటాకమును నిర్మించెను. పంటకాలువలు అనేకములు నిర్మింపఁబడెను. నాగలాపురము అను క్రొత్త పట్టణమును కట్టించెను.

౧౫౨౦వ సం. నందు రాయచూరు యుద్ధము జరి గెను. బీజపూరునవాబుల స్వాధీనములోనుండిన రాయ చూరు ముట్టడించి స్వాధినముచేసికొనెను. గుల్బర్గకూడ స్వాధీన మాయెను. న్యూనిజ్ వ్రాసినచరిత్రలో ౭౦౩౦౦౦ కాల్బలము, ౩౨,౬౦౦ గుఱ్ఱములు, ౫౫౧ ఏనుగలు యుద్ధముచేసెననికలదు. కొందరు చరిత్రకారులు ఇది అతి శయోక్తి అని వ్రాసిరి. కాని చంద్రగుప్త మౌర్యునిబలము ౬౦౦,౦౦౦కాల్బలము, ౩౦,౦౦౦ గుఱ్ఱములు, ౯౦౦ఏనుగులు నుండెనట. ఆకాలములో రాజులవెంట అనేకమంది సా మంతరాజులుండెడివారు. కప్పముకట్టుటయేగాక యుద్ధ మునకు సేనలనుబంపుట వారికి విధియైయుండెను. ఇప్ప టికి హైదరాబాదులో ప్రముఖులగు నవాబులు, జాగీర్దా రులు వారివారి సిబ్బందులను ఉంచుకొనుటగలదు. పూర్వ ము లంగరుఉత్సవము జరుగుచుండెడి దినములలో సైన్య మును జూచినవారు కృష్ణదేవరాయల సైన్యము అతిశ యోక్తి కాదని చెప్పుచున్నారు. తంజావూరులో దొరికిన ఒకశాసనము రాయచూరుయుద్ధములో ఆపత్ సహాయుఁ డను ఒకబ్రాహ్మణుఁడు యుద్ధముచేసెనని చెప్పుచున్నది. బ్రాహ్మణులు మంత్రిత్వము చేయుటయే గాక అప్పు

ప్పుడు ఆపత్సమయమందు వీరసహాయమునుకూడ చేయు చుండిరి.

౧౫౨౦-౨౯ వరకు రాజ్యమును నిరంకుశముగా పాలించి మరణమొందెను.

"హిందూదేశ రాజులు మిక్కిలి పరాక్రమ వంతులై, అనేక దేశములు జయించి, నిరంకుశ సామ్రా జ్యము అనుభవించినప్పటికి, వారు జనసమ్మతమైన పరి పాలన చేయలేదు. జనులు వారు యెట్లు పాలించినను బద్ధులై జడభూతములవలె పన్నులు చెల్లించుచునుండిరి" అని రాజ్యతంత్రములను గురించి వ్రాసిన మేయిన్, గ్రీన్ మొదలగు వారు వ్రాసియున్నారు. ఇది యెంతవఱకు నిజము? కృష్ణదేవరాయలు మొదలగువా రెటువంటి పరి పాలనము చేయుచుండిరి, అని కొంచెము ఆలోచించ తగినది. ప్రధానపట్టణమునుండి రాజ్యమంతయు స్వయ ముగా పరిపాలన చేయుట అసంభవము. వేరువేరు ప్రాం తములందు వేరువేరు ఏర్పాటులు చేయవలసియుండును. ఆ ప్రాంతములో నుండువారికి తెలిసినట్లు, ప్రధానపట్టణము లోనుండు వారికి వారికష్టసుఖములు తెలియవు; గనుక రాజ్య మంతయు ననేక భాగములుగా విభజింపఁబడి యేయేభా గమునకు అవసరమైన యేర్పాటులు ఆ ఆభాగములులో జేయుటకు అధికారులను ఏర్పాటుచేసిరి. ద్రావిడదేశము లలో నాడు, కోట్టము, మండలము అని భాగములుండెను. ఆంధ్రదేశములో స్థలము సీమ, రాజ్యము, అని భాగము లుండెను. ఈభాగములలో వేరువేరు అధికారులుండిరి. ఈప్రకారము ఏయేప్రాంతములలో ఆప్రాంతములకు అనుకూలముగా అధికారులను ఏర్పాటు చేసినను, ప్రధాన పట్టణమునుండి వీరు సరిగా పరిపాలించుచున్నారో లేదో తెలిసికొని, అన్యాయము లేకుండ ఏర్పాటులు చేయఁబ డెను. సేలంజిల్లాలో దొరకిన ఒకశాసనములో పెరు మాళ్ కణియ వార్ దేవాలయములో ముగ్గురుస్థానికులను అన్యాయము చేయుటవలన ఆగ్రామాధికారులుతొలగించు టకై విజయనగరమునకుఁబోయి, రాజుగారి చూడనెంచగా ప్రధానమంత్రి అయిన తిమ్మరుసు వారికి రాజుగారిదర్శ

నము చేయించెననియు, రాయలవారు వారికోరికను నెరవేర్చెననియు, వారికిపుష్పమాలలువేసి,ఒకశాలువ,ఒకగుఱ్ఱము, ఒకగొడుగు ఇచ్చెననియు, శాసనములో నున్నది. దీనివలన రాజుగారు సామాన్యజనులందరకు స్వయముగా దర్శనమిచ్చుచుండిరనియు,సామంత రాజులు వారిష్టమువచ్చినట్టు చేయుటకు వీలులేకుండెననియు తెలియుచున్నది. ఈవిషయమునే అనంతపురము జిల్లా శాసనములో "నమస్తభువనాశ్రయ" అను బిరుదము తెలియచేయుచున్నది.

ఈకాలములో రాజులను వారిష్టము వచ్చినట్టు పరివర్తించకుండ జనసభలు ఎన్నికలు, మొదలైన అనేక యేర్పాటులు చేయఁబడుచున్నవి. ఆకాలములలో సభలుండెనుగాని, సభలకు స్వతంత్రము లేకపోయెను. అయినను రాజులు తమ స్వేచ్ఛానుసారముగ పరిపాలనచేయకూడదనియు, కొన్నినిర్బంధములకు లోఁబడి యుండవలెననియు, పురాణకాలమునుండి యేర్పాటులుండెను. గ్రీకు దేశమందు తత్వబోధకులలో గొప్పవాడు ప్లేటో. ఎటువంటి రాజ్య పరిపాలన మంచిది? రాజుయొక్క పరిపాలనమా? శ్రీమంతులైన సామంతుల యొక్క పరిపాలనమా? సామాన్య జనులయొక్క పరిపాలనమా? ఈసంగతులు చర్చించుచు రాజు కుండవలసిన గుణములన్నియు చెప్పెను. ౨ వేలసంవత్సరముల తరువాత జర్మనీ దేశములో ట్రైట్షీ నీట్సే,మొదలైన తత్వబోధకులు కూడ రాజుయొక్క పరిపాలనయే మంచిదనిరి. కాని ప్లేటో చెప్పిన పేరు. రాజు గుణములు, తన పరిపాలనమందు ధర్మమును అవలంబించుచు, భూమిమీద అవతరించిన దేవునివలె నుండునో ఆరాజు పరిపాలన శ్రేష్ఠమని ప్లేటోనుడివేను. ఏరాజుతన సామర్థ్యమును ప్రకటించిమస్త ప్రపంచమందు తనమాటే వేదమని చెప్పెడు రాజేరాజు అనిట్రీట్షీ చెప్పియున్నారు. ప్లేటో చెప్పిన గుణములుకలిగినరాజు దొరకుట కష్టము. మనరాజనీతిలోనిరాజు ప్లేటో రాజువంటివాఁడు. కౌటిల్యుని అర్థశాస్త్రములో

విద్యా వినీతో రాజావా ప్రజానాం వినయేరతా
అనన్యాం పృథ్వీంభుంక్తె సర్వభూతవాతేరతా.

ఏరాజు సర్వభూతములకు వాతముగానుండునో ఆరాజు పృథ్వీని నిరంకుశముగా పాలించుననియు.

"ప్రజానుఖేవాతం రాజ్ఞః ప్రజానాంచ వాతేవాతం,
నఆత్మప్రియం వాతం రాజ్ఞఃప్రజానాంతుప్రియంవాతం"

ప్రజలయొక్క సౌఖ్యమే రాజుయొక్క సౌఖ్యము ఆత్మసుఖము సుఖముకాదు. అనియుచెప్పబడియున్నది. మహాభారతములో

పూర్వాహ్నే ఆచరేద్ ధర్మం ధ్యాహ్నే అర్థముపార్జయేత్ సాయాహ్నే ఆచరేత్ కామమిత్యేషావైదికీ సుశ్రుతి

ఉదయమందుధర్మము, మధ్యాహ్నమందు అర్థము, రాత్రియందుకామము. రాజుఆచరించ వలయుననియు వక్కాణింపబడియున్నది.

అనగా ప్లేటోతత్వవేత్త అయిన రాజేరాజనియు, మహాభారతము ధర్మార్థకామములు మూడుపొందుటకు ప్రయత్నముచేయురాజేరాజనియు కౌటిల్యుడు,సర్వభూతములందు ప్రియముగురాజేరాజనియు చెప్పెను.అటువంటి గుణములన్నియు కలిగి దక్షిణ హిందూ దేశమును ప్రకాశముకలుగజేసినటువంటి మహామహులని స్మరించి, కాదుపూజించి యేదేశమందు ౨ న శతాబ్దమునందు ఆంధ్రరాజులు నాసిక్ మొదలు కృష్ణానది వరకు నిరంకుశముగా పాలించిరో, ౭ వ శతాబ్దమందు పులకేశిమహారాజు అజంటా చిత్తరువులువ్రాయించి పారసీకరాయబారులకు దర్శనమిచ్చెనో, ౮ వ శతాబ్దమందు రాష్ట్రకూటరాజైన కృష్ణుఁడు కైలాస, యెల్లోరా కట్టడములు కట్టించెనో, ౧౧ వశతాబ్దమందు చాళుక్య విక్రమాదిత్యుఁడు బిలణుఁడు విజ్ఞానేశ్వరుఁడు మొదలు పండితులను పూజచేసెనో, ౧౨, ౧౩ వ శతాబ్దములో కాకతీయసామ్రాజ్యము పాశ్చాత్యభాటసారులకు ఆశ్చర్యము కలుగజేసెనో అట్టిదేశము యొక్క ౧౫౦౦ సంవత్సరముల చరిత్రను జ్ఞాపకము తెప్పకొని, మనమందరము పుట్టుకవలన నాలుగు వేరు వేరు వర్ణములవారమై నప్పటికి కర్మవలన ముఖ్యముగా క్షత్రియులము, వైశ్యులము,గనుక కేవలము అర్థకామములు దేమునిగియుండుటవలన దేశాభివృద్ధికాదని తెలిసికొని ధర్మార్థకామములు కూడ ఆచరించుచు మనదేశమును తిరిగి ఉన్నతస్థితికి తెచ్చుట ప్రయత్నించెదము. ఈశ్వరుడు ఈయత్నమున మనకు సహాయము చేయుగాక.

# భారము

## భూషణం

భారమయ్యె మోయలేను
పరమేశ్వర దరిజేర్పుము — — భారమయ్యె

కను గొలుకుల నెటులనిలువ
గల నీ కన్నీటికడవ,
తొణకి తొణకి ప్రవహించెను
ననుక్షణం బపారమగుచు — — భారమయ్యె

నిశితమైన సాంఘికాభి
నీతములను దవిలియుంట;
ప్రణయ హృదయ మంత
రక్తపాతమయ్యె జగదీశ్వర — — భారమయ్యె

భీకర సంసార వార్ధి
నీదగలనె సంతోషపు
తెప్పలేక, మెప్పులేక,
కష్టమైన, గాకుండగ — — భారమయ్యె

నిరుపమ విజ్ఞానమూర్తి
నిర్మల సంతోష రాశి
నిశ్చలప్రణయస్వరూపి
నేనాటికి సమకూర్చెదో! — — భారమయ్యె

హృదయ కుసుమ దళములన్ని
పదిలపరచి దండగుచ్చి
మృదుపదంబులను బిగించి
వదలివేతునా జీవము — — భారమయ్యె




# మేఘపు తునుక

గాడేపల్లి సూర్యప్రకాశరావు

శరత్కాల దివసములు. ఒకనాటి మిట్టమధ్యాహ్న వేళ. ఎండ బాగుగ గాయుచుండెను. ఇంట చేయునదేమియు నంతముఖ్యమగు పని లేదు. మనసు నిర్మలముగ నుండి విశ్రాంతి గోరుచుండెను. ఊరవెలుపల జేరువనున్న యినుకతిప్ప మీదకు బోతిని. చెట్టుక్రింద నీడ చల్లగ నుండెను. చుట్టును చిన్నచిన్న మొలకలు మెల్లగ దలలూచుచుండెను. పచ్చని లేతగరికతివాసి నీడ యందు పరచబడి యుండెను. చిరుశ్రద్ధకముతో మేను వాల్చితిని. తరుశాఖలు మెల్లమెల్లగ పిల్లగాలుల విసరుచుండెను. శరత్కాల దివసములు. ఆశ్చర్య సౌఖ్యపములు. ఎండలు తీవ్రములు కావు; తీవ్రములు కాకనుపోవు. మనసు ఇంటికప్పు నిశ్చగించదు, నీలిమేఘముల కప్పనే కాని, చల్లని చెట్లయాకుల కప్పనే కాని ఇంట నుండ నీయదు హృదయము, వనవనాంతరసీమల తిరుగాడుమనునే కాని.

పైన సువిశాల సునిర్మల నీలాంబరము. శాంతి సముద్రమై విరాజిల్లుచుండెను. చుట్టును విశాలమౌ బయలు. ఇక్కడ నొక చెట్టు, అక్కడ నొక పుప్ప. ఇంతే. ఎదుట చెట్టుక్రింద రెండు మేకలు నిలచి అదే దృష్టిగ నేమో చూచుచుండెను. వేరొకచెట్టునీడ కొన్ని గోవులు పరుండి నెమ్మదిగ నెమరువేయుచు నత్యంత సంతుష్టిని, సౌఖ్యమును సూచించుచుండెను. గోపబాలురు వారియాట నాడుకొనుచుండిరి. వారి చిరుకేకలు, చెట్లయాకుల జలజల. ఇచట నొకపిట్టకూత, అచట నొకపిట్టపాట; ఇంత మించి వేరు ధ్వను లేమియు వచటలేవు. ఎంత సౌఖ్య[illegible] సమయమది! అపుడు నాచిత్తము నే బెంగలు [illegible]యించి యుండలేదు. బాధించు నాలోచనలును లేక శరీర మారోగ్యమును కలిగియుంచెను. హృదయ[illegible] పరిశాంతముగ నుండెను. సృష్టియంతయు శాంతి సౌఖ్యమును గోరు సమయమది. అట్టివేళల [illegible] మహాతేజము వ్యాప్తమైయుండును. అంబర[illegible] ఆ స్వచ్ఛనీలిమ, ఆ స్వేచ్ఛారాగమే మానవ హృదయాం[illegible]బరమునందును ప్రతిబింబితము లగును. ఆహ్యాంత [illegible] ర[illegible]ములు, ఆట్టివేళలు! అట్టివేళల మనసున ఎంతో [illegible]ముగ నూహలు చలించుచుండును. అతివేగముగ నొక[illegible] నెంబడి యొకటి పరుగిడుటకాదు. లేక ఒకేవిషయ[illegible] పట్టి పీల్చుటయు కాదు. అదొక చిత్రరీతిని వాయు[illegible] మున దేలిపోవుట. ఏదియు నొకకార్యార్థమై కా[illegible] ఎందులకో తెలియదు. అట్లు తేలిపోవుట యెందున్న [illegible] ఎంత హాయికొరకె యేమో! ఒక్కొక సమయమున గు[illegible] పక్షి రెక్కలు విప్పి వాయుపథమున హాయిగ దేలి[illegible] నట్లె మహాగాతమిని, నడివేసవి, చల్లని యుష[illegible] కా[illegible] స్వచ్ఛమౌ నీలినీరములు కనబడే కనబడక పరివహిం[illegible] నట్లే. ఆ నీరములపై నేదేని యొక చిన్నినావ, తెల[illegible]

నిప్పియొచటికో హాయిగ బోవురీతినే. అంతే. ఆస్థితి మైకముగాదు. అంతయు దెలిసియే యుండును, కాని వేగిరపాటు లేదు. ఆకసమున చల్లని నీటిమబ్బులు కమ్మి నపుడు, తూరీగ చేయు తొట్రుపాటుకాదు. రంగురంగుల పూలగుత్తులతో నిండి శోభించు వనమున తుమ్మెదకాంత చేయు ఝూంకృతియు గాదు. వీటియందు సౌందర్యము న్నను ప్రశాంతత తక్కువ. ఈయవస్థ వర్ణనాతీతము. అనుభవైక వేద్యమే. మహారణ్య మధ్యమున మునిపుంగవులు మునుపు పొందిన శాంతచిత్తతను పోలియుండు నేమో యిది. మనమైనను ఏ నిబిడారణ్యమునైన నీ హాయి ననుభవింప వచ్చును. చల్లని నీడలు, తరుశాఖలనుండి విశుద్ధములౌ శీతలమారుతములు. ఈచెట్టుకొమ్మ నొకపిట్ట, ఆ తుప్పలనడుమ నొకపులుగు, ఉండుండి యొకసారి హృదయశాంతిని వెలిబుచ్చుచు కూయుచుండును. గాన ప్రవాహములు కావు. గీతికాంజలులైన కావు. ఈపాట నుండి యొకపలుకు, ఆ పాటనుండి యొకపదము. వేరొక చోనుండి యింకొక శబ్దము. ఏజంతువు అఱపో! ఏమృగము పిలుపో! ఇచట సెలయేటి రొద, అచట నాకుల జలజల! వింతవింత ధ్వనులు! ఏమిగ్గైన నేమి, హృదయానందము వెలిబుచ్చుటయే. అంతయును ఇవన్నియు వనశాంతిని మరింత హెచ్చించునే గాని అణుమాత్రమును భంగపరచవు. ఇట్టిదే ఆ వింత శాంతియును. ఆ చెట్టుక్రింది మేకల కండ్లయందే శాంతిగలదో ఆశాంతియే. ఆ చేరువ నీడను నెమరు వేయుచుండిన గోవు ఏసంతుష్టిని, ఏ సౌఖ్యమును సూచించుచుండెనో, ఆసంతుష్టియే, ఆ సౌఖ్యమే. పై వినిర్మల నీలాంబరమున నే నీలిమ పొడసూపుచుండెనో ఆనీలిమయే ఆపిల్లవాయువులం దేలియాడు ఆచల్లందనమే. ఇవియే నాహృదయమును శుభ్రపఱచి, అందుప్రతిబింబితములై యుండెను. ఊహాభావములు మిళితములై మనోహృదయముల జలించుచుండెను. రెండును ఒక్కటిప్రేమాలింగనమున జేరి, మనోహృదయములు నిజస్వరూపములవీడి ఏకములై పోయెను..

దృష్టి ఆకసమువంక దిరిగెను. వెనుకటి గాఢకలిమ, వెనుకటి స్వేచ్ఛారాగము, ఆ శాంతి తేజము అట్లే శోభించుచుండెను. ఆకసము వంక నట్లేచూచుచుంటిని. హాయిగొల్పుచుండెను దృశ్యము.

ఇంత నొకచిత్రదర్శనము!

ఎచటనుండి యిది?

ఏమిది?

ఒక చిన్న మేఘపు తునుక!!

మహావాయుపథమున స్వేచ్ఛాటనము జేయుచు నొక చిన్ని మేఘపు తునుక!

అనంతాకాశమున, ఆ మనోహర నీలాంబర రాజవీధిని, ఒంటరిగ సంచరించుచు నొక మేఘపు తునుక!

మహాంబర సామ్రాజ్యము నేకఛత్రాధిపత్యముగ నేలుచున్నది నొక్కటే చిరుమేఘము!

స్వచ్ఛమౌ యాచిన్ని యంబుదకణము, పున్నమచంద్రుని యొయ్యారమును దీసిబెట్టు భావశ్యములతో, గగనవీధిని పయనమై పోవుచుండెను. ముందుజూడ నేమూల నొక మేఘమైన గనబడదు. వెనుకజూచిన నంతయు నీలిమయే. అంతే యాకాశమున నీయొక్క చిన్ని తునుకయే. దూదిపింజ యనవచ్చును. వెండిరేకన వచ్చును. బయలుదేరి పోవుచున్నది. షికారుముగ సంచారము చేయుచున్నది. మహా యొయ్యారముతో, అత్యంత లావణ్యముతో పోవుచున్నది.

ఎచటికో! ఎందుకో!

ఎంత చిన్ని తునుక!

మేఘమున కింత సౌందర్యముండు ననుకొనలేదు. పోవుచున్నది అతివిచిత్రముగ. ఇంటనందరు విశ్రమించు సమయమున నెవరికి దెలియక వీధిబట్టిపోవు కొంటె బాలునివలె బోవుచున్నది. హాయిగ, అమాయకముగ. ఎవరికన్నులను [illegible] గాదు ఆ పోవుట. ఇతరుల జోక్యమే

లేదు. మాయమర్మము లెరుగదు. స్వేచ్ఛాతరంగ డోలికల నుయ్యాల లూగుటలో మాయయేమి? ధర్మమేమి? పోవుచు న్నది మెల్లిగ నిటునటు జూచుకొనుచు. ఇచట చిత్రముల జూచుచు, అచట చోద్యముల జూచుచు. ఇటనాగుచు, అటునాగుచు. కనబడిన చిత్రము వెంట నెల్లబోవును. అతి సుందరముగ నెగిరిపోవుచున్నది. ఆ చిన్ని మేఘము, మాయమర్మము లెరుగని స్వేచ్ఛతో; తణుకు బెణుకులేని గమనముతో; అత్యంత సుఖదాయకమగు చిరునగవుతో, లోలోన నేమేమొ మాట్లాడుకొనుచు, వేడుకల జూచు కొనుచున్నది! ఆచిన్ని జలదము. ఎంత ఆహ్లాదకము.

మైమరచితిని. చుట్టునంతయు మాయమాయెను. హృదయము చిన్ని మేఘమై పోయెను...............

ఓహో కలసిపోవుచుంటిమి ఇరువురమును! మిన్ను ముట్టి పోవుచుంటిమి! వాయుమిత్రుని పక్షముల నెక్కి యెగిరిపోవుచుంటిమి. మెల్లగ, హాయిగ, వింతలజూచుచు, స్వేచ్ఛగ నెగిరి పోవుచుంటిమి. ఎన్నియో నగరములు, ఎన్నియో పల్లెలు; పోతిమి, కొండలు దాటిపోతిమి, లోయలు దాటిపోతిమి. నదములను, చెరువులను, వనము లను, అడవులను, ఎన్నియో దాటితిమి. అనంతవాయు పథమున, మహోజ్జ్వలగగన వీధిని దేలిపోవుచుంటిమి. ఆద్యంతములులేని మహాస్వేచ్ఛాటనము నిరుపమాన స్వేచ్ఛావిహారము!

...............................................

...............................................

కాని ఎంతకాలము?

...............................................

కూరిమి, పరిపంచము! క్రూరము మరిమి! క్రూరము సమస్తము!

మేఘబాలుని స్వేచ్ఛను జూచి యోర్వగలవా మేఘరాజములు? వచ్చినవి వెనువెంట మహావేగమున! తెల్లని తోలిమబ్బులు. నల్లని కారుమబ్బులు! అంబరము నిండిపోయెను. మేఘావళులతో వాయుపథము కలిగిపో యెను. మహాధూమములు మిన్నుముట్టెను! నభోంతరాళములు చీకట్లలో మునిగిపోయినవి. మిరింగినవి మమ్ము ఈ స్పర్ధ మేఘములు, ఒక్కమారుగ, మహాతూర్ణముగ:

ఇంకెచట మేము? ఎచట మా స్వేచ్ఛ! అంతయు మాయమైనది.

అయ్యో, అయ్యో, మా స్వేచ్ఛ
అమాయకమా మా స్వేచ్ఛ!
పనిర్మలమా మా స్వేచ్ఛ!
మాయమర్మము లెరుగని మా స్వేచ్ఛ!!

మాయము! మాయము!
మహాంధకారము!!

...............................................

ఇంతకును మా నేరమేమి?



౪౩ వ జాతీయ మహాసభాహ్వాన సంఘాధ్యక్షులు

భారత స్వాతంత్ర్య యోధ



శ్రీయుత

పండిత జవాహర్లాల్ నెహరుగారు



శ్రీయుత జే. ఎన్. సేన్‌గుప్తగారు



# ఏకాంతగీతము

ఇంద్రగంటి నాగేశ్వరశర్మ

ఆరిపోయిన దురితంపు టాసలెల్ల
తిరిగి నాప్రాణ సంకట తిమిరమెల్ల
రేపు కొనివచ్చి బాధింప నేపుచెందె
ఎటుల భరియింప నోపుదు నీజగాన!

నా మనోవీధి నెలకొన్న నవ్యకాంతి
అంతరించిన దోక త్రుటియందె దేవ
కొసరి కొసరి యాసలంగూర్చి విసరివైచె
నన్ననంతపాప తిమిర నర్తకునిగ!

ఆసలంగొల్పి యొకపరి నాదరింతు
వయిన నొకపరివేధింతు వంతులేని
దుఃఖ సంద్రాన బడవైచి తోడుపడక,
విధివిధానంబు దాపెడు విధముగలదె!

అస్మ దీయాంతరంగంబు నందునాథ!
నవ్యకాంతులు క్రొంగొత్త నాట్యమాడు
సమయ మాశించి దినములు సలుపుచుందు
నీ విలాసంబు లోలోన నిండిపోవ!







# అదృశ్యవ్యక్తి

ఒద్దిరాజు సీతారామచంద్రరావు

(అక్టోబరు సంచిక తరువాయి)

ఈ ప్రకార మనేకమాసములు గడచెను. ఇట్టి రహస్యఘటనల గుఱించిన గ్రంథము ( Record ) రక్షకశాఖయొద్ద బండిమోతకు మించెను. అయినను ఈ రహస్యచర్యను గుఱించిజూడ వెంట్రుకమాత్రమైన దొరకదు. హిందూస్థానమంతయు నీ విచిత్రవార్తలవలన మాఱుమ్రోగుచున్నది. ఇఁక పిడేళములయం దనినను వారివిలాస సమయమం దీవార్తయే కాలక్షేపయోగ్యమై పోయినది. ఇఁక కలకత్తా నగరమం దనినను వీధియం దేవఁడేని ఆకస్మికముగా నొకని భుజముపై చేయినైచుట తటస్థించెనో, భయముచే కుప్ప గూలిపోవును. జనసమూహమున నెవనికేని కొంచెము పాటి యొత్తిడిగలిగనా అదృశ్యవ్యక్తి యొత్తిడియేయని వడవడ వడకిపోవును. ఒకనాటిరాత్రి —౧౨ గంటలసమయమున చౌరంగీ క్రాస్పోలీసుస్టేషనునందు టెలిఫోనుగంట ధ్వనించెను. తత్క్షణమే యొకకానిస్టబల్ టెలిఫోను యంత్రము చెవియొద్ద నుంచుకొనియెను. అపుడీ క్రింది ప్రశ్నోత్తరములు జరిగెను.

,,పోలీస్ మెన్! హాలో!,, అనిశబ్దించెను.

,,ఆఁ''యని కానిస్టబల్ యుత్తరమిచ్చెను.

,,ఎక్కడినుండి పలుకుచున్నావు?''

,,చౌరంగీ క్రాస్పోలీసుస్టేషన్ నుండి.''

,,ఆఁ అయితే తక్షణము సహాయము బంపవలయును. విచిత్రచోరుడు పట్టుపడియె.''

,,ఉన్నాడా?''

,,హాఁ''

,,ఎపుడు?''

,,ఇపుడే.''

,,ఎక్కడ?''

,,ఇక్కడనే.''

,,పోలీసు ఏక్కడికి రావలయును?''

,,క్లైవ్ స్క్వేర్ నంబర్ పది.''

,,నీ పేరు?''

,,కృష్ణుడు.''

టెలిఫోన్ నిలిచిపోయెను. పదేను నిమిషముల కాలములో క్లైవ్ స్క్వేయర్ నంబర్ పది యింటిముంగిట రెండు మోటారుబండ్లు వచ్చి నిలిచెను. ఇరువురు సార్జంట్లు, ఒక డజన్ కానిస్టబల్ లు దిగివచ్చిరి. 'ఆ యింటి ముంగట నలుబది యేబదిమంది గుమిగూడి యుండిరి. ఈ సమూహమున నొక యావనుడు నిలిచి యేమేమో చెప్పుచుండెను. ఇంతలో సార్జంటు— ,,మిస్టర్ కృష్ణ యెవరు?'' అని యడిగెను. ఆ యావనుఁడు ముందునకు వచ్చి ,,నేనే నండి'' యనియెను.

"సమాచారమేమి?"

"నాగదియందెవరో యున్నారు."

"నీవు చూచితివా?"

"అతఁడు కానుపింపడు!"

"అయితే—ఎవరో యుండిరని నీకెట్లు గుఱుతించితివి?"

"అటుల ప్రశ్నింపుడు. అయ్యా! నే నన్నము తినుటకు వెడలిపోయినపుడు నాగదియందలి దీప మార్పివేయఁబడియెను. నే ననుమానించి మెల్లన గవాక్షమునొద్దకు వచ్చి చూచితిని. ఏమిగలదు? మేజుపై నొక కాగితము పఱచబడియున్నది. దానిపై నా ఫౌంటెన్‌కలము స్వయముగా వ్రాయుచున్నప్పుడు నేను "దేశమంతయు వెదకుచున్న దీ వ్యక్తికొఱకే" యని తలంచితిని. మఱియు "ఇదిభూతమో, పిశాచమో యైయున్నచో ద్వారము బంధించినను అవశ్యము వెడలిపోవును; అట్లు కాదేని లోపలనే బంధింపబడియుండు" నని తలచితిని. ఇది యొకటే ద్వారము. గవాక్షముల కినుపశలాకలు గలవు. మెల్లన ద్వారమునొద్దకువచ్చి చప్పుడుగాకుండ తురంతము నా ద్వారమును బంధించి పైగొళ్లెమును పెట్టితిని. తలుపు చప్పుడు కాగనే ఫౌంటెన్‌కలము మేజుపై పడిపోయెను; విద్యుద్దీప మార్పివేయ బడియెను. పోలీసునకు తెలుపుటకు పూర్వ మావ్యక్తి గదిలోనుండెనా లేక వెడలిపోయెనా తెలిసికొనవలయు" నని తోచెను, ఒక గవాక్షమునుండి లోనికి చూచుచుంటిని. అఱగంటవఱకు సర్వము శాంతిపంతమై యుండెను. తరువాత మఱల దీపము వెలిగెను. అపుడు నేను గవాక్షమునుండి తొంగి చూచితిని, ఫెడేల్‌మని నా ముఖముపై నొకబలమైన హస్తప్రహారము పడియెను. వెనుకకు తిరిగితిని. దీప మార్పివేయబడియెను. మంచముపై దుప్పటమునుగప్పుకొని యెవరో శయనించియున్నట్లు ప్రతీతమగుచున్నది."

పోలీసుసార్జంటు చతురవ్యక్తియని ప్రతీతమగుచున్నది. తక్షణమే ఆ గదిని ముట్టడివేయించెను. సర్చ్‌లైటు ప్రకాశమును గవాక్షముద్వార గదిలోనకు ప్రవేశింపజేసెను. మంచముపైదుప్పటమును గప్పుకొని యెవరో శయనించియున్నటుల ప్రతీతమయ్యెను. కొంచెము సేపటిలో మంచముపైగల దుప్పటము కదలజొచ్చెను. వెంటనే గాలితాకుటచే కొట్టుకొనిపోయినటుల నాదుప్పటము లేచి క్రిందబడిపోయెను. కాని దుప్పటముక్రిందయేమియు లేదు. పోలీసు వేయికన్నులతో చూచుచు కాచుచుండిరి. రాత్రి సంపూర్ణముగా గడచిపోయెను. ఏమియు విశేషములేదు.

తెల్లవారునప్పటికి యీ సమాచారము కలకత్తా పట్టణమునను, తదుపరి రెండు మూడుగంటలలో దేశమునందంతటను వ్యాపించెను. సూర్యభగవానుడింకను కలకత్తా వాస్తవ్యులకు దర్శనమీయలేదు. అప్పటికే క్లైవ్ స్క్వేయర్ నంబర్ ౧౦ యింటి చుట్టు లక్షలజనము మూగిపోయిరి. అదృశ్యవ్యక్తిని పట్టుటకు కావలసినదానికంటె నీ జనమును సర్దుపాటు చేయుటకెక్కుడుకష్టము పోలీసునకు కలిగినది.

పగలు పదిరెండుగంటలైనది. కాపలాకాయుచున్న పోలీసునకంటె అచ్చట మఱియేమియు మిగిలిలేదు. ఒక గంటకాలము మఱియు నతిక్రమించెను.

"అయ్యా! ఆఁకలియగుచున్నది. ఏమయిన భోజనమైతె నిడుడు." అని గదినుండి వినవచ్చెను.

శబ్దము వినవచ్చుటయే తడవు—సార్జంటు ముందునకువచ్చి యిట్లు సంభాషించెను:—

"నీవెవరు? ఎచ్చట నున్నవాఁడవు?"

"మనుష్యుఁడను. మఱియు, నీకెదుట—గవాక్షమునొద్ద నిలిచియున్నాను."

"కాని, నీవు కానుపింపవేమి?"

"ఔను—అదియొక పెద్దకథ. ఇపుడైతె ఆఁకలి యగుచున్నది. గతరాత్రి నేమియు భుజింపలేదు. మఱి యిపుడు పగటి యొంటిగంట సమయము."

"భోజనమునకేమి? ఇపుడే తెప్పించెదను; కాని నీవునాతో ఠాణాకు రావలసియుండును."

గదియంత యుహాసముచే ప్రతిధ్వనించెను. కొంత సేపునకు మఱలనిట్లు శబ్దము వినవచ్చెను:

"నీయిచ్ఛ యెట్లో అట్లేకానిమ్ము. కాని భోజన మిచ్చినగాని వెలికివచ్చెదను."

"కాని నిన్నే ప్రకారము పట్టుకొనవలయును? నీవు కనుపడుటయే లేదే!"

పెద్దనవ్వునవ్వి—నవ్వుచునే

"నేను స్వయముగా నీవెంటనడచెదను."

మఱికొన్ని నిరుపయోగ ప్రశ్నోత్తరములు ముగిసినపిమ్మట భోజనము వచ్చెను. ఎట్లెట్లు భోజనము లోనికీయఁబడుచుండెనో అట్లట్లు చూచుచుండగనే మాయమగుచుండెను. పిమ్మట "పానీయము."

అని శబ్దము విన వచ్చెను. జలముకూడా లోనికీయఁబడియెను.

"ద్వారము తెఱచుకొని కేవల నొకడవుమాత్రమే లోనికిరమ్ము." అని శబ్దమువినవచ్చెను. అన్నిటికంటె కఠినమైన సమస్యయేయిది. తక్కినదంతయు నస్వాభావికము గాదు; కాని, ఇపుడు లోనికేఁగుట కెవరుగాని సాహసించుటలేదు. ఒకరి మొగ మొకరు చూచుకొనఁజొచ్చిరి.

"భయపడకుడు. నేను భూతమునుగాను—పిశాచమునుగాను. నే నవశ్యము మీ వెంట ఠాణాదాఁక నడచెదను."

ఈ వాక్యములవలన సార్జంట్ మహాశయున కొకింత చిత్తస్వాస్థ్యము కలిగెను. పిస్టల్ (చిన్న తుపాకి) యున్న జేబునందొక చేయివైచికొని, రెండవచేతిని చాచుకొని గదియందు—సంశయించుచున్న మనస్సుతో, బలవంతముగా దెచ్చుకొనిన ధైర్యము వడకుచున్న పాలములకు పుష్టిగలిగించుచుండగా—ఆంగ్లేయులు సహజ ధైర్యముగలవారు గావున నొకరీతిగా గదియందు పదార్పణ మొనరించెను.

సార్జంటు అనగా జమాదారు అని చెప్పవచ్చును. వీరు పోలీసు సబ్ఇన్స్పెక్టర్ క్రింది యుద్యోగులే. అయిన వీరు మాత్రము యురోపియనులో, యురేషియనులో యై యుందురు. వేతనముసైత మధికమే. మన కథకు సంబంధించిన సార్జంటు పేదకుటుంబమునకు సంబంధించిన యురోపియన్ మహాశయుడు. అందుచేతనే సంశయించుచునైనను గది జొరఁగలిగెను.

రెండడుగులిడెనో లేదో అతఁడు స్తంభించి నిలిచిపోయెను. పాదాది శిరఃపర్యంత మాతని శరీరము విద్యుత్ప్రకోపము (Electric Shock) వలె వడకఁదొడగెను. ఉష్ణకాలముగాదు; ఉక్కలేదు—ముఖమునఁదొడిన చెమ్మటలు బిందువులు బిందువులుగా భూమిఁదొఱలఁజొచ్చెను. కారణమేమి? ఎవరును ఎదుటఁగాన్పించుటలేదు—కాని ఎవఁడో ఆతని చాచినచేతిలో చేయివైచి హస్తచాలనము (Shake haud) చేయుచున్నాడు. చాలకష్టము మీద జేబున కర్పించి యుంచిన చేతిని పైకి లాగికొని మోటారుబండిని తెమ్మని పోలీసునకు చేతితో సైగఁజేసెను.

౫

అదృశ్యవ్యక్తి పట్టుబడియెననియు, ఠాణాకుఁదేఁబడియున్నవాఁడనియు నీవార్త యింతకు పూర్వమే తెలియఁగలిగెను. కావున పోలీసుకెప్టన్, కొందఱు సార్జంట్లు ఠాణాకువచ్చి చేరిరి. పాతికమంది కానిస్టబల్లు విశేషముగా బిలువఁబడి అచటికి వచ్చిచేరిరి. రెండుగంటలు కొట్టబడిన పిమ్మట మోటారుబండి ఠాణాయొద్ద వచ్చి నిలిచెను. సార్జంటుమహాశయుఁడు మోటారు దిగివచ్చి కెప్టన్ మహాశయునకు సెల్యూట్ నొనరించెను. పిమ్మట వారికి క్రింది సంభాషణము జరిగెను:

"దొంగయేడి?"

"ఇదిగో, పట్టుకొనియున్నాను."

సార్జంటు తన వామహస్తమును కెప్టన్ దొరవారికి చూపించెను.

"లోనికి గొనిరమ్ము."

కెప్టన్ ఒకగదిలోనికేగెను. సార్జంటుకూడా అదే విధముగా అదృశ్యవ్యక్తిని పట్టుకొని అతని ననుసరించెను.

కెప్టన్ కుర్చీపై కూర్చుండెను. అతని చేరువను— మేజునకు వెనుకపట్టున ఒక వ్యవస్థాపకుఁడు కాగిదమును కలమును, సిరాబుడ్డిని పెట్టుకొని వ్రాయుటకు సంసిద్ధుడై యుండెను.

సార్జంట్ గదిలో ప్రవేశించెను. అతఁడు కూర్చుండెను. కెప్టన్ దొర సార్జంట్ వామహస్తము వైపుచూచుచు నిట్లు సంభాషించెను:

"నీవెవరవు?"

అదృశ్యవ్యక్తి ఈ తీరుగా నుత్తరమిచ్చెను:

"మనుష్యుఁడను."

"పేరేమి?"

"నళినీకాంతుఁడు."

"తండ్రిపేరు?"

"తెలుపవలసిన ఆవశ్యకత లేదనుకొనియెద. నా తండ్రి యేమియు నపరాధమొనరింపలేదు."

"న్యాయశాస్త్రమొప్పుకొనదు— తెలుపవలసియే యున్నది."

"వెళ్ళి నా తండ్రిగారిని విచారింపుడు."

"ఎచటనుండును?"

"స్వర్గధామమున."

"ఏమనుచున్నావు?"

"ఇన్ హెవన్—(In heaven)"

కెప్టన్ దొరగారంత వానికి నవ్వు నాపుకొనుట కష్టమయ్యెను. కొంతసేపునకు మరల నడగి వినఁజొచ్చెను.

"నీ వెచటనున్నావు?"

"ఈసమయమున ఠానాలో."

"ఇంతకు పూర్వము మాట?"

"క్లైవ్ స్క్వాయర్ నంబర్ పదిలో."

జ్వరము కొలచు పుల్లలోని పాదరసమువలె కెప్టన్ దొరగారికి చుఱ్ఱున కోపము తలకెక్కెను. శబ్దము పెద్ద ధ్వని లోనకు దిగెను.

"చెప్పనే చెప్పవా?"

అదృశ్యవ్యక్తి శబ్దమతి నమ్రధ్వనితో నుండెను.

"అయ్యా! చెప్పుచునేయుంటిని."

"ఎచట జన్మించితివి?"

"సూతికాగృహమున."

"సూతికాగృహ మేజల్లాలోని గ్రామము?"

సార్జంటునవ్వు నాపుకొనఁజాలక పోయెను. అతనికి దేశ భాషలయందు కొంతపరిచయముగలదు. కెప్టన్ దొరగారి వలె... కేవల మక్కఱగల మాటలను మాత్రమే నేర్చినవాఁడుకాఁడు, అందుచే నవ్వువచ్చెను. మృదు వాక్యములలో నదృశ్యవ్యక్తి యుత్తరమిచ్చెను:

"అయ్యా! ప్రాంతభూగోళము జదివి విడచి యిఱువదినాలుగు వర్షములైనవి. ఇపుడు జ్ఞాపకమునలేదు. అయినను, దానివలన మీకు ప్రయోజనముకూడ లేదు ఏలయన రెండు సంవత్సరములకు పూర్వము గంగాదేవి ఆ గ్రామమును తన కుక్షిఁబెట్టుకొనియెను. నేను దేవరవారి సమక్షమునను న్నాను. నా కొకటి న్యాయముగా విచారించి చెప్పుడు—నేను మీవంటి న్యాయశీలురు చతురులు, బుద్ధిమంతులునగు ప్రభువు మోల నిలచుటకును, దర్శనము పొందుటకు నేమి పుణ్యమొనరించితిని?"

"వెరివెల్. కాని నీవు కానుపింపవెందులకు? ఇది ముందు తెలుపుము."

"దుష్కర్మయొక్క ఫలము."

"కావచ్చును. కాని, ఇది నా మతికెక్కదు."

"అయితే యిందు నా దోషమేమి?"

"అటులకాదు. నీవు పుట్టినప్పటినుండియు నిటుల నే యుంటివా? వివరముగా తెలుపుము."

"మంచిది. అయితే వినుడు. పుట్టినపుడిటులలేను. నేను కలకత్తా యం. యస్‌సి. పాసు చేసితిని. తరువాత ఆవిష్కార విభాగమున పనిచేయుచుంటిని. ఒకనాడొక జర్మన్ తత్త్వజ్ఞుని పుస్తకమున దృశ్యాదృశ్య పదార్థముల భేదకారణమును చదువుచుండగా మనుష్యుడు సహిత మదృశ్యుడు కావచ్చునని నాకు దోచినది. రెండవ నాడు మా ప్రొఫెసరగు మిస్టర్ బ్రౌన్ గారితో నీ విషయమును ప్రసంగింపగా వారు పెద్దగనవ్వి "నీవు బుద్ధి చెడినవాడవైపోవుచున్నావు" అనిరి. నా విచారమంతయు సవిస్తరముగా వర్ణించుచుండగా వినకయే—"I have no time to hear this nonsense" (ఈ తెలివిలేని దానిని వినుటకు నాకు సమయములేదు) అనుచు తనగదిలోనకు వెడలిపోయెను.

"కొలది దివసములకే నాజనకుని దేహాంతమయ్యెను. మఱియొకసప్తాహమునకే నాసతి కాలమునకు గ్రాసమయ్యెను. అది నా కత్యంత దుఃఖసమయము. ఇంటనుండి వెలుపలకు వచ్చుటమానితిని. నెలలకాలము నా పాదములు కడప దాటలేదు. ఏదయిన మాట బలుకుట దుఃఖ మనుపించుచుండెను. ప్రాయికముగా నొంటిగా కూర్చుండు వాడను. కొన్ని దినములకు పిమ్మట జర్మన్ తత్త్వజ్ఞుని వాక్యములు స్మరణమునకు వచ్చెను. అపుడు నాకు విచారించుటకు చాలినంతటి యవకాశముండెను. అనేకవర్షములు విచారించి విచారించి వస్తువుల నదృశ్యమొనరించు నొకవిధిని కనుగొంటిని. ఆ విధిని నిర్వర్తించుటకు విశేషముగా ధనావశ్యకత యొకటియుండెను. నాతండ్రిగారు బ్యాంకులో దాచి యుంచిన రూప్యముల నన్నిటిని వెచ్చించి యుపకరణములను తెప్పించితిని; ప్రయత్న మారంభించితిని. అనేక పర్యాయములు ప్రయత్నించితిని. కాని సఫలతాదేవి దర్శనమీయలేదు. మెల్లమెల్లన ధనమంతయు వ్యయమైపోయెను. ఆభరణములు విక్రయింపబడెను. భూములు విక్రయింపబడియెను. అయినను నాకు నిరాశ కలుగలేదు.

"ఒక నాటి ప్రాతఃకాలమున నేను నాప్రయోగశాలలో నడుగుపెట్టగనే "మ్యావు, మ్యావు," మనుశబ్దము వినవచ్చెను. పిల్లిగదిలో బంధింపబడిపోయెనెమోయని నేను తలంచితిని. నేనీపిల్లిపైననే ప్రయోగక్రమము నడుపుచుంటిని. కాని నేటిదాక నది అదృశ్యము కాలేదు. అపుడు నేనాపిల్లిశబ్దము వినగనే "ప్చ, ప్చ" యని యుపలాలించితిని. తక్షణమే అయిదు సేరుల బరువు వచ్చి నాయొడిలో పడియెను. నా కలవాటయిన పిల్లికావున నది నాయొడిలో గూర్చుండుట కలవాటు పడియుండెను. ఈనాడు పిల్లియొక్క బరువు, దాని అటుపు నాయొడియందే కలదు; కాని యేమియు కానుపించుటలేదు. కొన్ని నిముషముల దాక నేను చిత్తరువునందలి బొమ్మవలె నుంటిని. కాని త్వరలో దానితత్త్వమును గ్రహించితిని. నాప్రయోగము సఫలమయ్యెను. నాసంతసమునకు పారములేకుండెను. ప్రయోగశాలయందా సంతోషముతో నాడుచు పాడజొచ్చితిని. ఒకసారి కుర్చీలో కూర్చుండును—ఒకసారి సంతసముతో గదియంతకలయదిరుగుదును. యథార్థముగా నే నపుడు బుద్ధిహీనుడనైయైపోయితిని. వెనకముందు విచార జ్ఞానము నశించెను. ఇదియే నావిపత్తికి మూలకారణముగా పరిణమించెను. అపుడు నన్ను నావశములో నుంచుకొని యుందునేని నాకిపుడుగల దుఃఖము—క్లేశము నాకు ప్రాప్తి గాకుండెడిదే. అంతేకాక ఈపాటికి ప్రపంచమున సంచలికించు గొప్పవిజ్ఞాన వేత్తనై యుండువాడను. కొంతసేపునకు నాసంతోషము సామాన్యస్థితికి వచ్చినపుడు గతరాత్రియే

...చే నాప్రయోగము ఫలవంతమయ్యెనా యని ...పఁదొడగితిని. నాదృష్టి ఉపకరణము (Apparatus) వైపు ప్రసరించెను. రాత్రి విద్యుత్ప్రారంభకము (Electric switch) ను నిలిపి వేయలేదు. నీరంధ్ర ... (Vacuum's tube) కెదుటనుంచఁబడిన దృగ్రక్షణము (Shade) మేజాబల్ల క్రిందఁబడి చూర్ణము చూర్ణ...గ కానుపించెను. పిల్లి బల్లమీఁది కెక్కి యుండెను. పిల్లి ...చే ఆసిడ్ క్రిందబడిపోయి యుండునని తలఁచితిని. ...నేలేచి స్విచ్‌ను నిలిపి వేయఁదలచి చేతిని చాపితిని. ...తలనొరిగి పోఁజొచ్చెను. కనుల యెదుట నంధకారగము ...కించెను. కోటును పైకెక్కించితిని కాని చేతియొక్క ...మైన గానరాదు. రాత్రి యేప్రయోగము పిల్లి న...మొనరించెనో ఇపుడా ప్రయోగమే నన్నా స్థితికి ...యున్నది. విద్యుత్తు నార్పివేసి అచట గూర్చుండి ...నా నూతనస్థితి ఫలమునుగూర్చి విచారించుచుంటిని. ...స్వయముగా నదృశ్యవ్యక్తి కావలయునని యెపుడు ...కోలేను. జరిగిన దంతయు ప్రమాదమున నైపోయి ... గడచిన రాత్రి ప్రమాదమున విద్యుత్తును వెలిగించి ...యుంచితిని— ప్రమాదమున పిల్లి గదిలో బంధింపఁ...యుండెను. ప్రమాదమున బిల్లి మేజాబల్ల పైకెక్కెను. ...తెలియక వాక్యూమ్ ట్యూబున కమరించిన షేడ్‌ను ...గొట్టెను. పిల్లి అదృశ్యమయ్యెను. పిల్లిని చూచి ...నేనొక పెద్ద పొరపాటు చేసితిని. కారణమును ...యే. కారణము తెలిసి కొనకయే నాసంతోష...ప్రకటించుకొంటిని. ఎందు? నాకు నాప్రయోగ...ము లభింపవలసిన తావున!

"సాయంకాల మైదుగంటలయ్యెను. ప్రొద్దున ...యు భుజింపలేదు. ఆకలి వేపుకొని తినుచుండెను. ...ని పిలచితిని. అతని పేరు మురారి. నాపిలుపు ...వప్పు మురారి భోజనము దెచ్చెను. అన్నమును ...చి యేమో అడుగుటకు నావైపుజూచెను. అతని ...ముఖముపై పడిపోయెను. పిమ్మట చేతిని గాంచె ...కంపింపఁ దొడగెను. కెవ్వున నఱచి వివసు డయ్యెను. క్రింద బడిపోవువాఁడే కాని నేనాపి మంచముపై బరుండబెట్టితిని. ముఖముపై చల్లనినీరు జల్లితిని. కొంత నేపున కాతఁడు కనులను మెల్లన విప్పెనుకాని వెంటనే మఱల మూసికొనిపోయెను. అపుడు నాకేమి తెలియదు, కాని నేను అద్దమునొద్దకేగి చూచుకొని నపుడు మురారి భయకారణము నాకు తెలియవచ్చెను. ముఖము కంఠము వరకు లేదు. కుట్రపుపనివాఁడు కుట్టి వేలాడవైచిన కమీజు (Shirt) వలెనుండెను. అనగా నద్దమున నేను గ్రహించిన కమీజుమాత్రమే కానవచ్చుచున్నది. తలలేదు. చేతులు లేవు. నేనేచూడజాలనంతటి భయానకముగా, అస్వాభావికముగానుండెను. చాలాసేపు నాకే భయమయ్యెను. నా స్థితి నద్దములో నేనే చూడజాలక పోయితిని. నేను మఱల ప్రయోగశాలకువచ్చునప్పటికి మురారి పారిపోయెను. మేజాబల్లపై అన్నము పెట్టఁబడియున్నది. ఆఁకలి దహించుకొని పోవుచుండెను. ఎటులనో కొంతదిని నా నూతనస్థితినిగురించి విచారించుచుంటిని.

"అటుతరువాత రమారమి రెండువర్షములదాక నే నందేయుంటిని. కాని నేనెవరికి చెప్పక యెక్కడికో పారిపోయితినని లోకులుచెప్పుకొనుచుండిరి. మఱియు— నేనాయింటియం దేమయిన శబ్దమొనరించినపుడు విధినశులైన నా జనకుఁడును, స్త్రీయును పిశాచములై అట్టిశబ్దముల నొనరించుచుండిరని వారనుకొనుచుండిరి. నేనీపిచ్చిలోనే వేలరూపాయలు వెచ్చించి కొనితెచ్చిన యుపకరణములను పగులగొట్టితిని. ఈసమయమున నా పిల్లి మాత్రము నాయొద్దయుండెను. కొన్నినాళ్లకు నామనస్సునకు కొంతధైర్యము, కొంతశాంతి కలిగినపుడు వీధిలోనికి రాదొడగితిని. బట్టలుతొడుగక వెలుపలికివచ్చుటయే సులభము. ఏలయన— వస్త్రములదృశ్యములుకావు. శరీరము, శరీరమందలి ప్రత్యంగము అదృశ్యము. అయిదారుమాసములనుంచి కలకత్తాయందే యున్నాను. ఇక్కడి విజ్ఞాపన పత్రికలను మీరుచూచుచునే యుందురు. కావున మఱల చెప్పవలసిన ఆవశ్యకతయేమియులేదు."

కెప్టన్ ఇంతదాఁక రాతివిగ్రహమువలె కూర్చుండి యుండెను. అంత నాతఁడిట్లు సంభాషించెను:—

"బాగు, బాగు. మిస్టర్ వండర్ లుక్! ఏమి తెలియ రాదు. బుద్ధి తిరిగిపోవుచున్నది."

"ఔను మహాత్మా!

"మంచిది. నీవు మిక్కిలి దొంగతన మొనరించితివి. అందుచే నిన్ను నిర్బంధించియుంచి నీపై యభియోగచర్య జరుపబడును."

"నేనేమియు దొంగతన మొనరింపలేదు. ప్రపంచమున దుడ్డుగఱ్ఱ యెవరిదో, దూడ బఱ్ఱె వానిది. మీరే తెలుపుడు—మీరు భరతఖండమున దొంగతన మొనరించుచుంటిరా లేదా?"

"లేదు—భారత దేశమున మాకు రాజ్యాధికారముగలదు."

"ఆఁ—నిశ్చయము. కాని మీకెవరిచ్చట రాజ్య మొనరించుటకు చెప్పిరి?"

"బాగు, బాగు: ఏమి? రాజ్యము సైతము ఎవ్వరైన చెప్పిననే గాని యొనరించెదరా? ఎవనియందు బల శక్తులుండునో వాడు రాజ్య మొనరించును; బలహీనుఁడెవఁడో వాఁడే పరాధీనుఁడు."

"మిక్కిలి బాగు, మిక్కిలి బాగు, కాని, అయ్యా! ఆంగ్లేయులయందే బలముగలదని నే నడుగవచ్చునా?"

"ఆఁ. చూడుము. యూరోపియనులు రైలు నిర్మించిరి. తారు నిర్మించిరి. నావలు గలవు, తుపాకులు గలవు. నూర్ల తీరుల తుపాకిమందులను నిర్మించిరి. అన్నిటికంటె అద్భుత వస్తువు—మేము వాయు విమానములను, తీగలేని వార్తావాహకములను నిర్మించితిమి."

"కాని, దొరగారు! మీవాటినన్నిటిని తలదన్నెడు నొక దానిని నేనునిర్మించితిని. కావున నా నిర్మాణము యొక్క ఫలము ననుభవించెదను; దొంగతన మొనరింపను. మీరు కనిపెట్టినవాటి బలముచే భరతఖండమును దోచుచున్నారు; నేను కేవలము పొట్ట నిండుటకు మిఠాయి దిందును."

"కాని నీ నిర్మాణము, నీబలము తుచ్ఛమైపోయినది. ఏలయన—నిన్ను మేము పట్టుకొంటిమి. మమ్ము పట్టుకొనువాఁ డెవడు కాన్పింపడే."

"అబద్ధము, సర్వథాబద్ధము. నేను నాయిచ్ఛ కొలది వచ్చితిని."

ఈవాక్యము వెళ్లుచుండగనే కెప్టన్ దొరగారి ముఖముపై బలమైన దెబ్బతగిలెను. సార్జంటును వదిలిన తోపిడిచే నాతఁడు నేల బడిపోయెను; అతుడు కూర్చుండిన కుర్చి ఆతని పైనఁబడియెను.

తత్క్షణమే కెప్టన్ దొరగారు పిస్తోలు తీసి ఢణా, ఢణా రెండు దెబ్బలను గాల్చిరి. పిస్తోలు గుండ్లు ఎదుటి గోడపై లాంఛనములఁ గల్పించెను. ఈలోల్లిపిని లోకులు గుమియై లోనికి వచ్చిరి. గుఱ్ఱివాండ్రవలె చేతులను గాలిలో త్రిప్పఁ దొడఁగిరి. ఈఘటనము జరిగిన పిమ్మట నళినీకాంతుని గురించి మరియేమియు వినరాలేదు.

సంపూర్ణము



# పరితాపము

వోలేటి సీతారామమూర్తి

అప్పుడే విడి, తావిమందానిలాన
సలలితంబుగ విరజల్లి, కళలబొల్చి
ప్రకృతికెనలేని యొక్క లావణ్యమొసగి,
గాలితాకున మెలమెల్ల గదలుచుండి,
నూత్నమకరంద బిందుసందోహములను
అప్పుడప్పుడు కురియుచు నవని పైని,
తీవ జొంపాన వికసించుపూవ! నిన్ను
నరసినంతనె నా మనమందునొక్క-
సారిగా జనియించెను సంతసంబు,
వెంటనే నీదు దరిజేరి వినుతిజేసి
యనుపమంబైన నీదు సోయగముగాంచి
కాంచియెంతయొ కాలంబు గడిపినాను
" అహహ! ప్రేయసి కీయ గన్నారగాంచి
నన్ను మెచ్చు" నటంచును నమ్మి నిన్ను
నట్టె యీ మొండి చేతుల నకట! కోసి
నంతనే నీదు పరిమళం బంతరించె!
సోయగం బంతలోననే మాయమాయె!
నెచటికోగాని పుప్పొడి యెగిరిపోయె!
నొక్కమారుగ తేనియ లొలికిపోయె!
పత్రముల కళలెల్లను బారెనెటకొ!
జాలిగా యేడ్చె తేటియు జనిమె! కడకు
ప్రభ వెలింగెడి కుసుమమా! వాడితీవు;
కటకటా! యంచు నేను దుఃఖంబుతోడ
నెంతయును నీదు కష్టంబు నెంచి యెంచి
నేల విడిచితి నొక్క కన్నీటిచుక్క.



# ప్రాచీన న్యాయ విచారణ

గంగరాజు రఘునాథ రావు



వేదకాలమున జాతులయొక్క నాయకులు న్యాయాధిపతులై యుండిరి. కాని క్రమేణ రాజులయేర్పాటయ్యెను. ఇతనినే న్యాయాధిపతిగ నిర్ణయించిరి. నారద మహర్షి నుడివినట్లు రాజు న్యాయమునకు నిధి. బ్రాహ్మణుడు న్యాయవృక్షముయొక్క వేరనియు, రాజు దానియొక్క కొమ్మనియు, అధికారులును, మంత్రులును దాని ఆకులు, పుష్పములనియు, న్యాయసమ్మతమగు ప్రభుత్వము ఆ వృక్షముయొక్క ఫలమనియు, బృహస్పతి వ్రాసియున్నాడు.

## న్యాయస్థానములు

కాలము మారుకొలది రాజులయేర్పాటు దృఢపడెను. రాజ్యాంగవిధాన మేర్పడెను. న్యాయసభలు నాలుగు విధములనుగ నున్నవని బృహస్పతి వ్రాసియున్నాడు :—

౧. అచలః. ఇది గ్రామసభ.

౨. చలః: ఇది ప్రతినిధులసభ.

౩. రాజుయొక్క ముద్రిగలసభ: దీని అధ్యక్షుడు ప్రధాన న్యాయాధికారియై యుండెను.

౪. రాజసభ:

వీనిపై వేరొకసభ యుండెను. దీని అధ్యక్షుడు రాజు. లేక ఒక బ్రాహ్మణుడు ఎన్నుకొనబడుచుండెను. అధ్యక్షుడుగాక ముగ్గురు సభ్యులుండెడివారు. రాజున్న కూడ సకలమాత్యులుండెను. రాజు ప్రధాన న్యాయాధికారి అభిప్రాయము సారమును, న్యాయశాస్త్రము ననుసరించియు, తీర్పుచేయువాడు. ప్రధాన న్యాయాధికారి అభియోగము విచారించిన పిదప రాజుగారు శిక్షనొసంగుచుండెను. మను, చాణక్య, శుక్రుడు, ప్రధానసభ యొక్క సభ్యులసంఖ్య వివిధరీతి దెలుపుచున్నారు. ఇంతే కాక నీసభకు ప్రజా ప్రముఖులు అభిప్రాయమొసంగుటకు ఎప్పుడు ఆహ్వానింప బడుచుండిరి. వీరి అభిప్రాయమునకు శాస్త్రమునందు విలువగూడ యుండెను. ప్రధాన న్యాయాధికారిపదవికి సత్ప్రవర్తనుడును, విద్యాసంపన్నుడును, నియమింప బడుచుండెను. ముఖ్యముగ నీ పదవులయందు బ్రాహ్మణులే నియమింప బడుచుండిరి.

రాజసభయందు అభియోగముల తీర్పుకూడ చేయ బడుచుండెను. క్రింది న్యాయస్థానముల అప్పీళ్ళు కూడ జరుగుచుండెను.

రాజసభ కాక ప్రతి పట్టణమునందును న్యాయ ... యుండెను. ఇందు క్రిమినల్, సివిల్

న్యాయములు విచారింపబడుచుండెను. శుక్రనీతియందు క్రిమినల్, సివిల్ వ్యాజ్యములకు వేరు వేరు న్యాయస్థానములుండెనని వ్రాయబడియున్నది. సివిల్ కోర్టును ధర్మస్థానమనియు, క్రిమినల్ కోర్టును కంటక శోధనమనియు, పిలుచుండెడివారు.

ప్రతిగ్రామమునందు పంచాయితీ సభయుండెను. ఆ గ్రామముయొక్క చిన్న అభియోగములు విచారించుచుండెను. ఈ పంచాయితీసభకు జుర్మానా విధించుటకును, శిక్ష నొసంగుటకును, అధికారముండెను. అధిక సభ్యుల అభిప్రాయమును బట్టి తీర్పు చేయబడుచుండెను. శుక్రనీతియందును, అర్థశాస్త్రమునందును. ఇది చాల ప్రశంసింపబడినది. ఇంతియకాక సంచార న్యాయాధికారులు కూడ నుండిరని తెలియుచున్నది.

చిన్న అభియోగములకు మరొసభలు నియమింపబడుచుండెనని బృహస్పతి, శుక్రుడు వ్రాసియున్నారు. వ్యవసాయకులును, వర్తకులును, అభియోగములను స్వయముగ తీర్పు గావించుకొనెడి వారని నారదుడు వ్రాసియున్నాడు. ఈ పద్ధతి అన్నిటికన్న మేలైనది. ఏలయన వీరికి సామాన్యముగా నిజపరిస్థితులు తెలియును, అందువలన అన్యాయము జరుగజాలదు.

న్యాయశాస్త్రములయందెక్కడ అన్ని గ్రంథములయందు అప్పీలు చేయవచ్చునని కలదు. రాజసభ చివఱిది. రాజు తీర్మానింపబడిన తీర్పుపై అప్పీలు లేదు. దీనిని చూచినచో ప్రాచీన పద్ధతి ప్రస్తుత విధానములవలెనే నున్న దనుకొనుచున్నది.

## తీర్పు గావించు పద్ధతి

న్యాయశాస్త్రములు నాలుగు విధములవి యుండెను:

౧. ధర్మమునకు సంబంధించినవి.
౨. వ్యవహారమునకు సంబంధించినవి.
౩. ఆచారములు.
౪. రాజ శాసనములు.

ఒక అభియోగము రెండు విధముల చట్టముల క్రిందికి చేరిన దేని ననుసరించవలయునను విషయమునుగూర్చి న్యాయశాస్త్ర గ్రంథములయందు విశదరీతుల చెప్పబడియున్నది. పెక్కు న్యాయాధికారులు ధార్మిక చట్టములకే ప్రాముఖ్యము నొసంగియున్నారు. కొందరు న్యాయాధిపతులు ధార్మికచట్టముల ననుసరించి తీర్పుగానివో, వాద ప్రతివాదము, చర్చననుసరించి తీర్పు గావింపవలయునని అభిప్రాయము నిచ్చియున్నారు. కాని దీనిని అందరు అంగీకరించుటలేదు. అన్నియు ఆచారములననుసరించి, ఆయా వంశముల రీతులు దృష్టియందుంచవలయుననియు, వ్రాసియున్నారు.

న్యాయ సభలు పవిత్ర స్థలమున జరుగుచుండెడివి. బహిరంగముగ ఉదయము, సాయంత్రము విచారణ జరుగుచుండెడివి.

అభియోగముల కారణములు పదునెనిమిది విధములని నారదమహర్షి వచించి యున్నాడు. ఇందు క్రిమినల్ వ్యాజ్యములుకూడ చేరియున్నవి. విచారణ చేయునపుడు నాలుగు విషయములు గమనింపబడుచుండెను :—

౧. పూర్వపక్షము: వాది వాఙ్మూలము.
౨. ఉత్తరపక్షము: ప్రతివాది వాఙ్మూలము.
౩. క్రియ: సాక్షుల వాఙ్మూలము.
౪. నిర్ణయము: తీర్పు

న్యాయాధికారి అన్నియు విచారించి తీర్పుగావించువాడు. దావాలు వ్రాసియైనను, నోటితోనైనను, చెప్పబడుచుండెడివి. కార్యాలయము నందలి రిజస్టరులో ఆ వివరమంతయు వ్రాయబడుచుండెను. దావా దాఖలు అయిన పిమ్మట ప్రతివాదిని అరెస్టుచేసి సభకు తేబడుచుండెను. ఒకసారి జవాబు నొసంగిన పిదప అందేలాటిమార్పు చేయబడకుండెను. కాని ప్రతివాదియొక్క దావాపై విమర్శనము చేయగలిగియుండెను.

## సాక్షులు



సాక్షుల గూర్చి చాల నిబంధనలుండెను. దుష్ప్రవర్తనము గలవాడును, గర్వింపబడిన వృత్తులుగలవారును, వృద్ధులును, పిన్నవయస్సుగలవారును, సారాయి త్రాగువారును, దుఃఖముతోను, అలసియును, ఆకలితోనున్నవారును, మతిభ్రమగలవారును, దొంగలును, సాక్షులుగ అంగీకరించకుండెడివారు. ఏలయన వీరు తమ అవసరములను బట్టి అబద్ధములాడుదురని తలంపబడుచుండెను. సాక్ష్యము నైకొనుటకు పూర్వము సత్యమునుగూర్చి ఉపన్యాసము జరుగుచుండెడిది. న్యాయాధిపతులు, సాక్షుల సంభాషణముబట్టి, నిజానిజములు కనుగొనవలయునని ఆజ్ఞయుండెను.



## పరీక్ష



ఇంతియకాక తీర్పు గావించుటకు మరియొక పద్ధతి యుండెను. నిందితుడు అగ్ని, జలము, విషముచే పరీక్షింపబడుచుండెను. వీని ప్రయోగ మతనిపైకాకున్న అతనిపై నేరమారోపింపబడకుండెను. ప్రాచీన గ్రంథములలో అగ్నిపరీక్షనుగూర్చి కలదు. ఈ పద్ధతి తరుచుగ జరుగుచుండెను. సాక్షులవలన యేవిషయము తెలియనపుడును, న్యాయాధిపతి తీర్పుగావించు భారము తనపై వేసుకొననపుడును, ఈ పద్ధతి అవలంబింపబడుచుండెను. ఆ కాలమున న్యాయవాదులుకూడ నుండిరి. వారిని ప్రతినిధులని శుక్రనీతియందు చెప్పబడియున్నది. క్రిమినల్ అభియోగములలో నేరము ఋజువు పరచుటకు నిందితుని దండింపకుండిరని హ్వ్యాక్ స్టాంగ్ వ్రాసియున్నాడు.

తీర్పు గావించునపుడు చట్టములు కన్నులు మూసుకొని ఆచరణయందుంచకుండెడివారు. కాని అభియోగముయొక్క పరిస్థితులను బట్టి ప్రత్యేకముగ విచారించుచుండిరి.

## శిక్షలు

తీర్పు లేక శిక్షలు యెన్నియో విధములుగనుండెను.

సివిల్ (దివాని) కేసులలో జుర్మానా విధింపబడుచుండెను. లేక బాకీయున్న రూపాయ లిప్పించెడివారు. అక్రమమని తోచిన అభియోగముల కొట్టివేయువారు. రూపాయలిప్పించునపుడు న్యాయాధిపతి తన యిష్టానుసారము ఆ మొత్తమునందు హెచ్చుతగ్గులుచేయుచుండెడివాడు.

క్రిమినల్ (ఫౌజ్దారి) అభియోగములలో జుర్మానా, శిక్ష, కొరడాదెబ్బలు, శరీరమునకు గాయములు చేయుట, దేశమునుండి తరిమివేయుట, గనులలో పనిచేయుటకు నియమించుట, ఉరి దీయుట, మున్నగునవి విధింపబడుచుండెను. ఉరిదీయుట, గాయపరచుట తరుచుగ జరుగుచుండెడివి. శరీరమునకు నొప్పి కలిగించుటకు బదులు జుర్మానా విధింపబడుచుండెనని హ్వ్యాక్ స్టాంగ్ వ్రాసియున్నాడు. ఒకడు మరల మరల నేరములుగావించినయెడల వాని వామహస్తమును నరుకుచుండెడివారు. తల గొరిగించుటకూడ నొక శిక్షయనియు, ఇది చాల నీచమయినదిగా భావింపబడుచుండెననియు, మెగస్థినీస్ వ్రాసియున్నాడు.

సత్ప్రవర్తనముయొక్క జామీనుపైకూడ నేరస్థులు విడుదల యగుచుండిరి. ఒకడు మొదటి తీర్పు అబద్ధమని తలంచిన కొంత ధనము జుర్మానాగ నొసంగి మరల తీర్పు చెప్పెడివాడు. లేక దీని అప్పీలు హైకోర్టులో చేయుటకు హక్కుండెను.

## న్యాయాధికారులు

ప్రాచీన న్యాయశాస్త్రములయందు న్యాయాధికారులను గూర్చియు నిబంధనలు గలవు. వారు పక్షపాతములేక న్యాయవిచారణ చేయవలయుననియు, అట్లుచేయనియెడల తొలగింపబడుదురనియు గలదు. యాజ్ఞవల్క్యుడును, చాణుక్యుడును, దీనిగూర్చి విపులముగ వ్రాసియున్నారు. న్యాయాధికారులు న్యాయదేవతలుగ తలంపబడుచుండిరి. పరిస్థితులు బాగుగ గమనించి తమకు తోచిన రీతి తీర్పు చేయుటకు వారికి స్వాతంత్ర్యముండెను. వీరు అన్ని వర్ణ తులవారి నొకే విధముగ జూడవలసియుండెను.

## ప్రజారక్షణము

న్యాయస్థానము లన్ని తరగతుల వారిహక్కులు గాపాడుచుండెను. నౌకరులకు తమ జీతము కోర్టుద్వార పొందుటకుహక్కుయుండెను. ఇంతియకాక వారుసమ్మతి లేనిచో తమయుద్యోగము విరమించుకొన గలిగియుండిరి. విదేశీయుల రక్షణముకూడ చేయబడుచుండెను. వారిపై కూడనిదే చట్టములు ప్రయోగింపబడుచుండెను.

అయినను ఒక విషయమునమాత్రము అన్యాయముగ జరుగుచుండెను. బ్రాహ్మణులకు సల్ప శిక్ష విధింపబడు చుండెను. బ్రాహ్మణులు దేవతసమానులని భావించుటచే నట్లు జరుగుచుండెడిది కాబోలు!

## విదేశీయుల అభిప్రాయములు

ఆకాలమున భారత దేశమునకు వచ్చిన వారు న్యాయశాఖ పరిపాలనమును ప్రశంసించి యున్నారు. మెగెస్థినీస్ దొంగతనము తరుచుగ జరుగకుండెడిదనియు న్యాయచట్టములను పరిశీలించిన ప్రజలు కోర్టులకు ఎప్పుడో పోవుచుండెడివారనియు, వాయిదాకు వ్యతిరేకముగ వుండిన అభియోగ మొకటి యైనను తేబడలేదనియు, ప్రజలు నోటిమాటలతోనె యిచ్చి పుచ్చుకొందురనియు, భూములు, ఇండ్లు, రక్షణము చేయ నవసరము లేదనియు, వ్రాసియున్నాడు.

మెగెస్థినీస్ పిమ్మట ఒక వేయి సంవత్సరములకు చీనా దేశమునుండి యొక మతబోధకుడు వచ్చెను. అతడు క్రింద తరగతుల వారు అల్పాభిప్రాయులైనను, సత్యమునే పలుకుదురనియు, రూపాయలు యిచ్చిపుచ్చుకొనుటలో మోస మెంతమాత్రము జరుగదనియు, ప్రజలు న్యాయశీలురనియు, ప్రాపంచిక విషయములను, వారు లక్ష్యముజేయరనియు, వీరిలో మోసము నెంతమాత్రము లేదనియు, వాయిదాకు వ్యతిరేకముగ నడువరనియు, ప్రభుత్వమువారి శాసనములు తగురీతిగ నున్నవనియు వ్రాసియున్నాడు.

కాని కాలపరివర్తనమువలన ప్రాచీన పద్ధతులన్నియు, రూపుమాసిపోయినవి.



# కర్తవ్యము

వి. కె. నందూరి

ప్రణయ లేఖల రచియింప పట్టుకాదు
విరహవీచిక లందేల వేళ కాదు
ఆంధ్రి జాతీయ రక్తనాళంబులందు
వేడి రక్తంబు ప్రవహించి వెల్లి విరియ
మేఘ గంభీర రవమున మిన్ను ముట్ట
శౌర్య కుమారు లెల్లరు ముక్త కంఠు లగుచు
వీర తంబులను పాడ వేళ నేడు.



# కవితాతత్త్వము

ఊటుకూరు సత్యనారాయణ రావు

ఏది సర్వాంగసుందరమై రసావేశముతో సత్యాన్వేషణకొఱకు ఆలపింపబడునో అదియే కవిత్వము. అది ప్రశాంత విశ్వగర్భమున చెవికి వినరాని, హృదయైక వేద్యమగు ననంతమధుర మోహనపల్లకీ నిస్వానము. అది ఆకృతిచే బంధింపబడదు. రసార్ద్రమగు మానవ హృదయాకాశమున ఎప్పుడో తళుక్కుమని మెఱపుదీవె వలె మెరసిపోవును.

ఒక మానవుని నుండియేగాక సృష్టిలోని ప్రతివస్తువునుండియు, వాటి అవ్యక్తమధుర వదనముల నుండి కవితాస్వరూపమే పొడకట్టుచుండును. పచ్చని మృదుల తృణాంకుర శయ్యలు, చల్లని మంద పవమానపోతములు, చంద్రికా ధవళములగు శరత్కాలనిశలు, బంగారుజిలుగు పని శోభోత్తు సాంధ్యసంపదలు, కలకంఠ కుహూకల ధ్వానము, తుమ్మెదల ప్రభాతగానము, రాయంచ విహారమున కానందించి అపుడప్పుడే తమ ముఖములవిప్పి చిరునగవు జిలుకుచున్న కొలని లోని పద్మములు; మున్నగు సర్వరామణీయక వస్తుప్రపంచమును, తమ నిశ్శబ్ద విమలహృదయములో కవిత్వమునే, గానము సేయుచున్నవి. ఇది యది యననేల, రామణీయకమగు సృష్టిలోని ప్రతిఅణువును కవిత్వమే.

ఈ కవిత్వమే రసావేశముగల మానవుని మృదులములగు వాక్కులనుండి యనన్యశోభావంతమగు నాకృతితో బయల్వెడలి రసజ్ఞప్రపంచమును మహానంద డోలికలలోనుంచి యూగించుచుండును. తన్మయుడై యుండగా వ్రాసెడి యొక కవిచేతిలోనికలము, దిగంత విశాల మహీతలశాసిత సార్వభౌమకరన్యస్త హేమమయ రాజదండమునకు సహస్రాంశము మిన్నయని వ్రాయుట అతిశయోక్తి కాదు. అతఁడు ప్రపంచమునంతయు నొక్కతరి నవ్వించును. ఇంకొకతరి శోకసముద్రమున ముంచును. వేరొకమారు అసాధ్యమగు నందన వనవాటికల విహరింపజేయును. నక్షత్రవీథికి గొంపోవును. పైనుండియే పాతాళము జూపించును. కాని ప్రపంచముతోడనే ఆతనికి సంబంధము లేదు. ఈ శక్తి నంతయు ప్రపంచమునకొఱకు చూపించుటలేదు. ఒకరు వినలేదని చింతింపడు. ఇంకొకడు విమర్శించునని జంకడు. వేరొకని యానందమునకొఱ కిట్లు సేయడు.

ఆత్మీయానందమునకు ఏ కుటీరమునందైనను, యే సెలయేటి దరినైనను, యే యినుకతిన్నెపైనైనను, ఏకాంతముగ తనలోతాను ఆలపించి ఆలపించి తేలిపోవును. కవిసృష్టికి రసార్ద్రమగు ప్రకృతియే పులకించిపోవుననిన వేరుమాటలేల? తమ దరినుండి గానము సేయునపుడు సెలయేళ్లు భక్తిభావమున తమ శీతలవాకలతో నాతనిపాదములఁగడిగి చల్లుకొనును. లతావితానము తమ అరవిరిపుష్పమంజరుల వర్షించును. స్వయముగా నాతఁడానందతత్త్వములో మునిగియున్నాడు. ఆతని నావరించిన సర్వవస్తు విశేషమును ఆనందమయము. ఆతఁడు జగద్వంద్యుఁడగు నానందమూర్తి.

మానవునిహృదయావేశమునందు రసోత్పాదకమగు [illegible]ల్లు వాఙ్మయరూపమున కవిత్వచిత్రము సేయబడును. [illegible]ందులకాతఁడు మహాపండితుడుగ జదువుకొనబని లేదు. [illegible]క్షణగ్రంథము లతనికి కవిత్వము నేర్పవు. ప్రయత్నించి యలవరచుకొన్న నవి చిలుకపలుకుల సామ్యము జెం[illegible]ను. ఇక కవియెట్లగును—?.

ఖండాంతరులచేగూడ పొగడ్తగనిన విశ్వభారత [illegible]కవి రవీంద్రుడు తు నకు పట్టపరీక్షయందైన నుత్తీ[illegible]డయ్యెనా? లేదు. మహాకవికి ఆత్మబలమును, ఆత్మ సంస్కారమును, అనుభూతియు మాత్రముచాలును. [illegible]ని మధురకవితావాహినిని ఏఛందోనియమమును ఆప [illegible]దు. కవి తనకున్న భావనావైలక్ష్యముతోనూ తనజగ[illegible] కల్పించుకొని, అందు తనకనుపగు నతీతమనోహర [illegible]ల రచించి తన్మన్యమున స్వేచ్ఛగా సంచరించుచుం[illegible]. కంచుమోత పదాడంబరముగాని, దీర్ఘములై [illegible]నిగని సమాసములుగాని యుండవలయునని నియా[illegible] లేదు. సహజభావోద్రేకముగల కవికుమారుఁడు [illegible] చిత్తములను తనమాటలలో కావ్యమునుచిత్రింప [illegible]డు. భావావేశములేని కేవలపదములతో నేమి ప్రయో[illegible]జనము? కవిత్వమునకు భాష అంగము. భావము జీవము. [illegible]షాప్రధానమగు కావ్యము ప్రాణములేని సుందరమగు [illegible]రీరమువంటెది. భావమును భాషను తూచి కరగిపోసి [illegible]వ్యమున్ససృష్టించనివాడే కవి. ఇట్లుగచియించిన కావ్య[illegible] ననుసరించియే లక్షణములు నిర్ణయింపబడెను. కాని [illegible]బంధములతో కావ్యమారంభము కాలేదు. కావ్యము [illegible]స్త్రముగాదు. కావ్యమునకును శాస్త్రమునకును సంబంధ[illegible]లేదు. కావ్యము రసావిష్టమై భావౌచిత్యమును, రా[illegible]మణీయకతను కలిగించును. శాస్త్రము వస్తుతత్వమును [illegible]వరించును. కవితారాజ్యము సుందరమైనది. [illegible]జ్ఞానికరాజ్యము పరమసత్యమును నివేదించును. కవి[illegible] హృదయైకగమ్యమైనది. విజ్ఞానము బుద్ధికేగోచరిం[illegible]. కవియు, వైజ్ఞానికుడును ఒకేలక్ష్యమును నిరూపింపదలచుచున్నను వారిరువురి మార్గములలో చాలభేదముకలదు. * కవిశ్రేష్ఠుఁడగు వర్డ్సు వర్తు (Wordsworth "కవితారాజ్యములోనికి వైజ్ఞానికులు ప్రవేశింపరాదనియు అదియొక పవిత్రతీర్థస్థానమనియు తలంచి "who would botanise over his mothers grave" (తనతల్లిసమాధిపై నెవడు వృక్షశాస్త్రముచదువును) అని విషయనిర్ణయమునకన్న రసానుభూతియే పరమోత్కృష్టమని వచించినాడు. సంగీతము, చిత్రకళయు, గూడ కావ్యకుటుంబమునకు జెందినవే. కాని వానివలన గలుగు నానందము క్షణమాత్రము. కవితానందము హృదయమునకేగాక శల్యమునకును గోచరించి శాశ్వతస్థానము నేర్పరించుకొనగలదు. అందుచేతనే ఆర్యులు:—

"పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః। కో వెత్తి కవితాతత్వం ఈశ్వరోవేత్తి వానవా" యని నిర్వచించినారు. కొందరీ కవిత్వమువలన నేమిప్రయోజనము? పనిలేనివారి కాలయాపనకొక ఆడంబరవృత్తియని రసవిహీనహృదయులు తలంతురు. ఒక కవి, తానురచించిన యొకగీతిక పల్లించుకొనుచు కొన్నిరోజులు నిరాహారియై యుండగలడు. అందేమి యానందమున్నదో ఆతఁడును జెప్పలేడు. కాని ఏదియో నిర్మలప్రేమ జ్యోత్స్నల వెలయించు నొక కాంతివంతమగు జ్యోతి ఆతని హృదయ సౌదాభ్యంతరమున వెలుగుచు రామణీయక చిత్రముల సాక్షాత్కరింపజేయుచున్నది. ప్రపంచిక భవబంధముల నిరికించు ననంతసాంద్రాంధకారచ్ఛటల చించివేసి శాశ్వత మనోవికాసమును, యేకాగ్రతయు కలిగించు జ్యోతివలన గలుగుప్రయోజనము సామాన్యమని తలంచుట యెంతవెఱ్ఱితనము. అంతటి యానందము లేనిదే పోతనవంటిగర్భదరిద్రుడు తినుటకు పట్టెడన్నమును, కట్టుకొనుటకు జీర్ణవస్త్రమేని దొరకక అస్థిమాత్రశరీరముతో దున్నుకొని జీవించినసేద్యకాడు బ్రతికియుండగలడా? పోతనకు కవితానందములేనిచో శుష్కించి భాగ

* బాబు ద్విజేంద్రలాలు రాయల "కాళిదాస భవభూతుల"ను విమర్శన గ్రంథమునుండి.

పతగచనకు ముందే మరణించియుండును. ఆతని యానందముముందు రాజసన్మానములుగూడ తులతూగలేకపోయెను. కార్లైలువంటి యత్యద్భుత కవితాధురీణుడు గూడ కూటికిలేక యల్లాడెను. కాని ఆతని వినిర్మల కవితాధోరణి గిరినిర్ఝరమువలె చల్లగా మెల్లగా ప్రవహించెను. ఆతని హృదయమున నశాంతి బొడకట్టలేదు. కవి దుఃఖములలోగూడ నానందము ననుభవింపగలడు. కావ్యశిల్పమువలన గలుగు సంతోషము నిష్కామము. కారణరహితము. ఎవరేని చక్కని భావోద్దీపకమగు గీతము చదువుచో విని యేలఆనందింతురు? దానివలన నేమిఫలితము కలుగును? ఫలముగోరికాదు, ఆగీతము హృదయమున నొకవిధమగు రసస్థానము నాక్రమించినది. శ్రావ్యముగ వినుపించినది. కవిత్వము ఏభావయందున్ననేమి, అది విశ్వమోహనము. సర్వజన సమాదరణీయము. ఈ కవితాతత్త్వమునుగూర్చి నిఘంటుకారకులలో, విమర్శకులలో కవులలోగూడ భేదాభిప్రాయములున్నవి.ఆ మోహనస్వరూపము నిదమిత్థమని నిర్ణయింపజాలరైరి. విశ్వనాథపండితుడు తన“సాహిత్యదర్పణము”నందు“ వాక్యం రసాత్మకం కావ్యం రసవదేవ కావ్యం” అని సిద్ధాంతీకరించినాడు.

జగన్నాథ పండితుడు

“రమణీయార్థ ప్రతిపాదకశబ్దః”

విద్యానాథుడు

“శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవమ్”

వాగ్భటుని యభిప్రాయము

“సాదుశబ్దార్థ సందర్భం, గుణాలంకారభూషితమ్ స్ఫుటరీతి రసోపేతం కావ్యం కుర్వీత కర్తయే,,

ఆంధ్రకవులలో రసవత్కవితాధురీణుడును, మనోహరకల్పనా ఘటనాఘటనా సమర్థుడును నగుపింగళి సూరనార్యుడు కవిత్వమునుగూర్చి తనయభిప్రాయ మిట్లువివరించినాడు.

శబ్దసంస్కార మెచ్చటను జారగనీక
పదమైత్రి అర్థ సంపదల బొదలం
దలపెల్లన క్లిష్టత నను బ్రదీపితసుగా
బుధరుచ్యి దోషంబు పొంతం బోక
యా కాంక్షితసుస్ఫూర్తి, యాచరించుచును శా
ఖా చంక్రమక్రియం గడవం జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు
ఉపపత్తియెందు నత్యూర్జితముగ
నొకటం బూర్వోత్తరవిరోధ మొందకుండ
దత్తదనయవవాక్యతాత్పర్యశేధ
ములు మహావాక్యతాత్పర్యమునకునొన
బలుకనేర్చుట బహు తెపఃఫలముగాదె

వెబుస్టరు ( Webster ) యిట్లుచెప్పుచున్నాడు.

* “Poetry is the embodiment in appropriate language of beautiful or high thought imagination or emotion, the language being rethmical, usally metrical, and characterised by harmonic and emotional qualities which appeal to and arose the feeling and emagination”

(ఉపయుక్తమగుభాషలో నున్నతములు, సుందరములునగు భావములను సమావేశపరచుటయే కవిత్వము. కల్పన, భావావేశమును గలసియుండవలయును. పాఠకుల హృదయానుస్యూమగు భావోద్రేకమును గలిగించునదిగూడనై యుండవలయును )

బెయిలీ ( Baily )అభిప్రాయమట్లున్నది:—

*Poets are all who love, who feel great truths and tell them and the truth of truth is love.”

*బాబు ద్విజేంద్రలాలు”రాయల”కాళిదాస భవభూతుల విమర్శనగ్రంధమునుండి.

క్కవుల సన్నర్తులలో గణించినాడు షేక్స్పియర్:—

"The lunatic the lover, and the poet are of imagination all compact"

ఆహా! కవి కెంతటి శక్తి యున్నది. నామరూపా దులులేని విషయములకుగూడ తన రామణీయక భావసామర్థ్యంబునన నపూర్వసుందర భాషాకవచనముఁదొడిగి, జీవసంపోసి, లోకమెన్న డెరుంగని యొక అనన్యసాధారణ వ్యక్తిగామార్చి మహానందమువనుభవించును. షేక్స్పియర్ మహాకవియే ఒకానొకసందర్భమున నిదేవిషయము చెప్పినాడు.

"The form of things unknown, the poet's pen turns them to shape, and gives to airy nothing a local habitation and a name."

ఆంగ్లేయవిమర్శకులలో నగ్రగణ్యుడైన మెథ్యూఆర్నాల్డు (Mathew Arnold) అంతటివాడుకవితార్థనిర్ణయము గాని, కవిత్వభావసౌందర్యముగాని, యనంతమనియు అతిమనోహరమనియు చెప్పచున్నప్పు డీమహోత్కృష్ట మగు కళాప్రభావమువంక నివ్వెరపడిచూచుచు నిలువ బడిపోవలసినదే గాని యేమి వ్రాయగలము.



# తారకాసందర్శనము

అలపాటి, కామేశ్వరరావు

ధాతయను శిల్పి నిజహస్తచాతురిమము
నందున దివాకరుండ న్పదారువన్నె
బంగరవు బూదియర్క జేసి బహువిశాల
విమల తారావళీ పద విఫణియందు
నమ్మజూప గాంచికాలమ్మనిమెడి
వణిజుడదిక్రొంచు హర్షసంభరితుఁడయ్యు

నపర దిగ్భాగ నికషావ లాంచలమున
నరుణ సంధ్యాప్రభా సంచయమను నొరను
జేసి యావల నంభోరుహాసనుఁడను
శిల్పి మూల్యంబుకై నిరీక్షించుచుంట
నాతని కొసంగినట్టు రూప్యంబు లనఁగ
చదలు రాజిల్లెఁ దారకా సముదయంబు.




రామకృష్ణశాస్త్రి

౧

"చిన్నదానన!—నే ....."

అభినయిస్తూన్న సానీచిన్నదికాదు.

అనుభవించి ఆనందిస్తున్న రసికుడూ, చిన్నవాడుకాడు:

ఎంతసేపు చూస్తూఉరకున్నా-ఘణతిమారుతుంది కాని పద్ధతిమారడంలేదు. గమకాలూ మూర్ఛనలు 'ఆ'—లు, 'ఓ'లు, ఊ'లు, కలగలిపి గడబిడగా, గల్లంతు పెడుతూంటే, వయసుచెల్లినవాడికైనా వళ్లుమండుకరాదు;

చేతితో ఆగమని సైగచేసి—ఆ—నేను మాత్రం చిన్నవాడినా? ఏమిటే- ఆపైదేదో అందుకుందూ' అన్నాడు ఆయన. పాడేపాట, ఆడే ఆటా, అంతలో ఆపేసి పైట చెంగు చాటు చేసుకుని చిరునవ్వుతో వెనుకకు నడిచింది, ఆ నవలావణ్య నిధానం:

సంగీతసభలలోను, సానిమేళాల దగ్గరా నదురూ బెదురూ లేకుండా ముందు కూర్చుని తలత్రిప్పడానికీ, 'ఆ,హా అనడానికి, 'బలే భేష్, అనడానికి కొందరుంటారు: వాళ్లనిచాటుచేసుకుని, పాటవినడానికిమాత్రమే, చేరే వాళ్లుకొంతమంది: అల్లరిచేయడానికీ, తాముగాకుండా ఇతరులెవరైనా అల్లరిచేస్తే అదమాయించడానికీ చేరే రకాలు సరేసరిగదా!

'ఆపచ్చపిల్లకి గజ్జె కట్టించండి' అన్నాడుచాలా నెమ్మదిగా, సిగ్గు పడుతూ, నాగయ్య గారితో, రాజారాం:

ఓ అదెంత పనోయ్ —అమ్మా కన్నెకాని! అప్పుడే పడుచువాడవు, నీకుపసరు మొగ్గలు కావాలిగాని, (అంతకుముందు అభినయించిన నాయకురాల్ని చూపిస్తూ) ఈ రకాలునచ్చుతాయా?- కానీ నాయనా నీయిష్టమే.

ఇదుగో నీవు, మావాడు నీమీద కన్నేశాడు రా, ముందరికి గా-. రాజా, నీవిట్లుముందుకువచ్చి కూర్చోవోయి— ఊహు సల్లకాదు. రావాలిసిందే.

'ఎరక్కపోయి అడిగానుగదా' అని అనుకుంటూ ఇకవిధిలేక రాజుముందరికి జరిగి కూర్చున్నాడు తల వంచుకునే:

పచ్చపిల్లకి పదహారేళ్లుంటాయి: మనిషి చామన చాయగా ఉంటుంది: ఎప్పుడూ పచ్చపట్టు వోణివేసుకుంటుంది: చాలా నాజూకుగా, ఇంకా కాపురానికి వెళ్లని. ఏగొప్పయింటిపిల్లో లాగా కనబడుతుంది

'చల్లానాయేనూ—లేదా—నామ...న...మూ

క్షేత్రయ్యగారు ధన్యాసిలో పాడారట ఆ మతాన్ని: కాని, ఆచారాన్ని అనుసరించి, ఆనందభైరవిలో అన్నది—పచ్చపిల్ల: అదికూడా— అదేంటో బాగుంది, రాజుకి:

బావాపొద్దుపోయింది. సభచాలించి చాలాసేపయింది' రాజు, నాగయ్యగారు వెనుకబడ్డారు.

'నీయింటికి నీవు వచ్చేటందుకు— నెలలే సంవ

వలెనా రాయబారమూ.....'

ఆమె ఆహ్వానాన్ని అందుకున్నాడురాజు: ఆతని అంగీకారాన్ని గ్రహించింది ఆమె, ఆతోటుప్రాటులో:

'చూడు మామయ్యా: నీకు కోపం రాకుండా ఉంటే—' అని తడబడుతూ, ఇక ఆపైన మాటచెప్ప లేక ఊరుకున్నాడు రాజు:

నాగయ్యగారు—కాదు, సాహిత్యశిరోమణి నాగరాజ శాస్త్రిగారు—ఆతని మనసులో సంగతి గ్రహించి—

'ఆఁ నాకు తెలిసిందిలే, కాని, శశిని చాలా అన్యాయం చేయడం సుమా: నిక్షేపం లాటి—'

'కాదు మామయ్యా— నీవు అత్తను చేసినట్లు నేను శశిని అన్యాయం చెయ్యను. చెయ్యలేను— నామాట మీద నమ్మకం లేదూ;,

'నీమాట మీదా, నీమీదా నమ్మకమే—తప్పదన్న మాటేనా?'

ఏమో—నీ........,

నాయిష్టమంటే—కాలంతీరి పోయిన వాళ్లం మాకూ నీకూసాపత్యం ఏమిటి—అయినా......సరే,రా.'

చంద్రుడు వెల వెల బోకుండా, ఎప్పుడూ తెల్లవారకుండా, ఉంటే!

౨

శశి, తమలపాకులు యీనెలు తీసి చుడుతూ కిటికీలో కూర్చున్నది: బయటంతా, గదిలో చాలా భాగమూ, పండువెన్నెల: అందుచేత దీపం వెలిగించ లేదు. రాజు యింటికి వచ్చే వేళ అయింది: గదంతా అత్తరుప్ర వాసనతో గుప్పుమన్నది:

అది ఆమెకు మామూలయిపోయింది: ఆ అనవాలు పట్టి రాజు వచ్చాడని గ్రహించి, చేతులో ఉన్న తమలపాకులు పళ్లెంలోపెట్టి, ఆతనికి ఎదురుగుండా వచ్చింది:

రాజు షర్టు విప్పేసి యీజీచేర్‌లో కూర్చు న్నాడు వెన్నెలలో: శశివచ్చి, దగ్గరగా, తిపాయి నానుకుని నిలుచుంది:

'భోజనానికి లేవరూ' అన్నది కొంతసేపటికి: రాజుకు వినిపించిందో లేదో కాని, ఏమి జవాబు చెప్ప లేదు: చంద్రుడి వంక రెప్ప వాల్చకుండా చూస్తు న్నాడు:

'ఇదుగో—లేండి భోంచేతురుగాని'

అని మరికొంతసేపు ఊరుకుండి అడిగింది:

'అన్నట్టు—మరచిపోయినాను చెప్పడం—ఈ పూట ఆకలిగాలేదు:'అన్నాడురాజు:

'అశ్చే ఆకేమిటండీ—అట్లా పస్తు పడుకోకూడ దు: కాస్త పెరుగువేసుకొని నాలుగు ముద్దలు తింటే కడు పులో చల్లబడుతుంది: లేండి'అని బతిమాలడం మొదలు పెట్టింది:

'సరేలే—చిన్నపిల్లాడికి చెప్పినట్లు ఏమిటా పా ఠంఅంతా: నాకు కావాలిస్తే నేను తిననూ— ఇందులో బలవంతంకూడా ఎందుకూ—. తమలపాకులు యిస్తావా.'

'ఇందండి'

అని పళ్లెం తీసుకవచ్చి ఆతనిసమీపాన ఉంచింది: ఒక, ఆకు మడుపుకొరికి, ఆమె నోటికి అందించ బోయి నాడురాజు.

'ఎఛ్ఛే—వద్దు—ఎంగిలి' అని తప్పించుకుందిశశి:

పోనీ, నీ ఎంగిలి—నాక్కావాలి'.

'ఉహుఁ—ఎంగిలి తాము తినకూడదు, ఇంకొకరి కి పెట్టనూకూడదు: అంతమాత్రం తెలియదూ—శుభ్రం గా ఆకులచుట్ట చేతికిస్తే,వేసుకోకుండా—ఎంగిలి ఎందుకండీ.'

'నాకు తెలియదులే, శశీ,ఈమడీ ఈఆచారం ఎవరు నేర్పారు:—అయితే నేను ఇంకెవరి ఎంగిలన్నా తి న్నాననుకో; అప్పుడుమరి యెట్లా?'

ఏమో మీయిష్టంమీద: మీనోటికి నాఆజ్ఞఏమిటి: నాకు కనబడ్డంతవరకూ నేను చెపుతూ ఉంటాను:

సాచాటున చేసేవాటికి నే నేంచేయగలనూ?.'

'చాటున చేసేవాటికి, ఎదుటపడితే తిట్ట కూడదూ:'

'మహా నేర్చారులేద్దురూ మాటలు— మావాళ్లు పెంచి పెద్దదాన్ని చేసి మీచేతుల్లోపెట్టింది మిమ్మల్ని తిట్టడానికిన్నీ, సాధించడానికినా—మాఅత్త చెపుతూండేది, భర్త అంటే దేవుడుతో సమానమని.'

'అవును మంచివాడైతేను: మరి నాలాగా చెప్పిన మాట విననివాడైతే.'

'ఏమో అదంతా నాకు తెలియదు: చెప్పిన మాట వింటారో, లేదో, చెడ్డవారో మంచివారో నాకు తెలియదూ.'

'అట్లా అయితే, భర్త దేవుడులాగా అయితే భార్య ఏ మవుతుంది?'

'ఏమవుతుందో మీకు తెలియాలి: ఏమవుతుంది: భార్యభర్తకు ఏమవుతుంది— మా అమ్మ మానాయనకూ, మీ అమ్మగారు, మామగారికి ఏమవుతారు?,

'అదికాదు నేనన్నది: భర్తదేవుడుతో సమానంగా ఎంచుకోవా లన్నావుకదా:—మరిభార్యను భర్త ఎట్లా ఎంచుకోవాలి—దేవిలాగానా—'

'ఎవరి యిష్టం వారిది—ఆ శ్వేఛ్ఛగాచూస్తూంటే, ఎట్లా ఎంచుకుంటే మటుకు ఏం:'

దేవుడు లాగా' కన్న స్నేహిడు లాగా—లేకపోతే, చూడూ, నీసావాసగత్తె, కామున్ని, నీవేలా చూచుకుంటావో-ఆమాదిరిగా నన్నుకూడా ఎంచుకోకూడదు':

'చాల్లేండి— నేర్చుకొచ్చారు,ఎక్కడో తమాషా మాటలన్నీ— స్నేహితులా— నిద్రకళ్లని ఏమిటో మాట్లాడుతున్నారు—ఇక నిద్రపోండి:'

—శశి నిద్రపోయింది:

3

'ఊహుం—చెపితేగాని విడవను.ఇంతసేపటిదాకా ఏంచేస్తూన్నారు—ఇందాకనే ఎందుకు రాలేదు— అని కౌగలి వదలకుండానే, రాజును అడవాయించింది పచ్చ:

'అబ్బ— మెదలనీయి. చెపుతానుగా —పదుకుదూ—' అని ఎట్లాగో తప్పించుకుని, మంచం మీద వెళ్లి పడ్డాడు రాజు: ఆమె కిలకిలా నవ్వుతూ అతని పక్కను కూర్చున్నది:

'చెప్పరూ—

'ఏంలేదు—చాలాత్వరగా వద్దామనుకుంటే,ఇంత ఆలస్యమయింది: లేకపోతే మామూలుగా వచ్చినట్లుగానే వచ్చేవాణ్ణే—'

'అవును—మీకోసం,నేను ఎప్పుడువస్తారో అని ఎదురెదురు చూస్తూకూర్చుంటే, మీరు మీచిత్తంవచ్చిన వేళకు దయచేస్తారేం?ఈ మారు రండి చెప్తాను.'

'ఏంచేస్తావు.'

ఏంచేస్తానో—అప్పుడే మరచి పోయినారేం:—

ఇదుగో—ఇంతే—ఇంతే— చూసుకోండీగట్లు ఎప్పటికి మానుతారో?'

అబ్బ—మోటుతనం—నీకైతే. తెలుస్తుంది: పచ్చ నవ్వింది:

'అమ్మలాగా బిక్కమొగంవేసుకుని—

అబ్బ—'

రాజు, పచ్చను గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. ఆమెచెక్కిళ్లమీది పలుగంట్లల్లోకొత్తనెత్తురు కమ్ముకుంది:

'ఇప్పుడు—ఇదేతనం!అన్నది ఆమె నవ్వుతూనే:

'సరేకాని—నే నొకటిచెపుతా విను—'

ఆపైన మాట్లాడకుండా, చాలా వయ్యారంగా,అతని నోటికి చేయి అడ్డుపెట్టింది:

'మీరు చెప్పావద్దు— నేను వినావద్దు: మనకావ్వహారాలూ, ఆ కబుర్లూ, ఈ కబర్లూ ఎందుకండీ— అవిగో చూడండి,మల్లె మొగ్గలు చెట్టునిండా చాలాఉన్నాయి: కోసుకుందాం రండి:—తరువాత, కొత్త పాటొకటి పాడుతా—'

'నీవక్కోనుకురద్దు.'

'రాణిగారు ఎందుకు కోనుకురావాలే—నా కేం:'

'పోనీ నాకుమాత్రం ఏం—నా క్యాంపింగులోకి మల్లెంతులు అక్కర్లేదుకదా.'

'మీకెందుక్కైతే నాకుమాత్రం ఎందుకేమిటి—నాజడ బాగుందో లేదో మీకే కావాలి—'

'నీవుకావాలి—నీజడ—'

'అవును—శేలక్ రియబోసుకుంటే తెలుస్తుంది ఏం కావాలో—నాజడ అందమే నా అందం—'

'—రారూ:'

కొంచం సేపటికి, వనకన్యలాగా ఆమె, వసంతుడిలాగా అతనూ తయారయినారు: మల్లెపందిరిని ఆకు చాటు నన్నా ఒక్క పసరు మొగ్గ మిగలలేదు·

'ఏదీ—ఒకమారునవ్వండి'

రాజు నవ్వాడు:

'ఊహుం—ఇంకోమారు'

'ఎందుకంతకులాసా?'

నాకు కాకపోతే ఎవరికండీ కులాసా:' నన్నుచూసి మీరు మురిసిపోవాలి'. మిమ్మల్ని చూసి నేను మురిసిపోవాలి 'ఇద్దరికీ—సంతోషం, —ఎప్పుడూ సంతోషమే—'

'ఇవాళకి యీసంతోషంచాలు: ఇంకా వెళ్లనా?'

'ఎవరిని అడుగుతారు?'

'ఎవరినా—,

నన్నా—నేనువెళ్లమంటానా— వెళితే మళ్లా మీరు వచ్చేదాకా కష్టకాయలు గాచేట్టు వీధి వంకచూస్తూ ఎప్పుడు వస్తారా అని కనిపెట్టుకొనికూడదుద్దూ—మరిచిపోయినాను—వెళ్లండి—ఒక చిన్నపని చెపుతా మరిచిపోకుండా చేస్తారా?

'ఆ?,

'—ఈముద్దు మాశశికి అప్పగించండి'

అని అతని బుగ్గను కోమలంగా ముద్దుపెట్టుకున్నది:

'మరినాకో—'

మీకా—శశి దగ్గరనుండి నాకుకూడా, తెచ్చి పెట్టినతరువాత—ఒకటికి మరొకటి:'

౪

'మాగురువుగారి పేరేమిటి?' అన్నది నవ్వుతూ శశి:

రాజు అప్పుడే కాఫీ త్రాగి, బయలుదేర బోతున్నాడు: శశి పల్కరించడం విని, ఆశ్చర్యపడుతూ, ఆగి ఎవరు—మీగురువుగారేమిటి.'

'పోనీలేండి. నాకు చెప్పడానికి వీలులేకపోతే.'

'నీవన్నది నాకు తెలియందే.'

'ఆ అమ్మాయి— పేరేమిటి:'

రాజు మాన్పడి అట్టె నిలబడి పోయినాడు:

శశి ఇదివరకెన్నడూ,అంతచనువుగా, స్వతంత్రంగా,ఆమాదిరిగా మాట్లాడి ఎరుగదు: ఏదో మణిగిండనుకొని, వీధిలోకి వెళ్లేవాడల్లా వెనుకకుతిరిగి తిన్నగాగదిలోకి వెళ్లి కూర్చున్నాడు: శశి మెమ్మదిగా అతన్ని సమీపించి తలనిమురుతూ—

'ఏమండీ—అలాఉన్నారు:' అన్నది:

రాజు కొంచం సేపటిదాక ఏమి మాట్లాడలేదు: శశి కదలకుండా, అతన్నిచూస్తూనిలుచుంది:

'చూడు శశీ–నేను–పొరబాటే చేస్తున్నాను—ఇంతవరకూ నీకు తెలియదనుకున్నాను—చెప్పుదామని ఎన్నిసార్లో అనుకొని చెప్పలేకపోయినాను. నీవు విచారించుతావని— నీవంటే,నాకుప్రేమ— చాలా ప్రేమ ఉంది-నీకు అన్యాయంచేయడం లేదు,చేయదలచుకో లేదు—అయినా,ఆ అమ్మాయిని చూస్తే నాకదేదో— —అదోమాదిరి సంతోషం తోకలుగుతుంది— ఏమో ఏమిటో నేనుచెప్పలేను—పాపం చాలా మంచిది ఆ అమ్మాయికూడా—

'ఏమిటీధోరణి' అని? మాటకుఅడ్డంవచ్చిఅడిగింది:

'అవును-తప్పే—నీవిషయంలో అపచారంచేసినట్లే-కాని'

'ఇంతటితోఆగండి—కానీవద్దు గీనివద్దు,-మీరు

మ ట్లాడేమాటలన్నింటికి అర్థం ఏమిటి—ఏంభాషఅది'.

'మరి, నీవు—

'ఏంలేదండీ—మీ నీడచూసి మీరు బెదురుతున్నారు: నే నడిగిందల్లా—ఆ అమ్మాయి పేరు ఏమిటని—మాఅక్కయ్య పేరుచెప్పడానికి ఎందుకీ చదువంతా—

'ఆమెపేరు నీకెందుకూ—

ఆమె మీకెందుకో, ఆమెపేరునాకందుకూ—మీవచ్చుఅంటేనాకుచాలా ప్రేమ,గౌరవం,—తెలిసిందా

'ఏమిటీ.'

'వచ్చును మీరు ఎరుగున్నప్పటినుంచీ మీ ముఖంలోకి ఒక కొత్తకళ వచ్చింది: మునపటికన్న చాలా సంతోషంగా, ఎంతో బాగున్నారు:అంతా ఆ అమ్మాయి మూలానే కనుక ఆమెఅంటేనాకుప్రాణం తెలుసునా?'

'నిజంగానా!

'ఆ——మీతో ఎలాఅబద్ధం ఆడుతానండీ: నాకు ఆమెనుచూడాలని చాలాకోరిక ఉంది— ఎంతో నేర్చుకోవాలి కూడాను ఆమెదగ్గర:'

'ఆ—అర్థమయినాయిలే, నీ ఎకసక్కేలన్నీ—' అని రాజులేచాడు: శశి ఆతన్ని బయటికి వెళ్లనీయకుండా దోవకు అడ్డంగా నిలుచుంది:

'నేను మిమ్మల్ని ఎకసక్కెలాడటం మెందుకండీ— నిజంగా— నిజంగా నేచెపుతున్నాను:— నాకామెను ఒకసారి చూడాలని ఉంది— కరువుదీరా కావలించుకుంటాను—'

'నీకు వచ్చుమీద కోపం లేదూ.'

'ఎందుకూ'

'ఎందుకా— నాకువచ్చుమీద చాలాయిష్టం?

'అందుచేతనే— అమె అంటే నాకుప్రాణం:'

'నిన్నుచూడటానికి రమ్మన్నావా.

'నేను వెళ్లకూడదా'

'లోకానికి బాగుండదు'

'మీకో?

'నాకా— నీయిష్టం'

'నాలోకంమీరు: మీకుయిష్టమేనా చెప్పండీ'

'——మరిచేపోయినాను:వచ్చునీకు— ఇది—ఇమ్మంది:

'అమ్మ మంచివారు— తెచ్చినందుకు మీకు బహుమతివద్దూ——మీకిస్తేమీరు కాజేస్తారుకాని, నేను వచ్చి బాకీతీరుస్తానని చెప్పండి— మావచ్చుతో:

౫

'సంస్కృతమాశ్రిత్య'— నన్ను చంపుకు తినక చెప్పదలుచుకున్నదేమో తేలుద్దూ అన్నాడురాజు:

నాగయ్యగారు గొంతు సవరించుకొని—'చెప్పడానికేముంది నాయనా— నీకూ నాకూ బాగున్నా లోకానికి బాగుండలేదు:— మానేద్దూఅన్నాడు:

'అదికాదు మామయ్యా— మనంచేసేపని మంచిదైనప్పుడు, మనకి అందువల్ల ఏమినష్టంకలగనప్పుడు— పరులేమంటారని భయపడితే ఎలా?—మనమంతా లోకమంతా ఒకటయితే ఒప్పుకుంటాంకాని, లోకులేమనుకుంటారో అని వాళ్ల తప్పుకూడా ఒప్పుకుని మన్నించాలేం.'

'నీవుబాగానే ఉన్నావు: పైన పెద్దవాళ్లం చూస్తూ ఊరుకుంటే మమ్మల్ని అనరూ నలుగురూను?'

'నేనుచెడిపోవడం లేదని నీకు నమ్మకం ఉందిగా'

'నాకేనమ్మకంలేకపోతే, చేతులారా తీసుకెళ్లి ఎందుకు వప్పగిస్తాను నిన్ను.'

'అవును నాకుఉపకారమే చేశావు: నిన్ను నేను ఎప్పుడూ తలుచుకుంటూనే ఉంటున్నాను.'

'నీమంచికే చేశాను, నాయినా: లోకానుభవం కొంత కలగాలిసిందే.—అపిల్లకూడా చాలాఉత్తమురాలు

'నీమనచ్చింది ఉత్తమురాలు కాకుండా ఎట్లా ఉంటుంది.'

'మాకన్నులచలవ నీవే నాయనా—ఇచ్చినదైవం మరిచిపోయి, వర్ధిల్లనియ్యాలి' అనిహృదయపూర్వకంగా దీవించి నాగయ్యగారు వెళ్లిపోయినాడు:

'అయితే, ఇదేమిట్రా— ఇవెక్కడ వచ్చేను—

